





# చరిత్ర

హిందూ దేశ,ఆంధ్రుల,సాహిత్య,తత్వ

# తెలుగు వ్యాస పరిణామం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120035949

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# తెలుగు వ్యాస పరిణామం

(సిద్ధాంత గ్రంథం)

డా. కొలకలూరి ఇనాక్
తెలుగు రీడర్
పి. జి. సెంటర్
అనంతపురం

జ్యోతి గ్రంథమాల
అనంతపురం

# విషయ సూచి

# కృతజ్ఞత

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పరిశోధనకు ఆమోదించి, 'తెలుగు వ్యాస పరిణామం' అంశం సూచించి, ప్రోత్సహించిన ఆచార్య జి. యస్. రెడ్డి గారికీ; ఈ పరిశోధనకు పర్యవేక్షణ వహించి, సకల సదుపాయాలు కలిగించిన ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రిగారికీ కృతజ్ఞుణ్ణి.

అనంతపురం ప్రభుత్వ కళాశాలాంధ్రోపన్యాసక వృత్తిలో ఉండి, 1968 జులైలో తిరుపతి విశ్వవిద్యాలయ కళాశాలలో అధ్యాపక విద్యార్థిగా చేరి అనంతపురం పి. జి. సెంటరులో పరిశోధన సాగించి 1972 లో పూర్తి చేయటం జరిగింది. ఈ పరిశోధన చేయటానికి అనుమతించిన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖకూ, అవసరమైన గ్రంథాలు కొనటానికి 'బుక్ గ్రాంట్' ఇచ్చిన యు. జి. సి కీ; అనేక ప్రదేశాలలోని గ్రంథాల పరిశీలనార్థం 'ట్రావెల్ గ్రాంట్'లు మంజూరు చేసిన విశ్వవిద్యాలయానికీ కృతజ్ఞుణ్ణి.

గ్రంథాలు పత్రికలు పఠించటానికి అనుమతించి సహకరించిన అనంతపురం ప్రభుత్వ కళాశాల, పి.జి. సెంటరు; తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ కళాశాల; విశాఖపట్టణం ఆంధ్ర విశ్వ విద్యాలయ కళాశాల; హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయ కళాశాల, స్టేట్ ఆర్కైవ్స్; మద్రాసు విశ్వవిద్యాలయ కళాశాల, ప్రెసిడెన్సీ కళాశాల, తమిళనాడు ఆర్కైవ్స్, గ్రంథాలయాధికారులకూ; తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయం; మద్రాసు అముద్రిత పుస్తక భాండాగారం, కన్నెమెర గ్రంథాలయం, రాజమండ్రి గౌతమీ గ్రంథాలయం, వీరేశలింగం పంతులు ఆస్తిక గ్రంథాలయం, వేటపాలెం సారస్వత నికేతనం, బెజవాడ రామమోహన గ్రంథాలయం, గుంటూరు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయం కార్యదర్శులకూ, నిర్వాహకులకూ; ఈ పరిశోధన కృషిలో సలహాలిచ్చిన ఆచార్యులకూ, పెద్దలకూ కృతజ్ఞుణ్ణి.

*

దీని ప్రచురణకు అంగీకరించిన తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి, అనంతపురం పి. జి. సెంటరుకూ;

రూ 5000/- మంజూరు చేసిన ఆంధ్రప్రదేశ్ విద్యా సాంస్కృతిక శాఖకూ, శ్రీ భవనం వెంకట్రామ్‌రెడ్డి గారికీ; రూ 4000/- వడ్డీలేని ఋణం, కడప జిల్లా ప్రకాశం శతజయంతి ఉత్సవ నిర్వాహక సంఘం నిధుల నుంచి, ఇచ్చిన శ్రీ పి.యల్. సంజీవరెడ్డి ఐ.ఏ.యస్. గారికీ, శ్రీ పి. కమలేశ్వరరావు ఐ.ఏ.యస్. గారికీ, శ్రీ జి. నిరంజనరావు ఐ.ఏ.యస్ గారికీ;

ఆర్థిక ఋణ సదుపాయం కలిగించిన బేంకులకూ, మిత్రులకూ; ప్రెస్ కాపీ సిద్ధం చేయటంలో శ్రీ పాలపర్తి వేణుగోపాల్ తోడుకాగా, ప్రూఫులు రెండు దశలలో ఇద్దరు పండితులు చూడగా ఇలా ముద్రించిన హైదరాబాదు పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వాళ్ళకీ;

ఎన్నో విధాల ప్రోత్సహించిన పెద్దలకు, మిత్రులకు, విద్యార్థులకూ కృతజ్ఞుణి.

కొలకలూరి ఇనాక్

30-12-80

# ఉపోద్ఘాతం

ఆధునికాంధ్ర సారస్వతంలో వ్యాసం ప్రక్రియగా ప్రసిద్ధమే. ఇది ఆంగ్ల సాహిత్య ప్రభావం వల్ల తెలుగులో ఆవిర్భవించి రూపరేఖలు దిద్దుకొంది. వ్యాసం సృజన విమర్శన సాహితీ ధర్మాల సంగమ కేంద్రం. అందువల్ల ఇతర సాహిత్యాలలో లాగా తెలుగు సారస్వతంలోనూ వ్యాసం ప్రాచుర్యం పొందింది. ఈ 'తెలుగు వ్యాస పరిణామం' పరిశోధన వ్యాసంలో తెలుగు వచనం, వ్యాసం, సృజన వ్యాసం, విమర్శన వ్యాసం, తెలుగు వ్యాసశైలి అని అయిదు అధ్యాయాలున్నాయి. సృజనవ్యాసం-నవయుగ వ్యాసం, స్త్రీ వ్యాసం, పత్రికా వ్యాసం, వివాద వ్యాసం అని పునర్విభజనం పొందింది.

వచన రచనగా వ్యాసం ఉన్నందువల్ల, వచన సామర్థ్యం ఇతర ప్రక్రియలకన్నా ఎక్కువగా వ్యాసం కోరటం వల్ల, వ్యాస పరిణామం విశదం కావటానికి తెలుగు వచన పరిణామం నేపథ్యంగా పరిశీలించటం కృత్యమయింది. తదనుగుణంగా తెలుగులో వచనాది పద పరిశీలనం చేసి, స్థూలంగా తెలుగు వచనం పొందిన పరిణామం పరికించి; సంస్కృత గద్య-అర్థ లక్ష్యావకాశ పరిణామాలలోనూ, ఆంగ్ల వచనం-పరిణామ వైవిధ్యాలలోనూ కలిగించిన ప్రభావం దర్శించి, వచన స్వరూప స్వభావ తత్త్వాలు గుర్తించటం ప్రథమాధ్యాయంలో ఉంది.

తెలుగు వ్యాసం ఆంగ్ల సాహిత్య ప్రభావ ఫలితం కాబట్టి తెలుగులో దాని పరిణామం-ఆంగ్లంలోని వ్యాస స్థితి గతులు గమనించటంవల్ల స్పష్టమవుతుంది. అందువల్ల ఆంగ్ల వ్యాస వాఙ్మయ స్వరూపం పరిశీలించి, వ్యాస లక్షణాలు ఏర్పరిచి, ఆంగ్ల విమర్శకుల వ్యాస నిర్వచనాలు ఈ దృష్టితో పరిశీలించి, తెలుగులో ఈ ప్రక్రియా చైతన్యం గ్రహించి, ఆంగ్లాంధ్రాలలోని వ్యాస వైవిధ్యంలో సామ్యం గుర్తించి, వ్యాసోద్దేశావకాశాలు విశదం చేయటం ద్వితీయాధ్యాయంలో ఉంది.

తెలుగు వ్యాసం ప్రధానంగా సృజనం, విమర్శనం అయి ఉంది. సృజన వ్యాసం స్థూలంగా కల్పనాత్మక సాహిత్యాభిముఖంగా ఉంది. విమర్శన వ్యాసం విమర్శనాభిముఖంగా ఉంది. చతుర్విధంగా ఉన్న సృజన వ్యాసంలో ప్రధాన భాగం నవయుగ వ్యాసం. ఇది తొమ్మిది యుగాలలో వ్యాస పరిణామం వివరించేదిగా, వ్యాసాభ్యుదయం ప్రదర్శించేదిగా ఉంది. ఇందులో ఆంగ్ల వ్యాస ప్రభావానికి దూరంగా, అన్య ప్రక్రియాంతర్గతంగా ఉన్న వ్యాస సృష్టిని, ఆరంభ వ్యాస రచనాన్ని గుర్తించి, కందుకూరి గురజాడల కాలంలో ఉపన్యాస వ్యాస సృష్టిని దర్శించి, అధిక్షేపం, చరిత్ర, సారస్వత విమర్శనంగా వ్యాసా విర్భూతిని పరికించి, అనంతరం కల్పనాత్మకత వ్యాసగతంగా పెరగటాన్ని నవయుగ వ్యాసంలో పరిశీలించటం జరిగింది.

సృజన వ్యాసం ఇంకా త్రిగుణాత్మకంగా పరిణమించింది. స్త్రీ సృష్టిగా వ్యాసం స్వాతంత్ర్యానికి పూర్వాపరాలలో పొందిన అభివృద్ధి దర్శితమయింది. ఆంధ్ర సారస్వతంలో పత్రికా వ్యాస పరిశీలనార్థం తెలుగులో ముద్రణం పరికించి, పత్రికా స్థితి గతులు గమనించి, భిన్న శీర్షికలలో వ్యాస పరిణామం గుర్తించి, సంచికలలో వ్యాస రచనం తెలుసుకొనటం జరిగింది. అందువల్ల ప్రారంభ ప్రసిద్ధ పత్రికలు చేసిన వ్యాస దోహదం వివరణం పొందింది. సాహితీ సంబంధి చర్చలు వివాదాత్మ వ్యాసాలుగా రూపొందాయి. ఈ వివాద హేతువులు, ఈ వ్యాస లక్షణాలు ఈ రచనా వైవిధ్యం విశదం చేసి పరికించటమయింది.

విమర్శన వ్యాసం తెలుగులో విస్తృతంగా వ్యాపించింది. సృజన వ్యాసం కన్నా విశాలంగా రూపొందింది. విమర్శన వ్యాసం గుణంలో పరిమితమయి విమర్శనంగా ఏర్పడటమూ జరిగింది. అందువల్ల విమర్శనం, విమర్శన వ్యాసం మధ్య హద్దులు అస్థిరంగా ఉన్నాయి. సృజన వ్యాసంలో నిర్మాణ వైవిధ్యం, విమర్శన వ్యాసంలో విషయ వైవిధ్యం ప్రధానంగా గోచరమవుతున్నాయి. విమర్శన వ్యాసం అధికంగా సారస్వత విషయ పరిమితంగా రూపం పొందింది. కావ్యంయొక్క తత్త్వం, ఆత్మ, గుణం, చరిత్రలతో పాటు భాషనూ; కవ్యాత్మ కవి జీవిత చరిత్ర, పీఠికలు, పరిశోధనలతో పాటు అన్య భాషల సంగతులనూ,

అనువాదాలనూ, వేదాంత వైజ్ఞానిక రాజకీయార్థికాది విషయాలతో పాటు ఆంగ్లం లోని ఆంధ్ర సారస్వతాన్నీ పరిశీలించటం చతుర్థాధ్యాయంలో ఉంది.

రచయిత వ్యక్తిత్వం నుంచి అసలు వ్యాసం పుట్టటం, శైలి రచయిత వ్యక్తిత్వానికి ప్రతిబింబం కావటం వల్ల వ్యాసంలోని శైలి వ్యాసకర్త సాహితీ చైతన్యంగా ఉంది. కాబట్టి తెలుగు వ్యాస పరిణామంతో తెలుగు వ్యాస శైలిని సందర్శించటం జరిగింది. శైలిని అభివ్యక్తం చేయటానికి మూలంగా ఉన్న రచయితను, అతడి భాషా ప్రయోగ నైపుణ్యాన్ని పరికించటమయింది. ఇందులో శైలీ దర్శనం, సంగ్రహత, స్పష్టతాది రచయిత వ్యక్తిత్వలక్షణాలు, వాక్య పదాది భాషా లక్షణాలు ఏర్పరచి, వాటికి విస్తృత వ్యాస వాఙ్మయం నుంచి ఉదాహరణాలు గ్రహించి, అన్వయించిన కృషి చివరి అధ్యాయంలో ఉంది.

ఈ పరిశోధన వ్యాసంలో వ్యాస నిర్మాణ విషయాలు పొందిన పరిణామం విశదీకరించటం లక్ష్యంగా రచన జరిగింది. ఈ సందర్భంలో తెలుగు వచనం వ్యాస గతంగా పొందుతున్న పరిణామం దర్శితమయింది. సృజన విమర్శన వ్యాస పరిశీలనంలో ప్రత్యంతర్భాగ ప్రారంభంలో ఆవిభాగం స్వరూపమో, స్వభావమో, తత్త్వమో వివరించి, తత్సమాప్తిలో వ్యాస పరిణామానికి ఆ విభాగం చేసిన ప్రత్యేక దోహదం విపులీకరించట మయింది. ప్రతి విభాగంలో వ్యాస పరిణామానికీ, పథ ప్రవర్తనకూ, కారకులైన వ్యాసకర్తల వ్యాసాలను ప్రాధాన్య దృష్టిలో కాలక్రమానుసారంగా దర్శించటమయింది. ఒక రచయిత వ్యాస సృష్టి అంతా ఒకే మార్గంలో స్థూలంగా జరిగివుంటే, ఒకే విభాగంలో గ్రహించటం జరిగింది. భిన్న రీతులలో ఆవిర్భవించి ఉంటే, ప్రధాన వ్యాస సృష్టి పరిశీలనం పొందుతున్న చోటే చేర్చి ఆలోచించటమయింది. అయితే రచయిత వ్యాస వ్యాసంగం అధిక వైవిధ్యంతో విస్తృతంగా ఉన్నప్పుడు, భిన్న విభాగాలలో, పరిణామ క్రమంలో పరికించటం జరిగింది.

తెలుగు వ్యాస గతంగా పరిశోధనం ఇతఃపూర్వం మృగ్యం కావటం వల్ల, ఈ పరిణామం గ్రహించటానికి విమర్శన వాఙ్మయం దాదాపు లభించక పోవటం వల్ల, ఈ పరిశోధన నిమిత్తం ముద్రిత వ్యాసాల సంపుటాలు గ్రహించి వ్యాస పరిణామం గుర్తింపవలసి వచ్చింది. ప్రసిద్ధులైన పలువురు రచయితల వ్యాసాలు కూడా సంపుటాలుగా రూపొందక పోవటం వల్ల, ముద్రితమైన వ్యాసాలన్నీ

సక్రమంగా లభించక పోవటం వల్ల, అనేక వ్యాసాలు విస్తృత పత్రికా ప్రపంచస్థంగా ఉండటం వల్ల రచయిత లందరి వ్యాసాలన్నీ పరిశీలించటం కుదరలేదు కానీ, లభ్య వ్యాసాలతో పాటు ప్రారంభ వ్యాసాలన్నీ ప్రయత్నించి సంపాదించి, పరిశీలించటం జరిగింది.

వ్యాసం, ప్రక్రియగా, విషయ ప్రముఖంగా, ప్రసిద్ధంగా ఉన్నప్పుడు తత్పరిణామ సందర్శనార్థం పరికించటమయింది. ఒక ప్రత్యేక లక్షణ సమన్వితంగా ఒక విశిష్ట గుణ శోభితంగా ఒక పరిణామ ద్యోతకంగా ఉన్న వ్యాస సృష్టి ప్రాముఖ్యం పొందింది. ఆయా లక్షణాలు అనంతర వ్యాస రచనంలో నిక్షిప్తమయి ఉన్నా, ఆద్య రచనలు పరిశీలించినంత విశదంగా విపులీకరించటం జరగలేదు.

పత్రికలు, పత్రికా వ్యాసాలు దిన దిన ప్రవర్ధమానంగా ఉన్నాయి. వాటి స్వరూప స్వభావాలు విశదీకరించటం విస్తృత పథకంతో జరగవచ్చు కాబట్టి ప్రారంభ పత్రికలకు పరిమితంగా ఇందులో పత్రికా వ్యాసపరిణామం గుర్తించటమయింది. విమర్శన వ్యాసంలో విమర్శన ధర్మం ఉన్నప్పటికీ, విమర్శనం విశాల ప్రణాళికతో చర్చింప వచ్చు కాబట్టి అది ఈ పరిశోధన వ్యాసంలో నిరవకాశంగా ఉంది. స్థూలంగా ఈ రంగంలో ఇది ప్రారంభ కృషి కావటం వల్ల భావి పరిశోధకులకు పథ ప్రదర్శకంగా ఉంటుందని తలంచట మయింది. ఈ పరిశోధనాంశం ఆధునికం కావటం వల్ల, అనేక వ్యాసాలు వ్యావహారిక భాషలో ఉండటంవల్ల, వ్యావహారిక భాషలో ఈ పరిశోధన వ్యాసం వ్రాయటం సముచితమని భావించటం జరిగింది. దీనికి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాను మతి ఉంది.

8-8-72

*

ఈ సిద్ధాంత గ్రంథం రచనా కాలానికీ ప్రచురణ కాలానికీ మధ్య ఇంత విరామం దీన్ని ప్రచురించటానికి చేసిన ప్రయత్నంవల్ల అవసరమయింది.

ఇది శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి పిహెచ్. డి. పట్టం నిమిత్తం తెలుగు వ్యావహారిక భాషలో సమర్పించిన రెండో సిద్ధాంత గ్రంథం. రెండోదిగానే ముద్రితమయింది.

ఈ మధ్య కాలంలో వ్యావహారిక భాషలో ఈ విశ్వవిద్యాలయం నుంచి చాలా సిద్ధాంత గ్రంథాలు వచ్చాయి. ఇతర విశ్వవిద్యాలయాల నుంచీ వచ్చాయి. ప్రచురితమూ అయ్యాయి.

అనుబంధం-2, ప్రస్తసూచి, స్పష్టిసూచి తప్ప ఇందులో కొత్తగా ఏమీ చేర్చలేదు. అక్కడక్కడా అక్షరాల పదాల సవరణ కాక, మార్పులేమీ చేయలేదు.

ఈ మధ్య విమర్శనంలోని విశేషాలు తెలిపే వ్యాసం, ఈ పరిశోధ కుడిది, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ ప్రచురించింది, కనుక ఆ అంశాలు ఇందులో చేర్చలేదు.

ప్రత్యేకంగా పరిశోధన చేయదగ్గ విభిన్న విషయాలు ఈ గ్రంథంలో ప్రాథమికంగా పరిశీలించటం జరిగింది. ఆ పరిశోధనలకి గ్రంథం సూచి కాగలగటం విశేషమే.

బి. ఏ. ఆనర్స్., పూర్తి చేసింతర్వాత పరిశోధనలో చేరటానికి తొమ్మి దేళ్ళు దాకా అవకాశం లేకపోయింది. వ్రాతప్రతి సిద్ధం అయి కూడా ముద్రణ కావటానికి తొమ్మిదేళ్ళుదాకా వీలు కాకపోయింది. దీనికున్న చారిత్రక నేపథ్యం పరిశీలిస్తే సమాజ జీవితగమనం దర్శనమిస్తుంది. కాలం ప్రభావం తెలుస్తుంది. ఈ సిద్ధాంత గ్రంథ భవితవ్యాన్ని తెలుగుజాతి జీవిత చరిత్రల కాలమే నిర్ణ యిస్తుంది.

30-12-1980.

# తెలుగు వచనం

తెలుగు వ్యాస పరిణామం గుర్తించటానికి వచనాభ్యుదయం పరికించటం ఆవశ్యకం. ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో పద్యం పొందినంత ప్రాచుర్యం గద్యం పొందలేదు. సాధారణంగా మనిషి బుద్ధి సమీపస్థమయిన వచనం ఆలోచనాభివ్యక్తికీ, గుండెకు చేరువయిన పద్యం అనుభూత్యావిష్కరణకూ అనువైవుంటే, తెలుగు వాఙ్మయంలో ఆలోచన అభివ్యక్తం చేయటానికి చాలాకాలం పద్యమే శరణ్యమయింది. అప్పటికే గద్యం సిద్ధమయిఉన్నా స్వీకార్యం కాకపోయింది.

తెలుగు జాతి జీవిత ప్రారంభంలో వాక్కుగా విస్తృతంగా ఉన్న వచనం వ్రాతగా పరిమితంగా ఉన్నట్టు గమనింపవచ్చు. నేడు వచనం అనంత వ్యక్తిత్వం పొందింది. భిన్న ప్రక్రియా రచనకు వెన్నెముకగా ఉన్న వచనం పొందుతూ వచ్చిన పరిణామం గుర్తింపవచ్చు. స్వల్పస్థితి నుంచి అనల్ప దశకు పెరిగిన వచనాభ్యుదయం పరిశీలనార్హం.

సంఘ వ్యవహార రూపమయిన గద్యం, అనుభూతి రూపమయిన పద్యం భాషా ప్రధానాంగాలు. సామాన్యంగా పద్యం ఏ భాషా వ్యవస్థలో అయినా వ్యవహారంలో ప్రాథమికం, ఆద్యదశ. పద్యం అనంతర దశ. ''తొలుత పాట పుట్టినదనియు, తరువాత పద్యము వచ్చినదనియు, తరువాత గద్యము వచ్చినదనియు, నిది యొక యనుక్రమణిక. నిజానికి మొదటనే గద్యమున్నది. అ రును గద్యములోననే మాటాడెదరు. పాటలలో మాటాడరు. పద్యము మాటాడరు.'' (1)

మానవ వాగ్వ్యవహార రూపంగా గద్యం ప్రవర్తిల్లుతూవుంటే, చంధస్సుందరమై, హృదయ రూపమయింది. భాషా వ్యవస్థకు సహజమైన రీతికి తెనుగు అపవాదం కాదు. ఆంధ్ర భాషలో, ఆదికవి నన్న భారతం కంటె పూర్వం కవిత్వం సృజింప బడిందనటానికి గ్రంథా శాసనాధారమో అవసరమే కానీ, గద్యమున్నదనటానికి అవసరం లేదు. భాష మూర్తిదాల్చిన ముహూర్తం నుంచి గద్యం ప్రయుక్తమయి ఉం

కాని ఆంధ్ర భాషలో గద్య పద్యాలు గ్రంథస్థాలుగా సమకాలికాలు. భారతంలో నన్నయభట్టు గద్య పద్యాలను పదకొండో శతాబ్దిలో గ్రంథస్థం కావించటం దీనికి నిదర్శనం. "It is a sort of common place of literary history that verse is always older than prose, and in the case of most literatures - especially modern ones - it is almost demonstrably so." (2)

తెలుగు గద్యం దీనికి అపవాదం. శాసనాధారాలతో తెలుగు గద్యం పద్యం కంటే పూర్వంగా గోచరమవుతుంది. "The Turimella inscr. is the only one of its kind upto the 9th c - a prose inscr. written in the literary dialect. The rest of them are in simple prose obviously written in the spoken language by officers rather than scholars, with a preponderating desi element abounding in forms peculiar and at times quite unintelligible." (3)

గద్యం కంటే పద్యమే పూర్వం అనటానికి బలమైన హేతువు ఆంధ్ర భాషా విషయకంగా నేటికి అలభ్యం. పద్యం ప్రాచీనమయి కూడా కారణాంతరాల వల్ల లభించలేదనీ, శాసనస్థమై గద్యం లభించినంత మాత్రాన అది ప్రాచీన మనటం కుదరదనీ అంటే అనవచ్చుకానీ, అది ససాక్షికంగా పలికే పలుకు కాకుండా పోతుంది.

శాసనస్థంగా గద్యం ఆంధ్ర భాషలో పద్యం కంటే ప్రాచీనమే అయినా, గ్రంథస్థంగా సమకాలికమే అయినా, క్రమక్రమంగా పద్యం పొందిన ప్రాచుర్యం, విస్తృతత్వం గద్యం పొందలేదు. గద్యంలేకుండా పద్యకావ్యాలు ఆవిర్భవించాయి కానీ, పద్యం లేకుండా, గద్య కావ్యాలు - అంత తొందరగా - పుట్టలేదు. "In the history of literature and the history of individual nations, the development of prose is nearly always slower and more uncertain than that of poetry." (4)

దీనికి కారణం "మనుష్యులు మాటలాడు తీరున గ్రంథము చెప్పుట

గట్టితనముకాదనో, వినసొంపుగా ఉండదనో, జ్ఞాపకముంచుకొనుట సులభము కాదనో గాని, ప్రతి భాషలోను మొట్టమొదట పద్యకావ్యములే చెప్పబడుచు వచ్చినవి'' (5) అనటం సాధ్యమయింది.

గద్యం సాధారణంగా సాహిత్యస్థాయి పొందటం ఏ భాషలో నయినా పద్యంకంటే తరువాతనే అని చెప్పవచ్చు. "The development of Greak poetry had been completed before a prose literature had begun to exist (Encyclopedia Britannica)." (6) ఈ స్థితి ప్రాచీనభాషలకు సహజమైనట్లు గోచరిస్తుంది. "It has been commonly observed that a literary prose is much later in its development than verse." (7) "The first is that poetry was the original form of literature, and prose a later development." (8)

ఆంధ్ర భాషలో గద్యం పద్యం కంటే పూర్వమే అయినా, పద్యం సాహిత్య స్థితి పొందినంత తొందరగా గద్యం పొందలేదు. అప్పుడే పూర్తి గద్య రచనలూ వెలువడలేదు. దీనికి కారణం ప్రపంచ భాషా సామాన్యమైన తత్త్వమే! పద్యం పొందిన పరిణామం భాషాప్రారంభంలో గద్యం పొంద లేదు. పద్యం ఛందస్సహితమై, హృదయ సమీపస్థం, ఆనంద సంపాదకం. గద్యం ఆలోచనాత్మకమై బుద్ధిస్థం. మానవుడు ప్రాథమికంగా, పూర్వకాలంలో ఆనందం కాంక్షించటం వల్ల, పద్యం ప్రాచుర్యం పొందింది. గద్యం తత్తుల్య స్థానం పొందలేకపోయింది. ఆధునిక మానవుడు ప్రధానంగా బుద్ధి జీవి కావటంతో, ఆలోచనకు గద్యం చేరువయినంతగా పద్యం కాకపోవటంతో, నేడు వచనం పొందినంత ప్రాచుర్యం పద్యం పొందలేదు.

## 1. 1. గద్య వచన పద పరిశీలనం.

ఆంగ్లంలో 'ప్రోజ్' అనే పదానికి తుల్యంగా సంస్కృత భాషలో 'గద్యం' ప్రయుక్తం. గద్య పర్యాయ పదంగా 'వచనం' మృగ్యం. ఆంధ్ర భాషలో ప్రాచీన కాలంలో గద్యం, వచనం పర్యాయపదాలు. ఆధునిక కాలంలో

వచనం, గద్యం కంటే ప్రాచుర్యం పొందింది. వచనం నేడు వ్యక్తీకరించే అర్థం గద్యం స్ఫురింప చేయలేదు. నేటి భాషలో వచనపర్యాయపదంగా గద్యం ఎక్కడో తప్ప ప్రయోగింపబడదు. ప్రాచీన భాషలో గద్యం వచన పర్యాయ పదంగా భావింపబడినా 'గద్య' అని ము విభక్తి ప్రత్యయ రహితంగా వ్రాయ బడితే వచన పర్యాయంగా కాక, భిన్న వచన రీతీద్యోతకమవుతుంది. గద్యం అనగానే ఆశ్వాసాంత గద్యలే స్పష్టమవుతాయి. గద్యమనే విస్తృతార్థంలో గద్య పరిమితార్థబోధకం. వచనం స్థూలంగా గద్య పర్యాయపదమే అయినా, భిన్నార్థ బోధకం కూడా అవుతుంది. గద్యమన్నా, వచనమన్నా, ఒక వచన గ్రంథంలోని రచనగా భావింపబడవచ్చు. కాని వచనం అంటే చంపూ కావ్య సంప్రదాయం ఉన్న ఆంధ్ర సారస్వతంలో పద్యానికీ పద్యానికీ నడుమ ఉండే వచనం ఉద్దేశింపబడినట్లు స్ఫురిస్తుంది. ఇది వచనంగా ప్రసిద్ధంకాని, గద్యంగా గాదు. 'వచనములు' అని బహువచనరూపంగా ప్రయుక్తమయితే అది ఒక ప్రత్యేకాంధ్ర సాహితీ ప్రక్రియగా గోచరిస్తుంది. ''సింహగిరి వచనములు'', ''వేంకటేశ్వర వచనములు'', ''భవానీ మనోహర వచనములు'' పై ప్రక్రి యకు ఉదాహరణాలుగా చెప్పవచ్చు.

'వచనములు'లో చంపూ కావ్యాలలో గోచరమయ్యే వచనం కానీ, ఆశ్వాసాంత గద్యలలోని వచనం కానీ, పూర్తి వచన గ్రంథంలోని వచనం కానీ ఆధునిక వచన స్వరూప స్వభావాలకు సమీపంగానయినా లేదు. ప్రాచీన వచనం ప్రాధాన్యం వేరు, నేటి వచన ప్రయోజనం వేరు. పద ప్రయోగంలో, సమాస ఘటనంలో, వాక్య నిర్మాణంలో ద్వివిధ వచనాలకు సన్నిహితత్వం లేదు. ప్రాచీన వచనం నిర్వహించిన పాత్ర పరిమితం. ఆధునిక వచన పాత్ర అపరిమితం. ప్రాచీన కాలంలో అర్థభేదంతో ప్రవర్తిల్లిన గద్య వచన శబ్దాలను ఆలంకారికులు, శాస్త్రకారులు నిర్వచించిన ధోరణి పరిశీలింపవచ్చు.

## 1. 1. 1 సంస్కృత నిర్వచనాలు.

సంస్కృత భాషలో గద్య పర్యాయపదంగా వచనం మృగ్యం కావటం వల్ల గద్యానికే నిర్వచనాలుపలభ్యాలు.

(అ) వామనుడు.

"గద్యం వృత్త గంధి చూర్ణముత్కాలికా ప్రాయంచ" అని గద్యం వృత్త గంధి, చూర్ణం, ఉత్కాలిక అని చెప్పి, "పద్య భాగవత్ వృత్తగంధి, అనావిద్ధ లలిత పదం చూర్ణం, విపరీత ముత్కాలికా ప్రాయంచ" అని వివరించాడు.

(ఆ) భామహుడు.

"వృత్త బంధో ఽ ఙ్ఛితం గద్యమ్" అని గద్యం వృత్త గంధితో ఒప్పుతూ వుండేదని తెలిపాడు.

(ఇ) విశ్వనాథుడు.

"అపాదః పద సంఘాతో గద్యమ్" అని తెలిపి, ముక్తం, వృత్త గంధి, ఉత్కాలికా ప్రాయం, చూర్ణకం చూర్ణిక అని గద్యను విభజించాడు.

(ఈ) ఛందోమంజరి.

గద్యం వృత్తకం, ఉత్కాలికా ప్రాయం, వృత్త గంధి అని మూడు విధాలుగా విభజింపబడింది దాని అర్థం-

"అకఠోరాక్షరం స్వల్ప సమాసం వృత్తకం మతమ్
వృత్త వైదర్భ రీతిస్థం గద్యం హృద్యతరం భవేత్
భవేదుత్కాలికా ప్రాయం సమాసాఢ్యం దృఢాక్షరమ్
వృత్తైకదేశ సంబంధాత్ వృత్త గంధి పునస్మృతమ్" అని
వృత్తక ఉత్కాలికా ప్రాయ, వృత్త గంధి లక్షణం తెలుపబడింది.

(ఉ) వాచస్పత్యం.

"గద్య-కథనీయే 'సహ్యః కథం వియోగశ్చ గద్యమేతత్ వయామమ.' భట్టి-సా.ద ఉక్తి. పాద రచితౌ కావ్య భేదేన. 'అన్యం ఓతవ్య మూలం తత్ పద్య గద్య మయం ద్విధా ఇతి ఆత్మకావ్యం విభజనా' వృత్తబంధోఽఙ్ఛితం ముక్తకం. వృత్తగంధిచ భవేదుత్కాలికా ప్రాయం చూర్ణకంచ చతుర్విధమ్. ఆద్యం సమాస రహితం వృత్తభాగ యుతం పరమ్. అన్యందీర్ఘ సమాసాఢ్యం

తుర్యాం చాల్ప సమాసకమ్. ముక్తకం యథా గురుర్వచసి పృథురురసీత్యాది వృత్త గంధి యథా సమర కండూయ నిబిడ భుజదండ కుండలీకృత కోదండోత్య నుష్టుప్ వృత్తస్యపాద ఉత్కలికాప్రాయం యథాః అణిసి విస్మరణి నిదదరప రవిసర విదలిత సమర పరిగద పటర పరబలేత్యాది ప్రాకృతమ్ చూర్ణకమ్ యథా గుణరత్న సాగర! జగదేక సాగర! కామినీ మదన జనరంజనేత్యాది!" ఇందు ముక్తకం, వృత్తగంధి, ఉత్కలికా ప్రాయం, చూర్ణకం—వీని లక్షణం లక్ష్యంతో తెలుపబడింది.

(ఊ) V. S. Apte-Sanskrit-English Dictionary.

"గద్యమ్. Prose, elaborate prose composition, composition not metrical yet framed with due regard to harmony; one of the three classes into which all compositions may be divided.

వచనమ్. 1. The art of speaking, uttering saying. 2. Speech, an utterance, words (spoken), sentence. నను వక్త్రవిశేషని. స్పృహాగుణగృహ్యావచనే విపాశ్చిత (కుమార) 2:5

ప్రీతః ప్రీతి ప్రముఖ వచనం స్వాగతం వ్యాజహార (మేఘ) 3:3

3. Repeating, recitation. 4. A text, diction, rule, precept, a passage of a sacred book, శాస్త్ర వచనమ్, శ్రుతి వచనమ్, స్మృతి వచనమ్. 5. An order, a command, direction. మద్వచనాత్ (in my name) by my order. 6. Advice, counsel, instruction. 7. Declaration, affirmation. 8. Pronunciation. 9. The significance or meaning of word. అత్రపయోధర శబ్ద మేఘ వచనః."

గద్య వచనాలలో కావ్య పరంగా గద్యమే గ్రహింపబడింది.. వచనం కస్వీకరింప బడలేదు. కాబట్టి గద్య లక్షణమే గోచరముయింది. వచనానికి అర్థం

విపులంగా వుంది. కాని లక్షణం నిర్వచింపబడలేదు. గద్య, వచన పదాల ధాతువులైన గద్, వచ్‌లకు, పలుకు అనే అర్థం ఉన్నప్పటికీ సంస్కృతంలో గద్యం పద్యేతర రచనకు నామధేయమయింది.

## 1. 2. సంస్కృత నిర్వచన పరిశీలనం.

సంస్కృత నిర్వచనాలలో వచనం ప్రస్తావింపబడలేదు. గద్యం సలక్షణంగా విభజింపబడింది. పై నిర్వచనాల వల్ల తేలిన గద్య ప్రవిభేదాలు 1. వృత్తగ్రంధి 2. ఉత్కలికాప్రాయం 3. చూర్ణం (చూర్ణిక, చూర్ణకం) 4. వృత్తం 5. ముక్తకం అని అయిదు. వీనిలో వృత్తకం, చూర్ణకం ధర్మ సామ్యం చేతా, లక్షణ తుల్యత చేతా ఏకపదంగా చూర్ణకం అని గ్రహించవచ్చు. వృత్తగ్రంధి గద్య రచనమే అయినా, ఆ గద్యాంతర్గతంగా వృత్త భాగాలతో ఒప్పే రచన. చూర్ణకం, వృత్తకం దీర్ఘ సమాసాలు లేకుండా, లలిత మధుర పదాలతో, కఠోరాక్షర రహితమై, సంబోధనాత్మకంగా ఉండేవి. ఉత్కలికా ప్రాయం దీర్ఘ సమాస మయమై, కఠోరాక్షరయుతమై, ఉద్ధతంగా ఉండే వచనం. ముక్తకం సమాస రహితమయిన రచన. అంటే సమాస రహితమైన ముక్తకం, అల్ప సమాస సహితమైన చూర్ణకం లక్షణ సామీప్యం చేత ఏక పదంగా గ్రహించవచ్చు. కనుక చూర్ణకం, వృత్తకం, ముక్తకం ఏక విషయ బోధక భిన్న పదాలు. సౌకర్యార్థం ఈ మూడు విధాల వచన లక్షణాలకు ఏకత్వ మాపాదించి, పై మూడు పదాలకు బదులు తదర్థ బోధకత్వంతో చూర్ణకం స్వీకరించవచ్చు. కనుక వృత్తగ్రంధి, ఉత్కలికా ప్రాయం, చూర్ణకం సంస్కృత గద్య ప్రవిభేదాలుగా స్థూలంగా భావించవచ్చు. ఈ దృష్టితో వామనుడిచ్చిన నిర్వచనం సముచితంగా భావింపబడుతుంది.

## 1. 3. తెలుగు నిర్వచనం.

తెలుగులో పౌత్తపి వేంకట రమణ కవి లక్షణశిరోమణిలో గద్య లక్షణాన్ని ఈ క్రింది విధంగా వివరించాడు. "ఇక నందు గద్య లక్షణం-మరియు నందు గద్యము నైదు భేదంబుల విహరించునయ్యవి యోవంబేను గద్యయు, బిరుదు గద్యయు, చూర్ణికయు, వచనంబును, విన్నపంబునను గద్య

భేదంబు వైదను ప్రమోదంబున వివిధమ్ములై వినోదించునందు గద్య క్రమం బెటు వలె నంటేని, గద్య- అనుకరణ శబ్ద యుక్తంబునై యొప్పు, బిరుదు గద్య- సంబోధనాంత పద బంధురంబునై వర్ధిల్లు, చూర్ణిక- ద్వివచన బహు వచన సందర్భములగు విభక్త్యనుశాసన సమాసాదిత కల్పనానల్ప జల్పితంబై వెలయు; వచనంబులు- బహు ప్రకార రచనా నియమ ప్రాచుర్యంబులై సంచరించు; విన్నపంబులు విన్నవై ఋజుమార్గమ్ములననుగమించి మించు.''

## 1. 4. నిర్వచన సమన్వయం.

సంస్కృత నిర్వచనాలలోని గద్య ప్రవిభేదాలు తెలుగు నిర్వచనంలో పేర్కొనబడలేదు. తెలుగు చూర్ణికలో సంస్కృత చూర్ణికం గాని, వృత్తకం గాని, ముక్తకంగాని అనుసంధించే అవకాశం మృగ్యం. చూర్ణిక తెలుగులో ఉదాహరణవాఙ్మయ లక్షణంగా ప్రసిద్ధం. అర్థ వివక్షలో తెలుగు గద్య సంస్కృగద్య ఒకటికావు. తెలుగులో గద్య పరిమితార్థంలో ప్రయోగింపబడింది. సంస్కృతంలో గద్య విస్తృతార్థం కలిగి వుంది. కాబట్టి సంస్కృతంలోని త్రివిధ గద్య విభేదాలు, తెలుగులోని పంచవిధ గద్య భేదాలు మొత్తం గద్య బోధకమై ఉన్నాయి. నేడు గద్యానికి పర్యాయ పదంగా భావించే వచనం, పూర్వం భిన్నార్థంతో గద్య విభేదాలలో ఒకటి. నన్నయ భారతంలో సంస్కృతాంధ్ర సంప్రదాయ సంసేవనం జరిగింది కాబట్టి, సంస్కృతాంధ్ర నిర్వచనాంతర్గత గద్య ప్రవిభేదాలు భారతవచనంలోను, తదనంతర వచనంలోను పరిశీలింపవచ్చు. 1. వృత్తగంధి 2. ఉత్కలికాప్రాయం. 3. చూర్ణకం 4. గద్య 5. బిరుదు గద్య. 6. చూర్ణిక 7. వచనములు 8. విన్నపములు ఆంధ్ర వచన సాహిత్యంలో పరిశీలింపవచ్చు.

## 1. 5. గద్య ప్రవిభేదాలు

గద్య భేదాల వల్ల గద్య సంపూర్ణ రూపం పరికించే అవకాశం కలుగుతుంది. సంస్కృతాంధ్ర నిర్వచన దర్శితమైన విభాగాలు లక్షణతాలక్ష్య సమన్వయంగా చూడవచ్చు.

## 1. 6. వృత్త గంధి

'పద్య భాగవత్ వృత్త గంధి' అని వామనుడు, 'వృత్తైక దేశ సంబంధాత్ వృత్త గంధి' అని ఛందోమంజరి, 'వృత్త భాగయుతం పరమ్' అని వాచస్పత్యం తెలుపుతూ, 'వృత్తగంధి యథా సమర కండూయనిబిడ భుజదండ కుండలీకృత కోదండోత్యనుష్టుప్ వృత్తస్యపాద' అని వివరించటం వల్ల వృత్త పాదాలతో నిండి వచనంలా గోచరించే రచనకు వృత్త గంధి వచన ప్రభేదంగా లక్షణం నిర్ణయించినట్లు తెలుస్తుంది.

ఆంధ్ర కవిత్వంలో గద్యాంతర్గత పద్యచ్ఛాయ ఈ వృత్త గంధి గద్య విభేదానికి లక్ష్యంగా గుర్తింపవచ్చు. అనగా వృత్తగంధి పద్యభాగ నిబిడమైన వచనం. నన్నయ వచనంలో వృత్త గంధి రచన ఎక్కువ. అనంతర కాలంలో క్రమంగా తగ్గిపోయింది. నన్నయ వచనం 'అక్కథకుండు శౌనకాది మహ మునులకు జెప్పెనాది యుగంబున కశ్యప' కొద్దిమార్పులతో సీస పద్యం అవుతుంది.

అక్కథకుండు శౌనకాది మహామును

లకు జెప్పె నాది యుగంబునంగ (శ్యప)

ఇట్లు పెక్కు మృగంబులనెగచి చంపె (డు వేడుక)-తేటగీతి

ఇట్టి మహోత్పాదంబులు

పుట్టిన సురపతి...కంద పద్యం

నన్నయ తరువాత ఆంధ్ర కవులనేకులు వృత్త గంధి ప్రవిభేద గద్యం రచించారు. తిక్కనాదులు ఇటువంటి రచన చేశారు.

లోనుగాగల రాజలోకంబు తోడ (ఉద్యో 4.30) తేటగీతి. పెట్టుచోటు గాక పొగడుచుండు (అర. 5-356) ఆటవెలది. ఆది దశలో అధికంగా, అనంతరం అల్పంగా వ్రాయబడ్డ గద్య భేదం వృత్తగంధి.

గద్యంలో ఛందస్సు లేకపోయినా ఒక విధమైన తూగు, సమత, నడక

వచనం, గద్యం కంటే ప్రాచుర్యం పొందింది. వచనం నేడు వ్యక్తీకరించే అర్థం గద్యం స్ఫురింప చేయలేదు. నేటి భాషలో వచనపర్యాయపదంగా గద్యం ఎక్కడో తప్ప ప్రయోగింపబడదు. ప్రాచీన భాషలో గద్యం వచన పర్యాయ పదంగా భావింపబడినా 'గద్య' అని ము విభక్తి ప్రత్యయ రహితంగా వ్రాయ బడితే వచన పర్యాయంగా కాక, భిన్న వచన రీతిద్యోతకమవుతుంది. గద్యం అనగానే ఆశ్వాసాంత గద్యలే స్పష్టమవుతాయి. గద్యమనే విస్తృతార్థంలో గద్య పరిమితార్థబోధకం. వచనం స్థూలంగా గద్య పర్యాయపదమే అయినా, భిన్నార్థ బోధకం కూడా అవుతుంది. గద్యమన్నా, వచనమన్నా, ఒక వచన గ్రంథంలోని రచనగా భావింపబడవచ్చు. కాని వచనం అంటే చంపూ కావ్య సంప్రదాయం ఉన్న ఆంధ్ర సారస్వతంలో పద్యానికీ పద్యానికీ నడుమ ఉండే వచనం ఉద్దేశింపబడినట్లు స్ఫురిస్తుంది. ఇది వచనంగా ప్రసిద్ధంకాని, గద్యంగా గాదు. 'వచనములు' అని బహువచనరూపంగా ప్రయుక్తమయితే అది ఒక ప్రత్యేకాంధ్ర సాహితీ ప్రక్రియగా గోచరిస్తుంది. ''సింహగిరి వచనములు'', ''వేంకటేశ్వర వచనములు'', ''భవానీ మనోహర వచనములు'' పై ప్రక్రియకు ఉదాహరణాలుగా చెప్పవచ్చు.

'వచనములు'లో చంపూ కావ్యాలలో గోచరమయ్యే వచనం కానీ, ఆశ్వాసాంత గద్యలలోని వచనం కానీ, పూర్తి వచన గ్రంథంలోని వచనం కానీ ఆధునిక వచన స్వరూప స్వభావాలకు సమీపంగానయినా లేదు. ప్రాచీన వచనం ప్రాధాన్యం వేరు, నేటి వచన ప్రయోజనం వేరు. పద ప్రయోగంలో, సమాస ఘటనంలో, వాక్య నిర్మాణంలో ద్వివిధ వచనాలకు సన్నిహితత్వం లేదు. ప్రాచీన వచనం నిర్వహించిన పాత్ర పరిమితం. ఆధునిక వచన పాత్ర అపరిమితం. ప్రాచీన కాలంలో అర్థభేదంతో ప్రవర్తిల్లిన గద్య వచన శబ్దాలను అలంకారికులు, శాస్త్రకారులు నిర్వచించిన ధోరణి పరిశీలింపవచ్చు.

## 1. 1. 1 సంస్కృత నిర్వచనాలు.

సంస్కృత భాషలో గద్య పర్యాయపదంగా వచనం మృగ్యం కావటం వల్ల గద్యానికే నిర్వచనాలుపలభ్యాలు.

(అ) వామనుడు.

''గద్యం వృత్త గంధి చూర్ణముత్కాలికా ప్రాయంచ'' అని గద్యం వృత్త గంధి, చూర్ణం, ఉత్కాలిక అని చెప్పి, ''పద్య భాగవత్ వృత్తగంధి, అనావిద్ధ లలిత పదం చూర్ణం, విపరీత ముత్కాలికా ప్రాయంచ'' అని వివరించాడు.

(ఆ) భామహుడు.

''వృత్త బంధోఽజ్ఝితం గద్యమ్'' అని గద్యం వృత్త గంధితో ఒప్పుతూ వుండేదని తెలిపాడు.

(ఇ) విశ్వనాథుడు.

''అపాదః పద సంఘాతో గద్యమ్'' అని తెలిపి, ముక్తం, వృత్త గంధి, ఉత్కాలికా ప్రాయం, చూర్ణకం చూర్ణిక అని గద్యను విభజించాడు.

(ఈ) ఛందోమంజరి.

గద్యం వృత్తకం, ఉత్కాలికా ప్రాయం, వృత్త గంధి అని మూడు విధాలుగా విభజింపబడింది దాని అర్థం-

''అకఠోరాక్షరం స్వల్ప సమాసం వృత్తకం మతమ్
వృత్త వైదర్భ రీతిస్థం గద్యం హృద్యతరం భవేత్
భవేదుత్కలికా ప్రాయం సమాసాఢ్యం దృఢాక్షరమ్
వృత్తైకదేశ సంబంధాత్ వృత్త గంధి పునస్మృతమ్'' అని
వృత్తక ఉత్కలికా ప్రాయ, వృత్త గంధి లక్షణం తెలుపబడింది.

(ఉ) వాచస్పత్యం.

''గద్య-కథనీయే 'సహ్యః కథం వియోగశ్చ గద్యమేతత్ వయామమ.' భట్టి-సా.ద ఉక్తి. పాద రచితౌ కావ్య భేదేన. 'అన్యం ఓతవ్య మూలం తత్ పద్య గద్య మయం ద్విధా ఇతి ఆత్మకావ్యం విభజనా' వృత్తబంధోఽజ్ఝితం ముక్తకం. వృత్తగంధిచ భవేదుత్కలికా ప్రాయం చూర్ణకంచ చతుర్విధమ్. ఆద్యం సమాస రహితం వృత్తభాగ యుతం పరమ్. అన్యందీర్ఘ సమాసాఢ్యం

తుర్యాం చాల్ప సమాసకమ్. ముక్తకం యథా గురుర్వచసి పృథురురసీత్యాది వృత్త గంధి యథా సమర కండూయ నిబిడ భుజదండ కుండలీకృత కోదండోత్య నుష్టుప్ వృత్తస్యపాద ఉత్కలికాప్రాయం యథాః అణిసి విస్మరణి నిదదరప రవిసర విదలిత సమర పరిగద పబర పరబలేత్యాది ప్రాకృతమ్ చూర్ణకమ్ యథా గుణరత్న సాగర! జగదేక సాగర! కామినీ మదన జనరంజనేత్యాది!" ఇందు ముక్తకం, వృత్తగంధి, ఉత్కలికా ప్రాయం, చూర్ణకం—వీని లక్షణం లక్ష్యంతో తెలుపబడింది.

(ఈ) V. S. Apte-Sanskrit-English Dictionary.

"గద్యమ్. Prose, elaborate prose composition, composition not metrical yet framed with due regard to harmony; one of the three classes into which all compositions may be divided.

వచనమ్. 1. The art of speaking, uttering saying. 2. Speech, an utterance, words (spoken), sentence. నను వక్తృవిశేషని. స్పృహాగుణగృహ్యేవచనే విపాశ్చిత (కుమార) 2:5

ప్రీతః ప్రీతి ప్రముఖ వచనం స్వాగతం వ్యాజహార (మేఘ) 3:3

3. Repeating, recitation. 4. A text, diction, rule, precept, a passage of a sacred book, శాస్త్ర వచనమ్, శ్రుతి వచనమ్, స్మృతి వచనమ్. 5. An order, a command, direction. మద్వచనాత్ (in my name) by my order. 6. Advice, counsel, instruction. 7. Declaration, affirmation. 8. Pronunciation. 9. The significance or meaning of word. అత్రపయోధర శబ్ద మేఘ వచనః."

గద్య వచనాలలో కావ్య పరంగా గద్యమే గ్రహింపబడింది.. వచనం కస్వీకరింప బడలేదు. కాబట్టి గద్య లక్షణమే గోచరమయింది. వచనానికి అర్థం

విపులంగా వుంది. కాని లక్షణం నిర్వచింపబడలేదు. గద్య, వచన పదాల ధాతువులైన గద్, వచ్‌లకు, పలుకు అనే అర్థం ఉన్నప్పటికీ సంస్కృతంలో గద్యం పద్యేతర రచనకు నామధేయమయింది.

## 1. 2. సంస్కృత నిర్వచన పరిశీలనం.

సంస్కృత నిర్వచనాలలో వచనం ప్రస్తావింపబడలేదు. గద్యం సలక్షణంగా విభజింపబడింది. పై నిర్వచనాల వల్ల తేలిన గద్య ప్రవిభేదాలు 1. వృత్తగ్రంధి 2. ఉత్కలికాప్రాయం 3. చూర్ణం (చూర్ణిక, చూర్ణకం) 4. వృత్తం 5. ముక్తకం అని అయిదు. వీనిలో వృత్తకం, చూర్ణకం ధర్మ సామ్యం చేతా, లక్షణ తుల్యత చేతా ఏకపదంగా చూర్ణకం అని గ్రహించవచ్చు. వృత్తగ్రంధి గద్య రచనమే అయినా, ఆ గద్యాంతర్గతంగా వృత్త భాగాలతో ఒప్పే రచన. చూర్ణకం, వృత్తకం దీర్ఘ సమాసాలు లేకుండా, లలిత మయిన పదాలతో, కఠోరాక్షర రహితమై, సంబోధనాత్మకంగా ఉండేవి. ఉత్కలికా ప్రాయం దీర్ఘ సమాస మయమై, కఠోరాక్షరయుతమై, ఉద్ధతంగా ఉండే వచనం. ముక్తకం సమాస రహితమయిన రచన. అందే సమాస రహితమైన ముక్తకం, అల్ప సమాస సహితమైన చూర్ణకం లక్షణ సామీప్యం చేత ఏక పదంగా గ్రహించవచ్చు. కనుక చూర్ణకం, వృత్తకం, ముక్తకం ఏక విషయ బోధక భిన్న పదాలు. సౌకర్యార్థం ఈ మూడు విధాల వచన లక్షణాలకు ఏకత్వ మాపాదించి, పై మూడు పదాలకు బదులు తదర్థ బోధకత్వంతో చూర్ణకం స్వీకరించవచ్చు. కనుక వృత్తగ్రంధి, ఉత్కలికా ప్రాయం, చూర్ణకం సంస్కృత గద్య ప్రవిభేదాలుగా స్థూలంగా భావించవచ్చు. ఈ దృష్టితో వామనుడిచ్చిన నిర్వచనం సముచితంగా భావింపబడుతుంది.

## 1. 3. తెలుగు నిర్వచనం.

తెలుగులో పొత్తపి వేంకట రమణ కవి లక్షణశిరోమణిలో గద్య లక్షణాన్ని ఈ క్రింది విధంగా వివరించాడు. "ఇక నందు గద్య లక్షణం-మరియు నందు గద్యము నైదు భేదంబుల విహరించునయ్యవి యోవంటేను గద్యయు, బిరుదు గద్యయు, చూర్ణికయు, వచనంబును, విన్నపంబునను గద్య

భేదంబు వైదును ప్రమోదంబున వివిధమ్ములై వినోదించునందు గద్య క్రమం బెటు వలె నంటేని, గద్య- అనుకరణ శబ్ద యుక్తంబునై యొప్పు, బిరుదు గద్య- సంబోధనాంత పద బంధురంబునై వర్ధిల్లు, చూర్ణిక- ద్వివచన బహు వచన సందర్భములగు విభక్త్యనుశాసన సమాసాదిత కల్పనానల్ప జల్పితంబై వెలయు; వచనంబులు- బహు ప్రకార రచనా నియమ ప్రాచుర్యంబులై సంచరించు; విన్నపంబులు విన్ననై ఋజుమార్గమ్ములననుగమించి మించు.''

## 1. 4. నిర్వచన సమన్వయం.

సంస్కృత నిర్వచనాలలోని గద్య ప్రవిభేదాలు తెలుగు నిర్వచనంలో పేర్కొనబడలేదు. తెలుగు చూర్ణికలో సంస్కృత చూర్ణికం గాని, వృత్తకం గాని, ముక్తకంగాని అనుసంధించే అవకాశం మృగ్యం. చూర్ణిక తెలుగులో ఉదాహరణవాఙ్మయ లక్షణంగా ప్రసిద్ధం. అర్థ వివక్షలో తెలుగు గద్య సంస్కృగద్య ఒకటికావు. తెలుగులో గద్య పరిమితార్థంలో ప్రయోగింపబడింది. సంస్కృతంలో గద్య విస్తృతార్థం కలిగి వుంది. కాబట్టి సంస్కృతంలోని త్రివిధ గద్య విభేదాలు, తెలుగులోని పంచవిధ గద్య భేదాలు మొత్తం గద్య బోధకమై ఉన్నాయి. నేడు గద్యానికి పర్యాయ పదంగా భావించే వచనం, పూర్వం భిన్నార్థంతో గద్య విభేదాలలో ఒకటి. నన్నయ భారతంలో సంస్కృ తాంధ్ర సంప్రదాయ సంసేవనం జరిగింది కాబట్టి, సంస్కృతాంధ్ర నిర్వచ నాంతర్గత గద్య ప్రవిభేదాలు భారతవచనంలోను, తదనంతర వచనంలోను పరిశీలింపవచ్చు. 1. వృత్తగంధి 2. ఉత్కలికాప్రాయం. 3. చూర్ణకం 4. గద్య 5. బిరుదు గద్య. 6. చూర్ణిక 7. వచనములు 8. విన్నపములు ఆంధ్ర వచన సాహిత్యంలో పరిశీలింపవచ్చు.

## 1. 5. గద్య ప్రవిభేదాలు

గద్య భేదాల వల్ల గద్య సంపూర్ణ రూపం పరికించే అవకాశం కలుగు తుంది. సంస్కృతాంధ్ర నిర్వచన దర్శితమైన విభాగాలు లక్షణాలక్ష్య సమన్వయంగా చూడవచ్చు.

## 1. 6. వృత్త గంధి

'పద్య భాగవత్ వృత్త గంధి' అని వామనుడు, 'వృత్తైక దేశ సంబం ధాత్ వృత్త గంధి' అని ఛందోమంజరి, 'వృత్త భాగయుతం పరమ్' అని వాచస్పత్యం తెలుపుతూ, 'వృత్తగంధి యథా సమర కండూయనిబిడ భుజదండ కుండలీకృత కోదండోత్యనుష్టుప్ వృత్తస్యపాద' అని వివరించటం వల్ల వృత్త పాదాలతో నిండి వచనంలా గోచరించే రచనకు వృత్త గంధి వచన ప్రభేదంగా లక్షణం నిర్ణయించినట్లు తెలుస్తుంది.

ఆంధ్ర కవిత్వంలో గద్యాంతర్గత పద్యచ్ఛాయ ఈ వృత్త గంధి గద్య విభేదానికి లక్ష్యంగా గుర్తింపవచ్చు. అనగా వృత్తగంధి పద్యభాగ నిబిడమైన వచనం. నన్నయ వచనంలో వృత్త గంధి రచన ఎక్కువ. అనంతర కాలంలో క్రమంగా తగ్గిపోయింది. నన్నయ వచనం 'అక్కథకుండు శౌనకాది మహ మునులకు జెప్పెనాది యుగంబున కశ్యప' కొద్దిమార్పులతో సీస పద్యం అవుతుంది.

అక్కథకుండు శౌనకాది మహాముని

లకు జెప్పె నాది యుగంబునంగ (శ్యప)

ఇట్లు పెక్కు మృగంబులనెగచి చంపె (డు వేడుక)-తేటగీతి

ఇట్టి మహోత్పాదంబులు

పుట్టిన సురపతి...కంద పద్యం

నన్నయ తరువాత ఆంధ్ర కవులనేకులు వృత్త గంధి ప్రవిభేద గద్యం రచించారు. తిక్కనాదులు ఇటువంటి రచన చేశారు.

లోనుగాగల రాజలోకంబు తోడ (ఉద్యో 4.30) తేటగీతి. పెట్టుచోటు గాక పొగడుచుండు (అర. 5-356) ఆటవెలది. ఆది దశలో అధికంగా, అనంతరం అల్పంగా వ్రాయబడ్డ గద్య భేదం వృత్తగంధి.

గద్యంలో ఛందస్సు లేకపోయినా ఒక విధమైన తూగు, సమత, నడక

ఉండాలన్న కవికాంక్షకు ప్రతిరూపం వృత్త గంధి...."Aristotle, who threw light on so many things, practically started the whole enquiry in which this book is an essay, by his description of prose as neither possesing metre nor destitute of rhythm". (9)

వృత్త గంధి గద్యంలో ఛందస్సు వుంది. కానీ ఛందస్సు లేకపోయినా సమత ఉండాలన్నది సువ్యక్తం. కానీ వచనంలో సమత ఉండాలని, ఆ సమత ఛందస్సాధితమయినా అభ్యంతరం కాదని, వృత్త గంధి ఈ దశాబోధకమని భావించటం ఉచితం. అందుకు "But let not prose be altogether prose, for it would be dry; nor metred, for that would attract too much attention; but let it be mingled wtih all kinds of metres, especially iambic and trochaic."(10)

గద్యంలో సమత సంస్కృతాంధ్రాంగ్ల ప్రసిద్ధం. సంస్కృతంలో ఛందస్సు వల్ల సాధింపబడే సమత ఉన్న రచనకు వృత్తగంధి పేరుంది. తెలుగులో వృత్త గంధి గద్యం సిద్ధించింది. ఆంగ్లంలో ఛందోవికారం వల్ల-ప్రసిద్ధ మయిన ఏ ఛందస్సు వల్ల కాక, భిన్న గుణ మిశితంగా-గద్యం ఉంది. 'ఎ హిస్టరీ ఆఫ్ ఇంగ్లీషు ప్రోజ్ రిథిమ్' అనే గ్రంథం ఆంగ్ల గద్యంలో సమతను పూర్వం నుంచి ఆధునిక కాలంవరకు దర్శించింది.

"Prose needs a less obtrusive, more elusive, kind of music. On the other hand, the writer who has no ear, or no care, for rhythm of any kind, may produce a sort of prose that is over-prosaic, humdrum or down right ugly." (11) గాన రీతి నిబిడమైన గద్యం, సమత సాధితమైన గద్యం విలసిల్లాలని, నీరసం పేలవం అయిన వచనం కంటే అది వాంఛనీయమని తలపబడింది. ప్రాచీనాధునిక రచయితల వచన భాగాలు పరిశీలిస్తే ఈ సమత పుష్కలంగా అవగత మవుతుంది. కాని వచనంలో

పద్య గుణం నిబిడమై - పద్యం కాక - సమతాధర్మం నిండి - సమతకాక - రచింపబడ్డప్పుడు ఉత్తమ వచనం ఆవిర్భవిస్తుంది. "In fine, English prose of a poetic kind contains, I think far more hidden metre than, so far as I know, has never been recognised." (12)

ఆంగ్ల వచనంలోని పై విధ గద్యం వల్లనూ, సంస్కృతాంధ్ర వచనంలోని వృత్తగంధి గద్య ప్రవిభేదం వల్లనూ గద్యం పూర్తిగా నిశ్ఛందం కారాదనీ, ఛందస్సు స్పష్టంగా గోచరించేటట్లుగా వచనం ఉండరాదనీ, గద్యం పద్యగతమైన తూగుతో, సమతతో, ఛందస్సు లేకుండా సాగాలనీ కోరుకొన్నట్లు తెలుస్తుంది. ఈ విధమైన వచనం ప్రాచీన కాలంలో ఎక్కువగా ఆవిర్భవించింది. క్రమ క్రమంగా తగ్గిపోయింది. ఇప్పుడు వచనం అంటే ఛందస్సులేని రచనారీతి అనే భావం ఏర్పడింది. కాని ఛందస్సుకు ప్రధాన గుణమైన సమత వచన రచనంలో ఉండటం వాంఛనీయం.

## 1. 7. ఉత్కలికా ప్రాయం

ఉత్కలికా ప్రాయం పద్య భాగ విరహితమై, లలిత పద రహితమై ఉంటుంది. సమాసాఢ్యమై దృఢాక్షరమై వుంటుంది. దీర్ఘ సమాసాఢ్యమై వుంటుందని తెలుపుతూ, "అణిసి విస్మమరణి సిదదరపర విసర విదలిత సమర సరిగద పబర పరబలేత్యాది" అని వాచస్పత్యంలో వివరింపబడింది.

ఈ విధమైన గద్యం ఉదాహరణ వాఙ్మయంలో అధికంగా లభిస్తుంది. నన్నయ వచనంలో విరళంగా, తిక్కన గద్యంలో అత్యల్పంగా, శ్రీనాథుడు, పెద్దన మొదలైన వాళ్ళ కాలంలోని ప్రబంధాలలో దీర్ఘ సంస్కృత సమాస భూయిష్ఠమై, దృఢాక్షర సహితమై ఉత్కలికా ప్రాయ గద్య ప్రవిభేదం గోచరిస్తుంది.

ఈ లక్షణం దృష్టితో పరిశీలిస్తే ఉత్కలికాప్రాయం శైలీ ప్రవిభేదంగా భావితమయినంత ఒప్పిదంగా గద్య విభేదంగా కనిపించటంలేదు. ఇటువంటి రచన తెలుగులో ప్రత్యేకంగా చెప్పదగినంత వైశిష్ట్యంతో లేదనవచ్చు.

## 1. 8. చూర్ణకం

చూర్ణకం, వృత్తకం, ముక్తకం - దాదాపు ఒకే అర్థం చెప్పే భిన్న పదాలు. కనుక చూర్ణకం పదంతో ఈ మూడు విధాల లక్షణ సమన్వయం సముచితం. అనావిద్ధ లలిత పదం (చూర్ణం) అకఠోరాక్షరమై, స్వల్ప సమాసం (వృత్తకం), సమాసరహితం (ముక్తకం-గురుర్వచసి పృథురురసీత్యాది) అల్ప సమాసకం (చూర్ణకం-గుణరత్నసాగర ! జగదేక సాగర ! కామినీ మదన జన రంజ నేత్యాది) అయి ఒప్పేది చూర్ణకం. అంటే సమాసాలు లేకుండా, తప్పని సరి అయితే అల్పమో, స్వల్పమో సమాసాలతో కూడిందై, కఠోరాక్షరాలు లేని లలిత పదాలతో ఉండే గద్య ప్రవిభేద రచన చూర్ణకం.

చూర్ణకం నన్నయ భారతంలో ''నీలాభ్ర సంవృతమైన చంద్రరేఖ తేజము''లా విలసిల్లింది. నన్నయ రచనంలో చూర్ణక రచన మధికం. అనంతర కవులలో అల్పంగా చూర్ణక రచన వుంది. పద్యాల నడుమ ప్రయోగించే పదంగా, కొద్ది పదాల కూడికగా, చిన్న వాక్యంగా, ఒకటి రెండు చిన్న వాక్యాల కలయికగా ఉండే ప్రాచీనాధునిక పురాణ ప్రబంధ కావ్య వచనమూ, చంపూ కావ్యాలలో అసంపూర్ణ వాక్యంగా ఉండే పదం కానీ, పదాల కూడిక గానీ అయిన వచనమూ చూర్ణకం.

ప్రాచీన కవులలో అనేకులు చూర్ణకం ఉపయోగించారు. ఆధునికులు పలువురు ప్రయోగించారు. చూర్ణకం ప్రాచీన కాలంలో విస్తృత రచనావకాశం పొందకపోయినా, ఆధునిక కాలంలో అధికంగా సమాదరం పొందింది. నేటి వచన స్థితికి చూర్ణకం లక్షణ సామీప్యం వల్ల, చేరువగా వుంది. చూర్ణక రీతి గద్యం వర్తమానంలో విస్తృతంగా ప్రయుక్తమవుతూవుంది. ఒక విధంగా ఆధునిక వచన రూపానికి పరోక్షంగా ఆద్యరూపం చూర్ణకం.

## 1.9. గద్య

గద్యం అన్న అర్థంలో కాక గద్య భిన్నార్థబోధకం. గద్య అనగానే ఆశ్వాసాంత గద్యలే స్ఫురిస్తాయి. లక్షణ శిరోమణిలో చెప్పబడ్డ ''అనుకరణ

యుక్తంబై యొప్పు'' నన్న మాట పూర్తి లక్షణం కాదు. గద్య అనగానే మరొక భిన్నరీతి రచన ద్యోతక మవుతుంది. అది శివకవుల రచనా ప్రక్రియ అయిన గద్య. మల్లికార్జున పండితారాధ్యుడు గద్య రచన చేసినట్లు, దాని పేరు శ్రీముఖదర్శన గద్య అయినట్లు, బసవపురాణ పీఠికలో వేటూరి ప్రభాకర శాస్త్రి పేర్కొనటం గమనార్హం. ''రామానుజాచార్యులు రచించిన గద్య త్రయము వంటివి సంస్కృతమున కొన్ని గలవు.'' (13) అంతేకాదు, పాల కురికి సోమనాథుడు పంచ ప్రకార గద్య, నమస్కార గద్య, అక్షరాంక గద్య, అష్టోత్తర శతనామ గద్య వ్రాశాడు. గద్యం ఒక విధమైన ప్రక్రియగా సంస్కృతం నుంచి వచ్చినట్లు భావింపబడుతుంది. ''గద్యము... వచనము కాదనియు, ఒక గణ నియమ ప్రకారము రచింపబడిన రగడ రచనము లందు చేర్పవలయుననియు స్పష్టమగుచున్నది.'' (14) ''గద్యయను పదమున కొక విలక్షణార్థ మున్నట్లు... గద్యయను ప్రత్యేక ప్రక్రియ మన కొకటి నిర్దిష్టాకార ముతో నున్నట్లు'' (15) తెలిసింది. ''గద్య రచనలు మాత్రాఛందస్సు ననుస రించి నడచుచు పాటగా పాడుటకు వీలు కలుగుటచేత'' (16) నేటి వచనం కంటె భిన్నంగా గద్య విలసిల్లింది. ''పాలకురికి సోమనాథుడు- రచించిన గద్యకృతులనబడినవి వచన రచనములలో చేర్చుటకు వీలులేదు.'' (17) కాబట్టి ప్రాచీన కాలంలోనే వచనం వేరు గద్య వేరు అయ్యాయి.

ఆశ్వాసాంత గద్యలు సాధారణంగా, కవిని గూర్చి తెలిపేవిగా వుంటాయి. ''సకల భాషా భూషణ, సాహిత్యరసపోషణ, సంవిధాన చక్రవర్తి, సంపూర్ణ కీర్తి, నవీన గుణసనాథ, నాచన సోమనాథ.'' గద్యలోని సామాన్య లక్షణాలు పరిశీలింపవచ్చు. గద్యలు శబ్దాలంకార రచనలు, కొన్ని సందర్భాలలో మాత్రా ఛందస్సహితాలు. కవి గుణగణాదులు, బిరుదాలు, కవితాశక్తి సామర్థ్యాలు కవితా లక్షణాలు తెలుపుతూ వుంటాయి. ఆశ్వాసంలోని ప్రధాన కథాంశాలకు విషయ సూచన ప్రాయంగానూ వున్నాయి. సమాస భూయిష్ఠమైన, అనుప్రాసాలంకార శోభితమై ఉన్నాయి. కొన్ని గద్యలలో కవి వంశ నామాదికాలు, కొన్నింటిలో ఇష్టదేతావస్తుతియుతమైన సూచనం గోచర మవుతూ వున్నాయి. ఈ గద్యలు వచన రచనలే అయినా, పద్యాలలా ద్యోతక మవుతాయి. ''ఈ గద్య స్వరూపము కేవల వచనమునకును, కేవల పద్యమునకునుమధ్య స్థితి నా్ర

మించుచున్నది.'' (18) ఈ గద్యలు వచన పరిణామంలో వృత్త గంధి రచనకు పూర్వస్థితి ద్యోతకాలు. వృత్తగంధి రచనా విధానం గద్య కంటే పరిణత రూపం.

## 1.10. బిరుదు గద్య

పరిణామ శీలమయిన భాషలో బిరుదు గద్యలు గద్య రూపాంతరాలు. బిరుదు గద్యలు ఒక వ్యక్తి బిరుదు లుల్లేఖించటం వంటివి. బిరుదు గద్య రచన కాద్యస్థితి. కవులు తమ బిరుదులు వ్రాసిన వచనం బిరుదు గద్యగా, రాజులు వంధిమాగధుల మూలంగా వినే స్తుత్యాదుల వచనం బిరుదు గద్యగా స్వీకరించటం చేత, బిరుదు గద్య గద్య విభేదంగా భావింపవచ్చు. ''ఆశ్వాసాంతమున కవులు తమ బిరుదులను చెప్పుకొనుట సంప్రదాయమే కాని అయిన నివి సంబోధనాంత ములుగా నుండవు.''(19) బిరుదు గద్యలో కవులు తమ బిరుదావళి వ్రాసుకో వటం చేత అది సంబోధనాంతంగా లేదు. కాని రాజుల విషయంలో బిరుదు గద్య ఇతరులు వ్రాయటం వల్ల సంబోధనాంతంగా వుంది. ఈ సంప్రదాయం క్రీ.శ. 3వ శతాబ్ది నుంచి ఉన్నట్లు శకరాజగు రుద్రమమనుని గూర్చిన ''స్ఫుటలఘు మధుర చిత్రకాంత శబ్ద సమయోదారాలంకృత గద్యపద్య కావ్య విధాన ప్రవీణ'' (శ్రీ నిడదవోలు వేంకటరావు - ఆంధ్ర వచన వాఙ్మయములో ఇచ్చిన ఉదాహరణం) అనే శాసనస్థమైన బిరుదు గద్యమూలంగా వ్యక్తమవుతూ వుంది. అంతేగాక గద్య పదం మూడో శతాబ్ది నాటికే ప్రయోగింపబడ్డట్లు స్పష్టమవుతుంది. గద్య విధమైన రచనంలో, ప్రథమ పురుషలో బిరుదావళితో సంబోధనాంతంగా ప్రవర్తిల్లేది బిరుదు గద్య. ''గద్య గద్యము-Prose of melodious measured kind used in poems. గద్దె-titles, particularly those proclaimed by heralds as the princes style'' (C.P. Brown) బిరుదు గద్యకు రూపాంతరం బిరుదు గద్దె. ఏ బిరు దులు నిండిన స్తుతి పాఠాదికాలు ఏ స్థానంలో రాజు కూర్చుంటే వంది మాగధుల చేత చదవబడతాయో, ఆ స్థానానికి గద్దె అని పేరు వచ్చి, గద్దె సింహాసనానికి పర్యాయపదమై, బిరుదు గద్దె రాజు పరమయింది. ''గద్య అను పదము ప్రకృతిలో వచనమునకు వికృతిలో సింహాసనమునకు పేరైనది.'' (20) సోదె చెప్పే ఎరుక స్త్రీ 'గద్దె జెబుతా' అనటంతో గద్దె అర్థ విపరిణామం పొంది, సోదె అయింది. రాజుకు, భట్రాజు-స్తుతించే బిరుదు

గద్దెలు చదివేవాడు అయితే, సామాన్యుడికి, ఎరుక త్ర-బిరుదులు లేని స్తుతులు పలకటం వల్ల గద్దె అర్థ వంతంగా ఉందనవచ్చు. బిరుదు గద్యలోపు గద్య లోని గద్య వికృతిగా గద్దె అయి సింహాసనానికీ, సోదెకూ పర్యాయ పదం అయింది. బిరుదు గద్దె ప్రధానంగా స్తుతి విషయకం. బిరుదు గద్య ''సంబోధ నాంత పద బంధురంబునై వర్ధిల్లు''తూ వుంటుంది. ఇది గద్య విభేదం చెప్ప బడినా గద్యాంతర్భాగంగా భావించే అవకాశం వుంది.

## 1.11 చూర్ణిక

"చూర్ణిక ద్వివచన బహు వచన సందర్భములగు విభక్త్యాను శాసన సమాసాదిత కల్పనా సల్ప జల్పితంబై వెలయు" ఏవం విధమైన వచనం ఉదా హరణ వాఙ్మయ ప్రసిద్ధం.

## 1.12 వచనం

'వచనంబులు-బహు ప్రకారరచనా నియమ ప్రాచుర్యంబులై సంచరించు' అని లక్షల శిరోమణి తెలిపింది. వచనం బహు ప్రకారాలుగా వున్నా, ప్రధా నంగా నాలుగు రీతులుగా ప్రాచీన కాలంలో ప్రవర్తిల్లిందని గమనింపవచ్చు. పురాణ ప్రబంధ కావ్య సంతానంలో పద్యాల నడుమ ప్రయోగింపబడ్డ వచనం. శాసన భాషలో గోచరమయ్యే వచనం. ప్రత్యేక వచన గ్రంథాల వచనం. వచనముల ప్రక్రియలోని వచనం. ప్రాచీనాంధ్ర భాషలోని వచన పరిశీలనంలో పై విధమైన వచనం పొందినంత ప్రాచుర్యం ఏ గద్య విభాగం కాని, సర్వగద్య సంచయ వచనం కాని పొందలేదు. ఈ వచన స్థితి విస్తృతంగా ప్రముఖంగా దర్శింపవచ్చు.

చంపూ కావ్య వచనంలో వర్ణనం, సంభాషణం, కథా కథనం ప్రధా నంగా జరిగి విస్తృత వచనం ఆంధ్రభాషలో ఏర్పడింది. శాసన భాషలో వచనం గ్రాంథిక వ్యావహారిక రూపాలతో, రాజకీయ నిర్వహణ సమర్థమయింది. వచన గ్రంథాల వచనం కథా కథనంలో, మనుష్యత్వ వివరణంలో సమాజవర్ణనంలో ప్రత్యేకత కలిగిందిగా రూపొందింది. 'వచముల' వచనం గీతిమాధుర్యం వున్న రచనగా ఏర్పడింది.

సంస్కృతంలో గద్యం ప్రసక్తం కాని వచనం కాదు. తెలుగులో వచనం నన్నయ నాటి నుంచి వుంది. ''ప్రాచీన కాలమున వచన వాఙ్మయము వెలయ లేదని శంకించుట యసమంజసము'' (21) ప్రాచీనాంధ్ర వచనంలో నిశ్ఛందమై, లేకపోతే ఛందోంతర్గత గద్యమై ఉన్నదొక కోవ, శతకాలలోని పద్యాలలాగా మకుటంతో మాధుర్యంతో, గాన యోగ్యతతో, భగవన్నామ సంకీర్తనంతో వెలిసిన 'వచనములు' ఇంకొక కోవ. ఈ విధమైన సంకీర్తనంతో 'వచనములు' ఇంకొక కోవ. ఈ విధమైన రచనకు 'వచనములు' అని ప్రత్యేకంగా పేరు ఏర్పడింది. ''తెలుగు భాషలో పదమూడవ శతాబ్ది నుండి పాటలుగా పాడదగిన వచములు వెలయుట చేతను, నవి ప్రబంధముల యందు వెలయక నేకైకముగా నొక గ్రంథ రూపమున లభ్యమగుట చేతను, తొలి వచన గ్రంథము లవియే యని నిర్ధరింపవచ్చును.'' (22) ఈ దృష్టితో వచన వాఙ్మయ ప్రథమాచార్యుడు కృష్ణమాచార్యుడు.

తెలుగులో వచనం అన్న పదం పైఅర్థంలో నన్నయ కాలంలో లేదు. 12వ శతాబ్దంలో కన్నడ భాషలో బసవేశ్వరుడు కాలజ్ఞాన వచనము, షట్ స్థల వచనము అనే పేర్లతో ఛందస్సులేని రచన చేసి వచనముల రచనా సంప్రదాయ మేర్పరచినట్లు భావింప వచ్చు. ''తెలుగు కవులు వచన మను పదమును కన్నడము నుండి గ్రహించి యుపయోగించిరనుటలో సందేహము లేదు'' (23) వచనం అన్న పదం తెలుగులో 12వ శతాబ్దం కంటే ముందే వుంది. అయితే కన్నడ వచనప్రభావంతో వచనముల రచనా సంప్రదాయం తెలుగులో ఏర్పడిం దని తలపోయవచ్చు.

తెలుగు భాషలో వచన రచన ఆది నుంచి విస్తృతంగా సాగింది. అది తక్కిన అన్ని గద్య ప్రవిభేదాల కన్నా అధికం. తెలుగులో ఈ చతుర్విధ వచనం పొందిన పరిణామం స్థూలంగా పరిశీలిస్తే తెలుగు వచనం ప్రత్యేకత, వైశిష్ట్యం, వ్యక్తిత్వం స్పష్టమవుతాయి

## 1. 13 విన్నపములు

బిరుదు గద్య గద్యాంతర్భాగమయినట్లే 'విన్నపములు' వచనాంత ర్భాగాలు. 'విన్ననై ఋజు మార్గమ్ముల ననుగమించి మించు' అన్న లక్షణం

స్పష్టంగా లేదు. 'విన్నపములు' 'వచనములు' లాగా 13వ శతాబ్దికి చెందిన కృష్ణమాచార్యులే రచించాడు. అవి రెండూ ఏక కర్తృకాలే! తాళ్ళపాక అన్నమాచార్యులు విన్నపములు, వచనములు వ్రాసిన కృష్ణమాచార్యుణ్ణి స్తుతించాడు. ఈ వచనములు, విన్నపములు సంకీర్తనాలకు ఆద్య రూపాలుగా భావింపవచ్చు. వచన సంకీర్తనాలలోలాగ 'విన్నపము'లలో మకుటముంటుంది.

చూర్ణిక ప్రధానంగా ఉదాహరణ వాఙ్మయ సంబంధి. బిరుదు గద్యా గద్యకు విస్తృత దశ కాబట్టి గద్యలో అంతర్గతం అవుతుంది. 'వచనములు', 'విన్నపములు' ఒకే ధోరణి రచనా విధానం తెలుపుతాయి కనుక, వచనములు అనే విస్తృత పరిధిలో 'విన్నపములు' అనే స్వల్ప పరిధి ఇమిడిపోతుంది. వృత్త గంధి, ఉత్కలికాప్రాయం, చూర్ణకం గద్య ప్రవిభేదాలు గాబట్టి స్థూలంగా గద్యమనీ; చతుర్విధ వచన రూపం, వచనములు అన్న పద రూపం స్థూలంగా వచనమని స్వీకరింపవచ్చు. నేడు ఆంగ్లంలో 'ప్రోజ్' అనే పదానికి వచనం, గద్యం తుల్యపదాలుగా భావింపవచ్చు. అయితే, వచనం తెలుగులోనే ప్రయోగింపబడటం వల్ల, ఆంధ్ర సంప్రదాయ ముద్రితం కావటం వల్ల ప్రథమ గౌరవ పాత్రం అవుతుంది. గద్యం సంస్కృత వచనం తెలిపే పదం. అది కవిత్వ లక్షణాలకు దగ్గరగా వున్న లక్షణంతో ఒప్పుతూ వుంటుంది. కాబట్టి స్థూలంగా ఆంగ్లంలోని ప్రోజ్ అనే పదానికి తెలుగులో వచనం తుల్యపదంగా స్వీకరింప వచ్చు. ఈ వచనం తెలుగుభాషలో పొందిన పరిణామం దర్శించటం కర్తవ్యం.

## 2. తెలుగు వచనస్థూల పరిణామం

తెలుగు వచనం 1. శాసన వచనం 2. చంపూ కావ్య వచనం 3. 'వచనములు' వచనం 4. వచన గ్రంథ వచనం అని నాల్గు విధాలు. ఈ చతుర్విధాంధ్ర వచనం గూర్చి దిక్ప్రదర్శనంగా చూడటం అభిలషణీయం. శాసన వచనం అధికంగా వ్యావహారికం, అల్పంగా గ్రాంథికం అయివుంది. వచన గ్రంథస్థ వచనంలో వ్యావహారిక గ్రాంథికాలు 'సమతూకం'లో ఉన్నాయి. 'వచనములు'లోని, చంపూ కావ్యాలలోని వచనం సాధారణంగా గ్రాంథికంగా

వుంది. ఆధునిక యుగేతర కాలంలో వెలువడ్డ సారస్వతంలో అధికంగా గ్రాంథిక భాష వుంది. ఆధునిక యుగంలో అధికంగా వ్యావహారిక భాష వుంది.

## 2.1 శాసన వచనం

నన్నయభట్టు పూర్వ పద్య భాషకాని, వచనం కాని స్పష్టం కావాలంటే శాసనాలకు మించి గత్యంతరం లేదు. శాసనాలు రాజు రాజ్యవిషయానికి సంబంధించో, బ్రాహ్మణాదులకు చేసిన దానానికి సంబంధించో వుండవచ్చు. రాగి రేకుల మీదో, రాతి పలకలపైనో వ్రాయబడో, చెక్కబడో వుంటాయి. జయించిన, లేకపోతే కోల్పోయిన రాజ్యం ఎల్లల్లోనో, దానం ఇచ్చిన ప్రదేశంలోనో ఆ యా విషయాలు బోధించేవిగా వుంటాయి శాసనాలు. "శాసనములలోని భాష కడు పరిమిత మయినది. పరిమిత ప్రయోజమును కలది." (24) అందువల్ల వచన వైవిధ్యం అధికంగా తెలియదు. శాసన వచనం కొంత మార్గరీతిలో - అంటే గ్రాంథిక ధోరణిలో, మరికొంత దేశిరీతిలో - అంటే వ్యావహారిక ధోరణిలో సాగింది.

తెలుగు శాసనాలను మూడు విధాల విభజింపవచ్చు. మొదటి దశ శాసనాల భాష తెలుగు కాదు. సంస్కృతమో, ప్రాకృతమో, మిశ్రమమో అయిన భాష. ఈ శాసనాలలో తెలుగు దేశానికి సంబంధించిన వ్యక్తులు, గ్రామాల పేర్లు మాత్రమే గోచరిస్తాయి. ఈ శాసనాల కాలం క్రీ. శ. 2-5 శతాబ్దుల మధ్యకాలం. కెరూపురే, కుడూర, నాగబు, కమ్మాకరటె, ఎటిపుఅం, వేంగిపురం, ఏలూరే మొదలైన పదాలు గోచరమవుతాయి. రెండో దశ శాసనాలు చాలావరకు తెలుగు శాసనాలు. అవి వచనంలో వున్నాయి. వాటిలో ధనంజయుని కలమళ్ళ శాసనం (క్రీ. శ. 575), ఎరికల ముత్తురాజు ఎఱ్ఱగుడిపాడు శాసనం (6వ శతాబ్ది చివర), చోళ మహారాజు ఊరుటూరు, ఇందుకూరు శాసనాలు (7వ శతాబ్ది) ఉదాహరింపవచ్చు). ఈ దశ శాసనాలు 11 వ శతాబ్ది నుంచి నేటిదాకా చెప్పవచ్చు. ఈ శాసనాల భాష వ్యావహారిక గ్రాంథికాలతో నిండి, గద్య పద్యాత్మకమై వుంది.

### 2.1.1 వ్యావహారిక భాషా శాసనం

"స్వస్తిశ్రీ సోఱ మహారాజుల్లొళన ఇన్దుఱోళి అణపోతులు రేవణకాలు వుద్ధరణకాలు ఇచ్చిన పన్నస సెన్నాటి ఇశె ఱెనికిన్ తేని ఱెచ్చిన పఞ్చ మహాపాత

కున్నకున్'' పై శాసనంలో భాష గమనార్హం. ఈ భాష శాసన కాలం నాటి వ్యవహారికం. ఇటువంటి భాష నన్నయకు పూర్వపు శాసనాలలో వ్రాయబడటానికి కారణం వ్రాసిన వాళ్ళు పండితులు కాక రాజోద్యోగులు కావటం. శకటరేఫం, వాక్యరచనా విధానం శాసన భాష తీరు తీయాలు తెలుపేవి అవుతాయి. ఇటువంటి వచనా విధానం ప్రాఙ్నన్నయ కాలంలోని శాసనాలలో అధికంగా వుంది.

## 2.1.2 గ్రాంథిక వచన శాసనం

గ్రంథస్థ భాషకు సమీపస్థంగా వున్న శాసన భాషను గ్రాంథిక భాష అని పిలువవచ్చు. ఈ గ్రాంథిక భాషా శాసనం 9వ శతాద్దికి ముందటిది ఒకే ఒక్కటి లభ్యమయివుంది. "The Turimella inscr. is the only one of its kind upto the 9th c - a prose inscr. written in the literary dialect". (25)

> ఓం స్వస్తి శ్రీమత్ సత్యాశ్రయ శ్రీ పృథివీ
> వల్లభ - మహారాజాధిరాజ - విక్రమాదిత్య పరమే
> శ్వర భటారులాకున్ శ్రీమదున్నత ప్రవర్థమాన విజయ
> రాజ్య సమ్వత్సరంబుళ్ ఆ చంద్రతార పురస్సరమ్
> ద్వితీయ వర్షమ్ ప్రవర్థమానం కాను గొగ్గిభటారల దక్షిణ
> భూజాయ మానున్టు అయిన ఆలకుమర ప్రియతనయిన్టు అయిన
> ఉజేనీ పిశాచ నామధేయినుట్టు తుఱు తటాకనామాభిధాన నగరధిష్ఠానుం
> అయి ఈఱువ విష యథేచ్ఛేశన్ తస్య
> మాతాదత్తమ్ గోవృషణ భట్టారహో శత పంచశత్ క్షేత్రమ్.

ఈ శాసనం ఆ కాలం నాటి మిగతా శాసనాల కంటే భిన్నంగావుండి, భాష విశిష్టంగా వుంది. నన్నయ భాషకు, ఆ తర్వాతి గ్రంథస్థ భాషకు ఈ శాసన భాష సమీపంగా వుంది. "One can see that the inscr. is written in kavya style which is different from the Vyavaharika style. There is in this prose text an abundance of the tatsama element in vocabulary, a regular observance of sandhi rules as in the verse inscr. and a

refined type of sentence construction which we call anvaya - saustava.'' (26)

ప్రాఙ్నన్నయ కాలం నాటి వచన రూపం తెలుసుకోటానికి శాసనాలే ఆధారం. కాని నన్నయ అనంతరం కూడా శాసనాలు బహుధా ప్రవర్తిల్లాయి. నాటి భాష జన జీవితానికి మిక్కిలి సమీపంగా ఉన్నట్లు గమనింపవచ్చు. శాసన భాష అధికంగా వ్యావహారికమైవుంది.

## 2. 1. 3 శాసన వచన స్థూల పరిణామం

ప్రాఙ్నన్నయ యుగ వచనం రాజుకు, జనానికి మధ్యవర్తి అయింది. "నన్నయకు పూర్వము రాజకీయాది వ్యావహారిక ప్రయోజనార్థమైనను తెలుగు భాషలో కొంత వచన రచన జరిగింది." (27) శాసనాలు పూర్వం నుంచి అనేకం లభించాయి. దేశ చరిత్ర మారిన కొద్దీ శాసన వాఙ్మయం మారుతూ వచ్చింది. ఏ కాలంలో వచ్చిన శాసనాలు అ కాలం భాషను జత చేసుకొన్నట్లే, ఆ సాంఘిక పరిస్థితులకు దర్పణాలయ్యాయి. శాసనాలు చారిత్రకంగా ఎంత విలువైనవో, భాషా విషయకంగా అంత ప్రాధాన్యం కలిగి వున్నాయి. రాజరాజ నరేంద్రుడి కాలం శాసనాలు, చోళుల, కాకతీయుల, రెడ్డి రాజుల, విజయనగర రాజుల, నాయక రాజుల శాసనాలు భాషా విషయకంగాను, వచన విషయకంగాను అనేక నూత్నాంశ స్ఫోరకాలు అవుతున్నాయి.

ఒక యుగంలో కావ్యభాష ఏ సారస్వత ధర్మం కలిగి వుంటుందో, ఆ ధర్మం, వ్యావహారిక భాషలో శాసన వచనం ఉన్నప్పటికీ, శాసన భాషలో వ్యక్తమవుతునే వుంటుంది. రెడ్డి రాజుల యుగం సాహిత్యంలో వునరుజ్జీవనంగా భావింపబడుతుంది. శ్రీనాథాదులు పల్నాటి వీర చరిత్ర వంటి ప్రజావాఙ్మయ స్రష్టలయి కూడా కావ్య భాషలో ప్రాబంధిక రచన, శాబ్దిక దృష్టి, ఆలంకారిక రీతి, సంస్కృత సమాస భూయిష్ఠ ధోరణి, భాషాడంబరం-ఉత్తమ కవిత్వంతో పాటు ప్రదర్శించటం సహృదయ విదితం. ''ఉత్తమ శాబ్దిక విన్యాసము, అలంకారిక శైలి రెడ్డి రాజుల శాసనములందు పేర్కొనవలసిన విశేషములుగా నున్నవి. శబ్దాలంకారములందు ఈ నాటి శాసన రచయితలకు అంత్యానుప్రాసముపై

చాల యభిమాన మున్నట్లు కన్పించును.'' (28) ఈ యుగంలో శాసన వచన శైలి ఏ విధంగా వున్నప్పటికీ శాసన వచనం ఏ విధంగా వుందో గమనింపవచ్చు. ''రెడ్డి రాజుల శాసనము లందలి వచన భాగమును, దాని యందలి విశేషము లను పరిశీలించినప్పుడు రాజకీయ వ్యవహారమునకు నాటి యధికారులు ఆంధ్ర వచమును నిరాటంకముగా నుపయోగించిరని స్పష్టమగుచున్నది. అధికారక ముగా నిట్లుపయోగింపబడిన వచనము నాటి వ్యావహారిక భాషా శైలిని తెలిపి, ఈ వ్యావహారిక భాషకు కలిగిన పరిణతావస్థను చక్కగా సూచించు చున్నది.'' (29)

రెడ్డి రాజుల యుగంలో వెలువడ్డ శాసనాల భాషలో లోపం విజయనగర యుగ శాసనాలలో సవరింపబడింది. సాధారణంగా శాసన భాష సర్వజన విదితంగా వుంటుంది. అలా లేకపోతే అది తన నిర్దిష్ట ప్రయోజనం సాధించుకో లేకపోతుంది. శాబ్దికమై, అనగాహనమైన శాసనం నిష్ప్రయోజన మవుతుంది. అందువల్ల సర్వజనవేద్యం అయ్యేలాగా విజయనగరం శాసనాలు వెలువడ్డాయి. అయితే ఆ సాహితీ యుగధర్మం శాసనాల మీద లేకపోలేదు.

''గంభీరశైలి,సమాసాఢ్యవాక్యనిర్మాణముతో గూడిన ఉత్కలికా ప్రాయ మనదగిన వచనములు ఈ శాసనములందు స్వల్పములే. ఈ రచనములందు పాండిత్య ప్రదర్శనమునకు అవకాశము లేకపోవుటచేతను సర్వజన వేద్యముగా నుండవలెనను అభిప్రాయమునను, వ్యావహారిక శైలి నవలంబించుటయు నిందుకు కారణములు. ఐనను అచ్చటచ్చట రాజుల బిరుదావళులు పండితుల పాండిత్య ప్రశంసలు మున్నగు వానిని సూచించు వాక్యములు కొన్ని ఉత్కలికా ప్రాయములుగా కన్పించుచున్నవి '' (30)

శాసనాలలో వాక్యనిర్మాణం కాని, శైలి కాని, పద బంధాలు కాని, విషయవివరణం కాని, అభిప్రాయప్రకటనం కాని, అన్యదేశీయాలు స్వేచ్ఛగా వాడటం గాని, గ్రాంథిక వచనంలో లేని సులువును ప్రదర్శిస్తాయి. ఆనాటి గ్రంథ భాషకు, జన వ్యవహారానికి ఉన్న తేడా పట్టి చూపించేట్టుగా ఈ శాసన వచన భాష వుంది. ఈ వచనం ఒక నూత్నత్వ శోభితం అవు తుంది. ఎందువల్లనంటే పాలకుడికి, పాలితుడికి మధ్య సంబంధం ఈ శాసన

వచనం వల్ల తెలుస్తుంది. కనుక, శాసన వచనం ప్రధానంగా రాజుకు సంబంధించిన వివరాలు, అప్రధానంగా ప్రజాళి వివరాలు తెలుపుతుంది. సామాన్య ప్రజాజీవితం ఈ శాసన వచనంవల్ల తెలిసినంత అధికంగా ఆయా కాలాల కావ్యభాషలోని వచనం వల్ల తెలుస్తుందని చెప్పే అవకాశం తక్కువ

## 2. 2 చంపూ కావ్య వచనం

భారత భాగవత రామాయణాది పురాణములు, మను, వసు చరిత్రల వంటి ప్రబంధాలు, తదితర గద్య పద్యాత్మక కావ్యాలు, ఈ చంపూకావ్యాలు. వీటిలో వచనం మిక్కిలి అవసరమయింది. చంపూ కావ్యరచనా విధానం సంస్కృత సాహిత్యం నుంచి సంక్రమించిన విశేషం. కొందరు కన్నడం నుంచి చంపూ కావ్య రచనం తెలుగుకు సంక్రమించినట్లు తలుస్తారు కాని అది వాస్తవమనిపించదు. సంస్కృతంలో చంపూ కావ్యరచనాధోరణి క్రీస్తు శకం కంటె ముందే వుంది. "This type (Cempu) of composition must have come into existence before the beginning of the Christion era." (31) ఈ చంపూ కావ్య వచనం పొందిన పరిణామం ప్రముఖ కవి క్రమంలో స్థూలంగా గమనింపవచ్చు.

### 2.2.1 నన్నయ వచనం

నన్నయభట్టు ఆంధ్రకవితాగంగకు భగీరథుడు. కవితా హృదయం, భాషాబుద్ధి కోమలంగా, నిశితంగా ప్రదర్శించి ఆంధ్ర సరస్వతి కాత్మదానంచేసిన ఆర్ష తేజోమూర్తి నన్నయ. నన్నయ తెనిగించిన ఆంధ్ర మహా భారతంలో ఆది సభా పర్వాలు, అరణ్య పర్వంలో సగం వల్ల ఆంధ్ర వచనం చంపూ కావ్యాలలో ప్రవేశం పొందిన తీరు తెలుసుకోవచ్చు.

''నన్నయ భారతములో నూటికి 46 పంక్తులు వచన రచనలే'' (32) అని భావిస్తుంటే నన్నయ వచనం 35.5% మాత్రమే అని డా. యం. కుల శేఖరరావు అభిప్రాయం. గద్యశాత నిర్ణయంలో డా.యం. కులశేఖరరావు కృషి ఫలితం స్వీకార్యం. ఏమయినా మూడో వంతు కంటె ఎక్కువగా, సగం కంటె తక్కువగా నన్నయ భారతంలో వచనం ఉందని సమన్వయించుకోవచ్చు.

నన్నయ వచనం కవిత్వంలో అక్షర రమ్యతతో ఒప్పింది. శబ్దాలంకార సుందరమయి వచనం సాగింది. నన్నయ అక్షర రమ్యత వచనంలో తదితర కవులకు స్వీకరింప దగిందయింది. అర్థానుసారంగా, అంత్యాను ప్రాసయుతమై, ఆలంకారికంగా, ఔచిత్య మాధుర్యాలతో, ప్రకృతి శాస్త్ర విషయ పరామర్శతో వచనం నన్నయ కాలంలో వెలసింది. అనంతర కాలంలో అనుసరింపబడింది.

నన్నయ వచనంలో "పద్యములు గూర్ప వలను పడని వంశ క్రమాది వృత్తాంతముల జెప్పుట, విరివిగా చెప్పవలసిన కథలను సంగ్రహించుట, ఏక ధారగా నుండి విసువు జనింపజేసెడి పద్య పఠనము నుండి పాఠకుని మరల్చుట, అచ్చటచ్చట రత్నముల వలె లోకోక్తులు పొదిగించుట, ఏక సమాన సముచ్చయాత్మకముగా వాక్య రచన ముండుట, ప్రారంభము పద్య పాఠము వలె నడపించి వృత్త గంధిగా భావింప జేయుట" (33) తెలుసుకొని ఆ పైన వచనం స్వీకరించిన కవులా మార్గంలో రచించారు.

"నన్నయ భట్టు గాని, తిక్కన ఎఱ్ఱనార్యులు గాని వచనమును కథా కథన పద్ధతికి ననుగుణమై గౌణమైన వాహిక (medium) గా స్వీకరించినట్లు ద్యోతిలును......భారత రచనములో నన్నయ యే విధమైన యాఖ్యానాత్మక శైలిం బ్రదర్శించెనో, తిక్కన యెట్టి నాటకీయ శైలిని నడిపించెనో, యెఱ్ఱన యే విధమైన వర్ణనాత్మక శైలిని పుణికి పుచ్చుకొనెనో, యట్టి శైలీ వైవిధ్యమా కవుల వచన రచనము లందును" (34) గోచరమవుతూ వుంది.

వచనం వర్ణనకు, సంభాషణకు, కథాకథనానికి ఉపయోగపడుతుందని గమనించి ప్రయోగించిన కవి నన్నయ. "వచనములో భావ క్లుప్తీకరణశక్తి యున్నట్లు నన్నయ వచనముల వలన తెలియును." (35) నన్నయ తన కవితా రీతి ప్రదర్శించటానికి పద్యమెంత సమర్థంగా భావించాడో అంతగా వచనం తలచాడు కనుక, వచన మంత విస్తృతంగా వ్రాశాడు. తరువాతివాళ్ళు వచనాధిక్యం పూర్తిగా గమనించలేదని భావింప వచ్చు "ప్రథమావతారమైన నన్నయగారి గద్యములందున్న రసభావ వ్యంజకతా ప్రధానలక్షణము క్రమక్రమముగా లోపించినది." (36)

నన్నయ కవితా ధర్మ స్వీకారం చేసినట్లే, వచన ధర్మం కూడా ఆనంతర కవులు స్వీకరించారు. ''భాషా విధాతృత్వము ధ్వన్యాది సర్వకావ్య రహస్యములు కథా కథన శిల్ప పారమ్యము మొదలైనవి సంతరించుకొనుచు పద్యము నందు వలె గద్యము నందు కూడ" (37) సామర్థ్యం ప్రదర్శించిన వాగనుశాసనుడు నన్నయ్య.

''ఒక జాబితా చెప్పవలసిన సందర్భమున'' (38), ''ఇరువురు భాషించు సందర్భమున'' (39), ''ఒక విషయమును ప్రతిపాదించి దానిని సాదృశ్య సహితముగా నిరూపించు సమయము'' (40) న, ''సంక్షిప్తీకరణ సందర్భము" (41)న, వైదిక ధర్మాలు, వర్ణాశ్రమధర్మాలు, రాజనీతులు, లౌకిక ప్రసంగాలు, అనేకేతర విషయాలు వ్రాసే సమయంలో నన్నయ వచనాన్ని ఆదరించినట్లు స్పష్టమవుతుంది.

స్థూలంగా నన్నయ అధికంగా వచనం వ్రాసినట్లు; అక్షర రమ్యతతో, నానార్థరుచిరత్వంతో ఆలంకారికంగా వచనం రూపొందించినట్లు; కథాకథనం, వర్ణనం, సంభాషణం మొదలైన సమయాలలో వచనం వాడినట్లు; సంగ్రహంగా చెప్పటానికి తగిందిగా వ్రాసినట్లు ; రసభావ వ్యంజకతకు, ధ్వనికి వచనం ప్రయోగార్హమైనదని గుర్తించి ప్రయోగించినట్లు కనిపిస్తుంది. ఈ మార్గంలో తదనంతర కవులు వచనం ప్రయోగించారు. కాని, నన్నయ వచనం వాడినంత విరివిగా తరువాతి కవులు వాడలేదు. నన్నయ బహుకాలం నిలిచే పద్యానికే కాదు, గద్యానికి ఆది కవి.

## 2. 2. 2. నన్నెచోడ వచనం

నన్నెచోడుడు నన్నయ ప్రయోగించినంత విరివిగా వచనం చేపట్టలేదు. ''సజాతీయ పదములు చేర్చి కూర్చుటలోను, అనుప్రాసాత్మక వాక్య సంధానము నందును వాక్యరచనా విన్నాణము నందును'' (42) నన్నెచోడుడు నేర్పు చూపించాడు. నన్నెచోడవచనం 'సంస్కృత పద జటిలమై అలంకార సహితమై' (43) ఒప్పింది. పద్యం ప్రయోగింపదగ్గ ఘట్టాలుకొన్ని ఉండగా, గద్యం మాత్రమే వ్రాయదగ్గ సన్నివేశాలు కొన్ని ఉన్నాయి. నన్నెచోడుడు గద్య ప్రయోగాలలో

నూత్న దృష్టి ప్రదర్శించాడు. ''వచనముల నా యా సందర్భములందు ప్రయోగించుట కూడ వృత్తౌచిత్యము వంటిదే'' (44) అని గుర్తించాడు. నన్నె చోడుడు ప్రయోగించిన వచన శాతం 27.1 అయి, నన్నయ వచన శాతం కంటే తగ్గిపోయింది. వచనం పద్యసమంగా భావించిన కవి నన్నెచోడుడు. కథా సంక్షేపానికి వచనం సముచితంగా భావించాడు.

నన్నెచోడుడు వచన రచనపట్ల, చంపూ రీతి రచనలో ఆసక్తి చూపాడు. శివకవులు దేశితత్వం ఆంధ్ర సాహిత్యంలో ప్రవేశపెట్టి, ఆంధ్ర భాషాస్వచ్ఛత వాంఛించారు. వీళ్ళు అనేక గద్యలు రచించినట్లు తెలుస్తుంది కానీ అవి అన్నీ లభ్యాలు కావు. మల్లికార్జున పండితారాధ్యుడు, పాలకురికి సోమనాథుడు మొదలైన శివకవులు ఆంధ్ర వచనం ఆదరించి, దాని స్వచ్ఛశీలాన్ని కాపాడ ప్రయత్నించారు. శివకవులు తమ రచనలు పండిత పామర పఠనయోగ్యం కావాలని తలంచి జానుదెనుగులో వ్రాయటం వల్ల, వచనంలాగా సాగే ఛందస్సు-ద్విపద-స్వీకరించటం వల్ల ప్రత్యేకంగాను, అధికంగాను వచనంలో రచన చేయవలసిన అత్యవసర స్థితి లేకపోయింది. ''శివకవులు పాల్కురికి సోమనాథుని వంటివారు, ప్రజాభ్యుదయ దృష్టి కలవారైనను వచన కావ్యములు వెలయింపలేదు.''(45)

### 2.2.3 తిక్కన వచనం

తిక్కన, జీవితంలోనూ, సాహిత్యంలోనూ సమన్వయ వాది. నన్నయ భారతంలోని పద్య రచన మాత్రమే స్వీకరించి, శివకవుల ద్విపదలోని నిర్వచన స్థితి స్వీకరించి, రెండు విధాల కవితాధర్మ సమన్వయం చేసి, రామాయణం యౌవనంలో నిర్వచనంగా వ్రాసిన సమన్వయ వాది తిక్కన.

జీవితంలో, సాహిత్యంలో మంత్రియై, మహాకవియై, నన్నయ అనువదింపని భారత భాగం అనువదించటానికి పూనుకొని, అంతకు పూర్వం రామాయణం నిర్వచనంగా వ్రాసిన తానే, అప్పుడు వచన వ్యక్తిత్వం దృగ్గోచరమయి, భారతం పదిహేను పర్వాలు వచన సహితంగా రచించి, హరిహరాద్వైతం లాగానే వచన నిర్వచనాద్వైతం సాధించిన మహా మనీషి, సమన్వయ వాది, తిక్కన సోమయాజి.

తిక్కనలాగా కేతన, మారన, అనంతామాత్యుడు తెలుగు పలుకులకు వచనంతో తీయదనం ప్రసాదించారు. నన్నయ వచనం పద్య విధేయ మయి నట్లుకాక, తిక్కన వచనం స్వాతంత్ర్యం పొంది ప్రత్యేకతను పుంజుకొంది. వచనం పట్ల ఇంత ఆదరం భారత రచనా కాలంలో ప్రదర్శించిన తిక్కన, రామాయణ రచన సమయంలో తద్భిన్నదృష్టి వ్యక్తీకరించటానికి నాటి సాంఘిక స్థితి కొంతవరకు, వ్యక్తిత్వం మరికొంతవరకు కారణమయ్యాయి.

జాత్యముగామి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁజొన్ప, వాక్యసాం
గత్యము సేయుచో నయిన గద్యముతోడుగఁజెప్పిపెట్ట, దౌ
ర్గత్యము దోఁపఁ బ్రాసము ప్రకారము వేఁగు నక్షరంబులన్
శ్రుత్యను రూపమంచునిద, సూరుల కివ్విధమింపుఁబెంపదే— 14

ప్రథమాశ్వాసము—నిర్వచనోత్తర రామాయణము.

సూరుల కోసం తిక్కన గద్యం వ్రాయలేదు.

వచనము లేకయు వర్ణన
రచియింపఁగఁగొంత వచ్చుఁ బ్రౌఢులకు;గథా
ప్రచయముఁ బద్యములన పొం
దుచితంబుగ చెప్పుటార్యు లొప్పిదమనరే ! 15

ఆర్యులొప్పిద మనటం కోసం వచనం వ్రాయలేదు. తన ప్రౌఢత్వం ప్రదర్శించు కోవటం కోసం తిక్కన వచనం వ్రాయలేదు. తిక్కన పై రెండు పద్యాలవల్ల వచనం, గద్యం పర్యాయ పదాలుగా భావించినట్లు స్పష్టమవుతుంది. వర్ణన కోసం వచనం అవసరమన్న అభిప్రాయమూ వ్యక్తమయింది.

తిక్కన వచనంలో నాటకీయత గోచర మవుతుంది. "అందుచేతఁ దిక్కన్నయుపజ్ఞగా బయలుదేరిన యీ సర్వాంధ్ర గద్య ప్రపంచము తత్కవి వైయక్తిక వాక్ప్రాత సహజ లక్షణానుగుణముగా ప్రధానముగా నొక గుణమును సంతరించుకొని విరోధాభాసాలంకారాద్యలంకారములను ప్రపంచించుట ప్రతిభాద్యోతకముగా భాసింపఁ జేసికొనుచుఁ తెలుగు పలుకుబడులు స్వభావోక్తులు లోకోక్తులు విలక్షణములైన యాచ్ఛిక శబ్దములు మొదలైన వానిని వెదజల్లుటయే ప్రధాన లక్షణముగా విస్తరిల్లినది." (46) అనంతర కవిలోకం

తిక్కనను అనుసరించి సాధించిన లక్షణాలు తిక్కన వచనంలో గమనించి, వచనం పొందిన అభ్యుదయం గుర్తింపవచ్చు. "ఒక విధముగాఁ జెప్పవలసి వచ్చినచో నాధునికాంధ్ర గద్యము యొక్క ప్రథమ స్వరూపము తిక్కన గారి యందు భాసించి"ంది. (47) "నన్నయ త్రోవను పెకద్రొక్కి తిక్కన వేరొక మార్గమ్ము నవలంబించినాడు. ఆ మార్గము పద్యము నందెట్టిదో గద్యము నందు నట్టిదే." (48) తిక్కనార్యుని గద్యం ప్రౌఢ దశను అందుకొంది.

తిక్కన వచనం రమారమి 28 శాతం. నన్నయ లాగా వర్ణనం, కథా కథనం వచనంలో వ్రాసి, ప్రసంగాలకు, నీతి బోధలకు వచనం అనుకూలమని గుర్తించాడు తిక్కన. ఈ మహామనిషి వచనంలో ప్రాణ శక్తి ఒక్కటే–అది సమాజం నుంచి పుట్టిన వచనం. జనం వాడుకకు దగ్గరగాఉన్న వచనం కావడం వల్ల మిక్కిలి శక్తిమంతమై విలసిల్లింది తిక్కన వచనం.

## 2 .2.4 ఎఱ్ఱన వచనం

ఎఱ్ఱనార్యుడు వచన రచనంలో నన్నయ తిక్కనల మార్గం అవలం బించి, వచన రచన చేసి, తన ప్రత్యేక మార్గం ఏర్పరచుకొని వర్ణనాత్మక వచ నంలో క్రొత్త పథం స్థిరీకరించాడు. "భావప్రస్తారమునకు గాని, భావ వ్యాఖ్యాన మునకు గాని, వచనముపయుక్తమగునని" (49) ఎఱ్ఱన గుర్తించాడు. "చంపూ కావ్యములలో నన్నయ తరువాత, నీశంభుదాసు నంత విశేషముగా వచన రచన గావించిన వారు మరొకరు కనబడరు." (50) ఎఱ్ఱనార్యుని వచనం 30 శాతం వుంది. "శంభుదాసుని వచన మొక క్రొత్తబాట త్రొక్కి సొగసులు మూటగట్టుకొన్నది." (51) అనటం నూత్న విషయ బోధకం గానీ, స్పష్టంగా వుంది కానీ, కాదు. స్తంభోద్భవ వచనం వంటి వచన రచనలు అనేకం నృసింహ పురాణంలో ప్రత్యక్షమయి, వచన భక్తులకు సాహిత్య రసానంద సంధాయకాలవుతాయి "ప్రత్యేక శీర్షికలు కలిగి వర్ణనాత్మకములై వస్త్వైక్య ముతో, సమానాంతర వాక్య విన్యాస వైఖరితో ఆద్యంత మొకే రీతిగా నున్న ఉత్కలికాప్రాయ రచనముతో వర్ణనా ప్రధానములును, అలంకారాన్వితములు నునైయుండి ఆంధ్ర వచన వికాసమున ప్రత్యేక స్థితిని వహించి స్వతంత్రము లైన చిరుకబ్బములుగా పరిగణింపదగియున్నది." (52) "ఈ సమయమున

కెట్టా ప్రెగ్గడ నృసింహ పురాణము నందలి స్తంభోద్భవ వచనమును జూచినచో భేదము తెలియును.'' (53) భాగవతంలోని గంగావతరణ వచనం. ఈ స్తంభో ద్భవ వచనంతో ఎంతో పోలి వుంది. ''ఈ వచన రచనమే తరువాత పోత నార్యునకును ప్రబంధ కవులకును మార్గము చూపినది. చూడుడు: భారతము లోని ప్రసన్నమైన వచన రచనమునకును దీనికిని సంబంధమే లేదు.'' (54) భారత వచనంతో ఎఱ్ఱన వచనం దూరం కావటానికి కారణం స్పష్టత, కథా కథనం, సంభాషణ రీతి కంటే భిన్నంగా, వర్ణనం ప్రధానంగా, ఆలంకారిక దృష్టితో రచన జరగటం. పాత్ర వర్ణనం కూడా వచనంలో సమగ్రంగా ఎఱ్ఱన నిర్వహించాడు.

ఎఱ్ఱన వచనం నన్నయ తిక్కనల మార్గంలో సాగి, ప్రత్యేక పథం ఏర్పరచుకొని, తరువాతి వాళ్ళకు మార్గదర్శక మయింది. ఎఱ్ఱన వచనం కఠి నమై సంస్కృత సమాస జటిలమై నూత్న వ్యక్తిత్వం పొందింది.

## 2.2.5 సోమన వచనం

నాచన సోమనాథుడి కవిత్వంలా వచనమూ అధిక వివాదాత్మకమే. వచ నాభివృద్ధికి సోమన వచనం దోహదం చేసిందని భావించే వాళ్ళూ, ద్రోహం చేసిందని తలపోసే విమర్శకులూ ఉన్నారు. సోమన వచనంలో నాదమాధుర్యం, లయ, ఆనంద హేతువులయినట్లే, వచనం పద్య కావ్యం నిర్వహించే స్థితికి పోయి, బాధాకారక మయింది. నాచన సోమనాథుని వచనం స్వేచ్ఛగా సాగినా, సాగదీసినట్లు కనిపిస్తుంది.

సోమన వచనం కాఠిన్య ప్రవర్శక మయింది. ''ప్రాచీనాంధ్ర కవి కృతులలో దురవబోధములనబడు వానిలో సోమనాథుని కృతి ప్రధాన మయినది. అప్రతీత పద ప్రయోగాభి వచనము చేతను, శయ్యా నైగనిగ్య సంపాదన ప్రీతి చేతను, అనుప్రాస విన్యాసాభి రతి చేతను, నీతడు తన కృతిని పెక్కు పట్టు లందు దురవబోధము గావించెను. అందును వచన రచనములో మఱియు గఱకుఁదనముఁ జూపెను. ఆంధ్ర కవులలోఁ జిత్రకవిత్వమును వెలయించిన వారిలో నీతడే ప్రథముఁడుగాఁ గానవచ్చుచున్నాఁడు.'' (55) దీనికి కారణము

సోమన వచనము శాబ్దికం, ఆలంకారికం కావటమే ! "పూర్వ కవులలో నాచన సోముడు గద్యమును పద్యము కన్న జటిలముగా వ్రాయుటకు త్రోవ చూపెను. వచనము నీతడు కథను నడుపుటకుగాక, కేవల వర్ణనాత్మక సందర్భములలో ప్రయోగించెను. ఇట్టి వర్ణనములలో శ్లేషను సాధించుట, శబ్దాలంకార చిత్రితముగా వ్రాయుట ఈతని పద్ధతి. ఈ విధానముల వలన వచనము యొక్క సారళ్యత ప్రసన్నత లోపించి, పద్యమే గద్యము కన్న మేలు అనిపించును. అనంతర కవులు వచన రచన విషయమై నాచన సోమున ననుకరింప జొచ్చిరి." (56)

నాచన సోమన వచనంలో నవీన గుణ సనాథత్వం గుర్తింప బడింది. "కేవలము పద్య రచన యందే కాక వచన రచనము నందును ఒక పరిణత దశను కలిగించిన యీతని రచనము నవీన గుణములను సంతరించుకొనిన" (57) దన్న మాట విమర్శకులలో కొందరి కిష్టం. వచనం ఆ కాలంలో వ్రాయబడుతున్న తీరులో నాచన సోమన వచనం ఒక దశా ప్రదర్శకం. సోమన వచనంలోని కవితాగుణం అనిష్టమయిన వాళ్ళకి వచనం అసహజంగా తోస్తుంది. వచనంలో లయ, ఆలంకారిక రీతి కోరే వాళ్ళకి వచనం సహజంగా వుంటుంది. ఇతని వచనం అభిరుచి అంతర్యాన్ని బట్టి స్వీకరింపబడుతుంది.

## 2.2.6 పోతన వచనం

పోతన వచనం నన్నయ వచనం లాగా శబ్దాలంకార శోభితం. తిక్కన వచనం లాగా చిన్న వాక్యాల సమాహార రూపం, కథాకథనం, వర్ణనం నాటకీయత స్పష్టమయ్యేది వచనం. కవిత్రయం వచనం ఎలా వాడుకోవచ్చో గుర్తించగా, ఆ గుర్తింప గ్రహించి, పోతన తన భాగవత పురాణ రచనకుపయోగించుకొన్నాడు.

తిక్కన సోమయాజి వచన రచనలో చూపిన ఒడుపులు స్వీకరించి వాటిని మరింత శోభావంతంగా ప్రదర్శించాడు పోతన. భక్తి భావ ప్రేరణకు, భక్తి రచనకు వచనం ఎంతగా అర్హమో గుర్తించాడు. గంగావతరణ వచనం, జలక్రీడాభివర్ణన వచనం పోతన వచన రచనా సామర్థ్యానికి గీటురాళ్ళు. ఫల

శ్రుతి పద్యాలలో వ్రాయటం సంప్రదాయం. కానీ "పోతనగారి గ్రంథము చాల చోటులందు ఫలశ్రుతులు చెప్పినప్పుడు వచనములే" (58) వాడుకొంది. "పోతన్నగారు నృసింహావతార ఘట్టమున వ్యంజకత్వమును తన వచనములో విచిత్రముగా సాధించిరి." (59)

పోతన్న వచనం పద్యంలా మధురంగా వుంటుంది. వచనంలో సారళ్యం, మాధుర్యం చిప్పిలుతూ వుంటాయి. ప్రసన్నత, కోమలత్వం పోతన పద్యంలో గోచరమవుతాయి. ఈ భక్త కవి పద్యానికి, వచనానికీ దూరం—ఎడం తక్కువ. "ఒక విధముగాఁ జెప్పవలసి వచ్చినచో నాధునికాంధ్రము యొక్క ప్రథమ స్వరూపము తిక్కనగారి యందు భాసించి యొక మధుర సంప్రదాయ రచనా సౌష్ఠమును పోతన్నగారియందు నిండించి కొన్నదని యనుకొనవచ్చును." (.60) పోతన వచనాలు "దీర్ఘములే యైనను అలంకార భూయిష్ఠములు. ఈ మహా కవుల గంటము నుండి గద్య రచన బంగారు పంటలు పండినవి. తర్వాత అనే కులీ ఒరవడిలో తమ శైలులను పరవళ్ళు త్రొక్కించి, భాషా యోషామ తల్లికి వెలలేని వచన భూషణములలంకరించి మురిసిపోయిరి." (61) పోతన వచనం, ఆధునికులకు మార్గదర్శకం. వచన ధర్మం, ప్రయోజనం గోచరించేట్టు సృష్టించిన వచన నిర్మాత పోతనామాత్యుడు.

## 2.2. శ్రీనాథ వచనము

శ్రీనాథుడాంధ్ర కవిత్వ సార్వభౌముడై నట్లే వచనశ్రీనాథుడు. శ్రీనాథుడు సంస్కృతాంధ్ర పాండిత్య కవిత్వాల సవ్యసాచి ఈ మహాకవి కవిత్వంలా వచనం సుందరమై, రసబంధురమై రాజిల్లింది. దీర్ఘ సంస్కృత సమాసం చివర కొస మెరుపులాగా అలతి ఆంధ్ర పదం ప్రయోగించి పవిత్ర హృదయాకాశంలో ఇంద్రధనుస్సు సృష్టించే కవితా గంగాధిపతి. వచనంలో సారస్వత జీవనం, జీవన సారస్వతం పారమంట గుర్తించిన రసజ్ఞ శేఖరుడు శ్రీనాథుడు. శ్రీనాథుడిచేతిలో వచన మొక ఒయ్యారం, ఒక నూత్న సౌందర్యం సంతరించుకొంది. సంఘ జీవిత సన్నివేశాలు వచనంలో రసమయంగా వర్ణించి, వచన రచనా విధానంలో నూత్న పరిణామం కలిగించాడు. సామాజిక

వ్యవహారం వచనంలో బాగా వ్రాయవచ్చుననే భావ్యూహకు శ్రీనాథుడి వచనం నాంది.

నీతి బోధలకు, శాస్త్ర చర్చలకు వచనం ఉపాదేయంగా గుర్తించాడు. వర్ణనకు వచనం ఉపయోగమవుతుంది కాని, కుండిన నగర వర్ణనం శృంగార నైషధం వచనంలో మచ్చుతునక. శృంగార నైషధంలో వచనం ప్రాచీనతా స్వతంత్రతా మార్గద్యోతకం. "శ్రీనాథుని రచనము వచన వికాసమున ప్రత్యే కతనే వహించుచున్నది. అందుచే నీతఁడు పద్య రచనముననే కాక వచన రచనమునను సార్వభౌముడనిపించుకొన నర్హుడు." (62)

శ్రీనాథుడి వచనం కావ్య రీతిలో, దీర్ఘ సమాసాలతో, శ్రవః పేయమై అలరారింది. ఈ లక్షణాలు తదనంతర కవులనేకులు అనుసరించారు. "శ్రీనాథుని చేతిలో వచన మొక నూత్న మర్యాదాశ్రయమైనదని సిద్ధాంతము." (63)

శ్రీనాథుడి వచనం ఆలంకారిక, ప్రాబంధిక ధర్మాతిశయంతో భవిష్యత్ ప్రబంధ నిర్మాతలకు, వచన రీతులకు తోవ చూపింది.

## 2.2.8 ప్రబంధ వచనం

ప్రబంధాలలో వచనం ప్రాధాన్యమూ, ప్రాచుర్యమూ క్షీణించాయి. ప్రబంధాలలో వచనం కథా కథనంలో, వర్ణనంలో నాటకీయతలో, ఆలంకారికంగా, శాబ్దికంగా, శ్రవః పేయంగా వుంటే వుండవచ్చుకాని, పద్య వచన నిష్పత్తి పూర్తిగా తగ్గిపోయింది. పూర్వ కవులు వచనంలో సాధింపలేని అంశాలుకానీ, గుర్తింపలేని ధర్మాలుకానీ క్రొత్తగా ప్రబంధ వచనంలో మృగ్యమనే చెప్పవచ్చు. ప్రబంధాలలో వచనం క్రమక్రమంగా తగ్గిపోయి విజయ విలాసం నాటికి మక్కాలి తక్కువ అయింది. చంపూకావ్యాలలో వచనం మూడో వంతు అయినా భారత కాలంలో వుంది. తుది ప్రబంధాల నాటికి నూటికి అయిదు వంతులే. క్రొత్తదనం ఎక్కువగా లేకపోయినా, వచనం పూర్వం కంటే తగ్గిపోయినా, ప్రబంధాలలో ఈషణ్మాత్రంగా గోచరించే వచనాభ్యుదయం గమనార్హం. ప్రబంధంలో వర్ణనలు - అష్టాదశ వర్ణనలు - తప్పని

సరి. వర్ణనకు పూర్వంలా వచనం ఆశ్రయమయింది వర్ణనంలో పెద్దనది పెట్టింది పేరు. ''కథా కథన మందును, కథా సన్నివేశ కల్పన మందును, అంగాంగ రస నిర్వహణ మందును, విషయ విభజన మందును'' (64) పెద్దన వచనంలో చూపిన ఒరవడి తరువాతి కవులకు అనుసరణీయమయింది.

ఈ కాలంలో వచనం పొందిన ఒక మేలి గుణముంది. కథా కల్పనకు వచనం వాడుకోవచ్చునన్న విషయం రూఢమయింది. ఈషణ్మాత్రంగా మూలంలో ఉన్న ప్రబంధ కథ విస్తృతంగా పెంచి, నూత్న కల్పనలు చేసి వ్రాసేటప్పుడు, కల్పనలలో వచనం ఉపయుక్తమయింది.

'ఆముక్తమాల్యద'లో వచనం తత్త్వ విషయబోధ కుపయుక్తమయింది. పాండురంగ మాహాత్మ్యంలో నిగమశర్మ అక్క పుట్టింటికి వచ్చినప్పటికి వున్న గృహస్థితి వర్ణించిన వచనం సంఘజీవిత వర్ణనకు సమర్థంగా గోచరించింది. శ్రీ కాళహస్తి మాహాత్మ్యంలో తిన్నడి వర్ణనం వల్ల పాత్ర వర్ణనకు, వేట వర్ణనం వల్ల చలత్ సన్నివేశ వర్ణనకు వచనం స్వీకరింపబడటం గుర్తింప వచ్చు. కళాపూర్ణోదయంలో సరస్వతీ చతుర్ముఖుల విలాస వివరణంలో, వచనం క్లిష్ట విషయ ప్రదర్శనంలో పనికి వస్తుందనిపించింది. రామాభ్యుదయ, వసుచరిత్ర, రాఘవ పాండవీయ, పారిజాతాపహరణ ప్రబంధాల వచనం ప్రాచీన కవి తల్లజుల మార్గానుయాయి.

విక్రమార్క చరిత్రంలో అంబికాలయం, మనుచరిత్రలో మృగయా వినోదం, ఆముక్త మాల్యదలో మాలదాసరి, పారిజాతాపహరణంలో పసిడి కొండ, శ్రీ కాళహస్తి మాహాత్మ్యంలో స్వర్ణముఖి, పాండురంగ మాహాత్మ్యంలో పాలకడలి, వసుచరిత్రలో చంద్రిక, కళాపూర్ణోదయంలో ద్వారక, ప్రభావతీ ప్రద్యుమ్నంలో ప్రభాతం, కవికర్ణ రసాయనంలో శ్రీ మహావిష్ణు మందిరం, విజయ విలాసంలో అర్జునుడి తీర్థయాత్ర, ఉత్తర రామాయణంలో సీతా భూప్రవేశం - వచనంలో చేయబడ్డ చక్కని వర్ణనలకు నిదర్శనాలు.

అధిక నూత్నతా బోధక వచనం లేక, అధికంగా వచనం వ్రాయబడక, పూర్వ కవుల ధోరణిలో సాగిన వచనంతో ప్రబంధాలు నిండివున్నాయి. వచన

వాఙ్మయ పరిణామ దశలో, చంపూ కావ్యాలలో ప్రబంధాలు అవాంతరాలు కావటం వల్ల పూర్తి గద్య గ్రంథాలు ఆవిర్భవించే అవకాశం ఈ ప్రబంధ క్షీణ వచనం వల్ల కలిగింది. ఈ విధంగా ప్రబంధాలు వచన వాఙ్మయ దోహదం కావించాయి.

## 2.3. 'వచనములు' వచనం.

'వచనములు' పద్య గద్య సమ్మేళనంగా సాగిన ప్రక్రియ. 'వచనములు పదమూడవ శతాబ్దినుండి (65) వ్రాయబడినట్లు చెప్పవచ్చు. వచన రూపం, కవితాగుణం, గీతిమాధుర్యం, మకుటం వున్న భక్త్యాత్మక రచనం 'వచనములు'. చంపూ కావ్యాలు శాబ్దికాలై, సామాన్య మానవుడికి దూరమయి నప్పుడు, దేశీతీరు సాహిత్య రీతి గుర్తెరిగినవాళ్ళు పాటలక్షణం, కవిత్వధర్మం కలిపి స్పష్టతతో వ్రాసిన వచనరచనలే 'వచనములు'. ఈ వచనముల ప్రక్రియలో ప్రధానంగా భక్తి వైష్ణవమత సంబంధి, శైవమత సంబంధి అయివుంది. జీవుడు భగవానుడితో హృదయార్తి తెలుపుకొనేటట్లు ఆత్మాశ్రయంగా సాగిన రచన యిది.

శతక వాఙ్మయములోని కథారాహిత్యం 'వచనములు' ప్రక్రియలో ప్రధానగుణంగా భావింపవచ్చు. ఛందస్సులేని రచనమే అయినా, కవితా గుణాలు అధికంగా కలిగి లయతో ఒప్పుతూ సాగుతూ వుంటుంది. ఈ వచన ములలో కొన్ని భగవంతుడి సన్నిధిలో పాడటం కోసమే ఉద్దేశింపబడ్డాయి. శ్రీ వేంకటేశ్వర వచనములు ప్రతిదినం వేంకటేశ్వరస్వామి సన్నిధిలో పాటగా పాడటానికి ప్రాచీనకాలంనుంచీ సాగుతూ వచ్చిన ఏర్పాటు దీనికి నిదర్శనం. వచనాంతర్గతంగా జీవుడి వేదనతోపాటు కవి ఆత్మమాత్రమే కాక, జీవితచరిత్రం సహితం అంతర్వాహినియై, బాహిరమైకూడ ప్రవహించటం గమనింపవచ్చు.

వచనముల రచనం ఆలంకారికమై వుంది. శబ్దార్థాలంకార సహితమై వచనములు రచింపబడ్డాయి. ప్రతి వచనం ప్రారంభంలో ఏ దేవ సంబంధిగా రచనముందో, ఆ దేవుడి నామావళిలో ఏదైనా పేరు సంబోధనంగా వుంటూ,

వచనం చివరలో మకుటం వుండటం సంప్రదాయం. శ్రీ వేంకటేశ్వర వచనముల చివర శ్రీ వెంకటేశ్వరా అనీ, సింహగిరి వచనముల చివర సింహగిరి నరసింహా అనీ వున్నాయి.

ఈ వచనముల రచనంలో భగవంతుడి అనంతత్వపు అర్థంకానితనం గోచరిస్తుంది. విశ్వకవి రవీంద్రనాథ టాగూరు గీతాంజలి, బైబిల్‌లోని కీర్తనలు 'వచనములు' చదివేవాళ్ళకు గుర్తుకు రావచ్చు. వచనములు–గీతాంజలి కీర్తనలు భగవన్నామ సంకీర్తనలై, భక్తిపారవశ్య ప్రదర్శకాలై, అనూహ్య భగవంతుడి తత్త్వాన్వేషణ దృష్టి కలవై, హృదయాన్ని ఆర్ద్రీభూతం కావించే సుగుణ శోభితాలై వున్నాయి.

వచనములు, విన్నపములు, సంకీర్తనములు అలతి మార్పులు వున్నవైనా స్థూలంగా ఏకార్థబోధకాలు. వచనములకే 'విన్నపములు' అనే పేరుంది. శ్రీ వెంకటేశ్వర వచనములు, శ్రీ వెంకటేశ్వర విన్నపములు అని తుల్య వచనములున్న భిన్న తాళపత్ర గ్రంథాల పేర్లు తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీలో ఉన్నాయి. సింహగిరి వచనములకు తంజావూరు తాళపత్రప్రతిలో 'విష్ణునామ సంకీర్తన ఫలము' అనే నామాంతరం ఉంది. అందువల్ల స్థూలంగా వచనములు, విన్నపములు సంకీర్తనములు ఒకే ప్రక్రియకున్న భిన్న నామాలు.

వచనములు "భక్తులు వ్రాసినవి. శివుడో విష్ణువో మరొక దైవమో ఆ దేవుని గురించి పౌరాణికకథలు, ఆయన పరాక్రమము, ఆయన దయ మొదలైనవి రక్షించుచు భక్తుని హృదయావేదనముతో కలిపి వ్రాయబడినవి" (66) ఈ వచనముల భాష ప్రముఖంగా గ్రాంథికం. వ్యావహారిక రూపాలు అక్కడక్కడా వున్నా అవి ఉద్దిష్టాలు కావు.

## 2.3.1 సింహగిరి వచనములు.

కృష్ణమాచార్య కర్తృకమైన దీనికి 'విష్ణునామ సంకీర్తన ఫలము' అనే నామాంతరం తంజావూరు తాళపత్ర ప్రతివల్ల లభ్యమవుతున్నది. ఇది డా॥ యం. కులశేఖరరావు సంపాదించి పరిష్కరించగా ముద్రితమయింది. రచనాకాలం క్రీ.శ. 1296-1323 మధ్యకాలం. దీని రచనాకాలం 13 వ శతాబ్ది అని 'ఆంధ్ర వచన వాఙ్మయము'లో శ్రీ నిడదవోలు వేంకటరావు తెలపటం గుర్తింపవచ్చు.

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము ఈ సింహగిరివచనములు 'ఎమోషనల్ ప్రోజ్ లిరిక్స్'గా భావించటం గమనార్హం. ఆచార్య దివాకర్ల వేంకటావధాని "శ్రీ కృష్ణమాచార్యుల సింహగిరి వచనములు తెలుఁగు సంధలి వచనైక రచనలో మొదటివి. ఈ వచనములకు సంకీర్తములనియు, పదములనియు, తాళగంధి చూర్ణకము లనియు పేర్లు గలవు" అని తెలపటంవల్ల కృష్ణమాచార్యుడు ప్రథమ సంకీర్తనాచార్యుడనీ, ప్రథమ వచనైక రచన కర్త అని తెలుస్తుంది. సంకీర్తన లక్షణం తెలుపుతూ దీనిని చూర్ణమనీ, తాళగంధి అనీ తాళ్ళపాక అన్నమాచార్యుడు పేర్కొన్నాడు.

ధర కృష్ణాచార్యాదిక
పరికల్పిత పదము తాళబంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యన్
బరగునది నిరుక్తనామ భాసిత మగుచున్

మఱియు తచ్చూర్ణ విధం బెట్టిదనిన

ఛందో గుణములనియతిం
బొందక తాళ ప్రమాణమునఁ గడుఁ జెలువై
కొందఱిచేఁ దచ్చూర్ణం
బందముగా తాళగంధి యనఁబొగడొందున్.

'ప్రతాప చరిత్ర' అనే వచన చారిత్రక గ్రంథం ఆధారంగా కృష్ణమాచార్య కాలం నిర్ణయింపబడుతూవుంది. క్రీ.శ. 1265-70 మధ్యకాలంలో జన్మించి క్రీ.శ. 1350 ప్రాంతంలో గతించి ఉండవచ్చునని ఊహింపబడింది.

ఇందులో వైష్ణవ సిద్ధాంతం, పురాణ వేదాంతం, నీతి విషయాలు ఉన్నాయి. ప్రతి వచనంలో ప్రారంభం 'దేవా' అని వుంది. కొందరీతణ్ణి అన్య రాష్ట్రీయుడుగా భావించారు కాని, ఆంధ్రదేశవాసి! సింహగిరి వచనములు తదనంతర వచనములకు ప్రక్రియాదృష్టితో అనుసరణీయంగా ఉన్నాయి

## 2.3.2 శ్రీ వేంకటేశ్వర వచనములు.

ఈ వచనకర్త తాళ్ళపాక పెద తిరుమలయ్య (1468-1553) అని పిలవబడే పెద తిరుమలాచార్యుడు. శ్రీ వేంకటేశ్వర వచనములకు 'వేంకటేశ విన్నపాలు' అని నామాంతరం ఉన్నట్లు తంజావూరు సరస్వతీమహల్ గ్రంథా

లయ తాళపత్ర ప్రతివల్ల తెలుస్తుంది. దీనికి సంపాదకత్వం వహించి పరిశోధించి ప్రకటించింది వేటూరి ప్రభాకరశాస్త్రి. ముద్రితగ్రంథానికీ, తంజావూరు ప్రతికీ వచనాలలో, వాక్యాలలో మార్పులు కనబడుతున్నాయి.

కనుగొన సాదరహితమై
పనుపడి హరిగద్దెపోలె బహుముఖరచనం
బున మెఱయు గద్యమది దాఁ
దెనుఁగు కృతుల వచన మనగ దీపించుఁగడున్

"హరి గద్దె యన ఆదిశేషుడు. అతనికి సహస్ర ముఖములు గలవు." (67) అనేక విధాల జరిగే రచనం గుర్తించటమే ఇందులో ప్రధానం. లక్షణ శిరోమణిలో పొత్తపి వేంకటరమణ కవి పేర్కొన్న విన్నపములే అనంతుడు చెప్పిన గద్యములు వీటినే తాళ్ళపాక కుటుంబంవాళ్ళు 'వచన గీతము' లనీ, తాళగంధి చూర్ణకము' లనీ పేర్కొన్నారు.

ముద్రిత వచనములకంటే అముద్రితాలు అధికంగా వుండవచ్చు. తిరుపతి, తంజావూరు ప్రతులలో తంజావూరు ప్రతిలో అధిక వచనాలున్నాయి. ముద్రిత గ్రంథానికి ఆధారం తిరుపతి ప్రతి.

'సింహగిరి వచనములు'లో లాగా కాక, శ్రీ వేంకటేశ్వర వచనంలో వచనాంత మకుటం మారక శ్రీ వేంకటేశ్వరా అనే వుండి, ప్రారంభ సంబోధనం మాత్రమే ఒక్కరకంగా వుండక భిన్నంగా వుంది. అనేక సంబోధనలతో వచనములు ప్రారంభమయ్యాయి. దాదాపు ప్రతి వచనం ఒక ప్రత్యేక సంబోధనం కలిగివుంది. దేవా, చక్రపాణీ, స్వామీ అన్న సంబోధనలు పునః పునః దర్శనమిస్తాయి. కొన్ని వచనములలోని సంబోధనలు ముక్తపదగ్రస్తంగా వున్నాయి. "యదుకుల తిలకా ముచుకుంద ప్రసన్నా" (120) "ముంచుకుంద ప్రసన్నా మచ్ఛావతారా" (121) "మత్స్యావతార భీమ విక్రమ" (122) "భీమ విక్రమ హాలాయుధ" (123) (తంజావూరు ప్రతి) అని సంబోధనలలో ముక్తపదగ్రస్త రచనముంది. ఇది ముద్రితప్రతిలో లోపించింది. ఈ విధమయిన రచనంవల్ల ఏ వచనం స్థానం ఎక్కడో, ఏ వచనం తర్వాత ఏదో తెలుస్తుంది. అయితే యిది సర్వత్ర సంపూర్ణంగా పాటింపబడలేదు. ఒక వచనంలోని

విషయం ఇంకో వచనంలో, ఒక వచనంలోని వాక్యం మరో వచనంలో కనబడు తున్నాయి. దీనికి కారణం భిన్నసమయాలలో ఇది వ్రాయబడడం కావచ్చు.

తంజావూరు ప్రతిలో సంబోధనం ఏకవచనంలోనూ, బహువచనం లోనూ వుంది. ముద్రితప్రతిలో ఏకవచనంగా, 'నీవు' 'నీ' అనే కనిపిస్తుంది. తాళపత్ర గ్రంథాలలో వుండే లోపాలు సవరించటంతోపాటు ముద్రితప్రతిలో తాళపత్ర గ్రంథంలోని కొన్ని వాక్యాలుకూడా సవరింపబడ్డాయి. ముద్రితప్రతి లోని 27 వ వచనానికి తాళపత్రప్రతిలో 7 వ వచనం తుల్యంగా వుంది. "ఒండొంటిఁ ద్వేషించుగాని నీ మీఁద భక్తి బోధింపవు" (ముద్రితప్రతి). "వొక్కొక్క మతంబ్బు వేరొక్క మతంబ్బున ఖండించుకొని నీ మీద భక్తి బొందింప నేరవు" (అముద్రితప్రతి). "తొల్లి నే నుత్తమ గుణంబు లెఱుంగను" (ముద్రితప్రతి-26 వ వచనం). "తొల్లి నే నుత్తమ ధర్మాంబ్బు లెరుంగుదునా" (అముద్రితప్రతి-6 వ వచనం). "నామీఁదం గృప పెట్టి పెద్దలు నన్నచార వంతుం డందురని నభిమానంబు రేఁచి నన్ను సాత్త్వికుంగాఁ జేసితివి." (ముద్రితప్రతి 26వ వచనం) "నా మీద కృపబెట్టి బెద్దలు నన్ను నాచార వంత్తుండన వలయునని యెయి బహుమానంబునకే సాత్వికునిగా జేసితివి." (అముద్రితప్రతి-6 వ వచనం).

సమర్థంగా నిర్వహించబడ్డ సంపాదకత్వం కలిగి కొన్ని వచనములు మాత్రమే ముద్రింపబడి, మరికొన్ని వెలుతురు చూడవలసివున్న శ్రీ వేంకటేశ్వర వచనములున్నాయి. అవి భక్తుల కానందం కలిగించేవిగా, వచన సహర్గం తెలిపే విగా వున్నాయి.

## 2.3.3 భవానీ మనోహర వచనములు.

దీనికి శంకర వచనములు అని నామాంతరం వుంది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ ప్రచురించిన ఆంధ్ర గద్య చంద్రికలో రెండు 'వచనము' లున్నాయి. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో D. No. 1432 సంఖ్య వున్న తాళపత్ర గ్రంథం ఒకటి వుంది. 98 పుటల గ్రంథం. 65 వచనములున్నాయి భవానీమనోహర అనే మకుటంతో ముగిసే ఈ వచనములు శివస్తోత్రాత్మకాలు. కర్త పేరు లేదు. భవానీశ శతకం అని దీని మొదట వ్రాయ

బడి వుండటంవల్ల 100 వచనము లుండవచ్చునని భావింపబడుతున్నది. శ్రీకంఠా, నిరంతర పూర్ణానంద అని ముద్రిత వచనముల సంబోధన లున్నాయి.

## 2.3.4 కాశికా వచనములు

దీనికి కాశికాధీశ్వర వచనములు, శివయోగి వచనములు అని రెండు భిన్ననామా లున్నాయి. ఒక వచనము శ్రీ గురుదేవా అనే సంబోధనంతో, శ్రీ కాశికాధీశ్వర అనే మకుటంతో ఆంధ్ర గద్య చంద్రికలో ముద్రిత మయివుంది.

## 2.3.5. సభాపతి వచనములు

దీనిలో రాయవాచకం ఉదాహరింపబడింది. కనుక ఇది క్రీ.శ. 1550 తరువాత వ్రాయబడిందిగా భావింపబడింది.

## 2.3.6. ఇతర వచనములు

1. గంగాధరయ్య వచనములు. 2. లక్ష్మీ వల్లభ వచనములు. 3. కాల జ్ఞాన వచనములు. 4. శఠగోప విన్నపములు. 5. శేషగిరినాథ విన్నపములు (శేషగిరినాథ వచములు అని నామాంతరం) 6. ఉత్తరగోపుర వచనము. 7. ఏగంటివారి వచనము. 8. తోటవారి వచనము. 9. గొడుగుల వచనము. 10. బ్రహ్మాండ వచనము. 11. రావణ వచనము. 12. లక్ష్మయ్యగారి వచనాలు. 13. వనవిహారవచనము. 14. 34 విన్నపములు. 15. లింగైక్య వచనము. 16. చిలుకపాటివారి వచనము. 17. యతిరాజశేఖర వచనములు-ఉన్నట్లుగా గ్రంథాలయ పుస్తక వివరణ గ్రంథాలవల్ల తెలుస్తున్నది కానీ అవి అలభ్యాలు.

ఈ వచన సంప్రదాయంలో దైవభక్తి ప్రధానం. అప్రధానంగా వ్యక్తులు తమ సాంఘికానుభవాలు తెలపటం గోచరం అవుతుంది. 'వచనములు' రచించే ఆచారం ప్రాచీనకాలంలో పుట్టి మూడొందలేళ్ళ పూర్వమే ఆగిపోయిందని భావించే అవకాశం వుంది. 13 వ శతాబ్ది చివరినుండి 18 వ శతాబ్ది ఆరంభం వరకు ఈ రచనలు జరిగినట్లు తలపోయవచ్చు. ఆ తర్వాత క్షీణించిపోయిం దీ రచనా పద్ధతి.

వచనముల భాష ముద్రితంగా గ్రాంథికం. అముద్రితంగా గ్రాంథికభాషకు దగ్గరగా నున్న భాష అని చెప్పవచ్చు. ఇవి కన్నడ సంప్రదాయ ఫలితంగా భావింపబడుతున్నాయి. ఈ వచనముల భాష భక్తి భావ ప్రకటనకు ఉపయోగ పడింది. వచనంలో భక్తసంబోధనావకాశం గోచరమయింది. గీతి మాధుర్యం ఛందస్సహిత పద్యాలకే వుండే అవకాశం ఎక్కువ. తక్కువగానయినా గద్యా నికీ గీతిమాధుర్యం ఉంటుందనీ, పాటగా పాడవచ్చుననీ ఈ 'వచనముల' వచనం వల్ల అవగతమయింది. స్థూలంగా భక్తుడి ఆత్మావేదన భగవంతుడితో సంభావిస్తున్నట్లు చెప్పకొనే అవకాశం కలగటంవల్ల, వచనం పద్యంలా పాడే విధంగా రచింపబడటంవల్ల, వచనముల వచనం సామాజిక ప్రయోజనం కొంతలో కొంత సాధించగలిగిందయింది

## 2·4. వచన గ్రంథాలు

ఆంధ్రదేశంలో ఆంగ్లవిద్య ప్రారంభం కాకముందు తెలుగులో వెలువడిన వచన గ్రంథాలు ప్రధానంగా, భాషాదృష్టితో, రెండు విధాలు- గ్రాంథిక భాషా రచనలు, వ్యావహారిక భాషారచనలు. ఈ వచన గ్రంథాలలో వచనం పొందిన రచనౌన్నత్యం పరికింపవచ్చు.

తెలుగు వచనచరిత్రలో వచన గ్రంథాలకు చాలా ప్రాధాన్యం వుంది. ఇంతకుముందు పరిశీలింపబడ్డ వచనం, పూర్తిగా ఏ విషయం తనంతతానే పద్య సహాయం లేకుండా వ్యక్తీకరించేదిగా కానీ, భక్తితప్ప మరేవిషయమూ ప్రకటించే స్థితి ఉందిగా కానీ, శాసనావసరం అతిక్రమించి రచింపబడిందిగా కానీ లేదు. అందువల్ల పద్యసహాయం లేకుండా పూర్తిగా విషయమంతా స్పష్టంచేసే సామ ర్థ్యంతో విలసిల్లే రచనం వచన గ్రంథస్థంగా వుంది. అల్ప విషయాన్ని ప్రకటించే ఈషణ్మాత్రి రచనంగా కాక, వచన గ్రంథ వచనం ఒక సమగ్ర విషయం వీలైనంతలో, సంపూర్ణంగా వ్రాయటానికి అనుగుణంగా పెరిగిన దశా ప్రదర్శ కంగా వుంది. కాబట్టి ఈ వచన గ్రంథాల వచనం వచన పరిణామంలో ఒక ఉన్నత స్థితి.

ఈ వచనంలో గ్రాంథికంగా ఉన్న రచనలలో కొన్నింటికి పద్యమూలా లున్నాయి. అవి పద్యభాషను ఛందస్సు తొలగించి వ్రాస్తే ఏర్పడ్డ వచనంగా వున్నాయి. చరిత్ర రచనల గ్రాంథికభాష ఆ ప్రయోజనం కోసం ప్రత్యేకంగా

నిర్మితమయింది. ఈ సందర్భంలో వచనం ఒక నూత్న పరిణామ ప్రదర్శక మయింది. కల్పితకథలు వ్రాసేటప్పుడు వ్యావహారికంగా భాష వ్రాసేటప్పుడు వెలువడ్డ వచనం సమాజానికి-అల్పంగా అయితే ఏం-ప్రతిబింబమయింది. వచనం సాంఘిక ప్రయోజనం సాధించిన దశ కలిగివుంది.

19 వ శతాబ్దికి పూర్వం మత, పురాణ సంబంధి గ్రంథాలలో వచనం గ్రాంథికం. చరిత్ర, మాహాత్మ్య, కల్పిత కథా సంబంధి గ్రంథాల వచనం వ్యావహారికం. కల్పిత కథల వచనమూ వ్యావహారికం అని స్థూలంగా భావింపవచ్చు. ఈ వచనాభ్యుదయం పరిశీలనార్హం.

## 2.4.1. మత సంబంధి గ్రంథ వచనం

ఈ వాఙ్మయం సాధారణంగా తత్త్వ దర్శన ప్రయత్నంగా వుంది. ఈ వచనం చంపూ కావ్య వచనంలా జటిలమై వుంది. వేదాంత వ్యవహార సార సంగ్రహము (దత్తాత్రేయ యోగి), ప్రభుదేవర వాక్యము (1560), వివేక సింధువు, వేదాంత వార్తికము (పరమానంద తీర్థ యతి), వివేక చింతామణి, సకల రహస్య సర్వార్థ సార సంగ్రహము-ఈ కోవ రచనలు. ఇవన్నీ తత్త్వ వివరణాత్మకంగా వున్నాయి. ఈ వచన స్వరూపం ఈ క్రింది ఉదాహరణంవల్ల గ్రహించే వీలుంది.

''సదాచార నియతాచార గణాచారంబు లనుచు ఆచార లింగంబు త్రివిధంబు. వారి వారి యందు ఏదైనా నే యొక తన సన్మార్గంబుచే సకల ధరణులకు సంతోషంబు సేయుట సదాచారం బనంబడు. భక్తిచే తా బట్టిన యాచారంబు ప్రాణాంతంబుగా నడపుట నియతాచారం బనంబడు. శివ మహేశ్వర నిందకుల శిక్షించెదననుట గణాచారం బనంబడు.''(పుట 103 వివేక చింతామణి 16 వ శతాబ్ది రచన. వ్యావహారిక భాష అల్పంగా గోచరమవుతున్నది. శైలి ప్రౌఢంగా వుంది.)

## 2.4.2. పురాణ సంబంధి గ్రంథ వచనం

పురాణాలలో భారత రామాయణాల కథలతో వ్రాయబడినన్ని వచన రచనలు భాగవత కథలతో వ్రాయబడలేదు. ఈ రచనలన్నీ గ్రాంథిక భాషలో వున్నాయి. ''వచన పురాణ కర్త లెవ్వరును వ్యావహారికమయిన స్వీకరించినట్లు

లేదు. కాని వారి రచన యంతయు పట్టి కథను చెప్పికొని పోవుటలోననే యుండును. నిరలంకారముగానుండును. వర్ణనలుండవు. ధర్మములు బోధించుట ప్రధాన లక్షణముగాఁ గానిపించును. సంస్కృత శబ్దములు మిక్కిలిగా వాడబడు చుండును. ఒక కావ్యలక్షణమును పెంపొందింప వలయునన్న యత్నమే లేక కథను సులభముగా నొక యుదాత్తమైన శబ్దజాలము నుపయోగించి రచించుకొని పోవుటయే ఈ పురాణముల పద్ధతి.'' (68)

'భారత సావిత్రి' పారాయణ గద్యం. ''వచనపురాణముల శైలి పరమావధిపొంది యొక దివ్యమైన స్థితిని చేరినదని చెప్పుటకు భారత సావిత్రి మచ్చుముక్క." (69) ఇది సంస్కృతానువాదమని చెబుతారు. ఎవ రీ అనువాదకర్తలో తెలియదు. కావ్యగౌరవం పొందిన గద్య లీ గ్రంథంలో వున్నాయి. ప్రత్యుదయం పారాయణం చేయబడే రచనమిది. ''తెలుగుభాషలోని పలుకుబడి గడుసుతనములు ప్రౌఢమార్గమున భారత సావిత్రియందుఁ బెక్కులు గలవు. తీవిగా మాట్లాడుట యెట్లో యదార్థముగా మాట్లాడుట యెట్లో జరిగిన పెద్ద కథను చెప్పదలచుకొన్న ప్రయోజనము నుద్దేశించి యే భాగము విస్తరించి చెప్పవలయునో యే భాగము కుదింపవలయునో యా రీతిగా తూచి చెప్పిన గద్యమీ భారత సావిత్రి.'' (70) ప్రబంధ కాలానంతరంలో వచన మహాశిఖరంగా భారత సావిత్రి గోచరిస్తుంది. ''భారత సావిత్రి యను పేరంబరగిన వచనమును (1550) ఇప్పటికిని గొందరు స్త్రీలు వల్లించుచుందురు. వేదాంత వ్యవహార సారమును దెలుపు వచన రచనములు పదునారవ శతాబ్దినాటివి గలవు.'' (71) దీని రచనాకాలం ప్రాచీనమయినా, పేరు ఆధునికంగా వుంది. ఇటువంటి పేరు 16 వ శతాబ్దిలో ఉండటం అరుదు.

పారాయణ గద్యాలతో 'ఉత్తరగోపురం' వ్యావహారిక భాషతో, కథాకథన ప్రధానమయి, శాబ్దికమై, సాంప్రదాయికమై, సంఘధర్మ ప్రరోచకమై వుంది. భారతంలో ఆది సభా భీష్మ అనుశాసనిక పర్వాలు వచనంలో తుపాకుల అనంత భూపాల కృతాలు, కషవె వీరరాజు భారత వచనం, నారాయణ కృత శాంతి పర్వ వచనం, జైమిని భారత వచనం ఉపలభ్యాలు. వీటి వచనం గ్రాంథికమై ప్రాబంధికంగా వుంది.

భారతంలాగా వచనంలో రామాయణమూ వ్రాయబడింది. శ్యామరాయ కృత రామాయణం, వచన విచిత్ర రామాయణం, ఉత్తర రామాయణ సంగ్రహం,

తుపాకుల అనంత భూపాలుడి సుందరకాండం ప్రౌఢ గ్రాంథిక రచనంతో ప్రకాశించాయి.

పురాణ సంబంధి కథలతో అనేక వచన రచన లున్నాయి. విష్ణుపురాణం, బ్రహ్మోత్తర ఖండం, మార్కండేయ కథ, భాగవతసారం (పుష్పగిరి తిమ్మన), నారద గర్వభంగం, బ్రహ్మాండ వచనం వంటి పురాణ సంబంధి వచన రచనలు గ్రాంథికంగా వున్నాయి.

ఈ పురాణ వచనంలో ప్రధానంగా భారత సావిత్రి వచనం రచనా రీతికి, సంఘ స్థితి ప్రదర్శనకు అనుకూలంగా వుంది. గ్రాంధిక వచన సంప్రదాయం అనంతర కాలంలో అధికంగా ఆదరింపబడి రచింపబడటానికి పూర్వ రచనలుగా ఇవి ప్రముఖ స్థానం వహిస్తున్నాయి.

## 2.4.3 చరిత్ర సంబంధి గ్రంథ వచనం

మత, పురాణ గ్రంథాల వచనం సాధించిన ప్రయోజనం కంటే చరిత్ర సంబంధి గ్రంథ వచనం పొందిన ఔన్నత్యం ఉత్కృష్టమయింది. పద్య మూలమైన రచనలు వచనంగా వ్రాయటంలో, ప్రసిద్ధమైన కథాకావ్యాలు గద్యం చేయటంలో ఉన్న సౌలభ్యం చరిత్ర గ్రంథం వచనంలో వ్రాయటంలో లేదు. చరిత్ర దృష్టి, తత్పథకం, తద్రచనా సామగ్రి, రచనా నిష్ఠ, రచన సమస్తం, సామాన్య దృష్టితో, వచనానికి క్రొత్త కోణాలు, క్రొత్త పంథాలు కలిగించా యనటం సత్యం. వచనం చరిత్ర రచనకు అవసరమైన క్రొత్త తేజం పుంజు కొని, ఒళ్లు విదిలించుకొని స్వేచ్ఛగా, పూర్వం కంటే ఉన్నతంగా నిలిచింది. పూర్వం వచన మెప్పుడూ పొందని అత్యున్నతమయిన దశను చేరుకొంది. సంఘావసరం తీర్చటానికి ఉపయోగపడింది వచనం. 16వ శతాబ్దిలో ఇంత ప్రయోజన దృష్టి ప్రదర్శించిన వచనం, ఇంతకాలంలో ఎంతో ఔన్నత్యం పొంది వుండవలసింది. అలా జరక్కపోవటం వచనాభ్యుదయ దృష్టితో బాధా కరంగా వుంటుంది. చరిత్ర గ్రంథ వచనం వ్యావహారిక భాషలో వుంది.

ప్రతాప చరిత్ర ఏకామ్రనాథ విరచితం. ఇది కాకతీయ రాజుల చరిత్ర అప్రధానంగా, ప్రతాపరుద్ర చరిత్ర ప్రధానంగా ఉన్న గ్రంథం వంశవృక్షాను సారంగా రాజ్యపాలన విషయం వివరిస్తూ సాగిన రచన. కథాకథనంలా చెప్ప

బడిన చరిత్ర గ్రంథం. ఈ గ్రంథం ఆధారంగా కాసె సర్వప్ప సిద్ధేశ్వర చరిత్రం వ్రాశాడు. "Hence we will be justified in placing pratapa charitra in the first half of the 16th century about 1550 A. D." (72).

"ఏకామ్రనాధుని ప్రతాప చరిత్ర యను గ్రంథము, కాకతీయ రాజుల వృత్తాంతము దెలుపు తొలి వచన కృతి తొలి చారిత్రక కృతి" (73). ఏకశిలా నగర దుర్గంలో ఉన్న నానా వర్ణాల వాళ్ళ వివరాలు తెలిపే వచన భాగం వ్రాసే తీరూ, అవకాశమూ ప్రతాప చరిత్ర వల్లే కలిగాయి.

సిద్ధేశ్వర చరిత్రము, ప్రతాప చరిత్రపై ఆధారపడి కాసె సర్వప్ప చేసిన సృష్టి. ఆ వచన రచనా విధానం చూచి తద్విధంగా వ్రాయాలని కాసె సర్వప్ప రచించాడు. ఆ చరిత్ర గానం చేయాలనిపించి, ద్విపద రచన చేశాడు. ప్రతాప చరిత్ర, సిద్ధేశ్వర చరిత్ర రెండూ పోల్చి పరిశీలిస్తే పరస్పర సంబంధం స్పష్టం అవుతుంది.

"విధ్యుక్తంబుగా పుణ్యాహవచనంబులు చేయించి యపార ద్రవ్యంబు భూసురుల కొసంగి శివదేవయ్య గారినిం జూచి యీ బాలునకు నామకరణంబు చేయుమన నాయయ్య రుద్రమ దేవికి యిట్టనియె. ఆ బాలుండు నీ పేరు మోసు కొని నీ యట్ల ధరాచక్రంబు మహామహిమతో బాలించునని ప్రతాప వీర రుద్ర దేవుడని నామ కరణంబు జేసెను." (పుట 43 ప్రతాప చరిత్రము).

"...విధ్యుక్తంబుగా పుణ్యాహంబు సేయించి అపార ద్రవ్యంబు భూసురుల కొసగి శివదేవయ్యగారిని జూచి యబ్బాలునకు నామకరణంబు సేయుమనుటయు, ఆయయ్య యిట్టనియె. ఈ బాలుండు నీ పేరు మెచ్చుకొని వుండునట్లుగా నీ ధరా చక్రంబు మహిమతో పాలించునని ప్రతాప వీర రుద్రుడని నామకరణంబు సేయుటయు ......" (పుట 146 సిద్ధేశ్వర చరిత్రము).

ఇట్లే సిద్ధేశ్వర చరిత్రా మంతా ప్రతాప చరిత్రను పోలి వుంటుంది. కాసె సర్వప్ప ప్రతాప చరిత్ర ఏకామ్రనాథుడు చెప్పినట్లే చెబుతానని చెప్పు కొన్నాడు. ప్రతాప చరిత్ర రచనా ప్రయోజనం సిద్ధేశ్వర చరిత్ర ద్విగుణీకృతం కావించింది.

రాయవాచకములో కృష్ణదేవరాయలు చరిత్రం వర్ణితం. అజ్ఞాత నామ ధేయుడు, విశ్వనాథ నాయకుడికి వ్రాసుకొన్న విన్నపంగా చెప్పబడుతుంది. "రాయవాచకము 16 వ శతాబ్దాంత దశకమున వ్రాయబడెనని నిశ్చయింప వచ్చును" (74). పార్శీపదాలు-రాజకీయ పారిభాషిక పదాలు-అనేకం దీనిలో కనిపిస్తాయి. "అతి దీర్ఘ వాక్యములును ప్రాతవచనా విధానమును అచటనచట భావ వైశద్యమునకు బంధకములై వ్యథాజనకములగుచున్నవి" (75) రాయవాచకం వంటిదే మరొక రచనం భాషా విషయంలో రాయవాచకంలాగే వుంది కానీ చరిత్ర సత్యం వివాదాత్మకం. రాయవాచకం "భాష వ్యర్థపదములుకాని, అనవసర పదాడంబరము కాని లేక సరసమై మిక్కిలి శక్తివంతముగానున్నది."(76).

మధుర మంగా పుంశ్చలీ విలాసము విజయ రంగ చొక్కనాథుడి పక్షాన 1689 మొదలు 1706 వరకు మధుర నాయక రాజ్యమును పాలించిన మహారాణి మంగమ్మ మీద అకారణవైరంతో ఎవరో కవి ఆమె పుంశ్చలీవృత్తి వర్ణించిన గ్రంథం. పచ్చి బూతులున్నాయి. రాయవాచకంతో భాషావిషయికంగా, రాజకీయ సందర్భంతో పోలికలున్నాయి. "మదనోద్రేకము గల్గించు వర్ణనలు, తీక్ష్ణమైన భాష, పోట్లైన మాటలును నీ గ్రంథమునకు ప్రత్యేకతను గల్గించుచున్నవి." (77). విమర్శనంలో తిట్టు రచనలకు వచనం ఉపయోగింపబడ్డ సన్నివేశమిది.

తంజాపురాంధ్ర రాజుల చరిత్ర కర్త ఎవరో తెలియదు. మధుర రాజుల పక్షం వహించి చరిత్ర వ్యత్యస్తంగా వ్రాశాడు. భాష, రాయవాచక భాషకు అర్వాచీనం. వాస్తవాన్ని తన కనుకూలంగా వినియోగించుకోవటానికి వచనం ఉపయోగ పడింది.

చారిత్రక వచన కృతులలో భాష వ్యావహారికం. వచనం ఉత్తమ శిఖరం అధిరోహించి, సామాజిక దృష్టి కలిగి, చరిత్ర చెప్పగల సామర్థ్యం పొంది ప్రకాశించింది.

## 2.4.4 మాహాత్మ్య సంబంధి గ్రంథ వచనం

ఈ విధమైన రచనలలో భాష వ్యావహారికం. ఇవి మాహాత్మ్యం తెలిపే రచనలే అయినా వ్యావహారిక భాషలో ఉండటంవల్ల సమాజ వాక్కుకీ వచన గ్రంథాలు ప్రతిధ్వనులయ్యాయి.

శ్రీరంగ, మాఘ, వైశాఖ, ధేను, హాలాస్య, గజారణ్య, వేంకటాచల మాహాత్మ్యాలు తెలిపే వచన రచనలు కాక, కాశీమహిమార్థ దర్పణం, పర్వత కల్పం, ఆచార్య విజయం, సారంగధరచరిత్ర మున్నగు వచన గ్రంథాలు అనేకం ఉన్నాయి. వీటి వచనం ఈ విధంగా వుంటుంది

''ధేనువు సాధుగుణము కలదిగా, ఆయా వేళ దప్పించక పాలిచ్చేదిగా, బాగా పితకనిచ్చేదిగా, మంచి పెయ్య కలిగినదిగా, అటునిటు పారిపోక యిల్లు మరిగి యుండ దగ్గదిగా, దాన మిచ్చిన వాండు ఆ యావుకు శరీరమందు యెన్ని రోమములు కద్దో అన్ని సంవత్సరములు దేవలోకమందు భోగభాగ్యములు అనుభవించుకొని వుండును.''(పుట 15 ధేను మాహాత్మ్యము M 273 తంజావూరు తాళ పత్ర ప్రతి) మాహాత్మ్య సంబంధి గ్రంథ వచనం వ్యావహారికమై, సామాజిక హృదయ ప్రదర్శక మయింది.

## 2.4.5 కల్పిత కథావచనం

నన్నయ కాలం నుంచి కథా కథనానికి వచనం ఉపయుక్త మయింది. అయితే చంపూ కావ్య వచనంలో కల్పనకు ఎక్కువ అవకాశం లేదు. కల్పిత కథల్లో వచనం సంపూర్ణంగా కల్పిత పరిధిలో ప్రయోగింపబడింది. వచనం కథా కల్పనలో పరీక్షింపబడి, నిగ్గు తేల్చబడిన సమయమిది. ఈ వచనం వ్యావహారికంలో సాగింది. కథా వాఙ్మయం ఆబాలగోపాలం పండిత పామర జనం అందరూ కోరేది కనుక, ఈ కల్పిత కథల వచనం మిక్కిలి సులభ శైలిలో సాగి, తత్ప్రయోజనం పరిస్పష్టం కావించింది.

సారంగధర చరిత్ర పూర్తిగా కల్పితం కాదు. గోవ్యాఘ్ర చరిత్రకు సంబంధించి కన్నడంలో 'గోవినహాడు' వుంది. విక్రమార్క చరిత్రం నూత్న కల్పనం కాదు. పంచతంత్ర కథ సంస్కృతానువాదం. భారత చిల్లర కథలు, భారత చిత్రకథలు—కల్పిత కథారచనలు. బేతాళ పంచ వింశతి, దిలారాం కథ, కీరబహత్తర కథలు, భోజ చరిత్రం, తాతాచార్ల కథలు మొదలైనవి వ్యావహారిక వచనంలో రచింపబడ్డాయి.

ఈ కథల కల్పనంలో సామాజికాభిమతం నిక్షిప్తమయి వుంది. వచనం దానికి రూపం ప్రసాదించింది. ఈ వచనం కూడా వచనాభ్యుదయం కలిగిం

చింది. సామాన్య జన సంభాషణ యక్షగానాలలో గ్రంథస్థమై, ఆ వచన రచనకు మార్గం కలిగించింది.

## 2.5 ఆధునిక వచనం

19 వ శతాబ్ది పూర్వం అల్పంగా, తర్వాత అధికంగా, ఆంగ్ల విద్యా ప్రభావం జాతి జీవితంలో అన్ని రంగాలలో కనబడింది. తెలుగు సారస్వతం కూడా ఈ ప్రభావం వల్ల కొత్త వన్నెలు దిద్దుకొంది. పద్య రచనలో వచ్చినట్లే వచన రచనలోనూ క్రొత్త పరిణామాలు వచ్చాయి. ఆధునిక యుగంలో తెలుగు దేశంలో వెలసిన వచన సాహిత్యంలో అత్యధిక భాగం పాశ్చాత్య భావ ప్రక్రియ శిల్ప ప్రభావ ఫలితం! నూత్న సాహిత్య దృక్పథాలు, భావ సందోహాలు ఏర్పడ్డాయి. నవల, కథ, వ్యాసం, జీవిత చరిత్ర, విమర్శ, ఆత్మకథ మొదలైన బహురచనా ప్రక్రియలు ఆంధ్ర వచనంలో చోటు చేసుకొన్నాయి. ఈ రచనల్లో రచనారీతి, శైలి, శిల్పం క్రొత్తగా సంక్రమించి, తెనుగు వచనం శక్తిమంత మయింది.

వచనంలో నవల–పదం, పదార్థం ఆంగ్లమే అయినా తెలుగయి పోయింది; చిన్నకథ, కథానిక, గల్పిక, స్కెచ్ ఆంగ్ల సాహిత్యం నుంచి వచ్చి ఆంధ్ర మయిపోయాయి. సృజన విమర్శన వ్యాసం, సాహిత్య, సాంఘిక, రాజకీయ ఆర్థిక విమర్శలు, సమీక్షలు, ఆత్మ కథ, జీవిత చరిత్ర వ్యక్తిత్వ బోధక ధోర ణిలో, చరిత్ర రచన-నూత్న దృక్పథంతో, పరిశోధనం-సత్య సందర్శన దృష్టితో, నిఘంటువులు-వచనంలో; విజ్ఞాన సర్వస్వాలు, లేఖారచనలు, యాత్రా గ్రంథాలు, బాలస్త్రీ సాహిత్యాలు, శాస్త్ర విజ్ఞాన బోధక రచనలు ఆంగ్లానువాద గ్రంథాలు, అనుసరణలు, అనుకరణలు మొదలైన రచనలు ఆంగ్ల ప్రభావం వల్ల తెనుగు వచనంలో ప్రవేశించి, పరిపుష్టం కావించాయి. ఆంగ్లేయావసరార్థం, ఆంగ్ల ప్రభావంతో తెలుగు పురాణ కథా సాహిత్యం ఆవిర్భవించాయి.

క్రైస్తవ మిషనరీలు రచన చేసిన అందరూ దాదాపు వచనంలోనే రచిం చారు. ఆంగ్లేయోద్యోగులు వచనం ఉపయోగించుకొన్నారు. సి.పి.బ్రౌన్ రచనలన్నీ తెలుగులో ప్రధానంగా వచనంలోనే సాగాయి. బ్రౌన్ ప్రోత్సాహంతో తెనుగు

వచన లేఖా విధానం ఒకటి తెలుగులో ఏర్పడింది. సి.పి. బ్రౌన్ అముద్రిత రచనలు చాలావరకు మద్రాసు ప్రభుత్వ అముద్రిత పుస్తక భాండాగారంలో (M. Vol. 401 నుంచి 432 వరకూ) ఉన్నాయి. మెకంజీ రచనలు, స్థానిక చరిత్రలు, కైఫీయతులు మొదలయిన సర్వరచనలు వచనంలో పై భాండాగారంలో (M. Vol. 1 నుంచి దాదాపు నాలుగు వందలు) ఉన్నాయి

ఆంగ్లేయులేకాక, ఆంధ్రులు ఫోర్టు సెయింట్ జార్జి కళాశాలలో ఉద్యోగి-విద్యార్థుల ఉపయోగార్థం, ఆంగ్లేయుల సహాయ ప్రోత్సాహ సహకారాలతో వచన గ్రంథాలు వ్రాశారు. రావిపాటి గురుమూర్తి శాస్త్రి (1770-1837) 'విక్రమార్క కథలు' (1819), 'పంచతంత్ర కథలు' (1834), పాతూరి రామస్వామి శాస్త్రి, నరసింహశాస్త్రి, రంగశాస్త్రి సోదరులు క్రమంగా 'శుక సప్తతి కథలు, (1840), 'హరిశ్చంద్ర కథ' (1840), 'విజయవిలాస వచనము' (1841) రచించారు. ఈ కాలంలోనే ఏనుగుల వీరాస్వామి 'కాశీయాత్ర,' శేషాచల కవి 'నీలగిరి యాత్ర', 'తాతాచారి కథలు' 'కాంభోజరాజు కథలు' మొదలైన అనేక కథలు వ్రాయబడ్డాయి.

నన్నయ కాలం నుంచి చిన్నయసూరి దాకా పెరిగిన చంపూ కావ్య వచనం, వచన గ్రంథాలలోని గ్రాంథిక వచనం రెండూ కలిపి స్థిరీకరిస్తున్న ధోరణిలో చిన్నయసూరి నీతిచంద్రిక సంస్కృతం నుంచి అనువదింపబడింది (1856). ప్రయోగ బాహుళ్యంచేత పరమ రమణీయమయిన, దాదాపు ఎనిమిది వందల సంవత్సరాల వచన సారం నీతి చంద్రిక. ఈ వచనం అడుగుజాడల్లో మొదట వచన రచనాభ్యాసం చేసిన సంఘ సంస్కర్త. ఆధునిక వచన హృదయం నిరూపించిన మహామనీషి కందుకూరి వీరేశలింగం పంతులు.అనంతర కాలంలో కందుకూరి వచనం సరళతా సౌందర్యం చిందించింది. సామాజిక ప్రయోజనం సాధించేంత సమర్థమయింది.

పాఠ్య గ్రంథదశ నధిగమించి తెనుగు వచన రచన చేసిన ప్రథమ రచయిత కందుకూరి. సాంఘిక ప్రయోజన సాధనంగా, పత్రికా రచనోపయోగకరంగా వచనం రూపొందింది. వీరేశలింగం పంతులు వచనాన్ని 'ప్రహసనములు'గా,'ఉపన్యాసములుగా','విమర్శనము'గా, 'నవల'గా,'జీవిత చరిత్ర'గా,'స్వీయచరిత్ర'గా, శాస్త్రరచనము'గా, 'పత్రికాభాష'గా, ప్రాణమున్న వ్యక్తిగా రూపొందించాడు.

అనువాద రచనకు, హాస్య, అపహాస్య రచనకు వచన మెంత సమర్థమో ప్రదర్శించాడు.

కందుకూరి సమకాలికుడు కొక్కొండ వేంకటరత్నం పంతులు. సమకాలికులిరువురు సమస్కంధులు. వాళ్ళ ఆవేశకావేషాలు ఉత్తమ వచన రచనకు, భాషా సేవకు దోహదం చేశాయి. వాళ్ళ సంస్కరణాభిలాష, సంఘోద్ధరణ వాంఛ, సాహితీ సేవ, వచనానికి వన్నె తెచ్చాయి. ఈ సమయంలో వెలిగిన పత్రికలు, జరిగిన సాహితీ వ్యాసంగం వచనం క్రొత్తరూపం పొందటానికి దోహదం చేశాయి. సంఘ సంస్కరణం, మూఢ విశ్వాసాలు దూరీకరించటం, నూత్నచైతన్యం సంఘానికి కలిగించటం, ఆంగ్ల విజ్ఞానం ఆంధ్ర దేశంలో అన్ని ప్రాంతాలకూ అందేటట్లు చేయటం, వచనం చేయవలసిన విధులై, సమర్థంగా నిర్వహింపబడ్డాయి. భారతదేశ భాషలలో ప్రప్రథమంగా ఎన్నికచేయబడ్డ ప్రిన్స్ ఆఫ్ వేల్స్ యాత్రా చరిత్ర, (కొక్కొండ వేంకటరత్నం పంతులు), ఆంగ్లంలోకే మళ్ళీ అనువదింపబడి ఆంధ్రులకు విశేష కీర్తి తెచ్చిన 'రాజశేఖర చరిత్ర' నవల (వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్ అనువాదం-కందుకూరి వీరేశలింగం పంతులు) ఆంధ్ర వచన సాహిత్య స్థానం తెలిపేవిగా వున్నాయి.

నన్నయ వచన రచనా పద్ధతి తదనంతర కవులకు అనుసరణీయమైనట్లు, చిన్నయసూరి ప్రారంభించి, కందుకూరి పరిష్కరించిన వచన మార్గంలో ఆధునికులనేకులు పయనిస్తున్నారు, పయ...చారు. ఈ భాష బహుకాలం నుంచి విద్యా కేంద్రాల భాషగా వుంది. ఇప్పుడిప్పుడే ఈ భాషా విషయంలో మార్పు కనపడుతున్నది.

ప్రాచీన శాసనాలలో గోచరించిన వ్యావహారిక భాష, వచన గ్రంథాలలో కనిపించిన వ్యావహారిక భాష సంఘ జీవిత సమీపస్థంగావుండటం, గ్రాంథిక భాష క్రమక్రమంగా మారుతూ దూరమవుతూ వుండటం, గమనించి జనం వాడే భాష, భాషలో కలిగే మార్పులు స్వీకరించే భాష కావ్యభాషగా వుండాలని వ్యావహారిక భాషా వాదం స్వీకరించి, సమర్థంగా ప్రచారం కావించిన క్రాంతదర్శి, మహావ్యక్తి, మహాసంస్థ గిడుగు రామమూర్తి పంతులు. ఆ భాషలో సంపూర్ణ రచనలు నాటకం, కథ, కవిత వ్రాసిన సంఘ సంస్కర్త, మహాకవి గురజాడ అప్పారావు.

వర్తమానాంధ్రంలో చిన్నయ సూరి వ్యాకరణ సూత్రానుగుణంగా ఉన్న భాష గ్రాంధికం అనీ, గిడుగు రామమూర్తి పంతులు వాదానుగుణంగా ఉన్న భాష వ్యావహారికమనీ పిలుపబడుతున్నాయి. నేటి వచనం వ్యావహారికం వైపు మొగ్గుచూపింది.

నేడు ఆంధ్రదేశంలో వచనం సంఘజీవి అయిన మనిషి భాషను ఎంతగా ఉపయోగించుకోవచ్చో అంతగా ఉపయోగపడుతూవుంది. మానవ నాగరకతా సంస్కృతుల అంతరాంతరాలు స్పృశించే రచనకు, అందులో వచన కవిత్వానికి కూడా ఉపయోగపడుతున్న వచనం, భిన్న రంగాలలో బహువిధ పరిశ్రమ కావించే వాళ్ళకు ఉపయుక్త మవుతున్న వచనం, మానవ జీవిత కోణాలు అనేకం సమగ్రంగా దర్శింపగల్గిన వచనం, సంఘానికి ఉత్తమ భవిష్యత్తు కలిగించేంత సమర్థం.

## 3. సంస్కృత గద్య ప్రభావం

స్వతస్సిద్ధమయిన వచన సంప్రదాయం వున్న తెనుగుభాషలో సంస్కృత గద్యం వల్ల నూత్న పరిణామాలు ఏర్పడ్డాయి. ''ఆంధ్ర వాఙ్మయమందలి ఇతర ప్రక్రియల వలెనె, తెలుగు వచన రచనముకూడ సంస్కృత భాషా సాహిత్యముల ఛాయలనే నడచినది.''(78). ''రస ప్రధానమయిన కావ్య వాఙ్మయ మెట్లు సంస్కృతమునుండి తెనుఁగునుఁ బ్రవేశించినదో యట్లే శాస్త్ర వాఙ్మయము గూడ సంస్కృతము నుండి తెనుఁగున ప్రవేశించినది.''(79). శాస్త్ర వాఙ్మయం సాధారణంగా వచనమయంగా వుంది. ఆంధ్ర వచనం సంస్కృత గద్య ప్రభావంతో, దాదాపు వెయ్యేళ్ళు, స్పష్టంగా- రచింపబడింది.

ఆధునిక యుగందాకా ఆంధ్ర వచనం ఉన్నతశిఖరం చేరుకోలేదు. సంస్కృత గద్య, ఆంధ్ర వచనాన్ని ఔన్నత్యం వైపునకు నడపించింది. సంస్కృత గద్య. ప్రదర్శించిన లక్షణం, చూపిన రచనావకాశం, పొందిన పరిణామం తెలుగు వచనంతో పోల్చి స్థూలంగా పరిశీలింపవచ్చు. దీని మూలంగా సంస్కృత గద్యప్రభావం తెలుగువచనంమీద, 19 వ శతాబ్ది పూర్వం ఎంతవరకుందో తెలుసుకోవచ్చు.

## 3. 1 గద్యార్థం

సంస్కృత గద్య ప్రభావం పరికించేముందు గద్యార్థం గ్రహించటం అవసరం. సంస్కృతంలో వచనం అనే పదం గద్యార్థంలో మృగ్యం, కాబట్టి గద్యం ఒక్కటే పదం, కనుక గద్యార్థం సంస్కృతంలో వచన రూపవివరణం అవుతుంది. గద్యలక్షణం పలువురు నిర్వచించారు. అది ఈ అధ్యాయం ఆరంభంలో పరిశీలింపబడింది. గద్య రచనలో ఉన్న సాధక బాధకాలు తెలియటంవల్ల గద్యార్థం బోధపడే అవకాశం వుంది.

"గద్యం కవీనాం నికషం వదంతి" గద్యం కవులకు గీటురాయి అంటారే -అంటే ఏమిటన్న ప్రశ్న ఉదయిస్తుంది. గద్య రచన శ్రమాయత్తమని అర్థం కావచ్చు. గద్యం వ్రాయటానికి కవి ప్రతిభావంతుడు కావాలనీ అంటారు. అందరూ గద్యం వ్రాయలేరనీ, వ్రాసిందల్లా గద్యం కాదనీ అనటంవల్ల గద్యం వ్రాయటం కష్టమన్న విషయం స్పష్టమవుతుంది.

గద్యం వ్రాయటానికి ప్రతిభ అవసరం అయితే పద్యం వ్రాయటానికి అంత ప్రతిభ అక్కరలేదన్న సూచనం కలుగుతుంది. మరి పద్యరచనలోఉన్న సౌలభ్యం, గద్యరచనలో ఉన్న క్లైష్ట్యం ఏమయివుంటాయని ఆలోచింపవలసి వుంటుంది. పద్య రచన ప్రపంచ వాఙ్మయంలో రెండు శతాబ్దులకు పూర్వం అధికంగా జరిగింది. ఈ యుగంలో గద్య రచన విస్తృతంగా ఉంది. పద్య గద్య రచనలకు, నాగరకతకు సంబంధం వుందా అనిపిస్తుంది. సమాజ సంస్కృతిలో నాగరకతా వేగం లేని రోజుల్లో పద్యం కవిలోక సేవ్య మయింది. దాన్ని సమాజం సమాదరించింది. నాగరకత పెరిగినకొద్దీ వచనావకాశం పెరిగింది. దాన్ని సంఘం స్వీకరించింది. ఈ నాటి నాగరక సంఘ శ్రోత్రిత్వానికి ఆవలి ఒడ్డు పద్యం, ఈవలిఒడ్డు గద్యం. ప్రశాంత సమాజ జీవితంలో పద్యం; వేగ భరితమైన నాగరక సంఘంలో గద్యం ఆదరింపబడ్డాయి.

గద్య రచన శ్రమ సహితం అనటంలో అర్థం ఊహించాలి. గద్య పద్యాలకు ప్రధానమైన తేడా ఛందస్సు. ఛందస్సహితమైన పద్యం, ఛందోరహితమయిన గద్యం రచించటంలోని సౌలభ్యం, క్లైష్ట్యం ఛందస్సు వల్లనే ఏర్పడ్డట్లు తోస్తుంది. ఛందస్సు మార్గమై పద్యరచనానుకూల్యం ఏర్పడి వుంది. ఛందో

మార్గంలేక వచన రచన అనుకూలతా బాధిత మయింది. "The poet, on the other hand...... had the great advantage of moving within prescribed limits" (80). ఛందస్సు నిర్ణయించిన శ్లోక పద్య మార్గంలో రచన చేయటంలో కవులు కొంత స్వేచ్ఛ కలిగి, పద్యరచనలో వుండే మెలుకువలు తెలిసి, వచన రచన శ్రమకు ఎడంగా వుంటారు. ఛంద స్సహిత రచనలలో లయవల్ల "అనౌచిత్యములు కూడ కొన్ని యెడలఁ బాటింపు నకు రావు. ఈ ఆటలు గద్యమునందు సాగవు. ఇచట ఛందోయతి ప్రాసాది సాహాయ్యము లేదు. మాధుర్యమో ప్రౌఢియో సౌకుమార్యమో ఓజోగుణమో రచనయందు సమకూర్చుటకు నధికమైన శక్తి కావలెను. ఇచట గద్య కవి చేసిన వర్ణనము హృదయంగమముగా నున్నచో వాఁడసహాయ శూరుడు కావలయును. అనఁగా వృత్తభేదములు యతి ప్రాసలు మొదలైనవి సహాయకములు. అవి లేని వాడు గనుక నిత డసహాయ శూరుఁడు" (81).

ఈ ఛంద స్సౌలభ్యంవల్ల గద్యం కంటే పద్యం రచించటం సులువన్న భావం ఏర్పడింది. ఈ దృష్టి అంగ్ల విమర్శకులూ, కవులూ కలిగివున్నారు. "Even in the middle ages, surprising as this may seem the European writer in the vernacular seems to have found verse easier to write than prose" (82).

ఛందస్సుఖం వల్ల పద్యం వ్రాయటం సులభం, గద్యం వ్రాయటం కష్టం అన్న అభిప్రాయం ప్రపంచ సాహిత్య సంప్రదాయంగా ఏర్పడింది. అందువల్లే గద్యం కవులకు గీటురాయి అనటం జరిగింది. కానీ, కొందరు ఆధునిక విమర్శ కులు ఛందస్సును వశం చేసుకోవటం కష్టమనీ; కొందరు ఆలోచనాపరులు నియ మాలకు లొంగి పద్యం వ్రాయటం బాధకమనీ, నియమాలు లేక స్వేచ్ఛగా వచనం వ్రాయటం సుఖమనీ, కొందరు కవులు ఛందస్సహిత పద్య రచన కంటే వచన కవిత వ్రాయటం బాధారహితంగా వుంటుందనీ ఉపన్యసించటం ఆంధ్ర విద్వల్లోకం వినే వుంది. ఈ దృష్టికి ప్రతినిధిగా శ్రీ శ్రీశ్రీ ఛందస్సు సర్పపరిష్వంగమనీ, దాన్ని త్యజించి కవిత్వం వ్రాస్తాననీ మహా ప్రస్థానంలో పలకటం అవశ్యం గుర్తించాలి.

ఆధునిక యుగంలో ప్రధాన లక్షణం తార్కిక హేతుయుతాలోచనం. తర్కానికి, హేతువుకు అందకుండా వస్తుతత్త్వంకానీ, మానసిక ఆలోచనం కానీ, సాధారణంగా ఈ యుగంలో తప్పించుకొని పోలేవు. గత కాలంలో కంటే నేటి కాలంలో ఆలోచనాపరులెక్కువనీ, మునుపటికంటే కవితాహృదయం తక్కువనీ, ఆలోచన పెరిగిన కొద్దీ కవిత్వ దశ తగ్గుతూ వుంటుందనీ, కవిత్వ స్థితి తగ్గిన కొద్దీ వచన స్థితి పెరుగుతుందనీ; లేకపోతే ప్రాచీన కాలంలో ప్రపంచ భాషల్లో అధికంగా లేని వచనం ఆధునిక కాలంలో ఇంత విస్తృతంగా ఆవిర్భవించవలసిన అవసరం లేదనీ తేలుతుంది. కాబట్టి ఆధునిక ఆలోచనకు వచనం ఆయువుపట్టు. నిశితమైన ఆలోచన వచనంలో చెప్పినంత స్పష్టంగా, క్లుప్తంగా, సూటిగా పద్యంలో చెప్పటం కష్టమనటం వుంది. "Why was prose developed if not to afford expression to a content which suffered by being thrust into metrical form? Quite erly in the history of Greek literature it was felt that a metrical form could not follow with proper exactness the forms of logical thought." (83).

పద్యంలో, శ్లోకంలో ప్రాచీనులు అనేక విషయాలు స్పష్టంగా, క్లుప్తంగా, సూటిగా చెప్పటం విద్యావంతులకు అవగత పూర్వమే! అయితే సౌందర్యం, సత్యం, దివ్యత్వం, తత్త్వం వంటి కొన్ని ఉదాత్త విషయాలు పద్యంలో అత్యుత్తమంగా చెప్పబడవచ్చు. కాని వివాద, తర్కశాస్త్ర, వేదాంతాల వంటి కొన్ని సంగతులు గద్యంలో అత్యుత్తమంగా చెప్పవచ్చు. వివాద విషయాలు పద్యంలోనూ, సౌందర్యాది విషయాలు గద్యంలోనూ చెప్పవచ్చుగాని అత్యుత్తమంగా చెప్పే వీలుంటుందా అనేది ఆలోచనీయమవుతుంది. కనుక పద్యంలో, గద్యంలో చెప్పవలసిన విషయాలు భిన్నభిన్నంగా వున్నాయని గుర్తించటం అవసరం.

అయితే ఛందస్సహిత రచన కంటే గద్య రచన సులభం అనే అభిప్రాయం ఆధునికులు ప్రకటించటానికి కారణం ఏమయి వుంటుంది? ఆధునిక మానవుడి ఆలోచన తీరు, స్వీకృత వస్తువు పద్యమయం కాకపోయినవిధం, పద్యమయమయితే విస్పష్టంగా ఏర్పడకపోయిన దశ, భావం పొందవలసిన పదజాలం కంటే ఎక్కువ ఉపయోగమైన హేతువు అనుభవించిన, పరికించిన ఆధునిక

కవులు, విమర్శకులు ఛందస్సహిత రచనం కష్టమని తలంచారు. వాస్తవ మేమంటే వాళ్ళ ఆలోచన ఛందస్సులో ఇమడలేదు. దానికది వాహిక కాదు; వచనం వాహిక. పద్యం-రచించటానికి అతీతస్థితి పొంది-గొప్పదవటం కాదు; వాళ్ళ ఆలోచన పద్యవాహిక కంటె గొప్పది. ఆ భావం పద్యంలో పట్టలేదు. వాళ్ళ భావ వ్యక్తికి పద్యమనే దుస్తులు సరిపోలేదు. అందువల్ల దుస్తులు గొప్ప వనికాదు. వ్యక్తికి నూత్న వస్త్రాలలాగా కొత్తవాహిక భావానికి కావలసి వచ్చింది. ఈ సందర్భంలో భావాధిక్యం గుర్తించబోయి, ఛందస్సు యొక్క అసమగ్రత చెప్పబోయి, దాని స్థితి వేరుగా ప్రదర్శింపబోయి, వేరుగా భావించటం, శ్రేష్ఠంగా పొరపాటు పడటం జరిగింది. జాగ్రత్త ఉన్న కవులు ఛందస్సును సర్ప పరిష్వంగం అని, అనవసర ప్రతిబంధకం అన్నారు కానీ వేరుగా అనలేదు. ఇటువంటి కొన్ని సందర్భాలవల్ల కొందరు విమర్శకులు ఛందస్సహిత రచన వచన రచన కంటే కష్టతరం అనుకోవటం జరిగింది. భావం ఎంత తీవ్రమయిందయినా, ఎంత సాధారణంగా వున్నా, ఎంత వివాద శాస్త్ర తర్క వేదాంత మయినా, ఎంత సామాన్యంగా వున్నా వచనం పెరిగిన ఎత్తుకు పద్యం పరిమిత అక్షరాలు, పాదాలు దాటి పెరగలేకపోవటం గమనించ దగింది. భావం పెరిగినకొద్దీ కవి పెరుగుతూ వ్రాయవలసిన వచనం - నిజమే-కవులకు గీటురాయి.

గద్యం సాహిత్యాభివ్యక్తిగా సంస్కృతం ఏ విధంగా రూపొందిందో, దాని లక్ష్య అవకాశ పరిణామాలు ఏ విధంగా వున్నాయో, తెలుగుతో అన్వయ దృష్టితో పరిశీలింపవచ్చు.

## 3.2 గద్యలక్ష్యం-సంస్కృతం

భాష సాధారణంగా వ్యవహార రూపంనుంచి లిపి రూపంగా పరిణమించినట్లే, సారస్వతం కొన్ని ప్రాచీన భాషల్లో, ఆద్యరూపం మౌఖికమై, అనంతరం లిఖితమై వుంది. సంస్కృత సారస్వతం బహుకాలం మౌఖిక సంప్రదాయ సంరక్షితం. సాహిత్యం మౌఖికంగా ఎక్కువకాలం ప్రయుక్తంగా వుండాలంటే లయాత్మక గీతాత్మక రచనకే అవకాశం వుండటంతో సంస్కృత సాహిత్యం శ్లోకమయమయి వెలిసింది.

అయినా, వచన రచనకు అవకాశం లేకపోలేదు. భాష లిఖితమైన తరు వాత కూడా గద్యరూపం నిలిచివుంది. తైత్తిరీయ సంహితలో, కృష్ణ యజుర్వే దంలో, బ్రాహ్మణాలలో, వేదాంతర్గతానేక భాగాలలో, వేదానుబంధాలలో గద్య రూపం గోచరమవుతుంది. శాస్త్ర గ్రంథాలు, వ్యాసభారతం, విష్ణుపురాణం, భాగవతం, చరక శుశ్రుత వైద్య గ్రంథాలు, అథర్వవేదం, అనేక భాష్యాలలో గద్యోన్నతి గమనార్హం. పతంజలి మహాభాష్యాన్ని గూర్చి గమనింపవచ్చు. "The earliest standard of prose writing is to be found in Patanjali's Mahabhasya which is noted for its grace, vigour, elegance and in which we find the perfection of Brammical prose"(84). అంతేగాక శివస్వామి మీమాంస సూత్రాలు వాత్స్యాయన న్యాయసూత్రాలు, శంకర బ్రహ్మసూత్రాలు మొదలైన వచన రచన లెన్నో సంస్కృత సారసత్వంలో లభ్యమవుతున్నాయి. ప్రయోజనాత్మక శ్లోక రచన జరుగుతున్న కాలంలో ఇన్ని గద్య రచనలు ఏ లక్ష్యం సాధించ టానికి వ్రాయబడ్డాయో పరిశీలించవచ్చు. ఇంత విస్తృత గద్య వాఙ్మయ సృష్టి వెనుక అత్యవసరంగా అనిపించిన ఏ లక్షణం గద్యసృష్టి హేతువుగా వుందో గమనింపవచ్చు.

సంస్కృతభాషలో, తద్ధర్మాలుగా చెప్పదగ్గ అనేకాలలో సంక్షిప్తత ప్రధానమయింది. బహ్వర్థం బహు క్లుప్తంగా చెప్పటానికి అనుగుణంగా సంస్కృతం ప్రాచీన కాలంనుంచీ పెంపొందింది. అందుచేత రచనం ఎక్కువ సంక్షిప్తంగా, అధిక సంక్షిప్తంగా, విపరీత సంక్షిప్తంగా జరగటంతో అర్థం స్పష్టంగాని పరి స్థితులు ఎదురయ్యాయి. ఈ సమయంలో శ్లోకాలు వివరించటం, విపులీకరించటం అవసరంగా తోచాయి. ఇందుకు శ్లోకంకంటే గద్యం బాగా పనికి వచ్చేటట్టు భావింపబడింది. "There were in most cases regular commentaries in prose on the Vedic hymns explanatory and analytical" (85). వేదాంత వ్యాకరణ రచనల వ్యాఖ్యానాలలో గద్య ముప యుక్తమయింది. వ్యాఖ్యాన గ్రంథాలలోనే కాక వైద్య గ్రంథాలలో కూడా గద్య ముపయుక్త మయింది కదా అని ఆలోచిస్తే, గద్యం అర్థస్పష్టం కోసం ఉద్దేశింప బడ్డట్టు భావింపవచ్చు. ఈ దృష్టితో చూస్తే గద్యం సంస్కృతంలో అర్థబోధన లక్ష్యంతో సృష్టిపొంది ప్రవర్తిల్లినట్లు గ్రహింపవచ్చు.

ఈ స్థితిలో వేదాంత విషయ వివరణాత్మకాలయిన బ్రాహ్మణాలు-గద్య భాగాలు-అధికంగా పెరిగిపోయాయి. "This kind of long prose work becomes to elaborate to be preserved or got up by rote. The compilers now hit at the other extreme. They would be more concise and precise. References must be facilitated. Thus brevity took the place of verbosity. This is the origin of the literature of the sutras" (86).

వ్యాఖ్యాన గద్యం విస్తృతంగా పెరిగిపోయినందువల్ల, చిలవలు పలవలుగా అల్లుకు పోయిన కారణం చేత, దాని పెరుగుదలను ఆపి, సంక్షిప్తంగా అల్పాక్షరానల్ప రచనావకాశం పునః స్మరణం చేయబడింది. ఈ గుర్తింపు వల్ల సూత్ర రచన మారంభమయింది. సూత్ర రచన క్రమ క్రమంగా విపరీత సంక్షిప్తతతో బిగిసిపోయి, ఎంత క్లుప్తంగా వ్రాస్తే అంత ఉత్తమ సూత్రం రచించిన తృప్తి కలుగుతున్నట్లు వ్యక్తమయింది. "The saying was proverbial that an author rejoiceth in the economising of half a short vowel as much as in the birth of a son". (87).

సూత్రకారులు అంత పట్టుదలగా వుండటంతో సూత్రాలు అర్థస్పష్ట్య వాంఛితాలయ్యాయి. ఈ కారణంచేత సూత్రవృత్తి రచన మొదలయింది. వృత్తి రచనం సూత్రప్రాయమై మళ్ళీ వివరణావసరం కలిగింది. సూత్రాలకు, సూత్ర వృత్తులకు భాష్యాలు వివరణాత్మక మయ్యాయి. భాష్య గద్యంతో మళ్ళీ గద్య రచనం విస్తృతమయిపోయింది. భాష్య వివరణం అధికంగా జరిగింది. గద్య విషయంలో భాష్యాలు బ్రాహ్మణాలయ్యాయి. గద్యం కలిగిన వ్యాకోచాత్మక గుణం వల్ల, వివరణ మందరికీ అర్థం కావటానికి అనగానే అధికంగా గద్యం వ్రాయవలసివచ్చింది.

ఈ విధంగా గద్యం స్పష్టంగా తెలుపవలసిన చోట వ్రాయబడి, సూత్రాలకు వృత్తులకోసం ఉద్దేశింపబడి, సూత్ర వృత్తులకు అర్థ స్పష్టతకోసం భాష్య రచనకు ఉపయుక్తమయింది. వేదాలు, వైద్యాది గ్రంథాలలోని శ్లోకగత

క్లిష్టత తొలిగించి వివరణం, విపులీకరణం చేయడానికి గద్య రచన జరిగింది. శ్లోకరచన ప్రయోజనం పరిమితం కాగా, గద్య రచన బహు ప్రయోజనంచేత అపరిమితమయింది. సంస్కృత వాఙ్మయంలో గద్య, వివరణ విపులీకరణాలతో ఒప్పే వ్యాఖ్యానాలకూ, అర్థ స్పష్టత్వం కలిగించే రచనకూ ఉపయోగింపబడి తల్లక్ష్యం సాధించింది.

## వచన లక్ష్యం - తెలుగు

ఆంధ్ర వచనావిర్భావం ఏ లక్ష్యంతో జరిగిందో తెలియాలంటే వచన స్వరూపం పరిశీలింపవలసి వుంటుంది. సంస్కృతంలోలాగా తెలుగులో వ్యాఖ్యాన వచనం లేదు. సంస్కృతంలోలాగా తెలుగులో ఆరంభంలో వివరణ విపులీ కరణార్థం వచనముపయుక్తం కాలేదు.

తెలుగు శాసన భాషలో వచనం, చంపూ కావ్యాలలో వచనం మొదలైన వచన రీతి వాఖ్యానప్రాయంకాదు. శాసన వచనం ప్రధానంగా విషయం తెలప టానికి ఉద్దిష్టం. చంపూ కావ్య వచనం ఒకవిధమైన కవితా సంప్రదాయ అవ సరం. ఈ కోవలో గద్యం, గద్య ఆ విధంగానే గోచరిస్తాయి. వర్ణనం, కథా కథనం, సంభాషణాది కవితాధర్మాల స్పష్టీకరణకు; పద్యం విషయబోధన సామర్థ్యం కంటే భిన్న ధర్మరచనకు వచనం స్వీకరింపబడింది. 'వచనముల'లో వచనం కవితాధర్మ బోధకంగా వుంది. సంపూర్ణ వచన రచనలు విషయం స్పష్టంగా తెలపటానికి ఉద్దేశింపబడ్డాయి.

అంచుచేత సంస్కృతంలోని వివరణ విపులీకరణ లక్ష్యంతో తెలుగు వచనం ఆవిర్భవింప లేదు. సంస్కృతంలోని వైద్య గ్రంథాలు మొదలైన వాటిలో స్పష్టత్వ సాధనార్థం గద్య ముపయోగించినట్లు తెలుగులో వెలువడ్డ వచనైక గ్రంథాలు కొంతవరకు తద్ధర్మం కలిగి వున్నాయి.

సంస్కృతంలోలాగా చంపూ కావ్య రచనంలో వచనం ప్రయోగించే పద్ధతి తెలుగులో గోచరమవుతుంది. బ్రాహ్మణాలు, సూత్రాలు, సూత్ర వృత్తులు, భాష్యాలు సంస్కృతంలో వెలసినట్లు తెలుగులో వచనారంభంలో వెలువడలేదు

సంస్కృతంలోలాగా గద్యం అన్న పదం తెలుగులో 3 వ శతాబ్దిలో శకరాజ రుద్ర దమనుణ్ణి గూర్చిన "స్ఫుటలఘు మధుర చిత్రకాంత శబ్దసమయో దరాలంకృత గద్య పద్య కావ్య విధాన" అనే బిరుదగద్యంవల్ల గోచరమవుతుంది. శివకవి యుగంలో గద్యపద ప్రయోగం

"ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన" అనీ,
"ఉరుతర గద్యపద్యోక్తుల కంటె
సరసమై పరగిన జానుఁదెనుంగు" అనీ తెలిసి

గద్యపద ప్రాచుర్యం వెలుగులో స్పష్టమవుతుంది.

సంస్కృత గద్య లక్ష్యం, తెలుగు వచనలక్ష్యం విభిన్నాలు. ఆయా భాషల్లో వచనావిర్భావం భిన్నావసరాల ఫలితం. రెండు భాషల్లో భిన్నదశల్లో, స్థితుల్లో పుట్టిన వచనంలో లక్ష్యం దృష్టితో సంబంధంకంటే తేడా ఎక్కువ. కాని సంస్కృతంలో గద్యం చంపూకావ్యగతంగా. అనంతర దశకు నిదర్శనం తెలుగులో ఆది దశలో కనిపిస్తుంది. అర్థస్పష్టం కోసం సంస్కృతంలో ప్రథమంగా వ్రాయబడ్డ గద్యం తెలుగులో వచనం ప్రారంభమయిన బహుకాలానంతరం వచనైక గ్రంథాలలో కనిపించింది. వచన లక్ష్యం విషయంలో అల్పంగా సంబంధం, అధికంగా తేడా సంస్కృతాంధ్ర భాషల్లో కనిపిస్తుంది.

## 3.3 గద్యావకాశం - సంస్కృతం

సంస్కృతంలో రెండు భిన్న రీతుల్లో వచన రచనావకాశం వుంది. సూత్రగద్యం, కావ్యగద్యం అని విభజింపవచ్చు. సూత్ర గద్యం బ్రాహ్మణాలు, సూత్రాలు, వృత్తులు, భాష్యాలలో ఉపయుక్తమయింది. కావ్య గద్యం తదితర రచనల్లో ప్రయోగింపబడింది. "Prose, without the limitation of metre, developed in two ways. There are prose Passages in the form of very short, crisp sentences in addressing the various objects utilized for religious rituals and there is also the free, elegant prose made use of in narration, in interpretation and in description." (88).

మత విధులలోనేకాక, వ్యాకరణ వేదాంతాది అనేక గ్రంథాలలో ఆద్యరీతి గద్యం ప్రయోగింపబడింది. ఈ విషయం స్పష్టంగా, సమర్థంగా బ్రాహ్మణాల గూర్చి ఇలా చెప్పబడింది:

"There language in general bears no resemblance to the language of the romances. The tone of the former is serious and scientific, while that of the latter is levitous and recreative. Bhashyas are stuffed with substance and technicality; they are Vasthu - Pradhana. Literary prose proper is the result of poetic art and rhetorical embellishmant." (89).

మత విధ్యుపయోగార్థం వెలువడ్డ సూత్రప్రాయ రచనలు, బ్రాహ్మణాల వంటి రచనలు శాస్త్రబద్ధ గద్యానికీ; ఉపదేశ కథలు, పంచతంత్ర హితోపదేశాలు, హర్షచరిత్ర, కాదంబరి వంటి రచనలు ఆలంకారిక కవితారీతి గద్యానికీ ఉదాహరణంగా చెప్పవచ్చు. ఈ రెండు విధాలా సంస్కృత వచన రచనావకాశం గోచరిస్తుంది.

## వచనావకాశం-తెలుగు

సంస్కృతంలోలాగా తెలుగులో సూత్ర రచన వచన రచనారంభంలో లేదు. అలాగే కావ్యవచనం కూడా ప్రారంభంలో లేదు. చింతామణి సూత్ర బద్ధమేకానీ, తెలుగుకు వ్యాకరణమేకానీ, తెలుగులో వ్రాయబడలేదు. తెలుగు వ్యాకరణానికి సూత్రరచన చేసిన అభినవ పాణిని చిన్నయసూరి. అయితే తత్పూర్వవ్యాకరణాలు చాలవరకు పద్యమయంగా వున్నాయి.

గద్యం ఆంధ్రంలో చతుర్విధంగా ప్రవర్తిల్లింది. శాసన వచనంలోగాని, పచనముల వచనంలోగాని, సంస్కృతం భిన్నంగా వుంది. చంపూ కావ్య వచనం, సంపూర్ణ వచన గ్రంథ వచనం సంస్కృతంలోని చంపూకావ్య గద్యాలతో, అనేక గద్య రచనలతో ఉన్న సంబంధం గమనించవచ్చు. ఈ నాలుగు విధాల తెలుగు వచన రచనావకాశం, ఆంగ్ల భాషా ప్రభావానికి పూర్వం, గోచరిస్తుంది.

శాసనాలలో, వచనైక గ్రంథాలలో వున్న వ్యావహారిక భాష తెలుగు సంప్రదాయ ఫలితం. వచనముల వచనం తెలుగుకే పరిమితం. చంపూకావ్య కథా వచన కావ్యరచనలు సంస్కృత వచనంతో సంబంధించి గోచరమవుతాయి.

తెలుగు వచనం వ్రాయటానికి ఉన్న అవకాశంలో సంస్కృతంతో పోలిక కొంత వరకే భిన్నత్వమే అధికంగా వుంది. అయినా విస్తృత రచనావ కాశం సంస్కృత రీతిసంబంధిగా వుంది.

## 3.4 గద్య పరిణామం

సంస్కృతంలో గద్యం బ్రాహ్మణాలు, సూత్రాలు, వృత్తులు, భాష్యాలుగా ఒకవైపూ, కథలు, గాథలు ఆఖ్యాయికలు, యాత్రాగ్రంథాలు మొదలైన రీతులుగా మరోవైపూ పరిణమించింది. ఈ సంస్కృత వచన ప్రక్రియలకు, తెలుగు వచన ప్రక్రియలకు పోలికలు దర్శనీయమవుతున్నాయి

### 3.4.1 కథానకం-సంస్కృతం-తెలుగు

కథానకం సంస్కృతంలో విస్తృత ప్రక్రియ. మానవ ప్రవర్తనంలోని లోపాలను ఎత్తి చూపి-సవరించుకొనే మార్గాలు ప్రదర్శించేది కథానకం. "Fable is with theme practical ethics, the science of niti or polity. Each fable is calculated to illustrate some reflection on worldly vicissitudes or some percept for human conduct". (90.)

కథానకాలు స్థూలంగా ప్రజాబాహుళ్య గాథలు (పాపులర్ టేల్స్), జంతు కథలు (బీస్ట్‌టేల్స్) లేక ఉపదేశ కథలు (డిడేక్టిక్ టేల్స్), కల్పనాకథలు (ఫెయిరీ టేల్స్). ఈ విధమైన గాథలు బౌద్ధ మత సంబంధిగాను, అసంబంధిగాను వున్నాయి. ఇందుకు ఉదాహరణంగా క్రమంగా బృహత్కథ, పంచతంత్ర హితోపదేశ కథలు శుకసప్తతి కథలు చెప్పవచ్చు.

### 3. 4. 2 బృహత్కథ

గుణాఢ్యుడు ఆంధ్రుడనీ, శాతవాహన రాజులలో ఒకరి ఆస్థానంలో ఉన్నవాడనీ కథలు ప్రచారంలో ఉన్నాయి. అతను బృహత్కథ ప్రాకృత విభేదమయిన పైశాచీ భాషలో రచించాడనీ, మూలం అలభ్యమనీ, ఇది దేశాంతర

వ్యాప్తి పొందిందనీ, ఆ ఇతరేతర భాషా ప్రతులు ఆధారంగా తిరిగి సంస్కృతంలో పునర్నిర్మాణమయిందనీ తెలుస్తూవుంది. బుధస్వామి 'శ్లోక సంగ్రహం' మాతృకకు సమీపస్థమని ఎ.బి. కీత్ అభిప్రాయం. క్షేమేంద్రుడి బృహత్కథా మంజరి, సోమదేవుడి కథాసరిత్సాగరము బృహత్కథ రూపాంతరాలు. క్రీస్తు శకారంభంలో ఈ గుణాఢ్యుడు జీవించినట్లు డా.వి. వరదాచారి అభిప్రాయం. ఈ బృహత్కథ భారత రామాయణాల తర్వాత అంతటి ఉత్తమ శ్రేణి రచనగా భావింపబడింది. ఈ బృహత్కథ ప్రభావం భాస నాటకాల మీద ఉందని ఆచార్య ఎ.బి. కీత్, బాణ కాదంబరిపై ఉందని డా. వి. వరదాచారి అభిప్రాయపడుతున్నారు.

ఈ బృహత్కథ విధానం-కథ రచనా విధానం-బౌద్ధ ధర్మ సంబంధిగా భావింపబడింది. "The Mahavaipulya Sutras of the Buddistic literature appears to contain the earliest Sanskrit legends in prose styled Ityukta and Vyakarana (Corresponding to the Itihasa Puranas in the Bramhanas) or legends in the form of parables styled as Avadana exhibiting many elements of the later animal fables and further = tales of pre-sages and wonders Adbhuta-Dharma and lastly special instruction in and discussion of definite = topic, dominated Upadesa and nitana". (91).

బృహత్కథాది రచనల కావ్యాంశ వైపుల్యానికిది ప్రయత్నం.

## 3. 4. 3. ఉపదేశ కథలు

జంతు కథలు (బీస్ట్ టేల్స్) లేక ఉపదేశ కథలు (డిడాక్టిక్ ఫేబిల్స్) గా ప్రసిద్ధి పొందాయి, పంచతంత్ర హితోపదేశాలు. వీటి కర్తృత్వం గూర్చి వివాద మధికం. తంత్రాఖ్యానం లేదా తంత్రాఖ్యాయిక పంచతంత్రంలో ఒక ప్రక్రియ. హితోపదేశం పంచతంత్రం మీద ఆధారపడి రచింపబడింది అయితే ప్రంచతంత్రంలో లేని కొన్నికథలు హితోపదేశంలో కూర్చబడ్డాయి. ఆనందభట్టు రచన 'పంచోపాఖ్యాన సంగ్రహము' (కథామృత నిధి) పంచతంత్రంలోని కథాకథన పద్ధతి భద్రపరచటానికి వ్రాయబడింది. పంచతంత్ర రచనాకాలం

క్రీ.శ. 510 పంచతంత్రంలో మిత్రలాభ, మిత్రభేద, విగ్రహ, లబ్ధప్రణాశ, అపరీక్షిత కారకాలు అయిదు భాగాలున్నాయి. హితోపదేశంలో మిత్రలాభ, సుహృద్భేద, విగ్రహ, సంధులు నాల్గు భాగాలున్నాయి.

జంతు కథలకు సంబంధించిన ప్రథమ గ్రంథం పంచ తంత్రం. "We have already pointed out that the oldest animal-fable known to us at present occur in the Chandogyopanishat" (92) అని తెలుస్తుంది. "The original text of this work has, it is true, undergone great alterations and cannot now be restored with certainity; but its existence in the 6 th century A. D. is an ascertained fact..."(93).

పంచతంత్ర కథలలో, కథ అంతా వచనంలో చెప్పబడి, సారాంశం వంటి విషయం కథ చివర శ్లోక రూపంలో చేర్చబడటం సాధారణ లక్షణం. "The maxim embodying the truth or point of the tale naturally stands in a different position from the more general didactic stanza; it must be capable of serving as an identification label or Katha Sangraha sloka, a verse that sums up the tale". (94).

పంచతంత్ర హితోపదేశాలలో ఒక కథలో వేరొక కథ కలిసిపోయి వుండటం, అనగా కథాంతర్గత కథగా వుండటం, ఆ రచనా పద్ధతిలో ఒక విధానం. "It was a distinctly artistic touch to complicate and enlarge the theme, not merely by combining a number of fables to from a book, but to interweave the fables so that the whole would become a unity." (95).

ఈ పంచతంత్ర హితోపదేశ కథలు తెలుగులో చిన్నయసూరి, కందుకూరి వీరేశలింగం పంతులు, కొక్కొండ వేంకటరత్నం పంతులు మొదలైన వాళ్లు మిత్రలాభం, మిత్రభేదం, సంధి విగ్రహం గ్రాంథిక శైలిలో శాబ్దిక వచన రచనగా కావించారు. ప్రాచీనాంధ్ర సాహిత్యంలో ఇటువంటి జంతుకథలు (ఉపదేశ కథలు) ఉన్నాయి కాని అంత ప్రాచీన కాలంలో వచనంలో లేవు.

ఆధునికాంధ్ర గ్రాంథిక వచనంలో చిలుకచెప్పిన కథలు, అపూర్వ చింతామణి కథలు, బేతాళ కథలు, ద్వాత్రింశత్సాల భంజికల కథలు, వ్యావహారిక భాషలో విక్రమార్క కథలు, పంచతంత్రం, దిలారాం కథ, కీరబహత్తరి కథలు మొదలైన అనేకం వున్నాయి. సంస్కృత కథానక సాహిత్య ప్రక్రియ ప్రభావం ఫలితంగా తెలుగు వచనంలో ఈ కథా పరిణామం సంభవమయింది

## 3.4.4 కల్పనా కథలు

అద్భుతోహలతో కల్పించిన గాధలు; సంస్కృత వాఙ్మయంలోని రచనలు ప్రాథమికంగా పసివాళ్ళ కుద్దేశింపబడ్డాయి. సింహాసన ద్వాత్రింశిక, శుకసప్తతి కథలు ఈ కోవ రచనలు.

సింహాసన ద్వాత్రింశిక తెలుగులో వుంది కాని వచనంలో లేదు. శుకసప్తతి కథల గ్రంథం తెలుగు వచనంలో లభిస్తుంది కాశీమజిలీ కథలు వచన గ్రంథం.

## 3.4.5 కథాఖ్యాయికలు

దండి దశకుమార చరిత్ర, సుబంధుడి వాసవదత్త, బాణుడి హర్ష చరిత్ర కాదంబరి రచనలకు సంస్కృతాలంకారికులు ప్రక్రియాదృష్టితో నామ నిర్దేశం స్పష్టంగా చేయలేదు. ఆంగ్ల విమర్శకులు వీటిని 'రొమాన్స్' అన్నారు. వీటిని కథాఖ్యాయికలని ప్రక్రియారూపంగా తలపవచ్చు. "Some efforts were made to discriminate the species of Katha or Akhyayika, though without success." అలంకారికులు చేసిన ఈ ప్రయత్నం గమనింపవచ్చు.

## 3.4.6 కథాఖ్యాయికా లక్షణం

భామహుడు, ఆఖ్యాయిక, వచనంలో సారస్వత ప్రక్రియగా, చెవి కింపు కలిగించే భాష కలదిగా, కథా ప్రకృతానుకూలంగా వుండి అవసరమయితే వక్త్రి, అపర వక్త్రి ఛందస్సులు కలిగి, ఉచ్ఛ్వాసాలుగా విభజింపబడి కథానాయకుడి చేత చెప్పబడుతూ ఉండాలని తెలిపి, కథ సంస్కృతంలోగాని, అపభ్రంశంలో గాని, కథానాయకుడిచేత చెప్పబడక, ఉచ్ఛ్వాసాలు లేక, ఛందస్సులేక,

వచనంలో సారసత్వ ప్రక్రియగా చెవి కింపుగా వ్రాయబడాలి అనీ లక్షణాలు స్పష్టపరిచాడు.

దండి, దశకుమార చరిత్ర రచయిత, భామహ కథాఖ్యాయికా లక్షణాలు తన కావ్యాదర్శంలో ప్రశ్నిస్తూ లక్షణ నిర్దేశం చేసే ప్రయత్నం సాగించాడు. కథాఖ్యాయికలు రెండూ సంస్కృతంలో శ్రుతిపేయం, ఆలంకారికం అయిన కథా కథనంతో ఉండాలని అంగీకరించి, కథా ప్రక్రియలో కథను కథానాయకుడు గాని మరెవరైనా గాని చెప్పవచ్చునని భావిస్తూ, లంబాలు అనే క్రొత్త విభజనం తెలిపి, ఉచ్ఛ్వాస విభజనం ఎందుకుండరాదని ప్రశ్నించి వక్త్ర, అపరవక్త్ర చ్ఛందస్సులెందుకు ప్రవేశపెట్టరాదని అడిగాడు. ఆ విధంగానే ఆఖ్యాయికా ప్రక్రియలో కథ, వక్త్ర, అపరవక్త్ర చ్ఛందస్సులతో ఉండి లంబాలుగా ఎందుకు విభజింపబడరాదని ప్రశ్నించాడు. దండి ప్రశ్నలకు ప్రక్రియ విషయంలో అవ్యవస్థ కారణం.

రుద్రటుడు కాదంబరిని, హర్ష చరిత్రను పరిశీలించి, కాదంబరిని కథగా, హర్ష చరిత్రను ఆఖ్యాయికగా స్వీకరించి, వాటికి సమగ్ర లక్షణాలు లేకపోవడం గమనించి, వాటికోసమే ప్రత్యేకంగా ఊహించి ప్రక్రియకు అయినట్లుగా లక్షణాలు తెలిపాడు. కథలో దేవగురువులకు నమస్కారంతో ప్రారంభంలో శ్లోకం, రచయిత జీవితం, వంశ వృత్తాంతం, సంస్కృత భాషలో కథాకథనం, కథారంభంలో అల్పంగా పూర్వగాథ, కన్యాలాభ, యుద్ధ విజయ, ధనాభివృద్ధుల వర్ణనం ఉండాలని తెలుపుతూ ఆఖ్యాయికలో దేవగురువులకు నమస్క్రియా శ్లోకం, అన్యకవుల ప్రసక్తి, రచయిత జీవితం వంశవృత్తం, సంస్కృత భాషలో కథాకథనం, ప్రత్యుచ్ఛ్వాసారంభంలో రెండు ఆర్యావృత్తాలు, కన్యాలాభ, యుద్ధ విజయ, ధనాభివృద్ధుల వర్ణనం ఉండాలని తెలిపాడు.

భామహుడు చెప్పిన కథాఖ్యాయిక లక్షణాలు పాటింపబడలేదు. దండి లక్షణాలు వ్యాకోచాత్మకంగా ఉండాలని తలచాడు. రుద్రటుడు బాణుడి కాదంబరి హర్ష చరిత్రలు సలక్షణాలుగా ఉండాలని వాటికోసమే లక్షణ కల్పనం చేశాడు. స్థూలంగా సంస్కృత కథాఖ్యాయికల లక్షణాలు అస్పష్టాలనీ, అనిర్దిష్టాలనీ చెప్పవచ్చు.

## 3.4.7 కథాఖ్యాయిలకా లక్ష్యాలు

బాణుడు రెండు గద్యగ్రంథాలు రచించాడు. హర్షచరిత్ర ఆఖ్యాయిక. హర్ష జీవితానికి ప్రతిబింబం. హర్షయుద్ధ పరాజయం ప్రస్తావింపవలసినచోట ఆగిపోయిన అసంపూర్తి రచన. కాదంబరి హర్షచరిత్రలలో హర్షచరిత్ర ఆద్య రచన. ఇది జీవిత చరిత్ర తుల్యం. కల్హణుడు రచించిన కాశ్మీర దేశరాజుల కథ రాజతరంగిణి వంటి రచనగా ఇది భావింపబడింది. భారతీయ కవులకు చారిత్రక దృష్టి తక్కువ అనటం ఉన్నా, వెలువడ్డ చారిత్రక గ్రంథాలివి.

తెలుగులో ప్రతాప చరిత్ర, సిద్ధేశ్వర చరిత్రం, రాయవాచకం, మధుర మంగా పుంశ్చలీ విలాసం, తంజావురాంధ్ర రాజుల చరిత్ర వచన రచనలు హర్షచరిత్ర కోవలోని చారిత్రక రచనలు. తెలుగులో వీటి అవిర్భావానికి సంస్కృత ప్రభావం వుంది. తెలుగు వచనం, అనంతర కాలంలో అనేక వచన కృతులు రావలసివున్నా, వెలువడలేదు.

సంస్కృతంలో కాదంబరి ఉత్తమ వచన కృతి. పునర్జన్మపై విశ్వాసం గతాగత జన్మల కలయిక శృంగార రస ప్రధానంగా చిత్రించే ఈ కథలో పాత్రలు గతజన్మ వాసనావిలసితాలుగా వున్నాయి.

తెలుగులో పద్యగద్య నాటక కావ్యాలుగా కాదంబరి కథ, మహాశ్వేత వృత్తాంతం వెలువడ్డాయి. ఈ రచన తెలుగులో ఆధునిక కాలంలోనే అవిర్భ వించింది.

బాణుడి హర్ష చరిత్ర, కాదంబరి-రెండింటిలో కాదంబరి ఉత్తమ సృష్టి. "On kadambari Bana has spent all his wealth of obser vation, Fullness of imagery and keenness of sympthy." (96) మనిషి హృదయ ధోరణులను. మానవాలోచనలను అత్యుత్తమ రీతిలో బాణుడు చిత్రించాడు. "Superb is Bana's power of description and he wields the language with greatest ease" (97). బాణ కాదంబరి సంస్కృత వాఙ్మయంలోనే కాదు ప్రపంచ కల్పనా సాహిత్యంలో ఒక మహోత్తమ శిఖరం.

దండి దశకుమార చరిత్ర, అవంతీ సుందరీ కథాఖ్యాయికలు వ్రాశాడు. దశకుమార చరిత్ర పూర్వ పీఠిక, ఉత్తర పీఠిక అని రెండు భాగాలుగా విభజింపబడింది. ప్రతి పీఠిక అయిదు ఉచ్ఛ్వాసాలుగా భాగింపబడింది. అవంతీ సుందరీ కథాసారంలో ఎనిమిది పరిచ్ఛేదాలు దశకుమార చరిత్రం మాత్రం తెలుగులోకి అనువదింపబడింది కాని వచనంలోకి కాదు.

దశకుమార చరిత్ర ఉత్తమ రచన అని భావించ నక్కర లేదు. భావ వ్యక్తీకరణం లోప భూయిష్ఠం. దండి అభిరుచి రహితుడా అనిపించేట్లున్న రచన. "Long compounds which constitute the life of prose are very rare occurance." (98). అయినా గుణాలు లేకపోలేదు. "Some of the descriptions are graphic and vivid." (99).

సుబంధుడివాసవదత్త వచన కృతి. గౌడీశైలి రచన. ఇది తెలుగు వచనంలోకి అనువదింపబడలేదు.

ధనపాలుడి 'తిలకమంజరి', వరరుచి 'చారుమతి', రామిలసోమిల 'శూద్రకకథ', శాతకర్ణి 'హరణ', మానవతి 'తరంగవతి' మొదలైన రచనలు కథాఖ్యాయికలు. ఇవన్నీ తెలుగు వచన రూపంలో మృగ్యాలు. ఈ కథాఖ్యాయికల వల్ల వచనం క్రొత్త లక్షణాలతో విలసిల్లింది. "The sentences became unduly long in descriptions. Little narration, more of description and absence of action came to charcterise prose." (100).

సంస్కృత కథాఖ్యాయికల వచనం తెలుగులో వచనైక గ్రంథాల, కల్పనాగాథల రూపంలో వచనంగా రూపొందింది

## 3. 4. 8. యాత్రాగ్రంథాలు - సంస్కృతాంధ్రాలు

యాత్రాగ్రంథ రచనావిధానం సంస్కృతంలో ఉంది. ఉత్తర దక్షిణ భారతదేశ యాత్రను చెప్పే యాత్రాప్రబంధ చంపూ గ్రంథం సమర పుంగవ దీక్షితులచే వ్రాయబడింది.

తెలుగులో ఇటువంటి యాత్రాగ్రంథాలు వెలిశాయి. అవి చంపువులుగా రచింపబడ లేదు. ఆధునిక వచనంలో ఆవిర్భవించాయి. ఏనుగుల వీరాస్వామయ్య 'కాశీయాత్రా చరిత్ర', కోలా శేషాచల కవి 'నీలగిరి యాత్ర', వేంకటేశ్వరయ్య 'గంగాసేతు యాత్ర', మండపాక పార్వతీశ్వర శాస్త్రి 'దక్షిణయాత్ర', మున్నంగి లక్ష్మీనరసింహశర్మ 'శ్రీశైలయాత్ర' పేర్కొనదగ్గ యాత్రా గ్రంథాలు.

## 3.4.9 చంపువులు - సంస్కృతాంధ్రాలు

సంస్కృత చంపువులు వచన పరిణామ దోహదకారులు. గద్య పద్యాత్మక మయిన చంపువులో గద్యస్థానం స్పష్టంగా నిర్ణయింపబడింది. "This, a mixture of prose and verse in campu, is hailed as the combination of vocal and instrumental music...This type of composition must have come into existence before the beginning of the christian era" (101).

తెలుగులో చంపూగత వచనం అత్యధికం. నేటి వచన రచనకు శాసన వచనం పుట్టుక అయితే, చంపూ వచనం బాల్యం.

## 3. 4. 10 నాటకాలు-సంస్కృతాంధ్రాలు

సంస్కృతంలో నాటక వచనం సంభాషణ శైలికి దోహదం చేసింది. తెలుగులో స్వతంత్ర నాటకాలు ఆధునిక యుగానికి పూర్వం లేవు. సంస్కృతానువాద నాటక వచనం గ్రాంథికం. తెలుగు స్వతంత్ర నాటకమైన కన్యాశుల్కంలో వచనం వ్యావహారికం. వర్తమాన దృశ్య కావ్య వచనం అధికంగా వ్యావహారికంగా వుంది.

తెలుగు వచనంమీద సంస్కృత గద్యం ప్రాచీన కాలంనుంచి తన ప్రభావం చూపుతూ వచ్చినట్లు, తెలుగు వచనారంభం, అభివృద్ధి తద్భాషామౌలిక లక్షణ సంబంధి అయినట్లు స్థూలంగా గోచరమవుతుంది.

19 వ శతాబ్ది ప్రారంభంనుంచి తెలుగు వచనం అధికంగా ఆంగ్లభాషా ప్రభావంవల్ల పరిణామం చెందింది. ఆ పరిణామం, తల్లక్షణాలు పరికింపవచ్చు.

వర్తమానాంధ్ర వచనం పూర్వంకన్న పరిణతమయినా, పరిపూర్ణత పొందిం దనటంకంటే, పరిణామ వాంఛితంగా ఉందనటం ఉచితం.

## 4. ఆంగ్ల వచన ప్రభావం

ఆంగ్లేయ పరిపాలనం ఆంగ్లవిద్యకు, ఆంగ్ల విద్య ఆంగ్ల సారస్వతాధ్యయ నానికి, తదధ్యయనం తత్ ప్రభావానికి దారితీశాయి. 19 వ శతాబ్ది ప్రారంభం నుంచి ఆంధ్రభాషా సారస్వతాలపై ఆంగ్ల ప్రభావం విస్పష్టంగా గోచరమవుతూ వుంది. 19 శతాబ్ది పూర్వంలేని, నేడున్న అనేక భాషా ప్రక్రియలు, శైలి, భావాలు చాల వరకు ఆంగ్లప్రభావాన్ని తెలుపుతాయి. పూర్వంలేని అనేక భిన్న రీతుల్లో నేడు వ్రాయబడుతున్న, భిన్న ప్రక్రియల్లో వాడబడుతున్న వచనం ఆంగ్ల ప్రభావాన్ని వ్యక్తీకరిస్తుంది. "The birth of prose, as we understand the term today was due very much to English influence"(102). "19 వ శతాబ్దమున వచన వాఙ్మయము అభివృద్ధికి వచ్చుటకు పాశ్చాత్య వాఙ్మయ ప్రభావము ముఖ్యహేతువు" (103).

ఆంధ్రవచనంమీద ఆంగ్ల వచన ప్రభావంవల్ల అది పరిణత మయింది. పూర్వం వచనం ప్రకటించలేని క్రొత్త విషయాలు తెలుగు వచనం ప్రకటించే సామర్థ్యం సముపార్జించింది. మునుపులేని అనేక వచన ప్రక్రియలు, నేడు తెలుగు వచన తేజస్సును పెంచుతున్నాయి. ఈ పరిణామాలకు మూలకారణ మయిన ఆంగ్ల వచనం పొందిన పరిణామం, అది కలిగివున్న ప్రక్రియలు పరిశీలిస్తే తెలుగు వచనంమీద దాని ప్రభావం వ్యక్తమవుతుంది. కనుక ఆంగ్ల వచన పరి ణామం, ఆంగ్ల వచన ప్రక్రియలు పరిశీలింపవచ్చు.

### 4.1 ఆంగ్ల వచన పరిణామం

ఆంగ్ల వచనం ప్రారంభం నుంచి పొందిన పరిణామం ఏడు దశలుగా విభజించి పరిశీలించవచ్చు. 7 వ శతాబ్ది నుంచి నేటిదాకా విభిన్న రీతుల్లో అభివృద్ధి చెందింది.

#### ఒకటో దశ (క్రీ.శ. 650 - 1550)

స్థూలంగా ఆంగ్ల వచనం 14 వ శతాబ్ది మధ్యకాలం దాకా పుట్టలేదని చెప్పవచ్చు. కాని 7 వ శతాబ్దిలో, సాహిత్యం కాకపోయినా, తత్సంప్రదాయ

బోధకంగా "The code of Laws of King's Inn" రచన వుంది. ఆల్‌ఫ్రెడ్ క్రీ.శ. (887) లో అనేక పండితుల సహాయంతో వ్రాసిన ఆంగ్ల వచనం అలభ్యంగా వుంది. "The prose of Alfred is simple, straight forward and clear, without any pretension to elegance" (104). "Alfred, the glorious king of Wess ex, was the pioneer of the Prose writers" (105).

ఆల్‌ఫ్రెడ్ క్రీ. శ. 997 లో బైబిల్ భాగాలు ఆంగ్ల వచనంలోకి అనువదించాడు. ఈ వచనం ఆనాటి పద్యంలా అలంకారికంగా వుంది. క్రీ. శ. 1023లో గతించిన ఉల్ఫ్‌స్టన్ పటిష్ఠమైన వచనం రచించాడు. నార్మన్ విజయంతో ఆంగ్ల భాష ఫ్రెంచి భాషా ప్రభావానికి లోనుకావటంతో ఆంగ్ల వచన రచన స్తంభించింది. దానితో మత సంబంధ రచనల్లో తప్ప ఆంగ్ల వచనం అప్రయుక్తమయింది. అయితే వాస్తవంగా ఆంగ్ల వచనం జాన్ ట్రివిసా (1328-1412) అనువాదాలతో ప్రారంభమయినట్లు చెప్పవచ్చు. ఈ కాలంలో ఆంగ్ల వచన రచయితలు చాసర్, వైక్లిఫ్ ప్రముఖులు (1350-1400). "...but towards the middle of the 14th century Englishmen began some what timidly to use prose as the vehicle for orginal work" (106). 15 శతాబ్దిలో జాన్ కాప్‌గ్రేవ్ (1393–1464), రిజినాల్డు పీకాక్ (1395–1460), సర్ జాన్ ఫోర్టెస్క్యూ (1394-1476) పేర్కొదగ్గ వచన రచయితలు. "Instruction in manners and in cookery, scrvice books and didactic essays, as well as old romances copied and modernized, and chronicles growing briefer and simpler, helped to formalize the middle class with books and with written as an instrument of communication" (107). లాటిన్ ప్రభావం విద్యావంతులపై ఇంకా తగ్గలేదు. ఆంగ్ల వచనంలోకి అనువాద రచనం స్పష్టం జరగలేదు. క్రీ.శ. 1474 లో విలియం కాక్స్టన్ ముద్రణా కార్యం ప్రారంభించే దాకా ఆంగ్లవచనం వ్యవస్థీకరింపబడలేదు. ఆ పైన ఆంగ్ల వచనంలో ఆకస్మిక పరిణామం సంభవించింది. అనేక కథాఖ్యాయికల వచనానువాదాలు ముద్రింపబడ్డాయి.

తెలుగులో ప్రథమ వచన రచనశాసనాలవల్ల లభిస్తుంది. అది తెలుగు వ్యావహారికంలో ఎక్కువగా వుంది. ఆంగ్ల వచనం కొంచెం ఆలస్యంగా తెలుగు వచనంతోపాటు పుట్టింది. ఆంగ్లంలో లాగా ఆంధ్రంలో మత సంబంధి రచనలు ప్రప్రథమంగా జరిగాయి. ఆంగ్ల భాష నార్మన్ విజయంతో ఫ్రెంచి భాషవల్ల ప్రభావిత మయినట్లు ఆంధ్ర భాష రాజరాజ నరేంద్రుడి కాలంలో సంస్కృతం వల్ల అనువాద రూపంలో ప్రభావితం కావటం స్పష్టంగా గ్రహింపబడింది. తద్విధంగా వచనమూ ఏర్పడింది. తెలుగులోనూ, ఆంగ్లంలో లాగా, ముద్రణా సౌకర్యాలు ఏర్పడ్డ తరువాత వచన రచన విస్తృతంగా జరిగింది. 7వ శతాబ్దినుంచి 16 వ శతాబ్దిదాకా, ఆ పైన 19 వ శతాబ్ది దాకా ప్రభావం చెప్పే అవకాశం లేకపోయినా, వచన పరిణామంలో ఏర్పడ్డ కొన్ని సమాన లక్షణాలు గుర్తింపవచ్చు.

## రెండో దశ [క్రీ. శ. 1550- 1620]

ఈ దశలో వచనం బహు విషయ విన్యస్తంగా వుంది. "Pamphleteering of all kinds, Political religious arguement, political, educational and literary, theorizing, flourish now as never before, with the result that the literary historion has to deal with a mass of miscellaneous prose." (108). ఇంతేగాక వైద్యం, వేట, రాజకీయాది అనేక విషయాలు ఫ్రెంచి లాటిన్ నుంచి వచనానువాదాలున్నాయి. చరిత్ర, జీవిత చరిత్ర వేదాంతం వంటి అనేకం వచన రూపం పొందాయి. ఈ సమయంలో రెండు-దేశి, మార్గ-భిన్న సంప్రదాయాల ఫలితమైన వచనం ఆవిర్భవించింది. నిర్మాణంలో లోపాలు, వాదంలో పటిష్ఠత లోపించటం వచనంలో ఈ కాలంలో కన్పించాయి. సిసిరో రచనా విధానం కంటె, సెనెకా రచనారీతి అవలంబింపదగిందిగా భావింపబడింది. "but the impression one gets of Elizabethan prose is one of astonishing richness and freedom," (109). ఈ సమయంలో ఆంగ్ల వచనం స్మరణీయ స్థితిని పొందింది. "The prose of the middle of the 16th century-as we see it exemplified in the earliest Englieh critic, Sir Thomas wilson; the earliest English pedagogue, Roger Ascham; the distinguished humanist, Sir John Cheke is clear, unadorned and firm, these English men holding themselves found to

resist the influenes which were in favour of elaborate verbiage and tortured construction." (110).

తెలుగు వచనం కందుకూరి వీరేశలింగం పంతులు కాలంలో గ్రాంథిక, వ్యావహారిక రచనా రీతులలో నూత్న విషయ గ్రహణంతో పొందిన పెంపుదలకు తుల్యంగా ఆంగ్లంలో ఈ కాలంలో వచనం పొందిన పరిణామం కనిపిస్తూ వుంది.

## మూడో దశ [క్రీ. శ. 1620–1700]

ఈ దశవచనంలో ప్రధానంగా మత విషయాలు అధికం. పాత్రీకరణలు కూడా ఎక్కువగా వ్రాయబడ్డాయి. వ్యాసం, జీవిత చరిత్రలు విస్తృతి పొందాయి. "The seventeenth century was a period in the use of language in prose when a demand for the plain and a taste for the subtle went together" (111). ఈ దశలో వచనంలో హాస్యం, అపహాస్యం ఉన్న రచనలు, యాత్రాగ్రంథాలు, నవలలు సృజింపబడ్డాయి. ఈ దశలోని ఉత్తమ వచన రచయిత డ్రైడెన్ పూర్వ వచనంలో లోపాలు దిద్ది, ఉత్తమ వచన పథం నిర్మించాడు. ఈ సమయంలోనే వచన శైలిపై విపరీత చర్చ జరిగింది సిసిరో శైలివంటి ప్రాచీన, శాబ్దిక, ఆలంకారికా భాషాదృష్టి ఉన్న శైలికంటే భిన్నంగా వ్యావహారిక స్థితి ఉండి, కాఠిన్యం లేని శైలి కోరుకోబడింది. "Many participated in a deliberate effort towards the anticiceronian manner preferring conciseness, energy, liveliness and strength in prose and witty point making to pleasing sound." (112). భిన్న దృక్పథాలతో బేకన్, డన్నె, బర్టన్, జరిమి, టైలర్, హోవెల్, టల్లర్, మిల్టన్, ఐజక్ వాల్టర్ వంటి ప్రముఖులు - ఆంగ్ల వచనాభివృద్ధి కావించారు.

తెలుగులో వ్యావహారిక, గ్రాంథిక శైలీ వివాదాలు జరిగి, నన్నయ-చిన్నయ గ్రాంథిక శైలి కంటే కందుకూరి పరిణత భాషాశైలి గురజాడ, గిడుగు వ్యావహారిక శైలికి మార్గం ఏర్పరచింది.

## నాలుగో దశ [క్రీ. శ. 1700–1780]

సాంఘిక సాంస్కృతిక రంగాల్లో అభివృద్ధి దర్శించిన వచనం శాస్త్ర విషయికంగా, వేదాంత సంబంధంతో మార్పు పొందింది. వార్తా పత్రికలు, పత్రికా రచనం మొదలై వచనం ఉపయోగకరంగా రూపొందింది. ఈ దశలో వచనం మిక్కిలి సహజంగా, సుకరంగా తయారయి భాషా ధర్మం ఇనుమడింపజేసింది. సాహిత్య విమర్శనం పటాటోపం తగ్గి కలకదేరింది. ఈ దశలో

ఎప్పుడూ లేనంత సామాజిక స్థితి వచనం పొందింది. అపహాశన రచనలు, నవల, స్వీయచరిత్ర బాగా అభివృద్ధి చెందాయి. "Control of diction, felicity of phrasing, beauty of surface, these are the qualities which distinguish the prose artists of this period, especially the later part" (113).

ఈ దశలో డెఫో, స్విఫ్ట్, బర్కెలీ, స్టీల్, అడిసన్, అలెగ్జాండర్ పోప్, హెన్రీ ఫీల్డింగ్, శామ్యూల్ జాన్‌సన్, ఆలివర్ గోల్డ్‌స్మిత్ మొదలైన రచయితలు వచనాభివృద్ధి కావించారు. "The result is a prose eloquent, balanced, and flexible;more rapid than Johnson's and graver than Addison's capable of both descriptive splendour and dry irony." (114).

ఆంగ్ల వచనంలో పూర్వమెప్పుడూ లేని వైవిధ్యం, సహజత, ఈదశలో ఏర్పడ్డాయి.

తెలుగు భాషలో 19వ శతాబ్ది ద్వితీయార్థంలో పత్రికా వ్యాసంగం మొదలై, వచనంలో ప్రాచీనాధునిక సారస్వత విషయాలు, సాంఘిక సాంస్కృతిక సంగతులు వ్రాయబడ్డ స్థితిలో, ఈ ఆంగ్లదశకు సమానంగా తెలుగు వచనం గోచరమవుతూ వుంది.

## అయిదో దశ [క్రీ. శ. 1780-1830]

ఈ దశలో చార్లెస్ లేంబ్, విలియం హేజ్‌లిట్, థామస్ డీక్విన్సీ ప్రముఖులైన వచన రచయితలు. కవిత్వానికి, నవలకు ఈ కాలం స్వర్ణయుగం. కవులనేకులు వచన రచయితలుగా రూపొంది ఈ దశలో భిన్నావసరాలకు భిన్న వచన శైలులు ఉపయోగింపవచ్చునన్న భావాలపై ఆధారపడి వచన రచన చేశారు. సున్నితం, నాగరకం అయిన సమాజం వీళ్ళ రచనల్లో ప్రతిబింబించింది, రచనల మార్గం నిర్ణయించింది. ఈ దశ రచయితలు రచనా వస్తువును, తీవ్ర భావ వ్యక్తీకరణను, సక్రమ శైలికంటె, వాంఛించారు. "Though some Romantic poets, Coleridge, Shelley, Keats, Byron-wrote excellent prose in their critical writings, Letters and Journals, and some of the novelists like Scott

and Jane Austen were masters of prose style, those who wrote prose for its own sake in the form of the essays and attained excellence in the art of psore writing were Lamb, Hazlitt and Dequincy." (115).

ఈ దశలో వచనం, పూర్వంలా విభిన్న రీతులలో వ్రాయబడుతూ, విభిన్న ప్రక్రియా రచయితల మూలంగా అభివ్యక్తమయింది.

తెలుగులో భావకవులు, ప్రాచీన కవితా సంప్రదాయబద్ధులైన కవులు 1930 ప్రాంతంలో తెలుగులో చేసిన వచన రచనలు అంగ్లంలోని ఈ దశ వచనంతో పోలుతున్నాయి.

## ఆరో దశ [క్రీ. శ. 1830-1880]

వార్తా పత్రికలు, సాహిత్య పత్రికలు పెరిగి దైనందిన జీవిత విశేషాలకు; నవల పెరిగి సాహిత్య జీవిత వైవిధ్యానికి ప్రయోజనం అధికంగా కలిగించిన సమయమిది. కళ కళకోసమే కాకుండా లోకానికి నీతిబోధ చేయాలని వచనానికి ఒక ప్రయోజనం ఏర్పడింది. టెన్నిసన్, బ్రౌనింగ్, కార్లైల్, రస్కిన్ ఈ దృష్టితో రచన చేశారు. డికెన్స్, థాకరీ, జార్జ్, ఇలియట్ మానవ జీవిత యాథార్థ్యాన్ని వచనంలో ప్రదర్శింప ప్రయత్నించారు. "Collectively Victoaian historians and writers of memoirs, scientists, travellers and social critics are not easily over - matched" (116). ఈ దశ వచన లక్షణాలు గమనింపదగి వున్నాయి. "Copiousness, Number and wide variety of styles (not excluding nearer anb more remote resemblances between them). Unevenness of quality. Seriousness of tone and moral engagement. Concreteness and particularity". (117). ఈ దశలో చరిత్ర ప్రాధాన్యం, తత్త్వరచన బాగా కనిపిస్తున్నాయి. శాస్త్ర విజ్ఞానం వచనంలో డార్విన్, హక్స్లే రచించారు. మత సంస్కృతులపైన అర్నాల్డు. సాహిత్య విమర్శ ప్రశస్తంగా భావింపబడింది. స్వేచ్ఛాతత్వం, మానవతావాదం, చారిత్రక మానసికం అయిన మత వ్యాఖ్యానం వచనంలో పెరిగి పోయింది. వచన రచనం స్పష్ట సంప్రదాయ

రాహిత్యం వల్ల రచయితలు తమ ఇష్టా నిష్టాలు, అభిరుచులు అనుసరించి వచనం రూపొందించారు. లయకు, సమతకు భిన్నమయిన పదజాలానికి, కల్పనకు అవకాశం ఇస్తూ సమర్థం, పటిష్ఠం, పూర్ణం అయిన వచనం వ్రాయబడింది. "This energetic mood prescribes the inventiveness and fertility of the prose-writers of the period, and explains the vitality of so many of their works" (118).

తెలుగులో ఇంత వచన వైవిధ్యం ఉన్నా, ఇంతటి స్థాయి ఇంకా పొందవలసి వుందని భావింపబడుతున్నది.

## ఏడో దశ [క్రీ. శ. 1880 తర్వాత]

ఈ దశలో వచనంలో వ్రాయబడ్డ విషయ వైవిధ్యం పూర్వమెప్పుడూ లేనంత అధికం. ఇప్పుడు శైలి విషయంలో తీసుకోబడుతున్నంత శ్రద్ధ మునుపెప్పుడూ లేదు. పదజాలం, వాక్యనిర్మాణం మొదలయిన వచన రచనలకు సంబంధించిన సర్వవిషయాలు కూలంకషంగా పరిశీలింపబడ్డాయి. నేటి ఆంగ్ల వచనం శాస్త్ర కళా జీవితరంగాలలోని అనేకాంశ బోధకంగా వుంది. ఈ యుగం వచన రచయితలలో యఫ్.యన్. లూకాస్, ఇ.యం. ఫార్స్టర్, హెన్రీ జేమ్సు, డబ్ల్యు.బి. యేట్స్, టి.ఎస్. ఇలియట్, ఎజ్రాపౌండ్, డి.హెచ్. లారెన్స్ కొందరు మాత్రమే. అన్ని ప్రక్రియలు పూర్వం కన్న సమర్థంగా రూపొందాయి. నూత్నభావ సందోహాలు రచనంలో చోటుచేసుకొన్నాయి. నేటి వచన పదరూపం అత్యుత్తమస్థితి నందుకొంది ప్రపంచ వాఙ్మయంలో ఆంగ్ల వచనం సముచిత స్థానం పొందివుంది.

తెలుగు వచనం ఇంతటి స్థానం పొందినట్లు సాక్ష్యం కావలసివుంది. తెలుగులో నేటి ప్రక్రియా వైవిధ్యంవల్ల వచనం ఉన్నత దశలకు చేరుకొంటూ వుంది.

ఆంగ్ల వచనం ప్రారంభంలో స్పష్టత సంక్షిప్తతలు కలిగి వ్రాయబడి క్రమక్రమంగా కఠినత్వం, అస్పష్టత, అసంక్షిప్తతలు సంతరించుకొని, సామాన్య వ్యక్తీకరణకు దూరమయి, మళ్ళీ నెమ్మదిగా డ్రైడెన్ కాలంనుంచి, స్పష్టత సంక్షిప్తత, అక్లిష్టత, కోమలత్వం ఏర్పరచుకొంది. ఈ వచనం సాహిత్యపరంగా,

శాస్త్రపరంగా అభివృద్ధిచెంది, రెండు భిన్నదశలను ప్రదర్శిస్తూ వుంది. నేటి ఆంగ్లవచనం ఉత్తమశైలీ సమంచితమై, సర్వ భావవ్యక్తీకరణ సమర్థమై వుంది.

ప్రకృతిని, మానవ ప్రకృతిని స్పష్టంగా చూపే ఔన్నత్యం ఆంగ్ల పద్యం కంటె అధికంగా ఆంగ్లవచనం కలిగి వుంది.

## 4. 2 ఆంగ్ల వచన వైవిధ్యం

ఆంగ్లవచనం ఆవిర్భవించిన నాటినుంచి ఏ ఏ ప్రక్రియాగతంగా వుందో ఏ ఏ విధంగా వ్రాయబడిందో గమనిస్తే, ఆంధ్రవచనం పొందిన, పొందవలసిన స్థానం, ఆంగ్ల ప్రభావం స్పష్టమవుతాయి. ఏ భావ వ్యక్తీకరణకు వచనం ఏ ప్రక్రియగా రూపొందిందో ఏ ప్రక్రియాగతంగా జీవితం ఎంత ప్రవర్తిల్లుతూ వుంటుందో అర్థమవుతాయి.

### 1. విమర్శనం

16 వ శతాబ్దిలో విమర్శన వచనం పుట్టింది. రోగర్ అస్కిమ్, సర్‌జాన్ చీకె, థామస్ విల్సన్ కేంబ్రిడ్జిలో ప్రారంభించారు. 17 వ శతాబ్దిలో బేకన్, బెన్ జాన్‌సన్, ఈ విధ రచనకు దోహదం చేశారు. ఇంతవరకు సాహిత్య పరమైన విమర్శనమే జరిగింది. అంత సమర్థంగా ఈ యుగంలో విమర్శనం జరగ లేదు. 18 వ శతాబ్దిలో విమర్శన వాఙ్మయం అధికంగా విస్తరిల్లింది. 19 వ శతాబ్ది విమర్శకులు వ్యాస రచయితలై ఉండటంతో వ్యాస విమర్శక వాహిక అయింది.

### 2. చరిత్రం

క్రీ. శ. 1547 లో చరిత్ర సంబంధి రచన మారంభమయింది. ఇది దాదాపు పత్రికా రచనంలాగా భావింపబడుతున్నది. ఇది దేశ చరిత్రకు, ప్రాచీనతకు సంబంధించినది. ట్యూడార్, రాఫెల్ హోలిన్‌షెడ్ మొదలయినవాళ్ళు ఆద్యులు. 17 వ శతాబ్దిలో థామస్ బ్రౌన్ థామస్‌ఫుల్లర్, ఐజక్‌వాల్టన్, సర్ థామస్ ఉర్కార్ట్ రచించారు. అపైన ఈరచనంలో సర్వోత్కృష్టంగా ప్రసిద్ధుడు గిబ్బన్. దేశ చరిత్ర రచన వచనంలో విరివిగా జరిగింది.

## 3. కల్పనా సాహిత్యం

"prose fiction, regularly produced, is one of the numerous gifts of the Elizabethans to our literature" (119).

విలియం పెయింటర్ 'పేలెస్ ఆఫ్ ప్లెజర్'లో నూటొక్క గాథలున్నాయి. ఆపైన అనేకులు అనువాద, స్వతంత్ర కల్పనా కథలు రచించారు. సర్ జఫరే ఫెంటన్, జార్జి జాన్‌లిలీ మొదలైనవాళ్ళు ఆద్యులు.

## 4. వివాద సాహిత్యం

ఈ వివాద సాహిత్యం ప్రధానంగా వచనంలో కరపత్రాలు వ్రాయటాన్ని గూర్చి తెలుపుతుంది. 16 వ శతాబ్ది కరపత్రాలు మత సంబంధ వివాదం తెలిపాయి.

## 5. అనువాదం

ఆల్‌ఫ్రెడ్ కాలం నుంచి బైబిల్ ఆంగ్ల వచనంగా అనువదింపబడుతూ వచ్చింది. ఇప్పుడు లాటిన్ నుంచి, ఫ్రెంచి నుంచి వివిధ ప్రక్రియలు అనువదింపబడ్డాయి. తొలి అనువాదాలలో సెనెకా రచనలు ప్రజాదరణ పొందాయి. చరిత్రలు అనువదింపబడ్డాయి. కల్పనా గాథలు, ఇతిహాస రచనలు ఆంగ్లంలోకి వచ్చాయి. ఫ్రెంచికంటె ఇటాలియన్ ఈ అనువాదాలలో ఎక్కువ ప్రాధాన్యం వహించింది. 16వ శతాబ్ది ఉత్తరార్థం 17వ శతాబ్ది పూర్వార్థం అధికంగా అనువాద కాలం.

## 6. వేదాంతం

బేకన్ రచన ఎడ్వాన్స్‌మెంట్ ఆఫ్ లెర్నింగ్ (1605) ఈ రంగంలో ప్రథమ రచనగా భావింపవచ్చు. హూకర్ ఈ రంగంలో ముందే కృషి చేశాడు. ఆంగ్ల వచనం వేదాంతంగా విస్తృతి పొందింది. బేకన్‌కంటె ముందు పలువురు ఈ రచన చేశారు. బేకన్ తరువాత హబ్బెస్ వేదాంత రచయిత. బర్కెలీ, హ్యూమ్, ఆడమ్ స్మిత్, జాన్ స్టూవర్ట్‌మిల్, థామస్ హెన్రీ, హక్స్‌లే మొదలైన అనేకులు ఈ విషయాన్ని ప్రముఖంగా చేశారు.

## 7. రాజకీయార్థిక సాహిత్యం

అంగ్లేయుల జీవితంలో రాజకీయార్థిక రంగాల చైతన్యం ప్రపంచ చరిత్రను దాదాపు నూరేళ్ళు శాసించింది. ఈ ఆధిక్యం సాహిత్యంలో ప్రవేశించింది. ఈ రంగాలలో మొదటి రచనలు 16, 17 శతాబ్దులలో ఆవిర్భవించాయి. సర్ జాన్ ఫోరెటస్ క్యూ, సర్ థామస్ స్మిత్, జాన్ సెలెడెన్ మొదలైనవాళ్ళు 15, 16 శతాబ్దుల్లో ఈ విధమైన రచచలు ప్రారంభించారు. 18వ శతాబ్దిలో జాన్‌విల్ కెన్, చార్లెస్ చర్చిల్, సర్ ఫిలిప్ ఫ్రాన్సిస్ మొదలైనవాళ్ళు అభివృద్ధి కావించారు.

## 8. ప్రజా సాహిత్యం

15వ శతాబ్ది చివరి భాగంలో రాజకీయంగా కొంచెం స్వేచ్ఛ లభించటంతో ప్రజాసాహిత్యం జన్మించింది. థామస్‌లాడ్జి 'ఏన్ అలారమ్ ఎగెన్స్ట్ యుజరర్స్' (1584) మొదలైన రచనలు, థామస్ నాష్ రచనలు, మార్ప్రిలేట్ వివాదం, అవహేళన రచనలు బాహుళ్యం పొందాయి. జోసఫ్ హాల్, థామస్ డెక్కర్ మొదలైన పాత్రీకరణ రచయితలు సంఘ శాసనం ప్రారభించారు. ఆధునికాలోచనంతో ప్రజా సాహిత్యంలో 17వ శతాబ్దిలోని దయ్యాల వివాదం (విచ్ కాంట్రవర్సి) ప్రసిద్ధం. సాహిత్యం సామాన్యుణ్ణి చేరిన సన్నివేశమిది.

## 9. చారిత్రక రాజకీయ రచనలు

చారిత్రక దృష్టితో' రాజకీయ చైతన్యం కోరే రచనలు అనేకం పుట్టాయి. రాజకీయాలు ఆర్థికంగా కలిగించిన పరిణామం ఒక ప్రక్క, చరిత్ర దృష్టిలో రాజకీయమైన మార్పు మరొక ప్రక్క అంగ్ల వచనంలో రూపం దిద్దుకొన్నాయి. జేకన్ హెన్రీ పాలన చరిత్ర, లార్డ్ హెర్‌బర్ట్ హెన్రీ పాలన జీవితం ఈ విధమైన రచనలు. ఇటువంటివి అనంతర చరిత్రలో అనేకం వచ్చాయి.

## 10. పత్రికా రచనం

నాగరిక జీవితానికి వార్తలు తప్పనిసరి. వాటి ప్రకటనం అత్యవసరం. ముద్రణావకాశంతో అది విస్తృతమయింది. ఆంగ్లంలో థామస్ ఆర్చర్ (1621) ఈ రచన మారంభించాడు, నథానియేల్ బట్లర్, నికొలస్ బర్నె ఆర్చర్ అనుసరించారు, హెన్రీవాలీ తర్వాత శామ్యూల్ పెకి పత్రికా వ్యాసంగం పేర్కొనదగ్గ

స్థాయిలో జరిగింది. పత్రికా రచనం క్రమక్రమంగా అభివృద్ధిపొంది సంఘ సంస్కరణ దాకా పెరిగింది. 18వ శతాబ్దిలో అధికంగా 19వ శతాబ్దిలో విప రీతంగా పత్రికా రచనం జరిగింది.

## 11. మత రచనలు

మతాధికారులు, సామాన్యులు మత విషయంలో వాదవివాదాలకు లోన వుతూ వుండే మత విషయంలో నూత్న దృక్పథం సాహిత్య రీతిలో వెలువ రించాడు జార్జి పాక్స్ (1624-90). థామస్ ఎల్‌వుడ్ (1639-1713), విలియం పెన్, ఈ క్వాకర్ ఉద్యమం సాగించారు.

## 12. జ్ఞాపకాల లేఖల రచనం

దిన చర్యలు, లేఖలు, వ్యక్తి హృదయ దర్పణాలుగా సాహిత్యాభివ్యక్తి కలిగి వున్నాయి. జాన్ ఎల్విన్ (1620-1706), శామ్యుల్ సెపిక్ (1633-1703) ఈ కోవ రచనలు చేశారు. ఆ పైన అనేకం వెలువడ్డాయి.

## 13. న్యాయశాస్త్రం

న్యాయశాస్త్ర సంబంధి రచనలు వచనంలో సాహిత్యస్థాయి పొంది వుండటం గమనార్హం. మాత్యూ, హాలే, థామస్ హబ్బెస్, జాన్ లాకే 17వ శతాబ్ది రచయితలు న్యాయశాస్త్ర సాహిత్యం సృష్టించారు. ఆపైన ఈ రచన బాగా ప్రవర్తిల్లింది.

## 14. వ్యాసం-ఆధునికాంగ్లవచనం

బేకన్‌తో, మాంటేన్ ప్రభావం వల్ల ప్రారంభమయిన వ్యాసం భిన్న రీతుల్లో సాగి వచనం అభివృద్ధికి దోహదం చేసింది.

## 15. నవల

డేనియల్ డెఫో (1659-1731)తో ప్రారంభమై భిన్న రీతుల్లో రచింప బడింది. మానవుడి హృదయాన్నీ, సమాజపు గుండెనూ స్పృశించింది. వచనం నవల వల్ల అభివృద్ధి చెందింది.

## 16. బాల సాహిత్యం

బాల బాలికలకు విషయం, విజ్ఞానం బోధించే సాహిత్యం వచనంలో వెలువడింది. హ్యూ రోడెస్, థామస్ వైటో 16వ శతాబ్దిలో పిల్లలకు పుస్తకాలు రచించారు.

## 17. పుస్తక విమర్శలు

19వ శతాబ్దిలో పత్రికలు ప్రారంభమయ్యాయి. వాటిలో పుస్తక విమర్శలు అధికంగా చోటు చేసుకొన్నాయి. 'రివ్యూ', మాగజైన్' పత్రికలు పుస్తక విమర్శలు ఎక్కువగా ప్రచురించాయి.

## 18. యాత్రా సాహిత్యం

18, 19వ శతాబ్దులలో అధిక యాత్రా సాహిత్యం ఆత్మాశ్రయంగా, పరాశ్రయంగా వెలువడింది. విలియం, డేం పియర్ (1652-1715) వాలిస్, కార్టెరెట్, జేమ్స్ కుక్, జార్జి మెకవర్ ఈ సాహిత్య సృష్టి కావించారు.

## 19. శాస్త్ర సాహిత్యం

శాస్త్ర రంగంలో సాధింపబడ్డ అభివృద్ధి శాస్త్రజ్ఞులకు, తద్విద్యార్థులకే కాక, సామాన్యులకు వ్రాయబడటం ఉద్దేశింపబడగా ఆ రచన సాహిత్యపరంగా రూపొందింది. ఐజక్ న్యూటన్, మైకల్ ఫేరడే, సర్ జోసఫ్, జ్ఞాన్ థామ్సన్ మొదలైన వాళ్ళు శాస్త్ర విషయం సాహిత్యంగా రూపొందించారు.

## 20. కథానిక-నాటక, పాత్రీకరణల వచనం

కథా కల్పనకు, సంభాషణకు, పాత్ర చిత్రణకు వచనం ప్రయుక్తమయింది.

## 21. జీవిత చరిత్ర, స్వీయ చరిత్ర

వ్యక్తుల జీవితాలు వచనంలో సాహిత్య ప్రకియలుగా వ్రాయబడటంతో సాహిత్యం సామాజికాత్మీయంగా తయారయింది.

ఆంగ్లంలో వచనం పరిధి విస్తృతం కాదు. విమర్శ వచనాన్ని విమర్శనంగా, నవలా వచనాన్ని నవలగా, కథా వచనాన్ని కథగా పిలవటంతో వచనం నవల, కథ విమర్శనాది ప్రక్రియలకు భిన్నంగా వచనం భావింపబడుతూ వుంది. వచన మంటే ఆంగ్లంలో సాధారణంగా వ్యాస రచన కుద్దేశింపబడ్డ భాషగా చెప్పబడుతుంది.

ఆధునికాంధ్ర వచనంలో, ఆంగ్ల వచనంలోని అన్ని ప్రక్రియలు ప్రవేశించాయి. శిల్పం, శైలి ఆది అనేక రీతులు ఆంగ్లంలో లాగా తెలుగులో రూపొంది, ఆంధ్ర వచనం సమృద్ధమయింది. ఆంగ్ల వచన పరిణామం వల్ల, ప్రక్రియా వైవిధ్యాల వల్ల ప్రభావితమయిన తెలుగు వచనం ఆంధ్ర జాతి జీవితానికి వెన్నెముక అయింది.

## 5. వచన తత్త్వం

తెలుగు వచనం శాసనాల, చంపూకావ్యాల, వచనముల, వచనగ్రంథాల స్వరూపంలో వికాసం చెందింది. అది, అనువదింపబడ్డ సంస్కృత సాహిత్యం వల్ల తెలుగు సాహిత్యం సంపన్నమయిన సన్నివేశంలో సంస్కృత గద్యం వల్ల పరిపుష్టమయింది. అది, పాశ్చాత్యసాహిత్య ప్రభావ సందర్భంలో ఇంగ్లీషు ప్రోజువల్ల శక్తిమంత మయింది. నేటి తెలుగు వచనం త్రిగుణీకృత తేజస్సుందరం.

తెలుగు వచనం యొక్క ప్రారంభం, పరిణామం, అస్తిత్వం, ప్రక్రియా వైవిధ్యం ఏ భాషాసాహిత్యంలోని వచనంతోనైనా పోలితే పోలవచ్చు. కొన్ని సందర్భాలలో అది ప్రభావ ఫలితంగా, కొన్ని సమయాలలో ఆది తెలుగు సాహిత్యం ప్రత్యేకతగా అనిపించనూవచ్చు. అయితే, ఏ భాషా సాహిత్యంలో అయినా వచనం వ్యక్తం చేసే సారస్వత ధర్మ స్వరూప స్వభావాలు స్థూలంగా విభిన్నం కావు. అందువల్ల వచనం, ఏ భాషా పరిధికీ పరిమితం కాకుండా, అన్ని భాషల ధర్మాలనూ తనలో నిక్షిప్తం చేసుకొని, ప్రత్యేక తత్త్వం కలిగివుంది. ఆ వచనతత్త్వం గుర్తించటం కర్తవ్యం.

## 5.1. వచన స్వభావం

ఆధునిక నాగరక జీవితావసరాల వల్ల వచనం ప్రధాన భూమిక వహించింది. సమాజంలో భౌతికత పెరిగి బుద్ధి జన్య వచనం అత్యవసరమయింది. ఈ యుగ యంత్ర ధర్మం వచన దోహదకారి అయింది. ఆధునిక మానవ మనస్తత్వంలోని వేగం వచన ప్రాధాన్యం ప్రదర్శించింది. శాస్త్ర విజ్ఞానంలో అసందిగ్ధతా కాంక్ష వచనా విర్భూతికి సహాయం చేసింది.

వచనం, నిశ్ఛంద రచనగా, జాగరూకమైన సాహిత్యాభివ్యక్తి యొక్క భిన్న రూపాల కలయికగా, స్పష్టమయిన ఆలోచన పొందిన ఋజునిర్మాణంగా, సందేహ నిరవకాశ శాస్త్ర రచనంగా, సరళ క్లుప్త భావ విస్పష్ట ప్రకటనంగా, హేతువునకూ వాస్తవానికీ సత్య సందర్శనం చేయించే సమర్థ దశగా గుర్తింప దగివుంది.

చెప్పదలచిన అభిప్రాయాలను సంపూర్ణంగా, స్ఫుటంగా, వెనువెంటనే గోచరమయ్యేటట్లు, నిరవరోధంగా, అబాధితంగా చెప్పగలిగిందే ఉత్తమ వచనం. అలంకారిక ధోరణికీ, స్వాధీనం కాని ఆవేశ ప్రదర్శనకీ, ఉత్తమ వచనంలో అవకాశం తక్కువ.

ఒకసారికంటె ఎక్కువగా చదవబడవలసిన అవసరం లేనట్లుగా భావింపబడ్డ వచనం, చదవగానే స్పష్టమయితే, అది ఉత్తమం. ఒడిదుడుకులు, కుదుపులు, ఊపులు లేకుండా క్రమంగా నిర్దిష్ట పథంలో సాగే వచనం, పఠన యోగ్యత పెంచుకొని, ధారావాహికత కలిగి, ప్రయోజనకారిగా రూపొందుతున్నది.

సరళమై, శబ్దాలంకార శూన్యమై, వీలయినంత వ్యావహారికమై, సంక్షిప్తమై, విషయం వెంటనే బోధించేంత సమర్థమై వ్రాయబడ్డ వచనం అధికంగా ప్రయోజనకారి అవుతుంది. వచన రచయితలందరూ పండితులు కానక్కరలేదు కనుక ఆ రచయితలు తమకు ముఖ్యమయినదాన్ని తమ భాషలో చెబితే వచన వైవిధ్యం, వైశిష్ట్యం, వైస్తృత్యం పెరుగుతాయి.

తెలుగులో తీవ్ర గ్రాంథిక వాదం, తీవ్ర వ్యావహారిక వాదం-రెండూ కలిసి భాషకు మేలు చేశాయి. గ్రాంథికవాదులు గ్రాంథిక భాషలో భావ వ్యక్తీకరణపు

అంతరాంతరాలు స్పృశిస్తుంటే, వ్యావహారిక వాదులు వ్యావహారిక భాషలో అభి ప్రాయ ప్రకటనాంతర్యం దర్శిస్తుంటే- ఈ రెండువిధాల జరిగిన కృషివల్ల తెలుగు వచన తత్వం పరిపుష్టమై, సామర్థ్యం పెరిగింది.

ఉత్తమ వచనంలో, రచయిత భావాలు పాఠకులకు నిరాటంకంగా చేర టముతోపాటు, భావాంతర్యం అవగతం అవటంతోపాటు, రచయిత పలకరించ నట్లుగా ఎదుట నిలిచినట్లుండటం జరుగుతుంది. ప్రక్రియా వైవిధ్యంవల్ల విభి న్నంగా వ్రాయబడుతూ శాసనాలనుంచి శాస్త్రాలదాకా పెరిగిన స్థితిలో, తెలుగు వచనం నిర్వహించవలసిన పాత్ర, ఆధునికయుగంలో చారిత్రక ఘట్ట మయింది.

## 5. 2 వచన స్వరూపం

వచనం తెలుగులో శాసనస్థమై, సంస్కృతంలో వ్యాఖ్యానస్థమై, ఆంగ్లంలో నియమావళితో ప్రారంభింపబడి వుండటం విదితమయింది. అందువల్ల వచనం సాధారణంగా ఆద్యలిఖిత దశలో శాసనాలు, నియమాలు, ప్రకటనలు, వ్యాఖ్యా నాలుగానూ; ఏదో విధమైన సంభాషణల రూపంలోను వుండవచ్చు. వచనం మొదట్లో, ఒక పదం చేర్చటానికి కాని, తీసివేయటానికి కాని వీలులేని, అంటే దాదాపు రచయిత స్వేచ్ఛగా పెంచటానికి, తగ్గించటానికి మార్చటానికి వీలులేని విషయము వ్రాయటానికి ఉపయోగపడింది. అది శాసనాలలో, నియమాలలో, ప్రక టనలలో వ్రాయబడి వివరణం, విపులీకరణం చేసే స్థితిలో అల్పంగా రచయిత ఇష్టానికి అవకాశం ఉన్నట్లుగా లిఖింపబడి, ఒక్క విషయానికి సంబంధించిన రెండు భావాలు పూర్తిగా చెప్పటానికి అవకాశమున్న సంభాషణలో ప్రయోగింప బడి, ఎదుటివ్యక్తిని ఉద్దేశించి పలక బడుతున్నట్లు వ్రాయబడే స్థితిని పొందింది.

సంస్కృతాంధ్రాంగ్లాలలో శ్రేష్ఠ, శ్రేష్ఠతర, శ్రేష్ఠతమమై, ఈ లక్షణం కనిపిస్తుంది.

స్పష్టంగా, పూర్తిగా, ఖచ్చితంగా అతివ్యాప్తి, అవ్యాప్తి లేకుండా, వివ రణ విపులీకరణాలు అయినా, విస్పష్ట ఆలోచన అయినా, చెప్పవలసి వస్తే

వచనమే శరణ్యం. సంస్కృత కథాఖ్యాయికలలో కాని, తెలుగు చంపూ కావ్యాలలో కాని, ఆంగ్ల కల్పనా సాహిత్యంలో కాని వచనం ప్రాథమికంగా వర్ణనకు ఉద్దేశింపబడి, ఉపయోగింపబడి, స్వరూపం తీర్చి దిద్దుకొంది.

పద్యం ఊహకు చేరువైతే వచనం వాస్తవికతకు సమీపం. ఆది కల్పనకు అవకాశం ఇస్తే ఇది హేతువుకు దోహదం చేసింది. అది ఛందస్సుందరమై, లయాన్వితమై, గీతిగుణం కలదైతే, ఇది లయాన్వితమై, విషయబోధకమై వుంది. అందువల్ల పద్యం హృదయజన్యం ప్రధానంగా, బుద్ధిజన్యం అప్రధానంగా అయితే, వచనం ప్రముఖంగా బుద్ధిజన్యం, అల్పంగా హృదయజన్యం అవుతూ వుంది. హృదయాన్ని కాల్చే, కోసే, పిండే, పండించే తీవ్రభావాల ఉద్రూతల్ని వచనంకంటే పద్యం బాగా చెప్పవచ్చు. కాని, సైనిక వ్యూహాన్ని, వైద్యరీతిని, శాస్త్ర దర్శనాన్ని, ఆలోచన నైశిత్యాన్ని, విషయ సూక్ష్మాన్ని, బుద్ధి అంతర్యాన్ని, మేధ పదనును వచనం ప్రదర్శించినంత బలంగా, పూర్తి స్ఫూర్తి మంతంగా పద్యం ప్రదర్శింపలేదు. సాధారణంగా పద్యం ఆవేశ సంభతరిమయితే వచనం ఆలోచనానిబిడం. అందువల్ల ఆలోచనపు విస్పష్ట వ్యక్తీకరణం వచనం.

న్యాయ శాస్త్రం పద్యంలో వ్రాయబడలేదు. వచనంలో చెప్పక తీరదు. న్యాయాధికారి తీర్పు వచనంలో వ్రాయబడ్డంత స్పష్టంగా పద్యంగా సాధ్యం కాదు. అందువల్ల తీర్పు చెప్పటానికి వచనం తప్ప గత్యంతరం లేదు. న్యాయం అన్యాయం మధ్య ఆలోచన పొందే సూక్ష్మ విశ్లేషణ వచనంలోనే రూపం దిద్దుకోగలుగుతుంది. అందువల్ల లోకంలోని ఏ రెండు భిన్న ధర్మాలమధ్య న్యాయం నిర్ణయించాలన్నా ఆ ఆలోచన, రచన వచనంలోనే సాగాలి.

పద్య వచన ధర్మాలు, రచనా రీతులు విభిన్నంగా వున్నాయి. పద్య కార్యనిర్వహణకు వచనం కానీ, వచన ధర్మసాధనకు పద్యంకాని ప్రయోగింగించటం ప్రమాదకరం. "But the heresy that the more poetic prose is, the finer it is, is widespread; it should be deplored and combated, not only because it is a vice of taste, but because in practice there is nothing more dangerous to the formation of prose style than the endeavour to make it Poetic." (120).

ఆధునికాంధ్ర సాహిత్యంలో వచన కవిత్వం వచనానికి అపకారం చేసింది అవుతుందా అన్న ప్రశ్న ఉదయించక మానదు. వచన కవిత్వం పద్యమా, గద్యమా అంటే, సాంప్రదాయికమైన ఛందస్సు లేదు గనుక గద్యమనే చెప్పవలసి వస్తుంది. లయ దృష్టి (రిథిమ్) పద్యంలో ఎక్కువ, వచనంలో తక్కువగా వుంటుంది. శబ్ద దృష్టి (రైమ్) వచనంలో కంటే పద్యంలో అధికంగా వుంటుంది. వచన కవిత్వంలో లయ దృష్టి, శబ్ద దృష్టి ఈ మధ్య వచన కవితకూ ఛందస్సు ఉందన్నవాదం అంగీకరిస్తే ఛందస్సు ఉండటంతో వచన కవిత్వం కవిత్వమే కాని వచనం కాదు. వచనం పద్యం కాకూడదు. పద్యం వచనం కాకూడదు. వచనం పద్యమయితే ఆలోచన క్షీణిస్తుంది. సమాజబుద్ధి వికసించదు. పద్యం వచనమైతే, హృదయం మరుగుపడుతుంది. మానవత్వం కాఠిన్యం వహిస్తుంది. వచన పద్యాలలో ఏది ఎటు ఒరిగినా, సాహిత్య వ్యక్తి రెండు చేతుల్లో ఒకటి నిరుపయోగం అయిపోతుంది. రెండు కలిసి పనిచేసినా, విడివిడిగా చేసినా ప్రయోజనకరమే కాని, ఒకటి మరొకటి అయిపోతే ప్రమాదకరం. కనుక వచనం వచనంగానే, పద్యం పద్యంగానే ప్రవర్తించటం సారస్వతానికి శ్రేయస్కరం.

వచనం విషయబోధనకు, కథాకథనానికి బాగా ఉపయోగపడ్డట్లు స్పష్టమవుతుంది. నీతి, వేదాంత, రాజకీయ, శాస్త్ర విషయాలు తెలపటానికి, కల్పనా గాథలు, చారిత్రక సన్నివేశాలు, జీవిత చరిత్రలు కథాకథనంగా చెప్పటానికి వచనం ఉపయుక్తమయిన సంస్కృతాంధ్రాంగ్ల ప్రాచీన వచన రచనలు సాక్ష్యం పలుకుతాయి.

ప్రపంచ వాఙ్మయంలో, అతి ప్రాచీన భాషల్లో పూర్తిగా, ఆధునిక భాషల్లో అధికంగా మొదటి రచనలు పద్యయుక్తంగా వెలువడటం వల్ల వచనం అనంతర సృష్టి. వచనం విరివిగా ప్రయోగింపబడటం, విశేష స్ఫూర్తిమంతంగా వ్రాయబడటం భాషా ప్రారంభం నుంచీ లేదు. కాబట్టి వచనం పద్యం కంటే చిన్నది. కనుక పెరగవలసి వుంది. పద్య రచనలో సాధించిన ఔన్నత్యం వచనం ఇంకా పొందవలసి వుంది.

వచనం రచింపబడటం వల్ల సమాజంలో క్రమక్రమంగా ఆలోచన పెరుగుతుంది. సిద్ధ సంప్రదాయాలను ప్రశ్నించటం జరుగుతుంది. క్రొత్త

మార్గాలు వెతుక్కోవటం, క్రొత్త ప్రయోగాలు చేయటం ప్రారంభమవుతుంది. నూత్న సంప్రదాయాలు సిద్ధిస్తాయి. వచనం మనవుడి నూత్నతాగవేషణకు, నిరంతరాన్వేషణకు దోహదకారి. ప్రపంచంలో నాలుగైదు వందల ఏళ్ళనుంచి విరివిగా ప్రయుక్తమవుతున్న వచనం, ఈ మధ్య వచ్చిన సామాజిక పరిణామానికి హేతువవుతుంది.

తెలుగులో కందుకూరి వచనం సంఘ సంస్కరణ దోహదకారి అయింది. పానుగంటి వచనం సంఘ చైతన్యకారి అయింది. ఆంగ్ల వచన రచనల వల్ల 'ఫ్యూడల్' వ్యవస్థ మారింది. మార్క్స్ వచనం సామాజిక చైతన్యంతో విప్లవాలు సాధించింది. ఫ్రాయిడ్ వచనం స్త్రీ పురుష సంబంధాల పునః పరిశీలన దృష్టి ప్రసాదించింది. భారత దేశంలో ఆంగ్ల ప్రభావంతో ఆవిర్భవించిన వచనం స్వాతంత్ర్య సమర ప్రోత్సాహకారక మయింది.

వచనం సమాజాన్ని పరిణమింప జేస్తుంది. వచనం సామాజిక చైతన్యాన్ని కలిగిస్తుంది. అది విప్లవాలు తెచ్చింది. పాతను గతింపజేసింది. ఆధునికతను అందించింది. అది ఈ దేశంలో స్వాతంత్ర్యమయింది. స్వేచ్ఛగా రూపొందింది. అది ప్రపంచ జీవితంలో ప్రత్యక్షమవుతూ వుంది. మానవ చైతన్యం, ప్రజాస్వామికం దాని పరిణామాలు. ప్రతి ప్రాణి అంతర తేజస్సును పరిపూర్తిగా స్వీకరించి జ్వలించి, వెలుగొంది, సమాజంలోని అన్ని కోణాలు చూచి, అన్ని భావాలు స్పష్టంగా వ్యక్తీకరించే స్వరూపం పొందింది వచనం.

## 5.3 వచనాత్మ

వాఙ్మయ త్రిభుజంలో వచనరేఖ అందించే త్రైవిధ్యం వచనాత్మను విశదీకరిస్తుంది.

### 5.3.1 వచన త్రైవిధ్యం

భిన్న ప్రక్రియల్లో విభిన్న రీతుల్లో వ్రాయబడే వచనం ఆనంద సంపాదకంగా, విషయ బోధకంగా ప్రధానంగా రెండే విధాలుగా ఉండవచ్చు. ప్రథమ దశకు ఉదాహరణంగా నవల కథాది రచనలు, ద్వితీయ దశకు శాస్త్ర రచనలు చూపవచ్చు. వచనం సామాన్యులకు హృదయధర్మాన్ని, అసామా

న్యులకు బుద్ధిధర్మాన్ని కలిగిస్తూ వుంది కాబట్టి దీని మూలతత్త్వం పరిశీలింప వలసి వుంటుంది.

అసలు వచన వైవిధ్యంలో ఈ రెండే రీతులు కాక మూడో తత్త్వం కూడా వస్తుగుణానుసార పరిశీలనం వల్ల లభించే అవకాశం వుంది. వచనం శాస్త్ర సంబంధంతో, కవితా ధర్మంతో ఉంటూ రెండూ కలిసేచోట ఏర్పడే భిన్న వచన రీతి క్రొత్త ధర్మ దర్శకంగా ఉంటుంది. తత్పరిశీలనం అవసరమే అవుతుంది.

## 5.3.2 వాఙ్మయ త్రిభుజం

వాఙ్మయ త్రిభుజంలో భాష అనే అడుగు భుజం రెండు కొసలు కలుపుకొంటూ సాగే పద్య గద్య-పద్యం గద్యం కవిత్వార్థంలోనూ వచనార్థంలోనే ఈ సందర్భంలో ప్రయోగింపబడుతూ వున్నాయి-భుజాలుపైన కలుస్తాయి. ఆధునికంగా సంస్కరణ పొందిన వాఙ్మయంలో భాష ఎంత వుంటే అంత రచన వుంటుంది. అంతేకాదు భాష, పద్య గద్యాలు సమస్థాయిని ప్రదర్శిస్తాయి కనుక ఈ వాఙ్మయ త్రిభుజం సమబాహు త్రిభుజంగా ఉండటమే వాంఛనీయం.




సాధారణంగా భాష పద్య గద్య రచనానుకూలత కలిగి వుంటుంది కానీ, పూరి పద్య రచనకో సంపూర్ణ గద్య రచనకో పరిమితం కాదు. భాషకు ఒక చేయి పద్యం మరోచేయి గద్యం. భాషా వ్యక్తి రెండు చేతులు సమంగా పెరగటం వాంఛనీయమే! అయితే ఏ వాఙ్మయం పరికించినా హెచ్చుతగ్గులు-పద్య గద్య విషయంలో - తప్పవు.

కాని, స్థూలంగా భాషాకోణం సమీపంగా ఉన్న గద్యం (ఈ) శాస్త్ర రచనలకు అమితంగా ఉపయోగపడుతుంది. పద్యకోణానికి చేరువగాఉన్న గద్యం (ఏ) పద్య ధర్మ ప్రదర్శకం అవుతుంది. అలాగే భాషాకోణం (అ) దగ్గర గానూ, గద్య కోణం (ఏ) చేరువగానూ ఉన్న పద్యం క్రమంగా కవితాగుణం మృగ్యమయిన ఛందస్సహిత రచనగానూ, వచన ధర్మ ప్రదర్శక నిర్మాణం గానూ వుంటుంది.

భాషా గద్య కోణంలో ఆవిర్భవించే వచనం ప్రాథమికం. అది హృదయాభివ్యక్తితో కూడింది గాక బుద్ధిజన్యంగా గోచరమవుతూ సామాన్యులకు దురవగాహంగా ఉండే సూత్రాలు, శాసనాలు, చట్టాలుగా రూపొందుతుంది. వచనం (ఈ) క్రింది నుంచి (ఏ) పైకి పెరిగిన కొద్దీ కథా కథనం సంభాషణం మొదలైన ధర్మ నిర్వహణ చేస్తుంది. ఆ పైన సృజన మయిన వచనం ఆలో చన కలిగించేదిగా వుంటుంది. ఇంకా పైకి వచనం పెరిగిన కొద్దీ సమాజ ప్రోత్సాహ హేతువు అవుతుంది. దీనిపైన వ్యక్తికి, సమాజానికి ఆనందం కలిగించే వచనం పుడుతుంది. ఇంకా వచనం సాగి కవిత్వమయి కవితా కోణం చేరుకొని, తద్ధర్మ బోధకం అవుతుంది.

భాషా పద్య కోణంలో పుట్టేది ప్రాథమికంగా ఛందస్సహిత రచనమయి వుంటుంది. భాషా సంబంధం పటిష్ఠం చేసుకొని పద్య రేఖ పైకి సాగిన కొద్దీ ఆనంద సంపాదక కవిత్వం ఆవిర్భవిస్తుంది. ఇది ఆరంభంలో ఆలోచనా బలంతో ఉంటూ, క్రమక్రమంగా ఆలోచనాంశ కోల్పోతూ, ఆనందాంశ పొందుతూ ఆలోచనాంశ పూర్తిగా తొలిగిపోయినప్పుడు, ఆనందాంశ సంపూర్ణంగా నిండిన కవిత ఆవిర్భవిస్తుంది. పద్య రేఖ ఎంత ఎత్తుకు పెరిగితే అంతగా రసానందం లభిస్తుంది. పద్యం గద్య ప్రభావ పరిధిలోకి పోయినా, గద్యం పద్య ప్రభావ పరిధిలోకి పోయినా, ప్రయోజనం పల్చబడుతుంది.

ఉత్తమ పద్యం, ఉత్తమ గద్యం ఆయా రేఖల అంతర్యం నుంచి ఆవిర్భ వించవచ్చు అయితే పద్య గద్య కోణంలో అవతరించే పద్యమయినా, గద్య మయినా ఆధునిక ప్రపంచ సారస్వతంలో ఆనందంగా స్వీకరింపబడుతుంది. స్వచ్ఛ కవిత కానీ, స్వచ్ఛ వచనం కాని, పద్యగద్య (ఏ) కోటి కోణంలో పుట్టే అవకాశం తక్కువ. కాని సామాన్యులు, ఈ కోణంలో పుట్టే గద్య పద్యాలు మిక్కిలిగా గుండెకు చేరువ కావటంతో, ఆనందంగా స్వీకరిస్తారు.

భాష వృక్షంలో పుట్టిన పద్య గద్యాలవంటి రెండు చెట్లు ఒకదానిపై కొకటి ఒరిగితే ఏ చిగురు ఏ రెమ్మదో, ఏ రెమ్మ ఏ కొమ్మదో ఏ కొమ్మ ఏ చెట్టుదో తెలియనంతగా పెనవేసుకు పోయినట్లే గద్య పద్యాలు కోటి కోణంలో (ఏ) స్పష్టంగా గోచరంకావు. అలాగే చివరల్లో వున్న ఆకులు, రెమ్మలు, కొమ్మలు అంతగా ఉపయోగపడనట్లే, కోటి కోణంలో పద్య గద్యాలు ఆనంద విషయికంగా వుంటాయి. భాషా వృక్షానికి ఆనుకొనివున్న కాండం యథా రూపంలోకంటే కోసి, చిత్రిక పట్టి, వేరుచేసుకొన్న రూపంలో ఉపయోగపడుతుంది. అంతగా ఉప యోగపడని చివరిభాగం కంటే, అధిక శ్రమతో ఉపయుక్తమయ్యే కాండం కంటే, యథారూపంలోనో, అల్ప పరిశ్రమతోనో, ఉపకరించే బలమైన శాఖలు వాంఛనీయాలయినట్లే, పద్య గద్యాలు ఆ యా తుది మొదళ్ళలోకాక మధ్య స్థంగా ఉత్తమ దశను చేరుకొంటాయి. అయితే చిగుళ్లు నవ్వినా, మొగ్గలు తొడిగినా, పూలు పూసినా అది వీటి కోటి కోణమే కాబట్టి సామాన్యుల కీ దశ వాంఛితంగా వుంటుంది.

గద్య రేఖలోని భాషకంటే పద్యరేఖలోని భాష సాధారణంగా మృదువుగా ఆలంకారికంగా వుంటుంది. గద్యరేఖలోని భాష స్పష్టతవైపు మొగ్గుతూ వుంటుంది. అయితే కవితా హృదయం ఉన్న రచయిత గద్యాన్ని పద్యంలా సాగింపవచ్చు. అలాగే శాస్త్రబుద్ధివున్న కవి పద్యాన్ని గద్యంకన్నా విస్పష్టంగా వ్రాయవచ్చు. పద్య గద్యాలు కోటికోణంవైపు(ఏ వైపు) సాగుతుంటే హృదయం వైపు, క్రిందికి, (అ ఈ ల వైపు) సాగుతుంటే బుద్ధివైపు పయనిస్తున్నట్లు గుర్తింపవచ్చు.

గద్యం పద్యంలోకి సాగినా, పద్యం గద్యంలోకి సాగినా పద్యం కాని, గద్యంకాని ఆరంభంలో గౌరవం పొందినట్లు కనిపించి క్రమంగా తదున్నతిని కోల్పోతాయి. ఒకటి ఇంకొకటి కావటం సంభవిస్తుంది. కాని ఆ అవసరం లేదు. కోటి కోణంలో రసౌచిత్యం కేంద్రం. అది గద్య పద్యాల చివరలు నిర్ణయిస్తూ తన ఉనికి మార్చుకొంటూ వుంటుంది.

పద్య గద్య కోణం (ఏ) నుంచి పద్యరేఖమీద పరికిస్తే మొదట కొంత గద్య గుణం గోచరమవుతుంది. కొంతదూరం దిగింతర్వాత గద్యస్ఫూర్తి లేని పద్య రచనా ప్రాంతం ఏర్పడుతుంది. అలాగే గద్య రేఖమీద ప్రారంభంలో పద్య లక్షణాలు ద్యోతకమవుతాయి. క్రమక్రమంగా పద్య స్ఫూర్తిలేని స్వచ్ఛమయిన గద్య ప్రాంతం స్పష్ట మవుతుంది.

ఎప్పుడయినా వ్యవహారంలో పదజాలం పెరిగి, భాష పెరిగి, గద్య పద్య రచనలు పెరగకపోతే వాఙ్మయ త్రిభుజంలో తాత్కాలికంగా అడుగు భుజం పెద్దదయి, గద్య పద్య భుజాలు సంకోచించి, కోటి కోణంలో దూరం ఎక్కువవుతుంది.




భాష పెరక్క, పదజాలం పెరక్క, ఉన్న పదజాలంతో అత్యుత్తమ ఫలితాలు సాధించే కవులు, రచయితలు కారణంగా గద్య పద్య భుజాలు పెరిగిపోవచ్చు. అప్పుడు వాఙ్మయ త్రిభుజంలో తాత్కాలికంగా భాషా భుజం చిన్నదయిపోయి, పద్య గద్య రేఖలు పెద్దవై పోతాయి.




ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో పద్య రచన, తదనుకూలంగా భాష పెరిగాయి. గద్యం పెరగలేదు. అప్పుడు వాఙ్మయ త్రిభుజంతో గద్య రేఖ కుంచితమవుతుంది. అంతేకాని పద్య రేఖ పెరక్కుండా గద్య రేఖలోకో, భాషా రేఖలోకో చొచ్చుకొని పోదు.



ఆధునికాంధ్ర వాఙ్మయంలో గద్య రచన బాగా పెరిగింది. దానితో పద్య రచన పోల్చి చూస్తే తక్కువ. ఈ సందర్భంలో వాఙ్మయ త్రిభుజంలో పద్య రేఖ చిన్నదౌతుంది. అంతేగాని గద్య రేఖ భాషా రేఖలోకో, పద్యరేఖలోకో ప్రవేశించదు.




ఎప్పుడయినా భాషను అతిక్రమించేంత పద్య సృష్టికాని, గద్య సృష్టికాని, తాత్కాలికంగా జరగవచ్చు. ఆ సమయంలో భాషా రేఖ అన్య భాషా ప్రభావంతో అయినా పెరగవచ్చు. పద్య రేఖో, గద్యరేఖో మిక్కిలి పెద్దది కావటంతో - ఆ కోణాల పటిష్ఠ సంబంధం కారణంగా అది తెగిపోక వంగిపోవచ్చు.

పద్య రేఖ పెరిగితే వాఙ్మయ త్రిభుజరూపాలు. 1. ఆరంభస్థితిని, 2. అనంతర స్థితిని తెలుపుతాయి.







గద్యరేఖ పెరిగితే వాఙ్మయ త్రిభుజ రూపాలు.






భాషా రేఖ పెరిగితే వాఙ్మయ త్రిభుజ రూపాలు.






భాషా పద్యాలు వ్యాకోచిస్తే వాఙ్మయ త్రిభుజ రూపాలు.






భాషా గద్యాలు వ్యాకోచిస్తే వాఙ్మయ త్రిభుజ రూపాలు.







భాషా పద్యగద్యాలు ఆకస్మికంగా మిక్కిలి తాత్కాలికంగా వ్యాకోచిస్తే వాఙ్మయ త్రిభుజ రూపాలు.







భాష పెరిగినా, పద్య రచన పెరిగినా, గద్యరచనా పెరిగినా, వాఙ్మయ త్రిభుజం త్రిభుజంగానే వుంటుంది. కోణాలు మారినా, భుజాల కొలతలు మారినా త్రిభుజత్వం మారలేదు.

అయితే వాఙ్మయ త్రిభుజం వాఙ్మయ వృత్తం అయ్యే అవకాశం కూడ మృగ్యం. ఎందువల్లనంటే, భాష పెరిగితే, వెంటనే గద్య పద్యాలు రూపొందక పోవచ్చు కాని, అనతి కాలంలో గద్య పద్యావిష్కృతి జరుగుతుంది. అలాగే గద్య పద్యాలు పెరిగితే నూత్న భాషా సృష్టికాని, సంపాదనం కాని జరిగి భాషా రేఖ పెరుగుతుంది. ఒకవిధంగా భాషకూ, గద్య పద్యాలకూ అవినాభావ

సంబంధం. తాత్కాలికంగా గద్య పద్యాలు పెరిగితే, తదనుగుణంగా భాష పెరుగుతుంది. భాష అప్పటి కప్పుడే ఆకస్మికంగా నూత్న సంప్రదాయమో, సంస్కృతో, భాషో ప్రభావం నెరపటం వల్ల పెరిగితే గద్య పద్యాలు వెంటనే పెరుగుతాయి. భాష పెరిగిందంటే దాదాపు గద్య పద్యరచన పెరిగిందని స్పష్ట మవుతుంది. భాష ఎంత ఎత్తుకు పోతుందో, అంత ఎత్తుకు అనతి కాలంలో గద్య పద్యాలు పోతాయి. ఈ రెండూ కానీ, రెండింటిలో ఏ ఒక్కటయినా కానీ కావచ్చు. అలాగే గద్యమో, పద్యమో ఉన్నతమయితే దాని ఎత్తుకు భాష పెరుగుతుంది. కాబట్టి భాషా గద్య పద్యాల సంబంధాలు సాధారణంగా శిరోదఘ్నాలుగా ఉంటాయి.

అయితే ఏ ఒక్క రేఖో పెరిగిపోయి వాఙ్మయ త్రిభుజం కుంఠితం కాదు. సాధారణంగా భాషా పద్య గద్యాల పరిణామం ఒకదానిమీద మరొకటి అవసరానికి తగినట్లుగా అవతరిస్తుంది. కనుక వాఙ్మయ త్రిభుజం త్రిభుజంగానే వుంటుంది. ఈ వాఙ్మయ త్రిభుజం బహుకాలాల ప్రపంచ మానవ సంస్కృతి చిహ్నంగా శాశ్వతంగా ఉంటుంది.

## 5. 3. 3 వచన రేఖ

వాఙ్మయ త్రిభుజంలో గద్య రేఖ ఆదినుంచి అంతం దాకా ప్రదర్శించే గుణాలు, వాటి స్థానాలు గమనించటం అవసరమే.

గద్యరేఖ



1 = కవితా ప్రభావ ప్రాంతం
2 = వచన ప్రాంతం
3 = భాషాధిక్య ప్రాంతం

కవితా ప్రభావ ప్రాంతం




1. ఛందస్సహిత వచన కవిత (ఇక్కడ ఛందస్సు సాంప్రదాయికం కాదు)

2. అస్పష్ట ఛందస్సహిత వచన కవిత (ఛందస్సు గోచరం కాక, లయ ప్రధానంగా ఉన్న కవిత)

3. వచన కవిత

భాషాధిక్య ప్రాంతం



1. సూత్రాలు (భాష్య వాంఛితాలు)
2. శాసనాలు-చట్టాలు (వివరణ వాంఛితాలు)
3. నియమావళులు-న్యాయవాదుల తీర్పులు (స్పష్టతకోసం భాష చేత విశేషంగా చాకిరీ చేయిచిన అస్పష్ట రచనలు)
4. శాస్త్ర రచనలు (అనేక శాస్త్ర విషయాలు వివరించటం కోసం ప్రయుక్తమయిన భాషతో ఉండే బుద్ధిస్థ రచనలు)

వచన ప్రాంతం




| | |
|---|---|
| 1 = సృజన వచనం | 2 = విమర్శన వచనం |
| 3 = శాస్త్ర చారిత్రకాది విమర్శనం | 4 = సారస్వత కళాది విమర్శనం |
| 5 = శాస్త్ర చారిత్రకాది వివరణం | 6 = సారస్వత కళాది వివరణం |
| 7 = వ్యాసం | 8 = జీవిత చరిత్రాది రచనలు |
| 9 = ఆత్మకథాది నివేదనలు | 10 = కథా నవలాది రచనలు |
| 11 = నాటకాది రచనలు | 12 = అన్యకల్పనా సాహిత్యం |

గద్య రేఖ (ఏ) పై నుంచి (ఈ) క్రిందికి సాగుతుంటే ప్రథమ దశలో అది హృదయ ధర్మం అందిస్తుంది. తృతీయ దశలో బుద్ధిధర్మం కలిగిస్తుంది. ద్వితీయ దశలో ఆనందాలోచనల కూడలి అయి, బుద్ధి హృదయాల సంగమ క్షేత్రం అవుతుంది.

అందువల్ల ఆధునిక వచనం, కవితావచనం స్వచ్ఛ వచనం, శాస్త్ర వచనంగా క్రమంగా ప్రథమ ద్వితీయ తృతీయ దశలలో గోచరమవుతూ వుంది. సృజన రచయితల అభిరుచి అధికంగా కవితా వచనంవైపు, అల్పంగా శాస్త్ర వచనంవైపు, విమర్శన రచయితల అభిరుచి అధికంగా శాస్త్ర వచనంవైపు, అల్పంగా కవితా వచనంవైపు మొగ్గుతుంది. అల్పంగా కవితా ధర్మం, స్వల్పంగా శాస్త్రధర్మం నిక్షిప్తం చేసుకోగల వచనం. స్వచ్ఛ వచనం అదే ఉత్తమవచనం.

ఉత్తమ వ్యాస రచయిత స్వీకరింపదగ్గ వచనం ఈ స్వచ్ఛ వచనమే ! ఒక్కొక్కప్పుడు వ్యాస వచనం కవితా వచనంగా, శాస్త్ర వచనంగా రూపొందటం కూడా సహజమే! అయితే మిక్కిలి ఉత్తమ వ్యాసంలో స్వచ్ఛ వచనమే ఉంటుంది. ఈ వచనం పూర్తిగా సృజనంలోకి ప్రాకి బుద్ధిబలం కోల్పోకూడదు. అలాగని విమర్శనంలోకి దిగజారి హృదయబలం వదులుకోకూడదు. రెండింటికి కేంద్రంగా మధ్యస్థంగా ఉన్న స్వచ్ఛ వచనమే వ్యాసరచన కుపయోగింపదగ్గ ఉత్తమ వచనం.

కవితా వచనం కాని, శాస్త్ర వచనంకాని, వచన సంపూర్ణ ధర్మాన్నికాని, పూర్తి స్ఫూర్తిని కాని పట్టివ్వగలిగి ఉండవు. స్వచ్ఛ వచనం కవితా వచనంగా మారినా, శాస్త్ర వచనంగా మారినా, తన వ్యక్తిత్వం కోల్పోతుంది. అప్పుడది వచనం కాక కవిత్వమో, శాస్త్రమో అవుతుంది. కవితారీతి కంటే శాస్త్రరీతి కంటే భిన్నంగా, స్పష్టంగా పరిపూర్ణ వ్యక్తిత్వంతో ప్రకాశించే స్వచ్ఛ వచనమే అసలు వచనం. ఈ వచనమే ఉత్తమ వ్యాస స్రష్టకు ఆరాధ్యం.

## References

1. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ - ఆంధ్ర గద్య చంద్రిక-ప్రథమ సంపుటి పీఠిక ... పుట 7.
2. George Saintsbury - A History of English Prose Rhythem - Macmillan and Company Limited (1912). p. 11.
3. Prof. Korada Mahadeva Sastri-Historical Grammer of Telugu. p. 86.
4. James Sutherland - On English Prose - p. 3.
5. మల్లాది వెంకటరత్నము - తెలుగు వచన కావ్యవృద్ధి పుట 1.
6. Ibid. p. 9.
7. A. S. Wilkins - Roman literature (1914) p. 23.
8. J. Middleton Murry - The Problem of Style. p. 49
9. George Saintsbury - A History of English Prose Rhythm. Macmillan and Company (1912) p. 1.
10. Isocrates-Quoted by George Saintsbury-A History of English prose Rhythm - Macmillan and Company (1912) p. 2.
11. F. L. Lucas - Style - collier books - (1962) p. 215.
12. Ibid - p. 230.
13. డా॥ యం. కులశేఖరరావు - Origin and Development of Telugu Prose - అముద్రితం - పుట 327.
14. Ibid - పుట 338.
15. పిల్లలమర్రి వేంకట హనుమంతరావు - సాహిత్య సమాలోచనము- పుట 79
16. శ్రీ నిడదవోలు వేంకటరావు - ఆంధ్ర వచన వాఙ్మయము - పుట 3

17. డా॥ యం. కులశేఖర రావు Origin and Development of Telugu Prose - అముద్రితం - పుట 340.

18. పిల్లలమర్రి వేంకట హనుమంతరావు - సాహిత్య సమాలోచనము- పుట 81

19. శ్రీ నిడదవోలు వేంకటరావు - ఆంధ్ర వచన వాఙ్మయము - పుట 8

20. Ibid పుట 22

21. Ibid పుట 6

22. Ibid పుట 23

23. డా॥ యం. కులశేఖర రావు Origin and Development of Telugu Prose - p. 45.

24. మల్లంపల్లి సోమశేఖరశర్మ-నన్నయకు పూర్వము ఆంధ్ర భాష (వ్యాసం) సారస్వతవ్యాసములు - ప్రథమ సంపుటము. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ - పుట 4

25. Prof. K .Mahadeva Sastri-Historical Grammar of Telugu - p. 36

26. Ibid.

27. డా. యం.కులశేఖర రావు Origin and Development of Telugu Prose - (అముద్రితం) పుట 64

28. Ibid పుట 565

29. Ibid పుట 571

30. Ibid పుట 771

31. Dr. V. Varadachari - A History of the Samskrita Literature- p. 114

32. గొబ్బూరి వెంకటానంద రాఘవరావు - ఆంధ్ర వచన రచనా పరిణామము - పుట 1

33. శ్రీ నిడదవోలు వేంకటరావు - ఆంధ్ర వచన వాఙ్మయము పుట 27

34. పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు - సాహిత్యసమాలోచనము పుట 86
35. Ibid - పుట 87
36. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, ఇతరులు - ఆంధ్ర గద్య చంద్రిక పుట 10
37. Ibid - పుట 13
38. డా. యం. కులశేఖరరావు-Origin and Development of Telugu Prose - పుట 160
39. Ibid పుట 167
40. Ibid పుట 169
41. Ibid పుట 176
42. గొబ్బూరి వేంకటానంద రాఘవరావు-ఆంధ్ర వచన రచనా పరిణామము పుట 51
43. శ్రీ నిడదవోలు వేంకటరావు - ఆంధ్ర వచన వాఙ్మయము పుట 27
44. డా. యం. కులశేఖరరావు-Origin and development of Telugu Prose పుట 306
45. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము - ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము పుట 158
46. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, ఇతరులు-ఆంధ్ర గద్యచంద్రిక పుట 80
47. Ibid పుట 80
48. Ibid పుట 78
49. పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు - సాహిత్య సమాలోచము పుట 87.
50. గొబ్బూరి వేంకటానంద రాఘవరావు-ఆంధ్ర వచన పరిణామము పుట 63
51. శ్రీ రావూరు సత్యనారాయణరావు - చిలకమర్తి వచన రచనలు సాహిత్యోపన్యాసములు (వ్యాసం) పుట 37
52. డా. యం. కులశేఖరరావు-Origin and Development of Telugu Prose. పుట 464

53. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ - ఆంధ్ర గద్య చంద్రిక పుట 80
54. శ్రీ పోలూరి హనుమజ్జానకి రామశర్మ - ఎత్తాప్రెగ్గడ పుట 361
55. వేటూరి ప్రభాకర శాస్త్రి - ఉత్తర హరివంశ పీఠిక పుట 12
56. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము - ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము పుట 159
57. డా. యం. కులశేఖరరావు-Origin and Development of Telugu Prose. పుట 511
58. Ibid పుట 629
59. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ - ఆంధ్ర గద్య చంద్రిక పుట 80
60. Ibid పుట 80
61. శ్రీ రాపూరు సత్యనారాయణరావు-చిలకమర్తి వచన రచనలు సాహిత్యోపన్యాసములు (వ్యాసం) పుట 37,38
62. డా. యం. కులశేఖరరావు-Origin and Development of Telugu Prose పుట 719
63. పిల్లలమర్రి హనుమంతరావు - సాహిత్య సమాలోచనము పుట 88
64. Ibid పుట 90
65. శ్రీ నిడదవోలు వేంకటరావు-ఆంధ్ర వచన వాఙ్మయము పుట 23
66. శ్రీ విశ్వనాధ సత్యనారాయణ - ఆంధ్ర గద్య చంద్రిక పుట 269
67. డా. యం. కులశేఖరరావు-Origin and Development of Telugu Prose. పుట 48
68. శ్రీ విశ్వనాధ సత్యనారాయణ - ఆంధ్ర గద్య చంద్రిక- పుట 217
69. Ibid - పుట 217,218
70. Ibid - పుట 219
71. ఆచార్య గంటి జోగి సోమయాజి-ప్రాచీనాంధ్ర వాఙ్మయము (వ్యాసం) తెలుగు వాఙ్మయము-సంపాదకులు కూర్మా వేణు గోపాలస్వామి పుట 77
72. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం-Introduction-సిద్ధేశ్వర చరిత్ర పుట iv
73. శ్రీ నిడదవోలు వేంకటరావు-ఆంధ్ర వచన వాఙ్మయము

74. డా. నేలటూరి వెంకటరమణయ్య-ఆంధ్ర వాఙ్మయ చరిత్ర పుట 74

75. Ibid - పుట 75

76. ఆచార్య దివాకర్ల వేంకటావధాని - ఆంధ్ర వాఙ్మయ చరిత్ర పుట 90

77. డా. నేలటూరి వెంకటరమణయ్య-ఆంధ్ర వాఙ్మయ చరిత్ర పుట 76

78. డా. యం. కులశేఖరరావు-Origin and Development of Telugu Prose పుట 18

79. ఆచార్య గంటి జోగి సోమయాజి – ప్రాచీనాంధ్ర వాఙ్మయము (వ్యాసం) తెలుగు వాఙ్మయము-సంపాదకుడు కూర్మా వేణుగోపాల స్వామి పుట 75

80. James Sutherland-On English Prose p. 7

81. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ - ఆంధ్ర గద్య చంద్రిక p. 2

82. James Sutherland-On English Prose p. 5

83. J. Middleton Murray - The Problem of Style p. 49, 50

84. Dr. Gaurinath Sastri-A Concise History of Classical Sanskrit Literature-Ch. XI p. 130

85. M. Krishnamachariar-History of Classical Sanskrit Literature-Ch. XIX See 2 p. 441

86. Ibid p. 441

87. Ibid p. 441

88. Prof. C. Kunhan Raja- Introduction - Kadambari- p. 8

89. M. Krishnamachariar-History of Classical Sanskrit Literature-Ch. XIX See II p. 442

90. Ibid - p. 411

91. Ibid - Ch. XVIII p. 412

92. A. Weber-The History of Indian Literature p. 210

93. Ibid – p. 211

94. A. B. Keith–History of Sanskrit Literature-Ch XI p. 244

95. Ibid – p. 244

96. Dr. V. Varadachari - A History of the Samskrita Literature-Ch. XIII p. 107

97. Dr. Gowrinath Sastri-A concise History of Classical Sanskrit Literature -Ch.XI p. 135

98. Dr. V. Varadachari - A History of the Samskrita Literature-Ch. XVIII p. 111

99. Ibid - Ch. XVII p. 111

100. Ibid - Ch. XVII p. 105

101. Ibid - Ch. XVII p. 114

102. Prof. G. N. Reddy- The Influence of English on Telugu Literature-Ch. prose p. 312 (Not Printed)

103. ఆచార్య గంటి జోగి సోమయాజి-ప్రాచీనాంధ్ర వాఙ్మయము (వ్యాసం) తెలుగు వాఙ్మయము - సంకలనం - కూర్పు వేణుగోపాలస్వామి పుట 78

104. Encyclopedia Britannica - Vol. 22. p. 452.

105. Emile Legouis - A History of English Literature. p. 51.

106. Encyclopedia Britannica Vol. 22 p. 452,

107. George Samson - The Concise Cambridge History of English Literature.- p. 94.

108. David Diaches - A critical History of English Literature-Vol. two p. 458

109. Kenneth Muin-Elizabethan and Jacobean Prose-Introduction p. xxi

110. Encyclopedia Britannica - Vol. 22 p.452

111. Peter Ure - Seventeenth Century Prose - Introduction p. xvii

112. Ibid - pp. xx, xxi

113. D. W. Jefferson-Eighteenth Century Prose. Introduction : pp. xxv, xxvi

114. David Diaches - A Critical History of English Literature - Vol. three. p. 807

115. B. R. Mullik-English Literature, Its background and Development. p. 111

116. Kenneth and Mirian Allott - Victorian Prose. Introduction p xix

117. Ibid-Introduction p xx

118. B.R. Mullik-English Literature, Its Background and Development p. 139

119. James Sutherland- On English Prose p. 18

120. J. Middleton Murry - The Problem of Style - p. 61



# వ్యాసం

ఆధునికాంధ్ర సారస్వతంలో అధిక భాగం ఆంగ్ల సాహిత్య ప్రభావ ఫలితం. ఆంధ్ర వాఙ్మయంలో ఈ ప్రభావం వచనం మీద ఎక్కువగా వుంది. వర్తమానాంధ్ర వచన ప్రక్రియల్లో వ్యాసం అధిక వ్యాప్తి పొందింది. ఆంగ్ల సాహిత్య సంబంధం వల్ల తెలుగులో ఆవిర్భవించిన అనేక నూత్న ప్రక్రియల్లో ఒకటైన వ్యాసం లక్షణాలు విశదం కావాలంటే, ఆంధ్రంలో కంటె ఆంగ్లంలో తత్సారస్వతం దర్శించటం భావ్యం.

తెలుగు సారస్వతంలో వ్యాసం తీరు తెన్నులు ఇంచుమించు ఆంగ్లంలో ఉన్నట్టే, గోచర మవుతాయి. వ్యాస లక్షణాలివి అని విస్పష్టంగా వింగడించి చూపే వీలు తెలుగులో లేనట్లే ఆంగ్లంలోనూ లేకపోగా, వ్యాస లక్షణాలివి అని నిర్ణయించిన విమర్శ సాహిత్యం ఆంధ్రలో లాగా, ఆంగ్లంలోనూ లేకపోవటం వల్ల ఆంగ్ల వ్యాస వాఙ్మయం పొందిన పరిణామం పరికించి, తెలుగు వ్యాస పరిణామం భావించి, స్థూలంగా వ్యాస లక్షణాలు నిర్ణయించుకోవటమే సంభావ్యం.

వ్యాసం, ఆంగ్లాంధ్రాలలో, వచనం పటిష్ఠంగా రూపొందితే ఏర్పడ్డ ప్రక్రియ. అందుచేత వ్యాసం, ఉత్తమ వచన నేపథ్యం కలిగి వుంటుంది. పరిపుష్ట వచన సహకారం మీద కాసిన కమనీయామ్రం వ్యాసం. బుద్ధి జన్య వచనం, హృదయ జన్య వచనం సంగమించే కూడలి వ్యాసం.

వ్యాస లక్షణాలతో వున్నట్లుగా భావింపబడే పూర్వపు కొద్ది రచనల మాట అటుంచితే నాలుగు వందలేళ్ళ నుంచి ఆంగ్లంలో, నూట పదేళ్ళ నుంచి ఆంధ్రంలో వెలుడుతున్న వీటి ప్రారంభం పరిణామం దాదాపు ఏకోన్ముఖంగా ఉన్నట్లు గమనించవచ్చు. ఆంగ్ల వ్యాస ప్రక్రియాంతర్గత వైవిధ్యం, ఈ ఆంధ్ర వ్యాస పరిణామ భాగంగా స్పష్టమవుతుంది రెండు భాషలలోని వ్యాసతుల్యమైన కొద్ది రచనల సంగతి అటుంచి, పరికిస్తే బేకన్ వ్యాసాలు కానీ, స్వామి నీన ముద్దు నరసింహనాయని వ్యాసాలు కానీ ప్రారంభంలోని ధర్మ సామ్యం తెలు

పక పోషు సంఘ చైతన్యం, ధర్మ బోధ, సంస్కరణ వాంఛ ఆంగ్లాంధ్ర ప్రారంభ వ్యాసాలలో ప్రదర్శింపబడ్డాయి కాని వాటి ఆత్మ, ఆవిష్కరణా, భిన్నమే !

వాక్కు, వ్రాత సాధారణంగా ప్రతి మనిషికీ భావ ప్రకటనపు రెండం చులు. వాక్కే సారస్వతంగా మిగిలిపోదు. మౌఖిక సంప్రదాయ సాహిత్యం లిఖితమైనా అయింది, లేదా అంతరించి అయినా పోయింది. వ్రాత యావత్తు సారస్వతంగా మిగలదు. ఎంతో వ్రాత గతించింది. సాహిత్యమైన వాక్కు వ్రాతా, కాలక్రమంలో వ్రాత అయి, ఆ వ్రాత వాఙ్మయమై ఆగత సమాజార్థం స్థిరమవుతుంది. సంస్కృతం సంగతికాదుగాని, ఆంగ్లాంధ్రాలలో చాలా సాహిత్యం ప్రాథమికంగా వ్రాత రూపమే! ఆంగ్లంలోనూ, ఆంధ్రంలోనూ వ్యాసం వాక్కు వ్రాత రూపాలు పొందింది. ఏదో ఒక దశలో ఈ రెండు భాషలలో పిలసిల్లిన ఈ రెండు విధాల వ్యాసం, వర్తమాన ప్రక్రియలలో ఏదీ పొందని ధర్మద్వయం కల్గిందౌతుంది. వ్రాయబడిన వ్యాసం చదవబడితే, వైశిష్ట్యం లేదుకానీ, చెప్పబడ్డ విషయం వ్రాయబడగా వ్యాస మయితే వైశిష్ట్యమే. ఈ దశ ఆంధ్రంలో మిక్కిలి స్పష్టంగా గమనింపవచ్చు.

మనిషి అనుభూతికి ఆలోచనకు కళలు ఆటపట్టులు. సారస్వతంలో అను భూతి ప్రధానంగా అభివ్యక్తి జరిగితే సృజన సాహిత్యం, ఆలోచన ముఖ్యమై అభివ్యక్తి కలిగితే విమర్శన సాహిత్యం ఆవిర్భవిస్తాయి. సృజన సాహిత్యంలో కొంతయినా ఆలోచన, విమర్శన సాహిత్యంలో అల్పంగానయినా అనుభూతి ఉండక తప్పదు. బుద్ధి ప్రధానమైన విమర్శన సాహిత్యం శాస్త్ర వాఙ్మయంగా రూపొందే స్థితి భావింపవచ్చు. అయితే, ఏ ప్రక్రియ అయినా, సారస్వతంలో, శాస్త్ర వాఙ్మయం వైపో, కావ్య వాఙ్మయం వైపో మొగ్గవచ్చు కాని, వ్యాసం మాత్రం కాదు. కొద్ది హెచ్చుతగ్గుల మాటకేమిగాని, ఉత్తమవ్యాసం అనుభూతి ఆలోచనలు సమంగా గ్రహించి రూపొందుతుంది.

కుడి ఎడమల ఉన్న బుద్ధి హృదయాల కేంద్రంలో పుట్టిన వ్యాసం ఉత్తమం అవుతుంది. ఆ రెండింటిలో ఏది ఎక్కువగా లోపించినా వ్యాసం వ్యక్తిత్వం ప్రశ్నింపబడుతుంది. హృదయబలం అధికమయిన కొద్దీ వ్యాసం సృజన

సాహిత్యంలో చేరుతుంది. పాఠకులకు సన్నిహితమవుతుంది. బుద్ధిబలం ఎక్కువయిన కొద్దీ వ్యాసం విమర్శనం అవుతుంది. సామాన్య పాఠకుడికి దూరమయి పోతుంది. ఆంగ్లంలో లాగా ఆంధ్రంలోనూ పై ధర్మాలు ప్రదర్శించే వ్యాసాలు ఆవిర్భవించాయి.

బుద్ధి హృదయాల సంగమ కేంద్రంలో ప్రవర్తించే వ్యాసాలు సృష్టించిన వ్యాస బ్రహ్మ 'కవులీ', హృదయంవైపు మొగ్గే వ్యాస స్రష్ట 'లేంబ్', బుద్ధి జన్య వ్యాస నిర్మాత 'బేకన్'లతో పోల్చి దగ్గ ఆంధ్ర వ్యాస కర్తలకు తెలుసు కోవటం కోసం ఆంగ్ల వ్యాస స్థూల పరిణామం పరికించటం అవసరమే! ఆంగ్లాంధ్రాలలో అనేకులకు వర్తమానంలో ఆరాధ్యమైన వ్యాస ప్రక్రియ, అది ఆవిర్భవించిన నాటి నుంచి అల్పంగానో, అధికంగానో కుడి ఎడమలకు సంచలించింది. ఈ చలనం వ్యాస వైవిధ్యానికి దోహదం చేసిందే కాని, తదన్యం సంభవింప చేయలేదు. అందువల్ల ఆంగ్లంలో వ్యాసం పొందిన వైవిధ్యంతో ఆంధ్ర వ్యాస పరిణామం పోల్చి చూచుకోవటం కోసం ఆంగ్ల వ్యాస స్థూల పరిణామం గమనార్హం!

## 1. ఆంగ్ల వ్యాస స్థూల పరిణామం

ఆంగ్ల వ్యాసం పొందిన పరిణామం పది యుగాలు: 1. బేకన్ యుగం. 2. పాత్ర రచనా యుగం. 3. కౌలీ యుగం. 4. వార్తాపత్రికా యుగం. 5. పత్రికా వ్యాస యుగం. 6. సంధి యుగం. 7. సమీక్షా యుగం. 8. లేంబ్ యుగం. 9 చారిత్రక వ్యాస యుగం. 10. ఆధునిక వ్యాస యుగం. ఈ యుగ విభజనం వెనుక ఉన్న లక్షణం- ముప్పై, నలభై ఏళ్ళ కాలంలో ప్రధానంగా వ్యాస రచయిత కాని, వ్యాస రచనాతత్త్వం కానీ స్వీకరించి ఆ యుగానికి పేరు నిర్ణయించటం బేకన్, కౌలీ, లేంబ్‌ల వంటి ప్రధానమైన వాళ్ళే ఎడిసన్ స్టీలులు అయినప్పటికీ, వాళ్ళు వార్తాపత్రికా జీవితంలో అంతర్భాగం కావటంతో, వాళ్ళ యుగం వార్తాపత్రికా యుగంగా స్వీకరించబడింది.

ఆంగ్లంలో బేకన్‌తో ప్రారంభమైన వ్యాస రచనం ఆకస్మికంగా ఆవిర్భవించి వుండకపోతే, పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకోవలసిందే అవుతుంది. ఫ్రెంచి రచయిత మాంటేన్ ప్రపంచ సాహిత్యంలో వ్యాసానికి ఆద్యుడు.

అటువంటి రచనా విధానమే. ఆ పేరుతో పిలువబడక పోయినా, విశ్వ సాహిత్యంలో విస్తృతంగా ఉందని అనంతరం అనేకులు భావించారు.

మాంటేన్ మార్గంలో వ్యాస రచన చేసిన ప్రథమాంగ్ల వ్యాసకర్త బేకన్ (1597). అతడి కంటే పూర్వం ఆంగ్లంలో వ్యాస రచనా రీతి-తుఫానుకు ముందు సముద్రంలో ఉత్పత్తి మోతలుగా, బైటపడని పొంగులుగా ఉంటే ఉంచవచ్చునని బేకన్ అంగీకరించాడు. అయితే లాడ్జి, లిలి, గ్రీని వచన రచనలు నవలా చరిత్రకు తత్ప్రాచీనత తెలపటానికి అవసరం కావచ్చు కాని వ్యాసానికి కావు. 1592 లో ఆంగ్లానువాదంగా వెలువడ్డ థియోఫ్రాస్టస్ రచనా విధానం బేకన్ తర్వాత ఆంగ్ల భాషలో వెలువడ్డ పాత్ర రచనా రీతికి ఉపయోగకరమయింది. విమర్శనం, కాక్స్టటన్ ముద్రించిన గ్రంథాల ఉపోద్ఘాత రూపంలా బేకన్ కంటే ముందే వెలువడింది. విల్సన్ రచన "ఆర్ట్ అఫ్ రెటోరిక్", గాస్కోన్ రచన "నోట్స్ ఆఫ్ ఇన్స్ట్రక్షన్ కన్సర్నింగ్ ది మేకింగ్ ఆఫ్ వెర్స్" కావ్యాలంకారాలు బోధించేవే కాని వ్యాసాలు కావు. వాద ప్రతివాద సాహిత్యం బేకన్ కంటె పూర్వం వెలువడింది.

వ్యాసావిర్భావానికి బేకన్ కంటె పూర్వం పూర్వ రంగం సిద్ధం చేసిన వచన రచయిత థామస్ నాష్ (1567-1601) అలక్ష్యం చేయరాదు. వివాద రచనా విధాన సమాప్తికి సమర్థవంతమైన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించిన వ్యక్తి నాష్. తీవ్ర విమర్శనంలోనూ తీయదనం నింపిన వ్యక్తి. అధిక్షేప (Satire) ప్రాధాన్యంతో రచన చేసి, ఆగత వ్యాస లక్షణాలలో ఒకదాన్ని అంతకు ముందే అందించి, తీర్చిదిద్దిన నాష్ ఆంగ్ల వ్యాస ప్రారంభంలో, తదావిర్భావానికి పరోక్షంగా కృషి చేశాడు.

## బేకన్ యుగం

ఆంధ్ర భాషా సారస్వతాల మీద సంస్కృత ప్రభావం ఉన్నట్లే ఆంగ్ల భాషా సారస్వతాల మీద కొంతవరకు ఉన్న ఫ్రెంచి ప్రభావం వ్యాస ప్రక్రియ విషయంలోనూ, ద్యోతక మవుతుంది. మాంటేన్ వ్యాసాలు ఫ్రెంచిలో వెలువడ్డ పదిహేడు సంవత్సరాలకు ఆంగ్లంలో మొదటి పది వ్యాసాలు ప్రకటించిన

బేకన్ తత్త్వభావానికి లోనయినట్టే భావింప వచ్చు. తను గానీ, విమర్శకులు గానీ వ్యాసకర్తగా గణింపని థామస్ నాష్‌ను గానీ; థియో ఫ్రాస్టస్ అనువాద వ్యాసాల ప్రభావంతో ఆంగ్లంలో పాత్ర రచనలు చేసిన ప్రారంభకులను గానీ; నాష్ కంటె గొప్పవాడు, తరువాత వాడు అయిన డెక్కర్‌ను గానీ తొలగిస్తే బేకన్ ప్రథమాంగ్ల రచయిత.

వ్యాస రచనంలో ప్రథముడూ; ఆ కాలంలోనే వ్యాసాలు వ్రాసినా, చాలకాలం తర్వాత ప్రచారం వచ్చినా ప్రసిద్ధిలేని బెన్ జాన్‌సన్, జాన్ షెల్ డెన్‌ల కంటె అధికుడూ; సర్ విలియం కారన్ వాలిస్, రాబర్ట్ జాన్‌సన్‌ల వ్యాసాలు సమకాలంలో ముద్రితాలయినా వాటిని ప్రభావితం చేసిన రచయితా అయిన బేకన్ ఆంగ్ల సారస్వతంలో వ్యాస ప్రక్రియలో ప్రథమ యుగాధిపతి.

మాంటేన్ చూపిన ప్రక్రియ తన భావాల కనుగుణంగా ఉన్నట్లు బేకన్ గుర్తించి స్వీకరించాడు. ఏ విషయాన్ని గూర్చి అయినా అంత నిశితంగా వ్రాయగల రచయిత బేకన్ కంటె భిన్నుడు వెదకబడవలసే వున్నాడు. అతని వేదాంత తత్త్వం, ఉత్తమ శైలి, సంక్షిప్త వాక్యాలు వ్యాసతత్త్వ ప్రదర్శకాలయ్యాయి. బేకన్ వ్యాసాలు అనేక విషయానుసంధాయకాలే గానీ, విస్తృతాలు కావు. ప్రతి వ్యాసం, ప్రతి వాక్యం, ప్రతి పదం, ప్రత్యక్షరం, అత్యుత్తమాలోచన ఫలితం. బేకన్ వ్యాసాలలో రచయిత పాఠకులతో ముచ్చటించినట్లుంటుంది కానీ నిరంతరం రచయితకు పాఠకుడికి మధ్య తెర, పల్చటిదే కావచ్చు - వ్రేలాడుతూ వుంటుంది. మాంటేన్ పాఠకుడికి మిత్రుడిలా వ్యవహరిస్తే, బేకన్ వైద్యుడులా ప్రవర్తిస్తాడు. బేకన్ 1597లో పది వ్యాసాల సంపుటి ప్రకటించి, 1612లో ఆ పదితో మొత్తం ముప్పై ఎనిమిది ప్రచురించి, 1625 లో అన్ని కలిపి, ఏభై ఎనిమిది వెలువరించాడు. ఈ అర నూట పద హారు వ్యాసాలు నాటి నుంచి నేటి దాకా విశ్వసాహిత్యాన్ని సుసంపన్నం కావించాయి.

సర్ విలియం కారన్ వాలిస్ 1600లో ఓర్పు, మానవత, ఆశ మొదలైన గుణాల గూర్చి వ్రాసిన విమర్శనాయుతమైన వ్యాసాలు, రాబర్ట్ జాన్‌సన్ 1601లో విద్యా విషయాల గూర్చి వ్రాసిన వ్యాసాలలో బేకన్ రచనా ప్రభావం

గోచరమవుతుంది. గొప్ప నాటక కర్తగా విమర్శకుడుగా కవిగా ప్రఖ్యాతి పొందిన బెన్ జాన్సన్ 1630 ప్రాంతంలో వ్రాసిన వ్యాసాలు 1641లో ముద్రింపబడ్డప్పుడు వ్యాస రచయితగా గుర్తింపబడ్డాడు. ఇతని వ్యాసాలు అధికమే అయినా, శైలిలో స్పష్టత ఉన్నా, బెన్ జాన్ సన్ ప్రధానంగా వ్యాసాలలోనూ విమర్శకుడుగానే గుర్తింపబడ్డాడు. జాన్‌షెల్‌డెన్ పైన బెన్ జాన్సన్ ప్రభావం అధికంగా, బేకన్ ప్రభావం అల్పంగా వ్యాస విషయంలో వ్యక్తమయినా, జాన్ షెల్‌డెన్ ఉత్తమ వ్యాస రచయితే! ఈ వ్యాసాలు న్యాయవాది తీర్పులులాగా వుంటాయి. భావ వ్యక్తీకరణంలో ధ్వన్యాత్మక కళ గూడ గోచరమవుతుంది. బేకన్ యుగంలో వ్యాసం ఆవిర్భవించి ఒక ప్రక్రియగా ఆంగ్ల సారస్వతంలో స్థిరపడింది.

## 1. 2. పాత్రరచనా యుగం

పాత్ర రచన అంటే పాత్ర చిత్రీకరణ. రచయిత ఒక విషయం స్వీకరించి, విభజించి వివరించటంకంటే ఒక పాత్రను గ్రహించి, స్పష్టంగా రూపొందించటం జరుగుతుంది. ఈ విధమైన రచనకు వ్యాసంలో కంటే కథానిక, నవల, నాటకాలలో అవకాశం ఎక్కువ. దీనివల్ల వ్యాసం బుద్ధి హృదయాల కూడలి నుంచి జరిగి హృదయం వైపు మొగ్గినట్లు భావింపబడుతుంది.

సంఘంలో వివిధ వ్యక్తుల జీవితాలు దర్శించి, తత్త్వం, గుణం, రూపం మొదలైన బహులక్షణాలు ఆధారం చేసుకొని, వ్యక్తుల్ని కొన్ని తరగతులుగా విభజింపవచ్చు. ఉదాహరణార్థం పల్లెటూరి బడిపంతులు అనుకోవచ్చు. ఈ ఒక తరగతి వ్యక్తి బాహిరాంతర రూపాలు స్పష్టంగా చూపుతూ చిత్రీకరింపబడ్డ పాత్ర ఆ తరగతిలోని బహుజనులకు మాతృకగా గోచరిస్తే అది ఉత్తమ పాత్ర రచన. ఇటువంటి రచనా విధానం ఆదిలో ఆమితాకర్షకంగా, ఆనంతరం అమిత నిరుత్సాహకంగా రూపొందటంవల్ల వర్తమానంలో తద్రచనా రీతి ప్రత్యేకంగా లేకపోయింది. ఒక తరగతి పాత్రను ఒకదాన్ని సృష్టిస్తే, మళ్ళీ అటువంటి పాత్ర అవసరం ఉండదు. అన్ని తరగతుల పాత్రలు చిత్రీకరింపబడితే, పాత్ర రచనావసరం సన్నగిలుతుంది. అంతే జరిగింది.

పాత్ర చిత్రణ దృష్టి ఆధునికం కాదు. క్రీ. పూ. 3వ శతాబ్దిలోని థియోఫ్రాస్టస్ పాత్ర రచనకు ఆద్యుడు. ఈ ప్రభావం అనంతర నాటక వాఙ్మయంలో

గోచరమవుతుంది. భార్య, న్యాయవాదివంటి పాత్రలు సృష్టించిన ఇతడి రచనలు బేకన్ రచనల కంటే ముందుగా ఆంగ్లభాషలో అవతరించినా బేకన్ మీద ప్రభావం చూపలేకపోయాయి. తదనంతర పాత్ర రచయితలు ప్రభావితులయ్యారు. ఈ విధమైన రచనలన్నీ ఒకే విధమైన పాత్ర రచనలు కాబట్టి, ఈ యుగం పాత్ర రచనా యుగంగా భావింపవచ్చు.

పాత్ర రచయితలు, రచనలు అనేకులు, అనేకం. అందులో ముఖ్యులు చేసిన ప్రధాన రచనలు ప్రస్తావింపబడవచ్చు. థామస్ డెక్కర్ 1608లో అల్పజీవితం జీవించే అనేకుల పాత్రలు, 1609 ప్రాంతంలో హాస్య పాత్రలు, 1613 లో గుర్రపు పందేలకు సంబంధించిన పాత్రలు, కవితాత్మక వచనంలో సంఘ ప్రతిబింబాలుగా సృష్టించి ప్రకటించారు. జోసఫ్‌హాల్ ప్రాచీన వేదాంతుల గుణదోషాల పాత్రలు, పరిహాస కుశలంగా, ప్రత్యేకతతో ఒప్పేవిగా చక్కని వచనంలో వ్రాశాడు. థామస్ ఒవర్‌బరీ హృదయవాది అయి, భార్య, ఉద్యోగి వ్యాపారస్థుడు మొదలైన పాత్రలు, అనేక దేశ ప్రదేశ వార్తల మీద ఆధారపడి చిత్రించాడు. జాన్ ఎరల్ 1628 లో ప్రచురించిన పాత్రలు, తదనంతరం ప్రకటింపబడిన పాత్రలు జీవితానికి చేరువగా ఉన్నాయి. హాస్యం విజ్ఞాన వాహిక అని నమ్మిన ఈ రచయిత కర్కశత్వం కాఠిన్యం ఉన్న హాస్యంతో ఒప్పే పాత్ర రచనలో నీతిబోధకుడు తీవ్రవాది. జార్జి హెర్‌బర్ట్ ఒక పూజారి జీవితంలో అనుభవం, ప్రార్థన, బోధన మొదలైన ధర్మాలు చెబుతున్నట్లు వ్రాసి, ఒక సిద్ధాంత రచనగా రూపొందించాడు. నికొలస్ బ్రెటన్ 1616 లోను, 1626 లోను ప్రచురించిన పాత్రలతోపాటు చేపలు, జంతువులు, ఋతువులు కూడ చిత్రించాడు. జఫరే మైన్‌సుల్, థామస్ ఫుల్లర్ చక్కని పాత్రలు రచించారు. 1811 లో 1605-1700 మధ్య కాలంలో ఆవిర్భవించిన పాత్రల సంకలనం ఫిలిప్ బ్లిస్ ప్రచురించాడు. అవి విద్యార్థులకు తప్ప, తదితరులకు మరుగుపడిపోయాయి. 17 వ శతాబ్ది అభిరుచికి దర్పణాలు పాత్ర రచనలు. అనంతర కాలంలో ఆ విధమైన రచనం క్రమక్రమంగా తగ్గిపోయింది.

## 1. 3. కౌలీ యుగం

ఈ యుగంలోనే కాక, ఆంగ్ల వ్యాస ప్రపంచంలో నేటి దాకా ఉత్తమ వ్యాస రచయితగా, వ్యాస బ్రహ్మగా పరిగణింపబడుతున్న 'కౌలీ' ఈ యుగ

కర్తగా పరిగణింపబడటమే ఉచితం! ఆంగ్ల వ్యాస చరిత్రలోను, సారస్వత చరిత్రలోను ప్రముఖులైన పలువురు ఈ యుగ ప్రవర్తకులైనా, కౌలీ లాగా వ్యాసం సృజనంగా, పాఠకుల హృదయాన్ని జయించేదిగా రచింపలేదు. ఆంగ్ల సారస్వతంలో ఇతర రచనా కారణాల వల్ల ప్రసిద్ధులైన ఈ పలువురు స్వీకరించిన మార్గంలో ధర్మ సామ్యం లేకపోవటంవల్ల ఈ యుగం వ్యాస పరిణామంలో ఒక ప్రత్యేక తత్త్వం తెలిపేది కాకుండా పోయింది. వ్యాసంలో విమర్శనం ఈ దశలో ప్రవేశించి ప్రాచుర్యం పొందింది. పత్రికా రచన ప్రారంభం ఈ యుగంలోనే జరిగింది.

బేకన్ మొదలైన వాళ్ళ లాగా సంక్షిప్త వ్యాసాలు వ్రాయక, థామస్ డెక్కర్ మొదలైన వాళ్ళ లాగా పాత్ర రచనలు చేయక, భిన్న రీతిలో వ్యాస రచన చేసిన 17వ శతాబ్ది వ్యాసరచయితలు సృష్టించిన వ్యాస సాహిత్యం అల్పం కాదు. ఆంగ్ల వ్యాసమారంభంలోనే మాంటేన్ మార్గం కంటె భిన్నంగా సాగింది. అయితే కౌలీ రచనలు, మాంటేన్ తత్త్వం పుణికి పుచ్చుకొన్నట్లు దాని కవి కొంత చేరువ అయినట్లు తెలుపుతాయి. అయితే బేకన్ మార్గంలో జరిగిన వ్యాస సృష్టి ఈ శతాబ్దిలో అధికంగా గోచరమవుతుంది. పాత్ర రచన ఈ యుగంలో ద్యోతకం కాలేదు కనుక థామస్ ఫుల్లర్‌తోనే ఆగిపోయిందని భావింపవచ్చు.

అబ్రహామ్ కౌలీ, మాంటేన్ మార్గంలో వ్యాస రచన చేశాడు. కౌలీ పాఠకుడితో అంతరంగికుడిగా, స్నేహితుడిగా వ్యాసాలలో ప్రవర్తించాడు. శైలి సున్నితమై, స్పష్టమై, సంక్షిప్తంగా వుంది. ఇతడి వ్యాసాలలో ఆత్మ నివేదనం ఉత్తమ గుణం. ఉత్తమ పురుషలో వ్యాసం వ్రాయటం, వ్యాసంలో నిరంతరం రచయిత ప్రత్యక్షంగా ఉండటం, పాఠకుడితో ప్రతి క్షణం మాట్లా డుతూ వుండటం కౌలీకి ఇష్టం. ఆ విధమైన రచన సమర్థవంతంగా నిర్వహిం చాడు. ప్రధానంగా వ్యాసరచయితకుండవలసిన గుణాలు అధికంగా ఉన్నవాడు కౌలీ. తరువాత ఉత్తమ వ్యాస రచయితలు అడిసన్, స్టీల్, లేంబ్‌లు అనుసరింప దగ్గ వ్యాస మార్గం చూపిన కౌలీ వ్యాస బ్రహ్మగా పేరొందాడు.

ఓవెన్ ఫెల్తామ్ రాజకీయ, నైతిక పారమార్థిక ధర్మాలతో నిండిన వ్యాసాలలో ప్రభుత్వాన్ని వ్యతిరేకించాడు. భావ వ్యక్తీకరణలో తీవ్రత ఈ

వ్యాసాల ధర్మం. రెండు సంపుటాలలో ఈతడి వ్యాసాలు అనేక ముద్రణలు పొందాయి. విలియం డ్రమ్మండ్ కవిగా పేరొంది, వ్యాస రచయితగా గుర్తింప బడ్డప్పుడు విమర్శకులు అతడి వచనంలో కవిత్వం చూశారు. వ్యాసం కవితా వచనంతో వ్రాసిన ఆది వ్యాస కర్త విలియం డ్రమ్మండ్. అతడి శైలి హృదయ ప్రవర్తకమయింది. సర్ థామస్ బ్రౌనే ప్రథమ వ్యాసంతో వ్యాస కర్తగా పేరొందాడు. ఇతడి వ్యాసాలు మిక్కిలి విస్తృతాలు. అయితే అతడిలో వ్యాస కర్త లక్షణాలు తక్కువ. గొప్ప విమర్శకుడు. మత వైద్య విషయ ప్రధానంగా బ్రౌనే వ్యాసాలున్నాయి. బుద్ధి బలం ఎక్కువగా ఉన్న బ్రౌనే గొప్ప ఆలోచనా పరుడే కాని, ఉత్తమ వ్యాస రచయిత కాలేకపోయాడు. ఎడ్వర్డ్ హైడ్ వ్యాసాలలో అనుభవాధిక్యం, ఆలోచనా వైవిధ్యం, భావ తీవ్రత గోచరమవుతూ వున్నాయి. బేకన్ లాగా కాకుండా మాంటేన్‌లా వ్యాసాలు ఇతడి వ్యక్తిత్వ ముద్రతో శోభించాయి.

జేమ్స్ హోవెల్ వ్యాస రచయితలలో బేకన్ తరువాత అంతటి కార్యాంతర మగ్న మనస్వి. రచయితగా గొప్ప శైలి కలవాడు కాడు. వ్యాసాలలో స్పష్టత, వేగం చూపి, పాఠకులతో సన్నిహితంగా సరదాగా ఉండే తత్త్వం కలవాడు. తర్వాత వెలువడ్డ పత్రికా వ్యాస రచనకు జేమ్స్ హోవెల్ మార్గదర్శి అయ్యాడు. ఉత్తమ కవి అయిన మిల్టన్ వ్రాసిన వ్యాసాలు, ఆతని హృదయ వ్యక్తీకరణ లేనివయినట్లయితే, వివాద సాహిత్యంగా తిరస్కరణ పొంది ఉండేవి. సర్ విలియం టెంపిల్, లార్డ్ హాలీఫాక్స్ వ్యాస సాహిత్యంలో ప్రసిద్ధులు. డ్రైడెన్ యావత్ సాహిత్యంలో పొందిన ఉన్నత శిఖరం వచనంలో సగం తగ్గి వ్యాసంలో మరింత తగ్గిపోయింది. అతడి విమర్శనం హృదయ వ్యక్తీకరణం పొంది ఉండకపోతే వ్యాసం అయివుండేది కాదు. మాంటేన్ హృదయ తత్వం కలిగి విమర్శనం వ్రాసిన డ్రైడెన్ వ్యాసకర్తగా భావింప బడటంతో విమర్శన వ్యాసానికి 17 వ శతాబ్ది చివరలో అంకురార్పణం జరిగింది.

## 1. 4. వార్తా పత్రికా యుగం

వార్తా పత్రికలు అధికమై, పత్రికల కోసం వ్యాసాలు వ్రాయటం, 17 వ శతాబ్ది అంతంలో, 18 వ శతాబ్ది ఆరంభంలో ఎక్కువయింది. వార్తా

పత్రికలలో ముద్రింపబడే వ్యాసాలలో ఉదాత్తత తగ్గిపోయింది. సామాన్య సంగతులు, అప్రధాన విషయాలు ఒక రోజు కంటే గుర్తుంచుకో నవసరంలేని లోక వ్యవహారాలు వ్యాసంలో చోటు చేసుకొన్నాయి. రాజకీయ, సాంఘిక సమస్యలు విమర్శనా దృష్టితో చూడబడ్డాయి. సంఘ దోషాలు తీవ్రంగా విమర్శించటం, విమర్శనంలో హాస్యమో, అపహాస్యమో, పరిహాసమో నిక్షిప్తం చేయటం, స్త్రీల అలవాట్లు నిందించడంవంటి విషయాలు వ్యాసాలలో ప్రవేశించాయి. నలుగురు కూడే చోట ఏర్పడే విచిత్రతలు, నలుగురు కలిసే చోట చర్చించుకొనే వీలు ఈ వార్తా పత్రికలలోని వ్యాసాలవల్ల ఏర్పడింది. వారాని కొకసారో, రెండు మూడుసార్లో, ప్రతి దినమో వచ్చే ఈ వార్తా పత్రికలలోని వ్యాసాలు విషయగతంగా తాత్కాలికమైనవే అయినా, శైలి, రచనా విధానం వ్యాసకర్త హృదయ వ్యక్తీకరణం, హాస్యం మొదలైన గుణాలు ఆ రచనలకు సార్వకాలిక స్థానం కల్పించాయి.

ఈ యుగంలో వ్యాసాలన్నీ వార్తా పత్రికలలో ముద్రింపబడటం వల్ల వ్యాసకర్తలకు పత్రికలు ఆధారం కావటం వల్ల, స్టీలు, ఎడిసన్ వంటి ప్రముఖులు ఈ కాలంలోని ఉత్తమ వ్యాస రచయితలే అయినా, ఈ యుగం వార్తా పత్రికా యుగంగా భావింపబడింది.

డేనియల్ డెఫో నుంచి వార్తా పత్రికా రచనం స్టీలు గ్రహించాడు. డెఫో ఉత్తమ వ్యాస కర్త. నిలకడగల రచయిత. అంతర్జాతీయ రాజకీయాలు, వాణిజ్యం డెఫోను వత్తిడి చేస్తూ వుండేవి. పలు పత్రికల్లో అనేక వ్యాసాలు వ్రాశాడు. ఏ విషయం మీద అయినా వ్యాసం వ్రాసే నేర్పు ఇతడి నుంచి తర్వాత వాళ్ళకు సంక్రమించింది.

స్టీల్ కంటె ఎడిసన్ ఉత్తమ వ్యాసకర్త కాని, స్టీల్ ఎడిసన్‌కు మార్గదర్శి. వ్యాస రచనకంటె ముందు స్టీల్ ఇతర సాహిత్య ప్రక్రియల్లో కృషి చేశాడు. అసత్యాన్ని లోకానికి చూపటం, మోసం కుళ్లు కుట్రల ముసుగు లాగివేయటం, వేష భాషా ప్రవర్తనలలో ఆర్జవం గుర్తింప జేయటం సాహిత్యంలో స్టీలు లక్షణాలు. వారానికి మూడు సార్లు వెలువడుతూ వచ్చిన 'టాట్లర్' లో స్టీలు ఒక్కడే సంఘ సంస్కరణ వ్యాసాలు వ్రాశాడు. పై పత్రికను ఆపి, ఎడిసన్‌తో కలిసి, 'స్పెక్టేటర్' పత్రికను దిన పత్రికగా ప్రారంభించాడు. స్టీలు

జీవితంలోని పొరపాట్లు సాహిత్యంలో కళగా రూపొందాయి. ఎన్నో అకృత్యాలు చేయగల స్టీలు సామర్థ్యం ఆశ్చర్యం కలిగిస్తుంది !

ఎడిసన్ 'టాట్లర్'లో ప్రారంభంలో అల్పంగా చివర్లో అధికంగా వ్యాస రచన చేసి, స్పెక్టేటర్‌లో స్టీలుకు సమస్కంధుడయ్యాడు. స్టీలు కంటె వేగంగా ఎడిసన్ వ్రాసేవాడు కాబట్టి స్పెక్టేటర్‌లో ఎడిసన్ రచనలు ఎక్కువగా వుండేవి. ఎడిసన్‌ని వ్యాస రచనా విషయంలో స్టీలు కంటె అధికుడుగా భావింపవచ్చు. ఎడిసన్ సంభాషణా చాతుర్యం, బుద్ధిబలం అధికంగా గలవాడు. స్టీలు హృదయ వాది. కవిత్వంలో షేక్స్పియర్, మిల్టన్‌ల లాగా వ్యాసంలో ఎడిసన్ నీతిబోధ చేశాడు. సర్ రోగర్ డి కవర్లీ, స్టీలు సృష్టి అయినా, పెంచి పెద్ద జేసిన ఖ్యాతి ఎడిసన్‌దే. హాస్యం, నిశిత పరిశీలన ఎడిసన్ గుణాలు.

అలెగ్జాండర్ పోప్ 'స్పెక్టేటర్' లోనూ 'గార్డియన్' లోనూ వ్యాసాలు వ్రాశాడు. జోనాథాన్ స్విఫ్ట్ రాజకీయ దృష్టితో 'ఎగ్జామినర్'లోనూ, 'టాట్లర్', 'స్పెక్టేటర్'లోనూ వ్యాసాలు వ్రాశాడు. జాన్ ఆర్‌బర్‌నాట్ హాస్యం, అధి క్షేపం ఉన్న వ్యాసాలు ప్రచురించాడు. ఆంథోనీ కూపర్ ప్రాథమికంగా వ్యాస రచయిత కాకపోయినా, మత సిద్ధాంత చర్చను పత్రికలలో సాగించాడు. కూపర్ మత విషయక వాదనలో వ్యాస దృష్టి వుంది.

## 1.5. పత్రికా వ్యాస యుగం

స్టీలు, ఎడిసన్‌లకు పూర్వం ఆంగ్లవ్యాసకర్తల వ్యాసాలలో ప్రత్యక్షం గానో, పరోక్షంగానో, మాంటేన్, బేకన్‌లలో ఏ ఒకరి ప్రభావమైనా గోచర మవుతుంది. స్టీలు, ఎడిసన్‌ల తర్వాతి రచయితల వ్యాసాలలో అల్పంగానో అధికంగానో వీరిద్దరి ప్రభావం ద్యోతకమవుతుంది. ఆ వ్యాసకర్త లందరూ కొంత కాలందాకా పత్రికలకోసం, పత్రికలలో వ్యాసాలు వ్రాశారు. దానితో వ్యాసం పత్రికా వ్యాసంగా రూపొందింది. ఈ విధమైన వ్యాసం వస్తువు, రచన

భావ విషయాలలో పూర్వంకంటె భిన్న రీతిలో సాగింది. అందువల్ల ఈ యుగం పత్రికా వ్యాస యుగంగా భావింపవచ్చు.

18వ శతాబ్ది ప్రారంభం నుంచి పత్రికలే వ్యాసం అభివృద్ధికి దోహద కారులయ్యాయి. 1712లో ప్రభుత్వం పత్రికల మీద పన్ను విధించడంతో చిన్న పత్రికలు ఆగిపోయాయి. పెద్ద పత్రికలు మూల్యం రెట్టింపు చేశాయి. పత్రికాభివృద్ధికి, వ్యాసాభివృద్ధికి, ఈ చర్య ప్రతిబంధకమయింది. ఈ యుగం వ్యాస చరిత్రలో వచ్చిన మరొక ముఖ్య ఘట్టం స్త్రీ సంపాదకత్వం. ఆంగ్లంలో అంతవరకు పురుషులే వ్యాసాలు వ్రాశారు. సంపాదకత్వం వహించారు. కాని 'ది పారెట్' (1746) 'ది ఫిమేల్ స్పెక్టేటర్' (1744-46) పత్రికలకు ఎలీజా హేవుడ్ సంపాదకురాలయి వ్యాసాలు వ్రాసి, పురుష సాహితీలోకంలో ప్రవేశించిన ప్రథమ వ్యాస రచయిత్రి అయింది.

హెన్రీ ఫీల్డింగ్, 'ది చాంపియన్', 'ది కవెంట్ గార్డెన్ జర్నల్'లలో స్పెక్టేటర్ శైలిలో వ్యాసాలు వ్రాసి 'టామ్ జోన్స్' వ్యాస సంపుటి ప్రకటించాడు. శామ్యూల్ జాన్‌సన్ తన పత్రిక 'రేంబ్లర్' మూలంగా వ్యాసరచయితగా ప్రసిద్ధి పొందాడు. 'ది ఐడ్లర్'లో వ్యాసాలు వ్రాయక ముందు 'ది ఎడ్వెంచర్'లో ప్రకటించాడు. భావ పటిష్ఠతకు, తీక్షణతకు 'ది రేంబ్లర్' ప్రఖ్యాతి పొందింది. పత్రికా వ్యాసశైలికి భిన్నమైన శైలిలో జాన్‌సన్ కవుల జీవితాలు వ్రాశాడు. తీవ్రవాది అయిన జాన్‌సన్ రచనల్లో హాస్యం కొరవడింది. పత్రికా వ్యాసాలు పుస్తక వ్యాసాలయినప్పుడే, ఈ వ్యాస కర్త రచనలు సముచితమైన గుర్తింపును పొందాయి. జాన్ హాక్స్‌వర్త్ బహుముఖ సారస్వత పరిశ్రమ చేసినా వ్యాస రచయితగానే గుర్తుంచుకోదగ్గ వ్యక్తి. 'ది ఎడ్వెంచర్'లో జాన్‌సన్‌కు కుడి భుజంగా నిలిచాడు. లార్డు చెస్టర్ ఫీల్డ్ 'పాగ్స్ జర్నల్' 'కామన్ సెన్స్' 'ది వరల్డ్' పత్రికలలో వ్యాసాలు వ్రాశాడు. ఆలివర్ గోల్డు స్మిత్ అసామాన్యమైన అనేక నూత్న భావాలు సమాజానికి అందించిన నేర్పరి. ఇతడి రచనలు ప్రజాదరణ పొందాయి. బేకన్ సంక్షిప్తవాక్య రచనావిన్యాసం, స్టీలు, ఎడిసన్‌ల ఉపన్యాస ధోరణి ఆలివర్ గోల్డు స్మిత్ ఆస్తులు. ఇకపైన పత్రికా వ్యాస రచనం తిరోగమించింది. ఈ తిరోగమన సమయంలో వెలువడ్డ 'ది జీనియస్' 'ది మిర్రర్' 'ది లౌంజర్' పత్రికా వ్యాస రచనంలో క్రొత్త పుంతలు త్రొక్కలేదు. ఈ సమయంలో బూలింగ్ బ్రూక్, డేవిడ్ హ్యూమ్,

హెన్రీ మెకంజీ, పత్రికా వ్యాసం క్రొత్త మార్గం పట్టించలేక పోయారు. స్టీలు, ఎడిసన్‌ల కారణంగా ఆవిర్భవించిన పత్రికా వ్యాసం, అంత ఉత్తమంగా తరువాత ఎక్కువ కాలం రచింపబడక, వాళ్ల కారణంగానే తిరోగమించింది.

## 1.6. సంధి యుగం

వ్యాసం, మాంటేన్ వ్యాసాలు లాగా హృదయ ప్రధానమై, బేకన్ వ్యాసాలు లాగా బుద్ధి ప్రధానమై విస్తరించింది. అల్పంగానో, అధికంగానో బుద్ధివైపో, హృదయంవైపో మొగ్గినా, ఆంగ్లసాహిత్యంలో డ్రైడన్ కంటె పూర్వం వచ్చిన వ్యాస సముదాయం అంతా సృజనవ్యాసం. డ్రైడన్‌తో ప్రారంభమైన విమర్శన వ్యాసం, లేహంట్, హేజ్‌లిట్ కాలాలలో పరిపూర్ణంగా రూపొందసాగింది. అందువల్ల సృజన విమర్శన వ్యాసాలు విభిన్నంగా వ్రాయబడటం, వ్యాసం రెండుగా విడిపోవటం జరిగిన ఈ కాలం సంధియుగంగా భావింపవచ్చు.

వ్యాసం ద్వివిధంగా ఈ యుగంలో గోచరించినంత స్పష్టంగా మునుపెప్పుడూ ద్యోతకం కాలేదు. ఈ సృజన విమర్శన వ్యాసాలు భిన్న వ్యక్తుల వల్ల అభివృద్ధి చెందక, ఈ కాలంలో ఒకే రచయిత వల్ల రూపొందటమూ జరిగింది.

లేహంట్ వ్యక్తిత్వం ఉత్తమ మయింది. 'ది ఎగ్జామినర్', 'ది రిఫ్లెక్టర్'. 'ది ఇండికేటర్' పత్రికలకు సంపాదకత్వం వహించాడు. బహు పత్రికలకు వ్యాస రచన చేశాడు. లేహంట్ ప్రధానంగా విమర్శన వ్యాసాలు రచయిత. ఈ వ్యాసాలలోనూ హృదయ వ్యక్తీకరణ చేసిన రచయిత లేహంట్. విమర్శన వ్యాసాలు సృజనాత్మకంగా సృష్టించిన వ్యాస కర్త లేహంట్. విలియమ్ హేజ్‌లిట్ అత్యుత్తమాంగ్ల వ్యాస రచయితలలో పేర్కొన దగ్గ రచయిత. చార్లెస్ లేంబ్‌తో సమానుడా అనిపించేంత గొప్పవాడు. చిన్న తనంలో పత్రికా వ్యాసాలు వ్రాశాడు. సాహిత్య విమర్శనం, ఇతరేతర విమర్శన వ్యాసాలు వ్రాశాడు. ఈ విమర్శన వ్యాసాలలో వ్యాస ధర్మాలు గోచరమవుతాయి. తీవ్రవాది అయినా, హేజ్‌లిట్ మిక్కిలి సంక్షిప్తంగా వ్రాసేంత సమర్థుడు. ఇతడి

విమర్శన వ్యాసాలకంటే ఇతర వ్యాసాలు గుణభరితాలు. విన్ త్రోప్ మెక్ వర్త్, థామస్ పైనె మంచి విమర్శన వ్యాసాలు వ్రాశారు.

## 1.7. సమీక్షా యుగం

పత్రికలలో వ్యాసాలు సమాజ సంస్కరణ వాంఛా సముచితాలయి ఆవిర్భవించాయి. ఆ దశ దాటి పత్రికలలో వ్యాస రచన తిరోగమించింది. ఆ పైన పత్రికలలో విమర్శకు సమాజం కాకుండా సాహిత్యం గురి అయింది. సక్రమమయిన గ్రంథ సమీక్ష సామాన్య వ్యాసం అవుతుంది. అందువల్ల ఈ యుగం పత్రికలలో గ్రంథ విమర్శనం ప్రవేశించింది. సమీక్షకులు తీవ్ర వాదులైనప్పుడు ఉత్తమ గ్రంథాలు దూషణకు ఎర అయ్యాయి. ఈ తీవ్ర వాదనం వల్ల విమర్శవచ్చి, దానికి ప్రతి విమర్శ అవతరించడంతో సాహిత్య వివాదం సంగతి ఎలావున్నా, విమర్శన వాఙ్మయం సమీక్షల రూపంలో పెరుగ జొచ్చింది. విమర్శలు, ప్రతి విమర్శలు పాఠక హృదయ సమీపంగా జరిగి, వ్యాస ధర్మం పుణికి పుచ్చుకొన్నాయి. ఈ వాద ప్రతివాద వాఙ్మయంలో కవులు భాగం పంచుకోవటంతో విమర్శన వ్యాసాలు కవితాత్మకంగా రూపొందాయి. ఈ కాలంలో సాహిత్యంలో రాదగని పరిణామం-సాహిత్యంలో రాజకీయాలు ప్రవేశించటం - వచ్చింది.

సిడ్నీ స్మిత్ సమదృష్టితో స్త్రీ విద్యను ప్రోత్సహించి, బీద ధనిక వ్యవస్థను తిరస్కరించాడు. మత మూర్ఖత్వం ఖండించి, నిష్పాక్షికంగా గ్రంథ విమర్శనం చేశాడు. ఫ్రాన్సిస్ జఫెరే పుస్తక సమీక్షలో వస్తువు ప్రధానంగా, రచనా విధానం అప్రధానగా భావించాడు. అతడు గత శతాబ్ద సంప్రదాయ బద్ధుడైన వర్తమాన సాహిత్యవిమర్శకుడు, వర్డ్స్వర్తు, కాల్ రిడ్జి, సాథీ కవులేకారని అభిప్రాయపడ్డాడు. నచ్చిన కవులను ఆకాశానికెత్తటం, నచ్చని వాళ్ళను పాతాళంలోకి తొక్కటంఇతని పద్ధతి. బైరన్, స్కాట్‌లను తీవ్రంగా విమర్శించాడు. జఫెరీ విమర్శకుడు కాకపోతే ఏమీ కాడు. గ్రంథ విమర్శస్థాయిని పెంచి, పత్రికలకొక క్రొత్త ప్రసాదించిన వాడు జఫెరీ.

హెన్రీ బ్రెహమ్ ఉత్సాహంతో తొందరపడి అధికంగా వ్రాసేవాడు. ఇతడికి అపహసించే గుణం అధికంగా వుంది. రాజకీయాలు ప్రథమంగా, సాహిత్యం ద్వితీయంగా భావించే ఇతడి వల్ల సాహిత్యంలో విగ్, టోరీ భేదాలు

ప్రవేశించాయి. ఇతడి సమీక్షలు పాక్షిక దృష్టితో రాజకీయ కల్మషంలో కొట్టుకు పోయాయి. స్కాట్ సరసుడు సహృదయుడై, జఫెరీ, బ్రెహమ్‌లలాగా పాక్షిక సమీక్షలు చేయక ధర్మదృష్టితో సమీక్షా కార్యం నిర్వహించిన వ్యాసకర్త. రాబర్ట్ సౌధీ సమీక్షలు స్కాట్ పద్ధతిలో శ్రేష్ఠంగా వెలువడ్డాయి. గుణం అంగీకరించేటప్పుడు సౌధీ మిత మెరుగని వాడే అయినా దోష నిరూపణ విషయంలో అమిత మిత భాషి ! వర్డ్స్‌వర్త్ వ్యాసాలు సృజనాత్మకంగా ఉన్నాయి. కాల్‌రిడ్జి వ్యాసాలు చిన్న జీవిత కథలంత పెద్దగా వ్రాయబడ్డాయి.

## 1.8. లేంబ్ యుగం

19 వ శతాబ్ది వ్యాసం ప్రధానంగా విమర్శనం తాకిడికి తట్టుకోవలసి వచ్చింది. ఇది విమర్శన ఫలితం. గత యుగాల వ్యాసం పాఠక హృదయస్థమైతే విజయవంతంగా రచింప బడ్డట్టు భావించడమయింది. కాని ఈ శతాబ్దిలో వ్యాసం-సాహిత్య సమీక్షలు కారణంగా-విమర్శనానికి సమాధానం చెప్ప గలిగిందిగా వుండవలసి వచ్చింది.

చార్లెస్ లేంబ్ ఏలియాగా మారటంకాని, విమర్శనానికి చోటులేని, అవకాశంలేని పూర్తి సృజన వ్యాసం వ్రాయటంకానీ, అంతగా తన జీవిత సంబంధి అనిపించేట్టు వ్రాయటంకానీ, విమర్శకుల ప్రభావమే అనిపిస్తుంది.

ఈ యుగంలో పత్రికలు సంఘానికి అమితంగా సేవ చేశాయి. రచయిత కు పాఠకుడికి మధ్య అడ్డుగోడగా నిలబడ్డ విమర్శకుడికి అతీతంగా నిలిచి, సంపూర్ణ సృజన వ్యాస నిర్మాణం చేసి వ్యాస చక్రవర్తిగా ప్రఖ్యాతి పొందిన చార్లెస్ లేంబ్ ఈ యుగ కర్త కావటం సమంజసమే !

చార్లెస్ లేంబ్ జీవితంలో అతి సామాన్యుడు. వ్యాస సాహిత్యంలో చక్రవర్తి. కుటుంబపు బరువు బాధ్యతలతో క్రుంగిపోయిన వ్యక్తి. సునిశితమైన హాస్యరచయిత. తనను గూర్చి, బంధువులను గూర్చి, స్నేహితులను గూర్చి స్వేచ్ఛ గా వ్రాసే లేంబ్ తల్లిని గూర్చి ఏమి వ్రాయలేదు. ఏలియా అనే మారు పేరుతో రచనలు చేశాడు లేంబ్ తన కాలం తీరుతెన్నులు బాగా గ్రహించిన

కుశాగ్రబుద్ధి. లేంబ్ శైలి సుకుమారం. మాంటేను హృదయ వ్యక్తీకరణ రీతిని లేంబ్‌కంటే అధికంగా పుణికి పుచ్చుకొన్నవాళ్ళు ఆంగ్ల వ్యాస సార్వస్వతంలో మరెవరూ లేరు. మాంటేన్ వ్యాసాలులో లాగా వ్యక్తిత్వముద్ర, వ్యక్తిగత ధోరణి వ్యాసంలో అధికంగా ఉండాలని భావించిన లేంబ్ వ్రాసిన వ్యాసాలు ఆంగ్లవ్యాస చరిత్రలో ఒక ప్రధాన ఘట్టంగా మిగిలివుంటాయి. లేంబ్ వ్యాసాలలోని కొన్ని ఉత్తమ గుణాలు లేంబ్ కంటె పూర్వంలో కాని పరంలో కాని ఉన్నఏ ఆంగ్ల రచయిత అయినా కలిగియుండవచ్చు కాని అన్ని గుణాలు కలిపి చూస్తే లేంబ్‌కి తుల్య వ్యాస రచయిత లేడు. మానవతావాది అయిన లేంబ్ వ్యాసాలు ఆత్మకథలులాగా హాస్య పూరితాలై, చక్కని శైలితో ఒప్పుతూ వున్నాయి.

జాన్ విల్సన్ ప్రధానంగా విమర్శకుడు. కాల్‌రిడ్జి, వర్డ్సవర్త్‌ల మీద విపరీత విమర్శలు ప్రకటించాడు. అతని వ్యాసాలలో సాహిత్య దృక్పథం లేక పోవటం, సృజన వ్యాస రచనలు అల్పంగా చేయటం గ్రహింపవచ్చు. జాన్ విల్సన్ లాక్ హర్ట్ సాహిత్యంలో శాశ్వతస్థాయి వుంది. జాన్ విల్సన్ కాల్‌రిడ్జి వర్డ్సవర్త్‌ల మీద వ్రాసిన విమర్శలు తప్పని వ్రాశాడు. ఇతని జీవిత చరిత్రలు గొప్పవే అయినా ఇతడు ప్రధానంగా విమర్శకుడు. జాన్‌స్కాట్ ఉత్తమ కళా లక్షణాలున్న సాహిత్యం సృష్టించినా ప్రధానంగా పత్రికా సంపాదకుడుగా రాజకీయాలు వ్రాసిన విమర్శకుడు.

డిక్వీన్సీ వ్యాసంలో చరిత్రగాని, వేదాంతం గాని ప్రధానంగా ఉన్నా, హాస్యం తొంగిచూస్తుంటుంది. ఉత్తమ వచన రచయితగా చెప్పవచ్చు. ఇతడు ఉత్తమ వ్యాస రచయిత కాలేకపోయాడు. ఇతని వ్యాసాలు అధికంగా విమర్శనాత్మకాలు. థామస్ మాన్‌టాల్‌ఫోర్ట్ మధ్యతరగతి జనంకోసం వ్యాసాలు వ్రాసిన అభ్యుదయవాది. పత్రికా సంపాదకత్వం వహించిన విమర్శన వ్యాస రచయిత. రాబర్ట్‌చాంబర్స్ పత్రికలకు అనేక వ్యాసాలు తాత్త్విక చింతన గల పుస్తకాలు రచించాడు.

హ్యూమిల్లర్ సాహిత్యచరిత్రలో స్మరణీయమైన పత్రికా సంపాదకుడు. విమర్శన వ్యాసాలు, పత్రికా వ్యాసాలు ప్రకటించాడు. డా. జాన్‌బ్రౌన్ వైద్యుడుగా కంటె వ్యాసరచయితగా ప్రసిద్ధుడు. కుక్కను గూర్చి చక్కని వ్యాసం

వ్రాశాడు. చక్కని శైలి, ఉన్నత భావాలున్న ఈ వ్యాసకర్తను సమకాలిక వ్యాసకర్తలు ప్రేమించారు. థాకరీ వాస్తవికత వున్న వ్యాసాలు రచించాడు. ఇతడి వ్యాసాలు సమకాలికులు గుర్తించారు. సమకాలిక సమస్యలు, పత్రికలు ఇతని విమర్శకు గురి అయ్యాయి. పత్రికా వ్యాసరచన బాగా దెబ్బతింటున్న కాలంలో సమర్థంగా వ్యాసాలు వ్రాసిన రచయిత థాకరీ.

## 1.9. చారిత్రక వ్యాస యుగం

పత్రికల ప్రకటనం చరిత్రకు కలిగించిన దోహదం అత్యుత్తమమయింది. పత్రిక వ్యాసాల వల్ల చరిత్రపొందిన పునరుజ్జీవనం దేనికీ కలగలేదు. పత్రికల మూలంగా వ్యాసరచనలో సృజన విమర్శన వ్యాసదశలు స్పష్టంగా రూపొంద టంతోపాటు చారిత్రక వ్యాసరచన మభివృద్ధి చెందింది. వ్యాసరచనంలో వచ్చిన పరిణామం ప్రజాకర్షకమై సంఘంలో చారిత్రక దృష్టి, చరిత్రపై అభిమానం ఏర్పడ్డాయి. ఈ దశతో వెలువడ్డ గిబ్బన్ రచన 'ది రైజ్ అండ్ ఫాల్ ఆఫ్ రోమన్ ఎంపైర్' చారిత్రక వ్యాసం కాకపోయిన ఉత్తమ చరిత్రగా, చారిత్రక సిద్ధాంతంగా, సమగ్ర సిద్ధాంత గ్రంథంగా భావింపబడింది.

దేశ చరిత్ర సామాజిక జీవితంలో ప్రధాన దృక్పథం కావటం వల్ల, ఆ వ్యాసాలు బహు జనాకర్షకాలయ్యాయి. పత్రికలు చారిత్రక వ్యాసాలు ప్రక టించడం వల్ల ప్రజావసరం తీరసాగింది. సంఘం చారిత్రక వ్యాసాలు కోరు తున్నందువల్ల ఆ వ్యాస సృష్టికి రచయితలు పూనుకొన్నారు. ఈ కాలంలో అనేకు లుత్తములు చారిత్రక వ్యాసాలు వ్రాసినా, ప్రధానంగా ఈ యుగం చరిత్ర ప్రేరితం కనుక చారిత్రక వ్యాస యుగంగా భావింపవచ్చు.

థామస్ కార్లైల్ చారిత్రక విమర్శకుడుగా ప్రసిద్ధి పొందిన వ్యాస రచ యిత. ఈ కాలం రచయితల్లో ఇతనికున్న ప్రచారం ప్రాధాన్యం గణింప దగింది. చారిత్రక వ్యాస సృష్టికర్త అయిన కార్లైల్ హాస్యదృష్టి, భాషా దృష్టి, ఉత్తమ శైలి వల్ల ఉత్తమ రచయితగా భావింపబడ్డాడు. అతని 'ఫ్రెంచి రెవెల్యూషన్' ఉత్తమ రచన. కార్లైల్ చరిత్రను సజీవంగా చిత్రించాడు.

థామస్ బాబింగ్టన్ మెకాలె విమర్శన వ్యాసంతో సాహిత్య ప్రవేశం పొంది, సమీక్షా వ్యాసాలు వ్రాసి, ప్రసిద్ధి పొందాడు. ఉత్తమ చారిత్రక

వ్యాసాలు వ్రాశాడు. చారిత్రక వ్యాసాలు వ్రాయటమే కాంక్షించి విమర్శకుడు కావటానికి, అవకాశమున్నా ప్రయత్నించలేదు. ఉత్తమ శైలితో, బలమైన, విస్తృతమైన, స్పష్టమైన చక్కని వ్యాసాలతో చరిత్రాంశాలు తెలిపాడు. జేమ్స్ ఆంథోనీఫ్రేడె చారిత్రక వ్యాసాలలో మానవతా దృక్పథం ప్రసిద్ధంగా భావింపవచ్చు. వేదాంతం బలహీనతగా ఉన్న వ్యాస రచయిత జీవితం చారిత్రక వ్యాస రచనంలో ప్రవేశించింది. ఎడ్వర్డ్ ఆగష్టస్ ఫ్రేమేన్ కాలం నుంచి చారిత్రక వ్యాస రచన తిరోగమించింది. శాస్త్రబద్ధమైన రచన, పరిశోధనాత్మక రచనపైన ఉన్నత నమ్మకం సృజన సాహిత్యం మీదలేని రచయిత కావటంతో వ్యాసాలు ఉత్తమంగా రూపొందలేక పోయాయి.

## 1. 10. ఆధునిక వ్యాస యుగం

పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్థం నుంచి ప్రారంభమయిన ఈ యుగంలో వ్యాసాలు, వ్యాసకర్తలు లెక్కకందటం కష్టం. ప్రతి వ్యాసం, వ్యాసకర్త పరిచయం ఒక విధంగా అసాధ్యం. అయితే స్థూలంగా, వ్యాసం పుట్టిందగ్గర్నుంచి ఇప్పటిదాకా వచ్చిన పరిణామమే, ఆ ప్రక్రియలే ఈ యుగంలో ప్రవర్తించాయి. ఈ యుగ వ్యాసకర్తలలో ప్రసిద్ధులు అనేకులున్నా, నూత్న ప్రక్రియకాని, నూత్న రీతికాని వ్యాస వాఙ్మయంలో వెలువడక పోవటం గుర్తింపవచ్చు. ఈ యుగం ఆధునిక వ్యాసానికి నిరతిశయ యుగంగా భావింపవచ్చు.

వ్యాసం పూర్వం లాగే సృజన విమర్శన రీతుల్లో వ్రాయబడుతూవుంది. పత్రికలు ప్రత్యేక సంపుటులు పై విధమైన వ్యాసాలుతో వెలువడుతున్నాయి. పత్రికలలో సృజన విమర్శన వ్యాసాలతో పాటు పత్రికా వ్యాసాలు కూడా ప్రచురింపబడుతూ వచ్చాయి. పత్రికా వ్యాసాలలో విషయ వైవిధ్యం పెరిగింది. కాని క్రొత్తదనం చెప్పదగినంత లేకపోయింది. ఒక యుగంలో పుట్టి, దాదాపు అంతరించి పోయిన చరిత్ర దృష్టి మరో విధంగా ఈ యుగంలో మొలకెత్తింది. సాహిత్య చరిత్ర, చరిత్రగా గమనింపబడటం బాగా సాగింది.

ఈ యుగంలో మునుపెప్పుడు లేనన్ని సాహిత్య ప్రక్రియలు క్రొత్త జీవం పుంజుకొన్నాయి. కల్పనా సాహిత్యంలో నవల, కథ మొదలైన రచనల్లో రచయిత సృజన సామర్థ్యం ఎక్కువగా ఆదరింపబడటం వల్ల సృజన వ్యాసం

కొత్త పరిణామం పొందలేక పోయింది. సాహిత్యంలో పూర్తి కల్పనా సార స్వతం కాని, పూర్తి శాస్త్రరచనలు కాని సంఘం సమాదరించటానికి కారణం, అది మానసికంగా పొందిన పరిణామమే! ఆధునిక దైనందిన మానవావసరాల వల్ల—నాగరికత శాస్త్రంతోను, విద్యార్జనం అధికంగా శాస్త్రంతోను, సమాజ దృష్టి శాస్త్రంతోను సంబంధించటం వల్ల, శాస్త్ర దృష్టి పెరిగిపోయింది. దాని నుంచి ఆటవిడుపుగా పూర్తి కల్పనా సాహిత్యం ఆరాధ్యమయింది. అందువల్ల లోక సత్యాలపై కల్పనాత్మకంగా, అటు శాస్త్రంగా కాక, ఇటు కల్పనగా కాక, రెంటి కలయికగా సాగే సృజన వ్యాసం ఈ యుగంలో వెనుకంజ వేసినట్లే భావింపవచ్చు.

అలెగ్జాండర్ స్మిత్ రచన 'డ్రీమ్స్‌త్రోప్' చక్కని వ్యాస సంపుటి. 'మెన్ ఆఫ్ లెటర్స్' సాహిత్య వ్యక్తుల కళాదృష్టి చూపే గ్రంథం. 'ఎసెల్ఫ్ ఇన్ మై బుక్ కేస్' కాలక్షేప రచన. పుస్తకాలు, ప్రకృతి, లోకంలోని విచిత్ర వ్యక్తులు, ఇతని వ్యాసాలలో గోచరమవుతారు. క్రొత్త ప్రక్రియకాని, క్రొత్త భావంకాని, నిజానికి అవసరంకాదు. పాత ప్రక్రియలు, భావాలకు క్రొత్తచైతన్యం అవసరం. ఆ లోపం స్మిత్ తీర్చేడనటం ఉచితం. స్కెల్టన్ రచన 'ది టేబిల్—టాక్ ఆఫ్ షిర్లీ' ఉత్తమ శైలితో సాగిన చక్కని వ్యాస సంపుటి. ఎ కె. హెచ్. బొయిడ్ వ్యాసకర్తల కవసరమయిన హృదయముండి, ఆలోచనా అంతగా లేకపోయినా, హాయిగా వుండే సంభాషణల వంటి వ్యాసాలు వ్రాసిన వ్యక్తి.

ఆర్. ఎల్. స్టీవెన్‌సన్ ఉన్నత స్థాయి వ్యాసకర్త. లేంబ్‌తో పోల్చదగ్గ వ్యక్తి. వ్యాసాలలో వ్యక్తిగతానుభవం, హృదయ వ్యక్తీకరణం బాగా చూపిన రచయిత. బాల్యానుభవాలు తెలిపే రచనల్లో యువక తత్త్వం స్పష్టంగా చూపాడు అతడి వ్యాసాలు ఉదాత్త భావ ప్రేరణలై, హృదయనుంచి పుట్టాయి. వ్యాస కళ మెలకువలు తెలిసి, ప్రకృతిని ప్రేమించి, నీతియుత జీవితం, వీర ప్రేమ వ్యాసాలలో నింపిన రచయిత స్టీవెన్‌సన్. ఎంత శాస్త్రీయంగా విషయావ గాహనం కలిగి వుండే వాడో, అంత గుండె దగ్గరగా వ్యాస సృష్టి చేశాడు. సర్ ఆర్థర్ హెల్ప్స్, చార్లెస్ కింగ్స్లీ వ్యాసకర్తలుగా ప్రసిద్ధులే.

జాన్ రస్కిన్ రచనలన్నీ వ్యాసాలే! పాఠకులను మిత్రులుగా చూసే వ్యాసరచయిత. సిద్ధాంతం చెప్పేటప్పుడు మాత్రం పాఠకులు విద్యార్థులులా వినాలని భావిస్తాడు. టాల్‌స్టాయ్ రస్కిన్‌ని చాల గొప్పగా అభిమానించాడు. రస్కిన్ తన దృక్పథం తప్ప అన్యం గ్రహించే అవకాశం లేని రచయితగా భావింపబడ్డాడు మాథ్యూ ఆర్నాల్డ్ వచన రచన లన్నీ వ్యాసాలే! ఆర్నాల్డ్ మత సంఘ సాహిత్య విమర్శకుడు. వాల్టర్ పేటర్ చక్కని శైలిలో విమర్శన చారిత్రక వ్యాసాలు వ్రాశాడు. వాల్టర్ బాగ్ హాట్ సాహిత్య విమర్శలు, జీవిత చరిత్రలు వేదాంత దృష్టితో వ్రాసిన రచయిత. థామస్ హెన్రీ హక్లే హాస్య గుణంతో, వేదాంత దృష్టితో నిశిత భావ వ్యక్తీకరణంతో విజ్ఞాన శాస్త్ర విషయాలపై వ్యాసాలు వ్రాశాడు.

థియోడోర్ వాట్స్-డంటన్, లెస్లీ స్టీఫెన్, హెన్రీడఫ్ ట్రెయిల్, రిచర్డ్ జఫెరీస్ మొదలైన అనేకులు వ్యాస రచన చేశారు. ఉత్తమ వ్యాస రచయితగా రూపొందటానికి తగ్గ లక్షణాలతో ఒప్పే ఆండ్రూ లాంగ్, చక్కని హాస్యంతో మరణ వార్త రచయితగా సాహిత్య రంగంలో అడుగు పెట్టిన లాఫ్ కేడియో హేరన్, కవి నవలారచయితా అయి కూడా చక్కని వ్యాసాలు వ్రాసిన గిస్సింగ్, చక్కని విమర్శనాదృష్టి ఉన్న ఫ్రాన్సిస్ థామ్సన్ వ్యాస రచనలో లోతులు గ్రహించటానికి సిద్ధమయిన రిచర్డ్ మిడిల్‌టన్, సాహిత్య దృక్పథ ప్రచారార్థం వ్యాసం స్వీకరించిన జాన్‌సింగే మొదలైన వాళ్ళు పేర్కొదగ్గ కృషి చేశారు.

మిక్కిలి ఆధునికుల్లో, నవలా రచయితగా ప్రసిద్ధుడయిన డి. హెచ్. లారెన్స్, సాహిత్య విమర్శన రచయితలుగా కృషి చేసిన యఫ్.యల్. టాకాస్, మిడిల్‌టన్ మర్రి, కవిగా ప్రఖ్యాతి పొందిన టి.యస్. ఇలియట్, సాహిత్య చరిత్ర పట్ల అధిక మమకారం చూపుతూ వ్రాసే జార్జి సెయింట్స్‌బర్గ్, జేమ్స్ సథర్‌లేండ్, డేవిడ్ డైచీస్, జఫర్‌సన్, జార్జి శాంసన్ మొదలైన అనేకులు వ్యాస రచన చేశారు, చేస్తూ ఉన్నారు.

ఆంగ్ల సాహిత్యంలో వ్యాస ప్రక్రియ నాలుగు వందలేళ్ళు నుంచి వ్రాయబడుతూ పరిణామం పొందింది. వ్యాసంలో విమర్శనం, చరిత్ర, ఆత్మకథ, జీవిత కథ. వ్రాసినా, వ్యాసం సృజనం, విమర్శనం, పత్రికా వ్యాసం, సమీక్షగా

రూపొందినా, వ్యాసరచయిత, హృదయం వ్యక్తీకరింపబడి, సృజనంగా వుంది. పాఠకులతో సన్నిహితంగా వుండి, వచనంగా, స్వల్పంగా హాస్యంగా వుండి, పాఠకుల బుద్ధికి కంటె, గుండెకు దగ్గరగా వచ్చిన వచన రచనా విధానం వ్యాసంగా భావింపబడింది. పూర్తి శాస్త్రంగా, పూర్తి విమర్శనంగా, పూర్తి చరిత్రగా, పూర్తి సిద్ధాంతంగా, పూర్తి క్రమబద్ధంగా, పరిపూర్ణంగా ఉన్న ఏ రచనా వ్యాసంగా భావింపబడలేదు. అందుచేత వ్యాసం హద్దులు అవధులు గోచరించాయి. కాబట్టి, ఆంగ్ల వ్యాస లక్షణాలు పరికించిన దృష్టితో ఆంధ్ర వ్యాస లక్షణాలు పోల్చుకోవచ్చు. హ్యూవాకర్ రచన 'ది ఇంగ్లీష్ ఎస్సే అండ్ ఎస్సేయిస్ట్'; ఆర్లో విలియమ్స్ సృష్టి 'ది ఎస్సే'; యఫ్. హెచ్. ప్రిచ్చర్డ్ గ్రంథం 'గ్రేట్ ఎస్సేస్ ఆఫ్ ఆల్ నేషన్స్'; మేబెల్ ఇరేని రిచ్ పుస్తకం 'ఎ స్టడీ ఆఫ్ ది టైప్స్ ఆఫ్ లిటరేచర్'; హెన్రీ న్యూ బోల్ట్ పరిశోధన 'ఎస్సేస్ అండ్ ఎస్సేయిస్ట్స్'; 'ఎన్ సైక్లోపీడియా బ్రిటానికా'లోని 'ఎస్సే అండ్ ఎస్సేయిస్ట్స్' విభాగం; ఈ వ్యాసధర్మ పరిణామ పరిశీలనకు నేపథ్యమై వున్నాయి.

## 2. వ్యాస లక్షణాలు

ఆంగ్లంలో ఎస్సె అన్న పదానికి ఆంధ్రంలో వ్యాసం నేడు సమానార్థకంగా ప్రయోగింపబడుతూ వుంది. ఆంగ్లంలో కాని, ఆంధ్రంలో కాని వ్యాస లక్షణాలు నిర్దేశించిన శాస్త్ర గ్రంథం లేదు. పైగా ఆ ప్రయత్నం వ్యాసం విషయంలో అనవసరం, అసాధ్యం, నిరుపయోగం అన్న అభిప్రాయం కూడ వుంది.

1. "At the same time, its outlines are so uncertain and varies so much in matter, purpose, and style, that systematic treatment of it is impossible." (1)

2. "The Word essay is very loosely used, and any attempt to fix rigourusly its forms and features must perforce end in failure." (2)

3. "while, therefore, we know fairly well what to expect of a poem called a lyric, and even of one called an epic or a tragedy, we have hardly the vaguest idea of what we shall find in a composition entitled an essay." (3)

4. "Definitions of the essay abound and yet no one has even been able to confine it in a phrase...........the truth is that it cannot be limited as to form or content." (4)

తెలుగులో వ్యాస లక్షణాలు, అందువల్ల స్పష్టంగా వివరించటానికి, పూర్వ ప్రయత్నం జరగలేదు వచన రచనగా, పద్య రచనగా, స్వల్ప పరిధి పరిమితంగా, విస్తృతంగా, స్వజనంగా, విమర్శనంగా, చారిత్రకంగా, సమీక్షగా, పత్రికా వ్యాసంగా వివిధంగా వికసించిన వ్యాసానికి లక్షణాలు చెప్పటం కష్టమే ! స్థిర రూపం లేక, కాలానుగుణంగా మారి, వస్తువు ఉద్దేశం శైలి భిన్నంగా సాగి, ఏ లక్షణాల పరిధిలో ఒదగకుండా పెరిగిపోయిన వ్యాస సాహిత్యం వింగడించి లక్షణాలు చెప్పబూనటం బాధ్యతాయుత కర్తవ్యం.

వ్యాసానికి లక్షణాలు, నిర్వచనాలు చెప్పటానికి అనేకులు ప్రయత్నించారు. ఈ ప్రయత్నించిన వాళ్ళలో ఎక్కువ మంది వ్యాసకర్తలు. వీళ్ళు చెప్పబూనుకొన్న వ్యాస లక్షణాలు చాలవరకు తమ వ్యాసాలకు, కొంతవరకు ఇతర వ్యాసాలకు వర్తించే టట్లుగా వున్నాయి. అంతేకాని సమగ్రంగా కూలంకషంగా నిర్వచనం కాని, లక్షణాలు కాని వ్యాసానికి చెప్పబడలేదు. విమర్శకులు చెప్ప ప్రయత్నించిన నిర్వచనాలు అతివ్యాప్తి అవ్యాప్తి దోషాలతో నిండాయి కాని సమగ్రం పరిపూర్ణం స్పష్టం అయిన నిర్వచనాలుగా కాని, లక్షణాలుగా కాని రూపొందలేదు. యధేచ్ఛగా సాగిన విస్తృత వ్యాస పరంపరలో లక్షణాలు స్థూలంగా చూడటానికి ప్రయత్నం చేయవచ్చు.

## 2. 1. 1. ఎస్సె-అర్థం

వ్యాస లక్షణాలు గ్రహించే ప్రయత్నంలో మొట్టమొదట వ్యాసం అనే పదానికి అర్థం తెలుసుకోవాలి. ఎస్సే అంటే ఆంగ్లార్థం ఆంగ్ధార్థం పరిశీలించాలి. తెలుగు వ్యాస పర్యాయపదాల అర్థం ఆంగ్లార్థంతో పోల్చిచూడాలి.

> "Etymologically, the word essay connotes this for it is the same as assay, and therefore means a trial of a subject, or an attempt towards it, and not in the least a thorough and final examination of it."(5)

ఎస్సె (essay) అనే పదం అస్సె (assay) అనే పదంతో తుల్యమనీ, ఒక విషయాన్ని పరిశీలించటం కానీ, ఆ ప్రయత్నం కానీ, దాని అర్థమనీ, ఏ విధంగానూ పరిపూర్ణ పరీక్ష కాదనీ తెలుపబడింది. "......... Essais meaning "attempts" or ' trails"(6) ఈ నిర్వచనా భిప్రాయం పై నిర్వచనంలో లాగా వుంది. ఇక్కడ ఎస్సైస్ అనే పదం ప్రయత్నాలు, పరిశీలనలు తెలిపేదిగా వుంది.

> "The word essay is a form of assay and derives from Latin exagium, a weighing or trial." (7)

ఎస్సె, అస్సె అన్య రూపమనీ, లాటిన్ పదం ఎక్సాజియమ్ నుంచి రూపొందిందని, తూచటం, పరిశీలించటం దాని కర్థమనీ తెలుపబడింది.

> "The very word from old French essai an attempt is ambiguous." (8)

ఎస్సె అనుదానికి ఎస్సై అనే పాత ఫ్రెంచిలోని మూల రూపం అనటం అస్పష్టంగా వుందని తెలుపబడింది.

ఎస్సె అనే పదానికి అస్సె రూపాంతరంగా చెప్పి, దానికి మూలం లాటిన్ పదమైన ఎక్సాజియమ్ అనటం, ఎస్సై అనే ఫ్రెంచి పదం మూలం అనటం రెండు రీతులు గోచర మవుతున్నాయి. ఎక్సాజియమ్ అన్నా, ఎస్సై అన్నా పరిశీలించటం అనే అర్థ సామ్యం ఉందని గమనింపవచ్చు. ఎక్సాజియమ్ నుంచి అస్సే వచ్చి, అస్సేకి సమానంగా ఎస్సె ఉందనటం కంటె, ఎస్సై నుంచి ఎస్సె ఏర్పడిన దనటం సముచితం. పైగా ఫ్రెంచి రచయిత మైకల్ డిమాంటేన్ ప్రథమ వ్యాస రచయిత కనుక, ఫ్రెంచి భాషలో వ్యాసానికి మూల పదం అయిన ఎస్సై, ఎస్సెకి మూల రూపంగా భావింపవచ్చు. కనుక ఆంగ్లంలోని ఎస్సె అనే పదానికి ఫ్రెంచి ఎస్సై మూల పదంగా భావించటమే సమంజసం.

కాబట్టి ఎస్సె అనే పదానికి అర్థం ఎస్సై పదార్థమే అవుతుంది. దానికి ప్రయత్నం, పరిశీలనం అని అర్థాలు. కనుక వ్యాసం అంటే ప్రయత్నం, పరిశీలనం అని చెప్పవచ్చు. ప్రయత్నం అనేది వ్రాతకు, పరిశీలనం అనేది ఆలోచనకూ సంబంధించినట్లు భావింపవచ్చు. వ్యాసం భాషా విషయక వచనంలో ప్రయత్నంగా పరిశీలనంగా గుర్తుంచుకోవలసిన అవసరం వుంది. హడ్సన్ ఎస్సె లాటిన్ పదమయిన ఎక్సాజియమ్ నుంచి ఏర్పడినట్లు భావించినా, తూచటం అనే పదానికి అలంకారికార్థం కూడా గ్రహించి, ప్రయత్నించటం, పరిశీలించటంగా చెప్పినట్లుగా కాని, ఎస్సై పదార్థం గ్రహించి ప్రయత్నించటం, పరిశీలించటంగా చెప్పినట్లుగాని భావింపవచ్చు.

## 2. 1. 2. వ్యాసం - అర్థం

వ్యాసం ఆంగ్ల ప్రక్రియే అయినా, పదానికుండే అర్థం ఆంధ్ర విమర్శకులే విధంగా భావించారో తెలుసుకొని, తెలుగులో పొందిన మార్పు పరికింపవచ్చు. సాధారణంగా ప్రక్రియ ఆంగ్లంలోనుంచి తెలుగులోని వచ్చినప్పుడు, ఆ ప్రక్రియ కాంగ్లంలో వుండే లక్షణాలు చాల వరకు ఆంధ్రంలోకి రావటం సహజం! ఒకొ్కక్కప్పుడు ఆంగ్ల ప్రక్రియ ఆంధ్రంలో క్రొత్త స్ఫూర్తి కలిగించటం కాని, సహజ లక్షణం కోల్పోవటంకాని సాధ్యమే. వ్యాసం ఆంధ్రంలో క్రొత్త స్ఫూర్తి పొందిందేమో పరిశీలింప వచ్చు.

వ్యాసమంటే ''ఏదేని యొక విషయమును విరివిగా వ్రాయుట'' అని శబ్దార్థ చంద్రిక, శబ్దరత్నాకరం, ''ఏదేని యొక చరిత్రాంశము'' అని ఆంధ్ర వాచస్పత్యం, ''ఏ విషయమునైనను తెలిసికొని దాని యందలి అంశములను విభజించి, వివరించి చెప్పుట వ్యాసమని చెప్పవచ్చును'' అని భాషా సమితి విజ్ఞాన సర్వస్వం చెప్పే అర్థాలు అసమగ్రంగా ఉన్నాయి.

''సంస్కృతమున, వి పూర్వకమగు అస్ ధాతువునకు ఏర్పరచుట అనియును, ని పూర్వకమగు అస్ అనుదానికి ఉంచుట అనియును అర్థము'' (9) అనీ, ''వ్యాస శబ్దమునకు సంస్కృతమున విస్తారము, విగ్రహము అను పర్యాయపదములు గలవు. 1. విస్తతిర్విస్తారః స్తృఞ్ ఆచ్ఛాదనే. విశేషముగాఁ గప్పుకొనుట. 2. విశేషణ గ్రహణం విగ్రహః గ్రహ ఉపాదానే. విశేషముగా గ్రహించుట. 3. వివిధ మాసనం వ్యాసః అసఉపవేశనే. అనేక ప్రకారములుగా నుండుట అని దీని వ్యుత్పత్తులు ఈ మూడును విరివికి పేళ్ళయినను నేడు పై మూడింటిలో వ్యాసము అనునది ఆధునిక సాహిత్య శాఖలో నొక ప్రత్యేక రచనకు రూఢియైనది'' (10) అనీ వ్యాస పదానికి అర్థం చెప్పటానికి ప్రయత్నం జరిగింది.

వ్యాసం అంటే 'ఏదేని యొక విషయమును విరివిగా వ్రాయుట' అనటం అర్థం చెప్పటంకాదు; నిర్వచించే ప్రయత్నం. వ్యాసం అంటే చరిత్రాంశం కాదు. వ్యాసం వ్రాయటానికి వస్తువు విభజింపబడి, వివరింపబడవచ్చు కాని, వ్యాసం అంటే వివరించటమే కాదు. సంస్కృతంలో వ్యాసమంటే నేడు అనుకొనే వ్యాసంకాదు. వ్యాసం అంటే 'ఉంచుట' అయితే సాహిత్యంలో దాని అర్థం స్పష్టం కాలేదు. తెలుగులో వ్యాసపదార్థం స్పష్టంగా లేదు.

ఎస్సెకి తెలుగులో వ్యాసం అనే పదం స్థిరం కాక పూర్వం మూడు పదాలు తదర్థంలో ప్రయోగింపబడ్డట్లు స్పష్టమవుతుంది.

''వ్యాసరచన వ్యాప్తికి వచ్చిన తొలినాళ్ళలో వ్యాసమునకు-ప్రమేయము శ్రీ స్వామినీన ముద్దునారసింహనాయనిగారు, సంగ్రహము శ్రీమాన్ పరవస్తు వేంకటరంగాచార్యులు గారు, ఉపన్యాసము శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గారు అను నామములు వాడుకలో నుండెను'' (11) అనీ, ''హిత సూచని రచ

యిత ఎస్సేకి పర్యాయపదం వ్యాసం అనడానికి బదులు ప్రమేయం అని ప్రయోగించాడు. ఇది గమనింప దగింది. ఇలాగే పరవస్తు వేంకటరంగాచార్యులుగారు (1822-1900) తమ వ్యాసాలను సంగ్రహము అన్నారు. కందుకూరి వీరేశలింగంగారు (1848-1919) ఉపన్యాసము అన్నారు.'' (12) అనీ తెలపటం వల్ల పై మూడు పదాలు వ్యాసపదానికి తదర్థంలో పూర్వపదాలు.

అయితే ఎస్సె అనే పదానికున్న అర్థం వ్యాసం అనే పదంలో లభ్యం కాదు. ప్రమేయమంటే ''యథార్థముగా ఎఱుఁగఁదగినది'' అనే అర్థం, సంగ్రహమంటే ''సమ్యగ్రహణము సంక్షేపము, సంక్షిప్తగ్రంథము'' అనే అర్థం, ఉపన్యాసమంటే ''ఏదేని యొక విషయము నెత్తి విస్తరించి చెప్పుట'' అనే అర్థం. ఆంగ్లంలోని ఎస్సె అనే పదానికున్న అర్థంతో పూర్తిగా పోలక, ఎస్సె పదార్థంలోని కొన్ని లక్షణాలు మాత్రమే తెలిపేవిగా ఉన్నాయి. ప్రమేయం సంగ్రహం, ఉపన్యాసం, వ్యాసం అన్న పదాలు ఉత్తరోత్తరం బలీయంగా ప్రయోగింపబడ్డాయి.

ఎస్సె అనే పదానికి వ్యాసం అర్థమైనట్లు సి.పి. బ్రౌను తెలిపాడు. ఎస్సె అంటే వివరణం కూడా ఇచ్చాడు. ''Essay; es 'sa' n.s. యత్నము ప్రయత్నము. An e. upon morals హితోపదేశము నీతి శాస్త్రమును గురించిన చిన్న గ్రంథము. Pope's e. on man పోపనే ఆయన చెప్పిన మానుష్య వివరణము, a well known e. on etymology is named వైకృతి చంద్రిక, an e on the principia సిద్ధాంత కౌముది, an e on devine knowledge జ్ఞాన ప్రదీపిక, the master ordered the student to write an e upon this యిందును గురించి నీకు తోచిన సాధక బాధకములను వ్రాయుచున్నాడు. an e on female education స్త్రీలకు శిక్ష చెప్పడములోవుండే సాధకబాధకముల వివరణము. Essayist n.s. గ్రంథకర్త. నొక విషయమును ఉపన్యసించి చిన్న గ్రంథము రచించేవాడు'' (13) అంతేకాక, ఎస్సె పదవివరణం కూడా గమనింపవచ్చు. ''Essay n.s. (add) is commonly called in Madras వ్యాసము Essayist n.s he who makes an attempt who writes an essay, an author ప్రయత్నము చేసే వాడు. (In Madras commonly called వ్యాసము వ్రాసేవాడు గ్రంథకర్త.'' (14)

ఈ నిఘంటువు 1852 లో ముద్రితమయింది. కనుక ఎస్సె అనే పదానికి తెలుగువ్యాసం అనే పదం మద్రాసులో అంటే మద్రాసుప్రాంతంలో ఉందని చెప్పబడుతూవుంది. కనుక 1862 కంటే ముందుగా వ్యాసాలు వ్రాసిన స్వామి నీనముద్దు నారసింహనాయుడు తన హితసూచని ప్రమేయాలకు వ్యాసం అని పేరుపెట్టకపోవడం, 1870,75 ప్రాంతంలో సంగ్రహాలు వ్రాసిన పరవస్తు వేంకటరంగాచార్యులు వ్యాసాలని పేర్కొనకపోవటం, తొంభైనాలుగు వ్యాసాలు వ్రాసిన బెంగుళూరునివాసి జయ్యరు సూరి ఈ రచనలను వ్యాసాలనకపోవటం, ఆతర్వాత కందుకూరి వీరేశలింగంపంతులు వ్యాసాలనక ఉపన్యాసాలనటం గమనిస్తే ఎస్సె అన్న పదానికి వ్యాసమని మద్రాసులోఉంటే వుండవచ్చుకాని తెనుగుదేశంలో ప్రచారం లేదు. ఒకవేళ ప్రసిద్ధిలోఉంటే సర్వజన సామాన్యంగా లేదు. ఉంటే ప్రసిద్ధ వ్యాసకర్తలకు లభ్యమయి ఉండేది.

అయితే సి. పి. బ్రౌను అంతటి ఆంధ్రసారస్వతోద్ధారకుడు అభూత కల్పనవ్రాసినట్లు భావించటం కుదరదు. అందుకు ఆధారం ఈవిధంగా గమనింప వచ్చు. "ది మెడ్రాస్ జర్నల్ ఆఫ్ లిటరేచర్ అండ్ సైన్స్'' మెడ్రాస్ లిటరరీ సొసైటీ, ఆగ్జిలరీ ఆఫ్ ది రాయల్ ఏషియాటిక్ సొసైటీ ప్రచురించే త్రైమాస పత్రికలో జూలై 1839, అక్టోబరు 1839 సంచికలలో ప్రచురింపబడ్డ ''ఎస్సె ఆన్ ది లేంగ్వేజ్ అండ్ లిటరేచర్ ఆఫ్ ది తెలుగూస్'' అనే చార్లెస్ పి. బ్రౌన్ రచన చదివి, మద్రాసులోని రచయితమిత్రులు ఉద్యోగస్థులు, పండితులు, పరిచయస్థులు, ఎవరయినా ఎస్సె అనే పదానికి తుల్యపదం తెలుగులో వ్యాసమని, ఎస్సేయిస్టుకు గ్రంథకర్త, వ్యాసము వ్రాసేవాడు అని చెప్పివుండవచ్చు. సి.పి. బ్రౌన్ ఆ పదాలు సర్వ సామాన్యమయిన పదాలుగా భావించివుండవచ్చు. లేకపోతే సర్వసామాన్యమయిన వ్యాసము వ్రాసేవాడు వంటి పద సామాన్యతకు సంబంధించిన ఆధారాలిప్పుడు లభ్యంగా ఉన్నాయి.

ఏమయినా, సి.పి. బ్రౌన్ వ్రాసిన ఈ వ్యాసం ఆంగ్లభాషలో ఆంధ్రభాషా సారస్వతాలకు సంబంధించిన ప్రథమవ్యాసం. మద్రాసు ప్రాంతములో ఎవరు ఎప్పుడు వ్యాసం అన్న పదం వాడారో కాని, గ్రంథస్థంగా ఈ పదం మొదట ప్రయోగించింది సి.పి. బ్రౌన్.

9)

ప్రమేయం, సంగ్రహం, ఉపన్యాసం వ్యాసం పదాలలో ఎస్సే తుల్యంగా నేడు వ్యాసం ప్రయోగింపబడుతూ వుంది. రెండింటికి పదార్థంలో తేడావున్నా, రెండూ ప్రక్రియార్థంలో పర్యాయపదాలయ్యాయి. ఆంధ్రలో వ్యాసం, ఆంగ్లం లోని ఎస్సే అర్థంలోనే వాడబడుతూఉంది. ఆంగ్ల సారసత్వంలో ఎస్సే పొందిన పరిణామంతో కొంతవరకు తుల్యమయిన పరిణామం వ్యాసం పొందింది కనుక, ఆంగ్లాంధ్రవ్యాసపదార్థంలో లక్షణైక్యం బాగా గోచరమవుతూ వుంది.

## 2.2.3. వ్యాస లక్షణాలు

ఆంగ్లవ్యాస వాఙ్మయాన్ని గూర్చి వ్యాసకర్తలు, విమర్శకులు చెప్పిన నిర్వచనాలు పరిశీలించి, సారస్వతంలో వ్యాస ధర్మాలు గుర్తించి కొన్ని స్థూల లక్షణాలు ఏర్పరచుకోవాలి. ఏ ఒక్క నిర్వచనమూ వ్యాస పూర్తి ధర్మం ప్రదర్శించేదిగా లేదు. కనుక ఒక్కొక్క నిర్వచనంలో ఉన్న కొన్ని గుణాలు గ్రహించి, క్రోడీకరించి వ్యాస లక్షణాలు రూపొందించుకోవచ్చు. ఆ విధంగా ఏర్పాటు చేసుకొన్న వ్యాస లక్షణాలు పరిశీలించటం అవసరమే !

ఆంగ్ల వ్యాస సారస్వతం గమనించి ఏర్పాటు చేసుకొన్న ఈ లక్షణాలు అన్నీ ఏ వ్యాసంలోనూ ఉండాలన్న నిర్బంధం ఏమీ లేదు. ఏ కొన్నయినా ఉండవచ్చు. కొన్ని లక్షణాలే ఉండి వ్యాసం ఉత్తమం కావచ్చు. ఎందువల్ల నంటే విస్తృత వ్యాస సాహిత్యంలో ఏ గుణం అధికంగా ఉన్నా, ఆ వ్యాసం ఉత్తమంగా గోచరమయ్యే అవకాశం వుంది. 1. వచనత్వం. 2. అవిశాలత్వం. 3. విశృంఖలత్వం. 4. మిత్రత్వం 5. హాస్యత్వం. 6. సృజనత్వం. 7. అసంపూర్ణత్వం. 8. వ్యక్తిత్వం లక్షణాలు అన్నీ ఉన్న వ్యాసం అన్వేషింప దగివుంది.

## 3.1. వచనత్వం

వ్యాసం వచన రచనగా వుండటం కూడా ఒక లక్షణమేనా అనిపించే అవకాశం వుంది. ఈ లక్షణం వ్యాసకర్తలు, విమర్శకులు అంగీకరించారు. పద్యమయంగా వ్యాస రచన జరిగివుండకపోతే, ఈ లక్షణ సాధనం అనవసర ప్రయత్నం. ఆంగ్ల సారస్వతంలో బేకన్ కంటె పూర్వం కింగ్ జేమ్సు రచించిన

'ఎస్సే ఆఫ్ ఎ|్రపెంటైస్ ఇన్ ది డివైన్ ఆర్ట్ ఆఫ్ పోయిజీ' 18వ శతాబ్దిలోని 'ఎస్సే ఆన్ క్రిటిసిజమ్' 19వ శతాబ్దిలోని 'ఎస్సే ఆన్ మైండ్'పద్య వ్యాసాలు ఆంగ్లంలో వ్యాసమన్న పదం ఎస్సే వచన రచనగా కంటె పద్య రచనగా ప్రాచీనం కాని వర్తమానాంగ్ల సాహిత్యంలోనూ, ఏ సాహిత్యంలో అయినా వ్యాసం వచన ప్రక్రియ కావటమే ప్రసిద్ధం. తెలుగులో కొత్తపల్లి సుందర రామయ్య రచన 'వ్యాస వ్యాసము' వ్యాసుడి జీవితం వస్తువై, అప్రసిద్ధంగా వ్యాసం పేరుతో ఉన్న పద్య రచన. అయితే వ్యాసం పద్య సృష్టి కాదు కాబట్టి ఇది స్వీకృతం కాదు.

## 3.2. అవిశాలత్వం

ఏ రచనా ప్రక్రియకు అయినా ఇతివృత్తమో, సన్నివేశమో, పాత్రో కారణంగా ఒక పరిమితి తప్పనిసరిగా వుంటుంది. ఒక విధంగా ఏ ప్రక్రియ విస్తృతత్వం అయినా, ప్రారంభంలోనే నిర్ణయింపబడుతుంది. ఈ విషయంతో, ఈ వాక్యంతో, ఈ ప్రక్రియ పరి సమాప్తమవుతుందని స్పష్టంగా ప్రణాళికా నిర్మాణంలో తత్ కర్త భావించుకొని వుండవచ్చు. ఆ భావన పాఠకుడికీ స్పష్టం కావచ్చు. అయితే, వ్యాసం ఇక్కడ ముగిసిపోతుంది, పోవాలి అన్న నిర్బంధం ప్రక్రియా గతంగా లేదు. రచయిత నూత్నాలోచన వల్ల ముగిసిపోయిన వ్యాసం అక్కణ్ణుంచి మళ్ళీ ప్రారంభం కావచ్చు. వస్తు స్వభావంలోనే వ్యాసం అపరిమితంగా సాగే అవకాశం కలిగి వుంది.

అయితే, రచన ఎంత విస్తృతంగా పెరిగినా వ్యాసమే అవుతుందా అంటే కాదనే సమాధానం. వ్యాసం పరిమితంగా కురుచదనంతో వుంటుంది. కొంచెం సేపట్లో చదవటానికి, కొద్ది పుటల్లో ముద్రించటానికి అనుకూలమైన కురుచదనం కలిగి వుంటుంది. ఈ కొంచెం, కొద్ది పదాలను వదలి మరింత స్పష్టంగా చెప్పే అవకాశం లేదు.

"Comparatively brevity, then, must in any event be admitted as a formal feature of the essay, and it would therefore seen to be a necessary condition of a good essay that it should not attempt to much". (15)

"Essay, a form of writting which may be defined as a non-technical prose exposition with a personal point of view, composed to be read at a single sitting and as a complete work". (16)

విమర్శకుల అభిప్రాయంతో ఏకీభవిస్తే వ్యాసం పరిమితంగా కురుచగా వుండాలని స్పష్టమవుతుంది. అయితే కురుచదనం, పరిమితి స్పష్టం కాదు. ఒక్కసారి చదివి ముగించటానికి వీలుగా వ్యాసముంటుంది. అన్న కాలియర్స్ ఎన్‌సైక్లోపీడియా అభిప్రాయం కాలపరిమితి కాని, పుటలు పరిమితిని కాని స్పష్టం చేయకపోయినా, వ్యాసం యొక్క అవిశాలత్వం గూర్చి తెలుపుతుంది.

కాబట్టి స్పష్టమైన పరిమితి తెలిపే వీలు తక్కువ. 'ఎన్ ఎస్సె కన్సర్నింగ్ హ్యూమన్ అండర్‌స్టేండింగ్'—లాకె, 'ఎ ట్రీటైజ్ ఆఫ్ హ్యూమన్ నేచర్'-హ్యూమ్, 'ఎస్సె ఆన్ మేన్'- పోప్, 'ఎస్సె ఆన్ ప్రోగ్రెస్'- స్పెన్సర్ వ్యాసాలుగా పేర్కొనబడ్డప్పటికీ వ్యాసాలు కావు. అవి బృహత్గ్రంథాలు కావటం వల్ల, విషయంలోనూ, రచనలోనూ ఎక్కువ విస్తృతి ఉండటంవల్ల వ్యాసాలు కావు. ఈ సందర్భంలో, తొందరపడటం కాకపోతే ఒక సూచనకు అవకాశం వుంది. ఒక వ్యాసం ఒక ఉద్గ్రంథంగా వుండదు. ఒక చిన్న పుస్తకంగా ఉంటే ఉండవచ్చు. సాధారణంగా ఒక వ్యాస సంపుటి ఒక ఉద్గ్రంథంగా ఉండవచ్చు.

వ్యాసం, అల్ప సమయంలో చదివి ముగించటానికి తగిందిగా, ముద్రణలో తక్కువ పుటల్లో ముద్రించటానికి వీలయిందిగా వుంటుంది. బేకన్ వ్యాసాలు, మిక్కిలి తక్కువ పుటల్లో ముద్రింపబడి, మిక్కిలి తక్కువ సమయంలో చదివి ముగించటానికి వీలుగా వుంటాయి. స్టీల్ ఎడిసన్‌ల వ్యాసాలు లాగా భోజన సమయంలో చదివి ముగించ దగినంత చిన్నవిగా వుండవచ్చు. వ్యాసపు అవిశాలత్వం, ఇంతకంటే అధికంగా కాని, ఇంతకంటే స్పష్టంగా కాని, వివరించే అవకాశం మృగ్యం.

## 3.3. విశృంఖలత్వం

సాధారణంగా ఏ రచనా ప్రక్రియలో అయినా ఒక విషయం క్రమ పరిణామం పొందటం సహజం. ఒక వస్తువు ఏకమో, అనేకమో అయిన రీతుల్లో పరిణమించవచ్చు. ఆ స్థితిలోను, ఒక విధంగానో, పది విధాల గానో, వస్తువు పరిణమించటం ఉచిత ధర్మంగా గోచరమవుతుంది. వస్తు ధర్మంలో దాని పరిణామ గుణం ఇమిడి వుంటుంది.

అయితే వ్యాసం ఈ ధర్మానికి భిన్నంగా కనిపిస్తుంది. వ్యాస విషయం పెంపుదల పొందేటప్పుడు ఒక మార్గంలో పెరిగినట్లు కాని, ఒక పద్ధతిలో సాగినట్లుకాని, ఒక విధానం అనుసరించినట్లు కాని, ఒక క్రమత కలిగివున్నట్లుకాని అనిపించదు.

"............when I make choice of a subject that has not been treated on by others, I throw together my reflection on it without any order or method". (17)

"............that systematic treatment of it is impossible". (18)

"The essays are loose thoughts thrown out without much regularity". (19)

"............an essay is a composition comparatively short, and second, that is something incomplete and unsystematic". (20)

వ్యాస రచయిత ఇష్టం వ్యాస విషయక్రమం నిర్ణయిస్తుంది. పద్ధతి లేకపోవటం, క్రమత లేకపోవటం వ్యాస ధర్మంగా భావింపవచ్చు. ఈ క్రమతారాహిత్యం అవిశాలత్వానికి లోబడి వుంటుంది.

## 3.4. మిత్రత్వం

భారతీయాలంకారిక సంప్రదాయానుసారంగా, కావ్యం ప్రభు సమ్మితంగా, మిత్ర సమ్మితంగా, కాంతా సమ్మితంగా ఉండాలన్న విభజనలో వ్యాసం మిత్ర సమ్మితంగా ఉండే కోవలో భావింప వచ్చు. అంతేకాక, రచయిత పాఠకులతో మాట్లాడటం వ్యాస గతంగా-వ్యాస ధర్మమయింది. ఈ మాట్లాడే తీరు అధికారిలా, అధ్యాపకుడులా కాక, మిత్రుడిలా ఉండటం, ఉండాలనటం గమనింపవచ్చు. మిత్రుడికి సలహా ఇస్తున్నట్లు, మిత్రుడి అభిప్రాయం కోరుతున్నట్లు, ఇద్దరికీ తెలిసిన సంగతులు ముచ్చటించుకొంటున్నట్లు ఆ పాఠక-రచయితలకే పరిమితమయిన ఆంతరంగిక సంబంధాల తెరలు తొలగిస్తున్నట్లు, ఉత్తమ వ్యాసం వర్తిస్తుంది. ఇద్దరు మిత్రుల సంభాషణలో దొర్లే విషయాలు ఒక విషయం నుంచి మరో విషయానికి పోతూ ప్రధాన విషయం శాఖోపశాఖలుగా విస్తరిల్లటం శాఖాచంక్రమణం చేస్తూ వ్యాసరచయిత ఈ ధర్మం ప్రదర్శించటం గోచరమవుతుంది. ఈ వ్యాసాలు సాధారణంగా ఆవేశపూరితాలుగా వుంటాయి.

పాఠకుల మైత్రి కోసం వ్యాసకర్త తన వ్యక్తిత్వం మరుగుపరచుకొని క్రొత్త వ్యక్తిగా గోచరింపవచ్చు. లేంబ్ తన వ్యాసాలలో ఏలియాగా ప్రత్యక్షమవటం ఇందుకు ఉదాహరణం. వ్యాసకర్తలు తమ వ్యక్తిత్వం మరుగుపరచుకొని క్రొత్త వ్యక్తిని చూపవచ్చు. స్టీలు, ఎడిసన్‌లు ఒకరి తరువాత ఒకరు సర్ రోగర్ డి కవర్లీ కావటం దీనికి ఉదాహరణం. మొత్తం మీద వ్యాస రచయిత స్వయంగా గాని, మారుపేరుతో కాని, పాత్ర గతంగా కాని, పాఠకులకు సన్నిహితంగా, మిత్రుడుగా రూపొందటం వ్యాస లక్షణంగా ఉంటుంది. వ్యాసకర్త...

"........have all that whimsical discursiveness, that delight in tossing the subject,like a shuttle cock, with a resonant battledore of humour, that careless readiness to expose every promising by path of theme, which is essential quality of an essayist". (21)

" This emphasis appears in three ways: (a) a seemingly deliberate effort to interest (and sometimes even to startle) the reader by the nature of the tone and the means of expressing it; (b) an interpretation and an evaluation of the subject which are more than usually dependent upon and expressed through the tone; and (c) a noticeable prominence of a specific narrator and a deliberate exploitation of his personality as material in the essay. The narrator need not appear directly in the essay though he does more in the familiar essay than in most of the others—yet the selection and arrangement of the details and the emphasis upon tone are such that we are aware of him at all times. We must be careful not to insist that the essayist himself is the narrator, even in essays written in the first person; for unless the essayist takes pain so to identify himself, we cannot know whether he is or not". (22)

వ్యాస రచయిత ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పాఠకుల మైత్రి ప్రదర్శింపకపోయినా, మైత్రీపూర్వకంగా వర్తించిన అభిప్రాయం కలిగించినా ఈ లక్షణం నిర్వహింపబడినట్లే అవుతుంది.

## 3.5. హాస్యత్వం

నవ్వు శారీరకంగా విశ్రాంతిని, మానసికంగా వికాసాన్ని కలిగిస్తుంది. అది శ్వాసకోశానికి, గుండెకు, బుద్ధికి కొత్తదనం, నూత్నశక్తి ప్రసాదిస్తుంది. వ్యాసంలో నవ్వు అలభ్యమైతే, తత్పఠనం బరువు అవుతుంది. నవ్వు ఏ స్థాయిలో నయినా వ్యాసంలో ఉండటం అవసరం. హాస్యమో, అపహాస్యమో, పరిహాసమో, నవ్వో, చిరునవ్వో, దరహాసమో, అట్టహాసమో వ్యాసంలో

ఎదురవటం ఆరోగ్యకరం. కఠిన జీవిత సత్యాలు వ్యాఖ్యానించే వ్యాస రచయిత ఆరోగ్యం కోసం హాస్యానుపానంతో గరళమైనా మింగిస్తాడు.

హ్యూవాకర్, వ్యాసకర్తలందరికీ ఎంతో కొంత హాస్యముంటుందంటే, ఆర్లో విలియమ్స్ మాంటేన్‌ని హాస్య శూన్య వ్యాస స్రష్ట అంటారు.

"The perfect essayist is a more variable being, and I am English enough to hold that he should have humour". (23)

వ్యాసాల మూలంగా వ్యక్తమైన అధిక్షేపం సంఘ సంస్కరణ సమర్థంగా వుంది. స్టీలు, ఎడిసన్‌ల అధిక్షేపం పాఠకులకు సంఘానికి పరమ ప్రయోజన కారి అయింది. లేంబ్ హాస్యం సున్నితంగా, మనిషిలో మార్పు సాధించేంత సమర్థంగా రూపొందింది.

ఆంధ్ర వ్యాస సారస్వతంలో సాక్షి, వదరుబోతు వ్యాసాలు అధిక్షేపం వల్ల సంఘ పరిణామం వాంఛించాయి. ఆంగ్లంలో లాగా హాస్యధర్మం ఆంధ్ర వ్యాసాలలోను లభ్యమవుతుంది.

కఠిన జగత్సత్యాలు వ్యక్తీకరింపబడే వ్యాసాలలో హాస్యం మృగ్యమయితే విషయం గహనమవుతుంది. వ్యాసం పాఠకులకు దూరమయ్యే ప్రమాదం నుంచి హాస్యం రక్షిస్తుంది. హాస్య ప్రమేయం లేని వ్యాసాలు తెలుగులోఉన్నట్లే ఆంగ్లంలో బేకన్ వ్యాసాల వంటివి ఉన్నాయి. అయితే వ్యాసాలలో వీలయితే హాస్యం పరిహరింపకుండా వుండటమే ఉచితంగా గోచరిస్తుంది.

## 3.6. సృజనత్వం

వాఙ్మయాన్ని సృజనం, విమర్శనం అని విభజింపవచ్చు. వ్యాసం ప్రధానంగా సృజన ధర్మాధిక్యం వల్ల హృదయానికి సన్నిహితం అవుతుంది. రచయిత ఆత్మీయతకు, వ్యక్తిత్వానికి సృజన ప్రక్రియలో అవకాశం ఎక్కువ. బేకన్ వ్యాసాలలో ఆత్మీయత ప్రత్యక్షం కాదు. వ్యక్తిత్వం స్పష్టం కాదు. అయినా ఆ వ్యాసాలు సృజన గుణమే కలిగి వున్నాయి. సృజనవ్యాసాల పుట్టుక ఇతర అవసరాల మీద అంతగా ఆధారపడక, రచయిత మీదే ఆధారపడి

వుంటుంది. విమర్శన వ్యాసాలు రచయిత పాండిత్యం, కృషి, పరిశోధన మీద ఆధారపడవచ్చు. వ్యాస లక్షణాలు చాల వుండి సృజన గుణం లేకపోతే, ఆ వ్యాసం వ్యాసం కావచ్చుకాని అధిక జనాదరణ పొందలేక పోవచ్చు. వ్యాసం సృజనమయిన క్షణంతో వ్యాసలక్షణాలు అనేకం దానితో అనుసంధానం పొందు తాయి. ఆర్లో విలియమ్స్ వ్యాసం ప్రధానంగా సృజనం కావాలని భావించాడు. హ్యూవాకర్ వ్యక్తిత్వముద్రే సృజన గుణ సంపాదకమని భావించాడు. లేహంట్ విమర్శనమయినా రచయిత గుండెలోంచి వెలువడితే సృజన ధర్మం పొందు తుందని భావించాడు. వ్యక్తిత్వ ముద్ర, సృజన వ్యాసంగా, వ్యాసం రూపొం దేందుకు దోహదం చేయవచ్చు కానీ, వ్యక్తిత్వ ముద్ర వున్న వ్యాసాలు అన్నీ సృజన వ్యాసాలు కాలేవు. వ్యాసం ప్రాథమికంగా సృజన రూపం. కాలాంత రంలో విమర్శన రూపం పొందింది.

"......all writings intended to contain a proof or to examine a proof to appraise some opinion or some character to describe a series of facts or to trace a series of tendencies are equally excluded from this discussion". (24)

ఎందువల్ల నంటే, ఈ పై గుణాలు తెలుపవలసిన చోట సాధారణంగా సృజన గుణం క్షీణించి విమర్శన ధర్మం పెరుగుతుంది. పై లక్షణంతో వ్రాయ బడే వ్యాసాలు సృజన వ్యాసాలు కావు. వ్యాసం ప్రధానంగా కథ, కవిత, నాటకం, నవలలలాగా సృజన రూపం. అయితే, ఈ కథాది సృజన ప్రక్రియల కంటే వ్యాసం ఆలోచనతో నిండివుంటుంది. ఆలోచింప జేస్తుంది.

## 3.7. అసంపూర్ణత్వం

వ్యాసం చిన్నదయినా పెద్దదయినా, అందులో విషయం పరిపూర్ణంగా, సమగ్రంగా కూలంకషంగా వుండదు. వ్యాస రచయిత స్వీకృతేతి వృత్తంలో కొదువలేకుండా వ్రాయడు. వ్యాస విషయం ఒకటైతే, వ్యాసేతర విషయాలు స్వీకరించి వ్యాసం వ్రాయవచ్చు కాని, వ్యాస విషయం సంపూర్ణంగా వ్రాయటం కుదరదు. కుదర కూడదు. ఇందుకొక కారణం వుంది.

వ్యాసంలో చెప్పదలచుకొన్న విషయం సంపూర్ణంగా వుండాలని రచయిత అభిలషించడు. స్వీకృత వృత్తం సంపూర్ణంగా చెప్పాలనుకోవటంతో తనకు తెలిసిన విషయానికితోడు తెలియని విషయాలు తెలుసుకోవటం, ఇతర గ్రంథాధారంగా విషయం గ్రహించటం, ఎక్కువగా ఆలోచించటం బహు పరిశ్రమ ఫలితంగా లక్ష్య విషయం తెలపటం జరిగినప్పుడు, అది పరిశోధనమో, విమర్శనమో, శాస్త్ర రచనమో అవుతుంది కాని, వ్యాసం కాదు. సాధారణంగా వ్యాసకర్త అనుభవంలోని విషయాలు హృదయబలంతో మరే ఇతర సాక్ష్యాలు, సహాయాలు అక్కరలేకుండా వ్యక్తీకరింపబడ్డప్పుడు వెలువడే వ్యాసంలో అసంపూర్ణత తప్పనిసరి అవుతుంది. వస్తువు సంపూర్ణమయితే ఆ రచన వ్యాసం కాదు. వ్యాసంలో అసంపూర్ణత్వం మిక్కిలి ప్రధాన లక్షణం. ఈ దృష్టితోనే ఏది వ్యాసమో, ఏది కాదో ప్రాథమికంగా నిర్ణయించవచ్చు.

"This incompleteness may arise either from treating a subject only in outline, or from handling only a branch or division of some greater theme." (25)

"That the essay is not intended to be exhaustive then, is one aspect of it that should be kept in mind." (26)

"......The subject to be treated requires no body of exact information for its treatment." (27)

"......The author is mearly touching upon the subject in hand and not treating it exhaustively; that he is giving a short coment rather than a complete formal discussion...". (28)

"It rarely pretends to be exhaustive or final, it is a series of personal comments rather than a finished arguement, a cultured glance, rather than a careful examination." (29)

వ్యాసం స్వయంసంపూర్ణం కాదు. లోపరహితం కాదు విషయ పరిపూర్ణత ఏవిధంగానూ ప్రశ్నింపబడరానిది. చదివి ఆనందించదగింది

మాత్రమే. స్వీకృత వస్తు సంబంధి సర్వవిషయ సంపూర్ణంగా, కూలంకష పరిశీలనాత్మకంగా, పూర్తి పరిశోధన ఫలితంగా వ్యాసం ఎప్పటికీ ఉండదు. లోపంలేని సంపూర్ణమైన గ్రంథాలు సిద్ధాంత గ్రంథాలు లేకపోతే లక్షణ గ్రంథాలు అవుతాయి గాని వ్యాసాలు కావు.

లాకే-ఎన్ ఎస్సె కన్సర్నింగ్ హ్యూమన్ అండర్‌స్టేండింగ్, హ్యూమ్-ఎ ట్రీటైజ్ ఆఫ్ హ్యూమన్ నేచర్, పోప్-ఎస్సె ఆన్ మేన్, స్పెన్సర్-ఎస్సె ఆన్ ప్రోగ్రెస్ వ్యాసాలుగా పేర్కొ-బడ్డ సంపూర్ణ విషయ సమన్వితాలు, బృహత్ప్రణాళికా నిర్మితాలు, కాబట్టి సిద్ధాంత గ్రంథాలుగా చెప్పవచ్చుకాని వ్యాసాలు కావు.

"There is a vital difference between the essay and the article-one that needs to be pointed out because of a current tendency to confuse the two. The essay differs from the article in at least one important point; it is the work of an individual, a man, a person, while the article may be the product of any man, or combination of men or even a whole editorial staff. The author of an essy is significant in his own right, and his views carry weight for this reason. The writer of an article is depersonalized : his material is the essential point of interest, not his own concepts of the material. The essay, as the work of a person can be and often is a work of art, but the article rarely rises above the level of a craft". (30)

"The essay never gives an exhaustive treatment of any subject; but as its name implies, is an attempt to set forth only those phases or things that the author may choose to express. It is suggestive and rambling rather than complete and direct." (31)

వ్యక్తిత్వాన్ని చొప్పించకుండా విషయసమగ్రంగా ఉండే రచన సిద్ధాంత సామీప్యం పొందితే విషయ పరిపూర్ణత్వం లేకపోయినా వ్యాసకర్త వ్యక్తిత్వం ద్యోతకమయ్యే వ్యాసం వ్యాసంగా స్వీకరణయోగ్యం. ఈ అసంపూర్ణత రచయిత-పాఠక సంబంధిగా వుంటుంది. ఒక విషయాన్ని గూర్చి ఉన్న పళంగా వ్యాసకర్త, ఎంత అనుభవశాలి అయినా, సంపూర్ణంగా అభిప్రాయ ప్రకటనం చేయలేడు. అదే విషయాన్ని గూర్చి పాఠకులందరికీ అన్ని వివరాలూ అక్కర లేదు. అందువల్ల వ్యాసం సంపూర్ణంగా వుండదు. అనేక విషయ తారతమ్య పరిశీలనంతో వాదోపవాదానంతర సిద్ధాంతంలో సామాన్య పాఠకుడు ఎంత వస్తు గ్రహణార్హత ప్రదర్శిస్తాడో అంతవరకే, ఇతరేతర సాక్ష్య సంబంధం లేకుండా వ్యాసకర్త ఎంత ఎలాచెబుతాడో అంతవరకే వ్యాస సంపూర్ణత్వం ఉంటుంది. కాబట్టి వ్యాసం ఎప్పుడూ విషయదృష్టితో అసంపూర్ణమే!

## 3.8. వ్యక్తిత్వం

ఏ రచనలో నయినా రచయిత వ్యక్తిగా గోచరం కానూవచ్చు, లేకపోతే తెర మరుగున ఉండనూవచ్చు. రచయిత రచనలో పరాశ్రయంగానో, ఆత్మాశ్రయంగానో ఉండవచ్చు. రచన చదివినప్పుడు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, భంగ్యంతరంగానో రచయిత ఎదురయితే అది ఆత్మాశ్రయ రచనంగానూ, రచయిత గుర్తుకే రాకపోతే అది పరాశ్రయంగాను భావింప వచ్చు. అయితే ఒక్క విషయం ఎప్పుడూ గుర్తుంచుకోవలసి వుంటుంది. రచన ఆత్మాశ్రయంగా ఉన్నా, పరాశ్రయంగా వున్నా, అవి వాటి వెనుక రచయిత స్వీకరించిన మార్గాలనీ, పరాశ్రయ రచనలోను రచయిత వ్యక్తిత్వం వుంటుందని గుర్తుంచుకోవలసి వుంటుంది. షేక్స్పియర్ తన నాటకాలలోని పాత్రల నన్నింటినీ నడిపించిన స్రష్ట. అయితే ఏ పాత్రగతంగానూ షేక్స్పియర్ ఉన్నట్లు విమర్శకులు భావించలేరు. ఇటువంటిది పరాశ్రయ రచనా విధానం. సర్ రోగర్ డి కవర్లీ పాత్ర వెనుకో, స్పెక్టేటర్ పాత్ర వెనుకో స్టీలు వ్యక్తిత్వమో, ఎడిసన్ వ్యక్తిత్వమో ఉందని భావించటం, సాక్షి పాత్రగతంగానో, జంఘాలశాస్త్రి పాత్రగతంగానో, పానుగంటి లక్ష్మీనరసింహారావు వ్యక్తిత్వం వుందని తలపోయటం ఆత్మాశ్రయ రచనా విధానం.

వ్యాసం, రచయిత ఆత్మాశ్రయ రచనా ధోరణి కాంక్షిస్తుంది. ఏ రచన అయినా, ఏ కళ అయినా, ఆత్మాశ్రయంగానే రూపొందినా, ఆ రచన, ఆ కళ అధికంగా తత్కర్త మానసిక, హృదయ స్థితుల మీద ఆధారపడి వుంది. రచయిత సాంఘికాది పరిణామాలకు లోనయినప్పుడు, మనస్సు హృదయం పొందే మార్పు వ్యాసంలో గోచరమయితే, అది తత్కర్త హృదయజన్యం అవుతుంది. రచయిత జీవితస్థాయిని బట్టి వ్యాస స్థాయి మారుతుంది. కాబట్టి రచయిత మానసిక,హార్దిక స్థితులు వ్యాస లక్షణాలు నిర్ణయించేవి అవుతాయి. రచయిత ద్వివిధౌన్నత్యం, వ్యాసౌన్నత్యంగా, ద్వివిధారోగ్యం, వ్యాసారోగ్యంగా రూపొందుతుంది.

వ్యాసంలో రచయిత వ్యక్తిత్వం ఆత్మాశ్రయ రీతిలో స్పష్టమవుతుంది. వ్యాసం, వ్యాసకర్త ఉత్తమ పురుషలో వ్రాయవచ్చు, పాత్రగతంగా నిలిచి వ్రాయవచ్చు. ఏమయినా పాత్ర వ్యాసంలోంచి పాఠకులతో మాట్లాడటం ప్రధాన వ్యాస ధర్మం. ఇక్కడ ఒక అవాంతరం ఉండవచ్చు. వ్యాసంలో వ్యాస రచయిత ప్రత్యక్షమై, పాఠకులతో సంభాషించినట్లుండటం, ఏ కారణం వల్లనయినా, ఏ రచయితకు అయినా ఇష్టం లేకపోవచ్చు. అప్పుడు రచయిత తన వ్యక్తిత్వ గోపన చేసుకొని, రహస్య వ్యక్తిత్వంతో పాఠకులతో సంభాషించినట్లుగా వ్యాసంలో వ్యక్తిత్వం నిలుపుకోవటం అయినా అవసరం. ఈ ధర్మం ఆంగ్ల వ్యాస రచయితలు పలువురు ప్రదర్శించారు.

వ్యాస విషయం విమర్శనమైనా,చరిత్ర అయినా,సాహిత్య చరిత్ర అయినా, సమీక్ష అయినా వ్యాస రచయిత వ్యక్తిత్వముద్ర వుంటే అది వ్యాసం, లేకపోతే అసమగ్ర విమర్శనమో, చరిత్రో అవుతుంది. ఉత్తమ మిత్రుడి వ్యక్తిత్వ ప్రభావం వల్ల తన్మిత్రుడు ప్రవర్తించినట్లు పాఠకుడు ఉత్తమ వ్యాస రచయిత వ్యక్తిత్వం వల్ల వ్యాస పఠనంలో పరిచితుడితో సంభాషణం లాగా, మిత్రుడితో కాలక్షేపం లాగా ఉత్సాహంగా ఉండ గలుగుతాడు.

వ్యాసం రచయిత వ్యక్తిత్వంతో స్పష్టంగా రూపొందినప్పుడది సృజన రూపం కూడా పొందుతుంది. వ్యాసంలో రచయిత వ్యక్తిత్వం పెరుగుతున్న కొద్ది సృజనధర్మం కూడా పెరుగుతుంది. అది తగ్గితే ఇదీ తగ్గిపోతుంది.

అందువల్ల సృజన ధర్మం, రచయిత వ్యక్తిత్వం వ్యాసంలో పరస్పర దోహద కారులు.

వ్యాసంలో రచయిత వ్యక్తిత్వం అధికమయిన కొద్దీ వ్యాస సంపూర్ణత తగ్గిపోతుంది. వ్యక్తిత్వ ముద్ర లోపించే కొద్దీ వ్యాసంలో అసంపూర్ణత తగ్గిపోతుంది. రచయిత వ్యక్తిత్వం రచనలో సంపూర్ణత్వం పరస్పర భిన్న మార్గాలలో సాగుతాయి. ఒకటి ఒక దశలో ఎంత ఎక్కువయితే, రెండవది అంత తగ్గిపోతుంది. వ్యాసంలో రచయిత వ్యక్తిత్వం అసంపూర్ణత్వం ఎక్కువగా వాంఛనీయాలు.

వ్యాసంలో రచయిత వ్యక్తిత్వం పెరిగిన కొద్దీ పాఠకులతో సన్నిహితత్వం, మిత్రత్వం పెరుగుతాయి. రచయిత పాఠకులకు సన్నిహితుడైతే పాఠకులు రచయితను అంతరంగికుడుగా, రచనను ఆంతరంగిక విషయంగా గ్రహించి, అవసరమైతే సమస్యలకు పరిష్కారం ఆలోచిస్తారు. రచయిత వ్యక్తిత్వం వ్యాసంలో పాఠకులకు ఆకర్షకమవుతుంది. రచయిత వ్యక్తిత్వం వ్యాసంలో పెరగటం వాంఛనీయమే కానీ, వ్యక్తిత్వాధిక్యం కాదు.

వ్యాసంలో రచయిత వ్యక్తిత్వం రచనను అలవోకగా, స్వీకరణ యోగ్యంగా, కోరదగినట్లుగా రూపొందిస్తుంది. రచనలో కాఠిన్యం తగ్గించి, వీలయితే హాస్యానికి చోటిస్తుంది.

రచయిత వ్యక్తిత్వం వల్ల, స్వేచ్ఛ వల్ల వ్యాసంలో విశృంఖలత్వం పెరుగుతుందనిపించవచ్చు. కాని వ్యక్తిత్వం పెరిగిపోతున్న కొద్దీ వ్యాసం సంక్షిప్తమవుతుంది. తన వ్యక్తిత్వం పాఠకుల ఎదుట ఎక్కువ సేపు నిరంజనంగా, నిర్వికారంగా నిలిపి ఉంచలేకపోవటంతో వ్యాసంలో అవిశాలత్వం చోటు చేసుకొంటుంది.

రచయిత వ్యక్తిత్వం, వ్యాస లక్షణాల కన్నింటికీ సంబంధించి వుంది. దాని నుంచే ఇతర లక్షణాలు ఆవిర్భవించాయని భావింపవచ్చు. ఒక రచన వ్యాసమా, తదితరమా అని నిర్ణయించటానికి ప్రధాన లక్షణం రచయిత వ్యక్తిత్వం. అది వున్న రచన వ్యాసం. అది లోపిస్తే దానికి మరోపేరు తల్లక్షణాల వల్ల సాధ్యం. రచయిత స్వభావాన్ని బట్టి, అతడు వ్యాస రచయిత

కాగలదా, లేదా అని విమర్శకులు తరచి చూడటానికి ప్రయత్నించారు. వ్యాసంలో రచయిత వ్యక్తిత్వం, వ్యక్తిత్వ ముద్ర అత్యవసర లక్షణాలు.

రచయిత వ్యక్తిత్వం వ్యాసంలో అవసరమనే ఆంగ్ల విమర్శకుల అభిప్రాయాలు అనేకం. ఫ్రెంచిలో ప్రథమ వ్యాసకర్త మైకల్ డి మాంటేన్ "It is myself I portray" అనటం వల్ల రచయిత వ్యక్తిత్వం వ్యాసంలో ఎంత ప్రధానమో తెలుస్తుంది.

"The central fact of the true essay, ineed, is the direct play of author's mind character upon the matter of his discourse." (32)

"The essay may use knowledge, but what it reveals is taste, good judgement, and that most precious quality originality." (33)

"However, one element in all definitions seems to be fairly constant–the personal point of view of the author." (34)

రచయిత ఆత్మీయమై, ఆత్మావిష్కరణం పొంది, వ్యక్తిత్వ ముద్రితమై, గోచరించేది ఉత్తమ వ్యాసమవుతుంది.

అయితే ఈ వ్యక్తిత్వ వాదాన్ని తిరస్కరించటానికి ప్రయత్నించిన బహ్వల్ప విమర్శకుల్లో ప్రిచ్చర్డ్‌ని ప్రధాన వ్యక్తిగా భావింపవచ్చు. ఈ విమర్శకుడు వ్యాసంలో వ్యక్తిత్వ ముద్ర స్పష్టంగా అనవసరం అనీ, వ్యాసం రచయిత నుంచి పుడుతుంది కనుక, ప్రత్యక్షమో పరోక్షమో, వ్యాసకర్త వ్యక్తిత్వం వ్యాసంలో ఉన్నట్లేననీ భావించాడు. వ్యక్తిత్వముద్ర లేనంత మాత్రాన వ్యాసకర్తను వ్యాసకర్తగా భావింపక పోవటం అనుచితమని వాదించాడు.

"On this account alone to refuse them the name of essayists is to exalt manner at the expense of sub-

stance and tantamount to saying that a pear – tree is not a pear–tree because it is an espalier.'' (35)

వ్యక్తిత్వ ముద్ర లేకపోయినా ఒక స్వల్పాంశం స్పష్టంగా వివరించటం వ్యాసంగా భావింపవచ్చునని ప్రిచ్చర్డ్ దృష్టి. ఈ విమర్శకుడి దృష్టి విమర్శన వ్యాస విషయంలో స్వీకరింపవచ్చు. కాని సృజన వ్యాసంలో రచయిత వ్యక్తిత్వం అత్యవసర దృక్పథం, లక్షణం.

వ్యాసంలో వచనత్వం, అవిశాలత్వం, విశృంఖలత్వం, మిత్రత్వం, హాస్యత్వం, సృజనత్వం, అసంపూర్ణత్వం, వ్యక్తిత్వం ప్రధాన లక్షణాలుగా స్వీకరింపవచ్చు. ఇందులో కొన్ని లక్షణాలు లోపించినా ఆ రచన వ్యాస మవుతుంది. అన్ని లక్షణాలతో ఒప్పే వ్యాసం అన్వేషింప వలసివుంది. ఆంధ్ర వ్యాస సాహిత్యంలో ఈ వ్యాస లక్షణాలు ఎక్కువ భాగం అన్వయిస్తాయి.

## 2.3. ఆంగ్ల వ్యాస నిర్వచన పరిశీలనం

ఆంగ్ల వ్యాసం మొదటినుంచీ, సమగ్రంగా విశ్లేషించి చూడకపోయినా, నిర్వచనప్రాయంగా దర్శింపబడుతూ వచ్చింది. వ్యాసం పేరుతో (ఫ్రెంచిలో ఎస్సై) మొట్టమొదటి వ్యాసం వ్రాసిన మైకల్ డి మాంటేన్ ప్రారంభించిన నాటినుంచి ఆధునిక కాలందాకా ఎందరో ఇచ్చిన నిర్వచనాలలో ప్రముఖంగా ఉన్నవాటిని స్వీకరించి పరిశీలిస్తే వ్యాస ధర్మం ఎంత వరకు గ్రహింపబడిందో స్పష్టమవుతుంది. అప్పటినుంచి ఆధునిక యుగం దాకా వ్యాస ప్రక్రియలో వచ్చిన సర్వ పరిణామాలు సమగ్రంగా తెలిపే వివరణాత్మక రచన మృగ్యం. అయినా ప్రముఖ నిర్వచనాలతో వ్యాస సంబంధం పరిశీలింపవచ్చు.

''It is my self I portray'' (36) అనే మాంటేన్ నిర్వచనం రచయిత వ్యక్తిత్వ ప్రాధాన్యం తెలియజేస్తుంది. వ్యాసంలో ప్రముఖంగా రచయిత అనుభవసారం అభివ్యక్తమవుతుందన్న తర్వాతి నిర్వచనాల కిది ఆద్యం. ఈ నిర్వచనం వ్యాస ప్రాథమిక ధర్మ ప్రదర్శకమయింది.

బేకన్ ప్రథమాంగ్ల వ్యాస రచయిత. వ్యాసం గూర్చి ఈ వ్యాసకర్త వెలిబుచ్చిన అభిప్రాయాలు మూడు. ఒకటి తన వ్యాసాలకు వర్తిస్తుంది. అది తన వ్యాసాలిటువంటివని తెలుపుతూ తన వ్యాస సంపుటి ఉపోద్ఘాతంలో పలికిన

మాటలు. రెండవది, వ్యాస లక్షణం తెలిపే ప్రయత్నం. మూడవది వ్యాస ప్రాచీనత భావించే స్థితి.

"He called his essays certain brief notes set down rather significantly than curiously." (37)

తన వ్యాసాలపై బేకన్ అభిప్రాయం తెలిపే నిర్వచన ప్రాయం. సిగ్నిఫికెంట్‌లీ అంటే స్పష్టంగా అనీ, ప్రముఖంగా అనీ; క్యూరియస్‌లీ అంటే అలంకారిక శైలి అనీ, ఉత్సాహాత్మకంగా అనీ భావిస్తే- వ్యాసం స్పష్టంగానూ, ప్రముఖంగానూ ఉండాలి కానీ—అలంకారిక శైలితోనూ, ఉత్సాహాత్మకంగానూ వుండనక్కరలేదని తెలుస్తుంది. ఈ నిర్వచనం వల్ల బేకన్ వ్యాసంలో స్పష్టత, ప్రాముఖ్యం వాంఛింప దగినట్లు గమనింపవచ్చు.

"The essays are loose thoughts thrown out without much regularity" (38)

బేకన్ ఈ నిర్వచనంతో వ్యాస లక్షణం తెలుపాలని భావించినట్లు గుర్తింపవచ్చు. లూజ్‌థాట్స్ అంటే అసంపూర్ణాలోచనలనీ, వితౌట్‌మచ్ రెగ్యులారిటీ అంటే విశృంఖలంగా అనీ ఊహింపవచ్చు, ఈ నిర్వచనంవల్ల అసంపూర్ణత, విశృంఖలత బేకన్ వ్యాస లక్షణాలుగా చెప్పినట్లు గుర్తింపవచ్చు.

"He defines an essay to be a loose sally of the mind, an irregular, indigested piece, not a regular and orderly performance" (39) అన్న నిర్వచనం బేకన్ నిర్వచనంలాగా ఉన్నప్పటికీ అంగీకరింపబడిందిగా గోచరంకాదు. ఎ లూజ్ శాలి ఆఫ్ ది మైండ్ అంటే లూజ్‌థాట్స్‌గానూ, నాట్ ఎ రెగ్యులర్ అండ్ ఆర్డర్లీ పర్ఫార్‌మెన్స్ అంటే వితౌట్‌మచ్ రెగ్యులారిటీగానూ పోల్చుకొన్నా, ఇర్రిగ్యులర్, ఇన్‌డైజెస్టెడ్ పీస్ అన్న విషయం అంగీకరించడంలో బాధ్యత వుంది. వ్యాస రచన క్రమతా శూన్యంగా ఉండవచ్చుగానీ వస్తువు అక్రమంగా ఉండటం గానీ, వస్తు సంబంధి ఆలోచనంలోని అపరిపక్వంగా ఉండటంగానీ

భావించటం బాధ్యతాయుత చర్య. ఈ నిర్వచనంలో వ్యతిరేక దృష్టి ప్రదర్శింప బడింది. ఆధునిక యుగంలో మిక్కిలి ఔన్నత్యం సాధించిన వ్యాస ధర్మంతో ఈ నిర్వచనం నిలవటం కష్టం.

"The word is late, but the thing is ancient. For Seneca's epistles to Lucilius, if one mark them well, are best essays, that is dispersed meditations."(40)

ఈ నిర్వచనంలో డిస్పర్స్డ్ మెడిటేషన్ అనే దాని వల్ల సృజనం వ్యక్తిత్వ ముద్రితం వ్యాసం అన్న భావం కలుగుతుంది. అనేక విమర్శకులు ఈ భావం అంగీకరించారు. ఎస్సె పదం కొత్తది. విషయం పాతది అనే బేకన్ అభిప్రాయం ప్రిచ్చర్ట్ అంగీకరింపవచ్చు.

"It is, then at a very early stage in world literature that we find the essay emerging."(41)

అని తెలుపుతూ ఎక్లెసియాస్టిక్స్ ఎక్లెసియాస్ట్స్ కూడా సెనెకొ ఎపిస్టల్స్‌తో పాటు వ్యాసాలుగా పేర్కొంటూ, ప్రాచీన ప్రపంచ సాహిత్యంలోంచి బైబిల్‌తో పాటు ఇండియా, పర్షియా, అరేబియా, చైనా, జపాన్, గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్సు మొదలైన దేశాల సాహిత్యంలోని 228 వ్యాసాలు, అన్నీ దాదాపు క్రీ. శ. పదో శతాబ్ది పూర్వానివి ఉదాహరించి, వ్యాసం పేరు ఆధునికం కావచ్చుగాని, వ్యాస ప్రక్రియ ప్రాచీనమని తెలిపాడు ప్రిచ్చర్ట్. ఈ విషయమే-

"Love-An essay from the Bible-Though he did not call this an essay, the Apostle paul wrote what today we would call by that name since it is a short piece of prose on single theme." (42)

అని తెలిపి మేజిల్ ఇరేని రిబ్ వ్యాస ప్రాచీనతను అంగీకరించినాడు. నిశితంగా పరిశీలిస్తే వ్యాస ప్రక్రియ ఆ పేరుతో పిలువబడకపోయినా, ప్రాచీన సాహిత్యం నుంచి విరివిగా లభ్యమవుతుంది. అయితే ఎస్సె అన్న పదం మాంటేన్ వల్ల లభించింది. కాని ఎన్‌సైక్లోపిడియా బ్రిటానికా, సెనెకొ

ఎపిస్టల్స్ వ్యాసాలుగా అంగీకరింపరాదన్న "Bacon said that the Epistles of Seneca were essays, but this can hardly be allowed" (43) అభిప్రాయం గుర్తింపవచ్చు.

వ్యాసం పదం మాంటేన్ నిర్ణయించాడు. ప్రక్రియ రూపొందించాడు. అయితే ఈ ప్రక్రియ ధర్మసామ్యంవల్ల కొన్ని లక్షణాలు కోల్పోయినా ఒక చిన్న వస్తువును వచనంలో వివరించటం అనే ధర్మంగ్రహించి, వ్యాసాలు ప్రాచీన ప్రపంచ సాహిత్యంలో లభ్యమవుతాయని కొందరు భావించారు. అనేకులు తిరస్కరించారు. అయితే ప్రాచీన సాహిత్యగత వ్యాసాలు స్వీకరించి, ఔచిత్యం దర్శింపవచ్చు.

ఆంగ్లంలో వ్యాసానికి అనేకులు అనేక నిర్వచనాలిచ్చారు. చాలా తుల్య ధర్మాలు, కొన్ని భిన్నధర్మాలు గోచరమయ్యే నిర్వచనాలు పరిశీలనార్థం గ్రహింప వచ్చు. అందరూ ఇచ్చిన అన్ని నిర్వచనాలు కాదుకాని, ఒక నిర్వచనంలో పూర్తిగా అంతర్గతమయ్యే నిర్వచనాలు వంటివి స్వీకరించలేదు.

1. "A composition of moderate length on any particular subject, or branch of a subject; originally implying want of finish, but now said of a composition more or less elaborate in style th rough limited in range" (The Oxford Dictionary).

2. "As a form of literature the essay is a composition of moderate length, usually in prose, which deals in an essay, cursory way with a subject, and in strictness, with that subject only as it affects the writer". (44)

3. "The term essay, which soon adopted in England, thus suggested that the author is merelv touching upon the subject in hand and not treating it exhaustively. That he is giving a short comment rather than a complete formal discussion as in a tretaise or monograph". (45)

4. "... the true essay is essentially personal like its verse analogue, the lyric, it belongs to the literature of self-expression. Treatise and dissertation may be objective; the essay is subjective". (46)

5. "The essay as we now understand it is usually a short literacy prose composition embodying only a selection of

its authors knowledge and views on a given subject. It rarely pretends to be exhaustive or final; It is series of personal comments rather than a finalized arguement–cultured glance rather than a careful examination."(47)

6. " Essay, a form of writing which may be defined as now-technical prose exposition with a personal point of view, composed to be read at a single sitting and as a complete work" (48)

7. " The essay ...... as a literary form, resembles the lyric, in so far as it is moulded by some central mood-whimsical, serious, or satirical-give the mood, and the essay, from the finest sentence to the last, grows around it- as the Cocoon grows around the silk worm". (49)

8. "An essay is a brief, usually prose, composition which reveals the authors personality as it given his contemplations on the meaning of life or his observations on various subjects." (50)

పైన ఉదాహరింపబడ్డ నిర్వచనాలలో వ్యక్తమయ్యే వ్యాస లక్షణాలు పరికింపవచ్చు. ఒకటిలో స్పష్టత చెప్పబడనప్పటికీ, అవిశాలత్వం అసంపూర్ణత్వం చెప్పబడింది. రెండుతో వచనత్వంతోపాటు సంపూర్ణ రహితత్వం, విశృంఖలత్వంతోరచయిత వ్యక్తిత్వం వ్యాసంలో ఉండటం చెప్పబడింది. మూడులో పరిశోధన, సిద్ధాంత రచనల కంటే భిన్నమయిన వ్యాసంలో అసంపూర్ణత తెలుపబడింది. నాలుగులో వ్యాసం ప్రధానంగా వ్యక్తిత్వంతో ఒప్పుతుందనీ అది ఆత్మావిష్కరణ సాహిత్య సంబంధి అనీ, చట్టాలు సిద్ధాంత రచనలు పరాశ్రయ రచన లయితే కావచ్చుకానీ, వ్యాసం అత్మాశ్రయమని, రచయిత వ్యక్తిత్వ ప్రాధాన్యం చెప్పబడింది. అయిదులో ఆ పరిపూర్ణతతో పాటు పాఠక మైత్రి స్ఫురింప జేయబడి రచయిత వ్యక్తిత్వ ముద్రను గూర్చి వివరింపబడింది. ఏడులో వ్యాసంసృజనమై, విషయతత్వం సరదాగానో, తీక్షణంగానో , అధిక్షేపకంగానో వుంటుందని గుర్తింపబడింది. ఎనిమిదిలో సృజన విమర్శన వ్యాస రీతి తెలుపుతూ రచయిత వ్యక్తిత్వ ప్రాధాన్యం స్ఫురింప బడింది.

ఆరులో నాన్‌టెక్నికల్ అనటం వల్ల శాసనాలు, సిద్ధాంతాలు, శాస్త్ర రచనలు కావనీ, ఎక్స్పొజిషన్ అన్నందువల్ల ఆలోచనా క్రమంలో పరిణామంతో

పాటు స్పెక్టేటర్ వ్యాసాలలోని హాస్యం, డికవర్లీ వ్యాసాలలో పాత్ర చిత్రణ గ్రహింపవచ్చుననీ, పర్సనల్ పాయింఫ్ ఆఫ్ వ్యూ అనటం వల్ల వ్యాస రచయిత ప్రత్యేకంగా ఆ వ్యాసం కోసం సముపార్జించిన విషయం కంటే వ్యక్తిగతాభిప్రాయ మనీ, కంపోజ్‌డ్ టు బి రెడ్ అంటే ఉపన్యాసాలు, పాఠాలు, వివాదాలు, ప్రసంగాలు మొదలైనటువంటివి కాకుండా వుండేవి అనీ ఎట్ ది సింగిల్ సిట్టింగ్ అనే దాన్తో పెద్ద పుస్తకాలు, విస్తృత గ్రంథాలు, లక్షణ శాస్త్రాలు కావనీ తెలుపుతుంది.

వ్యాసంలో స్థూలంగా వచనంలో వ్రాయబడటంతో పాటు- అవిశాలత — విశృంఖలత, రచయిత—పాఠక మిత్రత, హాస్యత, సృజనత, అసంపూర్ణత, రచయిత, వ్యక్తిత్వ సహితత, లక్షణాలుగా ఆంగ్ల వ్యాసం రూపొందినట్లు భావింపబడింది,

ఈ నిర్వచనాలు అధారంగా భావింపబడ్డ వ్యాస లక్షణాలు తెలుగు వ్యాసంలో తత్పరిణామం పరికించేటప్పుడు గమనింపవచ్చు. తెలుగు వ్యాసం పొందిన లక్షణాలు, తద్విస్తృతి, ప్రక్రియా భిన్నత దర్శింపవచ్చు.

తెలుగు వ్యాసం, ఉపన్యాసంగా, సంగ్రహంగా, ప్రమేయంగా పొందిన పరిణామం. ఆ ప్రక్రియా వైవిధ్య లక్షణాలు, ఆంగ్ల వ్యాస ప్రభావంతో రూపొందిన స్థితిపరికింపవచ్చు.

## 2.4. తెలుగు వ్యాసం- నూత్న లక్షణం

ఆంగ్ల వ్యాస లక్షణాలే చాలా వరకు తెనుగు వ్యాస లక్షణాలు అయ్యాయి. బహువిధాల అంగ్ల వ్యాస ధర్మానువర్తిగానే తెలుగు వ్యాసం ప్రవర్తిస్తుంది. తెలుగు వ్యాసం ఆరంభంలో ఆ పేరుతో పిలువబడలేదు. ప్రమేయం, సంగ్రహం ఉపన్యాసంగా పేర్కొనబడింది. ఆ పైన వ్యాస నామం ప్రసిద్ధ మయింది. ప్రమేయం, సంగ్రహం వ్యాస లక్షణ లక్షితాలు కావటం తప్ప, లాక్షణికంగా తదన్య ప్రాధాన్యం కలిగినట్లు లేవు.

## 4. 1. వ్యాసం - వ్యాస లక్షణం

ఆంధ్రంలో ఎవరు ఎలా చెప్పినా ఆంగ్ల ప్రభావ ఫలితంగానే వ్యాస విషయం స్పష్టమవుతుంది. కాబట్టి వ్యాస లక్షణాలు కూడా తద్భాషా సంబంధులు గానే వున్నాయి.

"ఒక విషయమును గుఱించి విస్తరించి వ్రాయుట వ్యాస లేఖన మనబడును. ఇట్లు విస్తరించి వ్రాయబడిన గ్రంథము వ్యాసము. వ్యాసము నాద్యంత మొక విషయమే వివరించబడును." (51) ఆంగ్ల వ్యాస ధర్మమే ఆంధ్రంలో తెలుపబడినట్లు స్పష్టమవుతుంది. "వ్యాసము నాతి దీర్ఘముగ నుండు వచన రచన. కావ్యమునకు వలె గాక వ్యాసమునకు విషయ నిర్వహణము నందలి జాగరూకతయు, వర్ణనౌచిత్యమును, ఉపక్రమోపసంహార సామ్యమును ప్రధానాంగములు. వ్యాసకర్త సూక్ష్మమున మోక్షమును జూపవలయును. విషయ సంగ్రహ రచనా రహస్యము నాతడెరింగి యుండవలెను. సంగ్రహముగ నున్నదని రచన నిస్సారముగా నుండజనదు. సంక్షేప కథనంబును, విషయ విస్తృతియునగు లక్షణద్వయోపేతమై, వ్యాస మొప్పారు చుండవలెను. కడు విస్తృతం బయినచో నది వ్యాసంబన నొప్పదు. దానిని వ్యాఖ్యానమనియు, కావ్యమనియు పేర్కొనదగును. పరిపూర్ణస్ఫూర్తియు, నిశ్శేషాంశ చర్చయు వ్యాసమున నుండజనదు." (52) ఈ విధంగా సాగిన ఈ లక్షణ యత్నం చాలా వరకు ఆంగ్ల లక్షణ సంబంధిగానే వుంది. దానికి తోడు వచన శైలిలో వాంఛనీయ ధర్మాలు వ్యాస ధర్మాలుగా పేర్కొనబడ్డాయి.

"వ్యాస మనగా నేమి? అను ప్రశ్నకు సంతృప్తికరమైన సమాధానము లేదు. వ్యక్తమగు ఒక అంశమును గూర్చి విపులీకరించి వ్రాసిన యెడల అది వ్యాసమగును. ఈ విపులీకరించుట ఎన్ని పద్ధతులుగానైన జేయవచ్చును. కాని నిపుణుడగు వ్యాసకర్త చేతిలో వ్యాసము ఎన్ని పోకడలనైనను ఇమిడించుకొన వచ్చును. ఇది వాక్క్రియా ప్రధానము కావచ్చును. విపులీకరణ ప్రధానము కావచ్చును. ఒక దృశ్యమును చూడగా ఒక మాట వినగా మనసులో పొడమిన భావ ప్రపంచమును అంతటిని గుదిగ్రుచ్చ వచ్చును. ఉపక్రమోపసంహారములలో నేర్పు చూపినచో ఎట్టి భావవ్యాప్తినైనను శరీరముగా గూర్చి వ్యాసము వ్రాయవచ్చును. వ్యాసమునకు అనువైన, అనువుగాని అంశములు లేవు. దీనిని

గూర్చి వ్రాసినను కావలసిన దెల్ల రచయిత తన భావ పథముల వెంబడి తర్కరథమున సుఖముగా పాఠకులను ఆశీనుల జేసికొని పోవుటయే.'' (53) ఆంగ్ల వ్యాస లక్షణాలు అవ్యవధిగ తెలుగులో తెలుపబడ్డ స్థితికి పై వాక్యాలు ఉదాహరణంగ చెప్పవచ్చు. లక్షణ స్పాష్ట్యం వాంఛనీయంగా మిగిలిపోయిన పై నిర్వచనప్రాయ రచనంలో క్రొత్త లక్షణాలు లేకపోవడమే గమనింపవచ్చు.

"అద్యతనాంధ్ర వచన వాఙ్మయ చరిత్రమున వ్యాస రచన ప్రధాన స్థానము నాక్రమించినది. వ్యాసమునకు సాధారణముగ నీ క్రింద వివరించిన లక్షణము లుండునని గ్రహింపవచ్చును.

1. అతి దీర్ఘమును లేక అతి విపులముగను నుండకుండుట.
2. సంగ్రహముగా గాని, క్లుప్తముగా గాని యుండుట.
3. వక్తవ్యాంశమును విషయ విభాగము చేయుట.
4. ప్రత్యేక ప్రత్యేక శీర్షికలుండుట.
5. విషయ ముద్దిష్టముగాగాని, నిర్దిష్టముగా గాని యుండుట.
6. నియతమైన పుటలలో నిముడుట

పై లక్షణములు వ్యాసము యొక్క వస్తువునకు సంబంధించినవి" (54). ఈ పై లక్షణాలు లక్షణ నిర్దేశం చేయాలన్న తొందర నుండి పుట్టాయి. ప్రత్యేక ప్రత్యేక శీర్షిక లుండుట ఆంగ్ల లక్షణంగా కాక, ఆంధ్ర లక్షణంగా భావింపవచ్చు. విషయ ముద్దిష్టమో నిర్దిష్టమో గాకపోవటం అసంభవం. లక్షణ యత్నమంతా ఆంగ్ల వ్యాస లక్షణ సంబంధిగా వుంది.

"వ్యాసం ఉపక్రమ ణోపసంహార విషయ విస్తరణాది మర్యాదలతో పూర్వపక్ష సిద్ధాంతముల సమన్వయించుకొనుచు నుదార గతిలో గంభీరముగా నుండవలెను." (55) పై లక్షణయత్నంలో రచనా శిల్ప విషయ సంబంధి దృష్టి వుంది.

ఆచార్య నిడదవోలు వేంకటరావు రచించిన ఆంధ్ర వచన వాఙ్మయం లోనూ, కురుగంటి సీతారామ భట్టాచార్యులు, పిల్లలమర్రి వేంకట హనుమంతరావు రచన నవ్యాంధ్ర సాహిత్య వీధులులోను ఒక పుట మాత్రంగా ఉన్న వ్యాస లక్షణ యత్నం ఆంగ్ల లక్షణ సంబంధిగానే సాగింది.

వ్యాస ప్రక్రియ ఆంగ్ల లక్షణానుగుణంగా ఆంధ్ర సారస్వతంలోను గోచరమవుతుంది. అయితే ఉపన్యాసం అనే పేరుతో పిలువబడే వ్యాస శాఖ ఆంగ్ల వ్యాస ధర్మం కంటే భిన్న రీతిగా ఆంధ్రంలో ద్యోతకమవుతూ వుంది. అందువల్ల "ఉపన్యాసం'' అనే సాహిత్యశాఖ వ్యాసాంతర్భాగంగా భావించి, నూత్న లక్షణ పరిశీలనం చేయవచ్చు.

## 4. 2. ఉపన్యాసం

ఉపన్యాస విధానంలో వ్యాస రచనం ఆంగ్లంలో లెక్చర్సు, అడ్రెసెస్సు, సెర్మన్సు పేరుతో ప్రసిద్ధమే. అయితే పాఠకుడితో రచయిత వ్యక్తిత్వ సంబంధం కోసం ప్రధానంగా, ఉపన్యసించటం కోసం అప్రధానంగా, ప్రారంభంలో, ఆంగ్లంలో పై విధమయిన రచనలు మొదలయితే ఆంధ్రంలో ఉపన్యసించటం కోసమే ప్రధానంగా, ఉపన్యాస ధోరణి ప్రారంభమయింది. ఆంగ్లంలో ఉపన్యాసం సాంఘికావసరం కాక, వినోదాత్మకంగా వర్తిల్లినట్లు గుర్తింపబడింది. ఆంధ్రదేశంలో ఉపన్యాసం ఒక్కొక్కప్పుడు సాహిత్యావధి అతిక్రమించినప్పటికీ, సంఘ సంస్కరణ వాంఛతో ప్రారంభమయింది. వ్యాసం ప్రధానంగా చదవబడటానికి ఉద్దేశింపబడితే- ఉపన్యాసం వినబడటానికి ఉద్దిష్టమయింది.

తెలుగు సంఘంలో సారస్వతంలో ఉపన్యాసం విశిష్ట దశా సంపాదకం కావటానికి కారణం ఆంగ్ల విద్యా ప్రారంభంతోపాటు, నిరక్షరాస్యత ప్రధానంగా భావించవచ్చు. సంఘస్థులు అక్షరజ్ఞులయితే వ్యాసం ప్రముఖ స్థానం పొందినట్లే అక్షరాస్యతా శూన్యులయితే ఉపన్యాసం ప్రాధాన్యం వహించింది. సంఘ సంస్కరణార్థం వ్రాస్తే చదవబడవలసిన వ్యాసం సాంఘికంగా అక్షరాస్యత శూన్యత వల్ల ఉపన్యాసమయింది.

అందువల్ల ఉపన్యాసం ఆంధ్రదేశంలో 19 వ శతాబ్ది ఉత్తరార్థంలో సాంఘికావసరమయింది. ఈ ఆవశ్యకదశ కందుకూరి, పానుగంటి మొదలయిన వాళ్ళ వ్యాసాలు చదివితే అవగతమవుతుంది. ఉపన్యాసమే వ్యాసంగా వ్రాయ బడటం, వ్యాసమే ఉపన్యాసంగా చదవబడటం రెండూ సంభవించాయి. కందు కూరి వీరేశలింగం పంతులు ఉపన్యాసాలు సభాముఖంలో ఉపన్యసించడానికి

పత్రికాముఖంగా ప్రచురించటానికి ఉద్దిష్టాలయ్యాయి. రెండు ప్రయోజనాలు సాధించాయి.

ఉపన్యాసం ఆంగ్ల వ్యాస లక్షణాలు అన్నీ కలిగి చదవటానికి అనుకూలంగా ఉండటంతోపాటు తెలుగుదేశంలో క్రొత్తగుణంకూడా పొందింది. వ్యాసంలో వ్యాసకర్త పాఠకుడితో పరోక్షంగా మాట్లాడువాడుకాని, ఉపన్యాసంలో వక్త ప్రత్యక్షంగా సంభాషిస్తాడు. వ్రాత కంటితోనే చదవటం కుదురుతుంది. అంటే వ్యాసం ఏకేంద్రియ వ్యగ్రతావాంఛితం. ఉపన్యాసకుడు కనబడుతూ, అతని కరచరణాద్యవయవ విన్యాసం అల్పంగానో, అధికంగానో చూడటంవల్ల అతని ఉపన్యాసం ధ్వని రూపంలో వినటంవల్ల, ఇది ఇంద్రియద్వయ వ్యగ్రతా వాంఛితం అయింది. వ్యాసంలో వ్రాతకులేని ప్రాణం ఉపన్యాసంలో భాషకు వస్తుంది. అంతేకాదు, సభయెదుటవున్న ఉపన్యాసకుడు సదస్యుల అవసరం గుర్తించి, ఉపన్యాసధోరణిలో మార్పులు, చేర్పులు చేయటమో, విషయం తగ్గించడం, పెంచడం చేయటమో సాధ్యమౌతుంది. అప్పుడు సభ్యుడి హృదయానికి ఉపన్యాసం చేరువకాగలిగే అవకాశం పొందినట్లు, పూర్తిగా అన్ని అంగాలు నిర్ణయమై ముద్రితమయిన వ్యాసంలో అవకాశంలేదు. అంతేకాదు-ఉపన్యాసంలో చిరంజీవీ శాశ్వతమూ అయిన శబ్దం ఉచ్చరింపబడి ఆహతమయి వినిపిస్తుంది. వ్యాసంలో వ్రాతకు శబ్దత్వం తద్రూపంలో సిద్ధించదు. బ్రహ్మమయిన శబ్దం సాధించే పరిణామం వ్రాత తక్షణం సాధించలేదు. శబ్దం మనిషి శరీరంమీద, బుద్ధిమీద చూపకలిగిన అధికారం అనంతం.

సామాజికావసరం కారణంగా ఆంగ్లంలోకంటే స్థాయీభేదంతో ఆంధ్రంలో అవతరించి, వ్యాసంలోని మేలిగుణాలతోపాటు నూత్నగుణ సంభరితమై విలసిల్లిన ఉపన్యాసం వ్యాసలక్షణంలో కొత్తదనం-నూతన లక్షణం ప్రత్యేకంగా తెలుగులో పొందింది. ఉపన్యాసంలో వినిపించే భాషకు ప్రాణమైన ధ్వని వ్రాతకుండదు. ధ్వనికున్న మార్దవ కఠిన్యాలు, ఆరోహణావరోహణ భేదాలు వ్రాతలో వినిపింపవు. అలాగే ఉపన్యాసకుడి భంగిమలు సమయజ్ఞత వ్యాసకర్త కుండవు.

వ్యాసంకంటే ఉపన్యాసం గుణాధిక్యంచేత ఉత్తమంగా భావించడంలో దోషంలేదుకాని, ఉపన్యసించటంలో ఉండే సాధకబాధకాలు తట్టుకోగలగటం

అత్యవసరం అవుతుంది. కొందరు వేదిక ఎక్కగానే పెదవులు వణుకుతాయి. నాలుక తడబడుతుంది. దౌడలు నొప్పి పుడతాయి. కంఠధ్వని కీచుపోతుంది. ఊపిరితిత్తులు బలహీనమయిపోతాయి. చెమట పడుతుంది. కాళ్లు తేలిపోతాయి. కళ్ళుతిరుగుతాయి. మూర్ఛ వస్తుంది. ఈ కష్టం వ్యాసరచయితకు లేదు. ప్రజాశక్తి ఎదుట నిలిచే సామర్థ్యం పెంచుకోలేని రచయిత, వాసకర్త కావటమే ఉత్తమం.

వ్యాసంలో రచయిత విషయం ఎక్కువగా చెప్పినా, తక్కువగా చెప్పినా ప్రమాదముండదు. ఉపన్యాసకుడు సభావేదికమీద వెలుగుతున్న దివిటీలాగా వర్తించాలి. వ్యర్థపదాలు, అనవరప్రసంగం, నీరసంగా ప్రవర్తించడం ఉపన్యాసకుడు చేయరాని పనులు ఎంత చెప్పాలో, ఎంతవరకు చెప్పాలో, ఎప్పుడు మానాలో తెలుసుకోలేనివాడు ఉపన్యాసకుడు కాలేడు. జాతి గుండె చప్పుడుతో, తన గుండెధ్వని ఏకంచేసుకోలేని వ్యక్తి ఉత్తమోపన్యాసకుడు కాలేడు.

ఉపన్యాసకుడు తానుపన్యసించిన విషయం ఆ సభాసదులకు మాత్రమే తెలుస్తుంది. తదితరులకు తెలియదు. ఇతర ప్రదేశవాసులకు అవగతంకాదు. కనుక బహుజనవేద్యం కావాలంటే ఉపన్యాసం వ్రాయబడాలి. అనేకులు ఉపన్యసింపగలుగుతారు కాని వ్రాయలేరు. కొందరు ఉపన్యసించింది వ్రాయలేరు. వ్రాసింది ఉపన్యసించలేరు.

దీనికి ప్రధానాంతరం భాష. తెలుగుభాష ఉపన్యసించేటప్పుడు వ్యావహారికంగా స్వేచ్ఛగా ఉంటుంది. అదే వ్రాయవలసివస్తే గాలమై గొంతు పట్టుకొంటుంది. కాబట్టి ఉపన్యసించటం సులువుగా. వ్యాసం వ్రాయటం కష్టంగా కొందరు భావించారు. కొందరుమాత్రమే తమ ఉపన్యాసాలు వ్యాసాలు కావించారు. ''నేను చిరకాల ముపన్యాసకుడుగ దేశ సంచారం బొనరించుట దుర్ఘటంబని తోచుటచేతను, ఉపన్యాస కార్యంబునకంటే, కవికార్యం బధిక ప్రయోజనంబని యెఱిగి యుండుటచేతను'' (56) ఉపన్యాసాలు వ్రాసి ప్రచురించటం జరిగింది.

కందుకూరి వీరేశలింగం పంతులు ఉపన్యాసాలు వ్రాయబడి ఉపన్యసింపబడికాని, ఉపన్యసింపబడి వ్రాయబడికాని వాగ్రూప లిఖితరూపాలు పొందాయి.

పానుగంటి సాక్షి రచనలు ప్రాతరూపంపొందినవే అయినా ఉపన్యసింపబడిన స్ఫూర్తికలిగించాయి. వాటిని వ్యాసాలు, ఉపన్యాసాలు అని రెండు పేర్లతో వ్యాస కర్త సంభావించాడు.

తెలుగువ్యాస లక్షణాలు. ఆంగ్లవ్యాస లక్షణాలతో తుల్యాలు. తెలుగులో ఉపన్యాసవిధానం వ్యాసలక్షణాలతో ఒప్పుతూ నూత్న లక్షణ సంపాదనమైంది. ఆంగ్ల వ్యాస లక్షణాలతో ఆంధ్రంలోకి వచ్చిన వ్యాస సంప్రదాయంతో తెలుగు ఉపన్యాసం క్రొత్త లక్షణం జోడించింది.

## 4.3.1. వ్యాస ప్రక్రియలు-ఆంగ్లం

ఆంగ్లంలో సాహిత్య ప్రక్రియ అయిన వ్యాసంలో అంతర్గతంగా భిన్న ప్రక్రియలకు అవకాశం ఏర్పడింది. వ్యాసం ప్రారంభం నుంచి పరిణామ ధర్మం ప్రదర్శించింది. బేకన్ కాలం నుంచి ఆధునిక కాలం దాకా వెలువడ్డ వ్యాసాలు సృజనంగా, విమర్శనంగా ఉండటంతోబాటు, సమీక్షా వ్యాసాలు, ప్రతికా వ్యాసాలు, చారిత్రక వ్యాసాలు, వెలుగు చూశాయి. ఇన్ని విధాలుగా వ్యాసరచన జరిగినా, ఇంత విస్తృత వ్యాస వాఙ్మయం ఏర్పడినా, ఈ ప్రక్రియ శాస్త్రు దృక్పథంలో పరిశీలింప వలసిన అవసరం తీరలేదు.

ఆంగ్లంలో వ్యాస సారస్వతంలో అధ్యయనం, పరిశీలనం, విమర్శనం జరిగినంత అధికంగా ప్రక్రియ దర్శింపబడలేదు. ఆంగ్లంలో వ్యాస ప్రక్రియను గూర్చి విమర్శకులు వెలువరించిన అభిప్రాయాలు పరికింపవచ్చు.

"In the last resort we may reduce the essays to two class-es-essays par excellence and compositions to which custom has assigned the same name, but which agree only in being comparatively short and in being more or less incomplete." (57)

ఈ నిర్వచనం వ్యాసాలు రెండు విధాలుగా ఒక తరగతి వ్యాసాలు ఉత్తమంగా, మరో తరగతిని ఆ పేరుతో పిలువబడేవిగా చెప్పబడ్డాయి. ఈ నిర్వచనంలోని దృష్టి స్పష్టమే కాని, విభజనంలో పేర్కొంచటంలో స్పష్టత లేదు.

"In Hazalitt and Francis Jeffery we see the form and method of essay beginning to be applied to literacy criticism." (58)

ఈ నిర్వచనంవల్ల వ్యాసరూప స్వభావాలు సాహిత్య విమర్శకు ప్రయో గింపబడటం ప్రారంభమయిందన్న సూచన కలిగింపబడింది. వ్యాసం విమ ర్శనగానూ, తద్భిన్నంగానూ వ్యవహరింపబడిందన్న ధోరణి స్పష్టంగా లేదు.

"We do in fact more often speak of them as articles, papers, thesies, monographs, studies, addresses or even lecetures; but when it comes to publishing in book form, the titile of essays in too often usurped for the same of its literary prestige... The essay proper remains and will always remain distinct from all these" (59)

ఈ నిర్వచనంలో పేర్కొబడ్డ రచనా విధానాలన్నీ చాలా వరకు పరి శోధనకు సంబంధించి వున్నాయి. వ్యాసంలో పరిశోధనాంశం ఎప్పుడయినా వెలువడవచ్చుకాని, పరిశోధనమే లిఖింపబడి, ఎప్పుడూ వాస్యం కాదు. వ్యాసం పేరుతో వ్యాసంకాని రచనలు పిలువబడుతున్నాయన్న సూచన ఈ నిర్వచనం అందిస్తుంది. పరిశోధనాత్మక రచనల్లో రచయిత వ్యక్తిత్వం ఉండనక్కర లేదు. వ్యాసంలో ఉండితీరాలి. వ్యాసం, పరిశోధనవ్యాసం, అని ఇది రెండు విధాలుగా విభజింపబడింది కాని, విపులీకరణం లోపించింది.

"The result is that of these two directions which the essay has been taken those who follow the one are perpetually excommunicated by those who favour the other." (60)

ఆ వ్యాసకర్తలేమి చేసినా వ్యాసం రెండు విధాలుగా రూపొందిందని, అది వ్యాసకర్తలు వెలివేసుకొనేంత స్పష్టమైన తేడా పొందిందని తెలుస్తోంది.

ఇంతవరకు పరిశీలింపబడ్డ నిర్వచనాల నుంచి స్పష్టమయ్యేది ఒక్కటే! వ్యాసం రెండు రూపాలు పొందింది అనేది సారాంశం. ఈ రెండు వ్యాస తత్త్వాలకు పై అభిప్రాయాలలో స్పష్టమైన పేర్లు గోచరం కాలేదు. ఒక విధమైన వ్యాసంలో సృజన ధర్మం అధికంగా వుంటుంది. రెండవ దానిలో అది లోపించి అయినా పోతుంది. లేదా అల్పంగానయినా వుంటుంది. కాబట్టి వ్యాసం సృజనమయిందీ, కానిదీ అన్న విభజనం అంగీకరింపవచ్చు. ఒక విధమైన

వ్యాసంలో రచయిత వ్యక్తిత్వం బాహాటంగా ఉంటుంది. మరో విధమయిన దాంట్లో లోపించటమో అల్పంగా ఉండటమో జరుగుతుంది. దీని వల్ల కూడా వ్యాసం రెండు విధాలుగా ఏర్పడుతుంది. సాధారణంగా సృజనమైన వ్యాసం రచయిత వ్యక్తిత్వ శోభితమవుతుంది. తద్భిన్న మయింది తల్లోపం ప్రదర్శిస్తుంది. ఈ రెండు విధాల వ్యాసానికి రెండు పేర్లు నిర్ణయించుకోవటం అత్యవసరమే. రచయిత వ్యక్తిత్వ ముద్రితమయ్యే వ్యాసం సృజన వ్యాసమనీ, తద్భిన్న మయింది విమర్శనా వ్యాసమనీ, ఈ ద్వైవిధ్యానికి నామకల్పనం సాధ్యమవుతుంది.

వ్యాస ప్రక్రియలు రెండు విధాలే కాదు, అనేక విధాలుగా ఉన్నాయి అని తెలిపే అభిప్రాయాలు లేకపోలేదు. 1. Familiar essay. 2. Character essay 3. Descriptive essay, 4. Critical essay 5. Scientific essay, 6. Philosophic or reflective essoy, 7. Narrative essay etc., (61) ఈ అభిప్రాయం వ్యాసాన్ని ఏడో అంత కంటె ఎక్కువగానో విభజించవచ్చునని తెలుపుతుంది.

''Although there are no definite forms, there are several general classes into which essays may be roughly grouped. These very frequently overlap. These may be historical, biographical, familiar, personal, imaginative, narrative, didactic, critical, reflective, philosophical or religious.''

వ్యాసం అనేక విధాలుగా విభజించటానికి వీలుందని ఈ అభిప్రాయం, ఈ విభజన తెలుపుతుంది.

"One : Facts & Explanations :

1. The Factual Essay.
2. The Factual Historical Eassy.
3. The semitechnical Essay.
4. A factual Biography.

Two : Interpretations and Evaluations :

1. Essays Interpreting our culture.
2. Essays of criticism.
3. Essays of Persuasion, agreement & logic.
4. Essays appealing to emotion.

Three : Literary Art and the creative Imagination :

1. Biography that is literature.
2. History that is literature.
3. Narrative Essays.
4. Descriptive Essays.
5. Familiar Essays." (63)

ఒక విధమైన లక్షణాలున్న వ్యాసాల కొక పేరు గ్రహిస్తూ సాగితే వ్యాస సాహిత్యం విస్తృతి ఆ పేర్ల వల్ల స్పష్టమవుతుంది. ఒక ప్రక్రియ ఎంత విస్తృతమయినా మంచిదేకాని ప్రక్రియా ధర్మం మరుగున పడకూడదు. ఒక ప్రక్రియాంతర ప్రక్రియలు విభిన్నమయితే ప్రక్రియాధర్మచ్యుత మయ్యే లేకపోతే మరుగయ్యే అవకాశం వుంటుంది. కాబట్టి విభిన్న ధర్మాల కొక సామాన్య ధర్మ స్థాపనం ఉచితం కావచ్చు,

అందువల్ల ఇన్ని విధాల వ్యాసంలో రచయిత వ్యక్తిత్వం ఉంటే సృజన వ్యాసమనీ, లేకపోతే విమర్శన వ్యాసమని భావించటమే ఉచితం. అయితే ఇంత స్పష్టమయిన విభజనం అవసరమా అనుకో నక్కరలేదు. సృజన వ్యాసం భిన్న రూపాలుగా, విమర్శన వ్యాసం వివిధంగా ఉండవచ్చు. అప్పుడూ వ్యాసాల కొక సామూహిక ధర్మం ఏర్పడుతుంది.

స్థూలంగా వ్యాసాలు సృజనం విమర్శనం అయి రెండు విధాలు. ఒక్కొక్క తరగతి వ్యాసంలో భిన్న ప్రక్రియలు ఉండవచ్చు. విభిన్న వ్యాస ప్రక్రియతో వున్న పైరెండువిధాలు వ్యాసం యొక్క పూర్తి విభజనకు ప్రధాన స్థితి వహిస్తాయి.

## 4.3.2. తెలుగు వ్యాస రచన

తెలుగులో వ్యాస రచనా విధానం వివరించటానికి అల్ప ప్రయత్నం గోచరమవుతుంది. ఇందుకు కారణం కళాశాల విద్యార్థులకు వ్యాసరచన పరీక్ష దృష్టితో మిక్కిలి ప్రధానం కావటమే ఏమయినా వ్యాసం రచనా దృష్టితో బాహిరంగా విభజించే ప్రయత్నం దీనివల్ల జరిగింది.

వ్యాసం ముగింపు మరపురానిదిగా వుండేటట్లు సారాంశంగా భావింపబడేటట్లు వ్రాయబడాలన్న ధోరణి గమనార్హం. "ఉపసంహార వాక్యము ముఖ్యాంశముతో

గూడి యుండవలెను. అనఁగా ఫలితార్థమునుఁ జివరఁ జెప్పుచుండవలెను.''(64)

వ్యాసం ప్రధానంగా మూడు భాగాలుగా విభజింపబడాలి అనీ, అవి ప్రారంభం, విషయ వివరణం ఉపసంహారంగా ఉండాలనీ, విషయ వివరణం విస్తృతంగా, తదితరాలు అల్పంగా సాగాలని తెలుపబడుతూ వుండాలని నిర్ణయమైనట్లు గోచరమవుతుంది.

''ఉపక్రమణిక: ఉపపాదనము, ఉపసంహారము- అను మూడంగములు కలిగి యుండుట.'' (65)

''మొదలు, పెంపు, తుది గలిగి యొక వింత శిల్పముతో నొప్పారు ఈ రచనా పద్ధతి పాశ్చాత్య సాహిత్య పరిచయ ఫలితమని విమర్శకుల అభిమతము.'' (66)

''వ్యాస స్వరూపమును ఆది మధ్యావసానములని మూడు భాగములుగా విభజింపవచ్చును. ఆదికి ఉపక్రమము, మధ్యమునకు వ్యాస శరీరము, అంతమునకు ఉపసంహారము అని పేళ్ళు.'' (67)

వ్యాస శరీరం ఒక్కొక్క వ్యాసం, ఒక్కొక్క వస్తువు కారణంగా సామాన్య లక్షణ బద్ధం కాకుండా భిన్నంగా వుంటుంది. అందువల్ల దాని లక్షణ నిర్ణయ ప్రయత్నం వ్యర్థం. పోతే పై నిర్వచనకర్త. కథతో, అనువాద విషయంతో, చర్చనీయాంశంతో సూటిగా, అసంబద్ధంగా, అసంబంధంగా, ముఖ్యాభిప్రాయగోపనంగా ప్రారంభమూ, ముఖ్యాంశ ద్యోతకంగా నూత్న భావప్రేరకంగా, అనువాద విషయంతో, మందలింపుతో, ప్రశ్నోత్తర రూపంతో, ఉపక్రమావృత్తితో, దృష్టాంత కథతో, తుంచినట్లుగా ఉపసంహారమూ ఉండవచ్చుననటం గమనార్హం.

ఆద్యంతాల మధ్య అసలు వ్యాస విషయం ఉంటూ వ్యాసం వ్రాయబడాలని, వ్యాస రచనకు రచనా దృష్టితో బాహిర విభజన చెప్పే ప్రయత్నం చాల ప్రాథమికం.

ఈ విభజనం స్థూలంగా ఉచితమయినట్లు కనిపిస్తుంది కాని, సమగ్రమయింది కాదు. అసలు ఏ రచన కయినా, ఆద్యంతాల మధ్య విషయ విస్తరణ

ఉండటం కుదురుతుంది కదా! కథానికకు, నవలకు, నాటికకు విమర్శనకు ఆది, అంతం, మధ్యలో విషయ ప్రవర్తనం సరికదా! ఏ సృజన విమర్శన రచనకైనా, ఏ కళకయినా లోకస్థ బహు విషయాలకు ఆది, మధ్య, ఆ అంతం సహజంగా ఉంటు న్నప్పుడు వ్యాసానికి మాత్రమే అవి ధర్మాలుగా చెప్పటం ఏం సబబు ?

ఈ విధంగా వ్యాస రచనా లక్షణం పాఠశాల కళాశాల విద్యార్థులకు ఉద్దేశింపబడి వుంది. ఇది తెలుగు విమర్శకులు క్రొత్తగా ఆంధ్రంలో ఆలో చించింది కాదు. ఆంగ్లంలో అధిక స్పష్టత వాంఛించిన లక్షణ గ్రంథాలలో లభ్యమవుతుంది. "It is usually is divided into three main parts : (1) the introduction; (2) the main body, consisting of a series of paragraphs, more or less closely related, in which the subject is developed; and (3) the conclusion." (68)

ఈ విధమయిన రచనా విభజనం ఆంగ్లంలో ఎక్కడో తప్ప జరగ లేదు. రచనా సంబంధి బాహిర విభజనం వ్యాస విషయంలో అవసరం కాదు.

## 4.4.1. వ్యాసోద్దేశం

ఛందస్సహిత కవిత బహు విధాల విస్తరించి వున్నప్పుడు, వచన కవిత వెల్లివిరుస్తున్నప్పుడు వ్యాసం వ్రాయవలసిన అవసరం కాని, నవలా వాఙ్మయం ప్రపంచిత మవుతున్నప్పుడు, నాటకాది సాహిత్యం సమాజాన్ని వెలిగిస్తున్నప్పుడు నూత్నంగా వ్యాసం ఆవిర్భవించవలసిన అవసరం కాని వెంటనే ఆలోచన కందదు. వ్యాసోద్దేశం తెలియాలంటే వ్యాసం పుట్టుక కారణం తెలియాలి.

అధునికమై, అధునిక ప్రయోజనార్థం ఆవిష్కరింపబడ్డ వ్యాసం ప్రారంభ మయిన తారీఖు, దాని ఆవిష్కృత రూపం ఏ సాహిత్య ప్రక్రియకు లేనంత స్పష్టంగా తెలుస్తుంది. వ్యాసం ఎస్సె-ఎస్సై అన్న పేరు క్రీ.పూ. 1571 మార్చి నెలలో వ్యాసం మొదటిసారిగా సృష్టింపబడింది. అప్పుడే ఆ పేరుతో రచనలూ ఆవిర్భవించాయి. ఇంత స్పష్టంగా ఏ సృజన విమర్శన సాహిత్య ప్రక్రియల ఆవిర్భావ సమయం తెలియదు.

ఫ్రాన్సు దేశీయుడైన మైకల్ డి మాంటేన్ నాగరక జీవితంలోని తొందర లకు దూరంగా, నగరానికి దూరంగా తన తాత ముత్తాతల, కోటవంటి భవనంలో జీవిత చరమదశలో ప్రవేశించి, చుట్టూ అరణ్యంగా ఉన్న ప్రకృతి మధ్య ఒంటరి మందిరం రెండో అంతస్తులో కూర్చుని బాహిరంగా చుట్టూ చూస్తూ, ఆంతరంగా చూచుకొంటూ ఆ వేగ ప్రపంచంలోని తొందరల మరచిపోతూ, ప్రశాంతంగా చదువుకొంటూ మననం చేసుకొంటూ, తన జ్ఞాపకాలను భద్రపరచటానికి, తన అనుభూతులను అభివ్యక్తం చేయటానికి న్యాయవాదియొక్క పరిశీలన దృష్టితో సంస్కారవంతమైన తన జీవితం అంతా తిలకిస్తూ వ్రాసుకు పోయిన రచనలే ఈ వ్యాసాలు. తొమ్మిది సంవత్సరాల పాటు తొందరపడకుండా నెమ్మదిగా వ్యాససృష్టిచేసి 1580 లో మొదటి వ్యాస సంపుటి ప్రకటించాడు.

ఈ వ్యాసావిర్భావాన్ని అంగీకరింపనివాళ్ళు వ్యాసకర్తల్లోనూ, విమర్శకుల్లోను ఉండటం సహజమే! ఈ అంగీకరింపని వాళ్ళలో ఆంగ్లంలో ప్రథమ వ్యాసకర్త, మాంటేన్ ప్రభావంతో వ్యాసాలు వ్రాసిన వ్యక్తి, బేకన్ ప్రథముడు. మాంటేన్ వ్యక్తిత్వం, ఈ వ్యాసాలు బాగా చదవబడ్డ ఇంగ్లాండులో, ప్రభావం చూపింది. బేకన్ మాంటేన్ వ్యాసాలు చదివి వాటివల్ల ప్రభావితుడై వుండాలి. 1597 లో, మాంటేన్ వ్యాసాలు ముద్రితమైన 17 సంవత్సరాలకు బేకన్ తన మొదటి పది వ్యాసాల సంపుటి ప్రచురించాడు. అందువల్ల వ్యాస ధర్మాలు బేకన్ మాంటేన్ నుంచి గ్రహించినట్లు స్పష్టమవుతుంది.

"How great and how rare was his (Montaigne) natural art can atonce be shown by comparing him with Bacon, his imitator and the first of our recognised English essayists". (69)

అయినా వ్యాసంపేరు ఆధునికం గానీ, ప్రక్రియ ప్రాచీనమని తెలుపుతూ వ్యాస ప్రాచీనతను భావించాడు బేకన్. ఈ విషయం అంగీకరిస్తూ విమర్శకుడు యఫ్. హెచ్. ప్రెచ్చర్డ్ తన గ్రేట్ ఎస్సేస్ ఆఫ్ ఆల్ నేషన్స్‌లో బేకన్ వాదాన్ని బలపరచాడు. వ్యాస ప్రారంభ సమయంగా ఒక తేదీని అంగీకరించటం గొప్ప పొరపాటనీ, ఎప్పుడయినా సాహిత్యంలో ఏ ప్రక్రియ అయినా క్రమంగా రూపొందుతుంది కానీ ఆకస్మికంగా తయారు చేయబడదనీ, ప్రాచీన కాలం నుంచి వ్యాస ప్రక్రియ వుందనీ, వ్రాయబడుతూ వచ్చిందనీ, ప్రాచీన భాషల

సాహిత్యం నుంచి ఉదాహరణలు అనేకం ఇచ్చాడు. అయితే ఒక విషయం విపులీకరింపబడ్డ రచనలే కాని, రచయిత వ్యక్తిత్వం లేనివి కావటంవల్ల అవి వ్యాసాలు కాదనవచ్చు. అయితే ప్రిచ్చర్డ్ "... he is asked to remember that personality express itself in many ways" (70) అని చెప్పే ఈ వ్యక్తిత్వం అభివ్యక్తం కానిది. అందువల్ల ప్రిచ్చర్డ్ తలపోసిన వ్యాసాలు ఆధునిక దృక్పథంతో ప్రాచీనకాలంలో వెలసినా ఆ పేరుతో పిలువ దగ్గని కావు.

అయితే వ్యాస రచనోద్దేశం స్పష్టం చేసుకోవటానికి విమర్శకుడి అభిప్రాయం ఇప్పుడు ఉపయోగపడవచ్చు.

"The truth is that the Sieur de Montaigne wrote to please himself and possible his contemporaries mixing artistic satisfaction ......" (71)

తన సంతృప్తికోసం, ఇతరుల్ని సంతుష్టుల్ని చేయటంకోసం, కళా తృప్తి జోడిస్తూ వ్రాసిన రచన వ్యాసం, సృజన రచన మయిన వ్యాసానికి ఇతర రచనలు మాదిరిగా ఉపజీవ్య గ్రంథావసరం లేదు. విషయ నిర్ణయార్హతను, మానసిక సామర్థ్యాన్ని తనంతట తాను స్వేచ్ఛగా పరీక్షించుకోవటమే వ్యాసం. ప్రథమ వ్యాసకర్త వ్యాసం కావ్యానందం కోసం ఉద్దేశించినట్లు తెలుస్తుంది.

అయితే బేకన్ తెలియని జనానికి విషయం తెలపటం కోసం, పాత్ర రచయితలు భిన్న పాత్రలను పరిచయం చేయటం కోసం, కౌలీ మున్నగు రచయితలు కావ్యానందం కోసం, స్టీలు మొదలైన వాళ్ళు సంఘం సంస్కరించటం కోసం, వార్తలు సరసంగా అందించటం కోసం, గ్రంథాలు సమీక్షించటం కోసం, గ్రంథ విమర్శన కోసం, చరిత్ర రచన కోసం వ్యాసం ఉపయోగించారు.

కవితా హృదయం ఉండి, ఛందస్సహిత రచనా విధానం అసమగ్రంగా భావించి, మనిషి అనుభూతులన్నింటికి, పద్యముపయుక్త మయినంతగా, ఆలోచన కుపయోగపడదని తెలిసి, అరిస్టోటిల్, సోక్రటిస్, ప్లేటో, సిసిరో, సెనెకా, థియోఫ్రాస్టస్ కవిత్వ పరిధిలో కాక వచన మార్గంలో ఆలోచనా ప్రదర్శనం కావించారు.

ప్రాథమికంగా వ్యాసం మనస్సృష్టి. అది మేధావి మనస్సు మాత్రమే కాదు; హృదయవాది అయిన మేధావి మనస్సు. అందుకే వ్యాసం హృదయం అనుభవించే ఆలోచనల కేంద్రం. ఆలోచనలు పుట్టే రమ్య రంగస్థలం. వ్యాసం మేధావి హృదయజన్యం. మేధావి మనస్సృష్టి తార్కికమై, జటిలమై, భాషాకఠినమై, సామాన్య పాఠక హృదయ గోచరం కాదు. మేధావి హృదయం నుంచి పుట్టే వ్యాసం ఆలోచనా స్తబ్ధ విషయికంగా ఆవిర్భవింపక, సామాన్య హృదయ సన్నిహిత మవుతుంది.

వ్యాసంలోని రచన ఆలోచన ప్రధానంగా కాని అనుభూతి ప్రధానంగా కాని ఉండవచ్చు. అయితే ఆ రెండు గుణాలు కుడి ఎడమలుగా ప్రతి వ్యాసం లోనూ ఉండాలి. అందువల్ల కోమల మనస్వి అయిన హృదయ వాది కాని, సుకుమార హృదయవంతుడైన మేధావి కాని సృష్టించిన ఆలోచనానుభూతుల కూడలి వ్యాసం. సాహిత్యంలోఏ ప్రక్రియ పొంది ఉండని ధర్మం ఉన్న వ్యాసం ఎవరయినా ఆ పేరుతో తమ ఆలోచనలు తెలుపటానికి వీలుగా రూపొందిన తీరే దాని ప్రయోజనం.

## 4.4.2. వ్యాసావకాశం

వ్యాసం అప్పటి నుంచి, ఇప్పటి వరకు ఆంగ్లంలో అనేక దశలు అధిగ మించింది. మాంటేన్ వ్యాస రచనా విధానం, బేకన్ చేతిలో హృదయాభి వ్యక్తిని కోల్పోయి, గ్రంథ భాగాలు సంతరించుకోవటం తగ్గి, సంక్షిప్త రూపంగా, ఆలోచనమంతా కాక, దాని ఫలితం మాత్రమే వ్రాయబడుతూ వచ్చింది. పాత్ర రచయితల కాలంలో డెక్కర్ మొదలైన వాళ్ళ వ్యాసాలలో పాత్రలకు ప్రత్యేకత సంక్రమించి, నాటక సాహిత్య లక్షణం ఎక్కువగా నవ లాది రచన లక్షణం కొంతవరకు జోడింపబడింది. కౌలీ తదితర రచయితల కాలంలో వ్యాసం మాంటేన్, బేకన్‌ల వ్యాస ధర్మం సమీకరించుకొన్న రూపం పొందింది. స్టీలు, ఎడిసన్‌ల కాలంలో వ్యాసం సామాన్య జన సన్నిహితమయి, పత్రికా వ్యాసంగా ప్రారంభమయి, ప్రాచుర్యం పొంది, ఔన్నత్య మొక మెట్టు దిగి, ఆలోచన మొక అడుగు క్రిందికి వేసి హృదయం ఒక మెట్టు పైకి ఎక్కి పాఠకుల చేత ఆదరింపబడటం అత్యంత ఫలంగా భావించి, అల్ప విషయానికి ఆధిక్యం వాంఛించి, రాజకీయ రంగంలో తాత్కాలిక సంగతులు సంతరించు

కొని, ఆ కాలంలోను, అనంతర కాలంలోనూఆదరం పొందే వాఙ్మయ ప్రక్రియగా విశిష్ట స్థానం ఆక్రమించుకొంది పత్రికా వ్యాసం పలువురు అనుకరించే అవకాశం కలిగి, అది అనేక విధాల విస్తృత మయింది. శామ్యూల్ జాన్సన్, ఆలివర్ గోల్డ్ స్మిత్ వ్యాసాభివృద్ధికి దోహదం చేశారు. సమీక్షకుల వ్యాసాలలో సాహిత్యం విషయమై, వాదోపవాదావకాశం కలిగింది. సాహిత్యం అడ్డం పెట్టుకొని వ్యక్తి విమర్శనం రాజకీయాల ముసుగులో ప్రారంభమయి, క్రమంగా సాహిత్య విమర్శనం బలవత్తర సారస్వత శాఖగా ఏర్పడింది. లేహంట్, విలియం హేజ్‌లిట్ ఈ సమీక్షా రచనకు మార్గదర్శకులయ్యారు. సిడ్నీ స్మిత్ ఫ్రాన్సిస్ జఫరే సమీక్షలు తీవ్రంగా సాగి, తీవ్ర వాదనకు కారణ భూతాలు అయ్యాయి. బహుకాలం తర్వాత, ఆంగ్ల వ్యాస చరిత్రలో చార్లెస్ లేంబ్-ఆంగ్ల వ్యాస చక్రవర్తి-కారణంగా, అత్యాధునిక పరిణామం కలిగి, ఒక క్రొత్త యుగా రంభమయింది. మాంటేన్, బేకన్‌ల వ్యాస ధోరణుల జోడించి, స్టీలు, ఎడిసన్‌ల హాస్య లక్షణాలు, వ్యాస సాంఘిక ప్రయోజనం గుర్తించి, హృదయం దోచుకొని అత్యుత్తమ వ్యాసాలు ఆంగ్లంలో రచించిన సాహితీ చిరంజీవి చార్లెస్ లేంబ్. సాహిత్య విమర్శనం జరుగుతున్న కాలంలోనే వ్యాసం మరో పరిణా మానికి గురి అయింది. కార్లైల్, మెకాలేల చారిత్రక వ్యాసాలు, సృజన ధర్మం గ్రహించాయి. ఈ సమయంలో సృజన ప్రక్రియలు అనేకం విస్తృ తంగా వ్రాయబడటంతో వ్యాసావకాశం అల్పంగా తగ్గి, అధికంగా నూత్న పథగామి అయింది. శాస్త్ర విషయాలు, సాంకేతిక సంగతులు వ్యాసంలో చోటు చేసుకొన్నాయి. ఇంత విస్తృతంగా పరిణమించి అత్యాధునిక విజ్ఞాన రచనా సాధనమయి, వర్తమాన భావ వాహిక అయి సాగే వ్యాసం, ఏ విషయం వివరించటానికి అయినా సమర్థమై, ఏ ప్రక్రియలోను ఇమడని ఏ విషయమయినా వ్రాయటానికి అనుగుణంగా రూపొంది, సృజన విమర్శ రూప ద్వైవిధ్యంతో ప్రకాశిస్తూ వుంది.

వ్యాసావకాశాన్ని గూర్చి విమర్శకులు, రచయితలు వ్యక్తం చేసిన అభి ప్రాయాలు వల్ల దాని పూర్ణావకాశ స్థితి గోచరమవుతుంది. "Apparantly there is no subject from the stars to the dust heap and from the amoeba to man, which may not be dealt in an essay." (72)

వ్యాసంలో సర్వ విషయాలకు అవకాశం వుందని స్పష్టమవుతుంది. వ్యాసం చాలావరకు హద్దులు లేనిది కావటం వల్ల, సాహిత్య గమనం కోరే ప్రతి రచయిత వ్యాసమనే విస్తృత రంగ స్థలంలో ప్రవేశించాడు.

"No subject is special to it, none alien from it. It should set out to prove nothing but can illuminate anything." (73)

ఇందు ప్రథమార్థం వ్యాసావకాశం, ద్వితీయార్థం వ్యాస లక్ష్యం తెలుపుతుంది.

వ్యాసంలో ఏ విషయమయినా వ్రాయవచ్చుననీ, వ్రాయరానిది లేదనీ తెలుస్తుంది.

"I would not be too much to say that the essay has been the most potent influence in humanizing relationship and in promoting healthy social intercourse. (74)"

ఈ అభిప్రాయం వ్యాసం యొక్క ఔన్నత్యం ప్రదర్శించేదిగా వుంది. సర్వసాహిత్య కార్యానికి వ్యాసం ప్రతినిధిగా భావింపదగినంత ఉన్నత స్థాయి ఈ అభిప్రాయం ప్రకటించింది. ఆరోగ్యకర సాంఘిక సంబంధాలు కలిగించటంతో, ఆ సంబంధాలు మానవత్వీకరించటంలో అధిక శక్తి మంతమైన ప్రభావంగా వ్యాసం ఉందనటం అతిశయోక్తి కాదు అన్న అంశం విమర్శనా దృక్పథంలో శ్రేష్ఠంగా భావింపవచ్చు.

విమర్శకులు సామూహికంగా ప్రకటించిన ఏకాభిప్రాయం ఒక్కటే. అది వ్యాస విషయంలో పరిమితి లేదు. ఏ విషయం అయినా వ్యాసంలో వ్యక్తీకరింపవచ్చు. వ్యాసం కలిగి వున్నంత విస్తృతావకాశం ఏ రచనా ప్రక్రియకూ లేనట్లే భావింపవచ్చు.

వ్యాస రచయితలలో అనేకులు వ్యాసావకాశం ప్రకటించారు. నేల మీద వున్న ఏ వస్తువైన వ్యాస విషయం కావచ్చు. నన్ను నేనే చిత్రించుకొంటున్నానంటే మనిషికి సంబంధించిన సర్వ విషయాలకు వ్యాసంలో అవకాశం వున్నట్లు స్పష్టమవుతుంది. స్త్రీ స్వాతంత్ర్యం నుంచి స్త్రీ జుట్టు ముడివరకు, ఆకాశంలో నక్షత్రం నుంచి ఇసుక రేణువు వరకు, భగవంతుడి ఆకారం నుంచి భక్తుడి

కన్నీరు వరకు, అదీ ఇదీ అనటం ఎందుకు, ఏ విషయమైనా వ్యాసంలో అవకాశం కలిగి వుంటుంది.

"It have loitered my life away, reading books, looking at pictures, going to plays, hearing, thinking and writing on what pleased me best" (75)

ఏ విషయం అయినా వ్యాసంగావచ్చుననిపిస్తుంది. ఇంద్రియ జ్ఞానంతో పరమానందం పొందే వ్యక్తి, పంచేంద్రియాలకు ప్రమోదం కలిగించే ఏ విషయమయినా వ్యాస విషయంగా స్వీకరించే అవకాశం వుంది.

ఆంగ్ల వ్యాసావకాశం విమర్శకుల, రచయితల దృష్టితో పరికిస్తే అనంతం. వ్యాస విషయం సృష్టిలోని ఏ విషయమైనా కావచ్చు. ఆధునిక సాంఘికావసరాలకు సమగ్రంగా ఉపయోగపడ గలిగే అవకాశం వ్యాసం పొందింది.

-నాలుగు శతాబ్దాలు ఆంగ్లంలో విస్తరిల్లిన వ్యాసం ఒక శతాబ్దం ఆంధ్రం పొందిన రూపాన్నీ, సృజన విమర్శన వ్యాసంగా అభివృద్ధి చెందిన ఆంగ్ల ప్రక్రియ ఆంధ్రంలో తత్ రీతిలో సాధించిన పరిణామాన్నీ, ఏ సాహిత్య మర్యాద ననుసరించినా ఆంగ్ల వ్యాసంలో సర్వులకు దర్శనమిచ్చే రచయిత వ్యక్తిత్వ ముద్ర ఆంధ్రంలో సాధించిన అభ్యుదయాన్నీ, బుద్ధి హృదయ బలాల కేంద్రంగా సంగమ క్షేత్రంగా ఆంగ్ల వ్యాసం పొందిన ఔన్నత్యం ఆంధ్రంలో నిలుపుకొన్న రీతినీ, ఆనంద ప్రయోజనంతో ఆవిర్భవించి, సంఘ సంస్కరణ వాంఛించిన అంగ్లవ్యాసం ఆంధ్రంలో సంఘ పరిణామ కాంక్షతో స్వీకరించిన దశనూ, తెలుగు వ్యాసం సృజన వ్యాసంగా, విమర్శన వ్యాసంగా రూపొందిన తీరునూ, తదంతర్గత ప్రక్రియలనూ దర్శింపవచ్చు.

వ్యాసం ఆనందం కలిగించినా, విషయం వివరించినా, సాహిత్యం విమర్శించినా, క్రొత్త భావాలు తెలిపినా, సంఘం సంస్కరించటానికి కృషి చేసినా, ప్రాథమికంగా మనిషి చుట్టూ ఆవృతమయింది. మనిషిని సంఘ జీవిగా అక్షరాలా పరికించింది వ్యాసం. వ్యాసం సాంఘిక జీవితానికి వ్యాఖ్యానం.



# References


1. W. H. Hudson - An Introduction to the study of literature ch. Essay P 331
2. Ibid P 332
3. Hugh Walker - The English Essay and Essayists P 2
4. Homer. C. Combs - Introduction - A book of the Essay P XIII
5. W. H. Hudson - An Introduction to the study of literature P 332
6. Compton's pictured - En Vol 4. P. 397
7. Chambers en. vol. 5 p. 393
8. Colliers en. vol. 7 P 418
9. రాయసం వెంకటశివుడు- ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక (1931-32) వ్యా. "వ్యాసము" పు 1
10. ఆచార్య నిడదవోలు వేంకటరావు- ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక (1960-61) వ్యా. నూరేళ్ళ తెలుగు వ్యాసము పు. 141
11. డా. కొత్తపల్లి వీరభద్రరావు-తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము పుట 363
12. శ్రీ పురిపండా అప్పలస్వామి-పీఠిక-సారస్వత వ్యాసములు-రెండవ సంపుటము పుట IX
13. C. P. Brown - English and Telugu Dictionary P 338
14. C. P. Brown - English Telugu Dictionary - Supplement P. 1380
15. W. H. Hudson - An Introduction to the study of literature ch. Essay P 333
16. Colliers En. vol. 7 P 418

17. Joseph Addison - Quoted by F. H. Pritchad in Introduction Great Essays of all Nations P 2
18. W. H. Hudson - An introduction to the study of literature - ch. Essay P 331
19. Bacon - Quoted by Hugh Walker - The English Essay and Essayists P 20
20. Hugh Walker - The English Essay and Essayists - P. 1
21. Orlo Williams-The Essay PP 16, 17
22. John L. Stewart - The Essay A critical anthology P 530
23. Orlo Williams - The Essay - P 25
24. Ibid P 13
25. Huge Walker - The English Essay and Essayists P 3
26. W. H. Hudson - An introduction to the study of literature - Ch. Essay P 332
27. Orlo Williams - The Essay P 10
28. Compton's pictured En. Vol 4 P 397
29. The Home University En. P 1723
30. Homer C Combs - Introduction - A Book of the Essay PXVI
31. Mabel Irene Rich - A study of the types of literature (Revised Edition) P 384
32. W. H. Hudson - An Introduction to the study of literature PP 334, 335
33. Orlo Williams - The Essay P 10
34. Homer C Combs-Introduction-A Book of the Essay P XIII
35. F. H. Pritchard - Introduction - Great Essays of all Nations P 3
36. Montaigne Quoted by Orlo Williams - The Essay - P 22

37. Compton's pictured En Vol 4 P 397

38. Bacon - Quoted by Hugh Walker - The English Essay and Essay and Esaayists P 20

39. Hugh Walker - The English Essay and Essayists P. 1

40. W. H. Hudson - An introduction to the study of literature - ch. Essay Footnote P 332

41. F. H. Pritchard - Introduction - Great Essays of all Nations - P 1

42. Mabel Irene Rich-A study of the types of literature P 352

43. Essay & Essayists En. Britannica - Vol. 8 P 716

44. Essay & Essayists - En. Britannica Vol 8 P 716

45. Compton En. Vol 4 P 397

46. W. H. Hudsoh - An Introduction to the study of literature - Ch. Essay P 334

47. The Home University Ed. P 1723

48. Colliers En. Vol 7 P 418

49. Alexander Smith - Quoted by Hugh Walker - The English Essay & Essayists P 3

50. En. Americana P 508

51. వావిలికొలను సుబ్బరాయ కవి - సులభ వ్యాకరణము - తృతీయ భాగము - వ్యాస పరిచ్ఛేదము పుట 1

52. రాయసము వెంకటశివుడు - వ్యాసము - ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక 1931-32 పుట 2

53. డా॥ ముదిగొండ వీరభద్రశాస్త్రి- పానుగంటి వారి సాహిత్య సృష్టి పుట 315

54. ఆచార్య నిడదవోలు వేంకటరావు - నూతేంద్ల తెలుగు వ్యాసము పుట 141

55. పురాణం సూరిశాస్త్రి- విమర్శనము (వ్యాసము) తెలుగు వ్యాసములు వ్యాస సంపుటి పుట 71

56. బేతపూడి భగవంతరావు-ఉపన్యాస మంజరి ఉపోద్ఘాతము పుట 1

57. Hugh Walker - The English Essay and Essayists P 3

58. En. Britannica Vol 8 P 717

59. Henry New bolt - Essays and Essayists P 2

60. F. H. Pritchard - Introduction - Great Essays of all Nations.

61. En. Americana - Essay P 509

62. Mabel Irene Rich - A study of the types of literature P 384

63. John L. Stewart - The Essay (anthology) PP XI-XII

64. నందిరాజు చలపతిరావు-ఉపన్యాస దర్పణము పుట 224

65 ఆచార్య నిడదవోలు వేంకటరావు - నూతేంద్ల తెలుగు వ్యాసము - ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక 1960-61 పుట 142

66. శ్రీ మునిమాణిక్యం నరసింహారావు - విన్నపము - సాహిత్య వ్యాసములు పుట 1.

67. శ్రీ గొల్లపూడి శ్రీరామశాస్త్రి- వ్యాసరచన - పద్యకథావళి పుట 37

68. Mabel Irene Rich - A study of the types of literature P 384

69. Orlo Williams - The Essay - P 25.

70. F. H. Pritchard - Introduction Great Essays of all Nations.

71. Orlo Williams - The Essay - PP 22, 28

72. Hugh Walker - The English Essay and Essayists P 2

73. Orlo Williams - The Essay P 9

74. F. H. Pritchard - Great Essays of all Naitons - Introductions P 2

75. William Hazlitt - Quoted by A. R. Waller· "William Hazlitt lectures on the English Poets- Introduction P 8.

—: o :—

# సృజన వ్యాసం

నూత్న వ్యక్తీకరణ సామర్థ్యం పొందుతున్న వచనం వ్యాస ప్రక్రియ వల్ల చైతన్యవంతమయింది. ఆంగ్ల వ్యాస ప్రభావంతో తెలుగులో ఆవిర్భవించిన వ్యాసం వల్ల ఆధునికాంధ్ర సారస్వతం క్రొత్తగా వైవిధ్యం పొందింది. ఈ ప్రక్రియ వల్ల రచనావకాశం, వచన సామర్థ్యం పెరిగాయి.

తెలుగు వ్యాసం ప్రధానంగా పొందిన పరిణామం రెండు విధాలు. సృజన వ్యాసం, విమర్శన వ్యాసం- వ్యాస పరిణామంలో రెండు ప్రముఖ శిఖరాలు. రచనా రీతిని అనుసరించీ, విషయ వైవిధ్యాన్నిబట్టీ పరికిస్తే స్థూలంగా విస్తృత వైశాల్యం కనిపించినా ప్రధానంగా రెండే నిర్మాణ రీతులు గోచరమవుతున్నాయి. ఈ స్థూల విభజనకు హేతువులు గమనింపవచ్చు.

హృదయం ప్రధానమైన, కాల్పనికత కలిగి, రచయిత వ్యక్తిత్వంవల్ల, అసంపూర్ణంగా-చాలావరకు ఆంగ్ల వ్యాస లక్షణ సంబంధిగా గోచరించిన వచన రచనలు సృజన వ్యాసాలుగానూ; బుద్ధి ప్రధానమై విమర్శన ధర్మద్యోతకంగా వుండి, కొంతవరకు ఆంగ్ల వ్యాస లక్షణాలతో ఒప్పుతూ, అసంపూర్ణ విమర్శనంగానో, చరిత్రగానో, తత్ రీతిలోని రచనలుగానో ఉన్న వచన రచనలు విమర్శన వ్యాసాలుగానూ స్వీకరింపవచ్చు. వ్యాస నిర్మాణాన్నిబట్టీ, విషయాన్నిబట్టీ దాని అస్తిత్వంలో వైవిధ్యం గోచరమవటం సహజమే! ఈ వైవిధ్యం ఎంత విశాలంగా ఉన్నప్పటికీ పై ద్వివిధ వ్యాసాంతర్గతమై ఉంటున్నట్లు గుర్తింపవచ్చు.

వ్యాసం ఏ పేరుతో వ్యవహరింపబడినా, ఏ రీతిలో రచించబడినా-సృజన వ్యాసమో, విమర్శన వ్యాసమో అయింది. నిర్మాణం వల్ల వస్తువువల్ల ఏర్పడ్డ వైవిధ్యం కూడా ఈ ప్రధాన విభాగంలో అంతర్భూతమయింది. కాబట్టి తెలుగు వ్యాసం స్థూలంగా పొందిన వైవిధ్యంలో ఉన్న విస్తృతత్వం పరికింపవచ్చు.

ఈ ద్వివిధ వ్యాస సృష్టి పరికించటం, దాని అంతర్భూత వైవిధ్యం దర్శించటం మూలంగా తెలుగు వ్యాస పరిణామం స్పష్టమవుతుంది. ఈ పరి

ణామంలో నిర్మాణవ్యాసం విషయ వ్యాసం సలక్షణంగా గుర్తింపవచ్చు. నిర్మాణ వ్యాసం వ్యాసగతంగా ఉన్న నిర్మాణ పరిశీలనం కాగా, విషయ వ్యాసం వ్యాస విషయ పరిశీలనంగా వుంది.

వ్యాసం ప్రధానంగా సృజన గుణశోభితమే! అయితే తెలుగు సారస్వతంలో వెలువడ్డ వ్యాసాలు అధికంగా విమర్శన సహితంగా ఉన్నాయి. అందులో ఎక్కువ భాగం సారస్వత విమర్శనంగా రూపొందింది. అందువల్ల సారస్వత విమర్శన వ్యాసాలే, వ్యాసాలుగా భావించటం విమర్శక సంప్రదాయమే అయింది. స్థూలంగా వ్యాసమంటే విమర్శనమే అనే భావం ఆంధ్ర సారస్వతంలో ఎంత ప్రచురమయినా, అది ప్రధానంగా సృజనరూపమే అనీ, సృజన వ్యాస సృష్టి అదే పేరుతో కాకపోయినా, అనల్పంగానే ఆంధ్ర సారస్వతంలో ఉందనీ గుర్తింపవచ్చు.

ఈ సృజన వ్యాసం ఉపన్యాంగా ప్రసిద్ధమయినా, ప్రమేయమనో, సంగ్రహమనో, వచన కావ్యమనో ప్రారంభమయినా, కథలు గాథలుగా రూపొందినా, మరే పేరుతో పిలుపబడినా విస్తృతంగానే ఆవిర్భవించింది. ఈ సృజన వ్యాసం పొందిన పరిణామం ప్రధానంగా నాలుగు విధాలుగా గుర్తింపవచ్చు. 1. నవయుగ వ్యాసం. ఇందులో ప్రధాన పరిణామం లక్ష్యంగా వ్యాస వాఙ్మయం విభజించి, ఆ విభాగంలో ప్రముఖత్వం గ్రహించి దానికి నిర్ణయం చేసుకొని, ఆయా యుగాలలో తెలుగు వ్యాసం పొందిన పరిణామం గుర్తింపవచ్చు. 2. స్త్రీ వ్యాసం. దీనిలో నాటి, నేటి స్త్రీలు చేసిన వ్యాస సృష్టిలో పరిణామం గమనింపవచ్చు. 3. పత్రికా వ్యాసం. పత్రికలలో వ్యాసం పొందిన వైవిధ్యం సాధించిన వ్యాసాభ్యుదయం దర్శింపవచ్చు. 4. వివాద వ్యాసం. సారస్వత రంగంలో వివాద హేతువులు వ్యాసాలుగా విమర్శన ప్రతి విమర్శనలుగా పొందిన పరిణామం స్వీకరింపవచ్చు.

ఈ చతుర్విధ సృజన వ్యాసంలో ప్రధానంగా విమర్శన వ్యాసం, అప్రధానంగా ఆంగ్ల వ్యాస లక్షణాలు గోచరమవుతున్నాయి. 'అసలు వ్యాసం' సృజన వ్యాస మనే తెలుసుకోవచ్చు. విమర్శన వ్యాసం అసంపూర్ణ విమర్శనమో అసంపూర్ణాస్య రచనమో అయి, 'అసలు వ్యాసం' కంటే భిన్నంగా భిన్న పరిధి ప్రవర్తకంగా వుంటుంది. అందువల్ల 'అసలు వ్యాసం' సృజన రూపం

గానే వుంది. అయితే వ్యాసం పేరుతో పిలువబడే అనేక రచనలు ఇతర ప్రక్రియల్లో స్థానం లేకపోవటం వల్ల వ్యాసాలుగా చెలామణి అవుతున్నాయి. అటువంటి రచనలకు విమర్శన వ్యాస వాఙ్మయంలోనే అవకాశంకాని, అసలు వ్యాస వాఙ్మయంలో చోటు లేదు.

సృజన వ్యాస వాఙ్మయం తెలుగు సారస్వతంలో అధికంగానే సృష్టింపబడింది. అందులో ప్రధాన భాగం వికాస వ్యాసం. అది పొందిన పరిణామం అసలు వ్యాసం సాధించిన అభ్యుదయంగా గుర్తింపవచ్చు. అందువల్ల ఈ పరిశీలనం తత్పరిణామ ప్రదర్శకం.

## 1. నవయుగ వ్యాసం

సృజన వ్యాసం ఉపన్యాస రూపంతోనూ వ్యాస రూపంతోనూ వెలువడి విస్తృతంగా వ్యాపించింది. సృజన వ్యాసం కొన్ని సందర్భాలలో వ్యాసం కాదేమో నన్నంత దూరంగా సామాన్యంగా వ్యాసంగా భావించే సృష్టి కంటే దూరంగా, జరిగిపోయింది. అయితే సమ్యగ్దృష్టికి ఆ రచనలు వ్యాసాలు కావటమేకాదు, అసలు వ్యాసాలుగా భావించటం సముచితంగా తోస్తుంది.

ప్రసిద్ధ పరిణామం దృష్టితో ఈ విధమైన వ్యాస రచనా సమయం కొన్ని యుగాలుగా విభజింపబడింది. ఈ యుగాలలో వ్యాసం పొందిన వికాసం యుగ క్రమంలో గుర్తిస్తే, ఆధునిక యుగానికే వ్యాసం వికాసం కలిగించినట్లు గమనింపవచ్చు. అయితే ఒక్కొక్క ధర్మ ప్రతిపాదకంగా ప్రవర్తిల్లిన ఈ యుగ వికాస వ్యాసం, ఆంగ్ల విద్యా ప్రభావం వల్ల ఆంగ్ల సారస్వత ప్రభావం వల్ల విద్యాలయాలలో వ్యాస రచనగా, సారస్వత రంగంలో ఉపన్యాసంగా ప్రారంభమయినట్లు స్థూలంగా భావితమయినా, ఈ వ్యాస రచన మరికొంతకాలం పూర్వం నుంచీ సారస్వత ప్రక్రియగా రూపొందినట్టు గుర్తింపవచ్చు.

కందుకూరి వీరేశలింగం పంతులు ప్రథమాంధ్ర వ్యాసకర్తగా విమర్శకులు, స్వీయచరిత్ర ఆధారంగా తలపోసినా, అంతకుపూర్వమే వ్యాస రచన జరిగిందనీ, వ్యాసకర్తలున్నారనీ, అనంతరకాలంలో విమర్శకులు భావించటం కుదిరింది. ఈ ప్రక్రియ సాహిత్య శాఖగా ఆంగ్ల సారస్వత ప్రభావంగా గుర్తించినా, ఈ విధమైన రచనకు బీజాలు సంస్కృతాంధ్ర సాహిత్యాలలో

ఆంగ్ల ప్రభావంకంటే పూర్వం నుంచి ఉన్నట్టు తెలుసుకోవచ్చు. ఈ విధ మయిన సృష్టి ప్రపంచ సాహిత్యంలో పూర్వంనుంచి ప్రసిద్ధంగా ఉన్నప్పటికీ, అది ప్రక్రియగా రూపొందించటం, గుర్తించటం, ఆ మార్గంలో రచించటం ఆధునికం కాబట్టి, వ్యాసం ఆధునిక రచనా ప్రక్రియగానే గ్రహించటం సముచితం.

అయితే, తెలుగు సారస్వతానికి సంబంధించినంతవరకు, వ్యాస సృష్టికి పూర్వరంగం పరికించటం సంభావ్యమే! దీనివల్ల తెలుగులో వ్యాసావతరణకు అనుకూలంగా ఏర్పడ్డ సారస్వత వాతావరణం కొంత వరకు గోచరమవుతుంది.

## 1. 1. ప్రాగ్వ్యాస యుగం

ఈ యుగ విభాగంలో, ఆంగ్ల ప్రభావంతో నిమిత్తంలేని తెలుగులో జరిగిన వ్యాస తుల్య సృష్టి పరికించటం, అన్య ప్రక్రియాంతర్గతంగా రూపం దిద్దుకొన్న వ్యాస సముదాయం గమనించటం ప్రధాన కృత్యాలు. స్థూలంగా, ఇది వ్యాసమని గుర్తించబడకుండా తత్తుల్యంగా ఉన్న సారస్వత సృష్టిని పరిశీలించటం ఈ విభాగంలో సంభావ్యం.

మేధావి, తాత్త్వికుడు, ఆలోచనాపరుడు బుద్ధి హృదయాల కూడలిలో ఆలోచనానుభూతులు ఏక విషయికంగా అభివ్యక్తం చేస్తే, అది లిఖితమయినా, వాగ్రూపమయినా, వ్యాసతుల్యంగా రూపొందే స్థితి వుంది. ఆ వ్యక్తి ఒకే విషయం మీద దృష్టి లగ్నం చేసినప్పుడు వ్యాసం అవతరించి, భిన్న ప్రక్రియాంతర్గతంగా నిక్షిప్తమయి ఉండటానికి వీలుంది. ఈ దృష్టితో ప్రాచీన సాహిత్యం పరిశీలించినకొద్దీ వ్యాసతుల్య రచనల సంఖ్య పెరుగుతుంది.

వక్తవ్యాంశం, కథా పాత్ర సన్నివేశాది కల్పనల సహాయం లేకుండా కవి ఆలోచనానుభూతుల అనుసంధానంలో స్వేచ్ఛగా అవతరించినప్పుడు, వ్యాసంగా రూపొందే అవకాశం ఉంది. అది లిఖితమై వ్యాసంగానో, వాక్కై ఉపన్యాసంగానో నేడు పిలువబడ్డా, పూర్వం దానికే పేరూ లేదు. ఏ రూపమూ స్థిరం కాదు, ఇటువంటి రచనలను వ్యాసాలనటం, ఈ పద్ధతిలో రచన సాగించటం, ఇది ప్రక్రియగా ప్రసిద్ధి వహించటం, సారస్వత శాఖగా రూపొందటం, ఏ సాహిత్యంలో అయినా ఆధునిక పరిణామమే! అయితే ఈ పరిణామ పూర్వరంగం తెలుగు సారస్వతంలో ఏ విధంగా ఉందో గమనించటం కర్తవ్యమే!

ప్రపంచ సాహిత్యంలో ఈ విధమైన రచనా విధానం అతి ప్రాచీన కాలం నుంచి జరుగుతున్నట్లు గుర్తించిన యఫ్. హెచ్. ప్రిచ్చర్డ్ వ్యాస ప్రాచీనతను భావించి, ప్రపంచ సాహిత్యంలోని వ్యాసాలను అన్వేషించి, వెలుగులోకి తీసుకు వచ్చాడు. బేకన్ కూడా ఈ రచనా విధానం ప్రాచీనమని తలపోశాడు. అయితే వర్తమానంలో ఆధునికులు ఆ రచనలను వ్యాసాలు అనటం కుదిరిందికాని, ఆ కాలంలో అవి వ్యాసాలుగా రచయితలు కాని, విమర్శకులు కాని అనుకోకపోవటం, అది ఒక రచనా రీతిగా సాగక పోవటం వల్ల వ్యాసం ఆధునిక సాహిత్య ప్రక్రియగానే గ్రహించటం సాధ్యమవుతుంది.

యఫ్. హెచ్. ప్రిచ్చర్డ్ "గ్రేట్ ఎస్సేస్ ఆఫ్ ఆల్ నేషన్స్"లో చాలా దేశాల్లో ప్రాచీన సారస్వతంలో వ్యాసాలుగా ఉన్నవాటిని సంపుటీకరిస్తూ అవతారికలో "The main purpose of present collection is to show that, on the contrary, the essay is one of the oldest literary forms and that its vitality and importance have increased with the years" అన్నాడు.

ఈ విమర్శకుడు కల్పనా సాహిత్యంలో ఉన్న కథాపాత్ర సన్నివేశ సంబంధంలేని ఒకే విషయం మీద సాగిన చర్చను, వివరణను, వ్యాసంగా గ్రహించాడు. శాస్త్ర వాఙ్మయంలో హృదయ సన్నిహితాంశాలు కానీ, సృజన వాఙ్మయంలో బుద్ధి ప్రదర్శిత ఘట్టాలు కానీ, వ్యాసజన్మకు మాతృమూర్తులవుతున్నట్లు గుర్తించాడు.

1. ప్రిచ్చర్డ్ తెలుగు వాఙ్మయంలో వ్యాస పరిశోధన ఏమీ చేయలేదు కాని సంస్కృత సారస్వతంలో వ్యాసాలనదగ్గ వాటిని పేర్కొన్నాడు. మహాభారతంలో శాంతి పర్వంలో 28 వ అశ్వాసంలో 'విధి-గమ్యం' (duty and destiny), విష్ణుపురాణంలో (IV-24) స్వర్ణ యుగ పునరాగమనం (The return of the Golden age), వేదాంత సూత్రానికి శంకర భాష్యంలో (IV-2,3) స్వప్నావాస్తవికత (the unreality of dream) వ్యాసాలుగా పేర్కొన్నాడు.

"నెల్లూరు సనాతన సంఘము" "భారతవర్ష"కు అంకితం చేస్తూ ప్రచురించిన "ఆర్యోపన్యాస చంద్రిక" (9.10.1913) ఉపోద్ఘాతంలో శ్రీ ఏ. వి

రామశర్మ "ప్రాచీన సారస్వతంలో వ్యాసాలున్నాయని తెలుపుతూ నాకు సాధ్యమయినంత వరకు మన పురాణములందలి మతము నందలి గల గొప్పతనమును అందరికిన్ని వెల్లడి చేయ ప్రయత్నించ బూనుకొంటిని" అని ప్రకటించి కొన్ని వ్యాసాలు ఉదాహరించాడు.

శ్రీ మదాంధ్ర మహాభాగవతం చతుర్థస్కంధంలో నారదుడు ధృవుడికి ఉపన్యసించిన రీతినీ, అదే స్కంధంలో పృథు చక్రవర్తి సభాసదుల్ని ఉద్దేశించి "సద్ధర్మాలు-బ్రాహ్మణులు" అనే అంశం గూర్చి చేసిన ఉపన్యాస ధోరణినీ, నారదుడు ప్రాచీన బర్హికి జీవేశ్వరుల స్థితిని గూర్చి కథ వివరిస్తూ చేసిన సూచనలనూ వ్యాసాలుగా స్వీకరించి, ప్రాచీన సారస్వతాంతర్గతంగా వ్యాసాలు లభిస్తాయన్న విషయం వివరించాడు. ఈ అభిప్రాయం కలగటానికి మూల హేతువు యఫ్. హెచ్. ప్రిచ్చర్డ్-'గ్రేట్ ఎస్సేస్ ఆఫ్ ఆల్ నేషన్స్'గా భావింప వచ్చు.

2. వివేక చింతామణి 16 వ శతాబ్ది తత్త్వ వచన గ్రంథం. తద్రచయిత పరమానంద యతి. దీనిని 1962 లో శ్రీ వి సుందరశర్మ పరిష్కరిస్తే తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయం ప్రచురణ విభాగం ప్రచురించింది. ఇది మూడు ఖండాల గ్రంథం. దీనిలో వచనం అధికంగా గ్రాంథికంగా, స్పష్టంగా, వివరణాత్మకంగా, విషయబోధకంగా వుంది. ఈ గ్రంథంలో అనేక వ్యాసాలు నిబిడమయి వున్నాయి.

ఇందులో "చాతుర్వర్ణ నిరూపణము" "తత్వమసి" "వాక్యార్థ వివేకము" "పంచాక్షర విధానము" "ఆచార లింగ భేదంబులు" "పంచీకరణ వివేకము" "భారత వర్షము నందలి నానా దేశములు, అందలి ప్రజలు వారి స్వభావములు" వ్యాసాలే ! ఇవి మిక్కిలి విస్పష్టంగా వివరింపబడటం వల్ల వివరణాత్మక వ్యాసాలుగా గుర్తించే అవకాశం కలిగింది.

ఈ గ్రంథంలో వివరణ రీతికి రచయిత వ్యక్తిత్వ స్థితికి ఈ క్రింది వచనం ఉదాహరణంగా గ్రహింపవచ్చు. "మఱియు అజ్ఞాన సంశయ విపరీతంబులు ముక్తికి విఘ్నత్రయంబులు. అందు నేను బ్రహ్మంబు గాదనుట

యజ్ఞానంబనంబడు. నేను బ్రహ్మంబౌదునో కానో యనుట సంశయంబనంబడు. శ్రుతి యుక్తులచే నేను బ్రహ్మమైతే యీ కల్గిన జీవ భావ మేమగును అనుటయే విపరీతంబనంబడును'' (పుట 39) ఇటువంటి వివరణాత్మక వచనం వివేక చింతామణిలో అధికం కావటం వల్ల ఇంకా వ్యాస తుల్య రచనలు అనేకం గ్రహించే అవకాశం గోచరమవుతుంది.

3. ఏకామ్రనాథుడు రచించిన ''ప్రతాపరుద్ర చరిత్రము'' (16 వ శతాబ్ది) ప్రధానంగా ప్రతాపరుద్రుడి చరిత్రను, అప్రధానంగా కాకతీయరాజుల చరిత్రను తెలుపుతుంది. ఇది కాసె సర్వప్ప సిద్ధేశ్వర చరిత్ర వచనంగా ద్విపదగా పరివర్తించటానికి ఆధారమయింది. ఈ గ్రంథం సూర్యపల్లి బుచ్చునచే సంపాదింపబడి, ముదిగొండ వీరేశలింగ శాస్త్రిచే పరిష్కరింపబడి, కొడిమెల రాజలింగారాధ్యులచే వరంగల్‌లో ముద్రితమయింది.

ఈ చరిత్ర గ్రంథంలో ''బ్రహ్మ ముహూర్తంబున మంగళ గత నాదంబులు'' (పుట 52) మొదలుకొని ''తమ బండారమునకు కోట్లు చెల్లించు చుండును" (పుట 55) వరకు ఉన్న రచనాభాగం వ్యాసంగా స్వీకరింపవచ్చు. ఈ వ్యాసంలో ప్రతాపరుద్రుడి దిన చర్య వుంది. ఉదయం నుంచి రాత్రిదాకా చక్రవర్తి చేసేపనులు అనుదినము ఉంటూ వచ్చేవి కావటం వల్ల, ఇది కాకతీయ చక్రవర్తి దినచర్యను వివరించే వర్ణనాత్మక వ్యాసంగా గ్రహింపవచ్చు. ఈ భాగంలో క్రియామాపాలు మిగతా గ్రంథం కంటె భిన్నంగా ఉండటం విశేషం. అది ఈ ప్రత్యేక భాగానికి విశిష్టత కలిగించింది.

4. సేలం జిల్లా తీర్పుగా ప్రసిద్ధి పొందిన 1843 వ సంవత్సరం 108 సంఖ్య వ్యాజ్యానికి న్యాయాధిపతి శ్రీ నంబూరు కృష్ణమాచార్యులు. ఆ న్యాయ మూర్తి ఇచ్చిన తీర్పు ముద్రితమయి, మద్రాసు రికార్డ్సు కార్యాలయంలో ఉంది. ఇందులో కంసాలి కులం దేవ బ్రాహ్మణ జాతికాదని చేసిన తీర్పు భాగం వ్యాసంగా గ్రహింపవచ్చు.

ఈ వ్యాజ్యంలో వాది రామలింగాచారి. ప్రతివాదులు కోమటి సుబ్బా రాయశెట్టి, నయిరా రాయన్న శెట్టి, నారయ్యరెడ్డి, మాలకోటడు వగైరా ఉన్నారు. వాదిని ప్రతివాదులు మానహానిగా తిట్టి నిందమోపి అపరాధం చెల్లించమన్నట్లు, వాది తాను అపరాధం చేయలేదు కాబట్టి చెల్లించనన్నట్లు, ఆ పైన దండనగా

వాదిని కొట్టినట్లు, అపరాధం రూపాయి వసూలు చేసినట్లు ఫిర్యాదు చేస్తే, పన్నెండు రూపాయిలు ప్రతివాదులకు జరిమానా విధింపబడినది. ఆ పైన వాది మళ్ళీ సివిల్ కోర్టులో మాన నష్టం దావా వేసి 45.00 ఇప్పించమని కోరటంవల్ల న్యాయాధికారి తీర్పు చెప్పాడు. వాది మాన నష్టం దావాలో తాను దేవబ్రాహ్మణ జాతికి చెందినట్లు, మాలవాడు కొట్టటం వల్ల కులానికి వెలి అయినట్లు, ప్రాయశ్చిత్తం చేసుకోవటానికి అయ్యే ఖర్చు 45-00 ఇప్పించవలసిందిగా కోరాడు.

ఆ తీర్పు ''వాదియొక్క జాతి కంసాల జాతి. బ్రాహ్మణ జాతికాదు. ఆ జాతి వారికి వేదము చదవడానికిగాని, వేదోక్త కర్మానుసారము చేయుటకు గాని అధికారను లేదు. వీరు సంకర జాతిలోనున్నూ సంకరజాతి'' అని ప్రారంభమయి, సుదీర్ఘంగా సాగి, ధర్మశాస్త్రం, వర్ణాశ్రమ ధర్మాలు, మను స్మృతి, విజ్ఞానేశ్వరీయం విపులంగా ఉదాహరించి, చివరకు ''పయిన వాది చెప్పిన ప్రకారం ధర్మశాస్త్రములలో నొక చోటనున్నూ దేవ బ్రాహ్మణ జాతి అని నొకటి వుండేదిగా చెప్పి వుండలేదు...పయిగా హిందువులు ఈలాగంటె దేశ ములోనున్న ఈ సంకరజాతి, ప్రతివాదులు చెప్పే ప్రకారం యడమ చేతి వార్లను చేరిన వార్లుగానున్ను ఉద్యోగ జాతిగానున్ను ఉన్నారు'' అని తీర్పు ముగిసింది.

ఈ తీర్పు ఒక ఉత్తమ విమర్శన వ్యాసంగా రూపొందింది. 1886 లో ముద్రిత మయిన ఈ తీర్పులో న్యాయాధికారి వ్యక్తిత్వం, ప్రత్యక్షంగా తీర్పులో ఉండనక్కర లేకపోయినా, కనిపిస్తుంది. కాబట్టి ప్రాయశ్చిత్తం అక్కరలేదని, మాన నష్టం చెల్లించనక్కరలేదని దావా కొట్టివేయటం జరిగింది. వాద ప్రతి వాదాలు పూర్వాపరాలుగా ఒక విషయం విమర్శింపబడినట్లు ఈ తీర్పు రూపొంది ఉత్తమ వ్యాసంగా గ్రహించే అవకాశం కలిగించింది.

న్యాయాధికారి తీర్పుకు సంబంధించి, వ్యాసంగా భావింపదగింది మరొ క్కటి పండితాభియోగం పేరుతో 1930 లో ముద్రితమయింది. ఈ వ్యాజ్యంలో ఫిర్యాది శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, ముద్దాయిలు పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రి, గంజల సుబ్రహ్మణ్యం శెట్టి, సమదర్శిని సంపాదకుడు వల్లూరి సుగంధ పురి మొదల్వారు, ప్రచురణకర్త పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి సమదర్శిని

పత్రికలో, తననూ, తన రచనలనూ విమర్శించిన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి సాహిత్య సృష్టి పైన ప్రతి విమర్శ వ్రాసి ప్రచురిస్తే, దానిని వ్యక్తిగత దూషణగా భావించి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి న్యాయస్థానంలో అరోపించటంతో అభియోగం ఆరంభమయింది.

ఈ వ్యాజ్యం తీర్పు, కవులు రచయితలు విమర్శనం ఎంతవరకు చేయవచ్చో, ఏ హద్దు దాటితే వ్యక్తిగతంగా భావింపబడుతుందో, ఎటువంటి విమర్శనం చేయకూడదో నిర్ణయిస్తూ సాగటం వల్ల సాహిత్య విమర్శన రీతులు, ఔచిత్యం, హద్దులు వివరించే విమర్శన లక్షణం చూపే వ్యాసంగా రూపొందింది. ఇందులో "ఇద్దరును కీర్తిమంతులు. ఇద్దరును తమకుఁ దగినట్టి శబ్దములనుపయోగించుచు వాఙ్మయ సందర్భమగు దెబ్బలాటను సాగించిరి. ఇట్టి పురుషులకు కొంత శిక్ష యవసరము. అందుచేత తక్కువ శిక్ష యైనను సరిపడునని నాకుఁ దోచెను" అని తీర్పు ముగిస్తూ ఒకరిమీద ఒకరు దాఖలా చేసుకొన్న ఫిర్యాదులు ఆధారంగా ఇద్దరికీ "20 రూపాయిల జరిమానా గాని, ఒక నెల విడి ఖైదుగాని అనుభవించవలసినదిగా నాజ్ఞాపించు చుంటిని" అని ముగిసింది తీర్పు. దావులూరి ఉమామహేశ్వరరావు, ఆనరరీ ఫస్టుక్లాసు మెజస్ట్రేటు, ఇచ్చిన ఈ తీర్పు విమర్శన వ్యాసంగా గ్రహింపవచ్చు.

5. 1851 లో వఠ్యం వాసుదేవ పరబ్రహ్మశాస్త్రులు వ్రాసిన 'వ్యవహార దర్పణము' అనే నామాంతరం ఉన్న 'జాన్ఫ్రియర్థామసుభూపాలీయము' (జాన్ ఫ్రైయర్ థామస్ భూపాలీయము) - విజ్ఞానేశ్వరీయం, స్మృతి చంద్రిక మొదలైన అనేక హిందూ న్యాయశాస్త్ర గ్రంథాలు ఆధారంగా రూపొందింది. ఇందులో అనేకాంశాలు సమగ్రంగా వివరింపబడి వున్నాయి. రచయిత వ్యక్తిత్వం ఛాయామాత్రంగా గోచరం కాకపోతే ఇది ఏ విధంగానూ వ్యాసంగా భావించే అవకాశం కలిగి వుండదు. అయితే ఇందులోని చాలా భాగాలు శాస్త్ర వివరణ వ్యాసాలుగా గ్రహింపవచ్చు.

వారసత్వం గూర్చి తెలిపే రచన "తండ్రి చనిపోయిన పిమ్మట కొమాళ్ళు అతని ఆస్తిని పంచుకోవలసినది" అని ప్రారంభమయి, "హక్కును గురించిన సంగతి యింకా ముందు విస్తరించి చెప్పబడుతుంది" అని ముగిసి వ్యాసంగా

వ్యాసంగా భావించే అవకాశం కలిగించింది. ఈ గ్రంథ భాష వ్యావహారికంగా వుంది. రచయిత, ఇది ప్రయత్నపూర్వకమని-

''అఖిల లోకోపకారార్థ మట్టి ధర్మ
వాక్యతతి తెల్గు భాషచే బల్కబడియె-
గాన నన్నయసూత్ర సంస్కారములను
విడిచిపెట్టుట దోషమై వెలయదచట'' (పుట 68)

వివరించటం గమనార్హం.

6. 1852-53 సంవత్సరాలలో వర్తమాన తరంగిణి పత్రికలో ప్రచురింపబడ్డ రెండు రచనలు వ్యాసాలుగా భావింపవచ్చు. 10-10-1852 పత్రికలో ఇతర మతాలలో ఉన్నవాళ్ళను తిరిగి హిందూమతంలోకి మతాంతరీకరించి, హిందువులుగా చేయటంలోని ఆవశ్యకాన్ని వివరించే రచన 'మతాంతరీకరణం' వ్యాసంగా భావింపవచ్చు. ఇది వాద పటిమతో, సృజన వ్యాస ధర్మ ప్రదర్శకంగా ఉంది. 10.4.1853 పత్రికలో అధికంగా వర్షాలు కురిసి, వరదలు వచ్చి, ప్రజలు బాధపడితే విలేఖరి బాధపడుతూ ఆత్మావేదన నిండిన రచన వార్తగా ప్రచురించినా, వ్యాసంగా రచయిత వ్యక్తిత్వం ప్రాధాన్యం శోభించి 'గాలివాన' పేరుతో గ్రహింపదగిందిగా వుంది. ఇది పత్రికా వ్యాసధర్మ నిరూపకంగా ఉంది.

ఈ రెండు వ్యాసాలు, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో సి. పి. బ్రౌను సంకలనాలలో యం. వాల్యూము నం. 430 లో 87-91,/ 94-98 పుటలలో వర్తమాన తరంగిణి పత్రికలోనుంచి ఎత్తి వ్రాయబడి లభించాయి. సి. పి. బ్రౌను రచనలు, సేకరించిన రచనలు, భద్రపరచిన గ్రంథ సంచయంలో ఇంకా అనేక వ్యాసాలు లభ్యమయ్యే అవకాశముంది.

7. 'లార్డు మేయో' ''బంగాళుల యాచారంబులు తెలుపు ప్రబంధంబు గావించు వానికి బహుమానంబు'' ప్రకటిస్తే, కర్నూలు డిప్యూటి కలెక్టరుగా ఉన్న నరహరి గోపాల కృష్ణమ సెట్టి ''తెలుగు దేశము వారి యాచారంబులు తెలుపునట్టి ప్రబంధంబు'' ''శ్రీరంగరాజు చరిత్ర'' అనే నామాంతరం ఉన్న

''సోనాబాయి పరిణయము'' వ్రాసి 1872 లో ప్రచురిస్తే, ఇది ప్రథమాంధ్ర నవలగా విమర్శకులు అంగీకరించారు.

ఈ నవలలో ''ఇది భగవంతుని మాయసుమ్ము-చిట్టెడు పొట్టకు వలయు పట్టెడు సంకటికి'' (పుట 16)తో ప్రారంభమయి, ''యిండ్ల లోపల నెన్ని సొమ్ములు పెట్టుకొని యెట్టి భోజనము సేయుచున్నగాని యా యానంద మా సుఖంబు వచ్చునే'' (పుట 19)తో ముగిసే భాగం సలక్షణంగా వ్యాసంగా భావింపవచ్చు. ఈ వ్యాసంలో నాలుగు భాగాలున్నాయి. పల్లె జనుల బాధలు, పట్టణ జనుల సుఖాలు మొదటి రెండు భాగాలలో, పట్టణ ప్రజల బాధలు, పల్లె జనుల సుఖాలు మిగతా రెండు భాగాలలో వివరింపబడి పల్లె పట్టణ ప్రజల సుఖదుఃఖాల తారతమ్యం పరిశీలించిన సృజన వ్యాసంగా దీనిని గ్రహింపవచ్చు.

నవలలో వ్యాసం నిక్షిప్తమయి ఉండటానికి అవకాశం ఉంది. ప్రసిద్ధ నవలల్లో ఈ ప్రయత్నం సక్రమ ఫలితం ఇవ్వవచ్చు. విశ్వనాథ సత్యనారాయణ నవల 'వేయిపడగలు'లో 27 వ అధ్యాయంలో చేసిన వెన్నెల వర్ణన ప్రత్యేకంగా పరికిస్తే వర్ణనాత్మక వ్యాసం. ఇది వ్యాసంగా శ్రీ మునిమాణిక్యం నరసింహారావు సంపాదకత్వాన వెలువడ్డ నవ్య సాహిత్య పరిషత్ ప్రచురణ ''సాహిత్య వ్యాసములు''లో ముద్రితమయింది. ఆంధ్ర నవలా వాఙ్మయంలో అనేక వ్యాసాలు గోచరమయ్యే అవకాశం వస్తుతత్త్వంలోనే ఇమిడి వుంది.

8. వెలుగోటి కుమారేచేంద్ర భూపాల విరచితమయిన 'శ్రీ గీతార్థ సార సంగ్రహము' 'సారాంశ పంచకము' (1886). 'మనస్సాక్ష్యము' (1887), 'నాస్తిక ధ్వాంత భాస్కరము' (1888) తత్త్వ గ్రంథాలన్న పేరుతో వెలువడ్డాయి కాని, ఈ నాల్గు గ్రంథాలు నాల్గు తాత్త్విక వ్యాసాలుగా గ్రహింపవచ్చు.

'సారాంశ పంచకము' చిన్న వ్యాసం. మిగతా మూడు 70, 100 పుటల మధ్య పరిమితితో ఉన్న వ్యాసాలు. వచనం తీక్షణంగానూ, విషయం వాదోపవాద సహితంగానూ, ప్రతిపాదనం శంకా సమాధాన యుక్తంగానూ వుండి, ఈ రచనలు వ్యాసాలుగా భావించే అవకాశం కల్పిస్తున్నాయి. ప్రతి

వ్యాసంలోనూ రచయిత వ్యక్తిత్వం మిక్కిలి స్పష్టంగా గోచరమవుతూ వుంది. పాఠకుడికి విషయబోధ విశదంగా చేయాలన్న ప్రయత్నం ప్రతి క్షణం కనిపిస్తుంది. విషయం పరిపూర్ణంగా తెలపాలన్న తొందరకూడా గమనింప వచ్చు. ప్రత్యంశం వెనుక రచయిత వ్యక్తిత్వం నిబిడమయి ఉన్నట్లు తెలుస్తుంది. వ్యాసధర్మాలు కొన్ని అతిక్రమించినా ప్రధానమైన రచయిత వ్యక్తిత్వ ముద్ర వీటికి వ్యాస స్థానం కలిగించింది. ఈ వ్యక్తిత్వం ఎంత వరకుందో గుర్తించటానికి ఉదాహరణాలు ఉపకరిస్తాయి.

తత్త్వ విషయాలు 'ఈశ్వర ప్రేరణచేత నా బుద్ధికి గోచరించిన ప్రకార మిందులో వివరింపబడుచున్నయవి'' (పుట 4-గీతార్థసార సంగ్రహము). ఇందులో ఉత్తమ పురుష గోచరమయి, ప్రాథమికంగా వ్యక్తిత్వముద్ర చెప్పటానికి తగిన లక్షణం కనిపించింది.

''ఒకడు తన సొగసు కొఱకు తన వెంట్రుకలను గొన్నింటిని నుంచి, కొన్నింటిని దీసివేయుటవలన నా వెంట్రుకల విషయమై యతనికి వైషమ్యాదు లెట్లు చెప్పదగియుండదో, యా రీతిననే భగవంతుడను స్వశక్తి ప్రకాశార్థముఁగ తన స్వరూపములయిన జీవులముఁ గొందరకు సుఖాదులను గొందరకు దుఃఖాదుల నిచ్చుటవలన భగవంతునకు వైషమ్యాదులు జెప్పఁదగి యుండవు.)

(శ్రీ గీతార్థసార సంగ్రహము-పుట 90)

ఇక్కడ రచయిత వ్యక్తిత్వం ప్రత్యక్షంగా 'జీవులము' అనటంవల్లనూ, పరోక్షంగా వెంట్రుకల విషయం యుక్తిసహితంగా తెలపటం వల్లనూ గోచరమవుతూ వుంది.

'తన బిడ్డ బ్రతుకవలెనని ద్రిష్టి తీసి పరుల బిడ్డలను రహస్యముగా జంపుచున్నారు. ఇదియే జీవికి జీవి బలి యని చెప్పుచున్నారు.' (మనస్సాక్ష్యము-పుట 97)

''ఇవి అన్నియు నెంత యసహ్యకరములైనవో యెంత యన్యాయ కరములైనవో మీరే యోచించుడు. ఇట్టివే యనాది వాడుకలచేత సద్ధర్మ ములుగా నెంచి జరిపించువారు నేనీ గ్రంథమునందు వ్రాసిన మనస్సాక్షికము లైన తత్త్వముల నెట్లు ఒప్పుకొందురు?''

(మనస్సాక్ష్యము-పుట 97)

పైన ఉదాహృత భాగాలలో రచయిత ఆవేదన స్పష్టంగా వుంది.

"లింగ శరీరము యిల్లుకట్టుటకు ప్లాను వంటిది. ఇది స్థూల శరీరమును కలుగజేయుటకు కూడా పరిమాణమును జేర్చి స్థూల శరీరముగా గలిగించు చున్నది".

(నాస్తిక ధ్వాంత భాస్కరము-పుట 60)

పైన ప్రయోగించిన అలంకారం రచయిత వ్యక్తిత్వ బోధకంగా వుంది. ఈ వ్యాసాలు కొంతవరకు వ్యావహారిక భాషలో ఉన్నాయి. అందరికీ స్పష్టంగా ఉండే భాషలో వ్రాయాలని రచయిత సంకల్పం. "అయితే ఈ మనస్సాక్ష్య గ్రంథములో నందఱికిని తెలియజేయుటకు సులభముగా నతి సంగ్రహముగా తేలికయగు వాడుక మాటలతో వ్రాయుచున్నాడను" (మనస్సాక్ష్యము-పుట 7) అనీ, 'గ్రామ్య ప్రయోగములే అందరికి తెలియదగినవిగాన నీలాగు వ్రాసి నందుకు అంగీకరింపవలయును" (మనస్సాక్ష్యము-పుట 104) అనీ తెలపటం వల్ల రచయిత భాషా దృష్టి వ్యక్తమవుతూ వుంది.

9. 1902 లో ముద్రితమయిన 'నీలగిరి యాత్ర' అనే 'ఆంధ్రవచన కావ్యము'లో తత్ కర్త కోలా శేషాచల కవి 1846 లో చెన్నపట్టణం నుంచి నీలగిరి దాకా చేసిన యాత్రలో దివ్యస్థల మహిమలు, ప్రధాన ఘట్టాలు వర్ణించాడు.

ఈ యాత్రా గ్రంథంలో 'నీలి శైలావతారణానంతరంబునం గల కాననంబు దంతి సంతానంబునకు దానకంబై' (పుట 106) తో మొదలై, "అంతలో జెంతనుండు సాధనవంతులగు మనుజులు మిగిలినవానిఁ బోనీక పదిలంబు సేసెదరు" (పుట 115) వరకు సాగిన వర్ణనం ఏనుగులను బంధించటానికి సంబంధించింది, వర్ణనాత్మక వ్యాసంగా గ్రహింపవచ్చు. 'ఖెడ్డా' లో సర్వకార్యకలాపాలు వివరంగా ఈ వ్యాసంలో పొందుపరచటం జరిగింది.

10. సత్యం ప్రత్యక్షంగా చెప్పి, దానిని బలపరచటం కోసం రచయిత ఒక కథ కల్పించినా, ఆ రచన వ్యాసంగానే పరిగణింపవచ్చు. కథ చెప్పి, తన్మూలంగా సత్యం వాచ్యంగాకాని, వ్యంగ్యంగాకాని, చెప్పినా అది వ్యాసం

కాకపోయి, కథ కావచ్చు. సత్యం చెప్పటం ప్రధానమయి, ఉదాహృత కథ అప్రధానమయితే సత్యం ఒక్క వాక్య పరిమితమయినా, అనేకమైన పుటలకు వ్యాపించిందయినా, కథ ఎంత చిన్నదయినా, పెద్ద దయినా ఆ రచన వ్యాసంగా గ్రహించటంలో విప్రతిపత్తి లేదు.

సాంఘిక గ్రంథంగా భావితమయిన ''దర్పదళనము'' సంస్కృతంలో క్షేమేంద్రుడు రచిస్తే, తెలుగులోకి గొల్లపూడి శ్రీరామశాస్త్రి అనువదింపగా 1927 లో ముద్రిత మయింది. 11 వ శతాబ్ది నాటి ఈ సంస్కృత గ్రంథం యథామాతృకంగా అనువాదం పొందింది. ఇందులోని ఏడు భాగాలు ఏడు వ్యాసాలుగా భావింపవచ్చు.

''ఇందలి యంశములొక పక్షమునకు గాని యొక జాతికిఁగాని చేరక యెల్లకాలము సమన్వయించునవియై యున్నవి. నీతికిని ప్రాపంచిక జ్ఞానమునకు నీ గ్రంథ మొక గని యని చెప్పవచ్చును. దీనికి నీతి పదవి యనియు నామాంత రము గలదు'' అని''గ్రంథోపోద్ఘాతం''వల్ల తెలుస్తుంది. లోక సత్యం ప్రత్యక్షంగా వివరించటం 'విచారములు'గా పేర్కొన్న గ్రంథ భాగాలలో వుంది. కుల, ధన, విద్యా, రూప, శౌర్య, దాన, తపో విచారాలు దీనిలోని భాగాలు. ఒక్కొక్క విచారంలో ఒక్కొక్క అంశం విపులంగా వివరించటానికి సాధారణంగా ఒక కథ అయినా స్వీకృతమయింది.

ఈ 'దర్ప విదళనము' తెలుగులో వెలువడ్డ తర్వాత, ఈ వ్యాస సంపుటి ప్రభావంతో మరో గ్రంథం 'మద విదళనము' అనే పేరుతో పుట్టింది. అది తా. ఆర్ముగం సృష్టి. 1985లో ముద్రితమయింది. ఈ రచయిత తొలి పలుకులో ''క్షేమేంద్ర మహా కవి దర్ప విదళనమును జదివి నప్పటి నుండి తదనుసృత ముగ నాంధ్రమున నొక్క గద్దె కబ్బమునల్లు కుతుకముల్లమున పెల్లయి దీని రచనకు గడంగితి'' నని తెలపటం పరికింపవచ్చు.

ఈ గ్రంథం వ్యాస సంపుటిగా రచయిత భావించలేదు కాని, ఇవి అన్నీ వ్యాసాలే. ఇందులో బలగర్వము, కుల, ధన, విద్యా, రూప, యౌవన తారుణ్య, అధికార, ఆచార, మదాలున్నాయి. వీటిని తొమ్మిది వ్యాసాలుగా గ్రహించి, ప్రతిపాదించిన విషయం కథాబలంతో ప్రవర్తిల్లచేయటం సామాన్య లక్షణంగా

స్మరించవచ్చు. బల గర్వం అని పేరుందికాని, మిగతా వాటిలాగా బలమదమని లేకపోవటం గమనార్హం.

క్షేమేంద్ర వ్యాసాలు, 'విచారము'గా వుంటే అర్మగం వ్యాసాలు 'మదము' అని ఉండటము విషయ సంబంధికాని, వ్యాస నిర్మాణ సంబంధికాదు. అవి సప్తర్షి మండలం లాగా ఏడు వ్యాసాలయితే, ఇవి నవగ్రహాలులాగా తొమ్మిది. కుల ధన విద్యా రూప విషయాలు రెండింటిలో సమానంగా ఉండగా, అందులోని శౌర్య దాన తపో విచారాలు ఇందులో లేకపోగా, బలగర్వము, యౌవన, తారుణ్య అధికార, ఆచార మదాలు ఉన్నాయి. పోలిక ఉన్న వ్యాసాలలో అది శీర్షిక వరకేగాని విషయ సంబంధం కాదు. క్షేమేంద్రుడి 'దర్ప విదళనము' అర్మగం 'మదవిదళనము'నకు రచనా ప్రేరకమయినా విషయం విభిన్నంగా ఉంది. ఈ మదవిదళనము స్వతంత్ర వ్యాస సంపుటి.

ఈ వ్యాస సంపుటిలో వచనం కవితాత్మకంగా ఉంది. కొన్ని చోట్ల శబ్దదృష్టి ఎక్కువగా వుంది. నీతిజ్ఞుడైన మంత్రి వర్యుడు, భ్రష్టుడైపోతున్న రాకుమారుణ్ణి క్రమ మార్గంలో పెట్టటానికి చెప్పే నీతులతో కూడిన ఈ రచనలు చక్కని వ్యాసాలుగా రూపొందాయి. 'మదవిదళనము' లాగా నీతి బోధ ప్రధాన దృష్టిగా కలిగివుంది.

వచన రచనలలోనూ, అన్య ప్రక్రియలలోను వ్యాసాలున్నట్లు స్పష్టమే! ఆంగ్ల సారస్వత ప్రభావంతో వ్యాస సృష్టి విస్తృతం కావటం పరికింపవచ్చు.

వ్యాస రచనకు ఒక విధమయిన మానసిక హార్దిక స్థితి అవసరమవుతుంది. ఈ ప్రక్రియకు ఈ స్థితి సముచితంగా సరిపోతుంది. ఈ ప్రక్రియ లేనప్పుడు ఈ స్థితి మరో ప్రక్రియ వల్ల అభివ్యక్తి పొందుతుంది. అందువల్ల వ్యాసస్థితి సృజన వచన వాఙ్మయంలో నిక్షిప్తమయి గోచరమయింది. అందువల్లనే వ్యాస నవలాది ప్రక్రియలు లేనప్పుడు తెలుగులో వచన గ్రంథాలు వ్యాస స్థానాలయ్యాయి.

## 2. వ్యాసారంభ యుగం (1862-1876)

ఈ యుగంలో వ్యాసం ఆ పేరుతో పిలువబడలేదు. కందుకూరి వీరేశలింగం పంతులు కంటే పూర్వం వ్యాస రచన చేసిన రచయితలకే ఈ యుగంలో

ప్రాధాన్యం. ఈ సమయంలో వ్యాస సృష్టి కావించిన రచయితలు ముగ్గురు. 1. స్వామినీన ముద్దు నారసింహ నాయడు, 2. పరవస్తు వేంకట రంగాచార్యులు, 3. జయ్యారు సూరి.

వ్యాసం తీరుతెన్నులు తీర్చిదిద్దిన వాళ్ళుగా కాకపోయినా ప్రారంభకులుగా, అనంతరం వ్యాస సృష్టిలో ఆధిక్యం వహించి ప్రముఖుల మీద ప్రభావం ప్రసరించిన వాళ్ళుగా, ఈ వ్యాస కర్తలు ముగ్గురు వ్యాస పరిణామంలో ప్రధానమైన వాళ్ళుగా గుర్తింపబడవలసిన వాళ్ళు.

ఈ యుగంలో వ్యాసం ప్రారంభమయి, పెరిగి, లక్షణాలు స్వల్పంగా గోచరించే దశను పొంది, సారస్వతంలో భిన్న శాఖ ఆవిర్భవిస్తున్న దశను ప్రదర్శించింది. ఈ వ్యాసం భవిష్యత్తులో వ్యాసం పొందే అభ్యుదయానికి పునాదిగా ఏర్పడింది.

## 1. ప్రమేయము - హితసూచని (1862)
## స్వామినీన ముద్దు నారసింహ నాయడు

స్వామినీన ముద్దు నారసింహ నాయని హిత సూచని "వచన రూపము"గా రచింపబడ్డ "గ్రంథము" ఇందులో ఎనిమిది "ప్రమేయములు" ఉన్నాయి. ఒక్కొక్క ప్రమేయం ఒక్కొక్క అధ్యాయంగా ఉంది. విద్యా, వైద్య, సువర్ణ, మనుష్యేతర జంతు సంజ్ఞా, రక్షః ప్రభృతి, మంత్ర, పరోక్షాదిజ్ఞాన, వివాహ ప్రమేయాలు హిత సూచనిలో ఉన్నాయి.

ప్రమేయము వ్యాసంగానూ, హిత సూచని వ్యాస సంపుటిగానూ విమర్శకులు స్వీకరించారు. "వీనిలో ఎనిమిది ప్రమేయములను గురించిన వ్యాసములున్నవి." (1) 1. "ఈ వ్యాస సంపుటిలో వ్యాస మనుటకు బదులుగా ప్రకరణములను ప్రమేయములను పేర గ్రంథకర్త విభజించెను" (2) ఈ వ్యాస సంపుటి 1862 లో ముద్రింపబడినా, అంతకు పూర్వమే వ్రాయబడినట్లు, వ్యాసకర్త కుమారుడు స్వామినీన రంగ ప్రసాదు నాయడు తండ్రి తదనంతరం ప్రచురించటం వల్ల గ్రహింపవచ్చు. ఈ హిత సూచని ఎనిమిది వ్యాసాల సంపు

టిగా గ్రహించి, రచయిత స్వామినీన ముద్దు నరసింహనాయడు ప్రథమాంధ్ర వ్యాసకర్తగా భావించటం సముచితం.

అయితే, ఆంగ్ల విద్యా ప్రభావం ఉన్న వ్యాసకర్త ఈ ప్రమేయాలను వ్యాసాలుగా భావించినట్లు వ్యాసాలలో ఎక్కడా స్పష్టంగా లేదు.ఈ సంపుటి వచన గ్రంథమనీ, వచనరూపమనీ, గ్రంథమనీ,వాక్య గ్రంథమనీ భావించటం జరిగింది కాని వ్యాసంగా భావించలేదు.ఈ సంపుటి రెండవ పుట ఆంగ్లంలో గ్రంథ వివరాలు తెలుపుతూ "The Hitha Soochanee or Moral Instructor in prose prepared by Swamyneena Muthoo Naidu" వచనంగానే పేర్కొనటం జరిగింది కాని వ్యాసం తెలుపలేదు. ప్రమేయమంటే వ్యాసమన్న అర్థం ఉన్నట్లు తెలియటంలేదు. నిఘంటువులు "యథార్థముగా ఎఱుఁగఁదగినది" (శబ్దరత్నాకరము) అనీ,

"An object of certain knoledge, a demonstrated conclusion, Theorem-

2. The thing to be proved, the topic tobe proved or discussed (Apte' s Sanskrit-Engllsh Dictionary)

అనీ తెలపటంవల్ల వ్యాసమని స్పష్టంగా వివరించినట్లు కాదు. అందువల్ల ప్రమేయం అన్నపదం వ్యాసపర్యాయంగా ప్రయోగించినట్లు భావించే అవకాశం లేదు.

ప్రమేయం అన్న పదం ప్రముఖంగా ప్రయోగించిన రచయిత అభిమతం వ్యాస సంపుటిలో ఆ పదం ప్రయుక్తమయి నప్పుడు తెలుస్తుందేమోనని పరిశీలింపవచ్చు. హిత సూచనిలో ఈ పదం ప్రయుక్తమయిన నాలుగు సందర్భాలలోను వ్యాసం అనే అర్థంలో స్థూలంగా నయినా గోచరం కాలేదు.

"కనుక వాటిలో జరూరైన ప్రమేయములు ఇంగిలీషు గ్రంథములలో నుంచి దేశ భాషలను తర్జుమా చేయించి" (పుట 10)

"వివేకశాలులైనవారు పురాణాదుల యందుండే ప్రమేయములను పరిశీలిస్తే వాస్తవములైన వాటినివి" (పుట 56)

"ఆ ప్రసంగములో ఆమె కళా శాస్త్ర ప్రమేయము తెచ్చినట్లున్ను" (పుట 102)

"ఈ దిగువను వ్రాయబడే నా అభిప్రాయములో ఈ ప్రమేయము బుద్ధిమంతులయిన హిందూలయొక్క యోజనలో తేబడగలందులకు..." (పుట 135)

ప్రమేయమన్న పదం విషయం, సంగతి, ప్రసక్తి, అంశం అన్న అర్థంలో ప్రయుక్త మయినట్లు తలపవచ్చుకాని వ్యాసం అన్న అర్థం స్ఫురించదు. అయితే ఈ ప్రమేయాలు వ్యాసాలుగా పరిశీలింపవచ్చు.

ఈ ప్రమేయాలు వచనంలో రచింపబడ్డాయి. మంత్ర, వివాహ ప్రమేయాలు 75, 62 పుటలున్నా, 5 పుటలు (సువర్ణప్రమేయం) మొదలుకొని 20 పుటల వరకు (మనుష్యేతర జంతు సంజ్ఞాప్రమేయము) వ్యాపించి ఈ ప్రమేయాలు పరిమితంగా ఉన్నాయి. ఆలోచన విశృంఖలంగా సాగితే రచన ఆ విధంగా రూపొందింది. ఆంధ్రులంతా మేలు పొందాలన్న దృష్టి వుంది. "హిందూలలో చాలా మంది నమ్ముచున్నందునను వారికి వ్యర్థ వ్రయమున్ను వ్యర్థ కాలక్షేపమున్ను అసౌఖ్యమున్ను హానియున్ను కలుగుచున్న"వని ఆ మూఢ నమ్మకాలు తొలగించటం కోసం రచయిత ఈ రచన కావించినట్లు తెలుసుకోవచ్చు. అత్యల్పంగా అక్కడకూడా హాస్యధోరణి కనిపిస్తుంది. "దూర దేశస్థుడై యున్న తమ వాని సమాచారము తెలియకపోయినందున గురించిన్ని, సదరు ఉపాసనాపరులి ఒద్దికి కొందరు వెళ్ళి ప్రశ్న అడుగడమున్ను, ఆ మనిషి యింకా జీవించి యున్నాడనిన్ని కొన్ని రోజులలో వస్తాడనిన్ని వారు ఉత్తరము చెప్పడమున్ను ప్రశ్న అడిగినవారు ఆ మాట నమ్మియుండగా ఇంకా బ్రతికి యున్నట్లు చెప్పబడ్డ మనిషి అదివరకే చనిపోయినట్లు సమాచార పత్రిక రావడమున్ను కలదు," (పరోక్షాది జ్ఞాన ప్రమేయము- పుట 154)

రచయిత వివరించిన విషయాలు స్వాలోచనజన్యంగా ఉన్నాయి. ఈ ప్రమేయాలలోని వస్తువులు పరిపూర్ణంగా, సమగ్రంగా ఉన్నట్లు చెప్పే అవకాశం లేదు. బాలిక వివాహ వయస్సు తెలుపుతూ రచయిత చేసిన నిర్ణయం కంటే భిన్నంగా ఆ సమయంలోనే మద్రాసు అది వెలను సభ నిర్ణయించింది. "ఈ ప్రమేయము యొక్క ఉద్దేశములకు అనుగుణముగానున్ను యుక్తముగానున్ను ఏర్పరుచుకో వచ్చుననిన్ని దిద్దుబాటున్ను చేసుకుంటూ నుండవచ్చుననిన్ని నా యభిప్రాయమయి యున్నది." (వివాహ ప్రమేయము- పుట 224) తను

వ్యక్తం చేసిన అభిప్రాయాలు సర్వసంపూర్ణాలు కావని రచయిత విశ్వసించటం, దానిని ప్రకటించటం గమనార్హం.

రచయిత వ్యక్తిత్వం వస్తువు, భాష, రచనా రీతి మొదలైన అనేక విషయాలలో గోచరమవుతుంది. నేను 'నా' అనే పదాలే కాదు - పుటపుటకూ రచయిత జీవిత దృక్పథం, స్వభావం, మానవత్వం, ఉదాత్తత తెలుస్తూ వుంటాయి. ఈ పై లక్షణాల వల్ల ఈ ప్రమేయాలు వ్యాసాలుగా భావింపవచ్చు. ఆంగ్ల వ్యాస లక్షణాలు స్థూలంగా ఈ ప్రమేయాలలో కనిపించి, ఇవి వ్యాసాలే అనే అభిప్రాయం స్థిరపరుస్తున్నాయి.

ఈ రచయిత తన ప్రమేయాలలో ప్రదర్శించిన వ్యాస ధర్మాలు పరికింపవచ్చు. ప్రతి ప్రమేయం కొన్ని అంశాలుగా విభజించుకొని అంశ క్రమంలో వివరించటం ప్రతి ప్రమేయంలో కనిపించే సాధారణ విధానం. విద్యా ప్రమేయం అయిదు భాగాలుగా ఉంది. ''౧. విద్యల యొక్క గ్రంథముల యొక్క ప్రశంస. ౨. లోక శ్రేయస్సు కొరకు గ్రంథములు రచించ బడవలసినదనుట. ౩. ఏ గ్రంథమైనా విద్యార్థులకు సులభముగా బోధకా తగినట్లు ఉండవలసినదనిన్ని ఛందోబద్ధములైన గ్రంథముల వల్ల వారికి బాగా కిఫాయతు కలుగడము లేదనిన్ని. ౪. శాస్త్రముల యొక్క ఇతరాంశముల యొక్క గ్రంథములు సులభముగా తెలియతగినట్లు ఏర్పరచ వలసిన పద్ధతిన్ని విద్యాభ్యాసము చేసే క్రమమున్ను. ౫. సదరు గ్రంథములు ఏర్పడడమునకు సదుపాయములు'' ఈ క్రమంలో ప్రత్యంశం వివరించటం వల్ల వ్యాసం పూర్తి అయింది. ఈ విధంగానే ప్రతి వ్యాసం ఏర్పడింది.

వ్యాసంలో ప్రత్యంశం వివరించటానికి సాధారణంగా ఒక కథ ఉదాహరణంగా ఉంది. ఒక్కొక్కప్పుడు ఉదాహృతకథ విస్తృతంగానూ ఉంది. సువర్ణ ప్రమేయంలో శంకరాచార్యుల కథ, మనుష్యేతర జంతు సంజ్ఞా ప్రమేయంలో బ్రాహ్మణుడి కథ, ముంగి కథ, చీమల కథ, రక్షః ప్రభృతి ప్రమేయంలో బ్రాహ్మణుడి కథ, మంత్ర ప్రమేయంలో రాజు ఫకీరుల కథ, శంకరాచార్యుల కథ, భాగ్యవంతుడి భార్య కథ, తక్షకుడి కథలు కథ మొదలైన అనేక ప్రధానాంశ వివరణార్థం ప్రత్యక్షంగా

ఉన్నాయి. అయితే బగ్దాద్ పట్టణస్థుని కథ 22 పుటలు (పుట 103 నుంచి పుట 125) వరకు వ్యాపించింది.

ప్రమేయ ప్రారంభంలో 'శుభమస్తు', 'శ్రీమజ్జగన్నాథాయ నమః' అని వుంది. ముగింపులో 'సంపూర్ణము' అనో, '–' గనో, 'శ్రీమతే జగన్నాథాయ నమః' అనో కనిపించింది. ప్రమేయప్రారంభంలో ప్రముఖంగా కనిపించే అంశం గుర్తింపవలసివుంది. ఆరంభంలో ఆ ప్రమేయంలో చర్చింపబడే విషయం స్థూలంగా అన్నికోణాలనుంచి పరికించి, ఒక నిర్వచనప్రాయ పరిశీలనం-వాక్యంగానో, వాక్య సముదాయంగానో వ్రాయటం సర్వ ప్రమేయ సాధారణంగా కనిపించింది. ఉదాహరణ "పరోక్షమందు జరిగేటటువంటివిన్ని ప్రత్యక్షమందు జరగబోయేటటువంటివిన్ని సంగతులనున్ను, ఎవరెవరి మనస్సుల యందుండే యభిప్రాయములున్ను కనిపెట్టే జ్ఞానమున్ను ఈశ్వర విషయిక జ్ఞానమున్ను పరోక్షాది జ్ఞానమని యిక్కడ చెప్పబడుచున్నది." (పుట 148)

'హితసూచని' విషయ పరిశీలనం కర్తవ్యమే ! విద్యా వైద్య వివాహ ప్రమేయాలలో నూత్నవిషయబోధ ఉద్దిష్టంగా వుంది. సువర్ణ, మనుష్యేతరజంతు సంజ్ఞా, రక్షః ప్రభృతి, మంత్ర, పరోక్షాదిజ్ఞాన ప్రమేయాలలో మూఢనమ్మకాలు ఖండించటం వుంది. స్థూలంగా ఈ ప్రమేయాలు విజ్ఞానబోధకాలు, అజ్ఞాన నిరూపకాలు.స్వామినీన ముద్దు నరసింహ నాయడు వ్యాసం బోధనకు,నిరూపణకు ప్రబల సాధనంగా గ్రహించాడు.

విజ్ఞానబోధకాలు :- ఆంగ్లవిద్య నూత్నాలోచనలు తెలుగువాళ్ళకు కలిగింది. ఆ మార్గంలోనే ఈ రచయిత విద్యనూ, వైద్యాన్ని, వివాహాన్ని గూర్చి చేసిన ఆలోచనలు మేధావి దృక్పథం ప్రదర్శించాయి. సంఘసంస్కరణ వాంఛ, జాత్యభ్యుదయంపట్ల ప్రగాఢమైనకోర్కె వ్యక్తమయ్యాయి. రచయిత అయుక్తంగా అవాస్తవంగా ఉన్న రచనలను తిరస్కరించడం గమనార్హం. గ్రంథసృష్టినిగూర్చి "ఏ గ్రంథమైనా, చదువుకునేవారికి సులభంగానున్ను, త్వరితంగానున్ను, సందేహములు లేకుండానున్ను, బోధపడేలాగున నుండవలసినది అవశ్యకమై యున్నది." (విద్యా ప్రమేయము - పుట 4) "ఛందోబద్ధమైన గ్రంథము" రచించటంకంటె "వాక్యగ్రంథములు" వ్రాయాలనీ, గ్రంథాలు

పండిత పామర సామాన్యంగా ఉండాలనీ, అభ్యాస సౌలభ్యం ఉండాలనీ ఉండాలనీ రచయిత తెలపటం పరికిస్తే రచయిత ఆలోచన రీతి, హృదయ వైశాల్యం వ్యక్తమవుతాయి.

మనిషి శరీరం రోగనిలయమనీ, హిందువైద్యులకు శాస్త్రపరిశ్రమ తక్కువనీ, రసవిషాదులు ''లంఘనములు'' ప్రమాదకరాలనీ, శరీరతత్త్వం వైద్య పద్ధతి విద్యార్థులకు బోధించాలనీ, మంత్రాలు తంత్రాలు మూఢ నమ్మకాలనీ, జబ్బు శరీరతత్త్వ కారణంగా కలుగుతుందని తెలిపి, అల్లం, నల్లమందు, హారతి కర్పూరంతో రచయిత తయారుచేసిన మందువిషయం తెలిపి, దానిని వాడే తీరు వివరించిన వ్యాసభాగం వైద్యంపట్ల ఒక నూత్న దృక్పథం ఆ కాలంలో కలిగించింది.

వివాహ మర్యాదల్లో అన్యాయపద్ధతులు గమనించిన రచయిత సముచిత మార్గం వివాహప్రమేయంలో చూపాడు. వివాహధర్మంలో ఇచ్ఛ అంగీకారం ప్రధానంగా ఉండాలి. ధనవ్యయం పనికిరాదు. పూర్ణవయస్సు లేకుండా వివాహం చేసుకోకూడదు అనే అంశాల పూర్వాపరాలు జాగరూకంగా పరిశీలన చేశాడు. ''యుక్తవయస్సురాని బాలికలకే వివాహముచేసేలాగున ఏర్పరచుకున్న ఆచారము ద్రవ్యముపుచ్చుకొని బాలికలను వివాహమునకిచ్చే మర్యాదనుకూడా కలుగజేసినది.'' (పుట 216) అనే హెచ్చరికా. "వివాహముతోగాని పునర్వివాహముతోగాని చేరిన ఏ అంశమయినా అయుక్తమయినదిగాగాని అసౌఖ్యమయినదిగా గాని కనుపడే పక్షమందైనా నీతికోవిదులైనవారు'' (పుట 224) మార్చుకోవాలన్న సూచనా స్వీకరణార్హాలు.

అజ్ఞాననిరూపకాలు:— ఆంధ్రులలో ఉన్న అజ్ఞానం మూఢ నమ్మకాలు తొలగించాలని వ్యాసకర్త తీవ్రంగా ఆలోచించడం పరికించవచ్చు. ''సువర్ణము చేసే విద్య యొకటి యున్నదని కొందరు నమ్ముతున్నారు.'' అది పొరపాటు. ఆ నమ్మకం ఉండరానిది. ఆలోచిస్తే ఒక లోహాన్ని ఇంకొక లోహంగా చేయటం అసాధ్యమని బోధపడుతుంది. అందువల్ల ''నరుడు ఒక ధాన్యమును మరియొక ధాన్యముగానైనా, ఒక జంతువును మరియొక జంతువుగానైనా ఏలాగున చెయ్యలేడో ఆలాగుననే ఒక అసలు లోహమును మరియొక అసలు లోహముగా

నెప్పుడున్ను చెయ్యనేరడు'' (పుట 32) అని తెలుపుతూ స్పర్శవేది అనేదాన్ని నమ్మకూడదని, కథోదాహరణంతో వివరించి అజ్ఞానం దూరీకరించాలని కృషి చేశాడు.

పశుపక్ష్యాదులు మాట్లాడినట్లు పురాణప్రబంధ కావ్యాలలో సాధారణంగా ఉంటుంది. ఇది నమ్మరాదనీ, ''పురాణాదుల యందుండే సంగతులన్నీ వాస్తవము లయినవిగా బుద్ధిమంతులు నమ్మవలసిన పని లే''దనీ, ''వివేకశాలులయినవారు పురాణాదుల యందుండే ప్రమేయములను పరిశీలిస్తే వాస్తవములైన వాటినిన్ని ఆ యా నిమిత్తములలో నుండే నీతినిన్ని యుక్తినిన్ని విశదపర్చ గలందులకు కల్పించబడియున్న వాటినిన్ని కనిపెట్టనే వచ్చు''ననీ రచయిత ఆలోచన.

రక్షస్సులు, పిశాచాలు, భూతాలు, దయ్యాలు ఉన్నాయని చెప్పటమూ, నమ్మటమూ లోకంలో సామాన్యమయింది. ఈ అజ్ఞానం తొలగింపబడవలసిందిగా రచయిత వాదించిన తీరు గుర్తిపదగివుంది. మంత్రాలు లోకంలో అనేక కార్య సాధనాలుగా భావించటం మౌఢ్యం. ఈ మౌఢ్యం తొలగించాలని అనేక కథలు ఉదాహరిస్తూ తద్బోధ చేశాడు. అజ్ఞానాంధకారంలో మగ్గుతున్న జాతికి - వివేక భానూదయం కలిగించాలని రచయిత చేసిన ప్రయత్నచిహ్నంగా ఈ హిత సూచనిలో వ్యాసాలు ద్యోతకమవుతున్నాయి.

*రచనావిధానం:* ఈ వ్యాసాలు వ్యావహారిక భాషలో ఉన్నాయి. గిడుగు వ్యావహారిక భాషావాదంకంటే పూర్వం ఆ అంశంమీద వెలువడ్డ అభిప్రాయా లుగా, ఆ దృష్టితో జరిగిన సృష్టిగా ఈ వ్యాస సంపుటి ప్రాధాన్యం స్పష్టమవు తుంది. రచయిత అర్ధానుస్వారం పరిత్యజించి, ''ఈ వాడిక ఉచ్చారణకున్ను, లిపికిన్ని సులభముగా'' ఉందనీ, శకటరేఫం వదలివేసి, ''రేఫ శకటరేఫలకు ఉచ్చారణయందు భేదమే''మీ లేదనీ వివరించాడు. సంధి నియమం ఉల్లంఘించ వచ్చుననీ, అది ఉచితమనీ రచయిత అభిప్రాయం. గ్రామ్యోక్తి ఆంధ్ర భాషా సౌందర్యముగా భావించి ''సాధారణమయిన భాషయందు వాడికలోనున్న గ్రామ్య పదములు చాలామట్టుకు సరసమయిన వాక్యరచనలో నంగీకరించ తగినవిగా

నేను ఎంచుకుంటున్నాను'' అని రచయిత వ్యావహారిక భాషా రచనను సమర్థిం చటం, తద్రీతిగా రచించటం, భాషాభ్యుదయ సంధాయకంగా ఉన్నాయి.

ఈ వ్యాసాలలో వాక్యాలు ఆంగ్ల వాక్యచ్ఛాయల్లో సాగాయి. కొన్ని వాక్యాలు ఆంగ్లవాక్య నిర్మాణక్రమం గ్రహిస్తే, మరికొన్ని ఆంగ్ల వాక్యానువాదా లుగా రూపొందాయి. రచయిత న్యాయాధికారి కావటంవల్ల కావచ్చు, వాక్య నిర్మా ణంలో న్యాయాలయాల వాక్యరచనాధోరణులు ఉన్నాయి. సమాధాన నిరపేక్షంగా స్వయం పరిపూర్ణంగా వాక్య నిర్మాణం సాగింది.

పేరాలు సాధారణంగా పెద్దవిగా ఉన్నాయి. బగ్దాద్ పట్టణస్థుని కథ 22 పుటలు ఒక్క పేరాగా వుంది. వైద్య ప్రమేయంలో మూడవ పేరా, సువర్ణ ప్రమే యములో రెండవ పేరా ఒక్క వాక్యంగా ఉన్నాయి. ఒకవిషయం అయినా, అవాంతర, అంతర్గత అంశాలుకల విషయమైనా భిన్న విషయాలు అయినా ఒక పేరాగా వ్రాయటం కనిపిస్తుంది, స్థూలంగా వర్తమానంలో పేరాను వాడుకునే ధోరణికి భిన్నంగా హిత సూచనిలో పేరాలు గ్రహింపబడ్డాయి.

తెలుగు పదాలు చాలావరకు వాడుకకు దగ్గర రూపంతో వ్రాయటం జరి గింది. హితసూచనిలో ఆంగ్లపదాలు కొన్ని ప్రయుక్తమయి, ఆంగ్లపద ప్రభావ ద్యోతకంగా ఉన్నాయి. పేరా, ప్రింటు, ఇంగ్లీషు, జిఆగ్రఫి, జిఆమిత్రి, ఎరిథ్మిటిక్, ఎస్ట్రానొమ్మీ, ఫిలాసొఫి, ఎనాట్టొమి, సర్జరి, హాలు, దసుపపెట్టి - ఈ పన్నెండుమాత్రమే హితసూచనిలో ఉన్నట్టు 'తెలుగుసాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' గ్రంథంలో తెలపటం జరిగింది. అయితే ఇంకా కొన్ని ఇంగ్లీషు పదాలు ఈ వ్యాససంపుటిలో ఉన్నాయి. నంబరు, ఫష్టు, క్లాసు, డిస్ట్రిక్టు, ఆక్టిన్, గవరన్మెంటు, జూలై మొదలయిన వా ఆంగ్లపదాలు.

హితసూచనిలో ఉరుదూ పదాలు బహ్వాధికంగా ప్రయుక్తమయ్యాయి. న్యాయాలయాల పరిభాషతో ఉరుదూ పదజాలం ఎక్కువగా ఉండటం, రచయిత న్యాయాధికారి కావటంవల్ల రచనలో ఆ పదాలు అధికంగా చోటు చేసుకొన్నాయి. అవి సదరు (సదరహి), కిఫాయతు, ఛాపా, లాయఖు, జాబితా, జరూరు, తర్జుమా, బచావు, పూరా, బస్తీ, ఖరారు, పుస్తాయించి, హిమ్మత్, తగాజు, ఇలాకా, హక్కు, దాఖిలా (దాఖలా), ఖులాసా, తఖ్తు, జారీ, పకీరు, జవాబు, ఖుదా, పరాకి, ఖుషీ, అఫీసు, రోజు, హల్కా(మనిషి)బదలాయింపు, హవేలి, దర్వాజా,

కచేహరీ, మాఫు, మేజా, చంబా, దిలాసా, దుకాణాదారుడు, ఖజానా, ఇషారా, కషీదా, షరతు, ఉత్తర్వు, ఫరమాయిస్తే, దౌలత్, దర్యాప్తు, ఫలాని, బందోబస్తు, దర్ఖాస్తు, దఫా మొదలయినవి.

విరామ చిహ్నాల ప్రయోగం ఈ వ్యాస సంపుటిలో పరికింపవచ్చు. కామా సాధారణంగా ఉండకూడని చోటే వుంది. ప్రమేయమంతా ఒక పేరాగా, వాక్యమంతా ఒక పేరాగా ఉంటే చివరలో కామా ఉండటం, మధ్యలో ఎక్కడా ఉండక పోవటం ఈ సంపుటిలో సర్వసాధారణంగా ఉండటంవల్ల కొంతవరకు ముద్రాకాలల పరిస్థితి అవగతమవుతుంది. 'ఫుల్‌స్టాప్' సాధారణంగా ఉండవలసినచోట లేదు. అప్పుడప్పుడది ప్రమేయానికి, పేరాకు, వాక్యానికి చివరఉంది. ఈ సంపుటిలో 'ఫుల్‌స్టాప్'గా సరళరేఖ '–' ప్రయుక్తమయింది.

వాక్యనిర్మాణంలో సముచ్చయం ప్రధానపాత్ర వహించింది. సముచ్చయం భిన్నరీతి వాక్య రచనా సమర్థంగా గోచరమయింది. 'అనేక', 'ఏమి' పదాలు పునరావృతమయ్యే వాక్యాలవల్ల రచనలో వేగం కనిపించింది. సంక్షిప్తత స్పష్టతవల్ల వాక్యాలు పటిష్ఠంగా ఉన్నాయి. వ్యాసశైలిలో ఈ విషయం వివరంగా వుంది.

'హితసూచని'లోని ప్రమేయాలు వ్యాసాలే! అవి ఆంగ్ల లక్షణ శోభితాలు. రచయిత మేధావి, హృదయవాది అయినందువల్ల వ్యాసాలు బుద్ధికీ, గుండెకూ చేరువ కాగలిగాయి. జాతి శ్రేయం రచయిత కాంక్ష, తత్సాధనమార్గం వ్యాసంగా గ్రహించటం గమనార్హం. వ్యావహారిక భాషలో రచన కావించటంవల్ల ఈ భాషకు కొంతవరకు మార్గదర్శి అయినట్లు గుర్తింపవచ్చు. హితసూచని బహు విమర్శామోదంపొందిన వ్యాస సంపుటి కావటంవల్ల స్వామినీన ముద్దు నారసింహనాయుడు ప్రథమాంధ్ర వ్యాసకర్త.

## 2. సంగ్రహము 1872-1874)

పరవస్తు వేంకట రంగాచార్యులు.

'సంగ్రహము'లు సంపుటిగాలేవు. విడివిడిగా వ్యాసమొకచిన్నపుస్తకంగా పడు లభించాయి. ఇవి 29 అని శ్రీ నిడదవోలు వేంకటరావు వ్రాసిన మూకేంద్ర తెలుగువ్యాసంవల్ల తెలిసింది. ఇవి 22 అని తమిళనాడు స్టేట్ ఆర్కైవ్స్ (పాతరికార్డ్స్ ఆఫీసు) కేటలాగువల్ల తెలుస్తుంది. అయితే వ్యాసంలోలేని 'సంగ్ర

హము'ల పేర్లు కొన్ని కేటలాగులోనూ, కేటలాగులో లేనివి వ్యాసంలోనూ కనిపించాయి.

| | | వ్యాసం | | కేటలాగు |
|---|---|---|---|---|
| 1. | అవతార సంగ్రహము | × | = | 37-1872.2 |
| 2. | అర్థమత సంగ్రహము | × | = | 26-1872.2 |
| 3. | ధర్మ జన్మ సంగ్రహము | × | = | 65-1872.3 |

వ్యాసంలో ధర్మ జన్మ సంగ్రహము అని ఒక్క సంగ్రహంగా తెలపటం జరిగింది. కేటలాగులో రెండు సంగ్రహాలు ఉన్న ఒక పుస్తకంగా తెలపటం అయింది. ఆంగ్లంలో దానిశీర్షిక a Manual of virtue and a Manual of birth అని ఉండటంవల్ల రెండు సంగ్రహాలు అని గుర్తించటం సాధ్యమవు తుంది. 1873 లో పునర్ ముద్రితం అయినప్పుడు జన్మ సంగ్రహము, ధర్మ సంగ్రహము అని వేరు వేరుగా పేర్లుంచటం జరిగింది. కాబట్టి యివి రెండు సంగ్రహాలు.

| | | | | |
|---|---|---|---|---|
| 4. | వర్ణసంగ్రహము | × | = | 64-1872.3 |
| 5. | సృష్టి సంగ్రహము | × | = | 42-1872.3 |
| 6. | ప్రమాణ సంగ్రహము | × | = | 90-1872.4 |
| 7. | వేద సంగ్రహము | × | = | 89-1872.4 |
| 8. | శాఖా సంగ్రహము | × | = | 91-1872.4 |
| 9. | ఆత్మ సంగ్రహము | × | - | 40-1873.1 |
| 10. | ఈశ్వర సంగ్రహము | × | = | 122-1873.1 |
| 11. | గుణ సంగ్రహము | × | - | 123-1873.1 |
| 12. | ముక్తి సంగ్రహము | × | - | 168-1873.3 |
| 13. | కర్మ సంగ్రహము | × | - | 12-1874.2 |
| 14. | కాల సంగ్రహము | × | - | 15-1874.2 |
| 15. | దేవతా సంగ్రహము | × | - | 13-1874.2 |
| 16. | ముక్తిమార్గ సంగ్రహము | × | - | 9-1874.2 |
| 17. | రహస్య సంగ్రహము | × | - | 17-1874.2 |
| 18. | వివాహ సంగ్రహము | × | - | 16-1874.2 |
| 19. | స్మృతి సంగ్రహము | × | - | 14-1874.2 |

| | | | | |
|---|---|---|---|---|
| 20. | పునర్వివాహ సంగ్రహము | × | - | 6-1874.3 |
| 21. | ప్రాయశ్చిత్త సంగ్రహము | × | = | 182-1876.1 |
| 22. | అలంకార సంగ్రహము | × | - | |
| 23. | శ్రుతి సంగ్రహము | × | - | |
| 24. | వర్ణ నిర్ణయము | × | - | |

ప్రతి వ్యాసం 'సంగ్రహము' అనే పదంతో కూడి వుండటం పై సంగ్రహాల వల్ల స్పష్టమవుతుంది. 'సంగ్రహము' పదం లేకపోవటం వల్ల 24వది వ్యాసమయినా సంగ్రహం కాకుండా పోతుంది. అయితే ఇది వర్ణ నిర్ణయ సంగ్రహంగా ఉండవచ్చు.

## 25. కాల/కళా సంగ్రహము

ఈ పేరుతో సంగ్రహం ఉంటే, ఆ మాట వేరేకాని, ఆంగ్లంలో ఉన్న శీర్షిక చదవటం వల్ల 'కాల'గనూ కళగానూ ఒకే అక్షరాలు స్ఫురించే అవకాశం ఉంది. కాబట్టి శంకకు అవకాశం ఉంది. ఆర్కైవ్స్‌లో కాల సంగ్రహం లభించింది కాని, కళా సంగ్రహం కాదు. 'నూతేండ్ల తెలుగు వ్యాసము' రచయితకు ఈ సంగ్రహాలు ఎక్కడ పరిశీలించింది గుర్తులేదు కాబట్టి ఆర్కైవ్స్‌లో తప్ప భిన్న ప్రదేశంలో ఈ సంగ్రహాలు సందర్శించే అవకాశం లేకపోయింది.

## 26. హిందూ శాస్త్ర సంగ్రహము

పై సంగ్రహాలు మొత్తం తారావళిలా ఇరవై ఏడు. వ్యాసకర్త దృష్టిలో ఇవి సంగ్రహములు కాని వ్యాసాలు అయినట్లు అనుకోవటానికి ఆధారం లేదు. అయితే "వ్యాసములను సంగ్రహములను పేర తెలుఁగున వెలయించినది భారత వర్ష ప్రథమ మహామహోపాధ్యాయ పరవస్తు వేంకట రంగాచార్యులుగారు" (3) విమర్శకులు భావించారు.

అయితే ఈ సంగ్రహములు కేటలాగులో చేర్చిన ఆర్కైవ్స్ అధికారులు వీటిని ఆంగ్లంలో 'ఎస్సె' అనకుండా మాన్యువల్ అనటం గమనార్హం. Manual of the Doctorins of the Rishis, manual of souls, Manual of Incarnation of Deity, Mannual of Remarriage అని, మాన్యువల్ పదం సంగ్రహానికి ఆంగ్లానువాదంగా వుంది.

ఆంగ్ల వ్యాస లక్షణాలు పూర్తిగా కాకపోయినా అల్పంగా నయినా వర్తించటం వల్ల ఈ 'సంగ్రహము'లు ఆంగ్ల ప్రభావానంతరం ప్రవర్తిల్లిన తెలుగు వ్యాసాలుగా భావింపవచ్చు. ఈ సంగ్రహాలలో రచయిత వ్యక్తిత్వం ప్రత్యక్షంగాను, పరోక్షంగాను అత్యంతాల్పంగా ఉన్నా, అసంపూర్ణత్వం, విశృంఖలత్వం ఎక్కువగా లేకపోయినా, రచయితకు చదువరులతో సంబంధం కాని, రచనలో హాస్యంకాని లేకపోయినా, కొంతవరకు సృజన గుణంతో అవి శాలమై, వచన రచనలై, ఏక విషయ వివరణం కలవై ఉన్న ఈ సంగ్రహములు వ్యాసాలుగా స్వీకరింపవచ్చు. ఆంగ్లంలోని వ్యాసం వంటిది ఆంధ్రంలో వ్రాయాలని, వ్యాస ధర్మ మయిన సంగ్రహత్వం మాత్రమే గ్రహించి ఎస్సేకి వ్యాసం పేరుకాని, ఉపన్యాసం పేరు కాని అప్పటికి ప్రసిద్ధం కాకపోవడంతో, తను గ్రహించిన ధర్మంతో 'సంగ్రహము'గా పేర్కొంటూ, రచయిత ఈ రచనా కృషి సాగించినట్లు భావింపవచ్చు. ఈ 'సంగ్రహము'లు ఆంగ్లంలోని ఎస్సేల వంటివే అనే అభిప్రాయముండి వుండవచ్చు.

సరళ గ్రాంధికంగా ఉన్న ఈ వచన రచనలు పరిమితిలో మిక్కిలి చిన్నవి. ఇవి విశాఖపట్టణంలో ముద్రితాలు. ఈ సంగ్రహాలు పుట పరిమితి 4 '' X 3 '' సంగ్రహాలు ఆరు పుటలు మొదలుకొని, 20 పుటలు వరకు న్నాయి. అధిక సంగ్రహాలలో మేలు పదంతో రచన మొదలయింది. ''మేలు సెందుట'', ''మేలు జెందుట'', ''మేలు గోరు వారలు'', ''మేలు సెందుట'', ''మేలుఁ జెందం గోరుట'' వంటి పదాలతో సంగ్రహములు ఆరంభముంది. సంగ్రహం ప్రారంభంలో ఆ శీర్షిక వివరణం ఉంది. ''మేలుఁగోరు వారలు వేద విహిత కర్మంబులంజేయుచో నుచ్చరించు మంత్రముల సంబోధ్యులై, వారలవి యథావిధిగాఁ జేయుచో వారల యుద్దేశ్య ఫలంబులం గలిగించు తలంపుగలవారు దేవతలనంబడుదురు.'' (దేవతా సంగ్రహము పుట-1)

విషయ బోధ ప్రధాన కార్యంగా సంగ్రహ రచన జరిగింది. విషయ వివరణం సమర్థంగా ఉంది. ఇవి ప్రాచీనతా విధేయంగా భక్తి సహితంగా ఉన్నాయి. విషయం, రచనం మత సంబంధిగా ఉన్నాయి. సంగ్రహం ముగింపు శుభవాంఛా సహితంగా ఉంది. చిట్టచివర ''ఇది పరవస్తు వేంకట రంగాచార్యు లయ్య వారలుఁగారిచే రచింపబడిన'' దని వుంది. తుదకు సంగ్రహం పేరుంది.

తమిళనాడు స్టేటు ఆర్కైవ్స్ కేటలాగులో పుస్తకాలుగా ఉండి ఏడు లభ్య మవుతున్నాయి.

**శాఖా సంగ్రహము** : ఇది వేదాల విభజన అంతర్విభజనలను వివరిస్తూ వుంది. "చరకులు, ఆహ్వరకులు, కరులు, ప్రాచ్యకరులు, కపిష్ఠల కరులు, ఔప మన్యష్ఠల కరులును, చారాయణీయులు, నారాయణీయులు, వార మత వేయులును, శ్వేతులును, శ్వేతతరులును, మైత్రాయణీయులునని చరకులు పంద్రెండు శాఖల వారయిరి." (పుటలు 3,4). ఈ విధంగా విభజన వివరాలీ వ్యాసంలో ఉన్నాయి.

ముక్తి సంగ్రహము : ఇది ముక్తిని వివరించింది. "ఏ మేలొనగూడిన నెన్నడుంగీడు రానవకాశంబు గలుగదో, అది అన్నిటికి నెక్కుడయిన మేలు. అదియే పరమార్థము ముక్తి మోక్షము అపవర్గము అమృతము నిశ్రేయసము నిర్వాణము ఇత్యాది శబ్దములం జెప్పబడును." (పుట 20)

కర్మ సంగ్రహము : ఇది యజ్ఞాలలో పశుబలిని గూర్చి తెలిపింది. ఆ పశుహింస, హింసగా కనిపిస్తుంది కాని నిజంగా హింస కాదనేది ప్రధాన వాదం. "ఇట్లు యజ్ఞ దాన తపః ప్రభృతలగు సత్కర్మములు సేయుచుండుట యన్ని విధములను శ్రేయస్కరము" (పుట 6)

కాలసంగ్రహముః ఇది కాలధర్మం కాలమానం వివరించింది. "ఒక వస్తువు మరియొక్క వస్తువు కంటెను వేఱుగా నెఱుంగుటయు, నొక్క వస్తువు లోని యంశములనే వేఱువేఱుగా నెఱుంగుటయు వివేకము." (పుట 1)

దేవతా సంగ్రహముః ఇది హిందువులు భిన్న దేవతల నారాధిస్తున్నారనే అపవాద నివారణార్థం తెలుపబడింది. "ఇట్లు మనవార లేక దేవుని పరిక రంబులే యితర దేవతలని యెఱింగిసపరికరుండగు దేవుని నారాధింపుచున్నారని యెఱుంగక బహు దేవతల నారాధింపుచున్నారనియు, నొక్క దేవుని నెఱుంగ రనియుంజెప్పుట యిట్లు చెప్పు వారలట్లే యనేక విషయంబులం దత్త్వం బెఱుం గక చెప్పుదురనుటకు నిదర్శనము" (పుట 12). "ఇట్లు దేవతలు లెక్కలేకున్నను ముప్పది మూడు కోటులని లెక్క చెప్పుట యధికారముల సంఖ్యలం జెప్పుట కాని వ్యక్తి సంఖ్యం జెప్పుట కాదు" (పుట 16) అని దేవతాస్థితి వివరించటం గమనింపవచ్చు.

ముక్తిమార్గ సంగ్రహము: ఇది ముక్తి పొందే మార్గం తెలిపింది. "మేలు సెందుట యందఱుం గోరునది. అది కాల తారతమ్యంబునం బెక్కు విధంబులయి యుండును. అందెన్నటికిం జెడని మేలు ముక్తియనంబడును." (పుట 1.)

స్మృతి సంగ్రహము: ఇది స్మృతులంటే ఏమిటో వివరించింది. శిష్యులు ప్రశ్నిస్తే ఋషులిచ్చిన జవాబులే స్మృతులు అనటం గమనింపవచ్చు. "వేద మున వెదుక వలసిన యర్థముల సులభముగాఁ దెలుపుటచే స్మృతియును ధర్మ మునకు ముఖ్య ప్రమాణ మనబడుచున్నది." (పుట 1)

పరవస్తు వేంకట రంగాచార్యులు జంతు హింస యజ్ఞాలలో అంగీకరించి, తన వ్యక్తిత్వం మీద ఉన్న ప్రాచీనతా ముద్రను ప్రదర్శించిన భాగం చూడ వచ్చు. "అవి పశువులకుం దత్కాలమున హింసారూపంబులట్లు కానవచ్చిన ఉత్తర జన్మంబులు నుత్తర లోకములు నొసంగు గాన వైద్యుడు సేయు శస్త్ర సాధనములవలె శుభోదర్కములు గాన నధర్మకరములు గావు. అందుకు బదులుగా ధర్మంబులే యగును." (కర్మ సంగ్రహము-పుటలు 5,6)

వ్యాసకర్త ఈ వ్యాసాలలో ప్రదర్శించిన వ్యక్తిత్వంలో సంప్రదాయాన్ని శంకించే అంశం గమనింపవచ్చు. "ప్రశ్నములు నుత్తరములును వాక్య రూపము లగుట సహజము. గాని యప్పటికప్పుడు వారు శ్లోక రూపములగు వాక్యములు ప్రశ్నములు సేయుచుండిరనియు శ్లోకరూపములగు నుత్తరంబుల ఋషులు సెప్పిరనియు నమ్ముటకర్హంబై యుండలేదు." (స్మృతి సంగ్రహము-పుట. 3)

పరిమిత పరిధి నుంచి పరికిస్తే పరవస్తు వేంకట రంగాచార్యుల 'సంగ్ర హము'లు వ్యాసాలు. వీటిలో విషయం పూర్తిగా మత సంబంధి. ఈ వ్యాస రచనలో సంక్షిప్తత స్పష్టత వివరణ కలగలుపుగా ఉన్నాయి. ప్రారంభంలో వ్యాసం వేసిన చిట్టిపొట్టి అడుగులుగా వీటిని గ్రహింపవచ్చు.

## 3. వచన కావ్యము-స్త్రీ కళా కల్లోలిని (1876)

### జియ్యరు సూరి

జియ్యరు సూరి రచించిన స్త్రీ కళా కల్లోలిని 10.10.1876 న ముద్రిత మయిన మూడు భాగాల గ్రంథం. ఇందులో పద్య శీర్షికలున్న స్త్రీ నీతి (ప్రథమభాగం) 40 పుటలు, స్త్రీ విద్యావశ్యకాన్ని వివరించే స్త్రీ విద్యామణి

(ద్వితీయ భాగం) 164 పుటలు, స్త్రీ పురుష ప్రవర్తన తెలిపే స్త్రీ మానము (తృతీయ భాగం) 71 పుటలు వ్యాపించాయి. రెండవ భాగంలో 69, మూడవ భాగంలో 25 మొత్తం 94 వచన రచనలున్నాయి.

బెంగళూరి పదాతి పటాలపు బాలికా పాఠశాల ప్రధానోపాధ్యాయ పదవిలో ఉన్న జియ్యరుసూరి ఇటువంటి గ్రంథాలు తెలుగులో లేని లోపం తీర్చటం కోసం వ్రాసినట్లు పీఠికలో తెలిపాడు. ఇది బాలికా పాఠశాల కుద్దేశింపబడినప్పటికీ ''ఇంకను మౌఢ్యముచే నాచరింపఁబడి స్త్రీలు చదువఁ గూడదను మొఱకు పట్టు గల పురుషుల పొరపాటును దగు మాత్రముగాఁ దొలఁగించుననియు దేశాభిమానము గల పుణ్యవానుల యాదరణ వడయుననియు'' ఆశించాడు.

ఆంగ్లం, తమిళంలో ఉన్న గ్రంథాల నుంచి, వ్యాసాల నుంచి విషయం గ్రహించి, ఈ గ్రంథ రచన చేశాడు. ఇది ప్రత్యేకంగా స్త్రీల కోసం ఉద్దిష్టమయింది. అందువల్ల ఆయా రచనలలోని మేలి గుణాలు రచయిత అనుభూత్యాలోచనల నుంచి అవతరించాయి.

వ్యాసమనో, ఉపన్యాసమనో, రచయిత ఈ ప్రక్రియను పేర్కోలేదు కాని, ఈ రచనలు ఆంగ్లంలోని ఎస్సేల వంటివని స్పష్టంగా తెలుసు. ఈ గ్రంథంలో రచయిత రెండు పీఠికలు ఆంగ్లాంధ్రాలలో వ్రాయటం చూడవచ్చు. ఈ ప్రక్రియను రచయిత గ్రంథమనీ, వచన కావ్యమనీ భావించటం తెలుసుకోవచ్చు. రచయిత ఉద్దేశంలో గ్రంథమంటే వ్యాసమే అని ఈ పీఠికల వల్ల స్పష్టమవుతుంది. "It has been rendered in a suitable Telugu style, the matter having been selected from essays and writings of several Tamil authors, and one has been taken to avoid all disputed religious points with a view to its being used by all classes of native'' (ఆంగ్లపీఠిక)

దీనికి తుల్యంగా ఎస్సే అన్నచోట గ్రంథం అనటం తెలుగు పీఠికలో గోచరమవుతుంది. ''... తెనుఁగున బాలికా పాఠశాలలకుపయుక్తములగు గ్రంథములు లేకుండుటంజేసియు నిక్కొఱంతను దొలగింపుటకై యుక్త ప్రమాణములచే విరచింపఁబడియున్న ద్రావిడ గ్రంథములనుండి సర్వ

మత సమ్మత మగునట్టుగా నీ గ్రంథము సులభశైలితో'' వ్రాసినట్లు తెలపటంతో ఎస్సె పదానికి స్థూలంగా గ్రంథమని రచయిత గ్రహించినట్లు అనిపించింది. అయితే, గ్రంథం విస్తృతార్థంలో ప్రయోగింపవచ్చు కాబట్టి, ఈ ప్రత్యేక రచనలకు ప్రక్రియను తెలిపేటట్లుగా 'వచన కావ్యము' అనటం ఉచితంగా గుర్తించాడు. ఎస్సెకున్న సృజన ధర్మం వ్యక్తం చేస్తున్నట్లుగా ఈ పదం ఉంది. ఇది ఈ రచనలో అనేక పర్యాయాలు ప్రయుక్తమయింది. ''ఈ వచన కావ్యమున బహుస్థలముల యందును బ్రస్తాపింపఁబడి యుండుటం జేసి యది మరల వచింపక దానితో సంబంధించిన కొన్ని విషయములు మాత్రము సంక్షేపముగా నెత్తిచెప్పుట చాలునని దోచుచున్నది.'' (పుట 158) ఈ వచన రచనలకు ''వచన కావ్యము'' అనటం రచయిత ఉద్దేశం కావటం వల్ల ఎస్సె పదానికి వచన కావ్యము అనువాదంగా భావించినట్లు స్పష్టమవుతుంది. వ్యాస ప్రక్రియకు ప్రధానమయిన సృజన గుణం, వచన కావ్యం అనటం వల్ల కావ్య పదం కారణంగా కొంతవరకు సిద్ధించింది. ఆంగ్లంలోనూ వ్యాసం కొంత కవితా ధర్మ ప్రదర్శకంగా భావించినట్లు గుర్తింపవచ్చు. ''The eassy... as a literary form, resembles the lyric, in so far as it is moulded by some central mood–whimsical, serious or satrical'' (4)

4. వ్యాసానికి స్పష్టంగా పేరు తెలుగులో సిద్ధం కానప్పుడు దాని గుణం చాలా వివరంగా తెలిపే పేరు పెట్టటానికి జియ్యరు సూరి ప్రయత్నించటం ప్రశంసా పూర్వకంగా గ్రహింపవచ్చు. ప్రమేయం కాని, సంగ్రహం కాని ఆయా రచయితలు వ్యాసతుల్యంగా భావించినట్లు స్పష్టంగా చెప్పే అవకాశం లేదుకాని, వచన కావ్యం మాత్రం ఎస్సెకి అనువాదంగా స్వీకరించినట్లు విస్పష్టంగా గ్రహింపవచ్చు. ఆంగ్లవ్యాస లక్షణాలు పూర్తిగా వర్తించేటట్లున్న ఇటువంటి వ్యాసాలు ఈ సంపుటికి పూర్వం లేవు. ఆంగ్లంలోని వ్యాస రచనా విధానం అన్ని అందాలా ఆంధ్రంలోకి తేవాలని ప్రయత్నించిన జియ్యరు సూరి సమర్థమయిన కృషి ఫలితాలు ఈ వ్యాసాలు.

ఈ వ్యాస వచనం ఉత్తమంగా ఉంది. ఈ వ్యాస రచనా కాలంలో చిన్నయ సూరి నీతిచంద్రిక వచనం వంటిదే సర్వసామాన్యమయి ప్రచారంలో

ఉంది. అనంతర కాలంలో ఉత్తమ వచన నిర్మాత అయి, గద్య తిక్కనగా రూపొందిన కందుకూరి వీరేశలింగం పంతులు ఈ కాలంలో చిన్నయసూరి వచన మార్గంలో రచనకావిస్తూ వున్నాడు. ఈ సమయంలో ఈ మహా ప్రవాహంలో పడి కొట్టుకుపోకుండా మిక్కిలి సులభశైలిలో వచన రచన కావించిన జియ్యరు సూరి భాషా విషయికంగానూ సాధించిన అభ్యుదయం గుర్తింపవలసిందే !

ఈ రచయిత వచనంలో స్పష్టత, సంక్షిప్తత బలమైన రచనారీతులు. మారుమూల పదాలే కాదు- పదాడంబరం, అన్వయ క్లిష్టం, డొంక తిరుగుడు వాక్యాలు మచ్చుకైనా కానరావు. భాష వ్యావహారిక దశకు చేరువయిన గ్రాంధికంగా వుంది. బాలికలకు, ఎక్కువగా చదువురాని స్త్రీలకు ఈ వచన కావ్యం ఉద్దిష్టం కావటంతో మిక్కిలి సులభంగా వ్రాయబడి, భాషాప్రయోజనం రచనావసరం తీర్చినట్లు అయింది.

ఈ వ్యాసాలు మిక్కిలి సంగ్రహంగా ఉన్నాయి. ఇందులో పెద్ద వ్యాసం ఎనిమిది పుటలు చిన్న వ్యాసం అరపుట పరిమితిలో ఒదిగి ఉన్నాయి. సాధారణంగా వ్యాసాలన్నీ ఒకటీ, రెండూ పుటల పరిమితిలోనే ఉన్నాయి. ఆంగ్లంలో బేకన్ వ్యాసాలకుండే పరిమితి ఈ వ్యాసాలకుంది.

వివరింప దలచిన అంశం విస్తృతంగా చెప్పటానికి ఎన్నో అన్య విషయాలు ఉపబలకంగా గ్రహించాడు. ప్రధానాంశ సంబంధి భిన్న విషయ ప్రసక్తి ప్రతి వ్యాసంలోనూ ప్రత్యక్షమవుతుంది.

రచయిత మిత్రుడిలాగా, శ్రేయంకోరే గురువులాగా, ప్రతి వ్యాసంలోనూ పాఠకులతో ముచ్చటించటం కనిపిస్తుంది. రచయితను చదువరులు ఆత్మీయుడుగా గ్రహించి, పుస్తకం చదువుతున్నంతసేపు ఆంతరంగికుడుగా, హృదయం విప్పి చెప్పుకొన్నట్లు తృప్తి పొందుతారు. మనము, మనకు, మనకొఱకు అని రచయిత ఆలోచిస్తున్నప్పుడు, పాఠకుల్లో తాదాత్మ్యం కలుగుతుంది. ''ఈ పుస్తకమును వ్రాయ మనము నుండజాలము'' (పుట 188) అన్నప్పుడు పూర్తిగా నేను అనవలసినచోట కూడా మనము అనటం, కొంతవరకు కన్నడ భాషా ప్రధానమయినా, రచయిత అభీష్టం వ్యక్తం కావిస్తుంది.

పరిహాస కుశలత్వం అన్ని వ్యాసాలలో అంతర్వాహిని. చదువురాని మూర్ఖత్వం తెలిపే ప్రత్యంశం జాలి నుంచి పుట్టే హాస్యం దర్శిస్తుంది. దాతల గూర్చి చెబుతూ ''సంబళము పుచ్చుకొని వంటచేసి పెట్టెడు పాచకులు నన్న ప్రదాతలే ... వేశ్యలకు ద్రవ్య మొసగెడు కామాతురులును దాతలే!'' (పుట 185) అన్నప్పుడు చిరునవ్వు పుట్టక మానదు. పరిహాస కుశలత్వం పరికించిన తావులు ఈ వ్యాసాలలో అనేకం.

స్త్రీ కళాకల్లోలిని లోని వ్యాసాలు అన్నీ రచయిత ఆవేదన నుంచి, హృదయ వ్యధ నుంచి పుట్టాయి. ఈ రచనలో కృషి కంటే తపన ఎక్కువ. ఈ వ్యాసాలు విమర్శనంగా కంటే కథగా, కవితగా సృజన ధర్మం ప్రదర్శించి, చదువరులకు ఆనంద సంపాదకాలు అయ్యాయి. ఈ వ్యాసాలలో ప్రతిపదం రచయిత గుండె నుంచి ఊటజలంలా ఉబికి ప్రాణం పోసుకొని నర్తించింది. పరిపూర్ణ సృజన ధర్మ ప్రతిష్ఠితాలయిన ఈ వచన రచనలు ఆరంభంలో అవతరించిన ఉత్తమ వ్యాసాలు.

ఈ సంపుటిలోని ఏ వ్యాసమూ సంపూర్ణం కాదు. ఒక్క విషయం అనేక వ్యాసాలలో ఆలోచనకు గురి అయింది. ప్రతి వ్యాసంలోనూ రచయిత బాధ ఆకర్ష రూపం పొందింది. స్త్రీకి విద్య అవసరం అన్న అంశం దాదాపు ఇరవై వ్యాసాలుగా రూపొందింది.

ఈ వ్యాసాలు మొదటి నుంచి చివరిదాకా ప్రతి పదంలోను, ప్రత్యక్షరం లోను రచయితను ప్రత్యక్షంగా నిలిపాయి. ప్రతి వ్యాసాంశం రచయిత అనుభూతి నుంచి అవతరించింది. స్త్రీ విద్య, స్త్రీ అభ్యుదయం, స్త్రీ భవిష్యత్తు, లోక శ్రేయం, సంఘౌన్నత్యం, పురుషులు స్త్రీల పట్ల ప్రవర్తించవలసిన తీరు, అన్ని అంశాలూ రచయిత అనే మూసలోంచి, ఆ రంగు, ఆ రూపం పొంది అవతరించాయి. రచయిత కోపం, మంచితనం, వాదన, ఆవేదన, వాంఛ, దుఃఖం-విభిన్న లక్షణాలు - ప్రతిక్షణం వ్యాసాలలో ఎదురవుతున్నాయి. ఈ లోకం, ఈ మనుష్యులు, ఈ జీవితం బాగుపడాలన్న కాంక్ష ప్రత్యక్షరంలో ప్రత్యక్షమవుతుంది. రచయితకున్న ఈ వాంఛ ఈ వ్యాస సృష్టివరకే, సాహిత్యంవరకే పరిమితమయి ఉండదు. జీవితంలో ప్రవేశించి ఉంటుంది, సంఘ సంస్కరణం చేసి ఉండవచ్చు, కనీసం ప్రయత్నమయినా జరిగి వుండవచ్చు, అన్నంత

బలంగా వ్యాససృష్టి కనిపించింది. రచయిత సంఘ సంస్కరణ కృషి వివరించే, బలపరిచే ఆధారాలు లభించవలసి వున్నాయి.

ఈ వ్యాస సంపుటిలో ప్రత్యేకంగా కనిపించే లక్షణాలు పరికించటం అవసరమే. ఒక విషయంలో భాగమయిన చిన్న విషయం వ్యాస విషయంగా గ్రహించటం గుర్తింపవచ్చు. స్త్రీ విద్య ప్రధానాంశమయితే, అందులో అతి స్వల్ప భాగాలయిన ''విద్యాలంకారమే యలంకారము'' "విద్యయే నేత్రము'' అన్న వాటిని ప్రత్యేక వ్యాస విషయాలుగా గ్రహించి సమర్థంగా వ్యాస సృష్టి కావించటం పరికింపవచ్చు.

ఒక విషయం కాని, అవాంతర విషయం కాని, విస్పష్టంగా వివరించటానికి వీలయినంతవరకు కథనుగాని కథలనుగాని వ్రాశాడు. ఈ విధంగా వ్రాయటం ఈ సంపుటిలో విస్తృతంగానే వుంది.

వ్యాస శీర్షిక ఒకటి రెండు పదాలుగాగాక ఎక్కువగా, వాక్యంగా కూడా వుంది. ''స్త్రీలకు విద్య యావశ్యకము'', ''చదివిన వారికిని చదువని వారికిని గల భేదము" వంటి పెద్ద శీర్షికలు వాక్యాలుగానూ ఉన్నాయి.

ప్రతి వ్యాస శీర్షిక మొదట ఆంగ్లంలోనూ ఆ క్రింద బ్రాకెట్టులో తెలుగులోనూ ఉంది. Education cannot make them debauced-విద్య స్త్రీలను జెఱుపదు, Education is requisite to know God - భగవంతునరయు విద్యవలయు అని ఉన్నాయి. ఆంధ్రం రాని ఆంగ్లేయులు ఆ గ్రంథ విషయం గ్రహించటానికి ఈ ద్విభాషా శీర్షికలుంచి ఉండవచ్చు. అయితే కొన్నిచోట్ల ఆంగ్ల శీర్షికకు ఆంధ్రానికి పొంతన కుదరటం లేదు. మరికొన్ని తావుల్లో శీర్షిక ఒకటి, విషయం మరొకటిగానూ వ్యాసాలు న్నాయి. అనువాద రచనలు అనుకొనే అవకాశం లేకపోగా, ఆంగ్లంలో ఈబడిన శీర్షికలకు అనుగుణంగా వ్యాసాలు వ్రాయవలసిన అవసరం ఏమయినా రచయితకు ఏర్పడి వుంటుందేమో ! లేకపోతే ఆంగ్ల శీర్షిక ముందుగా నిర్ణయించుకొని, ఆపైన తెలుగు శీర్షిక ఏర్పరచి, వ్యాసం వ్రాయటం జరిగిందేమో ! ఏమయినా Hating the follower of other than his own religion అనే దానికి మకుటానువాదం ''మత ద్వేషము''. దీనిలో విషయం వ్యక్తిగత కక్ష.

స్త్రీ కళాకల్లోలినిలోని వ్యాసాలు ప్రధానంగా స్త్రీజ్యాత్యుద్ధరణార్థం ఉద్దిష్టాల య్యాయి. ఇందులో స్త్రీ విద్య, పాతివ్రత్యం, గౌరవం విస్పష్టంగా తెలపటం జరిగింది. స్త్రీ విద్య సాంఘిక ప్రయోజనంగా గుర్తించటం శ్రేయస్కరం. విద్య స్త్రీకి భగవంతుణ్ణి, లోకాన్ని చూపి మేలు చేస్తుంది. పూర్వం విద్యావంతులు న్నట్లు ఆధారాలున్నాయి కాబట్టి స్త్రీ విద్య సంప్రదాయ విరుద్ధం కాదు. విద్యా లంకారం నేత్రంగా ఉన్న స్త్రీలు పురుషులతో సమానంగా ప్రకాశిస్తారు, భర్తకు బిడ్డలకు ఉపయోగపడతారు. స్త్రీ అవిద్యావతి అయితే కాలం విలువ గుర్తించ లేదు, పాతివ్రత్యం రక్షించుకోలేదు, తన వాళ్ళకూ తనకూ కాకుండా పోతుంది. చదువులేని స్త్రీతో భర్త బాధలు పడతాడు. భర్త చెడిపోతాడు. పిల్లలు పాడయి పోతారు. ఇటువంటి అనేక విషయాలు అమూల్య సంగతులు స్త్రీ విద్యావిషయి కంగా జియ్యరుసూరి ఈ 'వచన కావ్యము'లో తెలిపాడు.

స్త్రీకి పాతివ్రత్యమే జీవితమని తెలిపే వ్యాసాలీ సంపుటిలో అనేకం. స్త్రీ మూర్ఖురాలయితే దాంపత్యం నరకప్రాయమని, పతివ్రతకు భర్తే భాగ్యమని, పుణ్యవతి లోకోపకారిణి అని, స్త్రీ దుర్గుణాలు కుటుంబ బాధాకారకాలనీ, పాతి వ్రత్యం సృష్టి శ్రేయమనీ, అది లేకపోవటం లోకనాశన హేతువనీ, బహు ధర్మాలు పాతివ్రత్య సంబంధిగా వ్యాసకర్త తెలిపాడు.

ఈ వ్యాస సంపుటిలో స్త్రీకి గౌరవం పురుషులు సముచితంగా ఇవ్వటం న్యాయమని తెలిపే భాగం 'స్త్రీమానము'. స్త్రీ దుఃఖిస్తే అశుభం, అత్తల ఆరక్ష్య అసహ్యం, స్త్రీ పురుషులు ఒక్కటే శరీరం, వివాహం స్త్రీకి గౌరవం, స్త్రీని అవమానించడం అవివేకం, స్త్రీల కష్టాలు శాస్త్ర విరుద్ధాలు, స్త్రీగౌరవం శాస్త్ర సమ్మతం, పురుషులు వ్యభిచరించటం, స్త్రీని అగౌరవించడం, స్త్రీలు పురుష గౌరవాదర్శాలు, స్త్రీని కొట్టటం తిట్టటం పాశవిక పద్ధతులు, స్త్రీ రక్షణార్థం, స్త్రీ ధనం ప్రత్యేకంగా ఉండాలి, వితంతు స్త్రీకి దుర్భర పరిస్థితులు అన్యాయం, కన్యాశుల్కం కష్టభూయిష్ఠం, బాల్య వివాహం సాంఘిక నేరం, స్త్రీ పురుషులతో సమానంగా విద్యార్జనం చేయవచ్చు, ముఖ్యంగా వేదాంత పాక సంగీత వైద్య శాస్త్రాలు అభ్యసింపవచ్చునంటూ ఈ భాగంలోని వ్యాసాలలో అనేకామూల్య విషయాలు రచయిత వ్యక్తీకరించాడు.

విద్యా విషయికాలు: విద్య ఆరోగ్యం కోసం అవసరం. విద్య అలంకారం, ఆస్తి. విద్య ఔన్నత్యం ఆధిక్యం కలిగిస్తుంది. విద్యావంతుడికి లోకమే పుస్తకం,

విద్యార్జనలో వ్యయం చేసిన కాలం సంపాదించిన డబ్బు వంటిది. సముచిత పుస్తక పఠనం లాభదాయకం. బాల్యమే విద్యకుచిత సమయం. అటువంటి అభిప్రాయాలు ఈ వ్యాసాలలో వ్యక్తమయ్యాయి.

దైవ విషయికాలు : భగవంతుడి స్వరూపంకంటే స్వభావం తెలుసుకోవాలి. సర్వసృష్టి మానవుడికి బానిస, పంచభూతాలు ప్రాణికోటికి పరిచర్య చేస్తున్నాయి. మనిషికి అవసరమయిన సర్వ వస్తువులు భగవంతుడి కృపవల్లనే లభిస్తున్నాయి. లోక కుటుంబానికి యజమాని దేవుడు. ఇత్యాది దైవిక సంగతులు బాలికలు తెలుసుకోవాలని రచయిత కాంక్ష.

సంఘ విషయికాలు : సంఘంలో జనమంతా సమానులు. పుణ్యోపదేశంలో దుష్టులను, శిష్టులను వేరుగా చూడవచ్చు. ఉత్తమ గుణవంతులు లోక రంజకులుగా ఉండాలి. దుర్గుణం అసహ్యించుకోబడాలి. పాపకార్యాలు పరిత్యజించి పుణ్యకార్యాలు చేయాలి. దుష్టులు వాళ్ళ దుర్గుణంవల్ల శిక్ష పొందుతారు. పవిత్రుల పవిత్రతే వాళ్ళకు సన్మానమవుతుంది ఇహలోక సంపద తృణప్రాయం, అజ్ఞానం కృత్రిమ జ్ఞానం ప్రమాదకారకాలు. ప్రవహించే కాలంలో ప్రపంచం నాటకమాడుతుంది. పాపమే శత్రువు. ప్రత్యంశంలో దేవుడున్నాడు. కారుణ్యం ప్రాణి ధర్మం. ప్రపంచ ధర్మ సత్రంలో బీదలు నిరాహారులు కారాదు. పరోపకారం లేని జన్మ వ్యర్థం, మత ద్వేషం మూర్ఖత్వం చిహ్నం. అర్హతకు తగిన దానం చేయాలి. స్త్రీ పురుషులు, సంఘంలో సమర్థంగా జీవించటానికి తగినంతగా సంఘ విషయాలు తెలుసుకోవాలన్న రచయిత అభీష్టం నుంచి అనేక ధార్మిక లక్షణాలు వ్యక్తమయ్యాయి.

రచనా విధానం : అనేక శీర్షికా విస్తృతమయిన ఈ సంపుటిలో రచనారీతి పరికింప దగింది. ఏ వ్యాసం చూచినా స్పష్టత సంక్షిప్తత ఈ రచనకు ప్రధానాంగాలుగా కనిపించాయి. ఈ వ్యాస భాషలో ప్రశంసనీయగుణం సౌలభ్యం. పదవిషయికంగా, వాక్యగతంగా, ఆలోచనా సంబంధిగా ఈ సౌలభ్యం లోపించ లేదు. భాష ఇంత ఆధునికంగా అప్పుడు ప్రయుక్తం కావటం హర్షదాయకం.

ఈ వ్యాసాలు బాలికలకు స్త్రీలకు ఉద్దిష్టాలు అవటంవల్ల స్పష్టంగా అర్థం కావాలని, ఎక్కువగా ఉపమాలంకారశోభితంగా లోకోక్తిమయంగా రూపొందాయి. ఇందుకీ రీతి బాగా ఉపకరించింది. వాక్య విన్యాసంలో బాగరూకత గమనార్హంగా వుంది. పెద్ద వాక్యంలో అన్వయ సౌందర్యం పెరిగి, చిన్న

వాక్యంలో స్వయం సంపూర్ణత సిద్ధించి, భాష బలంగా ప్రయుక్తమయింది. తదనంతర వ్యాసకర్తలు అనుసరింపదగ్గ వాక్య విన్యాసాలు, వైఖరులు ఈ వ్యాసాలలో చూడవచ్చు.

ఈ రచయిత శబ్దానికి చెవి యొగ్గిన భాషా వేత్త. శబ్దసమత-లయ కలిసివచ్చిన సన్నివేశాలనేకం. భాషాతత్త్వం బాగా గుర్తించిన, కవితా గుణం నిలుపుకొన్న వచన రచయిత జియ్యరుసూరి. "అతడు శిష్ట రక్షకుడు—దుష్ట శిక్షకుడు, పరమ కృపాకరుడు-సకల శుభంకరుడు, సద్గుణ సింధువు-దీన జన బంధువు, పరమ పవిత్రుడు - భక్తజన మిత్రుడు, సకలనుత చరిత్రుడు-సకల గత విచిత్రుడు" (పుట121) వంటి పదప్రయోగం రచయిత శబ్దదృష్టిని వివరిస్తుంది. "పద హతి ప్రయోగము వినా యభిహిత ప్రయోగము లేదు" (పుట 205) ఒక పదంకాని పదాలుగాని చివర ఉంచుతూ, వాక్య భాగాలు కాని, వాక్యాలు గాని వ్రాయటం రచయితకు సహజ చాతుర్యం అనియు, విడిచి, చెడి మొదలైనవాటితో, పునరుక్తితో వున్న పదాంతాలతో నిర్మాణమైన వాక్యాలు చూడవచ్చు. "తల్లియనియు, పెండ్లామనియు, శుద్ధమనియు, అశుద్ధమనియు భేదము తెలియక యిల్లువిడిచి, వాకిలి విడిచి, గొడ్డులు విడిచి, సొమ్ములు విడిచి, సొత్తులు విడిచి (విడిచి) మానము సెడి, మరియాదయుఁజెడి, మతిచెడి, గతిచెడి (చెడి)...త్రాగు బోతుల మహిమ నేమని చెప్పవచ్చును" (పుట 145) ఇటువంటి రచనా రీతులు అనేకం.

కందుకూరి వీరేశలింగం పంతులు ఈ వ్యాస గత విషయం, రచనా విధానం తన వ్యాసరచనంలో అధికంగా వినియోగించుకోవటం గమనింపవచ్చు. కందుకూరిపై ఉన్నంత ఎక్కువగా జియ్యరు సూరి భాషా భావ ప్రభావం మరెవ్వరి మీదా లేదు. అయితే, రచనా రీతిలో పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు పైన కూడా ఈ ప్రభావం ఉందని గుర్తింపవచ్చు. ఈ విషయం ఆయా వ్యాసకర్తల వ్యాసపరిశీలనంలో గమనింపవచ్చు.

స్త్రీ కళాకల్లోలిని రచయిత జియ్యరు సూరి మేధావి, హృదయవాది. తమిళాంగ్లాలలో వ్యాస లక్షణాలు గుర్తించి ఆంధ్రంలో వర్తింపజేసిన మనీషి. ఈ సంకలనం ఉత్తమ వ్యాస నిలయం. ఈ వ్యాస వచనం తరువాతి వ్యాస కర్తలనుసరించినంత ఉత్తమం. స్త్రీ అభ్యుదయ విషయికంగా ఇంత తీక్షణ

భావాలు ఈ సంపుటిలో తప్ప తత్పూర్వం లేవు. ప్రధానంగా స్త్రీ గతంగా, ఇంకా సంఘం, విద్య, దైవం సంబంధంగా వ్యాసాలు వ్రాసి, మానవ జీవితం సుఖప్రదంగా ఉండాలని, పునీతం కావాలని రచయిత వాంఛించాడు. సంఘ సంస్కర్తకు అవసరమయిన బుద్ధి, హృదయం, పాండిత్యం, అవకాశం ఉన్న జియ్యరుసూరి వ్యాసకర్తగా సాహిత్యానికి ఉత్తమసేవ చేశాడు. 'స్త్రీ కళా కల్లోలిని' వల్ల జియ్యరుసూరి వ్యాస ప్రారంభకర్త్రయంలో పరమేశ్వరుడు.

3- ఉపన్యాసము :

3. కందుకూరి యుగం (1874-1900)

కందుకూరి వీరేశలింగం పంతులే ప్రథమాంధ్ర వ్యాసకర్తగా భావించే వాళ్లు, ఉత్తమ వ్యాసకర్తగా తలంచేవాళ్ళు ఉన్నారు. వ్యాసరచనా విస్తృతిలోనూ ప్రాచుర్యంలోను కందుకూరి ఉన్నతిని సాధించిన వ్యాసకర్తలు లేరు. అనంత రాంధ్ర వాఙ్మయంలో కందుకూరి ప్రభావం అనంతం: వ్యాసం ఉపన్యాసంగా, సారస్వత ప్రక్రియగా తీర్చిదిద్దిన ఖ్యాతి వీరేశలింగం ంపతులు పరమవుతుంది. ఈ యుగంలో సారస్వత శిఖరంగా గోచరమయే ఈ రచయిత, వ్యాస సృష్టిలో అనల్ప కృషిచేశాడు. ఈ వ్యాసకర్త ప్రభావం సమకాలంలోనూ అనంతర కాలంలో పలువురు వ్యాసకర్తల ఆవిర్భావానికి హేతువు అయింది. ఆంధ్ర సారస్వతంలోనే సృజనవ్యాస చక్రవర్తి అయిన కందుకూరి వీరేశలింగం పంతులు ఈయుగకర్తగా గ్రహించటంలో విప్రతిపత్తిలేదు.

1. కందుకూరి వీరేశలింగం పంతులు(1848-1919)

ఈ యుగంలో ప్రధానంగా ఉపన్యాసం ప్రవర్తిల్లింది. వ్యాసంగా తరువాత గుర్తింపబడ్డ ఉపన్యాసం సాంఘిక అవసరంగా ఆవిర్భవించింది. ఉపన్యాసం సారస్వత ప్రక్రియగా రూపొందించిన వ్యక్తి కందుకూరి వీరేశలింగం పంతులు. వ్యాసం విద్యావంతసమాజ సమాజంలో సమర్థంగా ప్రయుక్తమయినట్లు, అంతగా విద్యాజ్ఞానం లేని ఆంధ్ర సమాజంలో ఉపన్యాసం బలవత్తరమైన సాధనంగా ప్రవర్తిల్లింది. సంఘ సంస్కరణ వాంఛకు సముపాయంగా ఉపన్యాసం కనిపించింది. ఒక చోట వాగ్రూపంగా వినిపించిన ఉపన్యాసం మరో చోట లిఖిత రూపంగా వ్యాసంగా కనిపించింది. అందువల్ల ఏక సమయంలో శబ్దరూపంలో, ఉపన్యాసంగా, అక్షర రూపంలో వ్యాసంగా ఒకే రచన గ్రహింపబడింది.

కందుకూరి ఏర్పరచిన మార్గంలో ఉపన్యాసం సాంఘిక పరిణామం కోసం బలమైన ఆయుధంగా ఉన్నట్లు అనేకులు గుర్తించారు. ఈ ప్రక్రియను స్వీకరించి అభిప్రాయ ప్రకటనం చేశారు. ఈ కాలంలో ఏ ప్రక్రియా సాధించలేని సాంఘిక చైతన్యాన్ని ఉపన్యాసం తీసుకువచ్చింది. అందువల్ల ఉపన్యాసం సాంఘికావసరంగా రూపొంది, సంఘ చైతన్య సాధనమయి, సారస్వత ప్రక్రియగా, ఏర్పడింది.

ఆంగ్లంలో వ్యాసం ప్రముఖంగా ముద్రిత రూపమయితే, తెలుగులో ప్రధానంగా ఈ కాలంలో ఉపన్యాసంగా శబ్దరూపంగా నిలిచింది. ఆంగ్లంలోని వ్యాసధర్మం కంటే భిన్నధర్మం కలిగి, భిన్న కార్యం నిర్వహించి, భిన్న రూపం పొంది-తెలుగులో ఉపన్యాసం తెలుగుదనం కలిగింటై, తెలుగు భాషకు నూత్న వ్యక్తిత్వం సముపార్జించింది. ఈ ఉపన్యాసం ప్రధానంగా కందుకూరి వీరేశలింగం పంతులు సృష్టి.

## కందుకూరి ఉపన్యాసములు,

ఆంధ్రజాతి జీవిత ప్రతిబింబంగా, ఆ నాటి ఆశలకూ ఆశయాలకూ నిలువుటద్దంగా, ఆవేశానికి ఆలోచనకు ఆలవాలంగా, సృజన ధర్మశోభితంగా ఉపన్యాసం-ప్రక్రియగా రూపొందించిన కందుకూరి వీరేశలింగం పంతులు ఆధునికాంధ్ర వచన వాఙ్మయ మార్గదర్శి, గద్యతిక్కన, కందుకూరి ఉపన్యాసాలు వేదికల మీద సభలలో గతించి పోలేదు. పత్రికలలో పుస్తకాలలో జీవించి వ్యాసాలుగా నిలిచాయి. ఆంగ్లంనుంచి తెలుగులోకి అవతరించిన ఎస్సె ఈ కాలంలో ఉపన్యాసంగానే సంభావ్యమయింది.

కందుకూరి వీరేశలింగం పంతులు ఉపన్యాసాలు-వివేకవర్ధని మొదటి భాగంలో (1874 నవంబరు-1876 సెప్టెంబరు) 16, రెండవ భాగంలో (1880 ఫిబ్రవరి - 1881 అక్టోబరు) 30, మూడవ భాగంలో (1882మార్చి - 1894 జనవరి) 39, ఉపన్యాసమంజరిలో 21, సతీహిత దేహారోగ్య బోధినిలో (1883 మే-1889 మే) 35, పతీహిత సూచనిలో (1884-89) 5, ధర్మబోధినిలో (1889) 5, ఏడవ సంపుటంలోని వ్యాసాలు (1889) 26 ఇవి ప్రధానంగా పాఠశాలలో ఇచ్చిన ఉపన్యాసాలు. సత్యవాదినిలో (1 4.1906) 10, ఉత్తమ స్త్రీ చరిత్రములు (1880 తర్వాత) 6, దేశీయ మహాసభయు, దాని యుద్దేశములును, స్వదేశ సంస్థాన చరిత్రాదులు, కొక్కొండ వెంకటరత్న కవికృత విగ్రహ తంత్ర విమర్శనము, శంకరాచార్యులు, బసవరాజు గవర్రాజు జీవ చరిత్రము, శ్రీ మాకర్ల సుబ్బారావు నాయుడుగారు (1889) మే 6, మొత్తం 199.

కొక్కొండ వేంకటరత్న కవికృత విగ్రహ తంత్ర విమర్శనము ఎవరో మారుపేరుతో చేసిన విమర్శనం, కందుకూరి సంకలనాలలో చేరి, కందుకూరి రచన అనిపెంచేట్లుంది కాబట్టి ఈ వ్యాసకర్త రచనగా ప్రస్తుతానికి సంభావింపవచ్చు. దేహారోగ్య ధర్మబోధిని రచనలు శాస్త్ర సంబంధి రచనలుగా భావించే అవకాశం ఉందికాని, రచయిత వ్యక్తిత్వ ముద్ర వీటిని వ్యాసాలుగా గ్రహించేట్టు చేస్తుంది. ఉత్తమ స్త్రీ చరిత్రములు, స్వదేశ సంస్థాన చరిత్రాదులు, జీవిత చరిత్రలుగా, సంస్థాన చరిత్రలుగా తలపోయవచ్చు. కాని రచయిత ఆవేదన ఈ రచనలలో నిక్షిప్తమయి ఉండటంవల్ల ఇవి వ్యాసాలుగా స్వీకరింపవలసి వుంది.

వచనం : మన తెలుగు వచన కఠిన పద భూయిష్ఠమై, సంస్కృత సంప్రదాయంలో దీర్ఘ వాక్యయుతమై సమాస సంరంభయుక్తమై, అధికాలంకార సహితమై, శాబ్దికమై ఉండటం వల్ల భాషా ప్రయోజనం సంపూర్ణంగా నెరవేరక ప్రమాదానికి గురికావటం జరిగింది. ''నా లోనే నాలోచించుకొని ముందు వ్రాసెడు పుస్తకములను విగ్రహము వలెఁగాక సుగమములుగా నుండునట్టు వ్రాయ నిశ్చయించుకొని నా యభిప్రాయమును, నా లోపలనే యుంచుకొనక పత్రికా ముఖమునఁ దెలిపితిని'' (స్వీయ చరిత్రము- రెండవభాగము- పుట 156) ఆ పైన చిన్నయసూరిలాగా వచనం వ్రాయటం మానుకొని, తాను విగ్రహంలో వ్రాసిన భాషకంటే సులభంగా భాషను ప్రయోగించాలని నిర్ణయించుకొని భాషను పటిష్ఠంగా ప్రయోగించాడు కందుకూరి. ఈ విధంగా వ్రాయటానికి అప్పటికే సులభంగా తెలుగులో వ్యాసరచన జియ్యరుసూరి నిర్వహించి, సృష్టించిన స్త్రీ కళాకల్లోలిని రచనారీతి కొంతవరకు ప్రోద్బలకమయింది.

తెలుగువచనం ఉపన్యాసాలలో సులభంగా, స్పష్టంగా, సంక్షిప్తంగా ఉండాలనీ ప్రాచీన వచనంలో ఉండే లోపాలను సవరించాలనీ, భాష ప్రాథమికావసరమయిన అభిప్రాయ ప్రకటనం, స్వీకరణ నిరాటంకంగా జరగాలనీ, వర్తమానాంధ్ర వచనం జాతి జీవితంలో భాగం కావాలనీ, ప్రగాఢంగా విశ్వసించిన ఉపన్యాస రచయిత, కందుకూరి వీరేశలింగంపంతులు వచనాన్ని ఆధునికావసరాలకు అనుగుణంగా తీర్చి దిద్దాడు. ఈ ఉపన్యాసంలోని వచనం, పూర్వ మెప్పుడూ చేరని దశ చేరుకొని వాడుక పదాలతో ప్రయుక్తమయి ఔన్నత్యం ఔత్తమ్యం పొందింది.

ఉపన్యాస లక్షణం: కందుకూరి ఉపన్యాసాలు రెండు పుటలు మొదలు కొని ఏభై పుటలు వరకు ఉన్నాయి. కాని సాధారణంగా అయిదారు పుటల ఉప న్యాసాలు, కాకపోతే పదిహేను-ఇరవై పుటలవి అధికంగా ఉన్నాయి. 120 పుటలున్న స్వదేశ సంస్థాన చరిత్రాదులు ఒక్క వ్యాసంగా చూపినా అవి అనేక సంస్థాన చరిత్రలు. ఈ ఉపన్యాసాలలో ఒక్కొక్కటి ఒక్కసారి వినటానికి, ఒక్కసారి చదవటానికి, ఒక్కసారి పత్రికలో ముద్రించటానికి ఉద్దేశింప బడటంతో వ్యాస పరిమితి లక్షణం పాటింపబడింది. ప్రజాళికోసం ఉపన్యాసా లిచ్చి, వ్రాసి, ముద్రించి ఈ వ్యాస ధర్మం పరిపూర్ణంగా నెరవేర్చి, వ్యాస స్రష్టగా ఆంధ్రుల గౌరవం అందుకొన్న సంఘ సంస్కర్త, సాహితీ వేత్త కందుకూరి.

సాంఘిక పరిణామం కోసం సాహిత్యం గ్రహించిన ఈ వ్యాసకర్త హాస్యం సృష్టించటం కంటే వాదించటం చేయవలసి వచ్చింది సంఘ వ్యతి రేకతను జయించటానికి సారస్వత యుద్ధం చేస్తున్న వ్యాసకర్త సాహితీ నాయకత్వం వహించిన వ్యక్తి. మూఢ నమ్మకాలను మూర్ఖ పద్ధతులను ఉప న్యాసాలలో అక్కడక్కడ అవహేళనం చేసినా అది హాస్యంగా సాధించాలన్న దృక్పథం నుంచి అవతరించలేదు. ప్రహసనాల ప్రసక్తి కాదు కానీ, ఉప న్యాసంలో రచయిత హాస్య సృష్టి స్థూలంగా చేయలేదని చెప్పవచ్చు.

సాహితీ వ్యవసాయం నిరంతరం సాగించే రచయిత ఉపన్యాసాలు, ఆంగ్ల సారస్వత ప్రభావం ఆంధ్ర సమాజావసరం కలిసి కదుపగా గుండె క్షేత్రంలో పండించిన విలువైన పంటలు. సాంఘికావసరాలు గుండె తడితే, వాటి ప్రతి ధ్వనులీ వ్యాసాలు. రచయిత ఆలోచన ఆవేదన తపన బాధనుంచి అక్షర రూపంలో ఆవిష్కరణం పొందిన ఈ ఉపన్యాసాలు అక్షరాలా అక్షరాలు. ఈ ఉపన్యాసాలలోని ప్రత్యంశం సృజనమయి ప్రకాశించింది. అధికోదాహరణ బలంతో సాగిన ఉపన్యాసం "ఊకపోగుగా నిస్సారంగా పూర్ణ విమర్శనంగా" కాక సృజనంగా రూపెత్తింది.

"దయ్యములు", "స్త్రీ విద్య", "సత్యము", "అతిబాల్య వివాహము-నిర్బంధ వైధవ్యము", "స్త్రీ పునర్వివాహం" వంటి అనేకాంశాలు పునః పునః పరిశీలనం పొందాయి. ఒక ఉపన్యాసస్థ విషయం భిన్నోపన్యాసాలలో గోచరం కావటం, ఏకాంశంమీద భిన్నాలోచనలు భిన్న రచనల్లో వ్యక్తం కావటం, "పరి

శీలించటం వల్ల ఏ వ్యాసమూ సంపూర్ణంగా సమగ్రంగా ఉన్నట్లు భావించే వీలు లేదు. ఈ ఉపన్యాసాలు అసంపూర్ణంగా ఆంగ్ల వ్యాస ధర్మ సహితంగా ఉన్నాయి. రచయితకు ఒక విషయంలో కలిగిన ఆలోచనలే ఆనాటి ఉపన్యాసంలో ఉంటాయి. కాలాంతరంతో అదే అంశం పునరాలోచన వల్ల నూత్న భావాలతో క్రొత్త ఉపన్యాసంగా అవతరించే అవకాశం ఏర్పడింది.

కందుకూరి వీరేశలింగం పంతులు వ్యక్తిత్వం ఉపన్యాసాలలో కాంతిమంతంగా ప్రకాశిస్తూ వుంది. స్త్రీ పునర్వివాహ విషయంలో గాఢంగా ప్రయత్నిస్తున్న సమయంలో విరోధులు భిన్నంగా ప్రచారం చేస్తుంటే స్త్రీ పునర్వివాహ ప్రవర్తక సమాజ కార్యదర్శిగా విజ్ఞాపనములో "మేము మనః పూర్వకముగా పని చేయుచున్నవారమని నమ్ముడు" అని తీక్షణంగా అభిప్రాయం ప్రకటించటం గుర్తింపవచ్చు. కందుకూరి సాహిత్య సృష్టి కోసం వ్యాసరచన చేస్తే చేసి ఉండవచ్చు కాని, అది ప్రధానం, ప్రముఖం, పరమం అయిన ప్రయోజనం కాదు. సంఘ సంస్కరణం రచయిత ప్రగాఢ వాంఛ. దాని కోసం ఈ సమస్త వాఙ్మయ సృష్టి. అందుచేత ఉపన్యాసాలలో రచయిత వ్యక్తిత్వం అంతర్లీనంగా ఉంది.

సదస్సులను సంబోధించటం, తన ఉద్దేశం వివరించటం ఉపన్యాసాలలో కనిపించింది. నేను, మనం అనటం కంటే ఉత్తమం అయిన వ్యక్తిత్వం సర్వధా ప్రత్యక్షంగా వుంది. వీటిలోంచి రచయిత వ్యక్తిత్వం తొలగించ గలిగితే, వీటి అస్తిత్వం ప్రశ్నింపబడుతుంది. తన గుండె సారం మనశ్శక్తి పీల్చుకొని, తన వ్యక్తిత్వం నుంచి ఆవిర్భవించి నిలిచిన ఈ ఉపన్యాసాలలో ప్రత్యక్షరం రచయితే! తన ఉపన్యాసం తానే అయిన ధన్యజీవి కందుకూరి వీరేశలింగం పంతులు

ఆంగ్ల లక్షణ పరిశీలనం వల్ల ఈ సృష్టి సమగ్రంగా వ్యాసంగా ఉన్నట్లు తెలిసింది. అయితే కందుకూరి వ్యాసాలకే పరిమితంగా రూపొందిన లక్షణాలు పరికింపవచ్చు. వ్యాసం ప్రధానంగా మూడు భాగాలు అనీ ప్రారంభం, ప్రధాన విషయం, ఉపసంహారం అనీ విభజన ఆంగ్లంలో అంతగా లేకపోయినా, తెలుగులో ఈ ఉపన్యాస సృష్టివల్ల ఏర్పడింది. తెలుగుదనం వ్యక్తీకరించే ఈ ఉపన్యాస రచనా విధానం గమనింపవచ్చు

వివేక వర్ధని మొదటి భాగంలోని ఆరంభ వ్యాసాలలో పద్యోదాహరణంతో వ్యాస ప్రారంభ సమాప్తాలున్నాయి. వీటిని వ్యాసాలుగా ఉపన్యాసాలుగా విభజించి చూస్తే, వ్యాసం పత్రికలో ప్రచురించటానికి, ఉపన్యాసం సభలలో చదవటానికి ఉద్దిష్టమయినట్లు గ్రహించి, రెండింటి నిర్మాణంలో తేడాలున్నట్లు తెలుసుకోవచ్చు. ఉపన్యాస ప్రారంభంలో సంబోధన తప్పనిసరిగా ఉంది. ఆ విషయ పూర్వోత్తరాలు, రచయిత కా విషయంతో సంబంధం, అర్హతలు తెలుపుతూ ప్రధాన విషయంతో సంబంధంలేని, సభకు సంబంధించిన సంగతులు ఉన్నాయి. వ్యాసాలకు ఇటువంటి ఆరంభాలు లేవు. వెంటనే ప్రధాన విషయం విశ్లేషించి, వివరించటం ఉంది. పూర్వ విషయం పునః స్మరిస్తూ క్రొత్త విషయంకాని, పూర్వ విషయ భాగం కాని గుర్తుకు తెస్తూ వ్యాసం కొన సాగింది.

పాఠకులకు సభాసదులకు ప్రధానంగా ఉద్దేశించిన వ్యాసం, ఉపన్యాసం అసలు విషయం చర్చించిన తీరులో తేడా గమనించటం అవసరమే! ఉపన్యాసం విస్తృతంగా విశాలంగా వుండి, విషయ విభజన క్రమం కలిగి నిర్మాణం జరిగింది. వ్యాసం చిన్నదిగాను, క్రమంలేని ఆలోచనల రూపంగానూ వుంది. ఉపన్యాసంలో రచయిత ఉపన్యాసకుడి గుణాలు ప్రదర్శిస్తే వ్యాసంలో భిన్న గుణాలుచూపించాడు.

కందుకూరి వీరేశలింగం పంతులు, అనేక విషయాలు ఉపన్యాసంలో వెలువరించాడు. ఇది కాలక్షేపంకోసం కాకపోవటంలో స్పష్టంగా విశదీకరించడం జరిగింది. వ్యాస విషయం బోధిస్తున్న ధోరణిలో రచన సాగింది. ఆంగ్ల సారస్వతం నుంచి గ్రహించిన అంశాలు బాగా అనువాదం పొంది, విషయ బోధన సామర్థ్యం పెంచుకొన్నాయి, పద్యశ్లోకోదాహరణాలు యుక్తి సహితంగా సందర్భశుద్ధితో ప్రయుక్తమయ్యాయి.

ఉపన్యాసోపసంహారం ఆరంభంలో పద్యశ్లోకయుక్తంగా జరిగింది. క్రమక్రమంగా అభ్యర్థనతో హెచ్చరికతో ముగించటం మొదలయింది మళ్ళీ ఆలోచించే సూచనతో అయినా వుంది. వ్యాస సారాంశం కొన్నింటిలో ఉంది. విధ్యర్థకంగానూ, ఆశీరర్థకంగానూవుంది. భగవత్ప్రార్థనతోనూ వుంది.

ఉపన్యాస రచనం : ఉపన్యాస రచనా రీతినిబట్టి 1. వివరణాత్మకాలు 2. విమర్శనాత్మకాలు 3. విజ్ఞాపనాత్మకాలు 4. ఉపదేశాత్మకాలుగా విభజింప

వచ్చు. ఎక్కువ వ్యాసాలు వివరణాత్మకంగా ఉన్నాయి. నూత్నభావబోధ ప్రధానకార్యంగా నిర్వహించిన రచయిత వివరణం చేయవలసి వచ్చింది. ఈ ఉపన్యాసాలలో 169 వివరణార్థం రూపొందాయి. ఈ వ్యాసాలలో విషయ విభజనంపట్ల ప్రధాన దృష్టి వుంది.

విమర్శన వ్యాసాలు మొత్తం 21 మాత్రమే! ఆంధ్ర జన జీవితంలో ఉన్న అనేకానేక మౌఢ్యాల మీద కశాఘాతాలీ వ్యాసాలు. ఇవి లోపాలు ఎత్తిచూపి, సవరించే మార్గం తెలిపి, భిన్న విషయ గతంగా సాగాయి. సంఘ సంస్కరణకు వివరణ వ్యాసాలుగా విమర్శన వ్యాసాలు కూడా ప్రయోజన కరంగా ఉన్నాయి. విమర్శన వ్యాసంలో ఫలితం కంఠోక్తిగా చెబితే, వివరణ వ్యాసంలో వ్యంగ్యంగా చెప్పటం జరిగింది. వివరణ వ్యాసంలో రచయిత పాఠ కుడితో కలిసి ఆలోచిస్తుంటే విమర్శన వ్యాసంలో చదువరి దూరమవుతూ వున్నాడు. అందువల్ల విమర్శన వ్యాసం అద్వైతమయితే, వివరణ వ్యాసం ద్వైతం. వివరణ వ్యాసం చదువరి గుండెకు చేరువయితే, విమర్శన వ్యాసం బుద్ధికి సమీపం. వివరణ వ్యాసాలకున్న హృదయ ప్రాధాన్యం వల్ల అవి అధికంగాసృజింపబడ్డాయి. ఈ కాలంలో స్వల్పారంభం పొందిన విమర్శన వ్యాసం క్రమంగా అభివృద్ధి పొంది, ప్రాధాన్యం పెంచుకొంది.

విజ్ఞాపనాత్మక వ్యాసాలు ఈ రచయిత సృష్టిలో మిక్కిలి తక్కువ. ఈ నాలుగూ స్త్రీ పునర్వివాహ సంబంధిగా నిర్మితమయ్యాయి. ఈ విధమయిన రచనలో ఇలా చెయ్యాలి. ఇలా ఉండాలి అని ఆదేశించటం, పాఠకుణ్ణి కార్యోన్ముఖుణ్ణి చేయాలని ఆశించటం జరిగాయి. ఇవి విషయాధిక్యం ఆవశ్యకం నుంచి ఆవిర్భవించాయి.

ఉపదేశ వ్యాసాలు వక్తవ్యాంశం సూటిగా బోధించటం ప్రధానంగా కలిగివున్నాయి. ఈ అయిదు వ్యాసాలూ విద్యార్థులు చేయదగ్గ పనులు తెలు పుతూ, చదువు సద్గుణాలు ప్రదర్శిస్తూ, అహింస బోధిస్తూ, ఐకమత్యం తెలు పుతూ ఉన్నాయి.

విషయ విభజనం : వ్యాసరచనా రీతిమీద ఆధారపడి చేసిన విభజనంతో పాటు విషయ వైవిధ్యం కూడా వ్యాస గతంగా పరిశీలించవచ్చు. దీనివల్ల విషయ గతంగా వ్యాసం పొందిన పరిణామం స్పష్టమవుతుంది. కందుకూరి వ్యాసాలు

విషయ ప్రాధాన్యాన్ని అనుసరించి వ్యాస సంఖ్య ఈ క్రింది విధంగా వుంది.

| | | |
|---|---|---|
| 1. | సాంఘిక వ్యాసాలు | 62 |
| 2. | మత విషయక వ్యాసాలు | 34 |
| 3. | స్త్రీ సంబంధి వ్యాసాలు | 34 |
| 4. | దేశ సంబంధి వ్యాసాలు | 11 |
| 5. | విజ్ఞాన వ్యాసాలు | 10 |
| 6. | జీవిత చరిత్ర వ్యాసాలు | 9 |
| 7. | శాస్త్ర వ్యాసాలు | 7 |
| 8. | ఆర్థిక వ్యాసాలు | 6 |
| 9. | శిశు వ్యాసాలు | 5 |
| 10. | నైతిక వ్యాసాలు | 4 |
| 11. | వేశ్యా సంబంధి వ్యాసాలు | 4 |
| 12. | వైద్య వ్యాసాలు | 3 |
| 13. | విద్య వ్యాసాలు | 3 |
| 14. | సాహిత్య వ్యాసాలు | 3 |
| 15. | రాజకీయ వ్యాసాలు | 3 |
| 16. | చారిత్రాత్మక వ్యాసాలు | 1 |

సాంఘిక వ్యాసాలు: సంఘ సంస్కర్త అయిన కందుకూరి వీరేశలింగం పంతులు సృష్టించిన వ్యాస వాఙ్మయంలో దాదాపు మూడవ వంతు సాంఘిక వ్యాసాలు. అవి భిన్న విషయ బోధకంగా ఉన్నాయి. గర్వం, సహనం, సత్యం, అహింస వంటి గుణాలు వివరంగా వ్యాసాలయ్యాయి. బ్రాహ్మణుల వృత్తులు, మరాచారాలు, దానధర్మాలు, పీఠాధిపతులు, వృద్ధవివాహాలు, భార్యా భర్తల ఐకమత్యం, దేహమనస్సౌందరత్వం తెలపడంతోపాటు భూతదయ, నీతి వర్తనం, దేహారోగ్యం మొదలైన అనేక విషయాలు నిరూపితాలయ్యాయి. ఈ వ్యాసాల వల్ల మనిషి జీవితాన్ని ప్రేమించటం సుఖపడటం ఇంతకన్నా ఉన్నతంగా పెరగటం అవసరమని తెలుస్తుంది.

మత విషయక వ్యాసాలు : హిందూమతం దాని తత్వం వివరించి, ద్వైత, అద్వైత విశిష్టాద్వైత, మత వివరణం చేసి, పరిశుద్ధాస్తిక మత బోధన

చేయటం రచయిత సంకల్పం మత విషయక మౌఢ్యం తొలగించాలన్న పట్టుదల ప్రతి వ్యాసంలోనూ ప్రత్యక్షమయ్యే సత్యం. పునర్జన్మ, విగ్రహారాధనం, మతగ్రంథాలు, ప్రార్థనావిధానం తెలిపే వ్యాసాలు ఆస్తికమత బోధకే ఉద్దిష్టమయినట్లు గుర్తింపవచ్చు. ఈ రచయిత- ఆస్తికమత ప్రచారం చేయటం, అందుకోసం ప్రార్థనా మందిరం ఏర్పరచటం గమనిస్తే, మత విషయ చైతన్యం కందుకూరి జీవితధ్యేయమయినట్టు అనిపించే అవకాశం ఉంది.

స్త్రీ సంబంధి వ్యాసాలు : ఈ వ్యాసకర్త సంఘసంస్కరణంలో ప్రధాన లక్ష్యం స్త్రీ. సంఘంలో బాధితగా పీడితగా ఉన్న స్త్రీ జనోద్ధరణ అవశ్యకర్తవ్యంగా భావించి, వాళ్ళ కష్టాల కారణాలు అవలోకించి, వాటి పునాదులు విచ్ఛేదం చేయటానికి కలం ఖడ్గంగా ఉపయోగించిన సాహితీ యోధుడు కందుకూరి. స్త్రీకి స్వాతంత్ర్యం లేకపోవటం, బానిసగా చూడబడటం పురుషాహంకార జన్యంగా భావించి, బాల్య వివాహం ఖండించి, స్త్రీ పునర్వివాహం ప్రోత్సహించి, స్త్రీ స్వాతంత్ర్యం రక్షించి, పురుషుడితో సమాన స్థానం కలిగించి ఉద్ధరించాలనుకొన్న రచయిత కృషి ఇది. కన్యగా, భార్యగా, కోడలుగా, తల్లిగా, పతివ్రతగా, అత్తగా, గృహిణిగా, విద్యావంతురాలిగా, చదువరిగా స్త్రీ చేయవలసిన కార్యాలు బోధించి, పురుషుడు చేయవలసిన దోహదాలు వివరించాడు కందుకూరి. ఈ వ్యాస సృష్టి స్త్రీ జనోద్ధణ సమర్థంగా వుంది.

దేశ సంబంధి వ్యాసాలు : దేశం అభివృద్ధి చెందాలంటే చేయవలసిన కృత్యాలు, దేశీయులు దేశం పట్ల కలిగి వుండవలసిన అభిమానం, దేశభాషల పట్ల వ్యక్తం కావలసిన నిరుపేక్ష తెలుపుతున్నాయి ఈ వ్యాసాలు. రచయిత దేశాభిమానం పెంచి, అభివృద్ధి సాధించాలని ప్రయత్నించటం వీటి మూలంగా తెలుసుకోవచ్చు.

విజ్ఞాన వ్యాసాలు : స్త్రీ ఋతుకాలం నుంచి శిశుపోషణం దాకా పొందే దశలు, ప్రవర్తించ వలసిన తీరు విజ్ఞానయుతంగా తెలపటంతోపాటు, మానసికారోగ్యం శారీరకారోగ్యం మీద కొంతవరకు అధారపడి వుంటుంది కాబట్టి, పీల్చే గాలి, త్రాగే నీరు, తినే ఆహారం ఉండే యిల్లు ఆరోగ్యకరాలుగా ఉండేటట్టు చూచుకోవాలని బోధించాయి విజ్ఞాన వ్యాసాలు.

జీవిత చరిత్ర వ్యాసాలు: ఇవి ఇతర దేశ స్త్రీల, ఆంధ్ర దేశ వ్యక్తుల జీవితాలు తెలిపే వ్యాసాలు, గ్రేస్ డార్లింగ్, జోనాఫార్క్ మొదలైన స్త్రీల విశిష్టత, ధైర్య స్థైర్యాలు తెలిపి, ఆంధ్ర స్త్రీ జాత్యభ్యుదయం కాంక్షించటం, అనిబిసెంటు, శంకరాచార్యుల మత దృక్పథం తెలపటం ఈ వ్యాసాలలో తెలి పాడు. వ్యాసకర్తకు మిత్రులు, సంస్కరణ కార్యంలో దోహదం చేసిన వాళ్ళు అయిన మాకర్ల సుబ్బారావు నాయడు, బసవరాజు గవర్రాజు గతిస్తే పొందిన వ్యధనుంచి వీళ్ళ జీవిత చరిత్ర వ్యాసాలు అవిర్భవించాయి.

శాస్త్రవ్యాసాలు : జ్యోతిశ్శాస్త్రం సవివరంగా తెలపటం, ప్రమాణమంటే ఏమిటో తాత్త్వికంగా చర్చించటం, యజ్ఞంలో జంతుబలిని గూర్చి సశాస్త్రీ యంగా ఆలోచించటం, అగ్ని పర్వతాలు, మంచుగడ్డ, సూక్ష్మ దర్శక యంత్రం, పాములు శాస్త్ర విషయాలుగానే వివరించటంలో విషయ ప్రాధాన్యం, వివరణ ప్రాముఖ్యం ఉన్నాయి.

ఆర్థిక వ్యాసాలు : ఆర్థిక దశ బాగుపడాలంటే స్వయంకృషితో జరగా లనీ, గృహ పరిశ్రమలు తదభివృద్ధికి హేతువులనీ, మితంగా ఖర్చు చేయటం తెలుపుతూ డబ్బు కోసం సుఖజీవనం త్యాగం చేయరాదనీ, సుగుణాలు కోరు కోవాలనీ నిర్ణయించే ఈ వ్యాసాలు డబ్బువల్ల మనిషి పొరపాటులు చేయకూడ దని హెచ్చరించాయి.

శిశు వ్యాసాలు: బాల్యంలో పసివాళ్ళు నేర్చుకోవలసిన అంశాలు, వాళ్ళను పెంచవలసిన విధానాలు తెలిపే వ్యాసాలున్నాయి. తల్లిదండ్రులు తీసుకోవలసిన జాగ్రత్తలు వివరింపబడ్డాయి. ఆజ్ఞాబద్ధులుగా పిల్లలు జీవించేటట్లు తల్లిదండ్రులు వాళ్ళను తీర్చిదిద్దాలని ప్రతి వ్యాసంలోనూ సూచించాడు.

నైతిక వ్యాసాలు: వీటిలో పౌరులు నీతిమంతులుగా ఉండాలనీ, జీవిత పరమార్థం గ్రహించాలనీ; వేశ్యా సంబంధి వ్యాసాలలో వ్యభిచారం సాంఘిక లోపమనీ, వేశ్యకూతురు వేశ్య కాదు కాబట్టి భార్యగా స్వీకరింపదగిందేననీ; వైద్య వ్యాసాలలో దేశంలో అనారోగ్యం వ్యాధులు అధికం కాబట్టి పాత పద్ధ తులు కాకుండా నూత్న మార్గంలో కృషి చేసి బాగుచేయాలనీ, ఔషధం దానం చేయాలనీ; విద్యావ్యాసాలలో విద్యాభ్యాసం ఉద్యోగార్థం కాకుండా విజ్ఞానార్థంగా సంఘమంతటా జరగాలనీ తెలిపాడు కందుకూరి,

సాహిత్య వ్యాసాలు: సాహిత్యంలో అనేక నూత్న ప్రక్రియా సస్యాలు పండించిన ఈ వ్యాస కర్త కవుల చరిత్ర వ్రాసినంత ఎక్కువగా సాహితీ విమర్శనం సృజింపకపోవటం గమనార్హం. "కొక్కొండ వేంకటరత్న కవి కృత విగ్రహ తంత్ర విమర్శనము" అ-క వ్రాసినట్లున్నా, ఇది కందుకూరి సృష్టిగా గ్రహింపవచ్చు. ఈ విమర్శనంలో రచయిత ఆంధ్ర భాషాభిమానం దాగివుంది.

రాజకీయ వ్యాసాలు: ఆంగ్లేయ పరిపాలనంలో లోపాలు చెప్పటం ఈ కాలం రచయితల పని కాకపోయింది. అయితే కందుకూరి వీరేశలింగం పంతులు అఖిల భారత కాంగ్రెసు ఉద్దేశాలు వివరించటం, రాజకీయ పాఠశాలల ఆవశ్యకతను గుర్తించటం రాజ్యాంగ సంస్కరణం వాంఛించటం వల్ల వ్యాసకర్త రాజకీయ దృక్పథం తెలుస్తుంది.

చారిత్రక వ్యాసం: 'స్వదేశ సంస్థాన చరిత్రాదులు' ఒక్క వ్యాసంగా కనిపించినా అనేక వ్యాసాల సంపుటి. హైద్రాబాదు, కూచి బీహారు, జయపురం మొదలైన సంస్థానాల చరిత్రలు వ్యాసాలుగా ఉన్నాయి. అనిబిసెంటు, అహల్యా బాయి మొదలైన వాళ్ళ జీవిత చరిత్రలు వ్యాసాలుగా ఉన్నాయి.

పూర్వ వ్యాసకర్తల ప్రభావం: ఇంత విస్తృత వ్యాస సృష్టి కావించిన కందుకూరి వీరేశలింగం పంతులు మీద ఉన్న ప్రభావాలు పరికించటం సముచితమే అవుతుంది. పూర్వ వ్యాసకర్తల ప్రభావం వల్ల కొత్త రచనం కొత్త ఆలోచనలు కలిగి ఈ వ్యాసకర్త రచనా వ్యాసంగం శోభావహం కావటంవల్ల సారస్వతం పరిపుష్టమై, దేశోపకారకమయింది.

కందుకూరి వీరేశలింగం పంతులు వ్యాస సృష్టిపైన ఆంగ్ల ప్రభావం ఉంది. "ఆ వ్యాసములు బయలుదేరుటకు కారణమైన చిత్త సంస్కారము వారికి ఆంగ్ల సాహిత్యావలోకనమున కలిగినదనుట సత్యదూరమును గాదు. అగౌరవమును కాదు" (5) ఆంగ్ల ప్రభావంతో పాటు పూర్వ వ్యాసకర్తల ప్రభావం కూడా ఈ వ్యాసకర్తపైన గోచరమవుతూ వుంది.

హితసూచని ప్రభావం: స్వామినీన ముద్దు నరసింహ నాయని 'హిత సూచని' లోని 'రక్షః ప్రభృతి ప్రమేయము' లోని విషయం కందుకూరి వ్యాసం 'దయ్యములు' లో ఎత్తి వ్రాసినట్లు గుర్తించి తెలపటం గమనింప

వచ్చు. ''ఇంచుమించుగా హిత సూచనిలోని వాక్యములను బోలిన వాక్యములనే గ్రాంధిక భాషలో నిట్లు రచించిరి'' (6) అనటం పరికింపవచ్చు.

ఇంకా హితసూచని ప్రభావం కందుకూరి వ్యాస సృష్టిమీద వుంది. పత్నీ హిత సూచనిలో హితసూచని నామమాత్రంగా చేరింది. స్వామినీన ముద్దు నరసింహ నాయని 'విద్యా ప్రమేయము', 'వైద్య ప్రమేయము' వ్యాస గత విషయం కందుకూరి వివేకవర్ధని మొదటి భాగంలోని 'విద్య', రెండవ భాగంలోని 'విద్యాభ్యాసోద్దేశము', 'సంఘ విద్యాభ్యాసము' లలో, వివేకవర్ధని మొదటి భాగంలోని 'వైద్యులు', రెండవ భాగంలోని 'వైద్యులు', 'ఔషధ దానము' లలో గోచరమవుతూ వుంది.

''... సారభూతమైన నీతినిన్ని యుక్తినిన్ని విద్యార్థులు ముఖ్యముగా గ్రహించవలసినది. ఇందువల్ల వారు క్రమముగా పండితులౌతారు. వారి వాక్యములు లోకమునకు శ్రేయః ప్రదములౌతవి. ఏ భాష యందైనా విద్యార్థి యెంత చదివినా గ్రంథములు రచించ నేర్చినా యుక్తాయుక్తములను వాస్త వమును అవాస్తవమును నిదానించడమునకు ఉపయోగమైన యోగ్యత కలిగిన మీదటగాని పండితుడని యెంచఁబడడు.'' (విద్యా ప్రమేయము - పుట 2)

''... సార భూతములయి, ప్రయోజనకారులయి యున్న విద్యలనే సంరక్షకులు బాలురకుఁ జెప్పవలసినది. ఈ చెప్పించెడు గ్రంథములందన్నిటి యందు గూడినంత వఱకు దగిన స్థలములయందు నీతి బోధకములగు విషయ ములు గూర్చి గరపుట మిక్కిలి యావశ్యకము. గ్రంథము లెన్ని చదివినను, యుక్తాయుక్తములను కృత్యాకృత్యములను యోగ్యతా యోగ్యతలను తెలిసి సన్మా ర్గమున మెలఁగుచున్న మీఁదటకాని యెవ్వడును పండితుఁడని యెంచఁబడఁడు'' (విద్య ఎనిమిదో-సంపుటం పుట 346)

ఇటువంటి ప్రభావం తెలిపే రచనా భాగాలు ఇంకా ఉన్నాయి. ఈ ప్రభావం వల్ల ఉత్తమ వ్యాస నిర్మాణ కృషి జరిగి తెలుగు భాషకు మేలే అయింది.

''సంగ్రహము'' ప్రభావం : పరవస్తు వేంకట రంగాచార్యులు తన వ్యాసాలకు 'సంగ్రహము'లు అని పేరు పెట్టి, అందులో అధికంగా మత విషయం చేర్చటం విదితమే! ఆ వ్యాసాలు శాఖా సంగ్రహము. కాల సంగ్ర

హము అని సంగ్రహ సహితంగా వున్నాయి. కందుకూరి వీరేశలింగం పంతులు వ్రాసిన మత సంబంధి వ్యాసాలకు అద్వైతమత సంగ్రహము, విశిష్టాద్వైత మత సంగ్రహము అని పేరు పెట్టటం గమనింపవచ్చు. శాఖా సంగ్రహంలో, భిన్న శాఖల ఆవిర్భావం తెలుపబడితే, కందుకూరి "శాఖా భేదములు"లో తత్సంబంధి హెచ్చు తగ్గులు పరికించటం జరిగింది. పరిమితంగా 'సంగ్రహము' ప్రభావం ఈ వ్యాస సృష్టిపైన గమనింపవచ్చు.

స్త్రీ కళా కల్లోలిని ప్రభావం : జియ్యరుసూరి వ్రాసిన ఈ సంపుటిలో 94 వ్యాసాలున్నాయి. విషయంలోను రచనంలోను ఈ వచన కావ్య ప్రభావం కందుకూరి వీరేశలింగం పంతులు వ్యాస సృష్టిమీద అధికంగా ఉన్నట్లు పరిశీలనంవల్ల తేలింది. స్త్రీ విషయికంగా వ్యాసరచన చేయడానికి ఈ గ్రంథం చూపిన ప్రభావం అమితంగా ఉంది ఈ ప్రధాన విషయం, ఈ శీర్షికలు, ఈ రచనావిధానం, ఈ భాషాప్రయోగం కందుకూరి వీరేశలింగం పంతులు రచనకు మార్గం ఏర్పరిచాయి. దోహదం చేశాయి. స్త్రీవిద్య, పాతివ్రత్యము, భూతదయ వంటి శీర్షికలు వాడుకోవటంతో పాటు, భావం గ్రహించి, కొంతవరకు వాక్య విన్యాసంకూడా స్వీకరించడం పరికించవచ్చు. ఈ క్రింది ఉదాహృతమయిన జియ్యరుసూరి, కందుకూరి వ్యాసాలలోని భాగాలు పరిశీలిస్తే ఈ ప్రభావం కొంత స్పష్టమవుతుంది.

" ప్రచండ మారుతము లేచి వీచునప్పుడును, అతివేగముగా జలప్రవాహము వచ్చునప్పుడును. వంగక యెదిర్చి నిలిచెడు గొప్ప మ్రాకులు వేళ్లతోఁ బెకలింపఁబడి కూలుచున్నవి. ఆ సమయమున నిక్కడ వంగియుండెడు చిన్న చెట్లకు నొక యపాయమును రాదు. ఆ ప్రకారమే స్త్రీలును పురుషులకుఁ గోపము వచ్చునప్పుడు ఎదిర్చి యుత్తరమియ్యక సమయానుసారముగా నొదుగుటయే వివేకము...చేతి వ్రేలె కన్నుఁబొడిచిన చేతి నేమిచేయవచ్చును? మన పల్లే మన నాలుకను గఱచిన పంటిని బెరికివేయవచ్చునా?"( స్త్రీ కళాకల్లోలిని–పాతివ్రత్య ధర్మము- పుట 161).

"పెద్దగాలి వీచునప్పుడు వంగి నేలయంటియున్న చెట్లుచెడక, తలయెత్తి యెదిర్చి నిలిచిన గొప్ప వృక్షములే వేళ్లతో పెల్లగిల్లినట్లుగా [illegible] పట్లనాని కోపమువచ్చినప్పుడు మారుమాటాడక వంగియున్న వాళ్లకేమి హానియు [illegible]

సుఖపడుదురు...మన పల్లెమన నాలుకను కఱచినచో మన మేమిచేయవచ్చును''
(పతివ్రతాధర్మము-సతీహితబోధిని-పుటలు 6, 7)

*ఇంకొక ఉదాహరణం :*

''పాతివ్రత్య ధర్మము తప్పని దానికి ముఖ సౌందర్యము లేకుండినను, పెండ్లింటి పూలదండవలె నది యందరిచేతను శ్లాఘింపబడును. పాతివ్రత్యధర్మము సెడినది యధిక సుందరిగా నుండినను అది కాటిపూలదండవలె నెల్లవారిచేతను దెగడఁబడును'' (పాతివ్రత్యభంగము- స్త్రీ కళాకల్లోలిని-పుట 162)

''మన నడత నిష్కళంక మయినదయిన యెడల మనమెంత కురూపు రాండ్రమయినను మన మెంత నగలులేనివారమయినను యోగ్యులందఱును మనలను భగవదర్పితమయిన పుష్పమాలను వలె కన్నుల నద్దుకొందురు. మనము చెడుతిరుగుడు తిరుగుచుంటిమేని మనము రతీదేవివంటి సౌందర్యము కలవారమయినను దేహమునిండ కనకాభరణములను దిగవేసికొన్నను, ఉత్తములైనవారందరును మనలను శ్మశానవాటికయందలి పూలదండలనువలె దూరమున విడుతురు.'' (పతివ్రతాధర్మము సతీ-హితబోధిని-పుట 4).

*మరొక యుదాహరణం :*

''బొక్కినోటివాఁడు పేలాలపిండిని మెచ్చుకొనునట్లును, ఈగ లశుద్ధమును శ్లాఘించునట్లును, దాసీ గమన మొనర్చుట తమకు గౌరవముగా నెంచెడు జ్ఞాన శూన్యులును బెక్కురుండెదరు.'' (పరస్త్రీ దాసీ గమన నిషేధము- స్త్రీ కళాకల్లోలిని-పుట 217)

''బోసి నోటివాఁడు పేలపిండిని మెచ్చుకొనినట్లు వదలు కచ్చ వాఁడొకఁడు వేశ్యావృత్తిని శ్లాఘించుచు వేశ్యలు లేకపోయినయెడల సంసారులు పాడగుదురని చెప్పినను, అది యుక్తికిని అనుభవమునకును దూరమైన మాటయని ధీమంతులందరును తెలిసియుందురు'' (వేశ్యాకాంతలు-ఏడవ సంపుటము-పుట 229).

*వేరొక ఉదాహరణం :*

'కొడుకు చచ్చినను జావని, కోడలి త్రాడుతెంపితే చాలునని తలంచెడు మంచిగుణముగల యత్తలనేకు లుండెదరు. మగడు పెండ్లామును దిట్టి కొట్టినా, అత్తగారికిఁ జనిపోయిన తన పురుషుడు మరల బ్రతికివచ్చినట్లుత్సాహము పుట్టును.

'అత్తగారు పగలఁగొట్టిన మట్టిపాత్ర, కోడలు పగలఁగొట్టిన కంచుపాత్ర' అను నట్లును, అత్తగారిపనికారడిలేదు అనునట్లును, కోడలిమీద దోషము చెప్పని సమయమే యుండదు. (అత్తగారి నిష్ఠూరము-స్త్రీ కళాకల్లోలిని-పుట 206).

"కొడుకేమైనను సరే కోడలిత్రాడు కోటిపల్లె రేవున త్రెంచినఁ జాలునని సంతోషించు అత్తలును మన దేశములో పలువురున్నారు. ఈ బాధలనుబట్టియే అత్తపోఁగొట్టిన దడుగోటికుండ కోడలుపోఁగొట్టినది కొత్తకుండయని సామెతయు, ఇటువంటివే మరికొన్ని సామెతలును వెలసి యున్నవి" (అతిబాల్య వివాహము-ఏడవ సంపుటము-పుట 28).

ఈ తీరులో స్త్రీ కళాకల్లోలిని వ్యాసాలు కందుకూరి వ్యాసాలలో గోచర మవుతున్నాయి. ఈ వ్యాసకర్త సంతకం చేసి భద్రంగా ఉంచుకొన్న స్త్రీ కళాకల్లోలిని 10.10.1876 న ముద్రితమయినట్లు జియ్యరుసూరి తన గ్రంథానికి వ్రాసిన పీఠికవల్ల తెలుస్తూవుంది. ఇదే వ్యాస సంపుటిని కందుకూరి వీరేశ లింగం పంతులు వివేకవర్ధని మే 1876 సంచికలో "శైలి మిక్కిలి మధుర ముగాను విషయము సర్వజన శ్లాఘనీయముగాను కనబడుచున్నది. గ్రంథమును స్త్రీలు చదువుటకు తగినంత సులభముగానే వ్రాయబడినది" అని గ్రంథ విమర్శనం ఉంది. వివేకవర్ధనిలో ప్రచురింపబడ్డ కందుకూరి వీరేశలింగం పంతులు వ్యాసాల మీద స్త్రీ కళాకల్లోలిని ప్రభావం కనిపిస్తూ వుండడం వల్ల ఇది, ఈ వ్యాసకర్తకు విడి వ్యాసాలుగా కాని, గ్రంథంగా కాని 1876 ప్రారంభం నాటికే లభించినట్లు స్పష్టమవుతూవుంది. ఈ లభించటం అభి ప్రాయంకోసం జియ్యరు సూరి కందుకూరికి పంపడం వల్ల జరిగి వుండవచ్చు.

పూర్వ వ్యాసకర్తల ప్రభావం వల్ల కందుకూరి వీరేశలింగం పంతులు వ్యాసాలు మరెంత పుష్టితో ప్రకాశించాయి. ఈ ప్రభావంవల్ల ఉత్తమ వ్యాస సృజనానికి కొంత అవకాశం ఏర్పడింది కాబట్టి రచయితకు కాని, సారస్వతానికి కాని, ఈ ప్రభావం మేలు చేసింది. ఈ వ్యాస కర్త శక్తిమంతంగా వ్యాసరచన కావించటానికి ఈ ప్రభావాలు దోహదం చేసి, రచయిత సామర్థ్యం, ఆధిక్యం ప్రదర్శించే గుణభరితాలుగా అయ్యాయి.

కందుకూరి వీరేశలింగంపంతులు వ్యాస రచనంలో ప్రాథమ్యం పొందక పోయినా ప్రాముఖ్యం పొందాడు. "వీరేశలింగము పంతులుగారు, తెలుగు సాహి త్యమును వ్యాసములతోను ఉపన్యాసములతోను సుసంపన్నము చేయు పూను

కొనుటకు పూర్వమే యీ ప్రక్రియ మన సాహిత్యము నందు విస్తరించినది''
(7) అన్న విషయం సత్యమే!

వ్యాసం ఉపన్యాసంగా ప్రసిద్ధం కావించిన ఖ్యాతి, ఆంగ్లవ్యాసంలాగా ఆంధ్రవ్యాసం సృజనగా రూపొందించి, దానికి ప్రాచుర్యం సంపాదించిన గౌరవం కందుకూరి వీరేశలింగంపంతులుకే దక్కుతాయి. వ్యాసం ఉపన్యాసరూపంలో సారస్వత ప్రక్రియగా ఏర్పరచి. స్థిరపడని భవిష్యదాంధ్ర సారస్వత లోకానికి భద్రపరచిన క్రాంతదర్శి కందుకూరి. భిన్న సారస్వత శాఖలకు ప్రాచుర్యం ప్రసాదించి, ఆధునికాంధ్ర సారస్వతంలో నూత్నయుగం ఏర్పరచి, తెలుగు వచన రూపం స్థిరీకరించి భాషకు ఉపకారం కావించిన మేధావి, సంస్కర్త, హృదయవాది కందుకూరి వీరేశలింగం పంతులు. సాంఘిక చైతన్యం వాంఛించి స్త్రీ జాత్యభ్యుదయం కాంక్షించి, దేశోద్ధరణం కోరి, దీనుల మేలు భావించి విప్లవోన్ముఖంగా పయనించిన కందుకూరి వీరేశలింగంపంతులు వ్యాస కర్తగా ఆ ప్రక్రియ అస్తిత్వానికి ప్రాణభిక్ష పెట్టిన మహనీయ వ్యక్తి, మహోత్తమశక్తి మహోన్నత సంస్థ.

## 2. కందుకూరి సమకాలికులు :

కందుకూరి వీరేశలింగంపంతులు కాలంలోనే ఉపన్యాస ప్రక్రియ బాగా ప్రచారమయింది. రచన తద్రీతిలో సాగింది. ఆ కాలంలో ఈ ప్రక్రియ గ్రహించి రచించిన వాళ్ళమీద కొంత ఆంగ్లవ్యాస ప్రభావం, కొంత కందుకూరి ప్రభావం ఉన్నట్లు స్పష్టమవుతుంది. ఈ యుగంలో కందుకూరి వ్యాస సృష్టికాక, విస్తృతంగా వ్యాసనిర్మాణం జరిగినట్లుకాని, వ్యాసరచనవల్ల ప్రసిద్ధుడయిన రచయిత ఉన్నట్లుకాని తెలిపే అవకాశం లేదు. అయితే, అల్పంగా అయితేనేమి, జరిగిన కృషి పరిశీలించడం కర్తవ్యమే! ఈ కాలంలో వ్యాసశీర్షిక తెలుగులోనూ, ఆంగ్లంలోనూ వ్రాయటం గమనింపవలసిన అంశంగా వుంది.

### 1. అంతఃపురోపన్యాసములు:

*ఆచంట సుందరరామయ్య*

ఆంగ్లంలో 'కర్టెన్ లెక్చర్సు' అనేదానికి తుల్యంగా ఆంధ్రంలో ఈ అంతః పురోపన్యాసములు అవతరించినట్లు భావింపవచ్చు. వీనిలో నాటకీయత కొంతచోటు

చేసుకోవటం గమనింపవచ్చు. దుఃఖంతో ఉన్న స్త్రీ, తన కష్టం చెప్పుకొంటుంటే మౌనంగా వుండేభర్త ఇద్దరూ ఈ విధమయిన రచనలో కనిపిస్తూఉన్నారు భార్య రెచ్చిపోతున్నా సమాధానంచెప్పని భర్త మౌనం, ఈ రచనకు ప్రాణ భూతంగా ఉంటుంది?

1891లో ప్రారంభించిన చింతామణి పత్రికలో ఈ అంతఃపురోపన్యాస ములు గోచరమవుతున్నాయి. దీనిప్రభావం పానుగంటిమీద చూడవచ్చు. తాను అంతఃపురోపన్యాసం పేరుతో వ్యాసరచన కావించేంతగా ఇది ప్రభావితం చేసింది. ఈ విధమయిన రచన ప్రధానంగా వినోదంకోసం, కొంతవరకు స్త్రీ సమస్య వివరణంకోసం పనికివచ్చింది.

ఈ అంతః పురోపన్యాసములలో స్త్రీ అవిధేయుడైన భర్తను సక్రమంగా ఉండేటట్లు చూచుకోవటానికి, అమాయికంగా ఉండే పురుషుణ్ణి దిద్దుకోవటానికి, అవివేకంగా ఉండే వ్యక్తిని వివేకవంతుణ్ణి చేసుకోవటానికి ఇల్లాలు చేసే సాధింపు లాగా రచన ముంది. పురుషుడు సాధారణంగా పలకడు, పలికినా నంగిమాట, అదయినా పాఠకులకు వినిపించదు. అయితే స్త్రీ మాటల వల్ల అతని భంగిమలు, మాటలు, ప్రవర్తనలు తెలిసిపోతాయి. వినోదస్థాయికి వచ్చిన సృజన వ్యాసాలివి. కుటుంబ వ్యవహారానికి సంబంధించి, గృహ వాతావరణానికి పరిమితంగా ఉన్న ఈ వ్యాసాలు అనంతరం అధికంగా స్వీకరింపబడలేదు.

## 2. పోకల శేషాచలము నాయడు

'అచల గ్రంథము' (1888) పూర్వోత్తర భాగాలతో ఒప్పుతూ వుంది. ఇందులో 13 ప్రకరణాలున్నాయి. ఇవి వ్యాసాలుగా రచయిత భావించకపోయినా, మత ధర్మ ప్రబోధకంగా, తాత్త్విక దృక్పథ ప్రదర్శకంగా ఉన్న ఈ ప్రకర ణాలు వ్యాసాలుగా గ్రహింపవచ్చు. దీనికి ప్రధాన హేతువులు విభజన, రచయిత వ్యక్తిత్వం, అహంకార నిరసన 'ప్రకరణము, చైతన్య నిరసన ప్రకరణము, ఉపదేశ ప్రకరణము మొదలైనవాటివల్ల ఈ 'ప్రకరణములు వివరణ వ్యాసాలుగా వున్నాయి.

## 3. దాసు శ్రీరాములు

ఈ వ్యాసకర్తవి రెండు ఉపన్యాసాలు 1. ఆచార నిరుక్తి 2. దురాచార పిశాచ భంజని లభ్యాలు. ఈ రెండూ విమర్శన స్థాయిలో రచితమయ్యాయి. వ్యాసకర్త ఎంత ఆచారం పట్ల పట్టుదల ఉన్న వ్యక్తో, ఈ ఉపన్యాసాలు తెలుపుతున్నాయి.

ఆచార నిరుక్తి (1890) లో ఆచారమనే పదానికున్న భిన్నార్థాలు తెలుపుతూ, ఆచారాచరణావశ్యకాన్ని వివరిస్తూ యాజ్ఞవల్క్య స్మృతి, పరాశర స్మృతి, మహా భారత కూర్మ పురాణాదుల నుంచి శ్లోకాలు ఉదాహరిస్తూ సుబోధ మగు వ్యాఖ్యాన రూపంగా రచిత మయింది.

దురాచార పిశాచ భంజని (1890) లో దురాచారాన్ని ఖండించటం ప్రధానంగా జరిగింది. స్మృతులలో నుంచి అనేకోదాహరణాలు గ్రహించి వివరించటం వ్యాసగతంగా గోచరమవుతూవుంది. ఇది ప్రాథమికంగా ఆచారానికి వివరణంలాగా ఉంది.

ఏలూరులో న్యాయవాద వృత్తి అవలంబిస్తూ సారస్వత కృషి ఆట విడుపుగా సాగించిన దాసు శ్రీరాములు ఆచారమంటే ధర్మము యొక్క రూప మని వివరించాడు.

## 4. యం. బుచ్చయ్య పంతులు

'కామినీ దుర్గుణ దూషణము, తన్నివారణ మార్గములు' (1891) 'ది హిందూ రిఫార్మర్'లో నుంచి పునర్ముద్రితమయింది. ఈ వ్యాసంలో స్త్రీల దోషాలు వేలెత్తి చూపటం ప్రధానంగా ఉంది. ఈ కాలంలో వస్తున్న వ్యాసాలలో స్త్రీకి సుగుణ బోధలో ప్రోత్సాహం కనిపిస్తుంటే ఈ వ్యాసంలో దుర్గుణాలు ఏ కరువు పెట్టటం వుంది. రచనా విధానం, ప్రయోగించిన భాష, విషయం, వ్యాసకర్తను ఆలోచనాపరుడుగా చూపాయి. ఈ విమర్శనం, వ్యక్తిగతం కాక సామాజికంగా సాగింది. స్త్రీలలో వైషమ్యాలు వివరంగా తెలిపి, అవి పోవాలంటే విద్య ప్రధానమని బోధించి, దమయంతి, చంద్రమతి, సావిత్రి, సీత కథలు తెలిపి, పతివ్రత, విద్యావతి అయిన ఒక స్త్రీ గుణగణాలు వివరించటంతో వ్యాసం సమాప్తమయింది. ఈ వ్యాసంలో దుర్గుణాలు ప్రదర్శించి, వాటిని

తొలగించటంవల్ల స్త్రీలలో ఉత్తమత్వం సాధింపవచ్చునని వ్యాసకర్త భావించాడు.

## 5. క్రిష్టియన్ లిటరేచర్ సొసైటీ

ఈ కాలంలో క్రైస్తవ మత ప్రచారం సారస్వత సంబంధంగా సాగింది. ఉపన్యాసం సారస్వత రంగంలో కొత్త ప్రక్రియ కావటంతో జనాదరణ పొందింది. అనేకులు ముద్రితమయిన ఉపన్యాసాలు చదువుతున్నారు. క్రైస్తవ రచనలు ఎక్కువ మంది చదవక పోవటంవల్ల, ఆ విధంగా కనిపించకుండా మతప్రచారం చేయగల రచనం, ఈ ప్రక్రియ గతంగా సాగించవచ్చునని గుర్తించిందాని ఫలితంగా కొన్ని వ్యాసాలు అవతరించాయి.

1. 'స్త్రీలకు విద్య నేర్పుట-కలుగు మేలులు' (1892) లో స్త్రీలకు విద్య బోధింపక పోవటానికి హేతువులు, స్త్రీ విద్యకు ఆక్షేపణలు తెలిపి, స్త్రీ విద్య వల్ల లాభం ఎన్ని విధాలుగా వుందో, ఎటువంటి విద్య ఎక్కడ బోధించాలో వివరించి, హిందూ స్త్రీలకే విద్యాలోపం ఉందనీ, హైందవేతరులకు విద్య లభించే అవకాశం ఉందనీ సూచిస్తూ వ్యాసం ముగిసింది.

2. 'ఋణము : అది తప్పించుకొను విధము' (1894) లో సమాజంలో అప్పుచేయవలసిన అవసరాలు, అప్పు చేయటం వల్ల నష్టాలు, అప్పు తీర్చేవిధం, అప్పు లేకపోతే ఉండే ప్రయోజనాలు, అంతా ఋణం సంబంధిగా చెప్పి, తీర్చ లేని అప్పు ఒకటి ఉందని మత ప్రచారం అల్పంగా సూచించి వ్యాసం ముగిసి పోయింది. క్రైస్తవ మత దృష్టితో' ప్రతి మనిషి పాపి అనీ, ఆ పాపం ఋణం లాగాతీర్చివేసుకోవాలనే ప్రచారం ఇందులో వుంది.

3. 'పరిశుభ్రత వలన గలుగు మేలులు' (1894) లో మురికి, రోగాలకు మూలమనీ, 'ముక్కే ఆరోగ్యమును కాపాడు ఒక ఉద్యోగి' అనీ, గాలిని శుభ్రంగా ఉంచాలనీ, పరిశుభ్రతను కాపాడాలనీ తెలుపుతూ. అంతరమాలిన్యం తొలగించుకోవాలన్న ధ్వనితో వ్యాసం సమాప్తమయింది.

4. 'హిందూ వితంతువులు, వారికి మేలు చేయుట యెట్లు?' (1896)లో దేశంలో విధవలుండటానికి హేతువులు, వాళ్ళకష్టాలు, అవి తొలగించటానికి చేయవలసిన చట్టాలు, పునర్వివాహాలు తెలుపుతూ సాగిన వ్యాసం వల్ల హిందువుల

లోనే వితంతువులున్నారు-క్రైస్తవ మతంలో ఇంతగా లేరు అన్న ప్రచారం ఉంది.

5. 'కులము దాని ఉత్పత్తియు, ఫలములును' అనే వ్యాసం హిందూ కుల వ్యవస్థ మీద సముచిత పరిశీలనం. జగన్నాథ పరీక్ష (1892)లో మత్స్య పురాణాన్నీ, బౌద్ధావతారాన్నీ వివరించి 'జగన్నాయకు డవతార పురుషుడే' అని తెలపటం జరిగింది.

ఉపన్యాస ప్రక్రియను గ్రహించి, చక్కని వ్యాసాలు వ్రాయించి, ప్రత్యక్షంగా క్రైస్తవ మత బోధన చేయకుండా ధ్వన్యాత్మకంగా మత ప్రచారం చేసుకొంది క్రిష్టియన్ లిటరేచర్ సొసైటీ. మంచి ఉపన్యాస సృష్టికి దోహదం చేసింది.

## 6. హుండి రామారావు

'స్త్రీ హితోపదేశము' (1894) రాజమండ్రిలో ముద్రితమయింది. పట్టభద్రుడైన రచయిత ఈ వ్యాసంలో చేసిన ఉపదేశం సాంఘికమయింది కాదు. స్త్రీ శారీరకమయింది. ఇది అయిదు అధ్యాయాలుగా విభక్తమయిన వ్యాసం. స్త్రీ పూర్ణారోగ్యవంతురాలుగా ఉండి, గర్భం దాల్చి, తల్లి అయి, పిల్లలను పెంచుకోవడందాక తీసుకోవలసిన శారీరక జాగ్రతలు వివరించటం జరిగింది.

## 7. కోపల్లి వేంకట రమణరావు

జీవహింస (1896) చంపకమాలతో ప్రారంభమయిన ఉపన్యాసం. 'అహింసా పరమో ధర్మః' అని జీవహింస కూడదని మానవుల హింస, జంతువుల హింస తెలిపే కథలు వివరించి, 'స్నేహితులారా! కాలాతీతమైనదని మీలో గొందఱు వగచు చుందురు. కాఁబట్టి యీ పై విషయముల సారాంశము ను జెప్పి యంతతో విరమించెదను' (పి. 7) అని వ్యాసం ముగించాడు.

## 8. వేకుమళ్ళ రాజగోపాలరావు

అతి బాల్య వివాహము (1896) 'దేశోపకారి' పత్రిక నుంచి పునర్ముద్రిత మయింది. ఇది అతి బాల్యంలో వివాహం చేయరాదని హేతుబలంతో వాదించిన ఉపన్యాసం.

## 9. చింతామణి పత్రికా వ్యాసాలు:

చింతామణి పత్రిక నుంచి వెలికితీసి వేరుచేసిన 'అనాగరికులలో స్త్రీల స్థితి', 'మూఢుల కారోగ్య విషయము బోధించుట మనకు ధర్మము' (చిత్రపు సీలాచలము); 'ఋణము' (ఎ. సుందరరామయ్య) వ్యాస ధర్మం ప్రదర్శిస్తున్న ఉపన్యాసాలు. మొదటి ఉపన్యాసంలో నాగరికులు స్త్రీలను గౌరవిస్తారని, అనాగరికులు హింసిస్తారని తెలిపి, స్త్రీని బాధించడం అనాగరిక లక్షణంగా సున్నితంగా హెచ్చరించడం ప్రశంసాపాత్రంగా ఉంది. అనారోగ్య పరిస్థితులు కల్పించుకొనే వాళ్ళకు హితం తెలపటం అవసరమని రెండవ ఉపన్యాసం వల్ల తెలుస్తుంది. ఆచంట సుందర రామయ్య క్రిష్టియన్ లిటరేచర్ సొసైటీ ప్రచురించిన ఋణం వ్యాసం విపులంగా చర్చించి అదే పేరుతో సమగ్రమైన ఉపన్యాసంగా రూపొందించాడు.

ఈ యుగంలో సమగ్ర ప్రక్రియగా ఉపన్యాసం, భిన్న రచయితల కృషి వల్ల, రూపం దిద్దుకొంది. తరువాత దశలో ఉపన్యాసం అనేక రచయితల ఆదరానికి పాత్రమయింది. ఉపన్యాసానికి సాహితీ గౌరవం స్థానం కందుకూరి వీరేశలింగం పంతులు ప్రసాదించగా, ఇతరులు అంగీకరించి, తద్రచన కావించటం ప్రారంభించారు. ఈ ఉపన్యాసం, ఈ యుగ ధర్మంగా, అనంతర తరానికి సంక్రమించింది.

## 4. వ్యాసం

### గురజాడ యుగం (1901-1915)

ఆధునికాంధ్ర కవితాలోకంలో అనితర సాధ్యమయిన పరిణామం కలిగించాడు గురజాడ. ప్రథమాంధ్ర స్వతంత్ర నాటకం సృజించి, ముత్యాల సరాల సృష్టితో ప్రసిద్ధి వహించి, కథానికాది రచనల విషయంలో ప్రాథమ్యాం వహించి, సారస్వతం సామాన్యుడి సొత్తుగా నిరూపించి, వ్యాససృష్టిలో పరిహాసం జోడించి, వర్తమానాంధ్ర భాషాభ్యుదయానికి ఆద్యుడుగా నిలచిన గురజాడ వేంకట అప్పారావు పంతులు ఈ యుగకర్తగా గ్రహించటం సముచితం.

ఈ యుగంలో ఉపన్యాస, వ్యాస రచనం విస్తృతంగా జరిగింది. ప్రాచీనతా గౌరవం, అభ్యుదయవాంఛ పరస్పరం పోటీపడి వ్యాస వాఙ్మయప్రోత్సాహకారకాలయ్యాయి. భాషా విషయంలో వాదోపవాదాలు బాగా చెలరేగాయి. పత్రి

కలు వేగంగా స్థాపితాలయి, అతి త్వరితంగా పెరిగాయి. ఉపన్యాసంగా వ్యాసం వ్రాయబడటం కంటే వ్యాసంగానే వ్రాయబడటం ప్రారంభమయింది.

వ్యాసం ప్రత్యేక సారస్వత భాగంగా, రచనా ప్రక్రియగా నామరూపాలతో ఈ యుగంలో స్థిరమయింది. ఈ కాలంలోనే వ్యాసం పెరిగింది. ఈ దశలో కందుకూరి వీరేశలింగం పంతులు రచనా విధానం ఒరవడిగా ఉంచుకొన్న వ్యాస కర్తలు ఉపన్యాస సృష్టిమూలంగా ప్రసిద్ధులయ్యారు. కందుకూరి వ్యాస సృష్టిని విమర్శించే కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి వంటి వాళ్ళు విస్తృతంగా ఉపన్యాస వాఙ్మయం సృష్టించారు. ఈ యుగంలో ఉపన్యాసాలుగా నయితేనేం, వ్యాసాలుగా నయితేనేం, వాఙ్మయం అధికంగా రూపొందింది. వ్యాసం, ఇంత వరకు భిన్న నామాలతో ఉన్నప్పటికీ, ఈ యుగంలో వ్యాసంగానే గుర్తింపు పొందే పరిణామం సాధించింది.

## 1. గురజాడ వేంకట అప్పారావు (1862-1915)

వ్యాసం పదం ఈ ప్రక్రియార్థంలో (1852) పూర్వంనుంచి ప్రయుక్తమవుతూ వుందని సి. పి. బ్రౌన్ తెలిపినా, ప్రయోగం అలభ్యం కావటం వల్ల తత్పరిశీలనం అవసరమే అవుతుంది. కందుకూరి వీరేశలింగం పంతులుకాని, తద్విమర్శకులుగాని, ఆ ఉపన్యాసాలను, అప్పటిలో వ్యాసాలన్నట్లు ఆధారాలు ఇంకా అలభ్యంగా ఉన్నాయి. "ఇంతను నాటికి ప్రక్రియ కుపన్యాసమన్న పేరే ప్రచారములో నుండెననియు వ్యాసమన్న పేరు దీనికి సమానార్థకముగా గ్రహింపబడుచు వచ్చినను, నంత ప్రాచుర్యమును వహించియుండలేదనియు సిద్ధాంతమగుచున్నది." (8) అయితే వ్యాసమన్న పదం ఎప్పణ్ణుంచి సమానార్థకంగా గ్రహింపబడుతూ వచ్చిందో స్పష్టంగా లేదు.

పత్రికలు సాధారణంగా వ్యాసాలు ప్రచురిస్తూ వచ్చాయి. ఈ రచనలను, అవి ఏ పేరుతో గ్రహించాయో చూడవచ్చు. చాలా పత్రికలు ఏ పేరూ పెట్టకుండా ఈ విధమయిన రచనలు ముద్రించాయి కాని, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక మాత్రం ప్రారంభంనుంచీ వీటిని వ్యాసాలు అనటం గుర్తింపవచ్చు. దాని మొదటి పుటలో "ఆంధ్ర పత్రిక, సంవత్సరాది సంచిక, వివిధ వ్యాసములతోను, చిత్రపటములతోను నాంధ్ర పత్రికాధిపతిచే బ్రకటింపఁబడి బొంబాయి తత్త్వవివేచకము ముద్రాక్షరశాలలో ముద్రింపబడినది. సాధారణ నామ సం,

చైత్రశుద్ధ పాడ్యమి భానువారం బొంబాయి'' అని వుంది. అయితే వ్యాసం అన్న పదం రచనం అన్న అర్థంలోనే ప్రయుక్తమయింది కాని, రచనారీతి, రచనా ప్రక్రియ అన్న అర్థం ప్రయోగింపబడలేదు. ఈ అభిప్రాయం, పద్య శీర్షికలను కూడా పేర్కొంటూ, వ్యాసంగానే చెప్పటం చాలా కాలంవరకు జరిగింది. అందువల్ల 1910 నాటికి వ్యాసం అన్న పదం కొంతవరకు ఈ రచనా రీతికి పేరయినట్లు గమనింపవచ్చు.

అయితే, ఈ విధమయిన రచనా విధానానికే ఆ పేరు స్థిరమయినట్లు స్పష్టంగా వ్యక్తంకావలసివుంది. గురజాడ అప్పారావు పంతులు తను వ్రాసిన రచనలకు ఉపన్యాసం అనకుండా వ్యాసమనటం గుర్తింపవచ్చు. ఈ వ్యాసాలకు వ్యాస చంద్రిక అని పేరు పెట్టటం సంపాదక ప్రయత్నమే కాని, ఈ రచనలను వ్యాస కర్త వ్యాసాలని పేర్కొనటం ఆయా వ్యాసగతంగా పరికింపవచ్చు.

''1912 అక్టోబరు నెలలో వెలువడిన ఏషియాటిక్ క్వార్టర్లీలో నొక రచయిత ఈజిప్టులో అరబిక్ భాషల స్థితిని గురించి బహు చక్కని వ్యాసం రాశాడు'' (విశ్వ విద్యాలయాలు సంస్కృత భాషలు-వ్యాస చంద్రిక పుట 101). ఆంగ్లంలో ఎస్సె అన్న పదానికి వ్యాసమన్న ప్రయుక్తమయింది. ఈ పదం 1912 తర్వాత వాడినట్లు స్పష్టమయింది.

''ఈ పుస్తకములో నాగవర్మను గురించిన్నీ, కన్నడ కావ్య ప్రపంచమును గూర్చిన్నీ యింగ్లీషులో వ్యాసములు కలవు.'' (చుట్టు చూపులేని విద్య - వ్యాస చంద్రిక-పుట 74)

''రెండవ కూర్పులో మాక్సమలరు దొరగారు తమ వ్యాసమును పినర్జించిరి'' (చుట్టు చూపులేని విద్య-వ్యాస చంద్రిక - పుట 73)

ఈ రెండు తావుల్లోనూ వ్యాసం అన్న పదం అన్యభాషా రచనా సంబంధిగా తెలపటం జరిగింది.

''విపులమైన విచారణ చేసి, వ్యాసములు రాసేవారి అభిప్రాయములు ఒకప్పుడు తెలిపోవడం సహజము'' (చుట్టు చూపులేని విద్య - వ్యాస చంద్రిక - పుట 72). ఈ వాక్యాన్ని బట్టి, దీని సందర్భము పురస్కరించుకొని గ్రహిస్తే, ఈ పదం, తెలుగులో జరిగే రచనా ప్రక్రియకు పేరయినట్లు స్పష్టమయింది.

కాబట్టి వ్యాసమన్న పదం తెలుగులో సారస్వత శాఖకు పేరుగా ప్రయోగించినట్లు గుర్తించటం జరిగింది. అయితే ఈ పదం, ఈ అర్థంలో ప్రయుక్తమయిన సమయం తెలుసుకోవటానికి ఈ 'చుట్టు చూపులేని విద్య' అన్న వ్యాసం ఎప్పుడు వ్రాయబడిందో తెలుసుకోవటం అవసరమవుతుంది. గురుజాడ వ్యాస సృష్టి, తెలిసినంతవరకు, 1897 నుంచి 1915 వరకు జరిగింది. ఎక్కువ వ్యాసాలు 1910 ప్రాంతంలో రచితాలయినట్లు గమనించవచ్చు. అందువల్ల ఈ వ్యాసం కూడా 1910 ప్రాంతంలో వ్రాసినట్లే గ్రహింపవచ్చు.

దీనినిబట్టి వ్యాస చంద్రిక కర్త గురజాడ అప్పారావు పంతులు వ్యాసం అన్న పదం 1910 ప్రాంతంలో ప్రయోగించినట్లు నిర్ణయింపవచ్చు. అందువల్ల ఆంధ్ర పత్రికలోనూ, వ్యాస చంద్రికలోను వ్యాసమన్న పదం, దాదాపు ఏక కాలంలో ప్రయుక్తమయినట్లు స్పష్టమవుతుంది.

ఆయితే, ఇంతకంటే ముందు, వ్యాసాలలో కాదుకాని, తల్లక్షణ గ్రంథాలుగా వెలువడ్డ వాటి శీర్షికలలో ఈ పేరు ప్రయుక్తమయినట్లు గుర్తింపవచ్చు.

"వ్యాస బోధిని - టి. వి. చెల్లప్ప శాస్త్రి - భాష - వచనము 1912

వ్యాస మంజరి - న.చ. దేశికాచారి.

వ్యాస మంజరి - పి.ఎ. ప్రణతార్తి హరశివ 1901

వ్యాస లేఖన దోషము- వై. ఎస్. హనుమంతరావు. 1921" (9)

ఈ గ్రంథ పట్టికను పురస్కరించుకొని చూస్తే వ్యాసం అన్న పేరు రచనా ప్రక్రియకు 1901 నాటికే ఉన్నట్లు గమనింపవచ్చు. ఈ లక్షణ గ్రంథాలు ఏర్పడటానికి పూర్వం లక్ష్యాలు ఉండి తీరవలసిన అగత్యం ఏర్పడుతుంది. కాబట్టి, 1901 కి పూర్వం వ్యాసాలు రచితాలయి ఉండాలనీ, ఇటువంటి రచనా రీతికి వ్యాసమన్న పేరు ప్రసిద్ధంగా ఉండాలనీ భావింపవలసి వుంటుంది. అందువల్ల వ్యాసం అన్న పేరు ప్రక్రియానామంగా 1900 లకు పూర్వం ఉందనీ, అయితే ఆధారాలు అలభ్యంగా ఉన్నాయనీ గ్రహింపవలసి వుంటుంది.

ఈ సందర్భంలో, పాఠశాలలకు పరిమితంగానూ, ప్రక్రియా రచనంగానూ, రెండు విధాలుగా వ్యాస రచన, వ్యాసం అన్న పదాలు ప్రయుక్త

మయినట్లు, ఈ రెండింటి నిర్మాణంలో తేడాలు ఎక్కువగా ఉన్నట్లు, చాలా వరకు సంబంధం లేనట్లు గమనింపవచ్చు. లక్షణాలు తెలిపే రచనలంటూ అవతరించిన వాటిలో చాలా భాగం పాఠశాలల వ్యాస రచనాభ్యాస సంబంధిగానే వున్నాయి. వ్యాసం అన్న పదం ప్రక్రియగా కాకుండా పాఠశాలలో రచనా విధానంనేర్పే సందర్భంలో, మొదటిగా ప్రయోగించినట్లు, విద్యార్థి విషయం విభజించుకోవటం నేర్పే ఉద్దేశంతో వ్యాసం అన్న పదం అవతరించినట్లు, అనంతరం రచనా ప్రక్రియకు పేరయినట్లు, ఆపైన సారస్వత శాఖగా పరిణమించి నట్లు భావించే అవకాశం వుంది.

ఏమయినా, ఈ పదం 1900 ఆరంభం నుంచీ ఈ ప్రక్రియకు పేరు.

ఈ పదం వ్యాసకర్తలలో గురజాడ వేంకట అప్పారావు ప్రయోగించటం పరికించి, ఈ యుగం ప్రధానంగా ఈ ప్రభావంతో ఉన్నట్లు గ్రహించి, గురజాడ ప్రాధాన్యం నిర్ణయింపవచ్చు. గురజాడ యుగంలో వ్యాసం సాహితీ శాఖగా, సృజనంగా రూపొందింది.

సారస్వత భాషా సంఘ సంస్కర్త, మానవతావాది గురజాడ వేంకట అప్పారావు పంతులు ఉత్తమ వ్యాస స్రష్ట. సామాజిక జీవితం సాహితీ రంగం తన వ్యక్తిత్వంగా రూపొందించుకొన్న ఈ రచయిత వ్యాసాలు 'వ్యాస చంద్రిక'లో 'మాటామంతీ' లో మొత్తం ఇరవై ఏడై, తారాబలం తెలుపుతున్నాయి.

మేధావి హృదయ కేదారంలో సక్రమంగా పండిన సస్య సంపద ఈ వ్యాస వాఙ్మయం. ఇవి సంఘ సాహిత్య సమ్మేళనం నుంచి ఆవిర్భవించిన అభ్యుదయ భావసందోహాలు. ఆంధ్రత్వం నిలుపుకొన్న తేజస్వి వాంఛితార్థాలు నిక్షిప్తం చేసిన అక్షర రూపాలు.

ఈ వ్యాసాలలో ఉన్న ప్రధాన లక్షణం ఆలోచనాపరుడైన రచయిత అనుభూతి. వ్యక్తికాని, సన్నివేశంకాని, సాహిత్య సాంఘిక భాషా సరాలు కాని, ఈ వ్యాసకర్తను ఆలోచనలోకి తరిమి, మథనం పొందేటట్లు చేసి, అక్కణ్ణుంచి గుండె క్షేత్రంలో అభివ్యక్తి సమరంలో అనుభూతిగా రూపొంది, వ్యాసాలుగా నిర్మాణం పొందాయి.

తెలుగు వ్యాసం విమర్శనం అభివ్యక్తం చేయటం గురజాడతో మొదలయిందనవచ్చు. ఈ వ్యాసకర్త తదనంతరమే, ఈ విమర్శక వ్యాసం భిన్న శాఖగా పరిణామం చెందింది. అందువల్ల తెలుగువ్యాస పరిణామంలో ఈ వ్యాసకర్త ఒక ప్రధాన ఘట్టం. ఆంగ్లంలో సృజన విమర్శన వ్యాసాలు పోటాపోటీలుగా విస్తరిల్లిన విషయం అవగత పూర్వకమే! వ్యాస శాఖలో ఈ రెండూ భిన్నోపశాఖలుగా చీలిన చోటుకుండే ప్రాధాన్యం గురజాడకు వుంది. ఈ వ్యాసకర్త సాహితీ విషయం అయినా, విమర్శనమయినా, సృజనమయినా, ఏ విన్యాసంగా నిర్మించినా, ప్రధానమయిన వ్యక్తిత్వం అది విశిష్టంగా గోచరించేటట్లు చేసి, ఆంగ్ల వ్యాసకర్తలు కౌలీ, లేంబ్‌లను తలపించాడు.

గురజాడ అప్పారావు వ్యాసాలలో తొమ్మిదిటిని వ్రాసిన సంవత్సరాలు తెలుస్తున్నాయి కాని మిగతా వాటి విషయంలో తెలియటం లేదు. ఈ వ్యాస వాఙ్మయంలో చాలా భాగం అముద్రితంగానే వుంది. స్థూలంగా ఇది 1897-1915 మధ్యకాలంలో నిర్మాణమయింది.

వ్యాస భాష : గురజాడ అప్పారావు వ్యాసభాష కొంత గ్రాంథిక సన్నిహితంగా, కొంత వ్యావహారికంగా వుంది. కన్యాశుల్కం మొదటి ముద్రణం భాషకంటే రెండవ ముద్రణ భాష వ్యావహారికంగా వుంది. మాండలికంగా రూపొందింది. ఈ భాషా పరిణామానికి గిడుగు రామమూర్తి పంతులు వ్యావహారికభాషా ప్రభావం పనిచేసింది. అందువల్ల ఆద్య రచనల్లో గ్రాంథికానికి సన్నిహితంగా, అనంతర రచనల్లో వ్యావహారికానికి సమీపంగా గురజాడ భాష పరిణమించిందని సిద్ధాంతీకరింపవచ్చు. వ్యాస చంద్రికలో మొదటి నాలుగు వ్యాసాలు, రచనారీతి, భాషా ప్రయోగాల వల్ల బంకించంద్రుని నవలా రచనకు పూర్వ రచనలు అయివుంటాయి. మిగతా వ్యాసాలు అనంతర రచనలుగా కనిపిస్తున్నాయి. 'మాటా మంతీ' లో గ్రాంథిక ఛాయలేని వ్యావహారికమే ఈ గ్రాంథిక వ్యావహారిక భాషలనుబట్టి పూర్వాపరంగా సిద్ధాంతం చేయటమటుంచి ఆలోచిస్తే, సాహిత్య విమర్శన వ్యాసాలు గ్రాంథిక భాషా సన్నిహితంగా ఉన్నాయి.

ఈ వ్యాసకర్త తన వ్యాసాలన్నీ తెలుగులోనే వ్రాయలేదు. అన్నీ వ్యాసాలనుకొనే వ్రాయలేదు. ఆంగ్లంలో వ్రాసిన వ్యాసాలు, నివేదికలు, సంపాదకాను

వాదాలు కాబట్టి, ఆ భాష గురజాడ భాషకాదు. 'మాటా మంతీ'లో చాలా రచనలు వ్యాసాలని రచయిత భావించిన సూచనలు లభించలేదు. ఆంగ్ల సృజన వ్యాస లక్షణ సమంచితాలుగా ఉండి, తెలుగులో మరో ప్రక్రియ పేరుతో గ్రహించటానికి వీలులేని రచనలను వ్యాసాలుగా గ్రహించటం ఉచితంగా భావితమయింది.

ఇవి మాత్రమే కాక ఇంకా ఈ రచయితవి వ్యాసాలున్నాయనీ, అవి అలభ్యాలనీ తెలుస్తుంది. ''ఆయన వ్రాసిన, అచ్చొత్తించిన అనేక ఆంగ్లపద్యాలు వ్యాసాలు యిపుడు లభించడంలేదు'' (పీఠిక-వ్యాస చంద్రిక) 'మహోదయం'లో పేర్కోబడ్డ బాలికా పాఠశాలల వ్యాసం కూడా లభించలేదు.

విమర్శన వ్యాసం : వీటిని సాహిత్య సమాజ సంబంధులుగా రెండు విధాలుగా విభజించవచ్చు. ప్రాథమికంగా రచనకంటే రచయిత మనస్తత్వం వ్యక్తమయిన తీరును బట్టి ఈ విభజనం సాధ్యమవుతుంది.

కందుకూరి ప్రహసనాలలో పచ్చిబూతు శృంగారం, కవిత్వంలో ప్రయోగాలు, ముత్యాల సరాల లక్షణం, బెంగాలు సాహిత్య రీతి, పరభాషా ప్రభావానికి దూరంగా ప్రాంతీయ భాషాభివృద్ధి, రవీంద్రుడి జీవిత సాహిత్య పరామర్శ, భాషా చారిత్రక పరిణామ పరిశీలనం, శాసన పరిశోధనతో నన్నయ సాహిత్య విమర్శనం, కన్యాశుల్క నాటక లక్షణం, హరిశ్చంద్ర నాటక పరిచయం గూర్చి తెలిపే వ్యాసాలు విమర్శన ధర్మ మార్గంలో ఉన్నాయి.

వ్యావహారిక భాషా ప్రయోజనం, గ్రామ శబ్ద చింతన, ఆకాశ రామన్న అస్తిత్వం, విద్యా విధానం గూర్చి ఆలోచన, భాషల ప్రాధాన్యపు చర్చ, పాఠ్య ప్రణాళికలో ఆధునిక వచన స్థానం, తెలుపుతూ సాగిన వ్యాసాలు సాంఘిక సమస్యలకు పరిష్కార కృషి చేస్తున్నంత లోతుగా సాగాయి.

విమర్శన వ్యాసం: ప్రధానంగా విషయాధిక్యంతో ఒప్పుతుంది. అదే సృజనమయితే రచనా ప్రముఖంగా ఉంటుంది. స్థూలంగా రచయిత వ్యక్తిత్వం రెండు రచనలనూ సృజనంగా చేసినా వైవిధ్యం తప్పనిసరి అవుతుంది. విషయ బోధ కుద్దిష్టమయిన విమర్శన వ్యాసం బుద్ధికి పని కలిగించే, ఆలోచనతో నిండే, అది వాంఛించే విధంగా రూపొందుతుంది. అయితే విమర్శన తీవ్రత కొంచెంగా

సడలి, వ్యక్తిత్వబలం అల్పంగా పెరిగినప్పుడు విమర్శన వ్యాసం సృజన ధర్మ ప్రదర్శకమవుతుంది.

సృజన వ్యాసం: బాల బాలికల మనస్తత్వం. సభలలో జరిగే విచిత్రాలు, లోక ధర్మంమీద దృష్టి. మనస్సును మథించే ఆలోచనలు, ఎప్పుడూ చదవ వలసిన ప్రకృతి పుస్తకం, వ్యక్తుల జీవింతాతర్యాలు, ఆనంద గజపతి దర్బారు వింతలు, జీవితంలోని వ్యక్తుల్ని పాత్రలుగా ఎన్నుకోవటం, 'ఛ'... గారబ్బాయి స్వరూప స్వభావాలు, విశదంగా వివరింపబడిన సృజన వ్యాసాలు.

సృజన వ్యాసాల దానధర్మం, ఆనందం. దానికి రచనా విధానం ముఖ్యం కాని విషయం కాదు. భావ వ్యక్తీకరణం ప్రముఖంగా వుంటుంది. విజయ వంతంగా దోషమున్నా రచనా సౌందర్యంవల్ల సృజన వ్యాసం అవుతుంది. విషయ మసంపూర్ణమై, విభజన క్రమం లేనిదై, భాషా సామర్థ్యం కొరవడ్డా, రచయిత వ్యక్తిత్వం ప్రముఖమై, ఆనందం కాంక్షిస్తుంటే రచన సృజన వ్యాసంగా రాణించవచ్చు.

'పిల్లలకు నీళ్ళంటే సరదా. ప్రవహించే నీళ్లన్నా, ఆటలాడుకొందుకు వీలిచ్చే నీళ్ళన్నా మరీసరదా' (మాటామంతీ-పుట 4). ఈ భావం రచయిత పరిశీలన నుంచి, జీవితం నుంచే ఆవిర్భవించింది. వాక్యం చదవగానే పిల్లలు - బాల్యం-నీళ్ళు-ఆటలు గుర్తుకు వచ్చి ప్రతి పాఠకుడు బాల్య స్పృహతో ఆనందం పొందవచ్చు. ఈ వాక్యం చదివి ఆలోచించకుండా ఆనందింపవచ్చు. ఇటువంటి వాక్య సందోహం ఉన్న 'పిల్లలు' వ్యాసం, ఇటువంటి అనేక వ్యాసాలు సృజనంగా ఉన్నాయి.

నిర్మాణ వ్యాసం: వ్యాస నిర్మాణ విధానం గమనించాలి. పూర్వ రచయి తలకంటె వైవిధ్యం ఈ వ్యాసకర్త సాధించలేదు కాని, మునుపులేని పాత్రీకర ణలు, ఈ రచయిత సృష్టించాడు. ఈ వ్యాసాలలో అధిక భాగం వివరణాత్మ కంగా ఉన్నాయి. కొన్ని విమర్శనంగా ఉన్నాయి. సృజనంగా ఉన్న వ్యాసాలు ఉపదేశాత్మకంగా సాగాయి.

ఈ వ్యాస సృష్టిలో ఉన్న పాత్రీకరణలు రెండు. మొదటివ్యాసం పాత్రీ కరణం వివరించేదిగా, రెండవది దానికి ఉదాహరణంగా ఉన్నాయి పాత్రలు జీవితం నుంచి యథాతథంగా కాక మార్పులతో గ్రహించటం, ఒక పాత్ర

సృష్టికి జీవితంలో అనేక వ్యక్తుల పరిశీలనం చేయటం అవసరమన్న పద్ధతిలో సాగిన వ్యాసం. రచయిత-కావ్యసృష్టి, రూపమూ వివరించి, నటన అబద్ధాలు తెలిపి లేని గొప్పతనం ఉన్నట్లు ప్రవర్తించటం వంటి గుణాలు వివరిస్తూ చేసిన పాత్ర చిత్రణ " 'ఛ' — గారబ్బాయి'. " ఆంగ్ల సారస్వతంలోని డెక్కర్, జోసఫ్ హాల్ వంటి పాత్ర రచయితలు వాళ్ళ పాత్రీకరణలు ప్రసిద్ధమే ! ఈ రచనలు ఆ కోవలో సాగాయి.

విషయ వ్యాసం: భాష, విద్య, రాజకీయాలు ఈ రచయితను వ్యాస రచనకు పురికొల్పాయి. వ్యావహారిక భాషా విషయంలో గురజాడ అప్పారావు పంతులు గిడుగు రామమూర్తి పంతులు కలిసి సాధించిన చైతన్యం తెలుగు దేశంలో చారిత్రకంగా మిగులుతుంది. కన్నడ వ్యాకరణాల పరిణామం, తిక్కన విరాటపర్వంలో ప్రయోగించిన భాష విశదం చేయటంతోపాటు, వ్యావహారిక భాషావశ్యకాన్ని వివరించటం జరిగింది. గ్రామ్యం తిరస్కరించాలనీ, సాహితీ వేత్తలు గ్రహించరానిదిగా అనుకోకూడదనీ, గ్రాంథికంలోనే అలక్షణ ప్రయోగాలు అనేకం ఉన్నాయనీ 'గ్రామ్య శబ్ద విచారము' లో తెలిపాడు.

మద్రాసు విశ్వ విద్యాలయ సభ్యత్వం పురస్కరించుకొని, గురజాడ అప్పారావు ఆంగ్లంలో వ్రాసి సమర్పించిన పరిశీలనాత్మక నివేదికలు రెండు. అవి అనువదింపబడి, వ్యాస చంద్రికలో చోటు చేసుకొన్నాయి. ఇవి విద్యా విషయంలో రచయిత అభిప్రాయాలకు దర్పణాలు. మాతృభాష కివ్వవలసిన స్థానం, అభ్యసింపవలసిన పాఠ్యాంశాలు, తెలుగు భాషాధ్యయనంలో ఉన్న కొరవలు, కట్టమంచి రామలింగారెడ్డి వ్యక్తం చేసిన అభిప్రాయాలలో దోషాలు, పాఠ్యాంశాలుగా ఉంచవలసిన పుస్తకాలు, పాఠ్యగ్రంథాలలో లోపాలు, ఈ నివేదికలలో వివరించటం జరిగింది. ఇవి వ్యాసాలుగా గ్రహింపవచ్చు. విద్యావిధానం పట్ల మేధావి ఆలోచనలకు ఈ వ్యాసాలు ప్రబల నిదర్శనాలు.

1908లో జరిగిన మద్రాసు కాంగ్రెసు మహాసభను గూర్చి గురజాడ అప్పారావు వ్రాసిన ఆంగ్ల వ్యాసం 'హిందూ'లో ముద్రితమయింది. దాని అనువాదం వ్యాసచంద్రికలో వుంది. నాటి రాజకీయాల పట్ల వ్యాసకర్త దృష్టి తెలుస్తుంది. ఆ సభానిర్వహణలో అవకతవకలు ప్రధానంగా, రాజకీయాలు అప్రధానంగా అసహన ధోరణిలో అధిక్షేప దృష్టితో వివరించటం జరిగింది.

నాటకాది అనేక రచనల వల్ల ప్రాథమ్యం పొందిన గురజాడ వేంకట అప్పారావు పంతులు సృజన విమర్శన వ్యాస వైవిధ్య రచనకు ప్రాథమ్యం వహించాడు. వ్యాసం ఇంత హృదయ ప్రతిబింబితంగా, పూర్వం సృజనం కాలేదు. విమర్శన రచయిత మానసిక భంగిమలుగా సాహిత్య లోకంలో శాశ్వతంగా నిలుస్తాయి. అయితే రచయితను విమర్శన వ్యాసం వల్ల కంటే సృజన వ్యాసం వల్ల వ్యాసకర్తగా స్వీకరించటం సముచితం. ఈ సృజన వ్యాసాలు అనుభూతి చిహ్నాలుగా చిరకాలం తెలుగు సాహిత్యంలో వెలుగుతాయి.

## 2. గిడుగు వేంకట రామమూర్తి పంతులు (1862-1940)

గిడుగు వేంకట రామమూర్తి పంతులు ఆధునికాంధ్ర వ్యావహారిక భాషా స్వరూప స్వభావాలు సమగ్రంగా నిర్ణయించడానికి కృషి చేసిన ఆద్యులలో ప్రాముఖ్యం పొంది అగ్రపీఠం అధిష్ఠించిన తెలుగుబిడ్డ. గ్రాంధిక భాషా కృషి జీవితాంతం సాగించిన పరవస్తు చిన్నయసూరి మరణించిన సంవత్సరమే పుట్టిన గిడుగు, గురజాడలు వ్యావహారిక భాషా కృషికి సూర్యచంద్రులయ్యారు. భాషా భవితవ్యం జాతి జీవనాడి పట్టిచ్చేదిగా ఉండాలని బ్రతుకంతా పరిశ్రమించిన ధన్యజీవి గిడుగు రామమూర్తి పంతులు.

ఆంగ్ల విద్యాభ్యాసంతో నూత్న దృక్పథాలు కలిగించుకొని సవర భాషను సముద్ధరించి, వ్యావహారిక భాషావాదం పూని, వ్యాసాలు వ్రాసి, ఉపన్యాసాలిచ్చి, 'తెలుగు' పత్రిక నడపి, ఆంధ్రదేశమంతా పర్యటించి, ప్రతిక్షణం ఆలోచించి, ప్రతి ఘడియ కృషి చేసి, తను నమ్మినసత్యం, రాష్ట్ర వ్యాప్తం కావించిన రామమూర్తిపంతులు ఆంధ్రభాష నోముపంట.

ఈ రచయిత వ్యావహారిక భాషాకృషి జీవిత దీక్షఅయినా, వ్యాసరచన ప్రారంభించింది ఆలస్యంగానే. "తాను తెలుగుభాషలో చేసిన కృషి అంతా తాను ఉద్యోగంనుంచి విరమించినతర్వాతే చేసేను అన్నారు." [10]అనటం గమనార్హం. 1933 లో సంకలనాలుగా రూపొందిన నాలుగు గ్రంథాలలో 'గద్య చింతామణి' దూరంగాఉంచి ఆలోచిస్తే, కొన్ని 1913 ప్రాంతంలో ప్రచురమయినట్లు తెలుస్తుంది. అప్పటికి ఈ భాషావాదం లోకానికంతా తెలుసు. జీవితాంతం చేసిన వాదోపవాదాలు, రచనలు పునఃపరిశీలనం చేసి, వ్యాసాలుగా రూపొందించటం ఆలస్యంగా జరిగినా, ఆ భాషావాదముద్ర దేశంలో ఈ వ్యాసరచనకంటే పూర్వం

నుంచేఉంది కనుక, ఈ యుగంలో ఈ రచయిత వ్యాససృష్టిని గూర్చి ఆలోచించటం జరిగింది. ఈ ఇరవై నాలుగు వ్యాసాలు కనీసం మూడు దశాబ్దాలు ఆలోచన పొంది, పాక్షికంగా, అసంపూర్ణంగా లోకంలో ప్రచారమై, చివరకు వ్యాస రూపం పొందినట్లు భావించే అవకాశం ఉంది.

గిడుగు సప్తతితమ జన్మదినోత్సవ ప్రచురణాలుగా వెలువడ్డవాటిలో 'వ్యాసావళి'లో 11 వ్యాసాలున్నాయి. అందులో 7 ఆంగ్లవ్యాసాలు కాబట్టి, వ్యాస పరిణామార్థం నాలుగు వ్యాసాలు, విషయ గ్రహణార్థం పూర్తివ్యాసాలు గ్రహింపవచ్చు. డా॥ బూదరాజు రాధాకృష్ణ అనువదిస్తే విశాలాంధ్ర ప్రచురణాలయం వాళ్ళ ముద్రణలో తెలుగు వ్యాసాలుగానే ఉన్న వీటిని అనువాదవ్యాసాలుగా పరిశీలింపవచ్చు. ఒకఉపన్యాసం, మూడు పీఠికలు వ్యాసాలుగా ముద్రితాలయ్యాయి. కాబట్టి ఇందులో మొత్తం వ్యాసాలు 15 ఆంధ్ర 'పండిత భిషక్కుల భాషాభేషజము'లో ఆ పేరుతోనూ 'మిథ్యాపవాదము' పేరుతోనూ ఉన్న వ్యాసాలు 2. 'బాలకవి శరణ్యము'లో 'ఉపోద్ఘాతము'ఒకచిన్నవ్యాసంగా గ్రహింపవచ్చు. ఈగ్రంథమంతా ఒక వ్యాసంగానయినా, లేకపోతే నలభై ఐదు చిన్నవ్యాసాలుగా అయినా స్వీకరింపవలసి వుంటుంది. కాబట్టి ఒక్క వ్యాసంగా భావించితే బాలకవి శరణ్యములో ఉన్న వ్యాసాలు మొత్తం 2. గద్యచింతామణి ఉపోద్ఘాతం ఒక వ్యాసంగా పరిగణింపవచ్చు. ఇంకా'నిజమైన సంప్రదాయం' వ్యాసమే కాబట్టి, మొత్తం 21. ఇవి ఉపన్యాసాలుగా, పీఠికలుగా, ఉపోద్ఘాతాలుగా ఉన్నా, వ్యాసాలుగా భావితాలయ్యాయి.

ఈ వ్యాసాలు వ్యావహారికభాషలో ఉన్నాయనటం నిజానికి అనవసరమే. అనువాదంగా ఉన్న వ్యాసాలుకూడా వ్యావహారికంగానే ఉన్నాయి. వాటి పరిమితి మూడు పుటలనుంచి 35కి పుటల వరకు వ్యాపించింది.

ఈ వ్యాసాలు గ్రాంథిక భాషా రచనను విమర్శించి, వ్యావహారిక భాషా రచనను సమర్థించేవిగా ఉన్నాయి. వీటిలో ప్రధాన విషయ వ్యక్తీకరణం, విస్పష్టంగా, విశిష్టంగా వాదబలంతో, ఆత్మశక్తితో ఉంది. ఇంతగా వస్తు ప్రాబల్యమున్న రచనం విమర్శ్యంగా రూపొందించవలసింది కాని, రచయిత వ్యక్తిత్వం వల్ల వ్యాసంగా రూపొందించింది. ఈ భావపట్ల రచయిత పట్టుదల, సత్యదృష్టి, దీక్ష, ఉపన్యాసంలో నిర్భీతి, వాక్చాతుర్యం, ఏకాగ్రత, అన్య పండితులను

ఖండించేటప్పుడు విషయ నిష్ఠితమైన విమర్శ, వ్యక్తిదూషణ రహితత్వం, తన వాదంపట్ల అచంచల విశ్వాసం, ఈ వ్యాసాలలో వాక్యాలలో పదాలలో ప్రతిక్షణం యెదురై, ఈ గుణాలు ఈ రచనలకు వ్యాసస్థానం సముపార్జించాయి.

వ్యాస విషయం అన్నింటిలోనూ ఒక్కటే! అది వ్యావహారిక భాష. దానిని వాదించడానికి, సమర్థించడానికి ఎన్ని ఉదాహరణలు కావాలో, ఉక్తులు యుక్తులు కావాలో, కృషీ పాండిత్యం అవసరమో, అన్నీ ప్రదర్శించిన రచనలే యీ వ్యాసాలు.

ఈ రచయిత స్థూలంగా బోధించిన భాషా విషయాలు గమనించాలి. ఈ రచయిత కృషి అంతా ఒక్కమాటలో 'నోటిమాటకూ చేతివ్రాతకూ' పొత్తు కుదర్చటం. భాషకు పరిణామం సహజధర్మం. ఏనాటి భాషకు ఆనాటి వ్యవహార రూపం ఉండటం సాధారణం, అవసరం అనీ. వ్యావహారిక భాష దోష భూయిష్టంగా, గ్రాంథిక భాష నిర్దుష్టంగా భావించి, ప్రాచీన గ్రంథాలలోని వ్యావహారిక రూపాలు దిద్దటానికిచేసే ప్రయత్నం తప్పు అనీ, గ్రాంథికమంటూ ఒక భాష లేదు, అనేక వ్యావహారిక భాషలున్నాయనీ, భాష నియమాలకు లొంగిఉండదనీ, దాన్ని వివరింపవచ్చుకాని, స్థిరం చేయకూడదనీ, భాషాప్రయోగాలు వ్యాకరణాల కంటే బలవత్తరాలనీ, అపశబ్దం, సుశబ్దం నిర్ణయించడంలో చారిత్రంగా నిర్ణయించడమే ముఖ్యమనీ, భాషను నిశితంగా శాస్త్రజ్ఞుడిలాగా విభజించి పరిశీలించి చూశాడు గిడుగు.

గిడుగు రామమూర్తి పంతులు భాషా విషయాలు, వ్యాకరణ సంగతులు వ్యాసంలో సృజనంగా వ్రాయటం సాగించిన విమర్శకుడు, ఉపన్యాసం ఇవ్వటం వ్రాయటంతోపాటు వ్యాసం వ్రాయటంకూడా సాగించిన వ్యాసకర్త, పీఠికలు ఉపోద్ఘాతాలు వ్యాసాలవుతాయన్న స్ఫూర్తికి కారణమైన రచయిత.

ప్రవాహ శీలమయిన భాష ప్రాణశక్తి గుర్తించి, పరిశోధన కావించి తత్ఫలితాలు వెలయించి, జాతికి ఉపకారం చేసిన గిడుగును పిడుగుగా భావించిన నాటినుంచి, నేటిదాకా ఆ ధ్వని ఆంధ్రదేశంతో మార్మోగుతూనే వుంది. తన పాత్ర చారిత్రకంగా నిర్వహించిన గిడుగు ఆత్మ నేటి వ్యావహారిక భాషాభ్యుదయపథం చూచి ఆనందిస్తుంది. భాషావిషయం సృజనవ్యాసంగా నిర్మించి, వ్యాస పరిణామంలో సృజన సామర్థ్యం పెంచిన వ్యాసకర్త గిడుగు రామమూర్తి పంతులు.

## 3. కందుకూరి అనుయాయులు

ఈ యుగంలో కనిపించే రచయితలమీద, వ్యాసం కంటే ఉపన్యాసం ప్రభావం ప్రసరించిందని, కందుకూరి వీరేశలింగం పంతులు రచనా విధానం ప్రేరేపించటం వల్ల ఉపన్యాస సృష్టి కావించిన వాళ్ళు అనేకులున్నారని, బోధ పడుతుంది. ఈ యుగంలోనే కందుకూరి సాహిత్యాన్ని విమర్శించటం కూడా బాగా జరిగింది. ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా నయినా, ఈ యుగంలో ఈ వ్యాసకర్త ప్రభావంతో రచనా కృషి సాగించిన వాళ్ళు, వాళ్ళ రచనలు ఉన్నట్లు స్పష్టమవుతుంది. అందువల్ల ఈ ఉపన్యాస కర్తల వాఙ్మయసేవ పరికింపవచ్చు.

## 1. రాయసం వెంకట శివుడు

రాయసం వెంకట శివుడు కందుకూరి వీరేశలింగం పంతులుతో సన్ని హితంగా మెలిగిన వ్యక్తి. రచనా సూచన లిచ్చిన వ్యక్తి. తన రచనా వ్యాసంగంలో శిష్యరికం చేసిన సాహితీవేత్త. ''శ్రీ వీరేశలింగముగారు నా కెంతయు స్మరణీయులు. గురువులు. చిరకాల పరిచితులు'' (వ్యాసావళి రెండవ భాగము-పుట 108). పత్రికారచయితగా, సంపాదకుడుగా గురువు అండదండలు పొందిన వ్యక్తి.

'వ్యాసావళి' ప్రథమ భాగంలో 32, ద్వితీయ భాగంలో 33, 'గృహ నిర్వహకత్వము'లో 11, 'వ్యాసము' 1-మొత్తం 67 వ్యాసాలు ఈ రచయిత సృష్టి. వ్యాసావళిలో రచనలు సృజనంగా, 'గృహనిర్వహకత్వము' లోని వ్యాసాలు ఆర్థిక శాస్త్ర రచనలుగా, 'వ్యాసము' విమర్శనంగా ఉన్నాయి.

విజయవాడలో సి. యం. యస్. పాఠశాల అధ్యాపకుడుగా, 'జనానా పత్రికా' సంపాదకుగా. వ్రాసిన అనేక వ్యాసాలు. నెల్లూరు శ్రీ వేంకటగిరి రాజా వారి కళాశాలాధ్యక్ష పదవిలో ఉండి వ్యాసావళి సంపుటాలుగా 1925-26 లలో ముద్రించినా, వాటి రచనా కాలం ప్రధానంగా 1890-1915 మధ్య ప్రాంతమే.

'వ్యాసము' ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలో (1931-32) ప్రచురితమైన లక్షణ వివరణం చేసే వ్యాసం. ''భావమెంత గూఢమయ్యెను,

తేటఁదనము గలిగి మృదుపద లలితమై, యొప్పారుట వ్యాస లక్షణము'' అనీ, ఉద్గ్రంథములందు వలె వ్యాసమందు శాస్త్ర చర్చలు, ఖండన మండనములు, విరుద్ధాంశ సామరస్యములు సమకూర్పరాదు. పదముల పరుసదనము లేక, కుఱుచదనము గలిగి, కొంత వఱకు క్రమభంగము నొంది వ్యాసము ఉండ జెల్లును. చర్చ యుండినను, అది యున్నదా లేదా యను సందేహాస్పదమై యుండనొప్పును. తర్కసహితమైనను తర్కరహితముగ గాన్పించు వ్యాస రచన నిర్దుష్ట చమత్కృతికి దార్కాణమై యుండును" అని తెలిపాడు. ఈ వ్యాసంలో అనేక వ్యాస సంబంధి అమూల్యాంశా లున్నాయి.

గృహనిర్వాహకత్వముఁ ద్వితీయ ముద్రణము (1899) తెలుగు దేశపు స్త్రీ లకును పాఠశాలలలోని బాలికలకును గృహ యజమానులకును మిగుల నుప యుక్తముగ నుండు నట్టిదిగా వుంది. ఆరోగ్యానికి సంబంధించిన అనేకాంశాలు తెలిపి, ప్రకృతిని ఏ విధంగా ఉపయోగించుకోవచ్చునో వివరించి, వస్త్రాభరణ సంబంధిగా వ్యయం చేయటాన్ని హెచ్చరించి, ఆర్థికంగా అభివృద్ధి పొందటం వంటి భిన్న విషయాలు వ్యాసాలుగా రూపొందించాడు.

వ్యాసావళి సంపూటాలలో 'సత్యము' 'సంతృప్తి' 'భూతదయ' 'దానములు' వంటి భావాలు, 'చందన వృక్షము' 'పుష్పములు' వంటి ప్రకృతి, 'వసంత ఋతువు' 'వానకాలము' 'చీమలు' 'సాలెపురుగు' 'గాడిద' మొదలైన పురుగులూ పశువులు, పిల్లల ప్రేమ, జీవితాభివృద్ధి, విద్యా విషయాలు 'చంద్రుడు' 'వెన్నెల' వంటి అనేక విషయాలు సృజనంగా వ్యాసాలు రూపొందాయి. చీమలు విషయం నాలుగు వ్యాసాలలో ప్రపంచితమయింది. 'అసమ వివాహము' 'సంఘ సంస్కరణము' వంటి సాంఘిక విషయగతంగా వ్యాస సృష్టి తక్కువ. 'ఉత్తర గోగ్రహణము' కవితా విమర్శనంగా వుంది.

ఈ 'వ్యాసావళి'లో పశు పక్ష్యాదులు, చెట్టు పుట్టలవంటి ప్రకృతి ఆధిక్యం ఈ రచయిత అందరికి పరిచితమయిన అంశం ఆనంద పర్యవసాయిగా వివరించటం తక్కువ. నూత్నాంశం బోధించాలన్న అధ్యాపక మనస్తత్వం వ్యాసకర్తమీద ప్రభావం చూపించింది. వ్యాసాలు చాలా చిన్నవిగా ఉన్నాయి. విషయ వివరణం మీద రచయితకు ఆసక్తి అధికం. వ్యాసం విజ్ఞానాత్మకంగా ప్రజాభ్యుదయ ప్రదర్శకంగా ఉండాలని రచయిత వాంఛించాడు. ఈ వ్యాసాల

కున్న సాంఘిక ప్రయోజనం ఆనందం కంటే భిన్నం. విషయ విభజనంలో రచయితకు జాగ్రత్త ఎక్కువ. ప్రధానాంశం అంతర్విభజనం చేసుకొనేటప్పుడు ఉదాహరణ బలం రచయిత గ్రహించాడు.

సృజనాత్మక రచనా విధానానికి "వెన్నెలయును, జంద్రుడును లేని యెడల మనుజుల సౌఖ్యమును, భూమి యొక్క సౌందర్యమును మిక్కిలి కొఱంత పడి యుండుననుటకు సందియము లేదు. బాల ప్రాయమునుండి వార్థక్యము వఱకును నిరక్షర కుక్షులకును, కవి సార్వభౌములకును రాజాధిరాజులకును వెన్నెల హర్షదాయకము.'' (వెన్నెల. వ్యాసావళి. ప్రథమభాగము. పుట 16) ఉదాహరణంగా చూడవచ్చు. ప్రజల మూఢ నమ్మకం నిరసిస్తూ "పిచ్చి నమ్మకము గల వారు ఇది భగవంతుని దండనయో లేక మఱియే కీడునకో చిహ్న మనియో భావింతురు'' (కొమ్ములుగల స్త్రీ పురుషులు - వ్యాసావళి- రెండవ భాగము - పుట 79) అని తెలిపాడు.

రాయసం వెంకటశివుడు మేధావి. హృదయబలం అధికంగా ప్రదర్శించకుండా బుద్ధిని వినియోగించి, దేశ శ్రేయం కాంక్షించి, వ్యాస రచన చేసి, పత్రికా సంపాదకుడై ప్రసిద్ధి పొందిన వ్యక్తి. ఉపన్యాస రచనా కాలంలో తద్రీతిని ప్రదర్శిస్తూ సాగిన ఈ వ్యాసాలు ఎన్ని భిన్న విషయాలకు స్థానాలో గుర్తిస్తే, వ్యాస విషయ విస్తృతి తెలుస్తుంది.

## 2. బేతపూడి భగవంతరావు

బేతపూడి భగవంతరావు వ్రాసిన ఉపన్యాస మంజరి (1913) రెండు సంపుటాలు ముద్రితమయింది. ఇవి లిఖింపబడక పూర్వం 1909 ప్రాంతంలో ఆంధ్ర దేశంలో అనేక పట్టణాలలో ఉపన్యసింపబడి ప్రచారమయ్యాయి. 'గాన సారము' (1909) సంగీత విద్యా సంబంధి వ్యాసం. మొత్తం మీద ఈ వ్యాసకర్త సృష్టిగా ఈ 21 ఉపన్యాసాలు పరికింపవచ్చు.

ఇవి ఉపన్యాసాలుగా వినిపించి, పత్రికలలో కనిపించి మాత్రమే కాక 'ఉపన్యాస మంజరి' సంపుటి గతంగా ముద్రితమయి, కందుకూరి వీరేశలింగం ప్రభావం గోచరింపజేస్తున్నాయి ప్రక్రియ పరకే ప్రభావం పరిమితమయింది. రచనం, విషయ గ్రహణం రచయిత స్వయంగా సిద్ధింప జేసుకొన్నాడు.

ఈ వ్యాస కర్తకు కళాజాత్యభిమానాలు ఎక్కువ. అవి క్షీణిస్తుంటే సహించలేక, ఉపన్యాస విధి నిర్వహించాడు. స్థూలంగా ఆంధ్రాభ్యుదయం రచయిత వాంఛ. దీనికి అవసరమైన అంశాలు స్వీకరించి, ఉపన్యసించి, రచించి ప్రచురించాడు.

విషయ వ్యాసం: కవులు పత్రికాధిపతులు, ఉపన్యాసకులు, హరికథకులు, నాటక ప్రదర్శకులు దేశోద్ధారకులని రచయిత భావించి, వాళ్ళ కృషి వివరించటం జరిగింది. లలిత కళల పట్ల రచయిత అభిమానం స్పష్టమయింది. రచయిత సాంఘికావసరాలు గుర్తించి, రైతుల అభివృద్ధి, వ్యాపార పురోగమనం, విద్యార్థులకు అర్థవంతమైన జీవితం శారీరకారోగ్యం గూర్చి వ్యాసాలలో వివరించాడు.

ఉపన్యాసం ఇవ్వవలసిన తీరు, తత్కర్త బాధ్యత, ఆవశ్యకాలు వివరించి, శ్రోతృనియమాలు తెలిపి, అవి వ్యాసాలుగా వ్రాయటాన్ని గూర్చి శాస్త్రీయంగా ఆలోచించిన ఈ వ్యాసకర్త లాక్షణిక బుద్ధి ఈ వ్యాస గతంగా ఉంది. ''స్వయముగఁ బ్రపంచమును దరిచి, గుణ దోషములను విమర్శించి గుణమును శ్లాఘించుచు, దోషమును నిరసించుచు, ప్రజలకు బోధించు బుద్ధి స్వాతంత్ర్యము గలవారు'' (ఉపన్యాసకులు - ఉపన్యాస మంజరి ప్రథమ భాగము-పుట 27) ఉపన్యాసకులని, ''వ్రాత మూలమైన బోధకంటే నీతని వాఙ్మూలమైన బోధ శ్రోతల హృదయ మందు మిక్కిలిగ నాటుకొనును'' (అదే. పుట. 29) అని తెలిపి ఉపన్యాసకుడి ఆధిక్యం వివరించాడు.

"నీ వెవరవు ?''అన్నమాట పది విధాలుగా ఉచ్చరించి, పది భిన్నార్థాలు సాధింప వచ్చునని రచయిత అభిప్రాయం. ఆ అనుకూలత ముద్రిత వ్యాసానికి లేదని పిండితార్థం. ''కొందఱు తాము లేఖన మూలమున బోధించు ధర్మముల నుపన్యసింపఁ జాలకయు, మఱికొందరు తాముపన్యసించు ధర్మముల లిఖియింప జాలకయు నున్నారు'' (వ్యాస లేఖనము-పుట. 149) రెండింటి సాధక బాధకాలు గుర్తించాడు.

ఈ రచయిత వ్యాసరచనా సామర్థ్యం వివరించడానికి యత్నించటం గమనింపవచ్చు. ''లేఖకునకు వలయు శక్తులలో మొట్టమొదటిది కల్పనాశక్తి'' (వ్యాసలేఖనము-పుట. 150) వ్యాసాలలో శైలీ సంబంధమైన ఆలోచన కూడా

చేశాడు. ఉపన్యాస దక్షత, వ్యాస సృష్టి సంఘోపకారకాలని ఈ రచయితకు ప్రగాఢ విశ్వాసం.

నిర్మాణ వ్యాసం పరిమితంగా వుంది. సంబోధనంతో ప్రారంభమయి, సారాంశ పద్యంతో సమాప్తమయింది. ప్రతి వ్యాసంలో నీత్యుపదేశం, ధర్మ బోధ బాహాటంగా గోచరమయ్యాయి. వ్యాసం ఒకటి, రెండు, మూడు భాగాలుగా విభజించి, విభజన చూపుతూ వ్రాయటం కనిపిస్తుంది. రచయిత ఉపన్యసించటంలో పొందిన చాతుర్యం రచనలో చూడవచ్చు. ప్రతి క్షణం రచయిత, ఉపన్యాసకుడిలాగా సదస్యులతో మాట్లాడుతున్న ధోరణి ప్రత్యక్షమవుతూ వుంది. వింటున్నవాళ్ళు విసుక్కుంటారనుకొన్నచోట హాస్యోక్తులు ప్రయోగించటం, విషయం శ్రోతలు భరించలేరనుకొన్నచోట చెప్పవలసింది తగ్గించటం, ఆసక్తిగా వింటున్నారనుకొన్నప్పుడు చిన్న విషయమే తీగెలు సాగదీయటం, చిన్నకథలు, పద్యాలు వివరణార్థం ఉదాహరించటం ఈ వ్యాసాలలో దర్శింపవచ్చు.

ఇవి ఉత్తమోపన్యాసాలు, వ్యాసాలుగా అవిష్కృతమయితే వ్యాసరూపం ప్రదర్శించేవి. భాష జాగరూకంగా ప్రయుక్తమయింది కాని పరిష్ఠంగా ఉందనే వీలు లేదు. ఆలోచనలో విశాలత్వం విస్తృతత్వంఉన్నాయికాని, లోతు వెదుకవలసివుంది.ఈ వ్యాసాలు దేశాభ్యుదయంపట్ల రచయితకున్న ఆవేదనకు రూపకల్పనలుగా ఉన్నాయి. సాహిత్య ప్రయోజనంతో పాటు సాంఘిక ప్రయోజనం కాంక్షించి ఆంధ్రుల అవసరాలకు కొంత వరకు ప్రతిబింబాలుగా ఉన్నాయి ఈ వ్యాసాలు.

## 3. కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి ఆర్ష ధర్మం, ప్రాచీన జీవిత విధానం, పూర్వ సంస్కృతి రక్షించాలని, ఆంగ్లేయ పరిపాలనం వల్ల జాతి జీవితంలో వచ్చే అనర్థాలను ఖండించాలనీ గాఢంగా వాంఛించి, తత్పరిపూర్తికోసం వ్యాసరచన కావించిన రచయిత. ఈ రచయితవి కొన్ని వ్యాసాలు మాత్రమే ఉపన్యాస పయోనిధి (1910) లో ఉన్నాయి వీటిని 1890-1910 మధ్య కాలంలో వ్రాశాడు.

కందుకూరి సృష్టి ఉపన్యాసం, రచనా ప్రక్రియగా కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి గ్రహించాడు. ఆ రచయిత ఆంగ్లవిద్యా ప్రభావంతో సాంఘిక పరిణామం కాంక్షించే స్థితిని నిరసించి, ఆ వ్యాస వాఙ్మయంలో విమర్శించాడు.

ఈ వ్యాసకర్త వ్యాస కృషి, భాషా, భావ, మతపరిధీ ప్రవర్తకంగా, పరిమితంగా ఉంది. గ్రామ్యం కాదు గ్రాంథికం ప్రయోగించాలని, కరపత్రాలు ప్రచురించి, పానుగంటి వంటి వాళ్ళను ప్రోత్సహించి, గిడుగువంటి వాళ్ళను విమర్శించాడు. నూత్న భావాలు, సాహితీ సిద్ధాంతాలు, రచనా రీతులు రచనా అసంబద్ధంగా ఉన్నాయని, మాతృభూమి సంప్రదాయాలకు, వాంఛలకు నష్ట కరంగా ఉన్నాయని తిరస్కరించాడు. ఆ దృష్టితోనే, నూత్నతను చేపట్టిన కందుకూరి వంటి వాళ్ళను విమర్శించాడు. హిందూదేశంలో హైందవ మతం తప్ప అన్య మతం విజృంభించకూడదనీ, అది దేశ సంప్రదాయ భంగకరమనీ భావించి, హిందూ మతౌన్నత్యాన్ని, అన్య మత నైచ్యాన్ని తీవ్రంగా తెలిపిన వ్యాసకర్త దృష్టి పరిశీలింపవలసి వుంటుంది.

ఈ రచయిత వ్యాసాలు ఇంకా రెండు సంపుటాలు మత విషయిక వ్యాసాలతో, రెండు మూడు భాషా వాఙ్మయ వ్యాసాలతో ప్రచురింపవచ్చునని నంది రాజు చలపతిరావు అభిప్రాయం. అయితే మూడు వ్యాసాలు, 'భాస్కరోదంతము' (1898)లో ''కాబట్టి సర్వ విధముల రామాయణ కవి హుళక్కి భాస్కరుడే కాని మంత్రి భాస్కరుడు కాదని లోకము గ్రహింపవలయును'' (పుట 74) అనీ, 'నన్నయ భట్టారక చారిత్రము' (1901)లో ''మనలోఁ బూర్వ కవి చారిత్రము అనేకము లీనడుమ నుత్పన్నములైనవి'' (పుట 1 పీఠిక) అనీ, 'బ్రాహ్మణులు శూద్రుల కన్యాయము చేసిరా?' (1917)లో, 'ఆంధ్ర కవులలో క్షత్రియుల కంటేను, వైశ్యుల కంటేను శూద్రులే హెచ్చుగా నున్నారని చదు వరులు గ్రహించుకొనవలెను'' (పుట 3 పీఠిక) అనీ సాహిత్య విమర్శనం తెలుపుతున్నాయి. విమర్శన వాఙ్మయం కులమత పరిధిని అతిక్రమించాలనీ, గ్రాంథిక భాషనే ప్రోత్సహించాలనీ, వ్యాసకర్త దృష్టి.

ఉపన్యాస పయోనిధిలో ఆంధ్రులలో సాంఘిక నీతి మతాలలో వచ్చిన మార్పులు, బ్రహ్మ సమాజాకర్షణ, ఖండాంతర ఖ్యాతి ఉన్న పవిత్రులు, కందు కూరి మత దృష్టి విమర్శన, భారత దేశౌన్నత్యం తెలిపిన పశ్చిమ ఖండ పండితుల అభిప్రాయాలు వివరించాడు. అయితే స్థూలంగా బ్రహ్మయ్య శాస్త్రి కృషి అంతా హిందూ మత ప్రాశస్త్యం వెల్లడించడమే.

ఆంధ్రుల ఆధిక్యం తెలిపే వ్యాసాలనేకం ఈ సంపుటిలో ఉన్నాయి. ఇది 42 వ్యాసాలతో 470 పుటలతో వుంది. "జీవన్మత లక్షణములన్నియు నొక్క హిందూ మతమునందు మాత్రమే పుట్టినవి" (పుట 50) అనీ, విద్యార్థులకు వేదాంతం బాల్యంనుంచి నేర్పాలని రచయిత అభిప్రాయాలు. అన్యమత ప్రాచుర్యం అరికట్టాలని ప్రబోధం, బ్రహ్మసమాజమతం, క్రైస్తవ మతం, దేశగౌరవ భంగకరాలని తలంపు, కృష్ణుడు జారుడు కాడనీ, హిందూ మతాలు ఉన్నతాలనీ, భగవద్గీతా ప్రాశస్త్యం, హిందూ మతౌన్నత్యం వివరించిన వ్యాసాలిందులో ఉన్నాయి.

బ్రహ్మ సమాజ మతంలో హిందువులు అందరూ చేరిపోవాలని ప్రచారం ఉద్ధృతంగా ఉన్నప్పుడు పలువురు ప్రముఖులు ఆ మతంలో చేరుతుంటే తీవ్రంగా ప్రతిఘటించిన మనీషి బ్రహ్మయ్యశాస్త్రి. శంకరాచార్యులు, అభేదానందస్వామి మొదలైన విశిష్టులను గూర్చి ప్రపంచమే గుర్తించిందనీ, దేశం గ్రహించాలనీ వ్యాసాలలో ప్రబోధించటం చూడవచ్చు.

కందుకూరి వీరేశలింగం పంతులు మత విషయికంగా, సాంఘికంగా, అభివ్యక్తం చేసిన అనేకాంశాలు విమర్శించి, ఖండించి, వివాదంగా రూపొందించి, వ్యాస సృష్టి చేశాడు కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి. యజ్ఞోపవీత విసర్జనం, అద్వైతం, ఆత్మజ్ఞానం, శ్రీకృష్ణ జీవితం, పాపి శిక్షణ, బ్రహ్మసమాజం మొదలైన అనేక విషయాల పరస్పరాభిప్రాయభేదం వల్ల విమర్శకు గురి అయ్యాయి.

నిర్మాణ వ్యాసం: వ్యాసం ప్రధానంగా వివాద విషయ నిష్ఠంగా వుంది. విమర్శనం, వివరణం ప్రధాన వ్యాసరీతులుగా ఉన్నాయి. ఒక్క అంశం వివరించటానికి అనేకోదాహరణలు గ్రహించటం వ్యాస ధర్మంగా రూపొందింది. క్రీస్తు మత శాఖలు వ్యాసంలో ఒక్క పేరా తెలుగు ఉంటే, 9 పుటల ఆంగ్లోదాహరణం ఉంది. 'ఏకేశ్వరవాదము'లో రచయిత వాక్యాలు తక్కువ. ఈ వ్యాసాలలో సంస్కృతాంగ్ల నిర్వచన స్వీకరణం బహుధా విస్తరిల్లింది.

వ్యాసకర్త ప్రాచీనతావాది. తద్గౌరవం ఉన్న వ్యక్తి. మత విషయికంగా తీవ్రదృష్టి ఆ విధంగా వ్యాస సృష్టి కనిపించాయి. హైందవమయిన సమస్తం సమారాధ్యంగా, తదన్యం ఖండనార్హంగా రచయిత భావన. విషయం తీవ్రమయినా, దృష్టి తీవ్రమయినా, వాక్కులో తీవ్రత లేదు. విమర్శనం సౌమ్యంగా

ఉంది. కందుకూరిని కూడా కఠినంగా మాట అనలేదు. విమర్శనం విశిష్ట సంస్కార సహితంగా గోచరమవుతుంది. సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో కూలంకష పాండిత్యంలో ఈ వ్యాసాలు శోభావంతంగా ఉన్నాయి. భాషా ప్రయోగంలో నైపుణ్యం, రచనారీతిలో సామర్థ్యం, విమర్శనంలో యుక్తి రచయిత ఆస్తులుగా కనిపించాయి.

ఆధునిక భావ విప్లవంలో లోకం కొట్టుకుపోతుంటే, దానితో మంచి చెడ్డలు అడ్డమాకలు లేకుండా పోవటం సహజమే! ఈ పరిస్థితిలో కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి వ్యాసాలు, ఉచితానుచితాలు యోగ్యతాయోగ్యతలకు మధ్య ఉత్తమావరోధాలుగా నిలచి, అసంకల్పితంగా, ఆధునికతలోని ఉచితం యోగ్యం మాత్రమే సంఘంలోకి ప్రవేశించే స్థితికి దోహదం చేసి చారిత్రక ప్రయోజనం సాధించాయి.

## 4. అత్తిలి సూర్యనారాయణ

ఈ వ్యాసకర్త కందుకూరి వీరేశలింగం పంతులు ప్రభావానికి లోనయినట్లు వ్యాసాలు నిరూపిస్తున్నాయి. ఇవి మూడు మాత్రమే లభించాయి.

1. విద్యార్థుల యర్హ్యకృత్యములు
2. ఈశ్వరోపాసన
3. సంఘ పారిశుద్ధ్యము - అభ్యాస ప్రభావము.

ఇందులో మొదటి రెండు 1904 లో యఫ్. ఎ. విద్యార్థిగా రాజమండ్రి కళాశాలలో ఉన్నప్పుడు వ్రాశాడు. మూడవ వ్యాసం 1909 లో కాకినాడ పి. ఆర్. కళాశాలలో అధ్యాపకుడుగా ఉన్నప్పుడు విరచించాడు.

విద్యార్థి దశ, తమ గదులు శుభ్రంగా ఉంచుకోవటం, బూటకపు మిత్రుల్ని తొలగించుకోవటం, అతి బాల్యంలో వివాహం చేసుకోకుండా ఉండటం కాలం విలువ తెలుసుకోవటం విద్యార్థులు చేయవలసిన పనులుగా బోధించి, అందరూ ఏకేశ్వరోపాసనాపరులు కావాలని వాంఛించి, పరిశుభ్రత, ఆరోగ్య విషయాలలో సంఘం చైతన్య పూరితం కావాలని కోరి, తన వ్యాసాలవల్ల సాంఘిక ప్రయోజనం సాధించాలని ఈ రచయిత ప్రయత్నించాడు.

## 5. శంకర వెంకట్రామయ్య

శంకర వెంకట్రామయ్య వ్యాస సంపుటి 'మత సంఘ విషయకోపన్యాసములు' (1906) ఉపన్యాస ధోరణిలో రూపొందాయి. ఈ రచనలు హృదయ జన్యాలు కాని బుద్ధి జన్యాలు కావని, "These are the outpourings of a feeling heart rather than of a enlightened intellect." అనే మాటల్లో తెలపటం జరిగింది. ఈ పన్నెండు వ్యాసాల సంపుటిలో బ్రహ్మ మతము ప్రధాన విషయం. స్త్రీ పునర్వివాహ విషయమూ వుంది.

బ్రహ్మ మతము, స్వాభావిక మతమనీ, మనిషికి మత జ్ఞానం అభివృద్ధి కావాలనీ, బ్రహ్మ స్వరూపం గుర్తించాలనీ, బ్రహ్మమత ధర్మాలు తెలుసుకోవాలనీ, ప్రగాఢ మత దృష్టి ప్రదర్శించిన వ్యాసాలు ఈ సంపుటిలో ఉన్నాయి. స్త్రీకి నిర్బంధ వైధవ్యం కూడదనీ, వివాహం మళ్ళీ చేయటం సముచిత మనీ వివరించటం జరిగింది. హిందూ సంఘాన్ని సంస్కరించాలనీ, జనులందరికీ ఉపకారం జరగాలని, స్వదేశవస్తు ప్రేరణం ఉండాలనీ, మాంసం భక్షించ కూడదనీ రచయిత ప్రబోధం.

ఈ వ్యాసాలు సృజన ధర్మ శోభితాలు. రచయితకున్న అభ్యుదయ వాదన, కల్పనా సామర్థ్యం వ్యాస ప్రకాశానికి దోహదం చేశాయి. ఈ కాలంలో రచయితలు చాలామంది మతదృష్టి, తమ సారస్వతం ద్వారా ప్రచారం చేయటం లక్ష్యంగా ఉంచుకొన్నారు. ఈ వ్యాసాలు ఆ కోవలో సాహితీ పరిమళంతో శోభించాయి.

## 6. ఓ. వై. శ్రీ దొరసామయ్య

ఈ వ్యాసకర్త వ్యాసం 'పాతివ్రత్య లక్షణము–సత్పురుష లక్షణము' (1906 మూడవ కూర్పు) రెండు భాగాలుగా వుంది. పతివ్రతకు, సత్పురుషుడికి ఉండవలసిన సల్లక్షణాలు వివరంగా, సృజనంగా ఈ వ్యాసంలో తెలపటం జరిగింది. ఈ కాలంలో స్త్రీకి అభ్యుదయం వాంఛించటం, స్త్రీకి నీతి బోధించటం, స్త్రీకి సద్గుణాలుండాలని కోరటం సామాన్యంగా వుంటే, ఈ వ్యాసకర్త స్త్రీ పురుషులకు మంచి గుణాలుండాలని ఆశించటం ఉత్తమ దాంపత్య జీవిత దర్శనార్థమనిపిస్తుంది. సత్యసాధని పత్రికా సంపాదకత్వం వహించి సారస్వత సేవ చేశాడు.

## 7. పి. వి. చలపతిరావు

గృహకల్లోల నివారిణి (1910) బెజవాడ నుంచి ప్రచురితమయిన 64 పుటల పది వ్యాసాల సంపుటి. ఇందులో స్త్రీ అన్ని రంగాలలో అభివృద్ధి కావటానికి అవసరమైన పరిస్థితులు, అందువల్ల గృహంలో వచ్చే పరిణామం సవివరంగా తెలిపాడు. స్త్రీ విద్య కుటుంబ కలహాలు తగ్గిస్తుందనీ, సమాజ జీవిత పురోభివృద్ధికి దోహదమవుతుందనీ భావించాడు.

నూత్న పద్ధతులలో జీవించటం అవసరమని ''...... దేశకాల పాత్ర ములననుసరించి యాచారములను మార్చుకొనుచున్న సుఖపడునుగాని, పూర్వాచారములను పట్టు విడవనట్టి యాచారములవలన వచ్చు నష్టమును కష్టమును గమనించక మూర్ఖముగా తిరుగువాడు చెడును'' (పుట 12) అని సూచించాడు.

ఈ వ్యాసాలలో గృహజీవిక ప్రాధాన్యం గోచరమవుతూ వుంది. ఏ కుటుంబంలో స్త్రీ పురుష లన్యోన్యంగా వుంటారో, ఆ కుటుంబం అభివృద్ధి పొందుతుందని రచయిత అభిప్రాయం. జాతిమత భేదాలు లేకపోవటం, మోసం లేకుండా సమభావం ఉండటం రచయిత కాంక్షలు.

వ్యాసం శార్దూల కంద పద్యాలతో ప్రారంభం అయి, పద్యోదాహరణంతో ముగిసిపోయింది. విషయం బోధించటానికి కథలు ఉటంకించటం గమనింపవచ్చు. ఈ సృజన వ్యాసాలలో రచయిత వ్యక్తిత్వం స్పష్టంగా గోచరమవుతూ వుంది.

## 8. కొవ్వలి శివరామచంద్రరావు నారాయణరావు

'పురాతన హిందూ స్త్రీల యౌన్నత్యము' (1910) లో రాజపుత్రులలో స్త్రీ మాత రక్షణం, పెళ్ళివల్ల స్త్రీ పొందే ఉన్నతత్వం, భారతదేశంలో కొందరు స్త్రీలు పొందిన గొప్పదనం వివరింపబడ్డాయి. రాజపుత్ర సంస్థానాలలో స్త్రీ అభ్యుదయం, చారిత్రక బలం ఆధారంగా వ్రాశాడు. ఈ సృజన వ్యాసంలో, ఈ కాలంలోని వ్యాస ధర్మాలు- విషయ గ్రహణంలోనూ, ఉపన్యాసరీతి రచనంలోనూ-గోచరమవుతున్నాయి.

## 9. హద్దనూరు గోపాలరావు

'శ్రీ యహంభావ స్వామి' (1911) బ్రహ్మపురంలో వ్రాయబడితే, ఇచ్ఛాపురంలో ముద్రితమయిన వ్యాసం. ఇది. ఆంగ్లంలో ప్రసిద్ధమయిన (కేరక్టరీ) పాత్రీకరణగా భావింపవచ్చు. ఇది సాహిత్య లోకంలో అహంకారంతో ప్రవర్తించే వ్యక్తుల సామూహిక రూపం. పాండిత్యం లేకుండా సమస్త విద్యలు వచ్చినట్లు నటించే వాళ్ళ ప్రతిరూపం. ఈ వ్యాసం సాంఘికాధిక్షేపంగా మిక్కిలి సృజనంగా ఉంది.

## 10. నాళము కృష్ణారావు

'పంచమహాపాతకము' (1912) ప్రాచీన పాతకాలు కావు, ఇవి ఆధునికాలు. ఈ పంచమహా పాతకాలు స్త్రీలకు పురుషులు కావిస్తున్నవి. అవి శైశవం, విద్య, వివాహం, సంసారం, వైధవ్యం - దశల్లో సాగింపబడుతూ ఉన్నాయి.

వివాద వ్యాసంలో, పత్రికా వ్యాసంలో ఈ రచయిత వ్యాసాలు కాక, ఈ ఒక్క వ్యాసమే లభ్యం. ఈ రచయితకు మానవసేవ, దేశమాత పత్రికలతో సంబంధం ఉంది. సృజన ధర్మ ప్రదర్శకంగా వ్యాస సృష్టిచేసే సామర్థ్యం ఈ రచయితకుంది.

## 11. గోగులపాటి వీరేశలింగం

గోగులపాటి వీరేశలింగం 'ఎడబాటు' (1912) వ్రాసే నాటికి తాను గుంటూరు జిల్లా పొన్నూరులో సబ్-రిజిష్ట్రారు. కందుకూరి వీరేశలింగం పంతులు పెంపకంలో పెరిగాడు. పెంపుడు తండ్రి పేరే తన పేరయింది. ఇది సాంఘికంగా, సాహిత్యపరంగా సంచలనాత్మక వ్యాసం. వ్యాసకర్త తన జీవితంలోని ఒక ప్రధాన ఘట్టం, అపనింద తొలగించుకోవటానికి, వాస్తవం వివరించటానికి, ఆత్మ కథావ్యాసంగా రూపొందించటం వ్యాస పరిణామంలో స్పష్టంగా గుర్తింపవలసిన అంశం.

గోగులపాటి వీరేశలింగం 31-3-1881 లో జన్మించిన ఎనిమిది నెలలకు తల్లి గతించింది. తండ్రి గోగులపాటి శ్రీరాములు, కందుకూరి వీరేశలింగం పంతులు ప్రభావంతో, పది రోజుల్లో వితంతు వివాహం చేసుకుంటే, అది

విఫలమయి గృహ విచ్ఛిత్తి ఏర్పడింది. తండ్రి 1892లో ఎల్లెన్ బియాట్రిస్ అనే 18 ఏళ్ళ క్రైస్తవ యువతిని వివాహమాడి, 1908లో గతించాడు. సంవత్సరం వయస్సునుంచి గోగులపాటి వీరేశలింగం, కందుకూరి వీరేశలింగం పంతులు ఇంటిలో, సంరక్షణంలో పెరిగి, చదువుకొని బి. ఎ. పూర్తిచేసి, ఉపనయన మయి, బి. యల్. చదువుతున్నప్పుడు పెంపుడు తండ్రి వితంతు వివాహం చేసుకొమ్మని ప్రోత్సహిస్తే మొదట అంగీకరించి, తర్వాత 'ఆ సాహసము చేయలే'నని, మనస్సు మార్చుకొని, ఉపనయనానికి ప్రాయశ్చిత్తం బెంగుళూరిలో చేయించుకొని, ఆ పైన 'బ్రాహ్మణ వివాహం' చేసుకొన్నాడు. పెంపుడు తండ్రిపట్ల గౌరవం, భక్తి, వినయం ఉన్న వ్యాసకర్త, ఆ సంస్కార పద్ధతుల తీవ్రతకు తట్టుకోలేకపోయాడు.

అయితే, 'శ్రీ వీరేశలింగం కవి చరితము'లో తోలేటి వెంకటసుబ్బయ్య వ్రాసిన 'వింత వాక్యములకు తగు రీతిని' సమాధానం వ్రాయవలసివచ్చి, ఈ వ్యాసం వ్రాసినట్లు చెప్పినా, కందుకూరి వీరేశలింగం పంతులు పట్ల అసహనం గోచరమయింది. పినతల్లి ఎల్లెన్ బియాట్రిన్‌ని సరిగ్గా చూడలేదనే నిందను తొలగించుకోవటానికి చేసిన ఈ యత్నంలో పెంపుడు తండ్రిమీదికి బాధవచ్చింది. విద్యార్థులు తాత్కాలికోద్రేకంతో కందుకూరి సాంఘిక విప్లవంలో కొట్టుకుపోయినా, ఉద్రేకం తగ్గాక దూరమవుతారని చెప్పటంతో ఈ సంఘ సంస్కరణం నిరసించినట్లు తెలుస్తుంది.

వ్యాసం ఈ రచనవల్ల ఆత్మకథాత్మకంగా పరిణామం ప్రదర్శించింది. సారస్వతం జీవితం రెండు ముడిపడి సాగిన సృష్టి యిది. ఈ దశలో వ్యాసం రచయిత జీవితంతో ప్రత్యక్షంగా సంబంధం కలిగిందైంది.

## 12. ఆర్యనారాయణమూర్తి

'మాంస భక్షణ నిషేధము' (1915) బళ్ళారి నుంచి వెలువడ్డ వ్యాసం. సంఘ సంస్కరణంలో భాగంగా ఈ వ్యాసం రూపొందింది. లోకంలో పదార్థాలు, అమృతాలు, మృతాలు, నిషిద్ధాలు అనీ; మాంసం నిషిద్ధ మయిందనీ తెలిపాడు. ఆహారపు అలవాట్లు దిద్దాలన్న ప్రయత్నంతో ఈ వ్యాసం సాగింది.

## 13. జ్ఞాన ప్రసాదిని (1915)

గుంటూరు నుంచి ప్రచురితమయిన ఈ సంపుటిలో 19 వ్యాసాలున్నాయి. వీటి రచయితల పేర్లు మొదటి పుటలో లేకపోయినా, ప్రారంభంలోని రెండు వ్యాసాలు ఏటుకూరి జోగిరాజు రచనలనీ, మిగతావి గుంటుపల్లి సుబ్బారాయడు సృష్టించినవనీ స్పష్టమవుతూ వుంది. ఇవి 10-9-1913 నుంచి 15-4-15 దాకా ప్రచురితాలయినాయి.

ఈ సంపుటిలో విద్య, పచనం, గ్రంథాలయాల గూర్చి, సత్యసంధత, ఋజువర్తనం వంటి విషయాల గూర్చి, కృషి గౌరవం మతసహనం వంటి అంశాల గూర్చి వ్యాసాలున్నాయి. ఈ రచనలలో ప్రధాన దృష్టి ఉత్తమ జీవితం, ఆధునిక దృక్పథం ఆంధ్రులకుండాలన్న ఆశ.

ఈ వ్యాసాలు చిన్నవి. విషయ విస్తృతి లేదు. ముందుగా కరపత్రాలుగా వేసి, పంచిపెట్టబడ్డాయి. లోకశ్రేయం కాంక్షించే రచయితల ఆత్మావలోకనంగా ఈ వ్యాసాలు గ్రహింపవచ్చు.

## 14. నంజుండప్ప

'గోకరుణానందాది గమనార్హ విషయములు' (1915) హిందూపురం నుంచి వెలువడింది. ఇది ఆవుచేసే మేళ్ళు, దాని కరుణ పొందితే కలిగే ఆనందం వివరించే వ్యాసం. దీని అంతర్గతంగా హిందూమత ప్రాశస్త్యం నిక్షిప్తంగా ఉంది.

## 15. కస్తూరి శివశంకర కవి

'రజస్వలా వివాహ విమర్శనము' (1915) నరసాపురం నుంచి వెలువడ్డ వ్యాసం. రచయిత సుదర్శినీ పత్రికాధిపతి. ఈ రచన బాల్యవివాహాన్ని అంగీకరించి, ప్రోత్సహించి, రజస్వలా వివాహాన్ని తిరస్కరించింది. ఈ వివాహ లాభాలు చెప్పిన, వ్రాసినవాళ్ళ సిద్ధాంతాలు విమర్శించి పరాస్తం చేసే ప్రయత్నం సాగించింది దీని శైలి, భాష, వాదపటిమ, వాడి, సామర్థ్యం విశిష్టంగా ఉన్నాయి. అయితే వాద విషయం బలహీనంగా ఉంది. సమర్థుడైన రచయిత సృష్టిగా, రచనకోసం, ఈ వ్యాసం గమనార్హం.

## 16. ఇతరులు

"వీరేశలింగ కవి సమకాలికులైన గ్రంథకర్తలలోను, పత్రికాధిపతుల లోను, వారి శిష్య బృందములోను వ్యాస రచనకు దొరకొనిన వారలనేకులు గలరు. శ్రీ దుగ్గిరాల సూర్య ప్రకాశరావుగారు కళాశాలలో పంతులుగారి శిష్యులుగ నుండిన దినములందే వివేకవర్ధనికి తఱచుగా వ్యాసములు వ్రాయుచు వచ్చిరి. అపుడును, పిమ్మటను వారిట్లు వ్రాసిన వ్యాసములు కొన్నిటిని నీతి మత విషయకోపన్యాసములను పేర వారు ముద్రించిరి. శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహముగారు తాము ప్రచురించిన 'మనోరమ', 'దేశమాత' పత్రికలందు వ్యాసములు వ్రాయుచుండిరి. ఐనను వారి షష్టిపూర్తి సందర్భమున ప్రచురింప బడిన సంపూర్ణ గ్రంథావళి పది సంపుటములలోను వారి వ్యాసములు చేర్చ కుండుట శోచనీయము ... వీరేశలింగము పంతుల వారి కాలమున వారి పత్రిక లలోను, వారి సాయమున నేను ప్రకటించిన 'సత్య సంవర్ధని' 'జనానా పత్రిక' లకును వ్రాయును వచ్చిన పంతుల వారి ముఖ్య శిష్యులును, నా సహాధ్యాయి, మిత్రులును నగు కీ. శే. గోటేటి కనకరాజుగారు కూడా వ్యాసరచన యందు సమర్థులు" అని రాయసం వెంకటశివుడు ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక (1930-31)తో వ్రాసిన 'వ్యాసము'లో తెలిపాడు.

గురజాడ యుగంలో వ్యాసం ప్రక్రియగా రూపొందింది. ఉపన్యాసం కూడా రచనా రీతిగా ప్రసిద్ధంగానే వుంది. ఈ యుగం వ్యాస, ఉపన్యాస రచనా ద్వైవిధ్యానికి కూడలి. వ్యాసం అనంతర యుగంలో తన ప్రభావం చూపితే, ఈ యుగంలో ఉపన్యాస స్రష్ట కందుకూరి ప్రభావం వ్యాసకర్తల మీద గోచరమవుతూ వుంది. అనంతర యుగంలో వ్యాసం, ఉపన్యాసం విభిన్నంగా ఉండకపోవటంవల్ల ప్రక్రియాస్థైర్యం సిద్ధించింది.

## 5. అధిక్షేప వ్యాసం

సాక్షి యుగం (1913-1933)

సాక్షి, వదరుబోతు, బారిష్టరుగారి బాతాఖానీ అధిక్షేప వ్యాస సంపుటాలు. సాక్షి వ్యాసాలు ఆంధ్ర దేశంలో పొందినంత ప్రాచుర్యం ఏ ఇతర వ్యాస సంపుటీ పొందలేదు. పూర్వ ఉపన్యాస వ్యాసాలకూ, వీటికీ ఉన్న ప్రధానమైన తేడా అధిక్షేపం. అందువల్ల ఈ రచనలు అధికంగా ఆనంద సంపాదకా

లయ్యాయి. కాబట్టి, ఈ యుగంలో వెలువడ్డ వ్యాసాలు అధిక్షేప ప్రధానంగా ఉండటం వల్ల, సాక్షి సంపుటాలు ఈ సృష్టిలో తలమానికంగా ఉండటం వల్ల, ఈ యుగం సాక్షియుగంగా గ్రహింపవచ్చు.

సాహిత్యంలో అధిక్షేపం ఆనందదాయకంగా, సంస్కరణ సమర్థంగా ప్రసిద్ధం. ఆనందం ఆంతరం కాక బాహిరంగానూ, సంస్కరణ బోధ వ్యంగ్యంగా కాక, వాచ్యంగానూ అధిక్షేపం కలిగించే స్థితి గుర్తింపవచ్చు. కళా సృష్టితో తన స్వర్గం నిర్మించుకొనే మనిషి చేసే బాల్య చేష్టగా అధిక్షేపం గోచరమవుతుంది. సమాజం లోపరహితంగా అన్ని విధాలా సర్వ సంపూర్ణంగా ఉన్నప్పుడు సారస్వతావసరం ఉన్నా, అధిక్షేపావసరం ఉన్నట్లు భావించే అవ కాశం లేదు.

మనిషి తననూ, తనచుట్టూ ఉన్న సమాజాన్నీ ప్రేమించటం మర్చి పోతున్నప్పుడు, తెలియనప్పుడు అధిక్షేపం గుర్తు చేస్తుంది. మనుగడకొక అర్థం, మనిషి బ్రతుకుకొక విలువ ఇవ్వటం అధిక్షేప విధిగా గమనింపవచ్చు. సాంఘిక జీవితంలో వ్యతిక్రమణలు సరిదిద్దే సారస్వత రీతి అధిక్షేపం. వర్తమాన ప్రపంచం పరస్పర విద్వేషాలతో నిండిపోయినప్పుడు సారస్వతంలో ఈ అధి క్షేపం అత్యంతావశ్యకం. వాంఛనీయం. అందుకే ఏ భాషా సాహిత్యంలో అయినా, అధిక్షేపం అతి ప్రాచీనం కాదు.

తెలుగులో అధిక్షేప సారస్వతం పూర్వం ఉన్నట్లుగా స్పష్టంగా చెప్పే వీలు లేదు. ఆధునికంగా అవతరించినట్లు భావింపవచ్చు. సమాజంలోని అవాంఛితాలు ఎత్తి చూపటానికి సారస్వతంలో బలమైన రచనా విధానం అధిక్షేపం. "The true satirist knows no obligation to society but that of showing its individual and collective villainy, cowardice and hypocrisy" (11) ఈ ప్రయత్నంలో అధిక్షేప రచ యిత తన రచనా ముఖంగా సమాజలోప ప్రదర్శనమే కాని, దాన్ని సముద్ధ రించే యత్నం చేయకపోవచ్చు. "Your satirist must be as single-minded and devoted in his research as a scientist like the medical student he spends his life in the discovery of diseases. The cure he leaves to others" (12)

అధిక్షేప సారస్వతంలో లోప ప్రదర్శనమే ఉంటుంది కాని సవరణ ప్రయత్నం ఉండనక్కరలేదు తెలుగులో అధిక్షేపం వైయక్తికంగా, సామాజికంగా, వ్యావస్థికంగావుంది. అది వ్యక్తిలోపం, సమాజలోపం, వ్యవస్థా లోపం ఎత్తి చూపుతుంది.

అధిక్షేపవ్యాసం, సమాజాతిక్రమణ ప్రతిబింబమై వుంటుంది. ''పాశ్చాత్య సాహిత్యంలో అధిక్షేప హాస్యం (Satire) ఒక విశిష్టమైన స్థానం సంపాదించు కుంది. ఈ అధిక్షేప కావ్యాలలో ఓ కవినో రాజకీయ వేత్తనో మరెవరినో హేళన పూర్వకంగా నిందించటం కనిపిస్తుంది. ఇలా వ్యక్తిగతంగా కాకుండా ఓ సంస్థనో సమాజాన్నో హేళన చేయటంగాని, సంఘంలో వ్రేళ్ళు పాతుకొని పోయి ఉన్న మూఢాచారాలు అంధ విశ్వాసాలు వెర్రిమొర్రి సాంప్రదాయాలు వగైరాలను హేళన చేయటం కాని ఈ అధిక్షేప కావ్యాల్లో అప్పుడప్పుడు కావ్య వస్తువుగా కనిపిస్తుంది. తత్కాలీన కవినో రాజకీయ వేత్తనో నిందించుటకు బదులు జాతినీ, తద్గత ఆచారాలనూ లోపము నెంచి సంస్కారాభిలాషతో నిందించినట్లయితే, ఆలంబనకి వ్యాప్తి కలిగి, అధిక్షేపము హాస్యానికి సన్నిహిత మవుతుంది.'' (13) తెలుగు సారస్వతంలోనూ, అధిక్షేపం కొంతవరకు ఈ విధంగానే ఉందని భావింపవచ్చు.

అధిక్షేపవ్యాసం హాస్యం కన్నా ఆధునికం కాబట్టి, నిన్న మొన్నటి రచనా రీతి. అధిక్షేపం చాటువులలోనూ, చెదురు మదురుగా కావ్యాలలోనూ కనిపించినా సాక్షి, వదరుబోతులలో ఉన్నంత అధికంగా పూర్వమెప్పుడూ ఆంధ్ర సాహిత్యంలో లేదు. వచన వాఙ్మయం పెరుగుతున్న కొద్దీ, నాగరకత వెర్రితలలు వేస్తున్నకొద్దీ, పూర్వ జీవితం మారిపోతున్న కొద్దీ అధిక్షేపం ప్రధానంగా రచనా రీతిలో గ్రహింపబడుతూ వుంది.

వ్యక్తి సమాజ వ్యవస్థల లోపం ఎత్తి చూపటం లోనే కాదు, వాటిని స్తుతించటంలోనూ అధిక్షేపం అవతరించవచ్చు. లోపం, దోషం ప్రదర్శించటం లోనే కాదు, తిరస్కరించటంలోనూ, తెలపకపోవడంలోనూ అధిక్షేపం వుంది. ఇది వ్యాస సృష్టిలో సంఘ సంస్కరణాభిలాషను కలిగించింది. హేళన సమర్థ మయింది.

ఈ యుగంలో అవతరించిన అధిక్షేప వ్యాసాలుతో పాటు, తర్వాత ఈ మార్గంలో సృజనమయిన అధిక్షేప రచనలు కూడా పరికింపవచ్చు. ఇప్పుడే వ్యాసరచనం, ఉపన్యాసంగా క్షీణిస్తూ, వ్యాసంగా ప్రపంచితమవుతూ ఉంది. ఈ యుగం వ్యాస పురోగమనానికి దోహదకారి అయింది.

## 1. సాక్షి ఉపన్యాసములు

*పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు (1865-1940)*

ఈ రచయిత వ్యాసాలు సాక్షి సంపుటాలలోనివి, ప్రకీర్ణోపన్యాసాలలోనివి కలిపి మొత్తం 171. వీటిని ఉపన్యాసాలు, వ్యాసాలు అని రచయిత, ప్రచురణ కర్తలు, విమర్శకులు భావించటం పరికింపవచ్చు. ఇవన్నీ ఆంగ్ల వ్యాసధర్మ శోభితాలుగా ఉన్నాయి. పూర్వప్రధాన వ్యాసకర్తలలో కనిపించే బుద్ధిప్రాధాన్యం, విమర్శన గుణాధిక్యం తగ్గి, హృదయబలం పెరిగి, అధిక్షేప బలంతో, ఆనంద కేంద్రాలుగా వ్యాసాలు సృష్టించి, పఠితృలోకానికి సన్నిహిత మయ్యాడు రచయిత.

ఈ వ్యాసాలలో సృజన గుణం పెరగటానికి దోహదం చేసిన వాటిలో ప్రధాన మయింది సాక్షి సంఘం. దానిలో సభ్యులున్నట్లు, సభా కార్యక్రమాలు జరుగుతున్నట్లు, సభ్యులు యాత్రలు చేస్తున్నట్లు, పాఠకులు లేఖలు వ్రాస్తున్నట్లు, సభలో కరతాళధ్వనులు చేస్తున్నట్లు, వాళ్ళను సంబోధిస్తున్నట్లు, వాళ్ళు రచనా సూచనలు చేస్తున్నట్లు, సంఘ సభ్యత్వం కోరుతున్నట్లు కల్పించిన విషయాలు సత్యంగా నిరూపించటానికి చేసిన యత్నంలో సృజనాత్మకత కనిపించింది.

ఎడిసన్, స్టీలు నడిపిన స్పెక్టేటర్ పత్రిక సాక్షి సృష్టికి మూలం. ఆంగ్లం లోని లక్షణాలు స్వీకరించి తెలుగులో వెలువడ్డ ఈ వ్యాసాలు సువర్ణలేఖ ఆంధ్ర పత్రికలలో ప్రచురితాలయ్యాయి. పిక్‌విక్ క్లబ్బులాగా సాక్షి సంఘం వాటిలో సభ్యులు, వాదోపవాదాలు సృజన ధర్మాన్ని పెంచాయి. సాక్షి వ్యాస రచనం 1913 లో ప్రారంభమయి, ఆగుతూ సాగుతూ 1933 దాకా జరిగింది.

ఒక్క వ్యాసంలో భిన్నోపన్యాసాలుండి, ఒక వక్త భావాలు మరో వక్త ఖండిస్తున్నట్లో సమర్థిస్తున్నట్లో ఉండి, ఒక అంశం పట్ల ఏర్పడే రెండు భిన్న

దృక్పథాలు రూపొందింది, రచనలో వైశద్యం పెరిగింది. ఈ వ్యాసాలలోని భావాలు సాక్షివో, జంఘాల శాస్త్రివో, మరొకరివో కాని, పానుగంటి లక్ష్మీ నరసింహారావు పంతులువి మాత్రం కావు అన్నంతగా వ్యాస సృజన విస్తృతి ఏర్పడింది.

సాక్షి సంఘం ఏర్పడటం, వ్యాసరచన ఆగటం సాగటం, పాత్రల యోగ క్షేమాలు జీవిత విశేషాలు వివరిస్తూ రచన ఉండటం వల్ల కథాసూత్రం ఉన్నట్లు ఏర్పడింది. చిన్న కథతో, అనేక ఉపన్యాసాలతో వున్న ఒక నవలగా ఈ రచన గోచరమయి సృజన గుణాధిక్యం తెలుపుతూ వుంది. ఇందులో వచనం వ్యాసం హద్దులు దాటి కథా నవలాది ప్రక్రియల పరిధిలోకి చొచ్చుకొనిపోయింది.

ఈ వ్యాసాలలో ఒకఅంశం వివరించటానికి ఉపబలకంగా కథ చెప్పటం పరిపాటిగా ఉంది. దీని వల్ల వ్యాసం కలిగించే ఆలోచన కంటే, కథ కలిగించే అనుభూతి ప్రధానమయి, సృజన ధర్మం పెరిగింది. ఒక వ్యాసంలో ఒకరి అభిప్రాయం తర్వాత ఇంకొకరి అభిప్రాయం ప్రకటితమయి, వ్యాసం నాటక ధర్మంతో ఒప్పింది.

ఏ విషయమయినా, మిక్కిలి విపులంగా తెలపాలని రచయిత కాంక్షించి నప్పుడు సాక్షి సంఘ సభ్యులలో ఒకళ్ళకు కల రావటం, అది వివరించటం సహజ మయింది. దీనివల్లనూ వచనం, వ్యాసం సృజన ధర్మం పెంచుకొన్నాయి.

వ్యాసకర్త తన అభిప్రాయాలు భిన్నరీతులతో వ్యక్తంచేసి, అవి పరోక్షంగా సాగించి, ప్రత్యక్ష సంబంధం త్యజించి, సమీపంలో ఉండే పాఠకులతో దూరమయిపోయాడు. ఇది రచయిత బుద్ధిపూర్వంగా ప్రయత్నించి సాధించిన విషయం.

రచయిత కాని, అతడి భావాలు కాని, చదువరి మనస్సులో మిగలక రచన మాత్రమే గుర్తుంటుంది. రచయిత ఆలోచనలతో సానుభూతి, ఏకీభావం కుదరటం సాధ్యంకాదు. సాక్షి వ్యాసాలలో పూర్వ వ్యాసాలకంటే ఆలోచనా సాంద్రత తగ్గి, పలచబడి, గుండెకు రచన సన్నిహితమయింది.

సాక్షి అధిక్షేపం : ఈ వ్యాసాలలో మిక్కిలి విశిష్టంగా అతి ప్రసిద్ధంగా, బహ్వాధికంగా కనిపించేగుణం అధిక్షేపం. పూర్వ వ్యాసాలలో ఇంత వైవిధ్యంతో

ఈ లక్షణం లేదనవచ్చు. సంఘంలోని దురభ్యాసాలు, దుష్ట విశ్వాసాలు, దుష్కర్మలు వెల్లడించటానికి, వ్యక్తిలో సంప్రదాయంలో, ఆచారంలో నీచత్వం, మూర్ఖత్వం, అజ్ఞానం, పిరికితనం, భయం క్షాళనం చేయాలనుకోవటానికి అధిక్షేపం సమర్థంగా ఉపయోగపడింది.

సాక్షి వ్యాసాలలో అధిక్షేపం ప్రధానంగా భాషాగతంగానూ, భావ గతంగానూ వుంది. సాక్షి ప్రారంభ వ్యాసాలలో అధిక్షేపం అడ్డపూకలు లేక సాగినా, రానురాను అది సన్నగిల్లి, అధిక్షేపం పరిధి సంకుచితమయి, సంఘం మీదా వ్యక్తుల మీదా సానుభూతి పెరిగి, అధిక్షేపం కొంచెం తగ్గి, జీవితం పట్ల క్షమాగుణం ఎక్కువయి, కొంత ఉదాసీనత, కొంత నైరాశ్యదృష్టి ఎక్కువయి, వ్యాసంలో అధిక్షేప తీవ్రత తగ్గిపోయింది.

సాక్షి వ్యాసాలలో సంఘంలోని గుడ్డి నమ్మకాలను, పిచ్చి అలవాట్లను, కవుల మూర్ఖతను అధిక్షేపించటం చూడవచ్చు. వీటిలో హాస్యం బాగా గోచర మవుతుంది. అధిక్షేపంలో తీవ్రత, కాఠిన్యం, నొప్పి పుట్టించే గుణం తప్పని సరిగా వుంటాయి. సాక్షి వ్యాసాలు ''అన్నింటిలోనూ హాస్యం కద్దు, అంతటా ఎత్తిపొడుపు కద్దు. వాచాలత ఉంది. వ్యంగ్యం ఉంది. ఆ వ్యంగ్యం కూడా కటువుగానే వుంటుంది. అక్కడక్కడ విషయాన్నిబట్టి, అసభ్యాన్ని అతిశయించి చూపి, అసహ్యం కలిగించేటంతగా వర్ణించటం కూడా కనిపిస్తుంది. సారంగధర నాటకం, తోలు బొమ్మలాట పగ్గైరాలపై వ్యాసాలు మోటు హాస్యాన్ని సహా అందిస్తున్నాయి. అసభ్యమైన దాన్ని వ్రేలెత్తి చూపునపుడు వేరే విధమైన దోషా లనే అధిక్షేపించేరు కాని వ్యక్తులతో తంటాలకి దిగలేదు. అక్కడక్కడ గ్రంథాలయోద్యమాలనీ, వ్యావహారిక భాషా వాదమనీ, కవికాలస్థలాలనీ కొందరు పెద్దలు నాడు చూపిన కొన్నికొన్ని మూర్ఖపు పట్టుదలలు మాత్రం గర్భితంగా అందించబడి అపహసింపబడ్డాయి. కాని యిట్టి చోట్ల వ్యంగ్యం కొంత మృదు వుగా ఉండి, పొరపాటును సూచించేదిగానే ఉంటుంది గాని తీవ్రంగా లేదు'' (14) అనటం సత్యం.

అధిక్షేపం ఆరంభంలో తీవ్రంగా ఉండి, భరించటం కష్టంగా కనిపించి, క్రమక్రమంగా ఆస్వాద యోగ్యంగా రూపొంది, చివరకు తగ్గిపోయింది. ఈ వ్యాసాల ప్రభావంతో 'పడరుబోతు', 'బారిష్టరు బాతాఖానీ' వంటి అధిక్షేప వ్యాస సంపుటులు ఆవిర్భవించాయి.

నిర్మాణవ్యాసం: ప్రతి వ్యాసంలోనూ, ప్రారంభంలో సభా సంబంధి విషయ వివరణమూ, సమాప్తంలో విషయోపక్రమరీతి ఉన్నాయి. వ్యాసాలలో పద్యాలు ఉదాహరించటం కంటే, ఎక్కువగా సృష్టించటం, ఎప్పుడయినా పద్య శ్లో కాంగ్ల వాక్యోదాహరణా లియ్యటం గమనింపవచ్చు. ప్రతి వ్యాసం చివర ఓమ్ శాంతిశ్శాంతిశ్శాంతి: అని వుండటం రివాజు. ఎప్పుడయినా ఓమ్ శాంతి శ్శాంతిః అనీ ఉంది. శీర్షికలలో 'జంటిల్‌మాన్' అని ఆంగ్లం, దరఖాస్తు అని ఉరుదూ పద ప్రయోగం కనిపించింది. వ్యాస శీర్షిక 'తృష్ణ' అంత చిన్నది గానూ, 'ఆంధ్ర సాహిత్య పరిషదేకాదశ వార్షికోత్సవాధ్యక్షోపన్యాసము' అంత పెద్దదిగానూ, ఉండటమే కాక, 'ఎంత భద్రముగా నున్న నంతక్షేమము' లాగా వాక్యంగా కూడా వుంది. ఈ వ్యాసాల పరిమితి రెండు పుటలు మొదలుకొని 37 పుటలు వరకుంది. సాధారణంగా సగం వ్యాసాలు పది పుటలకు లోపుగా, మిగతా సగం ఇరవై పుటలకు లోపుగా ఉన్నాయి. అంతకు మించిన వ్యాసాలు తక్కువ.

వివరణాత్మక వ్యాసాలు శాస్త్రం, మతం, పరిశ్రమలు, ప్రాణం, జన్మం మొదలైనవి 73. ఈ వ్యాసాలలో కొత్త సంగతులో, ప్రసిద్ధ విషయాలో అందరికీ తెలియటం కోసం వ్రాయటం జరిగింది.

విమర్శనాత్మకంగా వ్యాసాలు సాహిత్య, సాంఘిక సంబంధులుగా 72. భాషా దృష్టి, సాంఘిక లోపం, వ్యక్తిలోపం, మూఢాచారాలు, మూర్ఖ లక్షణాలు సాహిత్య స్త్రీ స్వాతంత్ర్య సౌందర్యాది అనేక విషయాలు నిశితంగా విమర్శనంగా పరికింపబడ్డాయి. విషయ గ్రహణం తీరుతెన్నులు తెలుపుతూ, చురుకుగా కరుకుగా కటువుగా సరసంగా ఈ వ్యాసాలు అధిక్షేపంతో విమర్శించాయి. అనౌచిత్యం అసందర్భం అయిన వాటిని సవరించటానికి, ధార్మికం కార్మికం అయిన వాటిని స్వీకరించటానికి ఉద్దిష్టమైన వ్యాసాలు విమర్శనాత్మకంగా ఉన్నాయి.

కథాత్మక వ్యాసాలు కథా రూపంలో ఆవిష్కృతాలయి, స్త్రీ స్వాతంత్ర్యం, దివ్య యోగాలు, మతాధిపతులు, కాలాచార్యుని పెళ్ళి ప్రయత్నం, విచిత్ర స్వప్నం మొదలైనవి ఈ రచయిత రచనలు 13 ఉన్నాయి. ఈ రచయిత వ్యాస ప్రధాన గుణం కల్పన.

వర్ణనాత్మక వ్యాసాలు పార్థసారథి స్వామి దేవాలయం ప్రవేశం, సజీవ

నిర్జీవ సంబంధి తోలుబొమ్మల ఆట, నాటకం ప్రదర్శించిన తీరు, శ్రీరామనవమి ఉత్సవం, రచనలో ఏ విధంగా రూపొందిందీ పరికింపవచ్చు. ఇవి పది, కళ్ళకు కట్టినంత విశదంగా వర్ణనంతో వున్నాయి. ఈ రచయిత వైశిష్ట్యాలలో వర్ణనం ప్రధానంగా చెప్పవచ్చు.

నాటకీయ వ్యాసాలుగా మూడున్నాయి. సాక్షి సంఘం సభ్యులుండటం ఉపన్యాసాలివ్వటం వాదించుకోవటం మాత్రమే కాదు. ప్రతి వ్యాసంలోను కొంత నాటక ధర్మం గోచరమవుతుంది. పూర్తి నాటక లక్షణ బద్ధంగా ఉన్న దర ఖాస్తు, మత బోర్డుల పటము, అత్యద్భుత స్వప్నము నాటక ధర్మ ప్రదర్శకంగా ఉన్నాయి. సంభాషణం, నటనం, ప్రేక్షక భాగస్వామ్యం వల్ల, ఈ ఉపన్యాస రీతిలోని వ్యాసాలు నాటకీయతను సంతరించుకొన్నాయి.

విషయ వ్యాసం: వ్యాస విషయం వల్ల వీటిని ఈ క్రింది విధంగా విభ జింపవచ్చు.

| | | |
|---|---|---|
| 1. | సాంఘికం | 59 |
| 2. | మతం | 34 |
| 3. | సాక్షి సంఘం | 20 |
| 4. | సాహిత్యం | 14 |
| 5. | స్త్రీ | 12 |
| 6. | భాష | 10 |
| 7. | కళ | 6 |
| 8 | నాటకం | 5 |
| 9. | వైద్యం | 4 |
| 10. | అంతఃపురోపన్యాసాలు | 4 |
| 11. | శాస్త్రం | 2 |

1 పాశ్చాత్య నాగరకతా వ్యామోహం పనికిరాదనీ, భూతవైద్యం మూర్ఖత్వమనీ, నిద్రలో నడవటం జబ్బనీ, సత్యం సర్వ శ్రేయస్కరమనీ, హిందూ మహమ్మదీయుల పండుగలు పరస్పరం భరించవచ్చుననీ, సముద్ర తీర పర్యటనంలో శుభాలున్నాయనీ, కాశీయాత్ర చేసి కాయగూరలు వదిలినట్లు చెప్పటం తెలివితక్కువదనమనీ, కోర్కెలుండకూడదనీ, పశువును నిందించ రాదనీ, పూర్వాపర నాగరకత తారతమ్యం గుర్తించాలనీ, పరిశ్రమలు అభి

వృద్ధి కావించాలనీ, మనుషులు పశువుల మందలాగా కాకూడదనీ, దేహబలం మనోబలం పెంచుకోవాలనీ, అస్పృశ్యత తొలగించాలనీ, మహాత్ముడి మార్గ మవలంబించాలనీ, సుఖదుఃఖాలు సమంగా గ్రహించాలనీ, ఆంధ్ర సాహిత్య పరిషత్తు ప్రయోజనకరమనీ, పురాణ పఠనంలో ఔచిత్యం దర్శించాలనీ, బహు విషయాలు సాంఘికంగా దేశోన్నతికి అవసరంగా రచయిత బోధించాడు.

2. మత విషయికంగా ప్రాచీనౌన్నత్యం పరికించి, దానిని సమర్థంగా చూపటం, మతంలో మార్పు బలహీనతగా భావించటం వ్యాసాలలో చూడవచ్చు. మత సంబంధ విషయ విమర్శనం తిలకింపవచ్చు.

3. సాక్షి సంఘ నిర్మాణం, సభ్యత్వం, కార్యకలాపాలు, సభలు, సభ్యుల జీవితాలు, లేఖలు మొదలైన అనేక విషయ ప్రాధాన్యమున్న వ్యాసాలున్నాయి.

4. సాహిత్య సంబంధి అభిప్రాయాలు అనేకం చూడవచ్చు. విమర్శక స్వభావం వివరించి, వాల్మీకి విశ్వామిత్ర రామాయణ పరామర్శ కావించి కుంభ కర్ణుడి శీలం చిత్రించి, శ్రీ యాజ్ఞవల్క్య నాటక మనేదాన్ని సమీక్షించి, గ్రంథ పరిష్కరణం తెలిపి, భవభూతి సాహిత్యం పరిచయం చేసి, ఆంధ్ర భాషా సారస్వత సంపూర్ణ సమీక్షా ప్రయత్నం చేసి వ్యాసాలు వ్రాశాడు.

5. ఈ వ్యాసకర్త స్త్రీ స్వాతంత్ర్యం సంపూర్ణంగా వాంఛించినట్లు స్పష్టం కాదు. నాటకీయ, కథాత్మక, వర్ణనాత్మక వ్యాసాల చాటునుంచి అక్కర లేదనటం తెలుస్తుంది. ఆధునిక జీవిత దృక్పథం పట్ల రచయితకున్న విశ్వాసం విస్పష్టం కాలేదు. స్త్రీ సంబంధి వ్యాసాలలో ఆధిక్షేపంతో విమర్శించటమే రచయిత పనిగా కనిపిస్తుంది. 'మహా పతివ్రత' విమర్శకు గురి అయింది. ఈ సందర్భంలో ఒక్క విషయం గమనింపవచ్చు. శ్రీమతి సు. స. వ్యాసం పోగొట్టుకొన్నట్లు, అది దొరికితే ప్రచురించినట్లు, వ్యాస కర్త్రికి బహిరంగ లేఖ వ్రాసినట్లు, ప్రత్యుత్తరం లభించినట్లు, శ్రీమతి సు. స.కు జవాబు వ్రాసినట్లు జరిగిన వ్యాస సృష్టి అంతా పానుగంటిదే! రచయిత స్త్రీ సాతంత్ర్యం పట్ల వైముఖ్యం చూపాడు.

6. వ్యావహారిక భాష పనికిరాదనీ, గ్రాంథికం వాంఛనీయమనీ రచయిత విశ్వాసం. ఈ వాదోపవాదాలలో ప్రధాన కృషి చేసిన కొద్ది మందిలో పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు పేర్కొనబడవలసి ఉండటం

గమనార్హం. గిడుగు రామమూర్తి పంతులు భాషా వాదాన్ని అధిక్షేపించటం కూడా పరికింపవచ్చు. ఆంధ్ర భాషా సంరక్షక సమాజము ప్రచురించిన 8, 9, 10 కరపత్రాల రచయిత పానుగంటి, కాశీభట్ట బ్రహ్మయ్యకు ఈ వాదంలో కుడిభుజం. సెట్టి లక్ష్మీనరసింహం వాదం ఖండిస్తూ, గ్రామ్య గ్రంథ పఠనం వద్దనీ, స్వభాషా దృష్టితో అపవాదం చేస్తున్నారనీ, గిడుగు రామమూర్తి పంతులు కృషి విమర్శిస్తూ వున్న ప్రభుత్వ విశ్వవిద్యాలయాల నిర్ణయాలు వింతలనీ, దేశ భాషను గూర్చి ప్రభుత్వానికి విజ్ఞప్తి పంపి, అది అవసరమనీ, బుఱ్ఱా శేషగిరిరావు పంతులు 'విమర్శాదర్శ' అనే గ్రంథం విమర్శిస్తూ, భాష లోప భూయిష్ఠమనీ వ్యావహారిక భాషా వాదానికి ప్రబల వ్యతిరేకం చూపిన ఈ వ్యాసకర్త, పరోక్షంగా తత్ప్రతిష్ఠ్యానికి దోహదం చేశాడు.

7. కళా వ్యాసాలలో లలితకళలు ప్రసక్తాలయ్యాయి. చిత్ర లేఖనం, కవి, తాజ్‌మహాలు, గానకళ, తోలుబొమ్మలాట కాక నాటక సంబంధి విషయం భిన్న వ్యాసాలలో పరిశీలనం పొందింది.

8. స్త్రీలు స్త్రీ పాత్ర ధరించటం, నాటకంలో పాటలు పద్యాలుండటం అవసరం అన్న సూచనలు, అనేకేతర విషయాలు ఈ వ్యాసాలలో చూడవచ్చు. ఈ అభిప్రాయాలలో కొన్నిటిని నాటకోపన్యాసాలలో రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ ఖండించటం జరిగింది. నాటక కళ వివరించే వ్యాసా లనేకం ఈ వ్యాసాలలో ఉన్నాయి.

9. ఆరోగ్య ప్రాధాన్యం వివరిస్తూ, అఖిల భారతీయాయుర్వేద పరిషత్తు ప్రాముఖ్యం తెలుపుతూ, ఆయుర్వేద వైద్య స్థితి గుర్తిస్తూ, భారత దేశ వైద్య పూర్వ పరిస్థితి వివరిస్తూ వ్రాసిన వ్యాసాలు ఆరోగ్యంగా ఉన్నాయి.

10. చింతామణి పత్రికలో అంతఃపురోపన్యాసాలు అచంట సుందర రామయ్య వ్రాశాడు. ఆ పేరుతో ఈ రచయిత నాలుగు వ్యాసాలు సృజించాడు. ఇందులో స్త్రీ అభిప్రాయం ప్రాధాన్యం వహించింది. స్త్రీ తత్త్వగోచరంగా ఉన్న ఈ వ్యాసాలు కోమలంగా ఉన్నాయి.

11. 'జ్యోతిష్యం' మీదా, 'గర్భవతులు - గ్రహణము'ల మీదా, రచయిత వ్యాసాలలో శాస్త్ర దృక్పథం ప్రదర్శించాడు. భిన్న విషయాలు

భిన్న రీతులు ఉన్నా, ఈ రచనలు ప్రధానంగా ఉపన్యాస రూపాలు అయినా, ప్రచురణార్థం వ్రాసిన వ్యాసాలే! ఒక్క విషయం మీదే భిన్న వ్యాసాలు, ఒక్క భావమే భిన్నోక్తులతో వ్రాయబడటం కూడ జరిగింది.

పలువురు పూర్వ వ్యాసకర్తలు సాధారణంగా సంస్కరణ దృష్టి వ్యాస దృష్టిలో నిక్షిప్తం చేశారన్న విషయం అవగతపూర్వమే. అయితే ఈ రచయిత వ్యాస రచనం సంస్కరణం కంటే సాహిత్యం కోసమే చేశాడు. గ్రాంథిక భాషా వాదం చేసేటప్పుడు ప్రాచీన భాషా స్వరూప రక్షణ దీక్ష గోచరమవుతుంది. ఈ వ్యాసాలలోని విషయం కాని, వివరణం కాని, మనస్సులో స్థిరంగా నిలిచిపోవటంకంటే, భాష, అభివ్యక్తి, రచనా విధానం నిలుస్తాయి. పానుగంటి వ్యాస వ్యక్తి ఆంతర్యంకంటే బాహిరత బాగా గుర్తు వుంటుంది. ఈ రచయిత, తెలుగు భాష తీయదనం గుర్తించి, గుర్తింప చేసే వ్యాస సృష్టి చేసి, భాషా ప్రవాహంలో భావం కొట్టుకుపోయినా భరించాడు.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు, సాంఘిక సంస్కరణం మీద విశ్వాసం లేకుండా, భాషాభ్యుదయ దృష్టి తిరస్కరిస్తూ, స్త్రీ స్వాతంత్ర్యాది విషయాలతో ప్రాచీన దృక్పథం ప్రదర్శిస్తుంటే, ఆయా భావాలు తిరస్కరించే పాఠకులు, ఈ వ్యాస రచనా సౌందర్యం కారణంగా వ్యాసకర్తను హృదయంలో నిలుపుకోవటం జరిగింది. ఆ భాషా నైపుణ్యం, వ్యక్తమయిన హృదయం, ఈ వ్యాసాలను జాతి ఆస్తిగా రూపొందించాయి.

*పానుగంటిపై ప్రభావం :*

పానుగంటి వ్యాసాలు స్పెక్టేటరు వ్యాసాలలాగా ఉంటాయనీ, ఈ వ్యాసకర్తపైన ఎడిసన్ ప్రభావం ఉందనీ, అందువల్ల రచయితను ఆంధ్రా ఎడిసన్ అనవచ్చుననీ భావిస్తుంటే, తన రచన మెకాలె రచన లాగా ఉంటుందని తలపోయటం ''నే నాత్మస్తుతి జేసికొందునని మీరధిక్షేపింతురు కాని, నా స్టైల్ మెకాలె వలె నుండునని కొందఱు పెద్దలే నా చాటున నను చున్నట్లు నేను వింటిని'' అంతఃపురోపన్యాసము ( ప్రకీర్ణోపన్యాసము పుట 405 ) అనటం గుర్తింపవచ్చు.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు వ్యాసాలపైన-విషయగ్రహణ సందర్భం వల్ల, కందుకూరి వీరేశలింగం పంతులు రచనా రీతి పురస్కరించు

కొని చూడటం వల్ల జియ్యరుసూరి, అంతఃపురోపన్యాస రచనా విధానం పరికించటం వల్ల, ఆచంట సుందర రామయ్య ప్రభావాలు గోచరమవుతున్నాయి. విషయ గ్రహణంలో ప్రభావం ఉన్నా, కందుకూరి అభివ్యక్తి, రచనారీతి కంటే పానుగంటి పద్ధతి భిన్నమే! కందుకూరి సాహిత్యంలో సంస్కర్త, అభ్యుదయవాది, పురోగమన వాదిగా ఉంటే, పానుగంటి ప్రాచీనతాభిమాని, సనాతన సంప్రదాయ సంరక్షకుడు, యథార్థవాదిగా ఉన్నాడు.

జియ్యరు సూరి రచనా విధానం పానుగంటి బాగా పుణికి పుచ్చుకొన్నట్లు జాగరూకంగా పరిశీలిస్తే స్పష్టమవుతుంది. ఇద్దరి రచనలలో తుల్య ధర్మాలు ఉన్నాయి.

త్రాగుబోతుల దుర్గతిని తెలుపుతూ ''కల్లంగడియే వారికి కాణాచి. తుప్పమెట్టలే వారికి కాపురపుటిల్లు. దుమ్ము దూసే వారికి దోవతులు. బూడిదయే వారికి సకినెల మంచము. పేఁడయే వారికి తలఁగడ. ఆకాశమే వారి కంబరము. కల్లే వారికి స్నానపానములు. సంకటములే వారి కాశ్రయము.''

(జియ్యరు సూరి శ్రీ కళాకల్లోలిని-పుట 145)

''వారి కాకాశమే పత్రము. నోటి మాటయే చేవ్రాలు. సూర్యచంద్రులే సాక్షులు. సత్యమే స్టాంపు.''

(పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు-సాక్షి, ద్వితీయ సంపుటం. సనాతనాధునాతన నాగరకతలు-పుట 75)

సంయమనం ఉన్న జియ్యరు సూరి రచనకూ, స్వేచ్ఛ ఉన్న పానుగంటి సృష్టికీ, భాషా ప్రయోగ కౌశలంలో కొంత సామ్యం రెండు రచనలు నిశితంగా పరిశీలిస్తే కనిపిస్తుంది.

ఉత్తమ శైలి ప్రదర్శించి, అధిక్షేపబలం పూర్ణంగా స్వీకరించి, సృజన వ్యాస సృష్టి కావించి, హాస్యం, రచనారీతి భావి రచయితలు గ్రహించేంత పటిష్ఠంగా రూపొందించి, సాంఘికాభ్యుదయం పట్టించుకోకపోయినా, వచనం పరుగెత్తించి, ఉపన్యాస సృష్టిచేసి; తెరమరుగున నిలిచిన వ్యాస కళాజ్యోతి పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు.

## 2. వదరుబోతు

'వదరుబోతు' 22 వ్యాసాల సంపుటి. ఇవి 1932 దాకా విడి వ్యాసాలుగా వెలువడి జనాదరణ పొందాయి. 1932 లో అనంతపురం విద్యార్థి సంఘం వీటిని ఈ సంపుటంగా ప్రచురించింది. ఇవి కాక ఇంకా 18 వ్యాసాలు అలభ్యంగా ఉన్నాయి.

నాటికే, అవి లభించకుండా పోయాయి. వీటిని ఎవరు వ్రాశారో తెలియదు. ''అనంతపురపు దరణులలోని యొకరిద్దఱి హృదయములందా యుద్ధ కాలమునఁ గలిగిన కదలిక ఫలెమే యీ వదరుబోతు''అనీ, ''ఈ వ్యాస కర్తలు ఇరువురు, ముగ్గురన్నను తప్పులేదు. వారి పేళ్ళు ప్రచురించుటకు మాకిప్పుడవకాశములేదు'' అనీ ప్రస్తావనలో తెలపటం వల్ల రచయితలు ఇద్దరో ముగ్గురో అయినట్లు తెలుస్తుంది. అయితే ''గ్రంథ కర్తల వ్యక్తిని ప్రకటించు నధికారము మేము గైకొనలేదు'' కాబట్టి, రచయితల పేర్లు మరుగున పడివున్నాయి.

పప్పూరు రామాచార్యులు 'ఆఁ! అప్పుడు-ఏదో వ్రాశాం!' అనటం కంటే ఎంతగా ప్రశ్నించినా, ఏమీ చెప్పక, ప్రసంగం మార్చటం వల్ల, 'వదరుబోతు' రచయితలలో పప్పూరు రామాచార్యులుండటం ఖాయం. రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ రచన కారణంగా మరొక రచయిత కావచ్చునని అభ్యూహ. ఈ వ్యాసాలలో చివరిది 2.3.23 న పినాకినీ పత్రికలో ముద్రితమయింది. 1932 కు 15 సంవత్సరాల పూర్వం నుంచి రచించటం మొదలైంది. అందువల్ల ఈ వ్యాసాలు 1917-1923 సంవత్సరాల మధ్య కాలంలో వ్రాయటం జరిగింది. ఇవన్నీ ఆఁగ్ల వ్యాస లక్షణ శోభితఁగా ఉన్నాయి. ఈ రచనలు వ్యాసాలనే రచయితల అభిప్రాయ మయినట్లు స్పష్టమవుతుంది.

సాక్షి వ్యాసాలకు స్పెక్టేటరు ప్రభావం ఉండగా వదరుబోతు వ్యాసాలకు టాట్లరు ప్రభావం ప్రసిద్ధంగా వుంది. 'వదరుబోతు' రచయితలు ఇద్దరు ముగ్గురున్నా, సాక్షికి సంఘమున్నట్లు దీనికి లేదు. 1913 లో వెలువడి, అధికంగా ప్రాచుర్యం పొందిన సాక్షి వ్యాసాల ప్రభావం 1917 తర్వాత అవతరించిన వదరుబోతు వ్యాసాల మీద ఉండ. అయితే ప్రస్తావనలో ''వదరుబోతు జననమునకు సాక్షితో నే సంబంధమును లేదనుట నిక్కము'' అనీ, ''సాక్షిలో నున్నంత మాటల పాటవము, అడ్డు ఆఁకలేని నాగుఁబాము నడక, సందేహము:

లేని సిద్ధాంతములు, గరుసుపాఱని గొంతుకతో రచ్చలో నున్న వారికెల్ల వినవచ్చునట్లుగా చేయు రాద్ధాంతములు'' వదరుబోతులో లేవనీ ప్రచురణ కర్తలు తెలిపినా, సాక్షి ప్రభావమున్నదన్న దృష్టితొలగి పోదు. పైగా బలపడుతుంది.

తెలుగులో అధిక్షేపవ్యాసం, సాక్షిమూలంగా సృజనమయింది. ఈ 'వదరుబోతు' వ్యాస కర్తలు అధిక్షేప వ్యాసం చేపట్టారు. కొన్ని సాక్షి వ్యాస విషయాలు గ్రహించారు. కొంత రచనా రీతికి మెఱుగు పెట్టారు. వ్యక్తుల నైచ్యం, సమాజ దైన్యం, ఆధునిక నాగరకతలో మూర్ఖత్వం, ప్రాచీన జీవితౌన్నత్యం ఈ వ్యాసాలలో గోచరమవుతూ వున్నాయి. విమర్శింపబడ్డాయి. రాజకీయ విషయాలు, సాక్షిలో లాగా, వదరుబోతులోనూ వ్యాస జీవితం నోచుకోలేదు. ''నీతి మత ధర్మాదులయందు దాస్యమును దైన్యమును'' గూర్చి ''వదరుబోతు'' వ్యాసాలలో వ్రాశారు.

కొన్ని వ్యాసాలలో ఆంగ్లభావాభివృద్ధి వుంది. ఈ వ్యాసాలలో అధిక్షేపం సున్నితంగా ఉంది. విమర్శ నిశితంగా ఉన్నా, వ్యక్తిగతంగా లేక, అబాధకంగా ఉండి, సంస్కరణ సమర్థంగా ఉంది. వీటిలో ప్రధానంగా సాహిత్యం, అప్రధానంగా సంఘం ప్రతిబింబించాయి. వ్యాసకర్తలు సంఘ దుస్థితిని గూర్చి పడిన ఆవేదన సారస్వత రూపమయింది.

విషయ వ్యాసం :

వ్యాసకర్తలు సంస్కృతాంధ్ర సాహిత్యాలలోని విశిష్టరచనం స్థాలీపులాక న్యాయంగా పరికించారు. కవి పండితలోకంలోని బిరుదుల ప్రసక్తి అధిక్షేపించారు. ప్రాచీనాధునిక కవితా తారతమ్యం గుర్తించి, నాటక కళా వైశిష్ట్యం వివరించటం తిలకింపవచ్చు. ఉపకారం చేయటంలో తృప్తి, కృతార్థత వుంటాయనీ, మత ధర్మ పరమార్థంగా సృష్టికర్త ఉద్దేశం ఇమిడి వుంటుందనీ, ఒకరి నొకరు గౌరవించటంలోనే జీవిత సత్యం ఉంటుందనీ తెలిపారు. ఆధునిక మానవ జీవితంలో తొందర నిరసించారు. వివేకం లేని విద్య వల్ల మనిషి పశువే అవుతాడనీ, హాస్యం కళ కూడా అవుతుందనీ భావించారు. సుఖం బాహిరం కాదనీ, సత్యం సర్వశ్రేయస్కరమనీ, ఆధునిక వివాహ వ్యవస్థ ఎంతో పతనమయిందనీ రచయితలు వ్యథపడ్డారు. డబ్బు పండుగలు పబ్బాల పేరుతో

వ్యయం చేయటం అవసరమని సూచించారు. విషయ వైవిధ్యం ఈ వ్యాస రచనంలో ప్రముఖంగా వుంది.

నిర్మాణ వ్యాసం :

వ్యాసాలలో వాక్యాలు చిన్నవి. భావాలు తీవ్రంగా ఉన్నాయి. పదాలు సమర్థంగా అతివ్యాప్తి అవ్యాప్తి కవకాశం లేకుండా ప్రయుక్తమయ్యాయి. క్రియారహిత వాక్య నిర్మాణం గోచరమవుతుంది. వాక్యాలు క్రియాంతమయితే, కత్తిరించినట్లు బహుసంక్షిప్తంగా ఉన్నాయి.

ఏ వ్యాసమూ పది పుటలకు మించలేదు. సాధారణంగా వ్యాసాంశాలు కథాబలంతో వివరింపబడ్డాయి. సామాన్యంగా వ్యాసాంతం ఆంగ్ల సంస్కృతాంధ్రాలలోని సూక్తితో వుంది. వ్యాసంలో అనవసరమని తోచిన చోటనెల్లా సూక్త్యుదాహరణాలున్నాయి. ఇవి పటాటోపంలేని వ్యాసాలు. ఒక్క అంశం, మూడు నాలుగు చిన్న భాగాలుగా విభజించి వ్రాయటం వ్యాస రూపంగా కనిపిస్తూ వుంది. విషయంలో కాని, రచనంలో కాని 'అతి' లేదు. భాషాభావాలు సమంగా సాగాయి. ఈ వ్యాసాల మీద సాక్షి ప్రభావం వాక్య నిర్మాణంలో, నాటక విషయ రచనంలో, సత్యసంబంధి విషయ గ్రహణంలో, కథా ప్రయోగంలో గోచరమవుతుంది.

సాక్షిలో విషయం తక్కువ, మాట లెక్కువ అయితే, వదరుబోతులో భాషా విషయాలు సమానంగా ఉన్నాయి. జంఘాలశాస్త్రికి నోరు తప్ప మరే అవయవమూ లేనట్లు మాట్లాడితే, వదరుబోతులో వదరుబోతు సంయమనవాక్కు గమనార్హంగా ఉంది.

సాక్షి, వదరుబోతు వ్యాసాలు స్పెక్టేటరు, టాట్లరుల లాగా ప్రాచీనతవైపు మొగ్గుతూ, సమాజ జీవితంలో ఆధునిక భావ పరిణామం వెంటనే అంగీకరించక పోవటం నుంచి ఆవిర్భవించాయి. అధిక్షేపం, అభివ్యక్తి సౌందర్యం, వదరుబోతు వ్యాసాలకు అలంకారాలు. ఆంగ్ల భాషా ప్రభావం ఆంధ్ర భాషా రచనలో కలిగించిన సంయమనానికి ఈ వ్యాస సంపుటి నిదర్శనం. ఆంధ్రులకు నూత్న రచనా రీతి సుకరంగా పరిచయం చేసిన ఆధిక్యం ఈ సంపుటికి కలిగింది. అధిక్షేపంతో, ఉత్తమ సృజనవ్యాస సంపుటిగా వదరుబోతు వుంది.

## 3. బారిష్టరు గారి బాతాఖానీ :

మొక్కపాటి నరసింహశాస్త్రి

మొక్కపాటి నరసింహశాస్త్రి 'బారిష్టరుగారి బాతాఖానీ' 19 వ్యాసాల సంపుటి. 1953-54 మధ్య ఆంధ్ర సచిత్ర వార పత్రికలో మూడు నెలల పాటు ప్రచురితాలయిన వ్యాసాలూ; రేడియో, ఢంకా, రూపవాణి వల్ల వెలుగు చూచిన రచనలూ ఈ సంపుటిలో ఉన్నాయి. ఇవి వ్యాసాలుగానే రచయిత భావించటం, వ్యాసం బాతాఖానీగా రూపొందటం గమనింపవచ్చు.

సాక్షి, వదరుబోతు వ్యాస సంపుటాల ప్రభావం ఈ బాతాఖానీ మీద వుంది. సాక్షి సంఘంలాగా బారిష్టరు మిత్రబృందం వుంది. వీళ్ళు అయిదుగురు. శర్మ, శాస్త్రి, భద్రం, రామం, టప్పయ్య వీళ్ళ పేర్లు. వీళ్ళు కలుసుకొనే తావు క్లబ్బు. వీళ్ళు గోలచేస్తున్నారని క్లబ్బు సభ్యత్వం రద్దుచేయటం వల్ల మరో స్థలం వెతుక్కోవటంలో నిమగ్నులయి పోవటంవల్ల బాతాఖానీ ఆగిపోయింది.

బారిష్టరు పార్వతీశం సృష్టితో ఆంధ్ర దేశంలో సుప్రసిద్ధి వహించిన మొక్కపాటి నరసింహశాస్త్రి కథానికా, నాటికా, నవలా రచయితనేగాక, వ్యాస కర్తగా ఈ 'బాతాఖానీ' వల్ల తెలుస్తాడు. 'ఇటువంటి రచనా వ్యాసంగాన్ని ఆంగ్లంలో సెటైర్ అంటారు. వ్యక్తిలోకాని, సంఘంలోకాని ఉండే దౌర్బల్యాలనూ, దురాచారాలనూ, అవకతవకలనూ వెర్రివేషాలనూ, ఎత్తిచూపి అవహేళన చేస్తూ నవ్వులపాలు చెయ్యడమన్నమాట'' (నా మనవి -రచయిత) ఈ దృష్టితోనే ఆంధ్రులను అధిక్షేపించటానికి ఈ వ్యాసాలు సిద్ధమయ్యాయి. ''మిక్కుటమైన జాత్యహంకారం, అనృతవాదం, ఆడంబరం, అజ్ఞానం, అశక్తదుర్జనత్వం, అలసత, అన్నిటియందూ నిర్లక్ష్యం, దేనియందూ విశ్వాసంకాని, భక్తికాని లేకపోవడం ఇత్యాదులెన్నెన్నో అవివేకాలు పూర్వజన్మ వాసనలూ, ఆంధ్రజాతి సంతతినీ పట్టుకుని వదలడం లేదని నా నమ్మకం''(నా మనవి-రచయిత) వీటిని అధిక్షేపబలంతో విమర్శించి, సమాజం గుర్తించేటట్లు చేసి, శాసనం చేసి జాతికి మేలు చేయాలన్న సంకల్పం, ఈ వ్యాస గతంగా గోచరమవుతుంది. అందువల్ల ఈ వ్యాసాలు ''హైందవ సాంప్రదాయాల మీదా, మతాచార వ్యవహారాల మీదా సాధించిన ధర్మయుద్ధాలు'' (నా మనవి -రచయిత)

*విషయ వ్యాసం :*

బారిష్టరు అప్పుడప్పుడు క్లబ్బులో మిత్రమండలికి బోధించిన విషయాలు టప్పుయ్య గుర్తుంచుకొని వ్యాసాలుగా వ్రాసినట్లు తెలపటం జరిగింది. ఆంధ్రుడు పరదాస్యశృంఖలాబద్ధుడనీ, సంక్రాంతి ఆంధ్రులకు ఆనంద సంకేతమనీ, ఏ విషయమూ సరీగ్గా గుర్తించే గుణం లేకపోవటం, అలక్ష్యం ఆంధ్రత్వ చిహ్నాలనీ, కవి పండితుల ఉపన్యాసాలు సభ్యులకు చావు అవుతున్నాయనీ, గొప్పలు చెప్పు కోవటం మానవ నైజమనీ, కష్టపడకుండా ధనార్జన బుద్ధి దూష్యమనీ, మనిషి ప్రసిద్ధి కోసం తాపత్రయపడతాడనీ, విద్యారంగంలో కాలుష్యం ఉందనీ, ఎవరూ బాధ్యత స్వీకరింపకుండా ఉంటున్నారనీ, ఆంధ్రుడెవడి ప్రయోజకత్వం అంగీకరింపడనీ, ఉగాది కొత్త జీవితం రుచి చూపుతుందనీ, నేడు ప్రాచీనార్ష ధర్మచ్యుతి జరుగుతూ వుందనీ, సామాజికాభివృద్ధి నూత్నమనీ, ఆదర్శాలన్నీ సాధ్యం కావటం అదృష్టమనీ, చలన చిత్ర రంగంలో మార్పులు అతివేగంగా జరుగుతాయనీ, సత్యసంధత విద్యార్థులతో పాటు అందరూ అలవర్చుకోవాలనీ ఈ వ్యాసాలు బోధించాయి.

ఈ వ్యాసాలు ప్రధానంగా ఆంధ్రులలోని లోపాలు, అవగుణాలు మాత్రమే చెప్పేవిగా ఉన్నాయి. ఆ చెప్పటమూ చులకన చేసినట్లు, తిట్టినట్లు అధిక్షేపయుతంగా వుంది జాతి నంతటినీ విమర్శకు గురి చేసినా, రచయిత విశాల దృక్పథం, జాత్యభ్యుదయవాంఛ గుర్తించాలి.

*నిర్మాణ వ్యాసం :*

ప్రతి వ్యాసంలో చర్చింపబోయే ప్రధానాంశంలోని ఏ భాగమో వివరించే ట్లుగా ఉన్న ఒక సన్నివేశం నాటకీయంగా, జరుగుతున్నట్లుగా, కళ్ళకు కట్టేటట్లు చిత్రించి, ఆ సన్నివేశ ప్రోత్సాహం వల్ల బారిష్టరు ప్రసంగించే అవకాశం సృష్టించి, మిగతా వ్యాసమంతా బారిష్టరు ఉపన్యాసంగా సాగించటం జరిగింది. 'ఆదర్శాలు', 'డైరెక్టర్ల పరిణామము', 'సత్యసంధత' వ్యాసాలు తప్ప మిగతావన్నీ కథతోనో, వార్తతోనో. సన్నివేశంతోనో ప్రారంభమయి ప్రధానాంశ వివరణం చేశాయి. ఈ వ్యాసాలు విమర్శనంగానో, వివరణంగానో ఉన్నా, ప్రధానంగా కథాది కల్పిత రచనల ధోరణిలో వున్నాయి. 'ఆదర్శాలు'

తప్ప ఏ వ్యాసమూ 14 పుటలు మించలేదు. సృజన ధర్మాధిక్యం వ్యక్తం చేసే వ్యాసాలు ఈ బాతాఖానీలు.

మొక్కపాటి నరసింహ శాస్త్రి, వదరుబోతు మార్గంలో తీర్చి దిద్దాలని యత్నించిన 'బారిష్టరుగారి బాతాఖానీ' వ్యాసాలు రచయిత లక్ష్య సిద్ధిని తెలుపుతాయి. అధిక్షేపం ఆంధ్రజాతి లోపం తీర్చే దృష్టితో సాగింది కాబట్టి, ఉత్తమ రీతి అధిక్షేపంగా రూపొందింది. రచయిత అంతరాభివ్యక్తి పొందిన ఈ వ్యాసాలు ఆంధ్ర జాతికి ఆనంద ప్రతిపాదకాలుగా అవతరించాయి.

## 4. ముట్నూరి కృష్ణారావు (1879–1945)

అధిక్షేప సంబంధం లేకుండా, మానవ జీవితంలోని లోవెలుగులు సమీక్షించిన ముట్నూరి కృష్ణారావు కృష్ణాపత్రికకు సంపాదకత్వం వహించి, భారతదేశ స్వాతంత్ర్యోద్యమంలో నిర్విరామంగా కృషి చేసి, మనిషి ఆధ్యాత్మికౌన్నత్యం వాంఛించి, తెలుగు దేశం అన్ని రంగాలలో పురోభివృద్ధి చెందాలని కాంక్షించి, సారస్వతం సుసంపన్నం కావించిన అగ్రశ్రేణి రచయిత. ముట్నూరి కృష్ణారావు వ్యక్తిత్వాన్ని సారస్వత పరిమిత పరిధి నుంచి పరికిస్తే, పూర్తి వైశిష్ట్యం వైదగ్ధ్యం గోచరం కావు. ఒక పరిపూర్ణ మానవుడి ఒక దశా విశేషంగానే ఈ వ్యాసాలు పరికింపవచ్చు.

పత్రిక కోసం వ్రాసిన సంపాదకీయాలు, సారస్వత కళాది సమీక్షలు, భావ వీచికలు వ్యాసాలుగా గ్రహింపవచ్చు. కృష్ణా పత్రికలో నుంచి ఏరి ముద్రించిన రచనలే 'సమీక్ష'లో 'లోవెలుగులు'లో కలిపి నూటికి పైగా ఉన్నాయి. ''టాగోరు కవిత్వమును గూర్చి కృష్ణారావు గారు వ్రాసిన వ్యాసములు రాధాకృష్ణుని వంటి వేదాంత వేత్త రచనాశక్తిని ఉద్దీపింప జేసినవని చెప్పుదురు" (15) అన్నప్పుడు ఈ వ్యాసకర్త ఆధిక్యం కొంచెంగా నయినా గుర్తించటం జరుగుతుంది.

ఈ వ్యాసాలు కళా మత సాంఘిక సంబంధులుగా ఉన్నాయి. లలిత కళలలో సారస్వతం, చిత్రలేఖనం, శిల్పం, నృత్యం వ్యాస విషయాలుగా ఉన్నాయి. ధార్మిక జీవితం, మత, సాంఘిక విషయ బోధకమై ఉన్నట్లుగానే, ఈ వ్యాసాలలో రెండు ధర్మాలు గోచరమవుతున్నాయి. ఆంగ్ల నాగరికతా

ప్రభావంతో తెలుగు దేశంలో తలెత్తిన నూత్న జీవిత రీతులు రచయిత భరించ లేకపోవటం నుంచి ఈ వ్యాసాలు ఆవిర్భవించాయి. భారతదేశం పారతంత్ర్యంలో ఉండటం వల్ల భారతీయుడి- ముఖ్యంగా ఆంధ్రుడి- ఆలోచనలో బానిస మనస్తత్వం కనిపిస్తుంది. ఈ వ్యాసకర్త స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కోరటంతో పాటు ఏ క్షణమూ దాస్యానికి తలవంచ లేదు.

ముట్నూరి కృష్ణారావు ఆవేదన ఈ వ్యాస సృష్టికి నాంది. జాతి అనేక రంగాలలో పొందే విపరీత పరిణామం, వేసే వెర్రితలలు చూచి, ఆందోళన చెందిన రచయిత వ్యక్తిత్వం పొందిన రూపాలీ వ్యాసాలు. విషయ పరిణామం పరికిస్తే ప్రారంభంలో కళాలోచన చేసిన రచయిత క్రమంగా, స్వాతంత్ర్యం, సాంఘిక జీవితం, మతం అనుసంధించి ఆలోచించటం స్పష్టంగా వుంది.

పత్రికా వ్యాసం అభివృద్ధి పొందుతున్న దశలో ముట్నూరి కృష్ణారావు చేసిన వ్యాస సృష్టి దాని రూపం నిర్ణయించేంత సమర్థంగా వుంది. అనంతర కాలంలో వెలువడ్డ పత్రికా సాహిత్యానికి ప్రాణభిక్ష, ఈ రచయిత నుంచి లభించింది. ''తెలుగు భాషలో వ్యాస రచనకు చక్కని ఒరవడి పెట్టిన వారు ముట్నూరి కృష్ణారావు గారనుట నిస్సంశయము. ఏ విషయమును గూర్చియైనను సమగ్రముగను, స్పష్టముగను, సుబోధకముగను వ్రాయు తెలుగు వచన రచయితలలో కృష్ణారావు గారిది అగ్రతాంబూలము.'' (16) అని విమర్శకాభిప్రాయం.

వైశద్యం దృష్టిలో ఉంచుకొన్న ఈ రచయిత సృష్టి స్పష్టతను సంతరించుకొంది, లోకంలోనో, సాహిత్యంలోనో లభించే ఒక విషయం గ్రహించి, దాన్ని సాంఘిక సమస్యా సంబంధిగా తాత్త్వికంగా ఆలోచించటంతో రచయిత బుద్ధి నైశిత్యం గోచరమవుతుంది. కాళిదాసు కవితా విమర్శనంతో, టాగూరు ఆలోచనలు ఈ వ్యాసగతంగా గోచరమవుతున్నాయి.

స్థూలంగా, ముట్నూరి కృష్ణారావు వ్యాసకర్తగా, కళా రంగంలోనూ మత సాంఘిక విషయికంగానూ, జాతి పతనం కాగూడదన్న తీవ్ర సంకల్పం ప్రదర్శించాడు. ఆంగ్లేయ సంస్కారం లాభం కలిగిస్తే గ్రహింపవచ్చు కాని, కీడు చేసినప్పుడు తక్షణం పరిత్యాజ్య మన్నాడు.

పారతంత్ర్యం భరింపరాదు, స్వాతంత్ర్యం వాంఛించాలి, సంపాదించాలి, ఆంగ్లేయత్వం ఏ రంగంలోను కోరరాదు, ఆంధ్రత్వం నిలుపుకోవాలి, దేశీయత

రక్షించుకోవాలి, ప్రాచీనార్షధర్మ సంస్థాపనం చేసుకోవాలి అనేవి అంతస్సూత్రాలుగా ఈ వ్యాసాలు రూపొందాయి.

సమీక్షలో వ్యాసాలు విస్తృతంగా ఉన్నాయి. కాని, 'లో వెలుగులు'లో సంక్షిప్తంగా ఉన్నాయి. సంపాదకీయాలు తత్కాలావసరబోధకాలై, స్ఫుటంగా ఉన్నాయి. ఈ వ్యాస భాష గ్రాంధికం నుంచి వ్యావహారికంగా పరిణమించింది. ఈ వ్యాసాలన్నీ 1916-1933 మధ్య కాలంలో ఎక్కువగా, ఆ తర్వాత తక్కువగా వ్రాయబడ్డాయి.

ఈ వ్యాసకర్త పాఠకుడితో సోదరుడిలాగా ప్రవర్తించటం వ్యాస పరిణామ దృష్టితో అవశ్యం గుర్తుంచుకోవలసిన అంశం. సోదరుడి బాధ్యత కంటే భిన్నమయింది. అన్నదమ్ములను ప్రేమించే సోదరుడు వాళ్ళ అవసరాలను, అర్హతలను గుర్తించి, లోకం బోధించటం, వివరించడం, కావలసినప్పుడు ఆదుకోవటం ఆసరా ఇవ్వటం వంటి భిన్న ధర్మాలు ఆంధ్రావళికి వ్యాసకర్త ప్రదర్శించటం గ్రహింపవచ్చు.

ఈ వ్యాసాలు ప్రధానంగా వివరణాత్మకంగానే ఉన్నాయి. శాస్త్రవేత్తలాగానో సాహితీ నిర్మాతలాగానో, రచయిత ప్రవర్తించలేదు. సాంఘిక పరిణామం కోసం రచయిత ఆవేదన నుంచి అవతరించిన ఈ వ్యాసాలు సాహిత్యంలో విమర్శనంగానో వివరణంగానో ఉండవచ్చుకాని, నిజానికి జాతిజీవితం ఉన్నతంగా మహోన్నతంగా ప్రాచీనౌన్నత్య ప్రదర్శకంగా వెలుగొందాలని వ్యాసాల ప్రధాన కాంక్ష.

వేదాంత పరమ రహస్యాలు 'లో వెలుగులు'లో, సాహిత్య, విమర్శలు 'సమీక్ష'లో, పొందుపరచి గతించిన మహావ్యక్తి ముట్నూరి కృష్ణారావు. ఆధ్యాత్మిక జీవితానికీ, కాల్పనిక సాహిత్యానికి వ్యాసకర్త చేసిన దోహదం ప్రశంసాపాత్రం.

భారతీయార్ష సమాజాన్ని ప్రేమించి, ప్రేమింప జేయాలన్న పట్టుదల ఉన్న రచయిత హృదయోద్వేగం నుంచి ఆవిష్కృతమైన ఈ వ్యాసాలు రచయిత అంతర వ్యక్తిని అవలోకింపజేశాయి.

అవసరమయినప్పుడు కథలను, పద్యశ్లోకాలను, తద్భాగాలను వ్యాసంలో ఉదాహరించాడు. పాఠకుడికి స్పష్టమయ్యే విధంగా అతడి అనుభవ సన్నిహితంగా ఉక్తి నైపుణ్యంతో చేసే రచనా దక్షత ఈ రచయిత సొత్తు.

ప్రతి క్షణం రచయిత పాఠకుణ్ణి పలకరించటం ప్రతి వ్యాసంలోనూ వినిపిస్తుంది. ఆత్మీయంగా సంబోధించటమూ వుంది. ఆధ్యాత్మిక విషయ వివరణంలో విస్పష్టత రచయిత లక్ష్యం. జాతిని చైతన్య వంతంగా చేయాలనుకొన్న ప్రతిభావంతుడి సృష్టిగా ముట్నూరి కృష్ణారావు వ్యాసాలు ఆంధ్ర సారస్వతంలో సముచిత స్థానం పొంది విలసిల్లుతున్నాయి.

## 5. వావిలికొలను సుబ్బారావు

సుప్రసిద్ధ కవి, వ్యాకరణకర్త, వావిలికొలను సుబ్బారావు వ్రాసిన వచన రచనలో 'బాలికాహిత చర్య', 'కుమారహితచర్య', 'పతి హితచర్య', 'కుమారీ హితచర్య', 'సతీ హితచర్య', 'గర్భిణీ హితచర్య'. 'ఆధునిక రచన విమర్శనము', 'ఆర్యవిద్యోపన్యాసము' (1922) వ్యాసాలు. హిత చర్యలలో మేలు బోధించటం లక్ష్యం. నీతి వివరించటం, యుక్త కార్యాచరణ విపులీకరించటం దృష్టి. వ్యావహారిక భాష ప్రయోగార్హం కాదని భావం. 'ఆర్యవిద్యోపన్యాసము' మూడు భాగాలుగా వుంది. జాతీయ విద్య నిర్వచనం, ఆర్య విద్యా శిక్షా పద్ధతి, జాతీయ విద్య అందులో వివరింపబడ్డాయి.

హితచర్యలు బాలకులు, కుమారులు, భర్తలు, కుమార్తెలు, సతులు, గర్భిణీ స్త్రీలు ఏం చేయవచ్చో, ఏం చేయరాదో వివరించాయి. నీతిబోధలో బూతు ప్రవేశించినా లక్ష్యపెట్టని విషయ నిష్ఠ హితచర్యలలో గమనించవచ్చు''... పర పురుషులతో మాటలాడు నపుడు ఆవలింత నటించి, బొమ్మలు విఱుచు నదియు, కనుబొమలు తల మెడ పెదవులు చేతులు తొడలు నిలుకడలేక పలుమాఱాడించుచు నలుచేతి పాదరసమువలె తత్తఱలాడునది, తన చంకనుండు బిడ్డను పరపురుషుడు తీసికొన సహించునది, పరపురుషులకు చీట్లు వ్రాయునది. పురుషులతో చీట్లాడునది, పురుటింటినుండియే తాను బిడ్డగన్న వార్త పర పురుషునకు వ్రాయునది, ఇట్టి వారందఱు దుష్ట స్త్రీలుగానో, చెడిపోవువారుగనో యుందురు.'' (కుమారీ హితచర్య-పుట 69)

'ఆర్య విద్యోపన్యాసము'లో విద్యా పరమోద్దేశం గ్రహించి, ఆంగ్ల విద్య ప్రాబల్యం తెలిపి, దేశ భాషాపతనం నిర్మూలించటం వల్ల కష్టం వివరించి, విద్య మత నాశన స్థితి పరిశీలించి, ఆర్య విద్య క్రమవికాసం నిర్ణయించి, జాతీయ విద్య నేతిబీరకాయగా చూపించాడు. "నా మతమున స్వవిద్యాభిమానము లేని వాఁడు స్వమతాభిమానము గలవాడు కానేఁరడు. స్వమతాభిమానము లేనివాడు దేశాభిమాని కాజాలడు. అభిమానము జ్ఞాన యుక్తమై యుండవలయును. మూఢాభిమానము వ్యర్థము. సాపాయము. నిజమైన స్వమతాభిమానము గల వాఁడు గాని దైవభక్తి గలవాఁడు కాజాలఁడు. దైవ సాహాయ్యములేక యే కార్యము నెఱవేరదు. కావున విద్యావంతులై దేశాభిమానము గలవారే క్రియా దక్షులై యుభయలోక వంద్యులగుదురు." పుట (80) అనటం వల్ల రచయిత కున్న స్వవిద్యాభిమానం వ్యక్తమవుతుంది.

ఈ రచయిత రచనా వైశిష్ట్యం గుర్తింపవచ్చు. పుటల తరబడి వ్యాపించే అసమాపక క్రియా వాక్య నిర్మాణం రచయిత సొత్తు. భాషలో నిజాయితీ, నిరాడంబరత అధికమై, కొన్ని చోట్ల అశ్లీలం అనిపించేంతగా రచన సాగింది. బలమైన భావ వ్యక్తీకరణ విధానం వుంది. భారతీయ ప్రాచీనత మీద రచయితకు అభిమానం. ఆంగ్లేయ జీవితం, ఆంగ్ల విద్యాది ఆంగ్ల సంబంధి సర్వకార్య కలాపాలు ఇష్టంలేని వావిలికొలను సుబ్బారావు స్వేచ్ఛమైన దేశాభిమాని.

## 6. పురాణం సూరిశాస్త్రి

'నాట్యాశోకము' 'నాట్యాంబుజము' రెండు వ్యాస సంపుటులు. వీటిలోని వ్యాసాలు 12 గానే కనిపిస్తున్నాయి కాని నిజానికి చాలా ఎక్కువ. ఒక్క వ్యాసంలో అనేకమైన చిన్న వ్యాసాలు ఉన్నాయి. నాట్యాశోకము సృజనంగా వుంది. నాట్యాంబుజము విషయ ప్రాధాన్యంతో వుంది.

'నాట్యాశోకము'లో నాట్య వృత్తాంత విలేఖరి, నాట్య కళా వైదుష్య సంకీర్త నోత్సాహుఁడు, భగవత్పాద సేవకుడు, సత్కళా రసపిపాసిగా పురాణం సూరిశాస్త్రి పేర్కొబడ్డాడు. 'తాటాకులలో పచార్లు' తాళపత్ర గ్రంథ పరిశీలనం యక్షగాన పాఠ పరిశోధనం సంబంధించి సాగింది. 'చెట్ల క్రింది ముచ్చటలు' ఎందరు ఎరకే పరిమితంగా వుంది. 'శ్రీరామ నాట్య లేఖలు' లో నాటకాలు, పాత్రలు, పాత్రధారులను గూర్చి 11 వ్యాసాలు రామ

సంబోధన పరంగా లేఖా రూపంగా, భక్తి ప్రపత్తులతో, భక్తుడి నివేదనలుగా వెలువడ్డాయి. మృచ్ఛకటికము రాధాకృష్ణ నాటకాలమీద సమగ్ర విమర్శనం.

'నాట్యాంబుజము'లో ఆంధ్ర నాటక చరిత్ర, రచయిత అనుభవాలతో తెలిపాడు. నాటక సమాజాల చరిత్ర గమనార్హంగా ఉంది. నాటకం రచనంగా, ప్రదర్శనంగా విమర్శించటం అవసరమని సూచించాడు. నాటక ప్రదర్శనలు, తద్విమర్శలు సాగవలసిన విధానం వివరించాడు. ఇందులో ప్రసిద్ధ నటుల పరిచయం ఉంది. ఈ 19 మంది నాటక రంగంలో సాధించిన అభ్యుదయం సవివరంగా సవిమర్శకంగా తెలిపాడు.

వ్యాసం లేఖారూపంగా ఆవిష్కరించిన ప్రథమ వ్యాసకర్త పురాణం సూరిశాస్త్రి. జీవిత చరిత్ర వ్యాసంగా రూపొందించిన విశిష్టత ఈ రచయితకు చెందుతుంది. వ్యాస రచనమంతా నాటక సంబంధిగా తత్పరిమితంగా ఉంది. నాటక రచనం నుంచి ప్రదర్శనం దాకా ప్రధాన సన్నివేశాలన్నీ, తత్సంబంధంగా పరికించటం, వివరించటం, విమర్శించటం శక్తిమంతమైన కృషి. ఈ వ్యాసాలు సృజన ధర్మ శోభితంగా ఉన్నాయి. ఉదా. "దక్షిణ ఇండియా రైలు మీద కొబ్బరి చెట్టు యేనుగు గుడిగోపురాలు, బిరుదు చిహ్నములుగ చిత్రిస్తారు. ఇంతకంటే నల్లిని వేస్తే బాగుండేది. బృహదేశ్వరుని పశుపతి నామమును మత్కుణగణాలే సార్థక పరుస్తున్నవి. మాగాని పెంపుతో నిలువ నెలవు, తినగడ్డియు దొరకక పశుజాలము సన్నగిలినది. భూసుర వర్గములు లెక్కకు మిక్కుటమై విదేశీయులకెగబ్రాకి కాఫీ పిపాసుల నారాధించుచున్నారు. నల్లిమూక మాత్రము యింటి పట్టును వదలజాలక దివ్య క్షేత్రముల నాశ్రయించి, శివకేశవ ఆరాధన కుతూహలురై సంచరించెడి భక్త పాంథులకు నిర్నిద్రవిరాగ సూత్రముల నుపదేశించుచు నిత్య సంభావన లొసంగుచున్నవి'' (నాట్యాశోకము-పుటలు 214, 215)

ఈ ఉదాహరణం ఆంగ్లంలో వ్యాసం కలిగివున్న లక్షణాలకు సమీపంగా వుంది. 1928కు పూర్వం లిఖితమయిన ఈ వ్యాసాలు కొన్ని ఆ నాటి వ్యాస సృజన గుణ ప్రదర్శకంగా ఉన్నాయి. రచయిత వ్యక్తిత్వం ప్రతి వ్యాసంలో గోచరమై నాటక సృష్టి, వచనరచనా రీతి, శైలి విశదమవుతున్నాయి.

## 7. ఇతర వ్యాసకర్తలు

ఈ యుగంలో అవతరించి, ఆధిక్షేప వ్యాస సృష్టికాని, వ్యాసం నూత్న గుణ శోభితంగా కాని చేయక, పాతరచనా రీతిలో వ్యాస సృష్టి కావించిన భిన్న కర్తలను పరిశీలింపవచ్చు. వీళ్ల సృష్టించిన రచనలు, ప్రధానంగా విషయం గ్రహించటానికి, నాటి దృక్పథం తెలియటానికి ఉపయోగపడతాయి.

### 1. అచ్యుతుని సీతారామయ్య

'సముద్ర యానము' (1915) దోషమా కాదా అని పరిశీలించటం ఇందులో ప్రధాన విషయం. దీనిని "కర్మిష్ఠులగు వేదవిదు లొకవంక నిరసించుచున్నారు. సంస్కర్త లొకు(క)మ్మడి కార్యక్రమముల సూచింపు చున్నారు" అని భూమికలో తెలిపి, సముద్ర ప్రయాణాన్ని నిరసింపజూడటం అనవసరం సాహసం అని నిర్ణయించాడు. రచయితలో సంస్కరణదృష్టి, అభ్యుదయ వాదం బలంగా కనిపించాయి. వ్యాసం భిన్న ప్రకరణాలుగా విభ జించాడు.

### 2. యాతగిరి లక్ష్మీ వెంకటరమణ

'గ్రంథాలయోద్యమము' (1919) ఆంధ్ర దేశంలో ఆరంభమయిన దశను, తదాపశ్యకాన్ని తెలుపుతూ వుంది. గ్రంథాలయం నిర్వహించటం, అది విదేశాలలో సాగుతున్న తీరు. ప్రాచీన భారతదేశ గ్రంథాలయాలు పొందిన స్థితి, తెలుగు దేశంలో అది పొందవలసిన గౌరవం వివరిస్తూ ఈ వ్యాస రచన సాగింది. ఇది ఒక ఉద్యమ ప్రదర్శన సామర్థ్యమున్న రచన.

### 3. పెద్దిభొట్ల వీరయ్య

'వార్రంగల్ ఒంటిమిట్ట వివాదము' (1919) వ్యాసంలో రచన దావా సంబంధిగా కనిపిస్తుంది. 'శ్రీ విద్వన్మహాజన న్యాయ సభవారి సమ్ముఖమునకు' వాది, వార్రంగలు, ప్రతివాది ఒంటిమిట్ట మీద దావా తేవటం వల్ల రచయిత న్యాయనిర్ణేతగా వ్యవహరింపవలసి వచ్చింది. ఈ దావాలో పోతన, శ్రీనాథుల విషయం ప్రసక్తమయింది.

ఇందులో వ్యాసం వ్యాజ్య రచనగా రూపొందటం గమనార్హం. ఊళ్ళు వాది ప్రతివాదులు కావటంతో సృజనాత్మకత అధికతరమయింది. వాదోప వాదాలకు అవకాశం కల్పిస్తూ, సారస్వత సంబంధి చర్చలు దావాగా సాగించ టం రచయిత సాధించిన పరిణామం.

## 4. చెలికాని లచ్చారావు

'విద్యావంతుని ధర్మములు' (1921) నాడు వెలువడ్డ అనేక వ్యాసాల ధోరణిలో సాగిన రచన. ఇది మొదట ఉపన్యసింపబడి, తదనంతరం చిత్రాడ నుంచి ప్రకటితమయింది. విషయం కాని, రచనం కాని నూత్నత సాధింపక పోయినా, ధర్మబోధకంగా ఉన్న వ్యాసం నాటి సమాజావసరమయింది. ఈ రచయిత సృష్టించిన అనేక వ్యాసాలు అలభ్యంగా ఉన్నాయని భావించే అవ కాశం ఉంది.

## 5. సత్యవోలు వెంకట్రావు పంతులు

'అహింసా ప్రబోధిని' (1925) మూడు ప్రకరణాల విస్తృత వ్యాసం, అహింసను ఆచరించాలన్న సామాజికావసరాన్ని సమగ్రంగా పరిశీలించాలన్న సంకల్పంతో సాగింది. ఈ వ్యాసంలో సిద్ధాంతం, లక్ష్యం ప్రధాన భాగాలుగా ఉన్నాయి. ఇందులో హింస ఎన్ని విధాలుగా జరుగుతుందో పరిశీలింపబడింది. శైలీ గతంగా స్పష్టత ఉన్న రచన. ఆలోచన, అభివ్యక్తి ఉదాత్తంగా ఉన్న వ్యాసం.

## 6. మలకపల్లి పెద శేషగిరి రాయకవి

'ఉద్దండకవి' (1927) వేములవాడ భీమకవి జన్మవృత్తాంతం, యశో వ్యాప్తి, కవితో సంబంధించిన వ్యక్తుల చరిత్ర తెలుపుతూ సాగిన వ్యాసం. ఇది ప్రచారంలో ఉన్న కథలు ఆధారంగా సాహితీ చరిత్ర గ్రహించే ప్రయ త్నంలో సాగిన సారస్వత విమర్శన వ్యాసం. కాకినాడ ఆంధ్ర జాతీయ గ్రంథ మాల ముద్రించిన ఈ వ్యాసం స్వజనంగా వుంది.

## 7. వరాహగిరి వేంకట భగీరథి

'భావ ప్రపంచము' (1928) 13 వ్యాసాల సంపుటి. రెండు మూడు పుటలు వ్యాస పరిమితి. అధిక్షేపం అల్పంగా గోచరమయ్యే సృష్టి. భాష,

పత్రిక, ఇల్లు కట్టటం వంటి అనేక విషయాలు అధిక్షేపబలంతో ఉన్నాయి. పుస్తకం చివరి పుట మీద రచయిత, ప్రచురణకర్తల గ్రంథ పట్టికలుండటం సామాన్యమయితే, ఈ పుస్తకం చివరి హెచ్చరికలో పుస్తకాల జాబితా వంటి దిబ్బ లేదన్నదీ సృజన వ్యాస సంపుటి.

## 8. గ్రామ పునర్నిర్మాణపు తరగతుల ఉపన్యాసములు (1929)

ఈ వ్యాస సంపుటి సంకలన కర్త శనివారపు సుబ్బారావు ఆంధ్ర ప్రముఖులచే ఇప్పించిన ఉపన్యాసములు ముద్రించాడు. సహకారం, గ్రామాభివృద్ధి, విద్య, సాంఘిక దోషాలు, ఆర్థిక పరిస్థితులు, పరిశ్రమలు, పాఠశాలలు మొదలైన బహు విషయాలను గూర్చి, గరిమెళ్ళ సత్యనారాయణ, చెరుకువాడ నరసింహం, మాగంటి బాపినీడు, వేమూరి విశ్వనాథ శర్మ, యన్. జి. రంగా, కాశీనాథుని నాగేశ్వరరావు మొదలైన ఉపన్యాసకులు వెలువరించిన అభిప్రాయాలు సంకలనంలో ఉన్నాయి. ఇవి విద్యార్థుల కుద్దిష్టమయినా, ప్రముఖాభిప్రాయాలుగా ఉన్నాయి కాబట్టి వ్యాసం గ్రహించిన విషయు దర్శనార్థం ఈ వ్యాసాలు పరికింపవచ్చు.

ఈ యుగంలో అధిక్షేపం ప్రధానంగా వ్యాస రచన సాగింది. పూర్వ యుగంలోనూ, ఈ యుగంలోను ఉపన్యాస, వ్యాస సృష్టి కావించిన వ్యాస కర్తలు గ్రంథాలుగా ముద్రించకపోవటం వల్ల, లభించకపోయినా స్థూలంగా ఈ యుగంలో అధిక్షేప వ్యాసం ప్రాధాన్యం వహించింది. పానుగంటితో ప్రారంభమయిన అధిక్షేప ప్రధాన రచన అనంతరం ఎక్కువగా సాగకపోయినా, అది భిన్న రచనా ప్రక్రియలలోకి ప్రవేశించింది. పానుగంటి యుగం మరో ప్రధాన వ్యాసకర్త ముట్నూరి కృష్ణారావు. ఈ రచయిత వ్యాసం రూపురేఖలు దిద్దటంలో చేసిన కృషి చారిత్రకంగా నిలచింది. ఈ యుగంలో వ్యాసం ప్రక్రియగా ప్రసిద్ధమయింది.

## 6. చారిత్రక వ్యాసం

*చిలుకూరి యుగం (1910-1967)*

దేశ చరిత్ర స్పష్టంగా కానీ వివాదరహితంగా కానీ రూపొందలేదు. ఆంగ్ల చరిత్రకారులు సంపూర్ణ సత్య సంధానమే చేశారన్న నమ్మకం భారత చరిత్రకారులకు లేకపోయింది. ఈ స్థితి దేశ చరిత్రనే కాదు, సారస్వత చరిత్రను కూడా ఆవరించుకొంది.

ఆంధ్ర సాహిత్యంలో చరిత్రకు సంబంధించినంతవరకు స్పష్టమయిన నిర్ణయాలు కష్టసాధ్యాలే. కవి కృతిభర్త కాలాదులు వివాదాలుగా రూపొందాయి. కవుల చరిత్రకు, కవితా చరిత్రకు సరయిన దేశ చరిత్ర పునాది లేకుండా అయిపోయింది. ఆంగ్ల విద్యా ప్రభావం చరిత్ర దృష్టి పెంచింది. ఈ దశలో దేశంలోని ఆలోచనాపరులు దేశ చరిత్రను రూపొందించే ప్రయత్నం చేశారు. సాంప్రదాయిక సిద్ధాంతాల మీదా, చరిత్ర వికాస దృష్టి మీదా, ఆంగ్ల చరిత్రల మీదా, దేశంలో క్రొత్తగా లభించే చారిత్రకాధారాలమీదా, లక్ష్యం పెట్టి, దేశచరిత్ర పునర్నిర్మాణం చేయాలని క్రొత్తగా ప్రయత్నించి కొంత వరకు విజయం సాధించిన వాళ్ళు దేశానికి ఉపకారం చేసిన వాళ్ళయ్యారు.

ఈ దశలో తెలుగు దేశ చరిత్ర ఒక వైపు నిర్మాణమవుతూ వుంటే, మరోవైపు సాహిత్య సంబంధి అనేకాంశాలు చారిత్రకంగా పరిశీలనం పొందాయి. చరిత్ర దృష్టి సారస్వత దృష్టిని విశాలం కావించింది. చారిత్రక వ్యాస సృష్టి చేసిన పలువురు వ్యాసకర్తలు ఆంధ్ర సరస్వతికి నూత్నాభరణాలు కైసేసిన వారయ్యారు.

ఈ చారిత్రక వ్యాసాలు దేశ చరిత్రతో సంబంధించిన సారస్వత చరిత్రను కానీ, దేశ చరిత్రనే కానీ పరిమిత పరిధి నుంచి పరికించేవిగా ఉన్నాయి. ఇవి ఈ కవుల చరిత్రను కాని, కావ్యచరిత్రను కాని, రచనాచరిత్రను కాని, ప్రక్రియాచరిత్రను కాని, తెలిపేవిగా లేవు. అందువల్ల ఈ చారిత్రక వ్యాసపరిధి గుర్తించటం అవసరమే అవుతుంది.

ఈ చారిత్రక వ్యాసాలలో సమగ్ర చరిత్ర కాంక్ష నెరవేరదు. ఒక చారిత్రకాంశంకాని, ఒక సారస్వత సంబంధి చరిత్ర భాగంకాని వివరింపబడుతూ ఈ వ్యాస సృష్టి సాగింది. అందువల్ల, ఈ వ్యాసాలలో సమగ్ర చరిత్ర కాని,

తత్ దృష్టికాని దర్శించే యత్నం ప్రయోజనకరం కాకపోతుంది. అయితే, ఏ అంశం ప్రధానంగా వ్యాసాంశమయిందో, అది తిరుగులేని చారిత్రక సత్య సంబంధిగా ఉంది.

చారిత్రక వ్యాసంలో రచయిత వ్యక్తిత్వం వహించే ప్రాధాన్యం వివాదానికి లోనవుతుంది. అయితే చరిత్ర కోసం చరిత్ర వ్యాసంగా రూపొందిస్తే వేరేమాట కాని, సాహిత్యమో, మరే అంశమో బలపరచటం కోసం చరిత్ర గ్రహించినప్పుడు, రచయిత ప్రభావం చరిత్రనూ, అంశాన్నీ అనుసంధించేటప్పుడు, వ్యక్తీకరించేటప్పుడు ఋజువు అవుతుంది. రచయిత వ్యక్తిత్వ ముద్ర లేని రచనలను చరిత్రగా పరిత్యజించి, ఉన్నవాటినే చారిత్రక వ్యాసాలుగా గ్రహించటం జరిగింది.

ఈ యుగంలో చరిత్ర నిర్మాణ మొక ఆవేశంగా రూపొందింది. చారిత్రక వ్యాసాలు సత్యసందర్శనంతోపాటు రచయితల హృదయ ప్రదర్శనం కూడా చేశాయి. ఈ యుగ వ్యాసాలన్నీ చరిత్రనేకాని, సాహిత్య సంబంధి చరిత్రనే కాని కలిగిఉన్నట్లు చెప్పటం సాధ్యంకాదు. కొన్ని ఒక గుణం చూపితే, కొన్ని మరో గుణంలో ఆధిక్యం కనబరచాయి. అందువల్ల ఈ చారిత్రక వ్యాసాలన్నింటిలోనూ సారస్వత పరామర్శ ఉంటుందన్న భావం నిరాధారంగా ఏర్పడిందవుతుంది. అయితే సారస్వతం, సంస్కృతి, దేశం, ఈ వ్యాసాలలో కొంతవరకు గోచరమవుతాయి. ప్రసిద్ధ చారిత్రక వ్యాసకర్తల సృష్టి పరిశీలింపవచ్చు.

## 1. చిలుకూరి వీరభద్రరావు (1872-1939)

తెలుగు చారిత్రక వ్యాస సృష్టిలో ప్రాథమ్యం వహించి, 'ఆంధ్ర చరిత్ర చతురానన' బిరుదు పొంది, దేశోపకారి, విబుధ రంజని ఆంధ్రకేసరి పత్రికలు నడపి,ఆంధ్రదేశాభిమాని,సత్యవాదిని పత్రికలలో సంపాదక కార్యం నిర్వహించి, రాజమండ్రిలో ఆంధ్రేతిహాస పరిశోధకసంస్థ ప్రారంభించి, ఆంధ్రుల చరిత్రను పది భాగాలుగా అచ్చువేయదలచి, అయిదు భాగాలు మాత్రమే వెలువరించి, జీర్ణ కర్ణాటక సామ్రాజ్య చరిత్ర నామంతో విజయనగర సామ్రాజ్య చరిత్రను ప్రచురించి, వివిధ సారస్వత చారిత్రకవ్యాసాలు వ్రాసి, చారిత్రక పరిశోధన రచనకు

కృషి చేసిన మహావ్యక్తి చిలుకూరి వీరభద్రరావు. అందువల్ల ఈ యుగం చిలుకూరి యుగంగా భావించటం సమంజసం.

చిలుకూరి వీరభద్రరావు ఆంధ్ర కవితా చరిత్రను, కవి జీవితాలను పరిశోధించి, వ్యాసరూపంగా వెలువరించటం ఆంధ్ర లోకానికి విదితమే! ''చారిత్రక వ్యాసము నందును సాహిత్య సంపదను పరిపోషించుటయందు వీరు నేర్పరులు. వీరు తిక్కన సోమయాజి, శ్రీనాథకవి మొదలైన వారి జీవిత చరిత్రలు రచించుచున్నప్పుడును, అందు వారి కవితారీతులను గూర్చిన అభిప్రాయ వ్యక్తీకరణమున విశిష్టత చూపించిరి'' (17) అనటంవల్ల చారిత్రక వ్యాస రచనంలో రచయిత దృక్పథం ప్రదర్శించటం జరిగిందని తెలుస్తుంది.

కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావు స్థాపించిన విజ్ఞాన చంద్రికా గ్రంథమాల పక్షాన చిలుకూరి వీరభద్రరావు రచించిన ఆంధ్రుల చరిత్ర మొదటి రెండు సంపుటాలు వెలువడ్డాయి. ''లక్ష్మణరావుగారి ప్రోత్సాహం లేకపోతే వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్ర కృషి బైటపడుండదు.'' (18) అయితే ఇతిహాస తరంగిణి గ్రంథమాల తరపున మూడవ సంపుటం వెలుగు చూచింది. మిగతా రెండు సంపుటాలు కష్టాలు భరించి రచయితే ప్రచురించాడు.

చరిత్ర పరిశోధనంలో విషయ సంపాదనకు ప్రధానంగా శాసన చరిత్ర ఆగత్యమయింది. లభ్య విషయాన్ని నిశితంగా విమర్శన దృష్టితో పరిశీలించి, పరిశోధించి నిగ్గుతేల్చి, సత్యం ఆంధ్రుల కందించే దృష్టితో వ్యాసకర్త చేసిన కృషి ప్రశంసాపాత్రం.

చిలుకూరి వీరభద్రరావు వ్యాసాలు కొన్ని మహా పురుషుల జీవిత చిత్రణంగా ఉన్నాయి. తిక్కన సోమయాజి, శ్రీనాథుడు, తిమ్మరుసు, అళియ రామరాయలు మొదలైన జీవిత చరిత్ర వ్యాసాలు చరిత్ర పునాది మీద నిర్మితాలయి, సారస్వత విమర్శనంగా సాగి, ఉత్తమ వ్యాసాలుగా రూపొందాయి. 'స్వయం సహాయము' ఆంగ్లంలోని సెల్ఫ్‌హెల్ప్ అనే స్మైల్ రచనకు అనువాదంగా ఉంది.

దేశ చరిత్ర, సారస్వత చరిత్ర అవ్యవస్థంగా ఉన్న స్థితిలో, వాటి పరిశోధనచేసి, రచనకు పూనుకొన్న తెలుగుబిడ్డ చిలుకూరి వీరభద్రరావు. కొమఱ్ఱాజు

వేంకట "లక్ష్మణరావుగారు చరిత్రలు వ్రాయుట సులభ సాధ్యము కాదు. అందును నిదివరకు మార్గమేర్పడని పట్టులను సాధించుట కష్టతరము. ఆంధ్ర జాతి చరిత్రకు రాచబాటవైవ మొదట పూనిన వారు మా గ్రంథకర్తలగు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు అని నుడువుటలో సాహసంబేమియు లేదు అని వారి కృషిని శ్లాఘించారు." (19) ఈ గుర్తింపు అవసరమే !

అయితే ఈ రంగంలో పూర్వమే కృషి జరిగింది. కాని, "గుణమును బట్టి చూచిన నగ్రగణ్యులనఁదగినవారు ఆంధ్రులచరిత్ర కర్తలగు చిలుకూరి వీరభద్ర రావుగారు. వీరి వలె నిష్పక్షపాతమైన విమర్శన శక్తిని ప్రకటించిన వారు మన దేశమున ననేకులు లేరు. ఆ శక్తికిఁ దగిన శ్రమను దీసికొని యెంత చక్కఁగ నెంత పూర్ణముగ మన చరిత్రమును సువ్యక్తము చేసియున్నారో దానిని దెలుపుటకు నాకు నర్హత చాలదు" (20) అన్నప్పుడు, వ్యాసకర్త కృషియొక్క విశాలత విస్పష్టమవుతుంది.

ఆంధ్ర దేశ చరిత్రలో మౌలిక పరిశోధన ప్రారంభించి, జీవితమంతా తన్నిర్వహణంలో కష్ట నష్టాల కోర్చి సాగించి, అమూల్యమయిన చారిత్రక వ్యాసాలు వ్రాసి, జాతి జీవితానికి చారిత్రక కాంతి ప్రసరించిన తేజోమూర్తి చిలుకూరి వీరభద్రరావు.

ఈ వ్యాస సృష్టి చారిత్రక పరిశోధనం ఆ కాలంలోనూ, అనంతర కాలంలోనూ అనేకులకు నూత్న పథ దర్శనం కావించి, నూత్న పరిశోధనకు పురికొల్పింది. చారిత్రక దృష్టికి చైతన్యం కలిగించిన వ్యక్తి ఈ రచయిత ఆంధ్ర చారిత్రాంశాలు నూత్న సాక్ష్యాల వెలుగులో మార్పులకు గురి అయినా, చారిత్రక పరిశోధనంలో ఈ వ్యాస కర్త చూపిన ఒరవడి, ప్రవేశపెట్టిన రీతులు అత్యవసరాలుగా ఉన్నాయి.

కవితా, చరిత్ర పరిశోధనలు రెండు చేతుల మీదుగా సాగించి, ఈ వ్యాస సృష్టితో సాహిత్య దోహదం చేసిన చిలుకూరి వీరభద్రరావు కృషి ఆంధ్రుల చరిత్ర లాగా శాశ్వతమయింది.

## 2. కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులు (1877-1923)

చరిత్ర మార్గదర్శిగా కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులు చేసిన పరిశోధన, చూపిన పాండిత్యం లక్ష్మణరాయ వ్యాసావళి రెండు సంపుటాలను బట్టి స్పష్టమవుతుంది. ప్రధానంగా చరిత్ర పరిశోధనం కావించి, ఆ రంగంలో కృషి చేసే అనేకులకు చేయూత ఇచ్చి కృషి చేయించటం ఈ వ్యాసకర్త సారస్వతానికి, చరిత్రకు కలిగించిన మేలు. వ్యాసాలుగా కానీ, బృహత్ గ్రంథాలుగా కానీ ప్రకటించినవన్నీ చారిత్రకాలే! అందువల్ల వ్యాసాలన్నీ చరిత్ర మూలంనుంచి విస్తరిల్లిన శాఖలుగానే గోచరమవుతున్నాయి.

ఈ రచయిత వ్యాసాలు 22. అన్నీ చరిత్ర సంబంధులు కావు. భిన్న విషయ విన్యస్తాలున్నాయి. అయితే ప్రతి వ్యాసం కొంతవరకు చారిత్రక విషయం మీద ఆధారపడి వుంది. అన్నీ చరిత్ర విషయాలు కాకపోయినా, ఈ కారణం వల్లనే చారిత్రకు వ్యాసాలుగా గ్రహించటం జరిగింది.

విజ్ఞాన చంద్రికా గ్రంథమాలను స్థాపించి, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం నిర్మించి, చేసిన సారస్వత సేవ చరిత్ర గుర్తించిన విషయం. జీవించిన కాలం తక్కువే అయినా, ఎక్కువగా, చిరంజీవిగా ఉండే సాహిత్య సృష్టి చేసి, చేయించి, భాషకు, చరిత్రకు దోహదం చేసిన వ్యాసకర్త కృషి ఆంధ్రదేశం అవలోకించింది.

లక్ష్మణరాయ వ్యాసావళి ప్రథమ భాగంలో వ్యాసాలు పరిమితంగా ఉంటే, ద్వితీయ భాగంలో అపరిమితంగా ఉన్నాయి. కొంతవరకు 'అలంకారములు' 'అథర్వవేదము' వ్యాస పరిధిలో నుంచి తొలగింప వచ్చుకాని ఇందులో చేర్చటం జరిగి పోయింది ఆంగ్ల వ్యాస లక్షణ ప్రదర్శకంగా ఈ వ్యాసాలలో విమర్శనం వివరణం గోచరమవుతున్నాయి. విమర్శించటంలో తీక్షణత వివరించటంలో సహనత పరికింపవచ్చు. రచయిత విషయబోధ స్పష్టంగా చేయటానికి భిన్నోపపత్తులు కల్పించాడు.

వ్యాసాలలో చారిత్రక విషయాలు, సంస్కృతాంధ్ర శ్లోకపద్యాలు, ఎక్కువగా ఉటంకించాడు రచయిత. వ్యాసాంతర్గతాంశానికి చిన్న శీర్షిక ఇచ్చి

వివరించటం, వ్రాయదలచిన ప్రధానాంశం విభజించి చూపటం, పేరాలో, ప్రధానాంశం ప్రారంభ వాక్యంలో ఇమడ్చటం, పాఠకులను మధ్యమధ్య సంబోధించటం, వీళ్ళను ప్రశ్నించి, రచయిత సమాధానం చెప్పటం, గమనింపవచ్చు. వ్యాసం అధోజ్ఞాపికలతో, భిన్న భాగాలు వరుస అంకెల గుర్తులతో సాగటం పరికింపవచ్చు.

లక్ష్మణరాయ వ్యాసావళి రెండు సంపుటాలలో చారిత్రక, భాషా, శాస్త్ర సారస్వత సంబంధులుగా వ్యాసాలున్నాయి. వాఙ్మయ వ్యాసాలలో చారిత్రక దృష్టి గోచరమవుతూ వుంది. శాస్త్ర వ్యాసాలు రచయిత అభ్యుదయ దృక్పథ ప్రదర్శకంగా ఉన్నాయి.

ఆంధ్ర బ్రాహ్మణుల నియోగి వైదిక భేదాలు పరిశీలించి, శ్రీనాథుడి గ్రంథ రచనం గ్రహించి, చారిత్రక రీతి వివరించటం, విజయనగర, కాకతీయ రాజచరిత్రలు విపులీకరించటం విశిష్టంగా భావింపవచ్చు. పంతులు తెలుగు దేశంలో భాషా శాస్త్ర దృష్టి బాగా ఏర్పాటు చెందని సమయంలోనే భాషా శాస్త్ర పరిశోధన రీతిలో త్రిలింగము- తెలుగు పదోత్పత్తిని, అరవంలో ధ్వని ఒకటి తెలుగులో లేకపోవటాన్ని వివరించి, ఉత్తమ పురుష సర్వనామం ద్రావిడ భాషలలో ఉన్న తీరు పరికించి భాషా వేత్తల ప్రథమ శ్రేణిలో స్థానం పొందాడు.

వర్తమానాంధ్ర దేశంలో తెలుగులో విద్యా బోధనం పట్ల శంకలుంటే, అర్థ శతాబ్దికి పైగా పూర్వమే దేశభాషలలో శాస్త్ర పఠనం భావించిన క్రాంతదర్శి వ్యాసకర్త. పంచాంగం, కర్మయోగంతో పాటు లలితకళలు కూడా రచయితకు సంభావ్యాలయ్యాయి.

వాఙ్మయ వ్యాసాలలో 'అలంకారములు' రచయిత వ్యాఖ్యానాల సమాహార రూపం. 'అథర్వవేదం', వివరణాత్మకంగా ఉన్న వేదవిషయకం. శృంగారరసం పట్ల ఆలంకారికుల దృక్పథం ఆధునికులకు ఆవశ్యకమే! అచ్చతెలుగు స్వరూప స్వభావాలు నాడే కాదు, నేడూ అవసరమే 'అభిజ్ఞాన శాకుంతలము' విమర్శనంలో వ్యాసకర్త బుద్ధినైశిత్యం ద్యోతకమవుతుంది.

బహు విషయ పరిజ్ఞానంతో, హద్దులెరుగని చరిత్ర పాండిత్యంతో, దేశాభిమానంతో, గంభీర శాంత సరసౌదార్యాది గుణాలతో ఆంధ్రవ్యాస వాఙ్మయం వెలిగించిన సాహితీవేత్త కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులు.

పరిశోధన దీక్ష, చారిత్రక దృష్టి, విమర్శనవైశిష్ట్యం త్రివేణీసంగమంగా సాగిన వ్యాసాలు సరస్వతీభూషణాలు. ఈ సృష్టిలో రచయితలకు మానవత్వం పట్లవున్న గౌరవాభిమానాలు తెలుస్తున్నాయి.విభిన్న విషయ విన్యాసాలుగా వున్న ఈ రచనలు ప్రధానంగా చారిత్రక వ్యాసాలు.

కొమర్రాజు వేంకటలక్ష్మణరావు పంతులు రూపంలో తెలుగుదేశం ఒకనాడు చరిత్రసిద్ధిని పొందింది. ఈ వ్యాసకర్త ఆంధ్రజాతి వ్యక్తిత్వం ఇనుమడింప చేయడానికి నిర్వహించిన కృషి ప్రశంసాపాత్రం. స్వయంగా పరిశోధన చేసి, చేయించి, వ్యాసాలు గ్రంథాలు వ్రాసి, వ్రాయించి, పరిశోధకులను రూపొందించి, పరిశోధన ఫలాలను ప్రకటించి,ఆంధ్రదేశంలో కలకాలం ఉండే రచనలవల్ల చారిత్రకవ్యక్తిగా పరిణమించిన ఈ వ్యాసకర్త చేసిన చారిత్రక వ్యాససృష్టి అల్పమే అయినా, గుణాన్నిబట్టి అనల్పంగా, భావి చారిత్రక పరిశోధనకు పథప్రదర్శకం.

## 3. మల్లంపల్లి సోమశేఖర శర్మ (1891-1963)

'చారిత్రక వ్యాసములు' మల్లంపల్లి సోమశేఖర శర్మ చేసిన వ్యాససృష్టి. ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో అధ్యాపకవృత్తి గౌరవప్రదంగా నిర్వహించటం, భారతిపత్రిక సంపాదకవృత్తి సాగించడం,పరిశోధన చేయటం,విజ్ఞాన సర్వస్వ కృషి ఫలవంతంగా ముగించటంవంటి భిన్న దశలు అధిగమించిన మేధావి రచయిత.అన్నివిధాలా ఆంధ్రాభ్యుదయం దర్శించినమనీషి.ఈ వ్యాసకర్త,చారిత్రక పరిశోధనరంగంలో చేసినకృషి చరితార్థంగా మిగులుతుంది. ఈ పరిశోధన ఆంధ్రదేశంలో బౌద్ధ చరిత్రగా రెడ్డిరాజుల చరిత్రగా ప్రసిద్ధం.

మల్లంపల్లి సోమశేఖర శర్మ చారిత్రక వ్యాసాలు 13.ఇవికాక ఆకాశవాణి ప్రసంగ వ్యాసాలు ఉన్న ఆంధ్రదేశ చరిత్ర చిన్న గ్రంథం. పై వ్యాసాలలో అయిదు 1932లో 'అమరావతిస్తూపము, ఇతర వ్యాసములు' అనే పేరుతో ప్రకటితమయిన గ్రంథంలో వున్నాయి.అందులోని 'అనాదృత వాఙ్మయము' వ్యాసం వాఙ్మయసంబంధి కాబట్టి తొలగించి మిగతా పన్నెండు వ్యాసాలతో 'చారిత్రక వ్యాసములు-బౌద్ధయుగము' ప్రచురితమయింది. ఇవి అనేక పత్రికలలో ప్రచురితాలు, ఆకాశవాణిద్వారా ప్రసరితాలు.

ఈ వ్యాసాల పరిమితి తక్కువగా ఉంది.రచనావిధానంలో ఆంగ్ల వ్యాస ధర్మాలు గోచరమవుతున్నాయి. భాష గ్రాంథికం. రచన స్పష్టతతో కూడి వున్నది.

వ్యాస రచనా శిల్పంలో ఒక నూత్నరీతి వుంది. విజృంభించే ఆవేశం బంధింపబడి,భావం సంపూర్ణంగా వ్యాకోచించి వ్యక్తీకరణం జరిగి వ్యాసం అవత రించింది. ప్రతి వ్యాసంలోనూ సృజన గుణంతోపాటు, కథాకథన విధానం గోచరమవుతుంది. భాష రచనను శాస్త్రవచనందగ్గరకు తీసుకొని పోతుంటే రచయిత, కవితాపరిధిలోకి బలవంతంగా లాగుకొని వచ్చిన ధోరణి వ్యక్తమవు తుంది.ప్రతివాక్యంవెనుక విపరీత కృషి-సిద్ధాంత యత్నం-కనిపించింది. ఒక్క వాక్యం కొన్ని గంటల ఆలోచనఫలితంగా అనిపిస్తుంది. అందువల్ల జీవితాంతం సాగించిన చరిత్ర పరిశోధనంతో ఈ చారిత్రక వ్యాస సృష్టి 13 వ్యాసాలకే పరి మితమయింది.

ఇతర చారిత్రక పరిశోధకులకు,ఈ వ్యాసకర్తకు ఉన్న తేడా గమనింప వచ్చు. అందరి చారిత్రక వ్యాసాలూ వాఙ్మయ సంబంధంతో గోచరమవుతుంటే, ఈ వ్యాసకర్త ఒక్క వ్యాసం 'అనాదృత వాఙ్మయము' లోతప్ప వాఙ్మయ ప్రసక్తి లేదు. అన్ని వ్యాసాలూ బౌద్ధమతసంబంధి చరిత్రకూ సంస్కృతిని పరిమితం ఉన్నాయి.

అనాదృత వాఙ్మయమయినా వాఙ్మయం కోసం చేసిన రచన కాదు. చరిత్ర కోసం చేసిన సృష్టి. చరిత్ర వాఙ్మయంలో ఏ విధంగా రూపెత్తిందో పరికించటానికిది పరిమితం. స్థూలంగా అన్ని వ్యాసాలలో చారిత్రక ప్రాధాన్యం భావింపవచ్చు. ఇతర పరిశోధకుల చారిత్రక వ్యాసాలలో సారస్వత పరిధి విస్తృతంగానే వుంటే, ఈ వ్యాసకర్త సృష్టిలో, అతి స్వల్పంగా ఉన్నా, లేదనవచ్చు.

ఈ చారిత్రక వ్యాసాలలో భారతీయ సంస్కృతిలోని ధర్మం, యజ్ఞ నిర్వహణంలోని ఔచిత్యం, దేశంలో బౌద్ధ మత వ్యాప్తి, రాజర్షి బుద్ధుడి మత దృష్టి, అమరావతిలో వెలసిన బౌద్ధస్తూప వైశిష్ట్యం, నాగార్జున కొండ చుట్టూ పరిభ్రమించిన బౌద్ధ మత దీప్తి, చీనా-హిందూ దేశాల బౌద్ధ మత సంబంధి

సామీప్యం, జావాద్వీపవాసుల వినోదాలతో భారతదేశ సంబంధం, బౌద్ధమత విష యక వాఙ్మయంలో పరిశోధన, భారత దేశంలోని విద్యావిధానం అవి బౌద్ధ యుగా లలో పొందిన ఉత్కృష్టత వేదభూమిలో వృత్తివిద్యలు బోధింపబడిన తీరు. భారతదేశచరిత్ర, సంస్కృతి చరిత్రల అవినాభావ సంబంధం వివరించే పరిశోధ నాత్మక చారిత్రక వ్యాసాలు, మల్లంపల్లి సోమశేఖర శర్మ సృష్టిగా ఆంధ్రుల ఆస్తి.

ఈ వ్యాససంపుటి మల్లంపల్లి సోమశేఖర శర్మ జీవితకృషికి సారభూత మైన చిహ్నం. ఆంధ్రుల ప్రాచీనచరిత్రలో మతనైతిక సాంఘిక రాజకీయ విష యాలలో గ్రహింపవలసిన అంశాలెన్నో ఉన్నాయి. ఈ వ్యాసాలు వివరాలు తెలిపేవిగామాత్రం లేక, సారభూతమైన విషయ విన్యస్తాలుగా ఉన్నాయి. భారత దేశనాగరకతాజీవితంలో ఆంధ్రదేశం నిర్వహించిన పాత్రవైశిష్ట్యం ఈవ్యాసాలు స్పష్టం చేస్తున్నాయి. మధుర మనస్వి, పరిశోధనా తపస్వి అయిన వ్యాసకర్త ఆలోచనారీతులు నూత్నదిక్కుల దర్శనం కలిగించి, కొత్తదృక్పథానికి అవకాశ మిచ్చి, ఆంధ్రుల కుపకారం చేశాయి.

## 4. డా. నేలటూరి వేంకట రమణయ్య (1893)

నేలటూరి వేంకట రమణయ్య సాగించిన చారిత్రక పరిశోధనం విశిష్ట మయింది. దానితో సమానత్వమే కాదు, తత్సామీపత్వంకూడా వర్తమానాంధ్ర దేశంలో ఎవరి కృషికీ లేదు. 1930 నుంచి చరిత్ర పరిశోధనం చేసి, అనేక పరిశోధన ఫలితాలు ప్రకటించి, ఉన్నత పదవులు అలంకరించి, విజయనగర చరిత్ర వెలుగులోకి తెచ్చి, దేశానికి చేసిన మేలు చిరస్మరణీయం.

నేలటూరి వేంకట రమణయ్య తెలుగులో ప్రధానంగా చారిత్రక విష యాలు, చారిత్రకాధారాలతో సారస్వత సంగతులు, అల్పంగా కవితావిమర్శలు వ్యాసాలుగా భారతి మొదలైన పత్రికలలోనూ, ఉపన్యాసాలుగా విద్వత్ పరి షత్తులలోను వెలువరించటం విదితమే !

1940 లో ప్రకటించిన "చరిత్ర రచన లేక చారిత్రక వ్యాసములు" మొదటి భాగంలో 6 వ్యాసాలు; 1950 లో ముద్రించిన 'ఆంధ్రులు - చరిత్ర'లో 2 వ్యాసాలు; 1958 లో "మద్రాసు గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీ'లో ఇచ్చిన

ఉపన్యాసానికి విపులీకరణంగా ప్రచురించిన ఆంధ్ర వాఙ్మయ చరిత్ర వ్యాసం, 1967 లో వెలువరించిన 'వాఙ్మయ వ్యాస మంజరి'లోని 21 వ్యాసాలు; మొత్తం త్రిదశాత్మక వ్యాస సృష్టి చారిత్రక వ్యాస రచనంగానే పరిగణింప వచ్చు.

ఈ వ్యాసకర్త చరిత్ర రచనకు అవసరమైన మార్గం ఏర్పరచుకొని, ఆ లక్షణాను గుణంగా వ్యాస సృష్టి చేయటంవల్ల సక్రమపథ ప్రవర్తనం పొందాయి వ్యాసాలు. చరిత్ర దృష్టి, భాషా దృష్టి ఉండి చారిత్రక వ్యాస సృష్టి చేసిన రచయిత ఈ రంగంలో చేసిన దోహదం గణనీయమయింది.

ఈ వ్యాసకర్త రచనా విధానంలోని మెలకువలు అనుసరింపదగి వున్నాయి. ఏ విషయం రచనకు వస్తువుగా స్వీకరించటం జరిగిందో, ఆ వస్తువు పూర్వ చారిత్రక పరిశోధకుల మూలంగా పొందిన పరిశీలనను క్షుణ్ణంగా గ్రహించి, ప్రత్యేకంగా అప్పుడు వెలువరచిన సత్యంతో సమన్వయం చేసి, వాదం బలంగా రూపొందించి, స్థూలంగా విషయం విభజించి, ఒక్కొక్క ప్రధాన విషయం విమర్శిస్తూ కాని, ఖండిస్తూ కాని రచన సాగించాడు. చారిత్రక నేపథ్యం నుంచి వ్యాసవస్తు పరిశీలనం ఈ రచనా ధర్మంగా గోచర మవుతూ వుంది.

ఎనభై యేళ్ళ వయస్సులో శాసన పరిశీలనం, పురావస్తు పరిశోధనం, వాఙ్మయ సేవ, చారిత్రక కృషి సాగిస్తున్న ఈ మేధావి జీవితం ఏ రంగం నుంచి చూచినా ధన్యంగానే గోచరమవుతుంది. ఆంధ్ర వాఙ్మయంతో చారిత్రక వ్యాసం, కవి, కవితా సమస్యా పరిష్కారానికి, నూత్న సత్య ప్రదర్శనకూ సన్నిహిత సంబంధం ఏర్పరచుకోవటం ఈ వ్యాసాల వల్ల కలిగింది. కవితా విమర్శనకు చరిత్ర ప్రయుక్తమయి, ఈ వ్యాసాలు చారిత్రక వ్యాస పరిణామ ప్రదర్శకాలుగా ఉన్నాయి.

నూత్న చారిత్రక సాక్ష్యాల వల్ల, పూర్వ చారిత్రక రచనలలోని సిద్ధాంతాలు మారిపోవటంతో, నూత్న చారిత్రక సత్యం ప్రకటించడానికి అవసరమూ, అవకాశమూ కలిగి వ్యాసరచన ఈ రచయిత సాగించటం

గుర్తింపవచ్చు. ఇవి కావ్య జాలంలో ఆధారాలు లేనప్పుడు, ఇతరాధారాలతో చరిత్ర నిర్మించే కృషిలో వెలువడ్డ వ్యాసాలు. దేశచరిత్రలో ఆంధ్రుల స్థితి, ఆంధ్రుల చరిత్రలోసంస్కృతి స్థానం పరికించటంలో రచయిత నిశిత దృష్టి స్పష్టమవుతుంది.

ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో మధుర తంజావూరు నాయకరాజుల పాత్ర విశదీకరించే వ్యాసం, బృహత్ప్రణాళికతో ఒప్పుతూ సమగ్ర వాఙ్మయ చారిత్రక రచనగా రూపొందింది, రచయిత పరిశోధన వైశిష్ట్యం ప్రదర్శిస్తుంది. వాఙ్మయ సంబంధి వ్యాసాలు, ఆంధ్ర కవుల స్థల కాలాదులు, చారిత్రక బలంతో ఆలోచించి, నూత్న సిద్ధాంతాలు స్థాపించాయి. అస్పష్టంగా ఉన్న సారస్వత విషయాలు చారిత్రక దృష్టితో విశదీకరించటం జరిగింది.

నేలటూరి వేంకట రమణయ్య వ్యాస సృష్టి స్థూలంగా చరిత్రలో జరిగి, పెరిగి, రూపం దిద్దుకొంది. అనేక చారిత్రకోపకరణ సహాయంతో పరిశీలించి, పరిశోధించి నిగ్గుతేల్చిన చరిత్ర-సారస్వత సంబంధి సారాంశం, వ్యాసాలుగా రూపొందాయి కాని, సిద్ధ చారిత్రక బలంతో వ్రాయబడలేదు. ఇవి పూర్తిగా చారిత్రకంగా ఉన్నా సారస్వత సంబంధం వల్ల, కొన్నిటిని వాఙ్మయ వ్యాసాలుగా భావింపవచ్చు. సారస్వతాభి వృద్ధికి, జీవితం అంకితం చేసిన డా. నేలటూరి వేంకట రమణయ్య చారిత్రక వ్యాసకృషి చరితార్థం.

## 5. సురవరము ప్రతాపరెడ్డి (1896-1953)

సాహిత్య, రాజకీయ సాంస్కృతిక రంగాలలో కృషి చేసి, గోల్కొండ పత్రిక (1925), ప్రజావాణి (1951) సంపాదకత్వం వహించి, పాండిత్యం, వ్యక్తిత్వం, విమర్శకత్వం, పరిశోధకత్వం పెనవేసుకుపోయిన మూర్తిగా అవతరించి చారిత్రక వ్యాస సృష్టి కావించిన సురవరం ప్రతాపరెడ్డి, హైదరాబాదు ప్రాంతంలో ఆంధ్రోద్యమం.

వ్యాసకర్త ఇతర సృజన రచనలతోపాటు 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర', 'రామాయణ రహస్యములు' పరిశోధన గ్రంథాలుగా వెలువరించాడు. అందరూ దేశ, సారస్వత చరిత్రలు రచిస్తుంటే, ఈ వ్యాసకర్త ఆంధ్ర సంఘ సంబంధి చరిత్రను స్పృశించాడు. ''రామాయణ రహస్యములు వ్యాసమున ననేక స్థలములలో శ్రీ రెడ్డిగారు తమ నిశితమైన బుద్ధి పాటవమును జూపి...

యున్నారు.'' (రామాయణ రహస్యములు-పుట 3) ఇందులోని ఏడు భాగాలు భిన్న వ్యాసా లనదగినంత విశిష్టంగా రూపొందాయి.

చారిత్రక వ్యాస కర్తలు, చరిత్ర బలంతో సారస్వత పరిశీలనం చేయడం సాగిస్తే, సురవరం ప్రతాపరెడ్డి సారస్వత బలంతో చరిత్రను, ముఖ్యంగా సాంఘిక చరిత్రను పరికించటం గమనింపవచ్చు. శుకసప్తతి, సింహాసన ద్వాత్రింశిక, వైజయంతీ విలాసము వంటి కావ్యాల చరిత్ర గ్రహించటానికి ఉపయోగపడతాయని తెలపటం, నూత్న దృష్టి కలిగించటమే అయింది. సారస్వతం చరిత్ర సరిసమంగా పరిశీలించిన సురవరం ప్రతాపరెడ్డి వ్యాస సృష్టి అల్పమే అయినా పరిశీలనార్హం!

## 6. మారేమండ రామారావు

కాకతీయ, శాతవాహన చారిత్రక వ్యాస సంకలన గ్రంథాల సంపాదకత్వము వహించి, 'కాకతీయాంధ్రరాజ యుగ చరిత్ర విమర్శనము' (1936), 'భారతీయ విద్యాచరిత్రము' (1934) వ్యాస రచనలు కావించి ప్రసిద్ధి వహించిన మారేమండ రామారావు చారిత్రక వ్యాస కృషి సువిశాలం.

మారేమండ రామారావు పరిశోధన ప్రథమశ్రేణి చరిత్రకర్తల మార్గంలో సాగింది. కాకతీయ సంచికలోని వ్యాసాలు పురస్కరించుకొని చిలుకూరి వీరభద్రరావు వ్రాసిన 'కాకతీయాంధ్ర రాజయుగ చరిత్ర'ను విమర్శిస్తూ మారేమండ రామారావు వ్రాయవలసి వచ్చింది. ఈ సందర్భంలో ''చతురాననులు నన్ను నిందించుటకు రెండు కారణములు గన్పించుచున్నవి. అందొక కారణము వారికి నాపై గల యసూయాక్రోధములు. రెండవ కారణము నాకు కళంకము నాపాదించియైననుసరే యశఃగ్రోక్కవలెనను వారి యుద్దేశము'' (మనవి-2వ పుట). ఆ ఉద్దేశం సాగనివ్వకుండా ఉండటానికి చేసిన విమర్శన మిది. 'భారతీయ విద్యాచరిత్రము' దేశంలో విద్యా పరిణామం వివరించే వ్యాసం.

చరిత్ర పరిశోధనలో జీవితం వినియోగించుకొన్న ధాన్యలో చారిత్రక వ్యాసాలు వ్రాసి, ప్రసిద్ధి పొందిన మారేమండ రామారావు వ్యాసాలు నిశిత విమర్శన దృష్టిని ప్రదర్శించాయి.

## 7. ఇతర చారిత్రక వ్యాసకర్తలు

చారిత్రక వ్యాస సృష్టి కావించిన వాళ్ళలో అనేకులు సారస్వత దృష్టినే ప్రదర్శించారు. అయితే పూర్తిగా చరిత్ర, నాటి దేశ పరిపాలనకు సంబంధించి వ్యాసాలు తక్కువగానే వెలువడ్డాయి. విష్ణుభట్ల సూర్యనారాయణ వ్రాసిన "శ్రీకృష్ణదేవరాయల చరిత్రము" (1951) సారస్వత ప్రమేయం లేని చారిత్రక వ్యాసం. ఇది విజయనగర నిర్మాణంతో మొదలై కృష్ణదేవరాయల జనన మరణాల మధ్య సాగించిన జీవిత ఘట్టాలు వివరించి, రాజ్యాంగం, ప్రభుత్వం, వ్యాపారం, సైనిక శిక్షణ వంటి భిన్న విషయాలు వివరించి ముగిసిపోయింది.

సారస్వతం నిమిత్తంలేని మరో చారిత్రక వ్యాసం 'ప్రాచీన భారతీయ ప్రజాస్వామికములు' (1955) చారిత్రక శిరోమణి కె. లక్ష్మీనారాయణ, బి.ఏ. ప్రజాస్వామిక మంటే వివరణం, పూర్వ ప్రజాస్వామికాలు, బౌద్ధవాఙ్మయంలో, జాతక కథలలో, పాణిని అష్టాధ్యాయిలో, మహాభారతంలో ఉన్న ప్రజాస్వామికాలను గూర్చి వివరించాడు.

ఒక ప్రాంతం అభివృద్ధి చెందటానికి దాని చరిత్ర దోహదం చేస్తుంది. ఈ గుర్తింపు వల్ల వట్టికోట ఆళ్వారుస్వామి 'తెలంగాణా' (1956) మొదటి భాగం వ్యాస సంపుటిగా ప్రచురించాడు. ఇందులో ఆదిరాజు వీరభద్రరావు పది వ్యాసాలు కాకతీయ రాజవంశం మొదలుకొని నేటి తెలంగాణా దాకా వ్రాశాడు. ఇవి అన్నీ చారిత్రక బలంతో రూపొందిన వ్యాసాలు. చొక్లెటి నృసింహశర్మ సర్వాయి పాపడు, మాదన్నలను గూర్చి చారిత్రకంగా వివరించాడు. ఇంకా అనేకులు, తెలంగాణా ప్రాధాన్యం తెలిపే అనేక వ్యాసాలు వ్రాసి సంపుటం సమర్థంగా రూపొందించారు. ఈ వ్యాసాలలో తెలంగాణా వ్యక్తిత్వం ఉంది. మనం ఆంధ్రులం అన్న సమన్వయముంది.

విద్యార్థులే భావి పరిశోధకులు కాబట్టి, వాళ్ళలో ఈ జిజ్ఞాసను పెంచటానికి డా. బి, రామరాజు చేసిన ప్రయత్నం నుంచి, 'మన సంస్కృతి-చరిత్ర' అన్న చారిత్రక వ్యాసాలు 19 మంది విద్యార్థులు వ్రాశారు- సంకలనంగా రూపొందాయి.

భిన్న పత్రికలలో, సంచికలలో చారిత్రక వ్యాసాలు వ్రాసిన వాళ్ళలో కుందూరి ఈశ్వరదత్తు ప్రముఖుడు. సరసత్వం, వైశద్యం ఈ రచయిత సృష్టించిన చారిత్రక వ్యాస గుణాలు. శాసన పరిశోధనంలో నిశిత బుద్ధి పాటవం చూపిన వ్యక్తి కుందూరి ఈశ్వరదత్తు.

రాజ రాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక సంపాదకత్వం వహించిన భావరాజు వేంకట కృష్ణారావు, కళింగ సంచిక వెలువరించిన రాళ్ళబండి సుబ్బారావు, రెడ్డి సంచిక రూపొందించిన వద్దాది అప్పారావు చారిత్రక వ్యాస నిర్మాణానికి దోహదం చేశారు.

చిలుకూరి యుగంలో చరిత్ర వ్యాస రచనలో ప్రవేశించింది. చారిత్రక, సారస్వత దృష్టి సమ్మేళనం పొంది ఈ వ్యాసాలు అవతరించాయి. ఈ యుగం ఆంధ్రుల జీవితాలోచనకు నూత్న చైతన్యం ప్రతిపాదించింది. చారిత్రక పరిశోధకులందరూ తమ రచనా ప్రక్రియకు ఏక కంఠంతో వ్యాసంగా పేర్కొనటం విశదంగా గమనింపవలసిన అంశం. ఉపన్యాసం ప్రక్రియగా మరుగున పడి, వ్యాసం సంపూర్ణంగా వెలుగులోకివచ్చింది. చారిత్రక పరిశోధనంకూడా వ్యాసంగా వెలువడటం తెలుగు వ్యాస పరిణామంలో గుర్తింపవలసిన ప్రముఖ ఘట్టం.

## 7. విమర్శన వ్యాసం :

### కట్టమంచి యుగం : (1920-1933)

పూర్వం సారస్వత పరిశీలనకు అలంకారశాస్త్రంకన్న బలమైన విమర్శన రీతి లేదని భావింపవచ్చు. వర్తమానాంధ్ర సాహిత్యంలో ప్రక్రియగా గోచర మయ్యే విమర్శనం ఆంగ్ల సారస్వత ప్రభావం వల్ల ఆవిర్భవించింది. సమగ్ర పరిశీలనం, సంపూర్ణ పరిశోధనం విశిష్ట ప్రక్రియాత్మకమయిన విమర్శనంగా గ్రహింపవచ్చు. ఒక సిద్ధాంతంలో భాగంకాని, ఒక ప్రధానవిషయంలో స్వల్పాంశం కాని విమర్శనంగానే వ్రాయటం జరిగినా, అది పరిపూర్ణ విమర్శనం కాక పోతుంది. ఈ స్థితిలో ఈ విమర్శనం వ్యాస రూపంలో అవతరిస్తే అది విమర్శన వ్యాసం. దీనికి ఉదాహరణం అవసరమే కావచ్చు. కట్టమంచి రామలింగా రెడ్డి వ్రాసిన 'కవిత్వతత్త్వ విచారము' విమర్శనం, 'వ్యాసమంజరి' రచనలు విమర్శన వ్యాసాలు.

అయితే విమర్శన వ్యాసాలు రచయిత వ్యక్తిత్వ ముద్రవల్ల శోభిస్తే సృజన వాఙ్మయంలోకి చేరుతాయి. ఆంగ్ల వ్యాస లక్షణ బద్ధంగా ఉంటే ఆ గుణం అధికంగా పొందుతాయి. రచయితకు వ్యాసంలో ప్రాధాన్యం లేకపోయి, విషయం వ్యాసంలో అధికారం చెలాయిస్తే, ఆ వ్యాసం విమర్శన సారస్వతం లోకి చేరుతుంది. అటాకాకపోయిన కారణం వల్లనే విమర్శన వ్యాసాలు కూడా సృజనంగా పరిగణన పొందాయి.

ఏ విషయమయినా సహేతుకంగా చర్చిస్తే విమర్శన వ్యాసంగా భావింప వచ్చు. అయితే, స్థూలంగా విమర్శన వ్యాసమంటే సారస్వత విమర్శనమే నన్న భావం సర్వసాధారణమయింది. విస్తృతార్థం కలిగివున్న విమర్శన మన్న పదం విమర్శన వ్యాస మన్నచోట పరిమితార్థంలో ప్రత్యేకార్థంలో ప్రయుక్తమయింది.

తెలుగులో విమర్శన వ్యాసం రచనా రీతిగా విశాలంగా వుంది. ఈ ప్రక్రియలో సృజనాత్మక దర్శనం వల్ల, రచయిత వ్యక్తిత్వ ప్రాధాన్యం వల్ల కొన్ని ప్రారంభంలోని రచయిత వ్యాసాలు మాత్రమే ఈ విభాగంలో గ్రహించటం జరిగింది. అయితే కొన్ని సృజనంగానూ, రచయిత ముద్రతోనూ ఉన్న వ్యాసాలు పూర్తి విమర్శనంగానే గ్రహించటానికి ప్రబల హేతువు, ఆ గుణాలు ఎక్కువగా లేకపోవటంగా గుర్తింపవచ్చు.

ఒక పాత్ర సృష్టినో, ఒక సన్నివేశ సరసతనో, ఒక కథా సౌంద ర్యాన్నో మాత్రమే విమర్శించిన రచనలు అనేకం ఉన్నాయి. కొన్ని శబ్దదృష్టినో, పరిమితార్థదృష్టినో ప్రదర్శించి వెలువడ్డాయి. అయితే, ఈ యుగంలో గ్రహించిన విమర్శన వ్యాసాలు, ఒక కవి, కావ్యం, రచనకు సంబంధించిన తత్త్వం, మూల సిద్ధాంతం, సమగ్రపరిశీలనం, పరిమితంగా చేసి, ఆ రచనకు, రచయితకు ప్రాథమికమూ, సారభూతమూ అయిన ప్రధానధర్మం గుర్తింపచేస్తున్నాయి. విమర్శన వ్యాసం చిన్న పరిధిలో ఒక సంపూర్ణాత్మను స్పృశింపగలిగే రచనా దక్షతకు నిదర్శనమవుతుంది.

ఆంగ్ల సారస్వత ప్రభావంతో నూత్నరీతిలో సమగ్రంగా విమర్శనం సృజించి, కావ్యానుశీలనంతో సారస్వత విమర్శనవ్యాసం నిర్మించి, కావ్య విమర్శనతత్త్వ ప్రథమాచార్య పీఠం అధిపసించి, వర్తమానాంధ్ర విమర్శన వాఙ్మ

యానికి ప్రారంభరచయితగా ఉన్న సృజన విమర్శన వాఙ్మయనిర్మాత, విద్యావేత్త అయిన కట్టమంచి రామలింగారెడ్డి, ఈ యుగకర్త కావటం సమంజసం.

ఈ వ్యాసాలలో, విమర్శనం ఒకకళగా రూపొందింది. విషయం వివరించటంతోపాటు, ఆనందం అందించగలిగిం దయింది. విషయం విమర్శనమయినా, రచనం సృజనమయింది. ఈ వ్యాసాలు బుద్ధికెంత సన్నిహితాలో, గుండెకంతగా సమీపాలు. సారస్వతం ప్రధానమే అయినా సమాజం ప్రదర్శించేంత సమర్థంగా ఈ విమర్శన వ్యాసాలు ఆవిర్భవించాయి.

## 1. కట్టమంచి రామలింగారెడ్డి [1880-1951]

కట్టమంచి రామలింగారెడ్డి విద్యా రాజకీయరంగ సవ్యసాచి, ఆంధ్ర విశ్వవిద్యాలయం మైసూరు విద్యారంగం మహితం కావించి, శాసన సభ సభ్యత్వం పొంది సాగించిన కృషితో, ప్రసిద్ధిపొందిన మేధావి. సృజనకావ్య నిర్మాణంతో, విమర్శన వాఙ్మయ సృష్టితో ప్రాముఖ్యం వహించిన సాహితీవేత్త ఆంగ్లాంధ్ర సారస్వత సమ్మేళనంగా రూపొంది, ఆంధ్ర సారస్వతం ప్రకాశవంతంగా దర్శించిన విజ్ఞాని. ఈ విమర్శకాగ్రణి రాజకీయ విద్యాపరిధుల సంధిలో ఊగిసలాడి ఉండకపోతే, ఆంధ్ర విమర్శన వ్యాసం మరింత సంపన్నంగా ఏర్పడేదని భావింపవచ్చు.

కట్టమంచి రామలింగారెడ్డి వ్యాసాలుగా 'వ్యాసమంజరి' (1989) లోని రచనలు గ్రహింపవచ్చు. ఇందులోని కొన్ని పీఠికలు 'లఘుపీఠికా సముచ్చయము' (1928) గా ముందే ముద్రితాలు అయ్యాయి. స్థూలంగా ఈ వ్యాసకర్త సారస్వత విమర్శనం, నన్నయ సూరనల కవితా సమీక్ష, బంధువుల రచనా పరామర్శ, ఆధుని కాంధ్ర కావ్య పరిచయం, సాంఘిక విషయ వివరణం, ఈ వ్యాస వస్తువులు. ఆంగ్ల వ్యాస ధర్మ శోభితంగా ఈ రచనలున్నాయి. విమర్శన వాఙ్మయ ప్రవర్తన చేసిన వ్యాసకర్త ప్రసిద్ధి, ఈ రచనలను విమర్శన వ్యాసాలు కావించాయి కాని, ఇవి పూర్తి సృజన ధర్మ శోభితాలు.

ఈ వ్యాసాలలో రచయిత వ్యక్తిత్వం వుంది. పరోక్షంగా ఉండటం కాదు, ప్రత్యక్షంగా వుంది. అంతేకాదు బాహాటంగా యధేచ్ఛగా స్వేచ్ఛగా ఉంది. తన జీవితం ఇంతగా విడమరచి విపులంగా పాఠకుల ముందుంచే వ్యాస

కర్త లెవరంటే కట్టమంచి రామలింగారెడ్డితోనే లెక్కించటం ప్రారంభించాలి. వాక్కులో సృజనధర్మంతో పాటు, హాస్యకుశలత వ్యాసాలలో రాశీభూతంగా గోచరమవుతుంది. ఉత్తమ విమర్శన వ్యాస రచనా రీతి కీవ్యాసాలు అన్ని అందాలా అర్హంగా చూపవచ్చు. ''విమర్శకులలో వీరికెంత ప్రాధాన్యమున్నదో వ్యాసరచయితలలోనూ అంత ప్రాధాన్యమున్నది. సాహిత్యాంగముగా పరిగణింప దగిన వ్యాసరచన ఆంగ్లభాషలోవలె మనభాషలోఇంకను పరిణతా వస్థకు రాకున్నను, జరిగినంతవరకు దాని పెంపునకు కారణభూతులయిన విద్వాంసులలో వీరొకరు.'' (21.)

కట్టమంచి రామలింగారెడ్డి విమర్శకులలో ప్రాముఖ్యం, ప్రాథమ్యం, వ్యాసకర్తలలో ప్రాధాన్యం కలిగి వుండటం గుర్తించవలసిన అంశం. అయితే ఈ వ్యాసాలు దృష్టిలో ఉంచుకోవటం వల్లనే వ్యాసలక్షణం వివరించటానికి ప్రయత్నం జరిగింది. ''విషయౌన్నత్యముతోపాటు, అర్థగాంభీర్యమును, దాని కనుగుణమగు శైలియు ఉన్నప్పుడే, వ్యాసము సర్వాంగసుందరంగా నుండును. అర్థగాంభీర్యము లేనిచో పేలవతయు, శైలీ సంపన్నత లేనిచో నీరసతయు తటస్థించి వ్యాసమునకు తీరనిలోటు కలుగును.''(22). ఈ లక్షణం సమగ్రంగా చేయాలన్న ప్రయత్నంతో కూడిందికాదు.

కట్టమంచి రామలింగారెడ్డి విమర్శన కృషికి పూర్వం తెలుగు వాఙ్మయంలో కవుల చరిత్రలు శబ్దసాధుతా విమర్శలు ఉన్నాయికాని, కావ్య తత్త్వం పరిశీలించే విమర్శన విధానం లేదనవచ్చును. ఈ వ్యాసకర్త ఆ లోపం పూరించి, ఒక కావ్యంలోని సమష్టితత్వం, సామూహిక శోభ, అంతర దీప్తి వెలువరించిన ఈ వ్యాసాలు ఒక సాహితీ రీతిలో ఆద్య స్థితి పొందు తున్నాయి.

నన్నయ కవితా పరిశీలనం చేసిన వ్యాసకర్త 'సునందిని' గుణ దర్శనం చేయటంలో ఔచిత్యం గమనించాలి. ప్రాచీనార్వాచీన వాఙ్మయాదరణ ఈ దృష్టివల్ల వ్యక్తమయి, ప్రశంసాపాత్రంగా భావిత మవుతుంది.

కట్టమంచి రామలింగారెడ్డి వ్యాసాలు ఉపన్యాసంగానో, విమర్శనంగానో పీఠికగానో అవతరించాయి. పీఠికలు వ్యాసాలుగా గ్రహించే స్థితి ఈ

వ్యాసకర్త కృషి వల్ల ఏర్పడింది. వ్యాస మంజరిలోని వ్యాసాలు పరికిస్తే, వ్యాసకర్త స్వీకృత వస్తువులోని మూలతత్వం, ప్రధాన గుణం, స్వభావం విస్పష్టంగా సవిమర్శకంగా గుర్తించి, గ్రహించి, సిద్ధాంతం చేసి, తిరుగులేని కళాభావనగా, సృజన వాఙ్మయ రూపంగా అందించటం గ్రహింపవచ్చు. ఈ వ్యాసాలు మేధావి ఆలోచనలుగా అనుభూతులుగా సాహితీ లోకంలో శాశ్వత స్థానం పొంది నిలుస్తాయి. వీటివల్ల వ్యాసౌన్నత్యం స్ఫుటమవుతుంది. విమర్శన వ్యాసం తర్వాత సాహిత్యంలో హృదయ లోపం కలిగిందౌతుంది. ఇతరుల విమర్శన వ్యాసాలు బుద్ధికి పదను పెట్టాయికాని హృదయానికి ఇంతగా గిలగింతలు పెట్టలేదు.

ఆంధ్ర వ్యాస సారస్వత నిర్మాతలలో కట్టమంచి రామలింగారెడ్డి నిర్వహించిన పాత్ర సుప్రసిద్ధం, చారిత్రకం అయింది. విమర్శన వ్యాస పరిధి విస్తృతం కావించిన ప్రఖ్యాతి, ఈ వ్యాసకర్తకే చెందుతుంది. విమర్శనవ్యాసం సారస్వతాంగంగా రూపొందించి ఆంధ్ర భారతికి అమూల్యాభరణం కాన్కగా ఇచ్చిన ఈ వ్యాసకర్త సారస్వత కృషి శాశ్వతమయింది.

## 2. జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి వ్యాస సంపుటాలు 'సాహిత్యతత్వ విమర్శనము' (1936), 'విద్యార్థి ప్రకాశిక' (1937) లలో సారస్వత విద్యా విషయాలు ప్రసక్తమయ్యాయి. అనేక రచనలు భిన్న పత్రికలలో విరివిగా ప్రచురించి గ్రంథాలుగా ముద్రించిన ఈ వ్యాసకర్త సారస్వత రంగంలో వహించిన ప్రసిద్ధి గమనింపవచ్చు.

వ్యాసకర్త శైలి, భావన వంటి విషయాలు విశదీకరించటం, లలిత కళలు, నాటకం, విమర్శనం వంటి అంశాలు చర్చించుట వల్ల సాహిత్యతత్వం పరిశీలించటం చేశాడు. విద్యా విధానంలో వాంఛింప దగ్గ పరిణామాలు, ప్రాచీనతకు విధేయమూ, ఆంగ్లేయ రీతికి భిన్నమూ అయిన ఆలోచననుంచి పుట్టి, విద్యార్థి ప్రకాశికగా రూపొందాయి. రెండు సంపుటాలలోని వ్యాసాలు 21.

సారస్వత, విద్యా విషయాల మీద సాగిన ఈ వ్యాసాలు సంపూర్ణత కోసం ప్రయత్నించలేదు, వ్యక్తిగతాభిప్రాయ ప్రకటనమే చేశాయి. ఈ

వ్యాసాలు సృజన ధర్మ ప్రధానంగా రూపొంది, రచయిత ఆత్మాభివ్యక్తిని కలిగివున్నాయి.

విమర్శనం పటిష్ఠంగా రూపొందించాలనుకొన్న ఈ రచయిత తన్ని ర్వహణం సమర్థంగా చేసినట్లుగా కానీ, శైలిని గూర్చి తన భావం ప్రకటించిన ఈ వ్యాసకర్త శైలి అంతర్యం స్పృశించినట్లుగాకానీ విశదంగా భావించే అవ కాశం తక్కువ. ఈ వ్యాసాలలో భాష ఉన్నంత బరువుగా భావంకాని, వాక్య మున్నంత సుందరంగా వస్తువు కానీ, ఉన్నాయనటం సాధ్యం కాదు.

ఈ వ్యాసాల వల్ల భాషకు ఒక ప్రత్యేక గుణం అలవడింది. పరుగు పందెంలోని అటగాళ్ల లాగా భాష అడ్డమాకలు లేకుండా పరుగు పెట్టింది. వరదవంటి ప్రవాహంలో భాష కొట్టుకు పోతుంది. తెలుగు వచనంలో ఇంత దూకుడు పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు తర్వాత ఈ వ్యాసకర్తే సాధించినట్లు చెప్పవచ్చు. వచన రచనలో పానుగంటి ప్రభావం ఈ రచయిత సృష్టిలో పరికింపవచ్చు

''శబ్దజ్ఞానము తోడనే సంతృప్తి నంది, విమర్శాలోకమునందలి విడ్డూ రపు గాథలనే మనసులందు గ్రుచ్చి మన పని చెల్లిపోయినదని'' భావింపక, కట్టమంచి రామలింగారెడ్డి మార్గంలో కావ్యతత్త్వం గ్రహించటానికి ప్రయత్నించి, ఆ విధంగా కృషి చేశాడు వ్యాసకర్త.

ఈ రచయిత వ్యాసాలన్నీ ఉపన్యాసాలులాగా, వక్త ఎదుట నిలచి మాట్లాడుతున్నట్లు ఉన్నాయి. విషయ వివరణార్థం సాక్ష్యాధారోదాహరణం గ్రహించటం అధికంగా ఈ వ్యాసాలలో కనిపించింది. పరిమితి దృష్టితో ఈ వ్యాసాలు పెద్దగా ఉన్నాయి. సుభాషితమన్న 68 పుటల వ్యాసం ఆంగ్ల వ్యాసానుసరణం 'పరంజ్యోతి' 97 పుటలు ఆక్రమించింది

ఈ రచయిత వ్యాసం ''తర్కశాస్త్రమును, తత్త్వశాస్త్రమును'' ప్రద ర్శించిదిగా వుండాలనీ, వ్యాసరచయిత ''శూన్యమును జూచియు, కనులు మూసి కొని, గంభీర యోచన యందు మునుగితనిందియు దన పని నిర్వర్తించు కొనును'' (సాహితీగోష్ఠి-సాహిత్యతత్త్వ విమర్శనము : పుట 62) అని వివరిం చాడు. అయితే విషయాల మీద ఈ ఆలోచనలు సంపూర్ణంగా లేవు.

ఈ వ్యాస వచనంలో కవితాగుణం ఎక్కువ. భావ ప్రకటనలో ఆవేగం, ఋజుత ఉన్నాయి. పాశ్చాత్య వ్యామోహ సంబంధి విషయ విమర్శనంలో అధిక్షేపం తొంగిచూడటం, కాఠిన్యం వ్యక్తం గుర్తింపవచ్చు. ఏమయినా తెలుగు వచనం కొత్త మార్గంలో సాగటానికి, వేగం సాధించటానికి జొన్నలగడ్డ సత్య నారాయణ వ్యాసాలు దోహదం చేశాయి.

## 3. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ (1893-1979)

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ ప్రకటించిన 'సారస్వతాలోకము' వ్యాసాలు, 'నాటకోపన్యాసము'తో మొత్తం నవరత్నాలు. 'వేమన' బృహత్ప్రణాళికా ప్రతిష్ఠితం కాబట్టి సిద్ధాంత గ్రంథంగా గ్రహింపవలసి వుంటుంది.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ రాష్ట్ర కేంద్ర సంగీత సాహిత్య ఎకాడమీలలో గౌరవ స్థానం పొంది, ఆంధ్ర కర్ణాటక దేశాలకు సుహృద్భావసేతువుగా వెలసి, సృజన, విమర్శన వాఙ్మయ నిర్మాణం చేసి, సంగీత పుంభావ సరస్వతిగా నిలచి, బుద్ధి హృదయాల కేంద్రంలో వ్యాస సృష్టి కావించి, మానవతా మాధుర్యం, సృజన సౌందర్యం వచనంలో నిక్షిప్తం చేసి, సారస్వత రంగం మహితం కావించాడు.

వాఙ్మయ త్రిభుజంలో వచన రేఖ మధ్యస్థ వచన రీతికి ఈ వ్యాస వచనం ప్రబలోదాహరణం, అటు కవితా గుణం, ఇటు శాస్త్ర ధర్మం సరిసమానంగా కలిగి వున్న వచనం, దాని సంపూర్ణ స్థితి ప్రదర్శకంగా ఉంది. ఈ వచనం, వ్యాస రచయిత నలభై సంవత్సరాలలో 'తలంచిన తలంపుల ఆడిన మాటల సంగ్రహం'గా రూపొందింది. అందుకే వ్యర్థత ఈ రచనంలో ఎక్కడా గోచరం కాదు. ఇది ప్రతి వ్యాస వాక్య పద రమణీయంగా వెలసిన వచనం. ఇంత ఉత్తమ వచనం తెలుగు వ్యాసకర్తలలో ఎక్కువమంది సృష్టించలేదు.

ఈ వ్యాసాలు 1954 లో ప్రథమంగా ముద్రిత మయినా ఎన్నో యేండ్ల పూర్వం కొన్ని వ్యాసాలు ప్రచురితమయ్యాయి. 1930 ప్రాంతంలో ఈ వ్యాస సృష్టి ఆరంభమయింది. ఈ వ్యాసాలు సాహిత్య సంబంధి విషయాలోచనలు. కాబట్టి విమర్శన ప్రధానమయిన సారస్వత వ్యాసాలు.

వ్యాస వస్తువును స్పష్టంగా ఆలోచించి, హేతుబద్ధమైన క్రమంతో విభజించి, ఒక్కొక్క విషయం గ్రహించి, ఉపపత్తులతో పెంచి, ఉత్తమ శైలిలో అక్షర రూపం అనుగ్రహించి, భాష గ్రాంథిక వ్యావహారాలలో ఏదయినా, వాగ్వ్యవహారానికి దగ్గరగా ఉన్న పలుకుబడితో సజీవాంధ్రంలో వ్యాసం రూపొందించటం రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ సాహితీ దక్షతను చాటుతుంది. ఇంత ఉన్నతి పొందిన వ్యాసకర్తలు తెలుగులో పలువురు లేరనటం అతిశయోక్తి కాదు.

వ్యాసంకాని, గ్రంథంకాని, రచనా విధానం కాని, కవి కాని, విమర్శకుడు కాని, వ్యవస్థకాని, విమర్శ పరిధిలోకి వచ్చినప్పుడు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ ప్రదర్శించిన ఉచితజ్ఞత గ్రహింపవలసిందే! విమర్శనం ఎంత నిశితంగా సాగినా, వ్యక్తిని తూలనాడని ఔదార్యం ఉత్తమ వ్యక్తిత్వ లక్షణం.

కవికయినా విమర్శకులకయినా, సాహిత్యంలో జరిగిన ఏ అన్యాయం వ్యాసకర్త సహించలేదు. వాళ్ళు ప్రాచీనులయినా, ఆధునికులయినా, ఈ భావంలో మార్పులేదు. నాచన సోమనాథుడికి అనవసరంగా అధిక స్థానం ఇవ్వటం కాని, వేటూరి ప్రభాకరశాస్త్రి, గన్నవరపు సుబ్బరామయ్య, 'రంగనాథరామాయణము' పరిష్కరించటంలో చేసిన కృషికి సరయిన గుర్తింపులేనప్పుడు కాని, రచయిత మూగ భావం వహించలేదు. వాదోపవాదాలయినా, అధికారులకు అనిష్టమయినా సత్యం ప్రకటించటం రచయిత వ్యక్తిత్వ శోభ.

వ్యక్తిని విమర్శించవలసి వచ్చినప్పుడు, అనేక సందర్భాలలో వ్యక్తికి అబాధకంగా, విషయమే విమర్శించి, పేరయినా చెప్పకుండా ఉండటం, పేరు చెప్పినప్పుడు తీక్షణకు చోటు లేకుండా సంయమనం ప్రదర్శించిన వ్యాసకర్త ఆర్షసంప్రదాయ వైశిష్ట్య సంరక్షకుడు. గమనింపవచ్చు.

ఒక కాల ధర్మం కాని, ఒక కవితా పరిశీలనం కాని, ఒక కావ్యాధిక్యం కాని, ఒక పాత్ర ప్రాముఖ్యం కాని తెలపటం వరకే వ్యాస రచనం పరిమితమయినా, పరిశీలనలో లోతు, పరిశోధనంలో దీక్ష, అభివ్యక్తిలో రామణీయకత, అనుభూతిలో ధార్మికత గోచరమయి, వీటి ఔన్నత్యం స్పష్టమవుతుంది. వ్యాసాలలో, పాత్రలతత్త్వం విశ్లేషించినప్పుడు రచయిత మానవ మనస్తత్వ

పరిశీలనం సామర్థ్యం స్పష్టమయింది. కావ్య గుణంకాని, కవితా ధర్మం కాని, కాల స్వభావం కాని వివరించినప్పుడు. ఆ వస్తువు ఎంత లోతుగా, మూలతత్త్వ ప్రదర్శకంగా చూడటం జరుగుతుందో, పాఠకులకు అంత దగ్గరగా, రచనం అంత సృజనంగా చేయటంలో రాళ్ళపల్లి దిట్ట. వ్యక్తుల మీద, జాతిమీద సాను భూతి ప్రేమా వ్యక్తమయి, ఈ వ్యాసాలు చదువరులకు సన్నిహితంగా నిలిచాయి.

వ్యాస వస్తువు అక్షర రూపంగా అవతరించటానికి అవసరమయిన ఆలో చన, వివరణం, విమర్శనం, వచనం ఉత్తమంగా నిలిపికూడా, వినయంగా వ్యాసకర్త వ్యాసాలలో గోచరం కావటం సాశ్చర్యంగా పరికించటం జరుగు తుంది. ఉదా. ''......నా కృతజ్ఞత నెట్లు చూపుకొనవలయునో నేనెఱుఁగను గాని, నా యయోగ్యతను ప్రదర్శించు మార్గ మెఱుఁగుదును'' (సారస్వతా లోకము-పుట 29)

''...నాచన సోమనాథుని కవిత్వమంత యుత్తమ జాతికిఁ జేరదని చెప్ప సాహసించి పలువురు పండితుల మనసు నొప్పించిన యపరాధిని నన్నే మీరీ నాడు అతని జయంత్యుత్సవములో అధ్యక్షునిగా నెన్నుకొని సాహిత్య ప్రపంచ మందు మీకుఁగల స్వాతంత్ర్య రసికతను వెల్లడించితిరి'' (సారస్వతాలోకము-పుట 48) ఈ వాక్యాలు వ్యాసకర్త ఔన్నత్యమే ప్రదర్శిస్తున్నాయి.

ఈ వ్యాసాలలో ఎన్నో వాక్యాలు సార్వజనీనంగా సామాజిక సత్యంగా కనిపిస్తున్నాయి.

> ''అల్పత్వమునకు రసికుల బ్రతుకులో చోటులేదు'' (పుట 27)
> ''పరదూషణము పందల పాలిటి బ్రహ్మాస్త్రము'' (పుట 32)
> ''దక్షత మనము చేతులార సంపాదింపవలసిన వస్తువుగాని పుట్టుకచే వచ్చునది కాదు.'' (పుట 33)
> ''తర్కశాస్త్రము నోరు మూసినను హృదయమును మూయఁజాలదు'' (పుట 118)

ఇటు వంటి వాక్యాలు ఎన్నయినా ఉదాహరించవచ్చు.

రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ వ్యాసం అన్న పదానికి బదులు ఉప న్యాసమే గ్రహించాడు. సారస్వతాలోకములోని మొదటి మూడు వ్యాసాలు 'సారస్వతోపన్యాసములు' అనే పేరుతో మొదట వెలువడటం వల్లనూ 'నాటకోపన్యాసము' అన్న పేరు వల్లనూ, ప్రారంభంలో ఉపన్యాస పద ప్రభావం. అనంతరం చ్యుతమయింది.

నాటకోపన్యాసం తప్ప. ఈ వ్యాసాలు అధిక విస్తృతంగా లేవు. రచయిత పాఠకులను సంబోధించటం, ఎదుట నిలచి మాట్లాడుతున్నట్లుండటం, హాస్య కుశలంగా ప్రవర్తించటం, సృజన ధర్మంతో వ్యక్తిత్వ ముద్రతో వ్యాస సృష్టిచేయటం, గుర్తింపవచ్చు.

ఈ వ్యాసాలలో విషయం అడ్డమాకలు లేకుండా సాగలేదు. వ్యాస వస్తువు అడవి లాగా కాకుండా ఉద్యాన వనం లాగా పెరిగింది. విషయ విశాలత్వం ఉంది కాని విశృంఖలత్వం లేదు. వ్యాసాలు సృజనమే అయినా విమర్శన రీతిని కలిగివున్నాయి. వ్యాస వస్తువు పరిమిత పరిధిలో స్వయం సంపూర్ణంగా రూపొందింది.

'నాటకోపన్యాసములు' సౌకర్యార్థం రెండు వ్యాసాలుగా భావింపవచ్చు కాని, ప్రథమ భాగం సిద్ధాంత చర్చగా, ద్వితీయ భాగం ఉదాహరణప్రాయంగా భావించి ఏక వ్యాసంగా గ్రహింపవచ్చు. మొదటి దశలో సంస్కృతాంగ్ల నాటక ధర్మాలు ఆలోచన పొంది, ఆధునికాంధ్ర సంబంధిగా కూలంకష పరిశీలనం జరిగింది. ఇక్కడ నాటక మూలతత్త్వం విపులీకరించటమయింది. రెండవ దశలో ధర్మవరం కృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు నాటకాలు సిద్ధాంత సమన్వయాలుగా గ్రహించటం పరికింపవచ్చు. ఈ వ్యాసంలో వ్యాస కర్త పాండిత్యం బుద్ధి నిశితత్వం ఆలోచన సామర్థ్యం స్పష్టమయ్యాయి.

'రాయలనాటి రసికత' శ్రీకృష్ణదేవరాయల కాలంలోని ఆంధ్రుల సాంఘిక జీవిత వైభవానికి నిదర్శనం; 'రాయల వైదుష్యము'. ఆముక్తమాల్యద కర్త కవితా సౌందర్య సమీక్ష; 'నాచనసోముని నవీన గుణములు' ఆ కవి కవితాగుణ కూలంకష పరీక్ష; 'నిగమశర్మ అక్క'. 'తిక్కన తీర్చిన సీతమ్మ' కన్నుల గుండెల్లోని కాంతి పుంజాలయిన పాత్ర సృష్టి సౌందర్య పరిశీలన; 'త్యాగయ్య

గారి నాద సుధారసం' సంగీతంలోని మాధుర్యానికి అక్షర రూపం; 'ఆంధ్ర వాఙ్మయమున నాచన సోమనాథుని కీయఁదగిన స్థానము' కవిస్థాన చర్చ; 'రంగనాథ రామాయణము' వివాద సంబంధి గ్రంథ పరిష్కరణ విషయం, తెలుపుతూ సాగిన విశిష్ట వ్యాసాలు; 'సారస్వతాలోకము'లో ఆలోకనం కలిగిస్తున్నాయి.

ఈ వ్యాసాలలో కొన్ని కన్నడంలోకి అనువదింపబడ్డాయి. ఇతర సృజన వాఙ్మయం తెలుగునుంచి కన్నడ తమిళాది భాషలలోకి అనువాదం చేయబడినట్లు వ్యాసం అనువాదంగా రూపొందటం ప్రచురంగా లేదు. అనువాదం వల్ల ఈ వ్యాసాల వైశిష్ట్యం బోధపడుతుంది. 'త్యాగయ్యగారి నాద సుధారసం' 'గానకలె' గానూ, 'నాటకోపన్యాసములు' 'నాటకోపన్యాస'గానూ (టి. యన్. శ్యామరాయ) 'రాయలనాటి రసికత' 'సాహిత్య మత్తు జీవనకలె' గానూ, వేమన గ్రంథం కూడా పై కన్నడ నామంతో సిద్ధవన హళ్ళి కృష్ణ శర్మ అనువదించాడు.

ఈ వ్యాసాలలో భాష గ్రాంథికంగానే వుంది. కాని 'త్యాగయ్యగారి నాద సుధారసం', 'తిక్కన తీర్చిన సీతమ్మ' వ్యాసాలలో భాష వ్యావహారికంగా వుంది. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ వ్యాసాలలో ప్రారంభంలో గ్రాంథిక భాష, అనంతరం వ్యావహారికం ప్రయోగించటం వల్ల, భాషా విషయిక పరిణామం గుర్తింపవచ్చు.

ఈ వ్యాసాలలో, ఎంత ఉత్తమ వచనమో, అంత ఉత్తమ రచనమూ, ఎంత విమర్శన సామర్థ్యమో, అంత సృజన నిర్మాణమూ, ఎంత సునిశిత పరిశీలనమో, అంత విషయ వివరణమూ, ఎంత సున్నిత భావ ప్రకటన దృష్టో అంత సూక్ష్మ పరిశోధనమూ, ఎంత కోమలాభివ్యక్తో, అంత తీక్ష్ణపరిశీలనమూ; నిక్షిప్తమయి వ్యాసకర్త ఔన్నత్యం గోచరమవుతూవుంది.

## 4. పింగళి లక్ష్మీకాంతం [1894-1970]

పింగళి లక్ష్మీకాంతం 'గౌతమ వ్యాసములు' ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆచార్య పదవిలో (1931-1949) ఉండగా వ్రాయటం జరిగింది. ఆకాశవాణి విజయవాడలో స్పోకెన్ వర్డ్ ప్రొడ్యూసరు (1954-60) గా ఉన్నప్పుడు

'నా రేడియో ప్రసంగాలు' సృజించటమయింది. ఈ వ్యాసాలు విధి నిర్వహణంలో భాగంగా అవతరించాయి.

బందరులో చదివి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి శిష్యత్వం పొంది, కాటూరి వేంకటేశ్వర రావుతో జంటకవిగా ప్రసిద్ధి పొంది, అవధాన విద్యలో కృషి చేసి, నటనలో ప్రావీణ్యం సంపాదించి, మద్రాసు విశ్వవిద్యాలయంలో చేరి యమ్. ఎ. పట్టం పొంది, తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో పరిశోధన చేసి, ఆంధ్ర శాఖాచార్యత్వం నిర్వహించి, ఆకాశవాణి ప్రొడ్యూసరుగా పని చేసి, కవిగా, రచయితగా, విమర్శకాగ్రణిగా, సముచిత గౌరవాధిక్యాలు పొందిన వ్యాసకర్త పింగళి లక్ష్మీకాంతం.

రచయిత వ్యాసకర్త కావటం యాదృచ్ఛికం. ఆంధ్ర విశ్వవిద్యాలయంతో ఆచార్య పదవిలో ఉండి వ్రాసిన పుస్తక పీఠికలు, ఇచ్చిన ఉపన్యాసాలు, ఆకాశవాణిలో ప్రసంగాలు అవసరమై చేసిన రచనలు, స్వభావ సిద్ధంగా కవి అయిన పింగళి ఆంగ్ల సారస్వత ప్రభావంతో సృష్టించిన వ్యాసాలు వ్యక్తిత్వ ముద్రతో, సృజనాత్మకంగా ఆవిర్భవించాయి. పీఠికలు వ్యాసాలుగా ప్రచురించటంలో తన అభ్యున్నతికి మార్గదర్శి అయిన కట్టమంచి రామలింగారెడ్డి ప్రభావం గోచరమవుతుంది.

వ్యాసం వ్రాయటం, ఉపన్యాసం ఇవ్వటం కంటే భిన్న ధర్మ ప్రదర్శకంగా ప్రసంగ వ్యాసం ఉంది. దీనిని వ్యాస శాఖగా గుర్తిపవచ్చు. వ్యాసం వ్రాసినట్లు ప్రసంగం వ్రాయటం, ఉపన్యాసమిచ్చినట్లు, ప్రసంగం చదవటం వల్ల ప్రసంగ వ్యాసం, ఉపన్యాస ధర్మద్వయంతో సమ్మేళనం పొందింది. అయితే వ్యాసంలో ఉండే విషయాధిక్యం విస్తృతత్వం ప్రసంగంలో తగ్గి, ఉపన్యాసంలో ఉండే అవయవ విన్యాస ప్రభావం, విషయం సమయానుకూలంగా తగ్గించట. పెంచటం, మార్చటం ప్రసంగ వ్యాసంలో లోపించి పోతాయి. చూడటంతో నిమిత్తం లేకుండా వినటం వరకే పరిమితంగా, కాలావధికి లోబడి వ్రాసింది చదవటం మాత్రమే ప్రసంగ వ్యాస లక్షణం. అందువల్ల వ్యాసోపన్యాస ధర్మాలకు మధ్యస్థంగా, ఆధునికంగా ఆకాశవాణి కారణంగా ఆంధ్ర సారస్వతంలో అవతరించిన వ్యాస శాఖ ప్రసంగ వ్యాసం.

పింగళి లక్ష్మీకాంతం వచనంలో కవితా స్ఫూర్తి గోచరమవుతుంది. ఇది వచన రేఖలో దాదాపు మధ్యస్థంగా ఉండేంత ఉన్నతం, అభివ్యక్తి, ఉక్తి వైచిత్రి వచనంలో నిరాఘాటంగా సాధించిన విశిష్టత గమనింపవచ్చు. ప్రారంభంలో ఉత్తమ గ్రాంథికం వ్యాస రచన కుపయుక్తం కావించి, ప్రసంగ వ్యాస సృష్టి నాటికి వ్యావహారికం గ్రహించి, తన సృష్టి వ్యావహారికం వైపు పరిణామం చెందుతుంటే, అంగీకరించి ఆ రచనకు సృష్టి, తుష్టి గుర్తింపవలసిన అంశం.

వ్యాసం వ్రాయటానికి గ్రహించిన విషయం లోతుగా పరిశీలించి, దాని మూల తత్త్వం గుర్తించి, విస్పష్టంగా వినూతనంగా ప్రతిభావంతంగా భావ వ్యక్తీకరణం చేయటం రచయిత సామర్థ్యంగా కనిపిస్తుంది. దీనికి అంకురదశలో కట్టమంచి ప్రభావం భావిత మవుతుంది.

ఈ వ్యాసకర్త, 'సాహిత్య శిల్ప సమీక్ష' లో వ్యాసం మీద వెలువరించిన అభిప్రాయం 'అందు మొదటిది-ఆది మధ్యాంతముల సామరస్యము. రెండవది అప్రస్తుత ప్రసంగరాహిత్యము. మూడవది అనతి విస్తృతి, నాల్గవది తార్కికమైన అనుక్రమము. ఐదవది పటుత్వమును, సౌందర్యమును గల శైలి, ఈ శైలియే కావ్యేతరమైన వ్యాసమునకు కావ్య మండలిలో స్థానము నొసగునది. వ్యాసమున అర్థ గాంభీర్య మెట్టిదో శైలీ సంపన్నతయు అట్టిదే. తాత్త్వికముగా విషయచాలన మొనర్చి పటుత్వము గల భాషలో, సోపపత్తికమైన సిద్ధాంతము చేయు వ్యాసములే పఠన యోగ్యములు'' (పుట 355) తన వ్యాసాలకు పూర్తిగా, విమర్శన రచనలకు కొంతవరకు పొసగుతుందికాని, సృజన వ్యాసానికి ఈ నిర్వచన ప్రాయ రచన సుదూరంలో నిలుస్తుంది.

'గౌతమ వ్యాసములు' విషయంలో, రచనంలో పెద్దవిగానూ, విశిష్టంగానూ ఉన్నాయి. ప్రసంగ వ్యాసాలు చిన్నవిగా ఉన్నాయి. ఈ అంశం పుటల పరిమితిని కూడా వివరిస్తుంది.

వ్యాసంలో ప్రధానమయిన విషయంలోని భాగాలయిన అంశాలు అనేకం తాత్త్వికానుక్రమంతో వివరించటం వ్యాస సంపుటి లక్షణమయితే, తక్కువ

అంశాలు స్వల్పంగా వివరించటం ప్రసంగ వ్యాస ధర్మమయింది. 'గౌతమ వ్యాసములు' లోని సంక్షిప్త రచనారీతి, ప్రసంగ వ్యాసంలో తగ్గి, విషయం విరివిగా విపులీకరించటం, చదవకుండా వినటం వల్లనే తెలియాలి కాబట్టి ఎక్కువయింది. అందువల్ల ప్రసంగ వ్యాసంలో సంక్షిప్తత తగ్గినా స్పష్టత పెరిగింది.

ఈ రెండు సంపుటాలలో ఉన్న వ్యాసాలు 27. ఈ తారావళి సారస్వత వ్యాసాభివృద్ధి దోహదం చేసింది. 'గౌతమ వ్యాసములు' లో ఆంధ్ర సారస్వతం, 'నా రేడియో ప్రసంగాలు' లో సంస్కృత సాహిత్యం ప్రాధాన్యం వహించాయి. రచయితలో వచ్చిన వస్తు పరిణామం వ్యాస విషయ పరిణామం తెలుపుతూ వుంది. భాషా విషయంలో గ్రాంథికం నుంచి సంస్కృతానికి ఎగబ్రాకటం గమనింపవచ్చు.

ఆంధ్ర సారస్వతం ఆరంభం నుంచి, ఆధునిక యుగం దాకా పొందిన పరిణామం ఆంధ్ర నాటక స్థితి గతులు తెలిపే వ్యాసాలు పరిపూర్ణత కోసం ప్రయత్నించాయి. పీఠికలుగా వెలువడ్డ వ్యాసాలు, అసంపూర్ణత్వంతో ఉన్నాయి. విమర్శన మున్నంత పటిష్ఠంగా, రచయిత వ్యక్తిత్వం, వ్యాసాలలో గోచరం కాదు. రచయిత ముద్ర ఉన్నా, సృజనంగా ఉన్నా, విషయం విమర్శనమయి, ప్రబలంగా రూపొందింది.

'నా రేడియో ప్రసంగాలు' సంస్కృతవిషయ వివరణంగాను, ఆంధ్ర విషయ విమర్శనంగాను ఉన్నప్పటికీ, గాంధీ బుద్ధుల ధర్మ ప్రవచన ప్రచారం తెలిపే జీవితచరిత్ర వ్యాసాలు. వినటం ఉద్దిష్టమయిన ఈ ప్రసంగ వ్యాసాలలో 'చూడండి' అనటంకంటే వినండి అనటం సముచితంగా ఉండవచ్చు. అయితే చూడండి అనటం హెచ్చరికగా గ్రహింపవచ్చు. 'వివరిస్తున్నాను వినండి' అన్నప్పుడు ప్రసంగ వ్యాస ధర్మం గోచరమయినట్లు అనిపించవచ్చు. 'గౌతమ వ్యాసములు'లో కంటే 'నా రేడియో ప్రసంగాలు'లో రచయిత వ్యక్తిత్వం ఎక్కువగా గోచరమవుతూవుంది. సంక్లిష్ట సంగతులవైపు మనస్సు మళ్ళించడంతోపాటు, వ్యక్తిత్వమే రచనంలో ప్రత్యక్షం కావటం ఈ రచయిత వ్యాస పరిణామంలో గుర్తింపవచ్చు.

ఆంధ్రభాషాచార్య సృష్టిగా, విమర్శనవ్యాసంగా, ప్రసంగవ్యాసంగా, ఉత్తమ వచన రచనగా, ఆంధ్రసాహిత్యంలో ఇవి విలువైన వ్యాసాలు. ఈ వ్యాస సంఖ్య తక్కువయినా ఆంధ్రవిద్యార్థులకివి ఎక్కువగా పరిచయమయ్యాయి. విశ్వవిద్యాలయాలు పాఠ్యభాగాలుగా చేయటంవల్ల, ఇవి విద్యార్థి లోకానికి సుపరిచితాలయ్యాయి. తెలుగులో విమర్శనవ్యాస రీతికి మార్గదర్శకాలుగా ఉన్న ఈ వ్యాసాలు, ఆంధ్రవాణికి అందగించిన సొమ్ములు.

## 5. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము [1908]

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము మొదటినుంచి వ్రాసిన వ్యాసాలలో లభ్యమయినవాటిని, షష్టిపూర్తి మహోత్సవ సంఘం 'లక్ష్మీరంజన వ్యాసావళి' ప్రచురించింది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆంధ్రాచార్య పదవి అలంకరించి పరిశోధనలు చేసి, చేయించి, గ్రంథపరిష్కరణం చేసి, రచనావైశిష్ట్యం సముపార్జించి తెలుగుదేశంలో వ్యాసకర్త పొందిన విఖ్యాతి విజ్ఞులకు తెలిసిందే! 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము', 'ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి' విపుల పరిధీ ప్రవర్తకాలు, ఉద్గ్రంథాలు కాబట్టి వ్యాసాలుగా పరిశీలింపబడవు. తెనుగు దుక్కి (1936) లోని వ్యాసాలువ్యాసావళిలో చేర్చటం జరిగింది కాబట్టి వేరుగా పరిశీలింప నక్కరలేదు. వర్తమానాంధ్రదేశంలో తెలుగు వాఙ్మయసేవ కావించే అనేకులు విద్యార్థులుగా ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము శిక్షణ పొందారు.

ఈ సంపుటంలోని వ్యాసాలన్నీ సాహిత్య విమర్శనకు పరిమితం. ఆచారాలు, నియమాలు, తీర్థాలు, పండుగలు తెలిపే సాంఘికవ్యాసం ఒకటితప్ప, మిగతా ఇతరవైన సాహిత్యవిమర్శనంతో ఒప్పుతున్నాయి. ఈ వ్యాసాలలో శ్రీమదాంధ్ర భారత సౌందర్యదర్శనంనుంచి భావ కవిప్రతీతులవరకు భిన్నవిషయాలు విమర్శన పూర్వకంగా వివరించాడు. కవిత్రయంపట్ల వ్యాసకర్తకు మిక్కిలిగౌరవం. భారతం భిన్న దృక్పథాలనుంచి పర్యాలోచించి, ఇదంపూర్వం అప్రసిద్ధంగాఉన్న అనేక మాత్రాంశద్యోతకంగా రూపొందింది.

ఈ సంపుటిలో పురాణాలు, ప్రబంధాలు, ఖండకావ్యాలు, నాటకాలు మొదలైన భిన్న ప్రక్రియాంతర్గత సాహితీ విమర్శనంతోపాటు, రాజనీతి,

జాతీయతవంటి దృక్పథాలుకూడా వివరంగా, హేతుసహితంగా , యుక్తిపూర్వకంగా, పరిశోధన పరిపూర్ణంగా వ్యాసాలు ఆవిష్కృతి పొందాయి.

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము ఈ వ్యాస సృష్టిలో ప్రదర్శించిన సమన్వయదృష్టి విశిష్టంగా ఉంది. ఈ వ్యాసభాష గ్రాంథికంగా వ్యావహారికంగా ద్వివిధంగాఉంది. ఆంధ్రాచార్యులు కొందరు గ్రాంథికమే అదరించటం పరిపాటి. అయితే ఈ వాస్తకర్త వ్యావహారికంకూడా ఉత్తమ విమర్శన రచనకు సమర్థ సాధనంగా వుంటుందని తెలిపినట్లయింది. ఇంతేకాదు, ఈ వ్యాసకర్త సమన్వయ దృక్పథం వ్యాసవస్తుగతంగాకూడా దర్శింపవచ్చు. సాధారణంగా ప్రాచీన వాఙ్మయవిషయమే వ్యాసవస్తువులుగా కొందరు ఆంధ్రాచార్యులు గ్రహించటం సాధారణంగా జరుగుతూవుంటుంది. అయితే ఈ వ్యాసకర్త సాంఘిక వస్తువులేకాదు యెంకిపాటల విమర్శనంకూడా వ్యాస విషయాలుగా గ్రహించాడు. వస్తు భాషలు పురస్కరించుకొని, రచయిత సమన్వయ దృక్పథం విస్పష్టంగా చూడవచ్చు.

ఈ వ్యాసాలు 1935 తర్వాత వ్రాయటం జరిగింది. ఇవి భారతి మొదలైన పత్రికలలో వ్రాసిన వ్యాసాలు, సాహిత్య పరిషత్తులలో ఇచ్చిన ఉపన్యాసాలు. వీటిలో లోతు, నిశితత్వం గమనార్హంగాఉంది. ఏ వస్తువు స్వీకరించినా, కూలంకషంగా సంపూర్ణంగా విస్పష్టంగా వ్యాసం రూపొందించటం రచయిత నైపుణ్యం విమర్శన నైశిత్యానికి ఆంధ్ర సారస్వతంలో ఈ వ్యాసాలు ప్రబల నిదర్శనాలు.

ఉత్తమ విమర్శన వ్యాస స్రష్ట అయిన ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము 'తెనుగులో సాహిత్య విమర్శ' అనే వ్యాసంలో "వ్యాసపు దృష్టి వేరు. వ్యాస రచయిత సాధారణముగా గుణ సంకీర్తనముతో తృప్తి పడును. గ్రంథ విలేఖరి ఆయా ప్రక్రియల సమన్వయ వీక్షణము కలవాడై, వాని గుణదోషములను, బలాబలములను, నిశితముగను, లలితముగను నిగ్గు తేల్చవలసిన వాడగును" (పుట 105) అని వ్యాసానికీ, ఉద్గ్రంథానికీ వచనంలో ఉన్న దృష్టి వైవిధ్యం వివరించాడు. ఈ దృష్టితో పరికిస్తే 'లక్ష్మీరంజన వ్యాసావళి' లోని వ్యాసాలు చిన్న గ్రంథాలుగా భావింపదగ్గ విస్తృతితో, విశేష విషయ సమంచితాలయి ఒప్పుతూ ఉన్నాయి.

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము వచనంలో స్పష్టత విశిష్ట గుణం. దానికి తోడు కవితా గుణం సిద్ధించింది. వ్యాస వస్తువు క్లుప్తంగా విమర్శించటంతో పాటు, సుందరంగా వివరించటం కూడా దర్శింపవచ్చు గ్రాంథిక వ్యావహారిక భాషలు వ్యాసకర్త యథేచ్ఛగా ప్రయోగించాడు. వ్యాసం విమర్శన వాహికగా, సమర్థంగా రూపొందటానికి వ్యాసకర్త దోహదం చేశాడు. నూత్న సారస్వతభావాలు, వినూత్నరచనారీతులు వివరించి, విమర్శనవ్యాసవాఙ్మయం పోషించి, వ్యాస సృష్టితో ఆంధ్ర సరస్వతిని ఆరాధించి, తన సారస్వత కృషి భవిష్యదాస్తిగా చేసి, విఖ్యాతి పొందిన ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము వ్యాస సంపుటి 'లక్ష్మీరంజన వ్యాసావళి' తెలుగు వ్యాస పరిణామంతో ఒక ప్రముఖ దశ.

## 8. చెళ్ళపిళ్ళ యుగం [1934-1950]

సారస్వత లోకంలో సుప్రసిద్ధులు అనేకులు ఈ యుగంలో వ్యాస సృష్టి చేశారు. అయితే ఇతర ప్రక్రియా నిర్మాణంలో పొందిన ప్రసిద్ధి వల్లనూ, వ్యాసస్పష్టి సంఖ్యలో అధికంగా చేయటం వల్లనూ, కథలు గాథలుగా వ్యాసాలు విస్తృత సృజన వాఙ్మయంగా రూపొందించటం వల్లనూ, వ్యక్తి ప్రాధాన్యం వల్లనూ ఈ యుగం చెళ్ళపిళ్ళ యుగంగా భావించటం సమంజసమే !

ఈ యుగంలో వ్యాసం హాస్య ప్రాధాన్యం పెంచుకొంది. కల్పనాత్మక సాహిత్య స్థాయిలో నిలిచే అర్హత అధికంగా సముపార్జించింది. విమర్శనం, ఆవేశం, వ్యాసంలో అత్యధికంగా రచయిత ప్రాధాన్యంతో ఒప్పింది. వ్యాస రచనంలో పూర్వమున్న క్లైష్ట్యం తొలగిపోయి, సులభంగా సుందరంగా రచనా సిద్ధి పొందింది. సారస్వత వ్యాసం విమర్శనమేదో, సృజనమేదో విస్పష్టంగా విడివడి రూపం దిద్దుకొంది. సాహితీ సంబంధి రచనమే వ్యాసంగా గ్రహింపబడి, ఏవం విధమైన ఇతర రచనలు వ్యాస నామంతో పేర్కొబడకుండా ఉండటం ప్రారంభమయింది. అయితే ఆంగ్లంలోని సృజన వ్యాస ధర్మం గుర్తించిన వ్యాసకర్తలు ఈ సృష్టి కావిస్తూ వచ్చారు.

## 1. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి [1870 - 1950]

కింకవీంద్ర ఘటాపంచాననులు, బాలసరస్వతీ కళా నిధులు, విద్వత్కవులు, శతావధానులు, అద్భుతనాంధ్ర కవి ప్రపంచ నిర్మాతలు, కళాప్రపూర్ణులు తిరుపతి వేంకటకవులు జంట కవులుగా తెలుగు జాతి భాగ్యాల పంటగా అవతరించారు. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి ఆరంభంలో బిరుదాలు దాల్చినా, అనంతరం త్యజించి, జంటకవిగా అవధాన కవితా వ్యవసాయం కావించినా, రచయితగా వ్యాస సృష్టి కావించిన సాహితీ తపస్వి.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి వ్యాసాలు 'కథలు గాథలు'గా మొదట అయిదు సంపుటాలుగా, అనంతరం సంపూర్ణంగా మూడు సంపుటాలుగా, ప్రచురణం పొందాయి. అవి రచయిత దృష్టిలోనూ, ప్రచురణ కర్తల దృష్టిలోనూ వ్యాసాలు. ఈ సంపుటాల శీర్షిక 'కథలు-గాథలు' అని ఉన్నా, ఇవి వ్యాసాలే!

ఈ వ్యాసాలు మొత్తం 170. ప్రథమ భాగంలో 'తెనాలి రామలింగ కవి కవిత్వం' అసంపూర్ణంగా ముద్రితమయి, మిగతా వ్యాసం భాగంరెండవ భాగంలో చేర్చటం జరిగింది. తృతీయ సంపుటంలోని 'రాణా ప్రతాపసింహ చరిత్ర' 'త్రియంబక శబ్దవిచారము'లతో ముగింపు భాగాలు 'వింత శ్లేషలు' 'భారతాంధ్రీ కరణ కాల పరిమితి' ప్రారంభ భాగాలు లభింపలేదని, 'రామాయణ కల్పవృక్షం' 'మర్యోధనుడు' 'పండితులపాట్లు' 'మనపేర్లు' లలో వ్యాస భాగాలు కొన్ని లోపించాయనీ, పూర్వవ్యాసాలు 'పరమ రహస్యం' లలో కొంత విషయం చ్యుతమయిందనీ గ్రహింపవచ్చు.

చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రి 1918 లో వ్యాస రచన మారంభించినా 1934 తర్వాత విశిష్ట కృషి జరిగింది. 1950 వరకు, మరణ పర్యంతం వ్యాస రచన కావిస్తూ కన్ను మూసిన ధన్య జీవి. ఈ రచయిత ఏ యే సంవత్సరాలు ఎన్నెన్ని వ్యాసాలు వ్రాసిందీ పరికింపవచ్చు. 1918-2; 19-1; 23-2; 27-4; 34-3; 35-6; 36-25; 37-23; 38-9: 39-5; 40-9; 41-14; 42-1; 44-14; 45-8; 46-12; 47-5; 48-11; 49-4; 50-1; కొన్ని వ్యాసాలు ఏ సంవత్సరం ముద్రించిందీ తెలియటం లేదు. ఈ

వ్యాసకర్త రెండు వ్యాసాలు వ్రాసేసరికి జంటకవిగా ఉన్న దివాకర్ల తిరుపతి శాస్త్రి గతించి పోయినా, తన వ్యాస సంపుటులకు తిరుపతి వేంకటీయము అనే పేరుంచటం గమనార్హం.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి భిన్నవ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురించాడు. ఈ వ్యాసాలు అధికంగా ప్రకటించిన పత్రికలు కృష్ణాపత్రిక, ఆంధ్ర వీక్లి. ఈ వ్యాస ప్రచురణం చేసిన పత్రికలు 25. అవి 1. అభ్యుదయ 2 ఆది శైవ 3. ఆనందవాణి, 4 ఆంధ్రడైలీ 5. ఆంధ్ర దినపత్రిక 6. ఆంధ్రపత్రిక 7. ఆంధ్రప్రభ 8. ఆంధ్రవాణి 9. ఆంధ్రవీక్లీ 10. ఉదయలక్ష్మి 11. కృష్ణాపత్రిక 12. గోలకొండ 13. జన్మభూమి 14. జాగృతి 15. త్రిలింగ 16. తెలుగుదేశం 17. ప్రజామిత్ర 18. ప్రజాసేవ 19. ప్రౌఢభారతి 20. భారతి 21. మోక్షసాధని 22. రామకృష్ణప్రభ 23. సమదర్శిని 24. సుధ 25. సుధర్మ అనేక పత్రికలను తన వ్యాసాలతో రచయిత గౌరవించాడు.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి వ్యాసాలలో ప్రధాన ధర్మం వ్యక్తిత్వం. తదావిష్కరణమే అభివ్యక్తి అయి అవి శోభిస్తున్నాయి. సాంఘిక సంగతులు, వివాద విషయాలు, వ్యక్తుల పరిచయాలు, నిజజీవిత సన్నివేశాలు, సాహిత్య విమర్శలు, సూటిగా గుండెనుంచి దూసుకువచ్చి వ్యాసాలుగా రూపొందాయి.

ప్రతి వ్యాసంలో, వాక్యంలో, పదంలో రచయిత వ్యక్తిత్వం గోచరమవుతూవుంది. వ్యాస లక్షణమైన వ్యక్తిత్వం, శైలీ లక్షణమైన వ్యక్తిత్వం విషయ భాషలలో మిళితమయి విశిష్టంగా అవతరించింది. రచయిత ఏ సందర్భంలోనూ కాఠిన్యం ప్రదర్శింపలేదు. ఎంత కఠిన సత్యమయినా చెప్పటం జరిగింది కాని, వాక్కులలో కాఠిన్యం బహ్వల్పం. గురువునయినా, బాధ్యతారహితంగా ప్రవర్తించినట్లు భావిస్తే ఖండించటానికి వెనుకంజ వేయలేదు.

ఈ వ్యాసాత్మ రచయిత వ్యక్తిత్వం. ఏ వ్యాసం చదువుతున్నా, రచయిత మనస్తత్వమో, నమ్మకమో, ఆలోచనో, అనుభూతో, మైత్రో, శత్రుత్వమో, ప్రేమో విరోధమో, ఎగతాళో, భయమో, మాట తూలటమో, మాట పడటమో, సాహిత్యాపవాదాలు ఖండించటమో, సిద్ధాంతాలు స్థాపించటమో చేస్తూ ప్రతిక్షణం వ్యాసకర్త కనిపిస్తూనే వున్నాడు.

సాక్షి వ్యాసాలలో రచయిత తన వ్యక్తిత్వం అనేకమైన తెరలమరుగుకు లాక్కొనిపోతే, ఈ వ్యాసాలలో రచయిత వ్యక్తిత్వం అనేకమైన యవనికలు తొలగించుకొని నేపథ్యం నుంచి రంగస్థలం మీదికి వచ్చి, కనులు మిరుమిట్లు గొలిపేంత కాంతిమంతగా గోచరమయింది. పూర్వవ్యాసకర్తలలో ఇంత వ్యక్తిత్వ ముద్ర ప్రదర్శించినవాళ్ళు తెలుగులో లేరనవచ్చు.

కందుకూరి వీరేశలింగం పంతులు ఉన్నతాసనం మీద నుంచి ఉపన్యసించిన ధోరణి వ్యాస రచనంలో చూపితే, పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు ఆనందం కలిగించాలన్న సంకల్పంతో కల్పనలు పెంచి, ఉన్నతాసనం దిగి తన వ్యాస సృష్టి అందిస్తే, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి తన వ్యాసాలతో పాఠకుల దగ్గరకు చేరి, మిత్రుడులాగా గురువులాగా వ్యవహరించాడు.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి వ్యాసాలలో తన వ్యక్తిగత విషయాలు సందర్భవశంలో ప్రస్తావించాడు. ఈ విధంగా వ్యాసకర్త జీవితం వ్యాసగతంగా వుంది. ఇంతగా పూర్వం వ్యాసకర్త జీవితం తెలియదు. ఈ రచయిత గుండె సంపూర్ణంగా, యథాతథంగా మిక్కిలి వాస్తవికంగా వ్యాసాలలో గోచరమయింది.

ఈ సంపుటాలలోని వ్యాస శీర్షికలు 'విద్య', 'భాష', 'నేడు' వంటి చిన్నవీ, 'పిఠాపుర ప్రభువు లేటు శ్రీ గంగాధర రావుగారి కథలు', 'యెనీమా వల్ల కడుపు తేలిక పడ్డట్లే సినీమా వల్ల యిల్లు తేలిక పడుతుంది' వంటి పెద్దవీ ఉన్నాయి. పుటల పరిమితి విషయంలో విమర్శన గ్రంథమంత వ్యాసం 'బమ్మెర పోతనామాత్యుడు' (పుటలు 143). 'నేనూ మా తిరుపతి శాస్త్రుల్లూ', 'శుభస్యశీఘ్రమ్' వంటి వ్యాసాలు (పుటలు 78, 70) ఎక్కువ పుటలే ఆక్రమించాయి. మొత్తం ఏభైకి పయిన పుటలున్న వ్యాసాలు అయిదు మాత్రమే అయినా, ఏభై, ఇరవై పుటల మధ్య నాదాపు పాతిక వ్యాసాలున్నాయి. మిగతావి ఇరవై పుటలకంటె తక్కువ. విశాలంగానూ, అవిశాలంగానూ ఉన్న ఈ వ్యాసాలు విస్తృత వ్యాసావకాశం కూడా చూపుతూ, తెలుగు వ్యాస పరిణామం కొంతవరకు ప్రదర్శిస్తున్నాయి.

ఈ వ్యాసాలలో మిక్కిలి విస్పష్టంగా గోచరించే అంశం వ్యాస విషయం వరకే రచనం, ఆలోచనం పరిమితం కాకపోవటం. ఒక వ్యాసంలో

మరో సంగతి వ్రాస్తూ, అలా జరిగిందని గుర్తించి, వ్యాసాంతంలో ప్రారంభాంశం వివరించటం చాలా వ్యాసాలలో గమనింపవచ్చు. ''యేదో వ్రాస్తూ దేనిలోకో వచ్చాం. అసలేమో వ్యాసం కవుల భిక్షాటనాన్ని గురించి ఆరంభం. ముగించే సమయానికి గాయకులు వచ్చి కలిశారు. అంతలో నేటి పెండ్లి కట్నాలు వచ్చి కలిశాయి'' (కథలు–గాథలు, ప్రథమ భాగము, పుట 330) వ్యాసం ఒక విషయం మీదే లగ్నం కావలసి వున్నా, తత్సంబంధి భిన్న సంగతులు స్పృశిస్తూ విశృంఖలంగా పెరగటం ధర్మమే! ఈ శాఖా చంక్రమణం మిక్కిలి అధికంగా ఈ వ్యాసాలలో వుంది.

ఈ వ్యాసాలలో ఏ వస్తువూ సంపూర్ణంగా సంభావ్యం కాలేదు. విమర్శన వ్యాసాలు సత్యం కంటే వ్యక్తి ప్రాధాన్యంతో ఒప్పుతున్నాయి. శబ్ద విచారంలోనూ కొన్ని పదాలు–అన్యథా నిరూపణావకాశాలు కలవేనని రచయితే చివరకు అంగీకరించటం కూడా ఈ అసంపూర్ణతను తెలుపుతుంది.

ఈ వ్యాసాలలో రచయిత చదువరులతో మాట్లాడుతున్నట్టు, వివరిస్తున్నట్లు, విమర్శిస్తున్నట్లు, సంభాషిస్తున్నట్లు కనిపిస్తుంది. మిత్రులిద్దరు తరతమాలు మర్చిపోయి, గుండె పుటలు విప్పి చదువుకొంటున్నట్లు, కలిసి ఆలోచిస్తున్నట్లు, అనుభూతి చెందుతున్నట్లు, కొన్ని వ్యాసాలు గోచరమవుతున్నాయి. ఈ వ్యాసాలు రచయిత మైత్రీయుతంగా చేసే సూచనలుగా గ్రహింపవచ్చు.

ఈ వ్యాస వచనం విమర్శన సందర్భంలోనూ వివాద విషయంలోనూ సృజన ధర్మమే ప్రదర్శించింది. సృజన పరిధి ప్రవర్తకంగా ఉంది. అల్పంగా హాస్య గుణం ఆరోగ్య ప్రదమయిన భావ వ్యక్తీకరణ సారళ్యం గోచరమవుతున్నాయి. ఈ వ్యాసాలు ఉత్తమంగా, లక్షణబద్ధంగా, విషయ వైవిధ్యంతో ఒప్పుతున్నాయి.

సాధారణంగా ప్రతి వ్యాస ప్రారంభంలో ప్రధాన విషయ వివరణంగా కాని, ప్రముఖ ప్రతివాద విమర్శనంగా కాని, ఉంది. వ్యాసం మొదటి నుంచి విషయ చర్చ చేయటమే గమనింపవచ్చు. ఎక్కడోతప్ప ప్రారంభంలో సంబోధనం లేదు. వ్యాసాంతంలో ప్రధాన విషయంలోని చివరి అంశమే

వుంటుంది. సాధారణంగా వ్యాసంలో ముఖ్య విషయం పునరుద్ఘాటించటం కనిపించదు. ఆశీరర్థకంగా వ్యాసం ముగిసిపోవటం కొన్నిసార్లు జరిగింది. అయితే 'ముగిస్తున్నాను' అనే ఎక్కువ వ్యాసాలలో చివరవుంటుంది, 'ఆపుతున్నాను', 'ఇంతే వ్రాసేది', 'స్వస్తి' వంటి ముగింపులూ ఉన్నాయి.

వ్యాసాలలో ఆంగ్ల నిర్వచనాలు లేవనవచ్చు. సంస్కృత నిర్వచనాలెక్కువ. ఆంధ్ర పద్యోదాహరణలు తక్కువ. తమ రచన లుదాహరించటం చూడవచ్చు. ఆంగ్ల పదాలు ఉరుదూ పదాలు ప్రయోగం అధికంగానే వుంది. రచన సరళంగా, విషయబోధ సులభంగా ఉన్నాయి.

వ్యాస భాష వ్యావహారికం. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి అంతటి మహా పండితులు కవులు విమర్శకులు వ్యాస సృష్టికి వ్యావహారిక భాష అంగీకరించటం వల్ల దానికి ప్రాచుర్యం కలిగింది. పత్రికలు గ్రాంథికం నుంచి వ్యావహారికం వైపు మొగ్గు చూపటానికి ఇటువంటి రచనలు కొంతవరకు దోహదం చేశాయి. వ్యావహారికంలో విమర్శనం సాధ్యమని ఈ వ్యాసాలు ఋజువు చేశాయి. అంతే కాదు, విద్యా రంగంలో కొంతవరకు బోధనం పఠనం వ్యావహారిక భాషలో జరగవచ్చునని అంగీకరించిన ఈ వ్యాసకర్త క్రాంతదర్శి. కందుకూరి వచనం ఆధునికంగా రూపొందిస్తే తిరుపతి వేంకటకవులు పద్యం నవీనం చావించారు. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి భాష వ్యావహారికంగా గ్రహించి, విస్తృత వ్యాస రచన కావించాడు.

## నిర్మాణ వ్యాసం :

రచనాగుణం పురస్కరించుకొని పరిశీలిస్తే ఈ వ్యాసాలు రెండే రీతులుగా ఉన్నాయి. వివరణాత్మకం, విమర్శనాత్మకం అయిన ఈ వ్యాసాలు దాదాపు సరిసమానంగా ఉన్నాయి. సాహిత్య, వివాద, శబ్ద చర్చలుగా సాగిన రచనలు ప్రాథమికంగా విమర్శనాత్మకంగా ఉన్నాయి. సంఘ విషయాలు, ఇతరేతరాంశాలు తెలిపే వ్యాసాలు ప్రముఖంగా వివరణాత్మకంగా ఉన్నాయి.

ఒక కవి కావ్యవైశిష్ట్యమో, కవితధర్మమో, కావ్య ఘట్ట రమణీయకమో, శబ్దౌచిత్యమో తెలుపుతూ, తమ సాహిత్య నింద చేసిన వాళ్ళకో, తప్పులు చూపిన వాళ్ళకో, తన విమర్శనంలో దోషాన్వేషణ చేసిన వాళ్ళకో, చులకన

చేస్తున్న గురువులకో సమాధానం చెప్పటంలో సాహిత్య కృషి అంతా విమర్శ నంగా సాగింది.

తెనాలి రామలింగ కవి కవిత్వమో, బమ్మెర పోతన కవితో, ఆంధ్రీకరణ విధానమో, తిక్కన నైపుణ్యమో, వైకర్తన శబ్ద విచారమో, ఏని శబ్ద సమాచారమో, అపవాదులకు సమాధానమో, నీలాపనిందలకు ప్రత్యుత్తరమో, ఇస్తూ వ్యాసకర్త చేసిన సాహిత్య సృష్టి విమర్శన రీతికి వన్నె పెట్టింది. విమర్శనం కవి కావ్య శబ్ద సంబంధిగా వ్యాసకర్త సాగించాడు.

సంఘంలో ఉత్తమ శీలంవల్ల, జీవితం వల్ల, సాహిత్యంలో ప్రసిద్ధులైన వ్యక్తుల స్వరూప స్వభావాలు, ఆలోచనా రీతులు తెలపటంలో, సామాజిక లక్షణాలు విస్పష్టంగా తెలియచెప్పాలనుకోవటంలో, నూత్న కవితాలక్షణాలు ఆధునిక సాహిత్యం పరిశీలించటంలో, గురు, సాహిత్య, మిత్ర విషయాలు తన జీవితంలో అనుసంధించి తెలపటంలో; వివరణాత్మకంగా వ్యాసం రూపొందించాడు వ్యాసకర్త.

రచయిత వెంకప్ప సోమయాజులు, అల్లంరాజు పేర్రాజులను గూర్చి వ్రాయటంలో; ఈతిబాధలు, గర్భాధానం మొదలైన సాంఘిక వ్యవహార చర్చలో; ఏది కవిత్వం, రామాయణ కల్పవృక్షం వంటి కవితాగుణ నిరూపణంలో; తన గురు పరంపరను, తన ముక్త్యాల పాలకొల్లు ప్రయాణాలను స్పష్టపరచటంలో; వివరణాత్మక వ్యాసం దృగ్గోచరమవుతుంది.

## విషయ వ్యాసం :

ఈ వ్యాసాలలో విషయాలు అనేకం. ప్రధానంగా సాహిత్యపరంగా అనేక వ్యాసాలున్నాయి. భిన్న విషయబోధకాలైన వాటి వివరాలివి:

| | | |
|---|---|---|
| 1. | సాహిత్య వ్యాసాలు | 123 |
| 2. | సాంఘిక వ్యాసాలు | 68 |
| 3. | జీవిత చరిత్ర వ్యాసాలు | 12 |
| 4. | భాషా వ్యాసాలు | 7 |
| 5. | ఆత్మకథా వ్యాసాలు | 6 |

6. స్త్రీ సంబంధి వ్యాసాలు 4
7. నాటక వ్యాసాలు 2

1. సాహిత్య వ్యాసాలు ప్రధానంగా రెండు భాగాలు. వివాద సాహిత్యం అధికంగానే వుంది. "తిరుపతి వేంకటకవులు ప్రభావతీ ప్రద్యుమ్న నాటకంలో పింగళి సూరన్న గారిని వెక్కిరింపబోయిరి" అన్న విషయం మీద వాదోప వాదాలుగా సాగిన చర్చలు, పాండవాశ్వమేధ ఖండన మండన వాదాలు, నన్నయ భట్టు సాహిత్య విమర్శ మీద వాదోపవాదాలు, గురు శిష్యుల శ్రీపాద, చెళ్ళపిళ్ళ సాహిత్య ప్రవాదాలు వ్యాసాలుగా సాహిత్యంలో వివాద సంబంధిగా ఉన్నాయి.

ఇవిగాక కవిపోషకులు, ప్రాచీనాధునిక పండితులు, సారస్వత సిద్ధాంతాలు, కవులు గ్రంథ పరిశీలనలు, పద సాధుతాచర్చలు, కవుల ఆర్థిక స్థితి, గురు సంబంధాలు తన సాహితీ కృషి తెలిపే విమర్శన వివరణాత్మక వ్యాసాలు సాహిత్య సంబంధంతో ఉన్నాయి.

2. ఈ రచయిత ఈతిబాధలు, పాతవీ కొత్తవీ తెలుపుతూ, గర్భాదానం సస్యగర్భ భూదానం వివరిస్తూ, మద్యనిషేధం, అహింస, క్షమ, పశ్చాత్తాపం స్పష్టపరుస్తూ, సినీమా వల్ల డబ్బు దండుగ కావటం బోధపరుస్తూ, సామెతల ప్రయోజనం, పౌరాణికుల సామాజిక స్థితి వ్యక్తం కావిస్తూ, గాంధీ వైశిష్ట్యం గుర్తింప చేస్తూ, లంచం తప్పుగా తెలుపుతూ సాంఘిక వ్యాసాలు వ్రాశాడు.

3. వ్యక్తి జీవితంలోని వైశిష్ట్యంకానీ, సాహిత్యంలోని ఔన్నత్యం కానీ, ఆరాధ్యంగా ఉన్నప్పుడు ఆ వ్యక్తులు సారస్వతంలో చిరంజీవులని నిరూపించే వ్యాసాలు ఈ వ్యాసకర్త కొన్ని వ్రాశాడు. గంగాధర రామారావు, వెంకప్ప సోమయాజులు, నర్సన్న [వ్యాసకర్త ముత్తాత], ఆదిభట్ల నారాయణదాసు, అల్లంరాజు పేర్రాజు, చిలుకూరి వీరభద్రరావు, జయంతి రామయ్య పంతులు, కృష్ణారావు, గూడూరి వియ్యన్న, బెల్లంకొండ రామరాయకవి మొదలయినవాళ్ళ కృషి శాశ్వతంగా అక్షరరూపంగా నిలచే వ్యాసాలుగా ఈ రచయిత సృష్టించాడు.

4. రచనలో వ్యావహారికం ప్రయోగించి, భంగ్యంతరంగా స్వీకరించటం చెప్పి, స్పష్టంగాను చెప్పి, గిడుగు ఉద్యమానికి హార్థిక దోహదంచేశాడు చెళ్లపిళ్ళ

'జలతాడనం', 'అంతా రామమయం', 'గారు శబ్దవిచారం' లలో కనిపించే వ్యావహారికదృష్టి గ్రామనామాలు వ్యక్తినామాలలో చూపిన భాషాదృష్టి, 'గిడుగు పిడుగా?' వ్యాసంలో తెలిపిన అభిప్రాయం వ్యాసకర్త మన స్తత్వంలోని ఆధునికతను ప్రదర్శించాయి. అయితే ఆధునిక కవితను తిరస్కరించడం, తమ కవితకు ప్రాచీనమని తిరస్కారం రాకూడదన్న ఆశవల్ల కావచ్చు.

5. ఆత్మస్తుతి ఆత్మనింద పరస్తుతి పరనింద పనికిరావని వ్యాసోక్తి అయినా ఈ వ్యాసోక్తి కాలేదు. రచయిత జీవితం తెలియకపోవటంవల్ల సాహిత్యానికి అనర్థకం వాటిల్లవచ్చు. ఏమయినా, ఈ సంపుటిలో గురుపరంపరనూ, ప్రయాణాలను తెలుపుతూ వ్రాసిన వ్యాసాలు ఆత్మకథా ప్రాధాన్యంతో ఉన్నాయి. రచయిత జీవితం కాంతిమంతంగా వ్యాసాలలో గోచరమయి, వ్యక్తిత్వావగాహనకు దోహదమయింది.

6. అనంత సాహిత్య సంసారంలో శిరోదఘ్నంగా మునిగిపోయిన సాహితీతపస్వికి సాంఘిక జీవితంలోని వ్యత్యాసాలు బాధకాలు అయ్యాయి. అందులో ప్రధానంగా స్త్రీ విషయికమైన వ్యాసాలు. 1937లో కళలకోసం దేవదాసీ జాతి ఉందనీ, ఆ స్త్రీలు స్వతంత్రలుగా ఉండాలని కాంక్షించటం, 1948లో శారదాబిల్లు ఆవశ్యకం గుర్తించడం, మరణానికి రెండేళ్ళముందుగా స్త్రీ జాత్యభ్యుదయం వాంఛించటం, రచయితలోని భావపరిణామం ప్రదర్శించాయి.

7. 'గురుశిష్య ప్రశ్నోత్తరములు', 'గురుశిష్య ప్రశిష్య నాటకం' అనే వ్యాసాలు సంభాషణాత్మకంగా ఉన్నాయి. వీటిలో విషయం వివాద సంబంధమైంది. వాదోపవాదాలు తెలిపే సందర్భంలో నాటక శిల్పం స్వీకరించటం వ్యాస రచనా పరిణామంగా గుర్తింపవచ్చు.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి ప్రాచీనత పాదులో పుట్టి, ఆధునికత పునాదిలోకి సాగి వ్యాససృష్టి కావించాడు. కవిత్వంలో లాగా వ్యాస రచనంలో నూత్న యుగారంభం చేశాడు. సాహిత్య విమర్శనం సృజనంగా చేసి, విపుల ప్రచారం ప్రక్రియకు ఆర్జించి పెట్టాడు. ఆధునిక వచనం గుండె దగ్గరగా, వ్యావహారికంగా రూపొందించాడు. వ్యాసం జనాదరణ పొందటానికి ముఖ్యకారకుడయ్యాడు. తెలుగు సారస్వతంలో ఈ వచన రీతి, ఈ వ్యాస రచనా విధానం, నూత్నకాంతిని, క్రొత్త యుగాన్ని కలిగించాయి

## 2. భమిడిపాటి కామేశ్వరరావు

హాస్య రచయితగా ప్రసిద్ధి పొందిన భమిడిపాటి కామేశ్వరరావు వ్యాస సంపుటాలు 'అవును' 'తనలో' 'మేజువాణి' 'లోకోభిన్నరుచి' 1930-1948 మధ్య కాలంలో ముద్రితాలయినా, వీటిని 1925-1944 సమయంలో వ్రాయటం జరిగింది. ఈ వ్యాసాలు రచయిత లోక దర్శనాన్ని ప్రతిబింబిస్తూ ఉన్నాయి.

ఈ వ్యాస ధర్మం ప్రధానంగా హాస్యంగా వుంది. ఏ విషయం స్పృశించినా హాస్య చతురోక్తితో వివరించటం రచయిత విధిగానిర్వహించాడు. ఈ హాస్యం చాలా సున్నితంగా కోమలంగా ఉంది. కాఠిన్యంలేని పరిహాసం హృదయక్షాళన సమర్థమై, మానసిక విశ్రాంతిని ప్రసాదించేంత సరసంగా హాస్యంగా రూపొందింది. ఈ రచయిత ఇతర వాఙ్మయంలో సాధించిన హాస్యం కంటే వ్యాసంలో నిక్షిప్తం చేసిన హాస్యం విశిష్టంగా ఉంది. సున్నితంగా ఉంది.

''ఆయనకి స్థిరాస్తి భార్య. చరాస్తి తనే'' (పల్లెటూరు స్కూలు తణిఖీ-అవును-పుట 90)

"కావలసినంత బలం వుంది రైలుకి. అన్ని పుట్లు ఇనప సామ్రగే కూడా ఒక్క నర మానవుడు ఎల్లా చెబితే అల్లా వింది. వొదిలిపోయింది'' (తమ్ముడి పెళ్ళికి తల్లి వెళ్ళడం- అవును-పుట 65) ఇంత హాస్య ప్రధానమైన సృష్టి తెలుగు వ్యాస వాఙ్మయంలో లేదనవచ్చు.

ఈ వ్యాసాలలో సృజన గుణం, రచయిత వ్యక్తిత్వం బాగా పరికింపవచ్చు. అధ్యాపక వృత్తితోనూ, నాటక కళతోనూ సంబంధం ఉన్న రచయిత సృష్టించిన వ్యాసాలలో చాలా భాగం ఆ విషయాలు మీదె సాగాయి. స్వీకృత వస్తువు సృజనంగా రచయిత అనే శంఖంలోనుంచి తీర్థంగా అవతరించటం దర్శింపవచ్చు. ''దీనికి ఏడుగూ పొడుగూ లేదు. అంటే, ఇది గొత్తితోక లాంటిది. ఇన్నిస్ పేట బ్యాంకు లాంటిది. మన అపనా తనామనా లాంటిది. బంట్రోతులు ఉండరు. ఏమి సప్లయిలు రావు. పలుకుబడి ఉండదు . . . మాట్లాడితే త్రికరణశుద్ధి [illegible] అన్నమాట. శుభాశుభాలు ఆ జీతంలోనే, పెన్షన్ అంటులోనే, [illegible] అంటులోనే, [illegible] కొమ్ములా అంటులోనే. దేవుడు

ఖర్చు దెయ్యాల ఖర్చు అందులోనే. సంసారం అంతా అందులోనే. దేశం అందులోనే. ఆస్తులు లేని వారసు తద్దినాలు అందులోనే, బేవారసు తద్దినాలు అందులోనే.'' (మేష్టరీ కూడా ఒక ఉద్యోగమేనా?-అవును-పుటలు 18, 19) ఇటువంటి ఉదాహరణాలు రచయిత జీవిత దృక్పథం కొంతవరకు వివరిస్తూ ఉన్నాయి.

వ్యాసాలలో అనేక విషయాలు ప్రసక్తమయ్యాయి. విద్యావిషయికంగా ఉన్న వాటిలో అధ్యాపకవృత్తి అగౌరవం పొందుతూ వుందనీ, ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపనంలో పట్టుదలలు గోచరమవుతున్నాయనీ, పల్లెటూరుబడి తనిఖీ చేయటం ఒక తంతుగా మారిందనీ తెలిపాడు రచయిత.

నాటక కళా సంబంధి వ్యాసాలు వివరణాత్మకంగానూ, హాస్యసహితంగానూ ఉన్నాయి. 'వన్స్‌మోర్' అంటే మూర్ఛిల్లిన సత్యవంతుడు లేచి పద్యం పాడి మళ్ళీ మూర్ఛపోవటం, నాటకం-టాకీ సంబంధం, తేడాలు గుర్తించటం, గాన ప్రశంసలో తదాధిక్యం, వైవిధ్యం, పరికించటం; మేజువాణి వ్యామోహంలో అవకతవకలు, త్యాగరాజు సంగీత మాధుర్యం ఔన్నత్యం దర్శించటం; ఆకాశవాణిలో కళా ప్రయత్నం గమనించటం; వ్యాసగతంగా రచయిత తెలిపాడు.

సాంఘిక విషయ విస్తృతాలయిన వ్యాసాలలో పెళ్ళికి తరలి వెళ్లటం, విమానం చూడటానికి మోజు పడటం, బస్తీరోడ్లు, అయోమార్గం, రైల్వే భోజనం, వోటు మొదలైన అనేకాంశాలు సృజనంగా ఉన్నాయి.

ఈ వ్యాసాలలో క్రమక్రమంగా హాస్య దృష్టి సన్నగిల్లింది. దాని స్థానంలో ఆలోచన ప్రబలింది. ఇది రచయిత బుద్ధి పరిపక్వతకు నిదర్శనమయినా, పాఠక సాన్నిహిత్యం ఈ వ్యాసాలు హాస్యలోపం వల్ల పోగొట్టుకునే ప్రమాదముంది. త్యాగరాజు పాటలను గూర్చి చెబుతూ కీర్తనకు నిర్వచనమివ్వటం చూడవచ్చు, ''కవిత్వ గానాల అనుకూల దాంపత్యంతో మేళవించిన రంగమే కీర్తన'' (మేజువాణీ-పుట 133). ఇందులో ఉన్న సృజన ధర్మం తర్వాత నిర్వచన ప్రాయ రచనంలో లక్ష్యమయింది. ''అభిరుచి బంధ, మోటు, సున్నితం అవడాన్నిబట్టి జీవితం అసారం శాశ్వతం దివ్యం అవుతుంది. ఒక

సామ్రాజ్యానికి మొద్దు స్వరూపపు రాజుగా పుట్టేకంటే దరిద్రుడైన నభిరుచులు కలవాడుగా పుట్టడం వెయ్యివేలు'' (లోకోభిన్నరుచి పుటలు 56, 57) మొదటి భాగంలో హృదయ నైశిత్యం, రెండో భాగంలో లేకపోగా ఆలోచనాబలం చేరి హాస్యానికి రచనను దూరం చేసింది.

వ్యావహారిక భాషలో వ్యాస సృష్టి కావించిన రచయిత గోదావరి మాండలికం విస్పష్టంగా రచనలోకి తెచ్చాడు. ''ఆయనకి భాగోతాలూ తోలు బొమ్మలూ పగటి వేషాలూ మేజువాణీలు ఏమిష్టమో యిష్టం'' (మేజువాణీ-పుట 6) ఏమిష్టమో లోని 'మో' ఎంతగా సాగదీస్తే అంగా ఇష్టం వ్యక్తం కావటం ఈ వ్యావహారికంలోనే సాధ్యం.

పద ప్రయోగంలో సృజనాత్మకత వల్ల హాస్యం ఆవిర్భవించింది. ట్యూషను బోధనా వ్యభిచారంగా, విదిన్ బ్రాకెట్సులో కోపపడటంగా, అవన్నీ అప్పుళ్ళుగా (అప్పుడు-బహువచనం), You how much అంటే You how much (నువ్వెంత) అనటంగా పద ప్రయోగ వైచిత్ర్యం వుంది.

భమిడిపాటి కామేశ్వరరావు వ్యాసాలలో ప్రధానంగా నూత్నంగా ఉన్న గుణం హాస్యం ఇంత హాస్య ప్రాముఖ్యమున్న సృష్టి పూర్వం లేదనవచ్చు. సృజనాత్మకత, వ్యక్తిత్వ ప్రాధాన్యం కలసి నిర్మించిన ఈ హాస్య ప్రధాన వ్యాసాలు, వ్యాస పరిణామ ప్రదర్శకాలు.

## 3. తుంపూడి భగవంతం గుప్త

వ్యాసావళి 1955 లో ముద్రించినా, ఈ వ్యాసాలు 1931-39 మధ్య కాలంలో రచితమయి, 'వాసవి' పత్రికలో ముద్రింపబడి, ప్రచారమయ్యాయి ఈ సంపుటిలో చేరని వ్యాసాలింకా అనేకం ఉన్నాయని 'వ్యాసావళి' వల్ల తెలుస్తుంది.

వ్యాసంలో రచయిత వ్యక్తిత్వ ప్రధానంగా ఉండాలన్న అభిప్రాయం ఈ సంపుటి బలపరచటం చూడవచ్చు. ప్రత్యక్షరంలోనూ, సంఘోద్ధారక, విమర్శక చక్రవర్తి రావుబహద్దరు తంపూడి భగవంతంగుప్త వ్యక్తిత్వం గోచరమవుతుంది. ఈ వ్యక్తిత్వం ఆవేదనను కలిగిస్తుంది. దీనికి హేతువు సంఘంలోని అవ్యవస్థ. ఇంకా లోతుగా పరికిస్తే వైశ్యులను తక్కువగా చూడటం

భరించలేని ఆవేదన వ్యాసకర్తను పీడించింది. ఈ ఆవేదనే అభివ్యక్తిగా వ్యాస సృష్టి జరిగింది. జాతి ప్రాముఖ్యం వ్యాసంలో అవతరించటం గమనార్హ పరి ణామం. ఆర్యవైశ్యులు ఆధిక్యం ఉన్నవాళ్ళని, వాసవకన్యక ప్రాముఖ్యం తెలు పుతూ, కోమట్లు ఆర్యులని వివరిస్తూ, వైశ్యస్త్రీలు శూద్రస్త్రీలవలె పాపయోను లనటం ''మానవ దేహము లన్నింటి యందును ప్రకాశించు ఆత్మ ఒకటియేయని బోధించుచున్నను అణగద్రొక్కి యుంచిన భేదభావము అక్కడక్కడా పైకి ఉబుకుట వ్యాస మహర్షియందు కూడ తప్పలేదు'' (పుట 60) అని విశదీకరిస్తూ తెలిపితే కాదని గుప్త వ్యాసాలు వ్రాశాడు.

ఈ వ్యాసాలలో సృజన ధర్మం విస్పష్టంగా వుంది. రచయిత ''కష్టము లేనిదే సుఖము లేదు. నాశనము లేనిదే ఉత్పత్తి లేదు'' (పుట 16) వంటి నిర్వ చన ప్రాయ సత్యాలు ప్రకటించాడు. రచయిత ప్రతివాద సామర్థ్యానికి 'వేద కర్మాధికారము' వ్యాసం నిదర్శనం. చిలుకూరి వీరభద్రరావు ఆంధ్రుల చరిత్ర అయిదో సంపుటంలో కోమటి జాతి నిరూపణ చేస్తూ అనార్యులని, దస్యులని ఈ వ్యాసకర్త వాదించాడు.

ప్రాచీనమయిన నమ్మకాలు హేతుబుద్ధికి కొన్ని అసహ్యంగా కనిపిం చటం సహజమే! వాటిని తొలగించటానికి రచయిత ప్రయత్నం దర్శింప వచ్చు. 'శ్రీకృష్ణ భగవానుడు' ఆర్య సిద్ధాంతపు పునాదులు సంచలించే పరి శోధన, 'భగీరథ నిర్వహణము' సంప్రదాయ భిన్నంగా ''కథను విప్పి చూడగా భగీరథుడు గొప్ప ఇంజనీరయి యుండినట్లు ఏర్పడుచున్నది'' (పుట 75) అని చేసిన ఆలోచన, సవిమర్శకంగా ఉన్నాయి.

జిల్లా అధికారిగా పనిచేసి విశ్రమించిన తుంపూడి భగవంతం గుప్త ''చిక్కని చక్కని శైలిలో'' (వేదము వేంకటకృష్ణశర్మ) ''చదువరులలో ఆలోచనను ప్రకోపింపజేయు గ్రంథమీ వ్యాసావళి'' (మల్లంపల్లి సోమశేఖర శర్మ) రూపంలో అందించాడు.

ఈ వ్యాసాలు సంఘ సంస్కరణాది సంగతులకు సంబంధించి వున్నాయి. మత జాతి విషయాలలో పరిణామం కాంక్షించటంతో పాటు, కుటుంబ వ్యవస్థ

బాగు పడాలనీ, మానవుడి అభ్యుదయం స్థిరం కావాలనీ, పశుబలం పనికి రాదనీ, తద్దినాలు వ్యర్థాలనీ, ఆంధ్రులలో ఆడపెత్తన ముందనీ, 'ఆఁడువారి యేలుఁబడి' జరిగిందనీ ఈ వ్యాసాలు తెలుపుతున్నాయి.

రచయితలో శాస్త్ర దృక్పథం విశిష్టంగా ఉంది. క్షీరసాగర మథనం విజ్ఞాన శాస్త్ర పరిశీలనగా భావించటం, బాల పోషణ సక్రమంగా చేయటం, కాలం చలనం కొలతగా తలపోయటం, గంగావతరణం గొప్ప 'ఇంజనీరు' కార్యంగా గ్రహించటం చూడవచ్చు.

చరిత్ర దృష్టివల్ల వ్యాస నిర్మాణం నూత్నాంశ శోభతో ఒప్పింది. కందుకూరి వీరేశలింగం పంతులు 1931 డిసెంబరు 11 న జరిపిన ప్రథమ వితంతు వివాహపు అర్ధ శతాబ్ది వర్ధంతి సభకు అగ్రాసనాధిపతిగా గుప్త ఇచ్చిన ఉపన్యాసం సంఘ సంస్కరణాభిలాషను స్పష్టంగా తెలిపింది.

రచనం సృజనంగా సాగించి, వ్యక్తి ఆవేదన నింపి, మత మౌఢ్యం తొలగాలని కోరి వైశ్యజాతి ఆధిక్యం వివరించి, సామాజిక చైతన్యం వాంఛించి, శాస్త్ర చారిత్రక దృక్పథం ప్రదర్శించి, వ్యాస సృష్టి కావించిన **తుంపూడి భగవంతం గుప్త వ్యాసావళి, రచయిత హృదయ ప్రతిబింబంగా ఉంది.**

## 4. శ్రీ తాపీ ధర్మారావు

కేంద్ర సాహిత్య ఎకాడమీ బహుమతి విజయ విలాస వ్యాఖ్యానా'నికి' పొందిన శ్రీ తాపీ ధర్మారావు (తాతాజీ) రచనలు విశాలాంధ్ర ప్రచురణాలయం ప్రకటించిన 'కొత్తపాళీ' (1955), అన్నపూర్ణ ప్రచురణలు ప్రచురించిన 'సాహిత్య మొర్మొరాలు' (1961) 'ఆలిండియా అడుక్కుతినే వాళ్ళ మహాసభ' (1961) లలోని వ్యాసాలు 1936-41 మధ్య కాలంలో వ్రాశాడు. అప్పటిలో ఇవి ప్రజామిత్ర, కాగడా పత్రికలలో ముద్రించాడు. మొదటి రెండు సంపుటా లలో సాహిత్య వ్యాసాలు 26, మూడో పుస్తకంలో సాంఘిక వ్యాసాలు 14. మొత్తం 40.

శ్రీ తాపీ ధర్మారావు ఈ వ్యవస్థ పట్ల, దీని మూర్ఖత పట్ల అనివార్య మయిన అసహ్యాన్నీ, వ్యథనూ, దుఃఖాన్నీ పొంది, సారస్వతం తన్నివారణో పాయంగా శరణు చొచ్చినట్లు ఈ వ్యాసాలు తెలుపుతున్నాయి. పూర్వ సాహిత్య

నియమాలు, సిద్ధాంతాలు, ఉల్లంఘించటం అవసరమన్న ధోరణితో పాటు, వాటి నీడన బ్రతుకుతున్న వాళ్ళను సహించలేకపోవటం కూడా పరికింపవచ్చు. సమాజంలో హెచ్చుతగ్గులు చూడ లేక వ్యథ పొందిన వ్యాసకర్త "ఉండడమో, లేక పోవడమో, ఉన్న వాళ్ళందరికీ ఒక్కలాగునే ఉండాలి" (ఆలిండియా అడుక్కుతినే వాళ్ళ మహాసభ-పుట 102) అన్నాడు.

వ్యాస నిర్మాణంలో సృజన శక్తి అధికంగా నిండివుంది. వ్యాస సంపుటాలకు పేర్లుంచటం దగ్గర్నుంచి ఈ సామర్థ్యం స్పష్టమవుతుంది. వ్యాస శీర్షికలు కూడా ఈ అంశం రుజువు చేస్తాయి. ఉదా. నియమాల పంజరం, పూల బజారు సరసాలు. దీనికి సాహిత్య విమర్శకుడయితే పుష్పలావికలు అనే పేరు పెట్టవచ్చు. ఈ ధర్మం ప్రతివాక్యం దృగ్గోచర మయ్యేటట్టు చేస్తుంది. ఉదా. "కవిత్వానికే గర్భాదానం కల్పించారు" (కొత్తపాళీ-పుట 218) "తలంతా కళ్ళు పెట్టుకొని ప్రజల జీవితం గ్రహించాలి" (కొత్త పాళీ-పుట 230) ఇటువంటి వాక్యాలు ఎన్నయినా ఉదాహరించవచ్చు. ఈ వ్యాసకర్త సృజన నిర్మాణంలో గుండె బలంతో ఆవేశ బలం తోడైంది. రక్తం ఉడికింది. ఉడుకెత్తిస్తుంది.

ఈ 'తాతాజీ రచనలు' లో శ్రీ తాపీ ధర్మారావు వ్యక్తిత్వం నిండి, బాహాటంగా కనిపిస్తుంది. ఈ వ్యాస సృజన ధర్మానికి వ్యక్తిత్వం ఆయువుపట్టు. అది విరాట్ రూపం దాల్చి సర్వత్రా దర్శనమిస్తుంది. "బూటకాలకి మారువేషాలకీ నా మనసొప్పుకోలేదు. కాబట్టి నిజం చెప్పాలి అని నిశ్చయించుకొన్నాను. ఎవ్వరేమన్నప్పటికీ నిజం తెలియజేయడమే సరి అయిన పని అని అనిపించింది దాని ఫలితమే ఈ కొత్తపాళీ" (పుట 11) ఇంతేకాదు. "కొంత శ్రమపడి ఈ గ్రంథాన్ని గురించి కొంత తెలుసుకున్నాను." (పుట 145) "మొదట ఏలాగా అడుక్కోవటమో నేర్పారు; తరువాత అడుక్కొనే వాడిని ఎన్ని అవస్థలు పెట్టాలో చూపుతున్నారు" (ఆలిండియా అడుక్కుతినే వాళ్ళ మహాసభ-పుట 81) ఈ వ్యాసాలలోని ప్రతివాక్యం రచయిత వ్యథ నుంచి ఆవిర్భవించింది; ఈ వాక్యం ఈ రచయితే వ్రాయటం కుదురుతుంది-అనదగ్గ వాక్యాలున్నాయి. రచయిత ఆవేదన, కోపం, అధిక్షేపం మిళితమయిన వ్యాస సృష్టి, ఇంతకుముందు లేదనవచ్చు.

శ్రీ తాపీ ధర్మారావు ఆవేశం వ్యాసాలలో అక్షర రూపం పొందింది. దానం చేసే స్వభావం స్వార్థంతో కూడిందని రచయిత ఆవేశానికి లోనైపోయాడు. ''ధర్మానికి దానం అన్న పేరు పెట్టిన భూలోక బ్రహ్మలు అడుగుకొనే వాడిని సృష్టి చేశారు. అడుగుకొనే వారిని అడవి మృగాలుగా చేసినవారు ఈ మహాదాతలు. వీళ్లలో ఎవరిని ఎక్కువగా గౌరవించాలో నిర్ణయించడం కష్టం. వారు బ్రహ్మలైతే, వీరు సృష్టికి ప్రతిసృష్టిచేసిన విశ్వామిత్రులు. వీరిద్దరికి చేయెత్తి జోహారు చేయడమే మహా ఉత్తమం'' (ఆలిండియా అడుక్కుతినే వాళ్ళ మహాసభ-పుట 73). దాతలకు కలిగే పాతకాలు లోనూ, 'రేపు, మాపు' దాతలు లోను ఈ ఆవేశం విస్పష్టంగా దర్శింపవచ్చు. రచయిత ఆవేశపు తీవ్రతలో భాషను చెర్నుకోలతో బాది అదిలించాడు.

శ్రీ తాపీ ధర్మారావు వ్యాసాలలో రచనా ధర్మం, వ్యాస నిర్మాణ సంబంధిగా పరికింపవచ్చు. ప్రధాన వ్యాస విషయం చిన్న అంశాలుగా విభజించిన పేరాకు ఒక శీర్షిక ఉంచటం జరిగింది. ఉదా. 'తలబరువు అని ఆక్షేపణ' అని శీర్షిక అపసర మేమిటి అన్న వ్యాసంలో చూడవచ్చు. అది వివరిస్తూ ''వ్రాతలు చూచినా చేతలు చూచినా తేలిక తలకాయలే ఎక్కువ కనబడతాయి. అంతే కాదు, తలలున్నాయా లేదా అన్న సందేహం కూడా కలుగుతుంది''. (కొత్త పాళీ-పుట 17). ఈ మూడు గ్రంథాలు మూడు ప్రధాన విషయబోధ కావిస్తున్న వ్యాసాలుగా వాటిలోని వ్యాసాలు భాగాలుగా చూడదగినంత వస్త్వైక్యం కలిగి వున్నాయి.

'కొత్త పాళీ'లో వ్యాసాలు ప్రధానంగా భాషకు నియమాలు ఎలా వుండాలన్న ఆలోచన మీద సాగాయి. భాష అందరికీ తెలిసేటట్లుండాలి. పదాలు వాడుకలో ఉండాలి. సంస్కృత నియామాలవల్ల తెలుగు భాషకు అపకారం జరిగింది. నియమాలు పంజరాలు కారాదు. అన్య భాషలు పరికించాలి. కవిత్వంలో చాదస్తాలు ఆపుచేయాలి అన్న ధోరణిలో రచన సాగింది. ''ఇదంతా బంధకవిత్వం అన్నారు. ఆ బంధాలతో ఆనందించారు. చిత్రవిచిత్రంగా ప్రవర్తించారు. మంచీ మర్యాదా చూడలేదు. విన్నవాళ్ళూ కన్నవాళ్ళూ ఏమనుకుంటారో అన్న చింత లేకుండా చెలరేగారు'' (పుట 218). ఈ వ్యాక్యంలో సృజన ధర్మం రచయిత వ్యక్తిత్వం, ఆవేశం 'సమపాళ్ల'లో మిళిత మయ్యాయి.

'సాహిత్య మొర్మొరాలు' భిన్న సృజన వ్యాస సంపుటి. కృష్ణ సత్యల కాలి తాపు కథ, కవిత్వంలో తాంబూల సందర్భం, కుకవి నిందాతత్త్వం, పుష్పలావికల అస్తిత్వం, వ్యర్థ పద పరిహార్య స్థితి, భోగకాంతల పరిస్థితి, అల్లసాని సంధ్యారాగ వర్ణన పరిశీలన, సాహిత్యంలో లోకోక్తులు, స్వాతంత్ర్యం, పోతన పెద్దనల కవితాగుణాలు ఈ వ్యాసాలలో పరిశీలించటం జరిగింది.

ఆలిండియా అడుక్కుతినే వాళ్ల మహాసభ బిచ్చగాళ్ళ వ్యవస్థమీద రచయిత బాధ తెలిపే వ్యాసాల సంపుటి. వీటిలో బాధ తీవ్రంగా ఉంది. బిచ్చగాడు ఇచ్చేవాళ్ళకు పుణ్యమిచ్చేవాడుగా భావింపవచ్చు. దేశస్థితిలో హెచ్చు తగ్గులు ఎక్కువయి, ఇచ్చేవాడు పుచ్చుకొనేవాడు రెండు వర్గాలే ఏర్పడటం పరికింపవచ్చు. ఇది పూర్తిగా బిచ్చగాళ్ళు-దాతలు సంబంధి వ్యాస సంపుటి.

ఈ వ్యాస సంపుటాలను గూర్చి రచయిత ''ఇదొక చిన్న సాహిత్య వ్యాసాల సంపుటి. ఈ వ్యాసాలు పండితులకోసం వ్రాసినవి కావు. పూర్వకవుల పరిచయం బాగా ఉన్న పాఠకుల కోసం వ్రాసినవీ కావు. ప్రబంధాలకూ, ప్రబంధకవులకూ కొంచెం దూరమున్న వారి కోసమే వ్రాశాను'' అని సాహిత్య మొర్మొరాలులోని ఒక్క మాటలో తెలిపిన రచయిత, వ్యాస రచన, వాటి ప్రయోజనం వివరించి ''ఏది ఏలాగున్న, అది విమర్శకులు వినవలసినదే, కాబట్టి మనవి చేస్తాను'' (పుట 82) అన్నాడు.

ఈ వ్యాసాలు వ్యావహారిక భాషలో రచితమయ్యాయి. అది సజీవభాషగా రూపొందింది. భాష అందరికీ తెలిసేటట్లుండాలనీ, జన సామాన్యానికి తెలిపే మాటలు వాడుక చేయాలనీ, అన్య భాషా పదాలు ఆంధ్రంలో కలిసిపోతే అభ్యంతరం లేకుండా ప్రయోగించాలనీ రచయిత తెలిపాడు. చిన్నయసూరి భాషను మనస్సులో ఉంచుకొని 'సూరి మరణం లేక బండిరా పల్లకి' అనే నాటిక వ్రాసి, కొత్తపాళీలో చేర్చాడు.

సహృదయత, పాండిత్యం, జనమంటే సానుభూతి ప్రేమ ఉండి, సృజన విమర్శన సృష్టి చేసి, వ్యావహారికం చేపట్టి, సంఘ సంస్కారణం వాంఛించి, సాహిత్య సోపానాలు అధిరోహించి, వ్యాసకర్తగా ఉన్నత స్థానంలో వున్న శ్రీ తాపీ ధర్మారావు సారస్వతంలో సముచిత స్థానం పొందాడు.

## 5. దిగవల్లి వేంకట శివరావు

రచయిత 'కథలు-గాథలు' నాలుగు సంపుటాలుగా 1944-47 మధ్య కాలంలో ముద్రితాలు. ఈ పేరు చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి వ్యాస సంపుటాలకూ ఉంది. దిగవల్లి వేంకటశివరావు వ్యాస సృష్టి చేయటం చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి తరువాతే అయినా 'కథలు-గాథలు' అని వ్యాస సంపుటాలకు పేరు పెట్టటంలో ప్రాధమ్యం పొందాడు.

దేశచరిత్ర రచనలలో, వ్యక్తుల జీవిత చరిత్రలలో, దిన చర్యలు, జాబులు, యాత్రా గ్రంథాలు, అనుభవాలు, జ్ఞాపకాలు మున్నగు వాటిల్లో, ప్రసిద్ధ వ్యవహారాలలో, మెకంజీ కైఫీయత్తులలో, బ్రౌన్ రచనలలో రచయితకు గోచరమయిన సన్నివేశాలు గ్రహించి, తన భాషలో సృజనంగా ఈ వ్యాసాలు వ్రాశాడు.

ఇందులో ప్రాచీనాధునిక సంగతులున్నాయి. భారత దేశాంధ్ర దేశ వ్యవహారాలున్నాయి. కవి పండిత విషయాలున్నాయి. రాజస్థాన సందర్భాలున్నాయి. తెల్లదొరల ఉద్యోగ ప్రసక్తి వుంది. మత బోధకుల జీవితం వుంది. సాహిత్య పరిశీలనం ఉంది. కావ్య విమర్శనం ఉంది. ఇవి భావి పరిశోధకులకు నూత్న సత్యాలు అనేక రంగాలలో అందించే సమర్థమైన వ్యాస సంపుటాలు. రచనంలో తప్ప విషయంతో రచయితకు నిమిత్తం లేదు. కాబట్టి వ్యక్తీకరణంలోనే రచయిత వ్యక్తిత్వం ఉంది. మేధావి, అనేక గ్రంథకర్త దిగవల్లి వేంకట శివరావు చేసిన ఈ సాహిత్య వ్యాస సృష్టి పరిశోధకులకు భిన్న విషయ సందర్శనం కావిస్తుంది.

## 6. రా. వేం. మ. గం. రామారావు

'సువిశాలమిదం విశ్వం' నవ్య సాహిత్య పరిషత్ పక్షాన 1945, పిఠాపురం యువరాజు రామారావు రచనగా ప్రచురితమయింది. ఇందులో 12 వ్యాసాలున్నాయి. ఆంగ్ల వ్యాస లక్షణ శోభితంగా, సృజన ధర్మ ప్రదర్శకంగా, రచయిత వ్యక్తిత్వ ముద్రతో, హాస్య కుశలతతో ఒప్పుతూ ఉన్నాయి వ్యాసాలు.

ప్రేమ, నవ్వు, దేవుడు వంటి ఆలోచనలు, ప్రకృతి. కొండలు-లోయలు వంటి సృష్టి, ప్రయాణం, ఆటలాడుకోటం వంటి సాంఘిక సంగతులు ఇందులో వ్యాసాలు. ప్రేమతత్వం వివరించటంలో రచయిత ఆవేశపు పొలిమేరలు దాటి, తాత్త్విక పరిధి చొచ్చి, రచన సృజన ధర్మం నిలిపాడు. ప్రేమ ''కాలం అంత దీర్ఘం ఐ, అవకాశం అంత వైశాల్యం కలిగి, రాళ్ళకంటె సామాన్యమై. అమృతం కంటె అపూర్వమై, చేదు గలిగి, తీపిలో కరిగి, భూకంపమై, పొంగు కదలియై, రంగులుకల ఇంద్ర ధనుస్సై, మెరిసే మెఱుపై, అశనిపాతం, ఆక్రోశరావమై, ఆనంద భైరవి రాగాలాపనయై, కన్నీరై. చిరునవ్వై'' (పుట 89) అనంతత్వం పొందటం గమనించి, సృజన ధర్మం గుర్తింపవచ్చు.

ఈ రచయిత వ్యక్తిత్వం బాహాటంగా వ్యాసాలలో గోచరమవుతుంది. తన ఇష్టానిష్టాలు ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ రచనంలో కనిస్తూ వున్నాయి ''నా కన్నిటిలోకి అందంగా కనిపించే నవ్వే దంటే, ఒక కంటితో కన్నీళ్ళు తళుకు కరిగిస్తూ, రెండో కంటితో చిరునవ్వు వెదజల్లే నవ్వు'' (పుట 30) ఇటువంటి వాక్యాలలో రచయిత నిలిచి ఉంటాడు.

హాస్యం వ్యాసంలో అందం. అది ఉంటే, పాఠకులు ఆకర్షితులవుతారు. ఈ వ్యాసాలలో అది పుష్కలంగా వుంది.

''స్త్రీలు ఈ లలితకళ ఏడ్పులో చూపించే శక్తి, వివిధత్వం, అందం పురుషులు చూపించలేరు. పురుషుడు ఏడుస్తుంటే ఏడ్చినట్లుంటుంది.'' (పుట 30) చదివితే నవ్వు రావచ్చు.

''నీరు కిందికి దొర్లటంలో, గాలి వీచటంలో పుట్టటంలో చావటంలో ఏ విధంగా మంచిచెడ్డలు లేవో, గోక్కోవటంకూడా అంతే! అసలు దురద మంచిదీ కాదు. చెడ్డదీ కాదు. దురద దురదే!'' (పుట 41) చదివినప్పుడు నవ్వురాక పోదు.

ఈ వ్యాసాలు వ్యావహారిక భాషలో ఉన్నాయి. కొన్ని వాక్యాలు ఆంగ్ల వాక్యానువాదాలుగా భావించే అవకాశం వుంది. సంపూర్ణ స్వేచ్ఛగా ఆనందమే ప్రధానకాంక్షగా, నవల కథాది సృజన ప్రక్రియకు దగ్గరగా వ్యాసరచన చేయటం

తెలుగులో అధికంకాదు. ఇది సాధించి ఈ వ్యాసకర్త ఈ సంపుటిని, ఉత్తమ వ్యాస వేదికగా ఆంధ్రులకు సమర్పించాడు.

## 7. ఇతర వ్యాస కర్తలు

ఈ యుగంలో వ్యాస సృష్టి కావించిన రచయితలలో వి. రామసుబ్బారాయుడు బి. ఏ. వ్రాసిన 'కవిత్వము-దారిద్ర్యము' (1932) సృజనంగా ఉంది. ఇందులో కవులు దరిద్రులుగా ఉండటం పరికింపబడింది. పూవు తావిలాగా కవిత్వం దారిద్ర్యం కలసిమెలసి అవినాభావ సంబంధంతో ఉంటాయని, అందుకే రాజులు కవులను పోషించే వాళ్ళని తెలుపుతూ వుంది, ఈ వ్యాసం.

హాస్యంకోసం తన పేరు కూడా రూపొందించుకొన్న వ్యాసకర్త అలపాటి కామేశ్వరరావు. దూదేకుడు (అనే నవ్వుతాలు) మూడు వ్యాసాల సంపుటి. ఈ దూదేకుణ్ణి ఏ. కే. రాయకవిగా రచయిత పేరుంచుకొన్నాడు. 'కులమింటికోతి' అనే మునిమాణిక్యం నరసింహారావు కథను విమర్శించే హాస్య వ్యాసం, కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి వ్రాసిన 'అస్పృశ్యుల యాలయ ప్రవేశము తగునా ?' వ్యాసం మీద విమర్శనం, 'భావకవిత్వం ప్రదర్శనం' అన్న వ్యాసం రచయిత ఈ సంపుటిలో చేర్చటం చూడవచ్చు. వ్యాసకర్త అభిప్రాయం, రచనం, హాస్యం పరికించటానికి "ఐనా హరి హరాలయాలకి బ్రహ్మ రూల్సు ఏంవిటి చెప్పండీ! వాడి ఆలయాలకి (ఏవీ?) వాడి రూల్సు, ప్రపంచకం అంతా సృష్టించేడు బ్రహ్మ. వివాహం ఉపనయనం ఇత్యాదుల్లో వాడి రూల్సున్నాయి. దేవాలయాలని వాడు అలాగే సృష్టించ లేదు గదా ? ఇహా, దేవుణ్ణి చూడ్డానికొచ్చిన వాడు పాపాత్ముడై తేనేం పుణ్యాత్ముడై తేనేం మలినాంబరధరుడై తేనేం మాంసాహారుడై తేనేం ?" (పుట 77).

కర్లపాలెం కృష్ణరావు వ్రాసిన వ్యాస మంజరి (1935) లో అన్నీ వ్యాసాలే కావు. స్త్రీ అనంతత్వం సంభావించే 'ప్రేమాంజలి', రాజకీయాలలో జోక్యం కలిగించుకొనేవాళ్ళకు బుద్ధి చెప్పే 'గిరీశంగారి బహుమానం' మాత్రమే వ్యాసాలు. 12 రచనల్లో 2 వ్యాసాలున్న ఈ గ్రంథానికి వ్యాసమంజరి అని పేరు పెట్టటం వల్ల నాటి వ్యాస నామ ప్రసిద్ధి వ్యక్తమవుతుంది.

త్రిపురనేని రామస్వామి చౌదరి (1887-1943) సాంఘిక విప్లవం వాంఛించిన మేధావి. సంఘం పేరిట, మతం పేరిట జరుగుతున్న అన్యాయాలను

ఎమరు తిరిగిన వ్యక్తి. ఈ రచయిత ఇచ్చిన ఉపన్యాసాలు, వ్రాసిన కావ్య పీఠికలు వ్యాసాలే. ఈ వ్యాసకర్త సృష్టి మత మౌఢ్యం, అంధ విశ్వాసాలు వస్తువులుగా రూపొందింది. దుష్ట వ్యవస్థను తిరస్కరించి నూత్న సమాజం నిర్మించాలన్న వ్యక్తి హృదయ ప్రతిబింబాలు ఈ వ్యాసాలు.

ఈ యుగంలో కథలు-గాథలు పేరుతో ఇద్దరు రచయితల సంపుటాలున్నాయి. సృజన ధర్మం అధికంగా, రచయిత వ్యక్తిత్వం నిశితంగా, హాస్యం సముచితంగా రూపొంది, వ్యాసం ఆనంద సంపాదకమయింది. నవల కథ మొదలైన సృజన ప్రక్రియా ధర్మం వ్యాస ధర్మంగా రచన సాగింది. వ్యాసం ప్రక్రియగా రచనా విస్తృతిని పొందటం పరిణామ ప్రదర్శకం.

## 9. చలం యుగం (1947-1970)

అన్య సృజన ప్రక్రియలతో పోల్చి చూస్తే, వ్యాసం అధికంగా రచింపబడలేదుకాని, గుణంలో విశిష్ట వ్యాస సృష్టి ఈ యుగంలోనే జరిగింది. అయితే పూర్వ యుగాలలో వెలువడ్డ వ్యాస సారస్వతంకంటే, ఇప్పుడే అది విస్తృతంగా రూపొందింది. ఆంగ్ల వ్యాస స్థాయితో ఆలోచిస్తే, తెలుగులో అంతటి ఆధిక్యం ఉందనటం సాధ్యం కాకపోయినా, సృజన కళగా వ్యాసం ఉత్కృష్ట స్థానమే పొందింది. ఆధునిక యుగంలో, సారస్వత సంబంధి విమర్శనంతో నిమిత్తం లేని వ్యాస సృష్టి కావించి, సాహిత్యంలో తిరుగుబాటు చేసిన వ్యక్తిగా ప్రసిద్ధి పొంది, నేటి వ్యాసకర్తలు చాలామందికంటే పూర్వమే ఈ ప్రక్రియ ప్రసిద్ధంగా రూపొందించిన శ్రీ చలం ఈ యుగకర్త కావటం సంభావ్యం.

## 1. శ్రీ చలం (1894-1979)

శ్రీ గుడిపాటి వేంకట చలం లైంగిక భావ విప్లవంతో, నవలా కథానికా నాటక వ్యాసాద్యనేక ప్రక్రియా స్రష్టగా ఆంధ్ర దేశంలో సుప్రసిద్ధుడు. జీవితంలో భావించింది సాహిత్యంగా, సాహిత్యంలో సాధించింది జీవితంగా, జీవిత సాహిత్యాలకు అవినాభావ సంబంధంగా వ్రాసి, బ్రతికి, రమణాశ్రమం చేరి, తాత్త్విక పరిధిని జీవిత చరమాధ్యాయంలో దీక్షగా పరిశీలించిన హృదయవాది. కోమల మనస్వి, సాహిత్య తపస్వి, తపస్వి చలం.

చలాన్ని ప్రేమించినా, ద్వేషించినా; ఆదరించినా, తిరస్కరించినా; గౌరవించినా, తూలనాడినా; ఆంధ్రులు అధికంగానే చేశారు. ఈ రచయిత తీవ్రత అంతా మాటకూ చేతకూ పొంతన కుదర్చటమనే చెప్పవచ్చు. ఈ అభిప్రాయాలతో అందరూ ఏకీభవించరు. స్త్రీని ప్రాణిగా చూడమనీ, స్త్రీ పశువు కాదు, బానిస కాదు అనీ, స్త్రీని పురుషులు సమానంగా గుర్తించాలనీ, ప్రబోధించిన రచయిత చలం.

ఈ ఆలోచనలోనే సాంఘిక వ్యవస్థ పునాది- వివాహ వ్యవస్థ-ప్రశ్నింపబడింది. ఇది అనవసరం, అసహజం అన్న భావం గాఢంగా ప్రచారమయింది. స్త్రీ పురుష సంబంధం కల్పితమనీ, కులమతాలు వివాహవిధికి ప్రతిబంధకాలనీ, మానవులు సంపూర్ణ స్వేచ్ఛతో, ఈ విషయంలో, ప్రవర్తింపవచ్చుననీ ప్రచారం చేసిన అభ్యుదయవాది చలం. రచయిత భావించే సమాజం, ప్రాక్తన సమాజం కానీ, మనిషి మహా మానవుడు మాధవుడు అయితే వెలిసే స్వర్గం వంటిదికానీ, అవుతుంది.

అర్ధ శతాబ్దినుంచి ఆంధ్రజాతి జీవితంలో అత్యుత్తమ పాత్ర నిర్వహించి అలసిపోయిన రచయిత, సృష్టించిన సాహిత్యం రచయితలు ప్రత్యక్షంగా పరోక్షంగా చాలా ఎక్కువ. సాంఘిక సాహిత్య జీవితాలలో శ్రీ చలం అభ్యుదయవాది మాత్రమే కాదు, విప్లవవాది. తన జీవితం, సిద్ధాంతాలు, సాహిత్యం అంతా స్త్రీ జాత్యభ్యుదయ వాంఛ చుట్టూ పరిభ్రమించాయి.

విస్తృతమైన శ్రీ చలం సాహిత్యంలో వ్యాస రచనం పరిమితంగా ఉంది. ఈ రచయిత, వ్యాసాలుగా వ్రాసిన ఆనందం, విషాదం, రెండు గ్రంథాలూ, 'మ్యూజింగ్స్' మూడు భాగాలూ, ప్రేమలేఖలు, స్త్రీ, (దేశి ప్రచురణలు) పుస్తకాలలోని రచనలు వ్యాసాలు.

చలం రచనా జీవితారంభంలో నవలలు, కథలు, నాటికలు సృష్టించాడు. అప్పటిలో శృంగార దృష్టి రచనా వ్యక్తిత్వాన్ని శాసించింది. అయితే క్రమంగా తాత్త్విక దృష్టి పెరిగి లైంగిక సంబంధం భక్తిభావంతో ఆలోచనకు గురి అయింది. ఆపైన భగవద్భక్తి కుదిరి, భక్తి భావప్రేరక రచనలు వెలువడ్డాయి. కాబట్టి చలం రచయితగా హృదయంనుంచి పెరిగి బుద్ధిని వశం చేసుకొని, రెంటిని సమ్మేళనం చేశాడు. రచయిత పాత్ర కథాగతాలోచనకంటే, స్వేచ్ఛా

లోచనం వల్ల ఆనందం పొందే స్థితికి, శారీరక సంబంధం కంటే ఉత్పన్న మయిన శృంగార, భక్తి, తాత్త్విక, భగవల్లక్షణాలు స్త్రీనుంచి పొంది ఆనం దించే దశకు, రచనవల్ల వ్యష్టిగా సమష్టిగా సాగిపోయాడు.

## వ్యాసాలు :

అర్ధ శతాబ్ది రచనా జీవితంలో చలం సృష్టించిన 'ఆనందం', 'విషాదం'- ఈ సంపుటాలు భావ ప్రాధాన్యం వివరించాయి. అతి విశాలమైన జీవిత ధర్మాలు సృజనంగా వ్యక్తీకరించటంలో రచయిత సామర్థ్యం గోచర మవుతుంది. కఠిన భావం సంక్లిష్టాభిప్రాయం స్పష్టంగా చెప్పాడు. చలం వ్యాసాలలో ఉపన్యాస గుణం, ఆవేశం ప్రధానంగా కనిపిస్తున్నాయి.

## మ్యూజింగ్స్ :

ఇవి మూడు సంపుటాలు. 1936-56 మధ్యకాలంలో రచన జరిగింది. రమణ మహర్షి దర్శనం తర్వాత ఈ రచన మారంభమయింది. మ్యూజింగ్స్ అనుభూతి ప్రాధాన్యంతో విలసిల్లే రచనలు. హృదయం మరుగుపడి, బుద్ధి ప్రకోపించి ఆధునిక మానవుడు యంత్రంలాగా జీవిస్తుంటే సహించలేక పిల్లల్ని ఉపాధ్యాయుడు మందలించినట్లు పెట్టేచీవాట్లు ఈ మ్యూజింగ్స్. ఈ వ్యాస రచన, రచయిత మానవుడి దైనందినావసరాల పరిధి దాటి, దైహికావసరావధి దాటి, విశ్వదృష్టితో, తాత్త్వికంగా చేసిన జిజ్ఞాస. తన బ్రతుకుతో ప్రతి సన్నివేశం తెచ్చిన పరివర్తనకు అక్షర రూపం మ్యూజింగ్స్. పరీక్షలు వ్రాసే విద్యార్థుల్ని పరికించటంనుంచి భగవదాలోచన దాకా సాగిన మానసిక కల్లోలంలో హృదయం విరజిమ్మిన సుమాలు మ్యూజింగ్స్.

## ప్రేమలేఖలు :

ప్రేమలేఖలు తాత్వికుడి హృదయానుభూతులు. ఈ రచనా ప్రక్రియను రచయిత వివరించాడు. ''ప్రేమలేఖ అంటే ప్రియమైన మిత్రులకి వ్రాయడం. పురుషులు గాని స్త్రీలుగాని భేదమైనప్పుడు ప్రేమలో వలెనే లేఖలో కూడా రోమాన్స్ పొయిట్రీ, టెండర్‌నెస్ ఎక్కువగా కన్పిస్తాయి'' అనీ, ''సర్వకాల సర్వావస్థలలోను నిన్నే అన్వేషిస్తున్నానని జ్ఞాపకం చెయ్యడమే ప్రేమలేఖ!" అనీ

''వాఙ్మయంలో లేఖకి స్థానం ఉండాలంటే అది ప్రేమలేఖ కావాలి'' అని తెలిపాడు. చలం ప్రేమలేఖలు ప్రేయసిని సంబోధించేవిగా ఉన్నాయి. అందులో ప్రేమ మాత్రమే లేదు. తాత్త్వికత, ఆలోచన, మానసిక శిక్షణ, కవితా పరిధి, గుండెనృత్యం, జీవిత వ్యథ, సమాజబాధ కలగలుపుగా సాగి, సృజన వ్యాసం సాహిత్యంలో సముచిత స్థానం పొందే దశ కలిగించాయి ప్రేమలేఖలు. 'ఈ ప్రపంచమే' ఈ సృష్టి సౌందర్యమే ఒక పెద్ద ప్రేమలేఖ' అనగల్గిన శ్రీ చలం ఆంధ్ర వ్యాససాహిత్యంలో తేజశ్శిఖరం.

## స్త్రీ :

ఈ గ్రంథంలోని రెండు భాగాలూ రెండు వ్యాసాలే. ఇతర వ్యాస లక్షణాలతోపాటు అసంపూర్ణత్వంకూడా ఈ వ్యాసాలకుంది. ''కానీ యివే వాస్తవమనీ, అనుకరింపతగినవనీ, శాసించడం లేదు. ఈ నాడు ఇవి నాకు తోచిన సత్యాలు. ముందు నాటికి మారిపోవచ్చు. ఇతరులకి ఇవి సత్యాలు కాకపోవచ్చు.' అని రచయిత తెలిపాడు. మొదటి వ్యాసంలో స్త్రీ సంబంధి పూర్వ సిద్ధాంతాలు ఖండింపబడ్డాయి. రెండవ వ్యాసంలో స్త్రీ జీవితాభివృద్ధి సూచనలున్నాయి. ఇవి 1950 లో మేన్ అండ్ వుమెన్ అనే ఆంగ్ల గ్రంథాధారంతో వెలిశాయి. అనంతరం స్వతంత్రాలోచనలతో నిండిపోయాయి.

శ్రీ చలం వ్యాసాలలో హృదయం విశ్వరూపం దాల్చింది. అనుభూతి గజ్జెల గుర్రంలా నృత్యం చేసింది. గుండె అన్ని కోణాలనుంచి పరిపూర్ణంగా రూపం దిద్దుకొని నిలచింది. రచయిత వ్యథ వ్యాసాలై అవతరించింది. స్త్రీ జీవితం చుట్టూసాంఘికా వ్యవస్థ భరింప శక్యం కాకుండా ఉండటంతో రచయిత బాధ పొందాడు. అందుకే తరతరాల నుంచి స్త్రీకి జరుగుతున్న అన్యాయానికి పురుషుడి ప్రతిఘటన చలం సాహిత్యం. ఈ ప్రతిఘటనంలో స్వార్థం వుంది. ప్రపంచ మానవ జీవితంలోని స్త్రీ సంబంధి పురుష స్వార్థం వర్తించినంత కాలం చలం బాధ లోకం బాధ.

## నిర్మాణవ్యాసం :

ఒక సున్నిత భావం అనుభూతి ప్రాధాన్యంతో పెరిగి ప్రారంభోపసంహారాలు మాత్రమే ఉండి, క్రమతా నిమిత్తం లేకుండా విస్తరిల్లి, కవితామయంగా,

గీతికలాగా సాగి, భాష నిశితమై, ఆవేశం ప్రధానమై, వ్యాస కళాఖండంగా అవతరించి ఆనందం కలిగించటమే చెప్పవచ్చుకాని, అంతకంటే లక్షణప్రయత్నం అనవసరమే! పుటల పరిమితి చెప్పటం కుదరదు. విషయ పరిమితి లేదు. భావ, రచన నిర్బంధాలు లేవు. అందువల్ల పరిమితి రాహిత్యం చలం వ్యాస ధర్మం.

భాషా విన్యాసాలు ఈ వ్యాసాలలో అనేక వాక్యాలు వ్యాకరణావిధే యాలుగా రూపొందాయి. ఆలోచనతో పాటు భాష పరుగెత్తింది. భాషకు నియ మాలు పరిత్యజిస్తే, అదెంతదూరం పోగలదో ఈ రచనలలో చూడవచ్చు. ఆంగ్ల పదాలు ఆంగ్లాంధ్ర లిపులలో వ్రాయటం, పద ప్రయోగంలో స్వేచ్ఛ ప్రదర్శిం చటం గ్రహింపవచ్చు. భాష సారస్వత విమర్శనంలో, శ్రీ శ్రీశ్రీ 'మహాప్రస్థాన' పీఠికగా, ఎంత సృజనంగా రూపొందించవచ్చో, చలం చూపాడు.

సాహిత్యంలో, జీవితంలో విప్లవవాది చలం చెప్పుకోవటానికి ప్రతి. పురుషుడు భయపడే, ప్రతి స్త్రీ సిగ్గుపడే స్త్రీ పురుష సంబంధి సత్యాలకు అభి వ్యక్తి కల్పించిన వ్యాసకర్త సాహిత్యలోకంలో వెలగించిన నూత్న దృక్పథ జ్యోతి ఆంధ్ర దేశంలో శాశ్వతంగా ప్రకాశిస్తుంది. స్త్రీ స్వాతంత్ర్యం కోసం స్త్రీ పురుషులు కోరుతున్నంతకాలం, అది లభించి స్థిరంగా నిలచి ఉన్నంత కాలం, తెలుగు గడ్డ మీద చలం చిరంజీవి.

## 2. శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు [1910]

శ్రీశ్రీ సాహిత్యం ఒకటి, రెండు, మూడు సంపుటాలలో వ్యాసాలు వ్యాసాలుగా, ఉపన్యాసాలుగా, వారం వారం రచనలుగా, సమీక్షలుగా, పీఠికలుగా, ఉపోద్ఘాతాలుగా ఉన్నాయి. ఇవన్నీ స్థూలంగా 1930-70 మధ్య కాలంలో వ్రాశాడు. అభ్యుదయ కవిగా ప్రపంచ ప్రఖ్యాతి పొందిన శ్రీ శ్రీశ్రీ వ్యాసాలు సృజన ధర్మ నిక్షిప్తాలు.

ఈ వ్యాసకర్త వచనం విశిష్టంగా ఉంది. వ్యాసం హృదయ గోచరంగా వుంది వ్యాస లక్షణ వ్యక్తిత్వమూ, శైలీ లక్షణ వ్యక్తిత్వమూ కలసి, గుండె మారుమూలలు భావాలకు ప్రతిబింబాలుగా వ్యాసాలను రూపొందించాయి. తన గుండె లోతుల్లోకి వ్యాస రచనలో, ఈ రచయిత దిగినంత దూరం రచయిత లందరూ దిగలేదు.

హృదయంలో కల్లోలం రేగి, ఆలోచనలో తరంగాలు పెట్రేగినప్పుడు ఈ వ్యాసాలు జన్మించాయి. రచయిత నిశిత బుద్ధితోపాటు, ఆలోచన, అనుభూతి, అభివ్యక్తులలో వ్యర్థత లేకుండా రచన సాగింది. వస్తు పరిశీలనంలో జాగరూకత రచయిత నైపుణ్యం ప్రదర్శిస్తుంది. ఏ విషయం ఎంతవరకు చెప్పాలో, ఎక్కడ ఆపాలో, ఎక్కడ ప్రారంభించాలో రచయితకు బాగా తెలుసు. ఏ విషయం ఎంత సూటిగా గుండెను తాకుతుందో రచయితకు స్పష్టంగా తెలుసు. ఈ భాష, రక్తంలోంచి పుట్టి, రక్తంలోకి నిష్క్రమిస్తుంది. భాష చేత చాకిరీ చేయించటం ఈ రచయితకు బాగా అనుభవంలోని సంగతి. ఈ రచయిత అభివ్యక్తి బాణం కంటే తిన్నగా, ఖడ్గం కంటే పదనుగా, జీవితంకంటే స్పష్టంగా, గుండెకంటే క్లుప్తంగా వుంటుంది.

ఈ వ్యాసాలలో ప్రత్యాలోచనా, పాఠకులకు నూత్నద్వారాలు తెరుస్తుంది. పాత సంతతయినా, నిత్యనూతనంగా ఈ వ్యాస సులోచనాలు చూపుతాయి. వ్యాసం క్రొత్త విషయాన్ని పంచరంగుల వర్ణచిత్రంలాగా ప్రతిపదంలో అప్రతిమానానంద సందోహాలు నిలిపి ఎదుట ఉంచుతుంది. ఇది, పంచేంద్రియ జ్ఞానంతో రచయిత అనుభవించిన ఏ అంశమయినా వ్యాసంగా రూపొందించ వచ్చునన్న స్ఫూర్తి కలిగిస్తుంది.

శ్రీ శ్రీశ్రీ ఉత్తమ కవిగా ఆంధ్రులకు పరిచయమే కాని, ఉత్తమ రచయితగా వ్యాసకర్తగా అంత గుర్తింపూ రావాలి. తెలుగులోని ఉత్తమ వ్యాసకర్తలలో శ్రీ శ్రీశ్రీ స్థానం అచంచలమైంది. ఈ కవి, కవిగా కవులకు, కవితా ధోరణి మార్గదర్శి అయినట్లే, ఈ రచయిత రచయితగా రచయితలకు నూత్నవచన రచనా విధానానికి పురోగామి. గుండెలోనుంచి వచ్చి, ఎదుటి గుండెలోకి చొచ్చి నిలచే ఆధునిక, వ్యావహారిక వచన రచనా విధానానికి శ్రీ శ్రీశ్రీ చూపిన మార్గం అనేకులకు అనుసరణీయమైంది.

అభ్యుదయ కవిగా, విప్లవ కవిగా, కవులనేకులకు ఆరాధ్య స్థానంలో ఉన్న శ్రీ శ్రీశ్రీ వ్యాసకర్తగా అంత ఔన్నత్యం పొందవలసే వుంది. నలభై ఏళ్ళలో జాతి జీవితంలో వచ్చిన కదలికలకు గుండె సంచలించి, వెలువడ్డ వ్యాసాలు భిన్న పత్రికలలో ప్రచురితాలై, భిన్న వేదికలమీద ఉపన్యాసాలై, సంపుటాలై, సమాహారాలయ్యాయి. శ్రీ శ్రీశ్రీ వ్యాసాలులాగా వచన కృతులు సమగ్ర పరిశీలనం పొందటానికి సమర్హాలు.

శ్రీ శ్రీశ్రీ వ్యాసాలు భిన్నవస్తువులమీద రచయిత దృష్టికి తార్కాణాలు. సాహిత్య సమాజాల సమ్మేళనంలో కలిగేమార్పు రచయితను ఆలోచింపజేసింది. తెలుగు కవితాధోరణుల పరిశీలనం జరిగింది. తన కవితను వివరించటం తప్పని సరి అయింది. సాహిత్యంలో నూత్నరీతులు అధివాస్తవికత, చైతన్య స్రవంతి సలక్షణంగా వివరణం పొందాయి. సౌందర్యం, కళ, చిత్రాలు, ఆలోచన రేకెత్తించాయి. గురజాడ అప్పారావు పంతులుమీద యీ రచయితకు అభిమానం ఎక్కువ. వచన రచనాధోరణిలో గురజాడ ప్రభావం శ్రీ శ్రీశ్రీ మీద వుంది. కన్యాశుల్కం ఎన్నికోణాలనుంచో పరికించటం, ముఖ్యాలసరాలు సలక్షణంగా గమనించటం చూడవచ్చు. ఇది శ్రీ కొడవటిగంటి కుటుంబరావు ప్రతివిమర్శకు గురై, తర్వాత ప్రశంసకు ఎరై పోయింది. మల్లాది, బుచ్చిబాబుల రచనలు ఇష్ట మయ్యాయి. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ప్రారంభంలో గౌరవంగా చూడబడి, అనంతరం 'పాషాణపాకి'గా భావింపబడ్డాడు. ఆంధ్ర సారస్వత మంతటిలో కవిత్రయమంటే తిక్కన వేమన గురజాడలని శ్రీ శ్రీశ్రీ అభిప్రాయం. జనశక్తి, ప్రజారథం, సృజన పత్రికలలో సాహిత్యవిషయాలమీద రచయిత అభిప్రాయాలు అనేకం ప్రచురింపబడ్డాయి.

ఆనందవాణిలో సాహిత్య సాంఘిక రాజకీయ కళావిషయాలు హృద యాభివ్యక్తితో సాగిన వ్యాసాలుగా; 'వారం వారం' శీర్షికగా, ఆనందవాణి, నవోదయ పత్రికలలో వెలశాయి. గ్రంథసంబంధిగా. తదితరంగా వ్రాసిన సమీ క్షలు ప్రారంభంలో పది పంక్తులు దాటలేదు. మధుకీల భారతిలో ఏడు పుటల సమీక్ష. కవితలు, కథలు, గేయాలు, వ్యాసాలు, అనువాదాలు సమీక్షించటం జరిగింది. ముందడుగు, మా భూమి వంటి నాటకాలు: యోగి వేమన, మనుషులు మారాలి వంటి సినిమాలు సమీక్ష పొందాయి.

పీఠికలు, ఉపోద్ఘాతాలు భిన్న ప్రక్రియలమీద వ్రాశాడు. ఇవి పుస్తక విషయం'నిర్మొగమాటం'గా చెప్పడంలో ప్రసిద్ధమయ్యాయి. రచయిత ఇష్టానిష్టాలు పట్టుదలతో పటిష్ఠంగా ఉన్నాయి. శ్రీ శ్రీశ్రీ వస్తుతః కవితాగుణాధిక్యంవల్ల స్థిమితంగా ఆలోచింపవలసినచోటకూడా ఆవేశ ప్రధానంగా ఆలోచించాడు.

నిర్మాణ వ్యాసం : శ్రీ శ్రీశ్రీ వ్యాస రచనావిధానంలో ప్రత్యేకంగా చెప్పదగ్గ లక్షణం ఒక్కటే! సాహిత్యమో, కళాత్మకమో, ఏ విషయమో

అయినా గుండె గంటను తాకితే, దాని ప్రతిధ్వనులుగా, రచయిత వ్యాసా లుంటాయి. ఈ ప్రాథమిక ధర్మం మీదే ఈ రచయిత వ్యాస నిర్మాణం ఆధారపడి వుంది. వ్యాసం చదవటం ముగించినా, అది గుండెలో గింగురు మంటూ వుంటుంది.

అందువల్ల వ్యాసం ఆరంభం ముగింపు లక్షణ బద్ధం చేసే వీలు లేదు. పుటనుంచి పది పుటలదాకా వ్యాసం విస్తరించింది. విషయం గుండెను తాకు తున్నంత సేపు వ్యాసం సాగుతుంది. లేకపోతే ఆగిపోతుంది. ఒక విధంగా ఈ వ్యాసాలు రచయిత గుండె చప్పుళ్ళు. అందువల్ల, ఈ వ్యాసాలు ఆంధ్ర లోకానికి శ్రీ శ్రీశ్రీ గుండెభిక్ష !

## 3. శ్రీ నార్ల వేంకటేశ్వర రావు

ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, సంపాదక సారధిగా, సంపాదకీయ నాటక, వ్యాస స్రష్టగా శ్రీ నార్ల వేంకటేశ్వర రావు ఆంధ్ర దేశంలో సుప్రసిద్ధుడు. పత్రికా నిర్వహణ, రచన, రాజకీయార్థిక సాంఘికాలోచనం, ఆంగ్లాంధ్ర సంస్కృత సారస్వత వివేచన ఏకమయి రచయితలో మేళవింపు పొందాయి. ఆంధ్ర సాహిత్యౌన్నత్యం ఆంధ్రేతరులకు ఆంగ్లంలో 'వేమన', 'వీరేశలింగం' పేర్లతో వ్రాసి ప్రచురించే సామర్థ్యం ఈ రచయిత కుంది. ఆంధ్ర సారస్వత విషయాలు కేంద్ర సాహిత్య ఎకాడమీ పక్షాన, అధికారికంగా ప్రకటనం చేసే సాహితీ వేత్త శ్రీ నార్ల. వ్యాసం, ప్రక్రియగా ఉన్నత శిఖరాలు అధిరోహించ టానికి ఈ మేధావి కృషి చేశాడు.

'పిచ్చాపాటి', 'మాటా మంతీ' సంపుటాలలో వ్యాసాలు 28. ఇవి 1951 లో ముద్రితాలయినా, వ్యాసాలు 1940-50 మధ్యకాలంలో వ్రాయటం జరిగి, ఆంధ్రప్రభలో, ఆ రూపంలో కాని, భిన్నరూపాలలో కాని ప్రచురణం పొందాయి.

వ్యాసతత్త్వం : వ్యాసరచయిత, భాషను విస్పష్టంగా సులభంగా ప్రయో గించే గుణం పఠించి, విమర్శన సాహిత్యం కంటే సృజన సాహిత్యం దేశంలో అధికంగా ఉన్న సామాన్యులకు చేరువ అవుతుందని గ్రహించటం గుర్తించి,

విషయం సమంజసంగా సమీక్షించే ఆలోచనా పరులలో ప్రముఖ వ్యక్తిగా గ్రహించి, ఈ వ్యాస సృష్టి దర్శిస్తే ఇవి త్రిగుణీకృతంగా ఆవిర్భవించినట్లు స్పష్టమవుతుంది.

గురజాడను స్ఫురింప చేసే 'మాటామంతీ', నానుడి స్థానంలో ఉన్న 'పిచ్చాపాటీ' తెలుగుదనం ఉట్టిపడే పదాలు. వ్యాస వాతావరణం తెలుగు దేశపు నడిబొడ్డులో పల్లెటూరు. వ్యాస విషయాలు ఆంధ్రత్వ శోభితాలు. వాక్య రచన తెలుగువాడి గుండె వాడితనం. పల్లె పట్టుల జీవితం అనుభవం ముద్రించుకొని ఆవిర్భవించింది. ఈ వ్యాసాలు సంపూర్ణంగా తెలుగుదనం నిలుపుకొన్న సాహితీ వీధులు.

ఈ వ్యాసాలు ఆంధ్రుల గుణాలు, అలవాటులు, ఆచారాలు, ఎన్నో ధర్మాలు తెలుపుతున్నాయి. తెలుగుభాష నుడికారపు సొంపుతో ప్రయుక్త మయింది. భావ ప్రదర్శనం తలపండిన తెలుగు పెద్ద వివరణంలాగా ఉంది. ఈ వస్తువు ఇంత సుందరంగా ఇంకొక భాషలో సంభవం కాకపోవచ్చు. ఈ వ్యాసాలు మేధావి అయిన ఆంధ్రుడి ఆలోచనకు హృదయం అభివ్యక్తం కావించిన సాహితీ సుమాలుగా శాశ్వతాలు.

ఈ వ్యాస రచనంలో ప్రధాన గుణం నిర్వచన ప్రాయ వాక్య విన్యాసం. వీటిలో చాలా వాక్యాలలో ఏ వాక్యమయినా పునరాలోచనం చేస్తే ఒక సృజన వ్యాసంగా రూపొందేంత సంక్షిప్తంగా ఉంది. "రుచుల విషయం అడగ వలసింది భోగులను కాని, త్యాగులనుకాదు" (మాటామంతీ పుట 128) ఇటువంటి వాక్యాలు ఒక వ్యాస హృదయం నిక్షిప్తమయినట్లు గోచరమవు తున్నాయి. పిండీకృత భావ శాబల్యం భద్రం చేసిన వాక్య విన్యాసం ఈ సంపుటాలలో సాధారణమైవుంది.

ఈ వ్యాసాలేవీ విమర్శనం సాగించలేదు. ప్రతి వ్యాసం ఆలోచనతో బరువైన వాక్య సందోహం కలిగి వుంది. కాని సృజన స్థాయి దిగిపోలేదు. అనేక భావాలతో నిండి అనేక భావాలు రేకెత్తించగలిగే ఈ వ్యాసాలు సృజనత్వం నిలుపుకొని ఆనంద సంపాదకంగా ఉన్నాయి.

22)

తెలుగు వాక్య నిర్మాణంలో సాధారణంగా సృజన గుణం అధికంగా ప్రదర్శితమయితే, ఆలోచన తగ్గుతుంది. అయితే ఈ వ్యాస సంపుటి అందు కపవాదం. ఈ వ్యాసాలలో అనవసర భావంకాని, పదం కాని, వాక్యం కాని గోచరం కావు. ఆనందోద్దిష్ట రచనలైన ఈ వ్యాసాలు ఆలోచన బరుతో నిండి, సృజనాత్మకత నిలుపుకొని, తెలుగు సాహిత్య విశిష్టి స్థాయి తెలిపే ఉత్తమ వ్యాసాలుగా నిలిచాయి.

*విషయ వ్యాసం :* ఈ వ్యాసాలలో విషయ వైవిధ్యం దర్శింపవచ్చు. సొంత పుస్తకం చదువుకొంటే కలిగే తృప్తి, అల్ప విశ్వాసాల వల్ల వచ్చే నష్టం, పసిపాపల ఆనందం పరికించటంలో సంతోషం, మంత్రాలవల్ల కార్య కలాపాలు జరగటంలో లోపం, కవిత్వ పాండిత్యాలకున్న సంబంధ వైరుద్ధ్యాలు. గడ్డం పెంచుకోవటంలో ఉండే సాధక బాధకాలు, నిట్టూర్పు లాభం, కట్టు కథల ప్రయోజనం, ధూమపానం వల్ల కలిగే పరిణామం, పరామర్శించటంలో కష్టసుఖాలు, పరాకుగా ఉండటంలో మంచి చెడ్డలు, నిద్ర సుఖం, జబ్బు వల్ల మేలు, అమ్మ అబ్బల ఆధిక్యం, సందేశాల తీరుతెన్నులు, మామిడి పండు గొప్ప దనం ఉన్నాయి.

ఇంతేకాక, ఈ జగత్తు నాటకశాల కావటం, స్వరూపం స్వభావానికి దర్పణంగా ఉండటం, పదవి అంటే ఆశనీ లోకుల అభిరుచినీ మహాత్ములను గుర్తుంచుకోవటం, మనిషిని పోలిన మనిషి ఉండటం, కవులు గొప్పతనం దాచుకోవటం, ఆకారంలో పోలికలున్నా కాకి కోకిలలతో మనిషి తేడా చూపటం, మాటకు మాట వడ్డించటం, వృద్ధాప్యం వల్ల లాభ నష్టాలు, పేరు సంకేతమే అయినా బాగా ఉండాలనుకోవటం, దాహం జ్ఞాన తృష్ణే కావటం తెలిపిన వ్యాసాలు ఈ సంపుటాలలో ఉన్నాయి.

*నిర్మాణ వ్యాసం :* ఈ వ్యాసాల విషయం రచనం సృజన గుణ సంభరితం. వాటి ఆలోచన విమర్శనాత్మకం అందువల్ల ఇవి ద్విగుణ సహితాలు. తాపీగా రచన సాగుతూ, ఒడుదుడుకులు లేకుండా పద ప్రయోగం జరుగుతూ, ఉదాహరణ బలం పెరుగుతూ వ్యాసాలు రూపొందాయి. భిన్న విషయాలు ప్రారంభించి నట్లుండి, అన్ని విషయాలు ప్రధాన వ్యాస భాగంలో అంతర్గత మవుతున్నట్లు వ్రాయటం ఈ వ్యాస లక్షణంగా కనిపిస్తుంది.

వ్యాసంలోని ఏ అంశమయినా వివరించవలసివుంటే, కథగాని, కబురు గాని, వార్తకాని, చెప్పటమో, వ్యక్తి జీవితంకాని, సన్నివేశం కాని తెలపటమో. ఈ వ్యాస రచనా ధర్మంగా వుంది. వ్యాస ప్రారంభం అకస్మికంగా జరిగి, ముగింపు ముక్తాయింపు లాగా ఉంటుంది. ప్రతి వ్యాసం ఒక బరువైన విష యంతోనో వాక్యంతోనో వ్యాస సారాంశంతోనో ఆగిపోయింది.

ఆంగ్లంలోని భిన్న వ్యాసాలు పరికించి లక్షణనిర్ణయం చేసి, ఈ వ్యాసా లలో పరికిస్తే అన్ని వ్యాసాలూ ఆ లక్షణానుగుణంగా ఉన్నట్లు తెలుస్తాయి. ఆంగ్లంలోని ఉత్తమ వ్యాసాల స్థాయి నిలుపుకొన్నవి ఈ వ్యాసాలు. శైలికున్న లక్షణ పరిశీలనంచేసి, ఈ వ్యాస రచన పరిశీలిస్తే, ఇవి ఉత్తమ శైలీ సమంచితా లుగా ఉన్నాయని తెలుస్తుంది.

ఈ వ్యాసాలు ఆంగ్ల సారస్వత ప్రభావం వల్ల అవతరించటం నిజమే! వాక్య నిర్మాణం అక్కడక్కడా ఆంగ్ల వాక్య రచనా ధోరణి ప్రదర్శించటమూ వాస్తవమే! అయితే ఇవి పదహారణాల తెలుగు వ్యాసాలు. ఈ సందర్భంలో ఆంగ్ల వ్యాసాలు ప్రోత్సాహ హేతువులు, లక్షణద్యోతకాలు.

ఉత్తమ శైలీ శోభితంగా ఉన్న వ్యాసాలలో సలక్షణంగా ఉన్న వాటిల్లో, ఆ రెండు గుణాలు మిశితమై, ఈ వ్యాస సృష్టి ఉత్తమంగా ఉంది. ఇటువంటి వ్యాసాలు ఎక్కువగా వెలువడివుంటే, అందుకు పాఠకులు అనుమతించివుంటే, తెలుగులో సృజన వ్యాసం దేదీప్యంగా వెలుగొంది వుండేది. శ్రీ నార్ల వేంకటేశ్వర రావు సృష్టించిన 'మాటా మంతీ' 'పిచ్చాపాటీ' ఉత్తమ వ్యాస సంపుటాలు.

## 4. శాంతి కృష్ణమూర్తి

'కథలు రాయడమెలా?'(1955) 8 వ్యాసాల సంపుటి. కథా రచనం అభ్యా సంతో సాధింపవచ్చుననీ, కథంటే వివరించటం ముఖ్యమనీ తెలిపాడు రచయిత. భావాలు పొంది పరచటం ఎలాగో, మొదటి కథ ఎలా వుంటుందో, ఒక కథ భిన్నరూపాలు ఎలా పొందుతుందో, కథలలో ఉన్న వైవిధ్యం ఏమిటో వివ రించాడు. కథాశిల్పం విశదీకరించి, గురజాడ అప్పారావు కథ 'దిద్దుబాటు' విభజించి పరిశీలించి, కథా రూపంలో భావ విహంగాలను ఎగరేయమని ఈ వ్యాసాలలో విషయబోధ చేశాడు. ఆధునిక కథా రచనను గూర్చి విమర్శన పూర్వకంగా

ఆలోచించి, సృజనంగా నిర్మించిన వ్యాస సంపుటి ఇది. విషయావగాహనం కోసం, ఆనందంకోసం ఈ వ్యాసాలు సృష్టి పొందాయి.

ఈ విషయమే ప్రధానమై వెలువడ్డ మరో సంపుటి 'కథలు రాయడం ఎలా?, (1963 సంపాదకత్వం 'శార్వరి') ఈ సంకలనంలో పలువురు వ్రాసిన వ్యాసాలున్నాయి. ఇవి కథారచనలో ఆరితేరిన వర్తమాన రచయితలు, కథ రాయటం ఎలాగో తెలుపుతూ వ్రాసినవయి, సృజనంగా ఉన్నాయి. ఇందులో ఉన్న పది వ్యాసాలు, కొన్ని కథల బలంతో, ఎలా కథలు వ్రాయవచ్చో వివరిస్తూ సాగాయి. భిన్నరచయితలు ఒక్కవిషయంమీద వ్రాసిన వ్యాసాలు ఒక్క సంపుటంగా ప్రచురించటంలో సంకలన వైశిష్ట్యం ఉంది.

## 5. మునిమాణిక్యం నరసింహారావు

'కాంతం కథలు'తో సుప్రసిద్ధి పొంది, ఏబై గ్రంథాలు వ్రాసి, ఆంగ్ల రష్యన్ హిందీ భాషలలోకి అనువదింపబడ్డ బహు రచనలు కలిగి, అధ్యాపకత్వంతో జీవితం ప్రారంభించి, ఆకాశవాణి ఉద్యోగిగా విశ్రాంతి గ్రహించి, సృజన వ్యాసనిర్మాణం కావించి, విమర్శన వ్యాస సంకలనం ప్రకటించి, హాస్య ప్రసిద్ధ రచయితగా పేరుపొంది, హాస్యరసంగూర్చి సశాస్త్రీయంగా పరిశోధన చేసిన మునిమాణిక్యం నరసింహారావు ఆంధ్ర హాస్య మాణిక్యం.

'ఇంటావిడతో పోట్లాట' (1957), 'ప్రణయ కలహం' (1957) సృజన వ్యాసాలు సొంత రచనలు. నవ్య సాహిత్య పరిషత్ పక్షాన ప్రచురించిన 'సాహిత్య వ్యాసములు' అనే విమర్శన వ్యాస సంకలనంలో "సాహిత్య విషయిక విమర్శనలు వ్యాస రూపమున బయల్వెడలుట ఆధునాతన పద్ధతి. ఇపుడు ఆంధ్ర వాఙ్మయ ప్రపంచమున వ్యాసరచనా శిల్పము క్రొత్త క్రొత్త కళలతో తళుకొత్తుచున్నదనుట నిర్వివాదాంశము" అని 'విన్నపము'గా తెలిపాడు మునిమాణిక్యం నరసింహారావు.

పై రెండు సృజన వ్యాసాలలో పోట్లాట, కలహం సృజనంగా, హాస్య ప్రధానంగా, భార్యా సంబంధిగా ఉండటంతో కోమలాభివ్యక్తితో, హృదయస్ఫూర్తితో ఒప్పాయి. ప్రధాన వ్యాసం భిన్న శీర్షికలుగా విభజించాడు. భార్యతో పోట్లాట, కలహం వంటి విషయాలు శాస్త్రీయంగా వివరించటానికి చేసే ప్రయ

త్నంలోనే హాస్యం తొంగి చూచింది. ఈ సృజన వ్యాసాలలో రచయిత నిలచి, వినోదాత్మకంగా విషయ వివరణ చేశాడు.

## 6. శ్రీ తిరుమల రామచంద్ర :

శ్రీ తిరుమల రామచంద్ర సాహిత్యం 'నుడి-నానుడి' (1963), 'సాహితీ సుగతుని స్వగతం' (1969) వ్యాస సంపుటాలు. పదహారు, నూట పదహారు లను గూర్చి వ్యాసంగా వ్రాసిన రచయిత మొదటి సంపుటంలో 48, రెండో సంపుటంలో 32 వ్యాసాలు చేర్చి ప్రకటించటంవల్ల పదహారు మీద రచయిత మమకారం తెలుస్తుంది. ఈ వ్యాస సృష్టి భారత దేశ స్వాతంత్ర్యం అనంతరం ఇరవయేళ్ళ పంట. ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో 'నుడి-నానుడి' అనే పేరుతో ప్రతి వారం ఒకటి చొప్పున రెండేళ్ళు వ్రాసిన వాటిలోంచి 48 ఏరి ప్రచురించటం, భారతిలో ప్రతిమాసం సాహితీ సుగతుని స్వగతమై వెలువడ్డ రచనలే కాక ప్రసిద్ధాంధ్ర పత్రికలలో ప్రకటించినవీ, గ్రంథ పీఠికలుగా వ్రాసినవీ కలిపి 'సాహితీ సుగతుని స్వగతం'గా ముద్రించటం జరిగింది.

### వ్యాస విషయం :

ఈ రెండు వ్యాస సంపుటాలలో ఉన్న ప్రధానాంశం భాషా శాస్త్రం. ఈ విషయం పదపదార్థ పరిశీలన దృష్టితో, పరిశోధన బుద్ధితో సాగింది. 'నుడి-నానుడి'లోని అన్నీ, 'సాహితీసుగతుని స్వగతం'లోని కొన్నీ, పదం కలిగివున్న మూలరూపం, తదర్థం నిర్ణయించేవిగా వున్నాయి. ఇంకా వర్ణ పరిణామం, అర్థ విపరిణామం ఏ విధంగా జరిగిందో తెలిపి, వర్తమానంలో ఆ పద ప్రయోగం ఎలా వుందో వివరించాడు రచయిత. సంస్కృత పదంలో ప్రాతిపదిక రూపం పరిశీలించే అవకాశం ఉన్నట్లే తెలుగులో కూడా ఉంటే బాగుంటుందన్న ఆలోచన నుంచి ఈ వ్యాసాలు అవతరించాయి. ''నేను ఈ వ్యాసాలలో ప్రతి పదాన్ని తెనుగు తోబుట్టువులలోని సమానార్థక సరూప పదంతో తులనాత్మకంగా తరచి చూడడమే కాక, ఆ పదం పుట్టు పూర్వాలను మానవజాతి పరిణామ దృష్టితోను, సంఘ పరిణామ దృష్టితోను తెలుసుకొనడానికి ప్రయత్నించాను'' అని రచయిత 'నుడి-నానుడి' లోని 'మనవి మాటలు' లో వివరించాడు. ఈ పరిశీలనం సశాస్త్రీయంగా జరిగింది. ఈ వ్యాస సంపుటికి మున్నుడి వ్రాసిన డా. భద్రిరాజు

కృష్ణమూర్తి "మాటల పుట్టుకలు పోల్చి సమన్వయించటంలో ఎన్నో సాంఘిక సాంస్కృతిక విజ్ఞాన విశేషాలు పాఠకులకు అందించారు. చాలా మాటలకు వారు కల్పించిన వ్యుత్పత్తులు శాస్త్ర చర్చకు నిలబడతాయి" అని వ్రాయటం పరికింపవచ్చు.

భాషా విషయాలు కాక, 'సాహితీ సుగతుని స్వగంత'లో మిగతా వ్యాసాలు లలిత కళల వివరణంతో; తొలి నవల తొలి-నాటకం చర్చలతో; బుర్రకథ. పద్యరాగాలు, నాటక పరిశీలనంతో; అన్నమాచార్యులు, చిలుకూరి నారాయణ రావు, త్యాగరాజు, ధర్మవరం కృష్ణమాచార్యులు వేదం వేంకటరాయశాస్త్రి మొదలైనవాళ్ళు వ్యాసకర్త అభిమానంలో, ఉండటం గమనింపవచ్చు. రచయిత కృషి ప్రధానంగా భాషా పరిశ్రమకు సంబంధించి వుంది.

## వ్యాస రచనం:

ఈ వ్యాసభాష వ్యావహారికాంధ్రం. నుడి-నానుడి వ్యాసాలు సాధారణంగా రెండుమూడు పుటల పరిమితిలో ఉన్నాయి. అయితే 'సాహితీ సుగతుని స్వగతం లోని వ్యాసాలు మూడు పుటలనుంచి ఇరవై పుటలవరకు వ్యాపించి ఉన్నాయి. ఈ వ్యాసాలలో ప్రధానలక్షణం ఆలోచనే, అయినా కళామయంగా రూపొం దాయి. భాషాపరిశోధన, శాస్త్రంగాకాక, వ్యాసంగా వ్రాయటమే శ్రమతోకూడి ఉంటే, సృజనంగా నిర్మించడం రచయిత సామర్థ్యానికి ప్రబలనిదర్శనం. అన్ని వ్యాసాలు-పరిశోధనలుకాక, కొన్ని వివరణాత్మకంగా ఉండటంచేతనూ, కొన్ని ఊహాబలంతో తర్కించటంవల్లనూ, శబ్దోత్పత్తి భాషాభిలాష పాఠకుల్లో కలిగించడమే వ్యాసప్రయత్నంగా ఉంపటంమూలంగానూ, ఈ సృష్టి సృజన వ్యాసమయింది. ప్రతివ్యాసంలో రచయిత పాఠకులతో ముచ్చటించటం, రచయిత ఎదుట నిలబడటం వంటి ఆంగ్లవ్యాస లక్షణశోభితంగా ఉన్న ఈ వ్యాసాల్ను సృజనంగా గుర్తింపవచ్చు. కాగా, సృజన విమర్శన వ్యాస వాఙ్మయ వైవిధ్యం ఈ రచయితకు తెలిసినంతగా, ఈతరంలో అందరికీ తెలియదనవచ్చు. కన్నడంనుంచి, కేంద్ర సాహిత్య ఎకాడమీ పక్షాన, సృజన వ్యాస సంపుటి అనువదిస్తు సృజన వ్యాసగుణం రచయిత గుర్తించాడు.

ద్రావిడ భాషావేత్తగా, సంస్కృత ప్రాకృతాంగ్ల పాండిత్యంతో ఆంధ్ర భాషా పరిశోధకత్వంతో పత్రికా సంపాదక రచయితగా ఆంధ్రదేశంలో సృజన వ్యాస పరంపర వెలయించిన శ్రీ తిరుమల రామచంద్ర ఆధునిక రచయితలలో ఎన్నదగ్గ వ్యాస స్రష్ట.

## 7. శ్రీ సంజీవదేవ్

రస రేఖలు (1963), తేజోరేఖలు (1965) రెండు వ్యాస సంపుటులు. అయితే రచయిత శ్రీసంజీవదేవ్ రసరేఖలు వ్యాసాలుగా అనుకొన్నట్లు ''ఈ వ్యాసావళి చేతయి వ్రాయటం, చేతకాక వ్రాయటం, ఈ రెంటి సమ్మేళనం'' అనీ, ''ఈ వ్యాసావళిలో రసం, రూపం, భావం, కళలూ, కళాకారులూ తత్వం తాత్వికులూ పర్యటనలూ కొండలూ ఎన్నో అక్షర రూపంలో ప్రత్యక్షమవుతవి'' అనీ స్వీయగానంలో వివరించటం వల్ల తెలుస్తుంది. తేజోరేఖలు విషయం ఆ మాట అనలేదుకాని, అవీ, ఇటువంటి రచనలే కాబట్టి వ్యాసాలు.

వ్యాస రచన విషయంలో ''విజ్ఞానానికి తోడు వినోదాన్ని కూడా ప్రసాదించే లాగా వ్రాస్తేనే వ్యాస రచనలో భోగట్టాకు తోడు ఆనందం దొరికేది'' (రసరేఖలు పుట IV) అనీ, ''ప్రత్యేకించి పర్యటన వ్యాసాలు కల్పనా సాహిత్యంలో లాగా కొంత మనోరంజకత్వాన్ని కలిగివుంటవి'' (పుట III) అనీ ఉండటం వల్ల కొంతవరకు వ్యాసధర్మం గుర్తించటం జరిగిందని తెలుస్తుంది.

జాన్‌సన్ చెప్పినట్లు, అవ్యవస్థంగా, అక్రమంగా ఉన్న ఆలోచనలీ వ్యాసాలు. ఇవి సృజనాత్మకంగా ఉన్నాయి. రచయిత అనుభూతితో వ్యాసాలు అందంగా రూపొందాయి. చిత్రలేఖనం ప్రధాన వస్తువుగా చాలా వ్యాసాలలో గోచరమవుతూ వుంది. చిత్రలేఖనజ్ఞుని హృదయ దీప్తిగా ఈ వ్యాస సృష్టి వుంది.

## 8. శ్రీ టి. భాస్కరరావు

స్ఫూర్తిశ్రీ వ్యాసావళి (1965) రెండు భాగాలుగా ఉంది. పద్యగద్య గేయ వాఙ్మయం సృష్టించే రచయిత ఈ వ్యాస రచనంలో నేర్పు చూపాడు.

కవితా పరిశీలనకు సారస్వత విమర్శనకు సంబంధించి సాగిన వ్యాసావళి, భాషాదృష్టి వివరించే 'మాటలంటే మాటలా?' 'మాటలతో మంతనాలు' సృజ నంగానే రూపొందాయి. ఆంధ్ర భాషా సారస్వత రంగాలలో కృషి చేస్తున్న శ్రీ టి. భాస్కరరావు ప్రయత్నంగా ఈ వ్యాససృష్టి వుంది.

వ్యాస విషయ విభజనంతో జాగరూకత, విమర్శనంతో నిశితత్వం సమగ్రంగా ఆలోచన, కవితామయంగా, ఆనంద సంపాదకంగా అభివ్యక్తి, వస్తుబోధనలో సరళత, వ్యాసకర్త సామర్థ్యం తెలుపుతున్నాయి.

## 9. కాటూరి వేంకటేశ్వరరావు

కాటూరి వేంకటేశ్వర రావు 'సాహిత్య దర్శనము' (1967) వ్యాస సంపుటి. కాటూరి పింగళి లక్ష్మీకాంతంతో జంటకవి. 'తొలకరి', 'సౌందర నందము' వంటి ఉత్తమ కావ్యాలు సృష్టించి స్వయంగా గద్య పద్యాత్మక రచనలు చేసి, ఆంధ్ర కవితాలోకంలో సుప్రసిద్ధి వహించిన కాటూరి వేంకటేశ్వర రావు వ్యాస రచనంలో నూత్న కోణ మవుతూ వుంది.

ప్రాచీనాధునిక సాహిత్య సంబంధిగా ఈ వ్యాసాలలో విమర్శనం సాగింది. శంభుదాసు టాగూరు వ్యాసాలలో ప్రత్యక్షమవుతున్నారు, ఆధునిక ప్రక్రియల మీద అభిప్రాయ ప్రకటనం ఉంది. సాహిత్య విమర్శనంలో వ్యక్తి గత సంబంధాలు గమనింపవచ్చు, బుచ్చి సుందరుని స్మృతి, మా గురుదేవులు, మా బాపిరాజు వంటి జీవిత చరిత్ర వ్యాసాలున్నాయి.

ఈ వ్యాసాలు కవితా హృదయమున్న వ్యక్తి ఆలోచనలు. భాష సరళ సుందరంగా ఉంది. అభివ్యక్తి ఆత్మీయత నుంచి కలిగింది. సన్నివేశాలు, పద్యాలు, ఉదాహరణాలుగా చూడవచ్చు. ఒక క్రమం లేకుండా ఏ విధంగా ఆలోచన సాగితే ఆ మార్గంలో రచన చేసినట్లు కొన్ని వ్యాసాలుంటే, కొన్నింటిలో క్రమత గోచరమవుతూ వుంది.

సాహిత్య విమర్శనం, వ్యక్తిగత పరిచయాలు సృజన వ్యాసాలుగా, సామాన్య పాఠకుడికి పఠన యోగ్యంగా హృద్యంగా ఉండటం ఈ సంపుటి వైశిష్ట్యం.

## 10. బుచ్చిబాబు

బుచ్చిబాబు నవలా రచయితగా సుప్రసిద్ధుడు. కథాకవితా రచనలు చేసినట్లు తెలుసు. కాని సృజన వ్యాసం, విమర్శనం వ్రాసినట్లు అందరికీ రచయిత పరిచయం కాలేదు. షేక్స్పియరు సాహిత్య విమర్శనకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ బహుమతి లభించింది. ఆంగ్లోపన్యాసక వృత్తితో జీవితం ప్రారంభమయి, ఆకాశవాణి ఉద్యోగంతో ముగిసిపోయింది. ఆంధ్రజ్యోతిలో వారం వారం వెలువడ్డ అంతరంగ మధనం (1968) ఆత్మకథా వ్యాస రచన 'నన్నుమార్చిన పుస్తకం' వ్యాస సంపుటి. ఆ యీ వ్యాసాలు రచయితను సృజన వ్యాస నిర్మాతను కావించాయి.

తన జీవితంలో చిన్నతనం నుంచి జరిగిన సంఘటనలు ఒక్కొక్క వ్యాసం అసంపూర్ణంగా వ్రాసిన బుచ్చిబాబు హృదయవాది. బాపిరాజు, చలం, గోపీ చంద్, కృష్ణశాస్త్రి, ఆల్డస్ హక్స్లీ, షేక్స్పియరు ఎలియట్ జీవితాలు, తన వ్యక్తిగత, సాహిత్య పరిచయంతో వివరించి, జీవిత చరిత్ర వ్యాసంలో సాహిత్యం అనుసంధించిన రచయిత బుచ్చిబాబు. నూత్న పదాలు రూపొం దించటంలో రచయితను గమనింపవచ్చు. 'కవిత్వం' వంటివి అనేకం. బుచ్చిబాబు చక్కని సృజన వ్యాస రచయితగా సాహిత్యం గ్రహించింది. ఉత్తమ సాహిత్యం చదివిం తర్వాత మనస్సు పొందే అనుభూతి బుచ్చిబాబు వ్యాసాలు చదివితే కలుగుతుంది.

## 11. డా. బోయి భీమన్న

డా. బోయి భీమన్న "ఏకపద్యోపాఖ్యానము, సవ్యాఖ్యానము, సాహిత్య వ్యంగ్య రచన (1969) వ్యాసం, ఆధునికాంధ్ర సాహిత్య వ్యాఖ్యాన, విమర్శన విధానానికి చెర్నాకోల దెబ్బ. ఇది అనేక ప్రక్రియలు వ్రాయటంలో నేర్పు కలిగి పద్మశ్రీ, కళాప్రపూర్ణాది బిరుదాలతో వున్న డా. బోయి భీమన్న చేసిన సృష్టి.

ఒక పద్యం వ్రాసిన కవిగా, ఆ పద్యానికి వ్యాఖ్యాతగా, ఆ చిన్న పుస్తకానికి అవతారిక వ్రాసిన పీఠిక కర్తగా మూడు రూపాలతో తానే భిన్న వ్యక్తులు ప్రవర్తించినట్లుగా కనిపించటం ఈ వ్యాసంలో గమనింప వలసిన

పులి విశాల హృదయం, రేచుకుక్కల అడవి పంది పోరాటం, దురహంకారి దుష్ట జంతువు చిరుతపులి స్వభావం అడవుల్లో విచిత్రానుభవాలు, జంతువుల జాడలు నీడలు, వేట ప్రమోదంలో ప్రమాదాలు, ఆంధ్ర దేశంలో హరిణ జాతిలో ఉన్న వైవిధ్యం, పెద్దపులి రాజసప్రవృత్తి రచయిత వేటాడటంలో ఎదుర్కొన్న ఇబ్బందులు, ప్రకృతి మీద అడవిమీద మనిషి మమకారం, వేటకు సంబంధించిన అనుభవాల అక్షరరూపంగా ఈ వ్యాసాలు ఆవిర్భవించాయి.

ఈ వ్యాసాలు ఆత్మకథలుగా భావింపవచ్చు కానీ, వేటకే పరిమితం కావటంతో మృగయా వినోదంగా గ్రహించటం జరిగింది. తెలుగు వ్యాసరచనంలో ఈ వస్తువు పూర్వ మెప్పుడూ లేదు.

ఈ వ్యాస కర్త వేటను, తదనుభవాలను తాదాత్మ్యంగా ప్రేమించిన తీరు గుర్తింపవలసిన విశిష్టంగా ఉంది. ప్రకృతి శక్తిని సజీవంగా చూచి, అనుభవించి, జీవించి వ్యాస సృష్టి కావించి, ఆనందించిన రచయిత అదృష్టం ఈ వ్యాసాలలో ప్రతిక్షణం కనిపిస్తుంది.

## 14. ఇతర వ్యాసకర్తలు

నేటి రచయితలు అధికంగా విమర్శన వ్యాససృష్టి కావిస్తున్నారు. సృజన వ్యాస సృష్టి కావిస్తున్నారు. సృజన వ్యాసమంటూ ఉంటుందని కొద్దిమంది వ్యాస కర్తలు గుర్తించలేదు. ప్రస్తుతం వ్యాస రచన కావించే వాళ్ళలో సృజన గుణమున్న వాళ్ల వ్యాసాలు పరికింపవచ్చు.

శ్రీ అమరేంద్ర 'భావవీణ' పేరుతో వెలువరించిన వ్యాసాలలో సాహిత్య విమర్శనం కొంత ఉన్నా, సృజన గుణం విస్తృతంగా ఉంది. భావ వీణ వ్యాసం, కవితగా 'రిపబ్లిక్ డే' భారతీయ భాషలన్నింటిలోనూ ప్రసారమయింది. ఒక హృదయ వీణ నుంచి వెలువడ్డ ధ్వనులీ వ్యాసాలు. ఇది కవితా పరిధిని వ్యాస పరిధిలోనికి తెచ్చిన రచనల సంపుటి. శ్రీ అమరేంద్ర హృదయ దర్పణంగా వెలువడ్డదీ సంపుటి.

శ్రీ సోమంచి యజ్ఞన్న శాస్త్రి 'ఎఱ్ఱ టేపు' సృజన వ్యాస సంపుటి. ప్రభుత్వ కార్యాలయాలలో ఎక్కువగా, ఇతర కార్యాలయాలలో తక్కువగా ఫైళ్ళకు సంబంధించిన ఆలస్యం వ్యక్తం చేసే, రెడ్ టేప్ చేసే, చిత్రవిచిత్రాలు

'ఎఱ్ఱ దేపు' పేరుతో వ్యాసాలుగా రూపొందాయి. ఆలస్యానికి, అశ్రద్ధకు, అవినీతికి మారుపేరుగా చెలామణి అయ్యే 'ఎఱ్ఱదేపు' వ్యాసాలు సృజనంగా రచయిత బాధ నింపుకొని వెలువడ్డాయి.

శ్రీ దరిశి చెంచయ్య రచన 'నా దివ్య స్మృతులు' రాజకీయంగా సాంఘికంగా చైతన్యం వాంఛించి కృషి చేసిన మేధావి జ్ఞాపకాలుగా సృజనంగా ఉన్న వ్యాసాలు.

వైజ్ఞానికంగా, శాస్త్రీయంగా రచనలున్నప్పటికీ వాటి రచనం సృజనంగా ఉండటం గమనింపవచ్చు. సారస్వతం ఉదాహరణ బలమైనా నిద్ర మొద లయిన ఆలోచనలు ఈ ధర్మం వివరిస్తున్నాయి. విమర్శనమయినా, రచనలోని పై గుణం వల్ల పరిశీలింపవచ్చు. ఈ కోవలో సాగిన శ్రీ విస్సా అప్పారావు 'వ్యాసావళి' (1956) వైజ్ఞానికంగా రూపొందింది. శ్రీ వావిలాల సోమయాజులు ప్రచురించిన మణి ప్రవాళము సారస్వత వ్యాస సంపుటిగా ఉన్నప్పటికి డా. అప్పజోడు వెంకట సుబ్బయ్య వ్యాస మంజరి (1962), షట్పది (1964) సాహిత్య బలంతో రూపొందిన వ్యాస సంపుటులు. శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ 'నరుడు - నక్షత్రాలు' (1968) వ్యాసాలు విజ్ఞానాత్మకంగా ఉన్నాయి.

సాంఘికంగా ఉన్న వ్యాసాలు సృజనంగా ఉండటానికి డా. గుంటుపల్లి రాధాకృష్ణమూర్తి (1958) 'సంఘ జీవనం' దర్శింపవచ్చు. ఈ వ్యాసంలో సంఘం, మానవుల అస్తిత్వం, వ్యక్తి అవసరాలు మనిషి ప్రాముఖ్యం వివరించటం జరిగింది. శ్రీ సుదర్శన 'ఆలోచనలు-అనుభవములు' (1960) ఆలోచనాధిక్యాన్ని, అనుభవాంతర్యాన్ని తెలిపే సృజన వ్యాసం.

ఈ యుగంలో వ్యాసం రచనా ప్రక్రియగా విస్తృతత్వం పొందింది. వ్యాస వస్తువులు వివిధంగా రూపొందాయి. సృజన గుణం అధికంగా అభివ్యక్త మయింది. రచయితల హృదయావిష్కరణం వ్యాసగతంగా గోచరమయింది. భిన్న సృజన ప్రక్రియలు రచింపబడుతూ వుండటం వల్ల వ్యాస రచన సృజ నంగా ఎక్కువగా పురోగమించలేదు. ఈ యుగంలో ఈ వ్యాస రచయితలు రచనలు ఎక్కువే అయినా, ఇతర ప్రక్రియలతో పోల్చి చూచినప్పుడు, ఈ యుగంలో ఈ ప్రక్రియ ఎక్కువగా రచనం పొందక పోయినా, గుణంలో విశిష్టత పరిగ్రహింపవలసినంత అధికంగా వుంది.

# స్త్రీ వ్యాసం

## 1. స్త్రీ వ్యాస సృష్టి :

తెలుగు దేశంలో అనేక రంగాలలో స్త్రీలు ప్రాధాన్యం వహించారు. సారస్వత రంగంలో సృజన విమర్శన వాఙ్మయ నిర్మాణంలో స్త్రీలు ప్రాధిక్యం పొందారు. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత స్త్రీ అభ్యుదయం ఇంకా విశిష్టంగా రూపం దిద్దుకొంది. వ్యాస రచనంలో స్త్రీలు కందుకూరి కాలం నుంచి కృషి చేశారు.

ప్రాచీన భారత దేశంలో స్త్రీలు విద్యాభ్యాసం చేసినట్లు, సాహిత్యం సృజించినట్లు స్పష్టమయినా, తెలుగు దేశంలో స్త్రీలు కవిత్వం వ్రాసినట్లు, పాండిత్యం పొందినట్లు గ్రహించినా, మధ్య కాలంలోని మహమ్మదీయుల దండ యాత్రలు, జమీందారీ పరిపాలనం, ఆర్థిక సాంఘిక స్థితులు కొంతవరకు కారణమై, స్త్రీ జీవితం ఒకనాటి స్థితిలో లేకుండా అయిపోయింది.

ఈ దశనుంచి స్త్రీ జాత్యభ్యుదయం కలగటానికి వర్తమాన సాంఘిక చైతన్యం, సాంప్రదాయిక బలం, స్త్రీ ప్రయత్నం, పురుష సంసిద్ధతలతోపాటు ఆంగ్లేయ పరిపాలనం కూడా దోహదం చేసింది. ఆంగ్ల విద్య స్త్రీ విద్యకు ప్రోత్సాహ మిచ్చింది. దీని వల్ల విద్యావతులు సాంఘిక అసమానతలను గూర్చి తీక్షణంగా ఆలోచించటం ఆరంభించారు. ఈ స్థితులు పరికించి వ్యథా హృదయాలతో బాధానుభూతి పొందారు. అంతవరకు హిందువులుగా ఉన్న ఆంధ్రులు క్రైస్తవులుగా, బ్రహ్మ సమాజమతస్థులుగా మారితే, స్త్రీలు పొందుతున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సమానతలు విస్పష్టంగా గ్రహించారు స్త్రీలు. ఈ గుర్తింపు ఒక విధంగా స్త్రీ జాతికి మేలుకొలుపు. అప్పటినుంచి ఒక సంచలనం, ఒక కనుపించని విప్లవం ఆరంభమయింది. ఇది, ఆంధ్రజాతి నిలిచి ఉన్న సాంప్రదాయకపు కట్టడాల పునాదులలోకి పోయింది. ఈ దశలో ప్రపంచంలో కొంతవరకు, భారతదేశంలో అధికంగా, వస్తున్న భావ విప్లవం దోహదమయింది.

ఈ స్థితి ఆలోచించే స్త్రీలకు, విద్యావతులకు స్పష్టంగా విశదమయినంత తొందరగా స్త్రీలందరికీ తెలియటం లేదు. పురుషులు, స్త్రీల బ్రతుకులు జాగ్రత్త పడాలనుకొన్నవాళ్ళు, ఈ భావ ప్రచారానికి సాహిత్యాన్ని వినియోగించుకోవటం, అప్పుడే అందాలు దిద్దుకొంటున్న సుందరిలాంటి వచనం ప్రయోగించటం, అప్పటికి దాదాపు సిద్ధించిన వ్యాస ప్రక్రియ వాడుకోవటం, కందుకూరి వీరేశలింగం పంతులు వంటి సంఘ సంస్కర్తలు ఉపన్యాసం వ్యాసంగా తమ సారస్వత రచనా కృషిలో స్త్రీ సమస్యలు వెలువరించటం పరికించిన స్త్రీలు, తమ వారికీ, సమాజానికీ సరసంగా వివరించటానికి, విశదపించటానికీ, విజయం సాధించటానికీ, సాహిత్యం బలమైన ఆయుధంగా గ్రహించారు.

అప్పటి నుంచి స్త్రీలు సారస్వత రంగంలో కృషి చేయటం ప్రారంభించారు. కవితలు, కథలు, వ్యాసాలు, ఉపన్యాసాలు సృజించారు. వేదికల మీద ప్రసంగించారు. ఈ దశలో, ఉపన్యాస మిచ్చి, వ్రాసి, వ్యాసంగా ప్రచురించిన స్త్రీలు పలువురున్నారు. వాళ్ళ వ్యాసాలన్నీ పత్రికలలో మరుగుపడి, వేదికల మీద వాగ్రూపాలై పోయాయి. పుస్తకరూపంలో వెలువడి మిగిలిన కొన్ని స్త్రీల వ్యాసాలు పరిశీలింపవచ్చు.

రచయిత్రుల వ్యాసాలు ప్రధానంగా స్త్రీల సమస్యలు, స్త్రీ భక్తి బోధించేవిగా ఉన్నాయి. స్త్రీ విద్య వాంఛించటం, బాల్య వివాహాలు తిరస్కరించటం, వితంతు వివాహాలు అంగీకరించటం, వేశ్యా వృత్తి నివారించాలనటం జరిగింది. స్త్రీ పతివ్రతగా, సద్గుణరాశిగా, సహధర్మచారిణిగా ఉత్తమ జీవితం కలిగి ఉండాలని కోరటం స్పష్టమయింది. ఉత్తమ స్త్రీల జీవితాలు తెలుసుకోవటంతోపాటు పురుషుల్ని దిద్దుకోవాలనే దృష్టి పెరిగి, వారి అలవాట్లు తప్పించి, భర్తను క్రమమార్గంలోకి తెచ్చుకోవాలని బోధించటం ఉంది. అంతే కాదు, స్త్రీలు భగవద్భక్తి కలిగి ఉండాలని, బ్రహ్మసమాజం నిర్వహించే ప్రార్థనా మందిరాలు దర్శించాలనీ వివరించటం జరిగింది.

ఈ చైతన్య రచనంతో ఆగిపోక, ఉపన్యాసంగా విస్తృత మయింది. స్త్రీలు, స్త్రీజాత్యభ్యుదయం వాంఛిస్తూ ఉన్న ఊళ్ళలోనూ, పొరుగూళ్ళలోనూ, తమంతట తాము పోయి అయినా సరే, ఆహ్వానింపబడి అయినా సరే, ఉపన్యా

సించటం గమనార్హమైన పరిణామం. ఆ ఉపన్యాసాలు, వ్యాసాలుగా అనంతరం ముద్రించటం కూడా జరిగింది.

ఈ కృషి ఇంతటితో ఆగిపోలేదు. కార్య రంగంలో ప్రయత్నించటమూ ప్రారంభమయింది. సాంప్రదాయిక జీవితం అనుభవిస్తూ చీకటిలో ఉన్న వాళ్ళు వెలుగు చూడలేక పోతుంటే, చూపటం విధిగా భావించారు. ఈ తరంలో స్త్రీలు, వితంతువులు పునర్వివాహాలు అంగీకరించలేక పోతుంటే ప్రోత్సహించటంతో పాటు, ఆ వివాహాలు చేయించటానికి, బాల్య వివాహాలు ఆపటానికి తీవ్రంగా కృషి చేశారు. స్త్రీలు వృత్తులు అవలంబించటానికి దోహదం చేశారు. ఎప్పుడైనా ఈ రంగంలో అలసత కనుపిస్తే, పురుషులు ఉత్సాహపరచటం, కార్యోన్ముఖంగా స్త్రీలను నడిపించటం, హెచ్చరిక చేయటం కూడా వుంది. ఉదా॥ ''గత సంవత్సరము మహిళా సభలో కర్మ విద్య నేర్చుకొనుటకు స్త్రీ దొరికిన యెడల నెలకు రూ. 15 యిచ్చెదనని తెలియజేసి యుంటిని. అట్టి వారిని మీరు జాగ్రత్త చేయక పోవడము ఆలోచించగా పురుషులవలె మీరున్ను సభలలో నుపన్యాసము లిచ్చుటలో సంతోషించుచున్నారు గాని ఆ పని నెరవేరుటకు తగిన ప్రయత్నములు చేయుచున్నట్లు తోచదు.'' అని రంగాభట్ల గున్నయ్య శాస్త్రి ఆంధ్ర మహిళా సభ ప్రచురణ 'మంజరి'లో వ్రాయటం చూడవచ్చు. పురుష సహాయంతో స్త్రీలు సారస్వత కార్య రంగాలలో చేసిన కృషి గ్రహించి, ఉపన్యాస పరిధిలో జరిగిన కృషి పరిశీలించాలి.

స్త్రీలు రచయిత్రులు కవయిత్రులు అవటం వల్ల సామాజిక ప్రయోజనంతో పాటు, సారస్వతం కూడా సుసంపన్నం అయింది. తెలుగు కావ్య వాఙ్మయం, యక్షగానాలు సృష్టించటంలో స్త్రీలు అధికంగా లేరు. వర్తమానాంధ్ర సాహిత్యంలో స్త్రీల సృష్టి సముచితంగా సమర్థ్యంగా, సమర్థంగా ఉంది. సంఖ్యలోనే కాదు గుణంలోనూ శ్రేష్ఠంగా వుంది. దీనివల్ల తెలుగు సారస్వతంలో పూర్వమెప్పుడూ లేని కొత్త పరిణామం వచ్చింది.

సాహిత్యం సమాజ ప్రతిబింబం అనటం అంగీకరిస్తే, ప్రాచీన వాఙ్మయం పాక్షిక ప్రతిబింబమనీ, వర్తమాన సారస్వతం పూర్ణ ప్రతిబింబమనీ, అనటానికి అవకాశం ఉంది. పురుషులు సృష్టించిన వాఙ్మయంలో పురుష భావన నిక్షిప్తమయిన సమాజం లభించింది. స్త్రీ పురుషులు సృజిస్తున్న సారస్వతం, ఇద్దరి

అనుభూతికి ప్రతిబింబమయింది. నాగరక నవ్యాంధ్ర సమాజం, స్త్రీలను రచనకు ప్రోత్సహించింది. పరిపూర్ణ సంఘ చిత్రపటం దర్శింపచేసింది. పురుషుడే స్త్రీ భావన చేసినా, స్త్రీ భావించినట్లు భావించినా, అది పురుషభావనే కాని స్త్రీ భావన కాదు.

ఈ దృష్టితో గమనిస్తే స్త్రీ సారస్వతం సృష్టి దర్శనానికి సమగ్రతను, సదవకాశాన్ని కలిగిస్తుంది. తెలుగులో ఇతర ప్రక్రియల విషయం అటుంచి, వ్యాస గతంగా ఆలోచిస్తే సంఘ సంస్కరణకు ఈ వ్యాసాలు, ఉపన్యాసాలు ఎంతో దోహదం చేశాయనీ, స్త్రీలు చైతన్యం పొందటానికి అవకాశం కల్పించాయనీ, రచయిత సృష్టికంటే, రచయిత్రి సృష్టిగా సత్వర ఫలితాలు సాధించాయనీ తెలుస్తుంది ఈ వ్యాస రచయిత్రులను భావంలో ప్రభావంలో మార్పు కారణంగా స్వాతంత్ర్యానికి పూర్వం అనంతరం రచనలు చేసిన దృష్టితో నాటి, నేటి రచయిత్రులుగా పరిశీలింపవచ్చు.

## 2. నాటి రచయిత్రులు

ఉపన్యాసం ఇచ్చినా, వ్యాసం వ్రాసినా రచయిత్రుల మీద కందుకూరి వీరేశలింగం పంతుల ప్రభావం ఉంది. అది ప్రోత్సాహ రూపంలో ప్రత్యక్షంగానో, ఉపన్యాస రీతికి మార్గదర్శి అయిన వ్యక్తికి లక్షణ గ్రహణం వల్ల పరోక్షంగానో ఉంది.

ఈ దశలో ఉన్న స్త్రీ వ్యాస రచనంలోని ప్రధాన లక్ష్యం కష్టం తొలగించుకోవటమే! స్త్రీ జీవితం చుట్టూ చుట్టుకొన్న కష్టనష్టాల ముళ్ళ తీగలు ఛేదించటమే ఉపన్యాస వ్యాసాలతో రెండంచుల పదును ఉన్న సారస్వత కుఠార కార్యమయింది. ఇటువంటి వ్యాస వాఙ్మయం సృష్టించిన విదుషీమణుల సారస్వతం దర్శింపవచ్చు.

### 1. బండారు అచ్చమాంబ

‘అబలా సచ్చరిత్ర రత్నమాల’ వ్యాస సంపుటి ఈమె సృష్టి. తెలుగులో వ్యాసకర్త్రి స్త్రీ సంఘం పట్ల అభిమానంతో అన్యదేశాలలో ఉన్న [illegible] సోదరీమణుల సచ్చరిత్రాలను వెదకి సంపుటీకరించి మేలుచేసింది. ఈ వ్యాసాలు

జీవిత చరిత్రాత్మకంగా ఉన్నాయి. రచయిత్రి భిన్నపట్టణాలలో ఉపన్యసించింది. రాజమహేంద్రవరంలో 'జనానా ప్రార్థనా సమాజం' సమావేశంలో ప్రసంగిం చటం తెలుసుకోవచ్చు. ఈ సమాజ స్థాపన చేసిన కొటికలపూడి సీతమ్మ, ఈ రచయిత్రి దర్శనమే గొప్ప లాభంగా భావించటం ఉచితంగా ఉంది. రచయిత్రి రచనా వ్యాసంగం భర్త సహాయంతో లభించింది.

## 2. కొటికలపూడి సీతమ్మ

కొటికలపూడి సీతమ్మ 'ఉపన్యాస సుమమాలిక' (1903) వెలయించి, సారస్వత రంగంలోని ఉపన్యాస ప్రక్రియ స్త్రీలకు కలిగించిన ప్రోత్సాహం తెలిపింది. ఇందులోని 18 వ్యాసాలు స్త్రీ సమస్యల వివరణ సమర్థంగా ఉన్నాయి.

రాజమహేంద్రవరంలో 'జనానా ప్రార్థనా సమాజం' ఏర్పరచి, ప్రతి శుక్రవారం స్త్రీలను తన యింటికి పిలిపించి ఈశ్వరారాధనం చేస్తూ, పలువురిని పిలిపించి ఉపన్యాసాలు ఇప్పిస్తూ, కాకినాడ వంటి ప్రదేశాలలో తాను ఉపన్య సిస్తూ, వార్తా పత్రికలలో సమాజాభివృద్ధి ప్రకటిస్తూ స్త్రీ జీవితాభ్యుదయం సాంఘికంగా కోరుతూ, సంస్కరణ హృదయం నిలుపుకొన్న రచయిత్రి కొటి కలపూడి సీతమ్మ. స్త్రీ, మత విషయాలలో ప్రముఖంగా వ్యాసకర్త్రి ప్రవర్తించ టానికి కందుకూరి వీరేశలింగం పంతులు దోహదముంది. రచయిత్రి ఉపన్యాసా లలో "ఒక సజ్జనోత్తముని జనన దిన మహోత్సవము" ఆ విషయం వివ రిస్తుంది.

ఇందులో వ్యాసకర్త్రి, స్త్రీ విద్యా ప్రాధాన్యమూ, విద్యావతుల వల్ల సమాజ లాభమూ, వితంతు శరణాలయావశ్యకమూ వివరించటం; స్త్రీలకు ఔచిత్యం, ఐకమత్యం, సత్యం, నీతి తెలపటం; దైవభక్తి ప్రార్థనం బోధించటం; స్వయంకృషి, పరస్పర మైత్రి ప్రోత్సహించడం చేసింది. స్త్రీ అభివృద్ధి చెందా లని, స్త్రీలలో భక్తి పెరగాలని రచయిత్రి ప్రధానాశయం.

ఈ రచనలు ముద్రితంగా వ్యాసాలుగా గ్రహించినా ఉపన్యాసాలే! "నే నిట్లుపన్యసించుట కిదియే ప్రప్రథమమగుటం జేసియు, మత విషయిక జ్ఞాన మత్యల్ప మగుటం జేసియు, నా జెప్పెడు పలుకులు మిమ్మాశ్చర్యంగుఱను చేయునని మాత్రము చింతిల్లుదానను" (సత్యము-పుట 1)

ప్రత్యుపన్యాసారంభంలో సమాజస్థులను 'హిందూ సుందరులగు నా ప్రియ సోదరీమణులారా!' 'ప్రియ సోదరీమణులారా!' అని సంబోధనం తత్తదుచిత సల్లాప పూర్వకంగా ఉండటం, ఈ సంబోధనం ప్రారంభంలో దీర్ఘంగా ఉండి, క్రమంగా హ్రస్వంగా రూపొందింది. ఉపన్యాసాంతంలో సారాంశంగా పద్యం ఉండటం మామూలు.

వ్యాసాలు పరిమితంగా, భాష సులభంగా, విషయం విస్పష్టంగా, ఉన్నాయి. ఉపన్యాస రచన సమర్థంగా రచయిత్రి చేసింది. వ్యాస కర్త్రికి సాహిత్యం కంటే, భగవద్భక్తి కంటే, ఉపన్యసించటం కంటే, స్త్రీ పురోభివృద్ధి ప్రగాఢ వాంఛ అయినట్లు వ్యాస సంపుటి ప్రత్యక్షంగా తెలుపు తుంది. పురుష కాఠిన్యం సూక్ష్మంగా విమర్శించినా అంత స్వాయువుల్లోని స్త్రీ జాత్యభ్యుదయానికి ఈ 'ఉపన్యాస సుమమాలిక' అక్షర రూపం.

## 3. టి. సింగమ్మ

'నారీ రత్నములు' అనే వ్యాసం 'బృందావన స్త్రీ సమాజము' యొక్క 'ప్రథమ సాంవత్సరికోత్సవమున' చదివింది రచయిత్రి. ఇందులో బహుభాషలు నేర్చిన, స్వీడను రాజ్యాధి పత్యం వహించిన 17 వ శతాబ్ది, 'క్రిష్టినా', హోల్కారు సంస్థానాన్ని గొప్పగా పాలించిన 18 వ శతాబ్ది 'అహల్యాబాయి', రాజకీయ సంస్కరణలు వాంఛించిన 'రాణీ గౌరి లక్ష్మీబాయి', అన్నాతురులను ఆదరించిన కాశిం బజారు మహారాణి 'సుపర్ణమయి', దయా స్వరూపిణి 'విక్టో రియా మహారాణి', వంటి అనేక రత్నాల వంటి, ఉదాత్తగుణాల ప్రదర్శించిన స్త్రీల జీవిత గాథలు, ఆంధ్ర దేశ స్త్రీ పురోభివృద్ధి తెలిపేటట్లు వ్రాసింది. వ్యాసం చక్కని ఉపన్యాసంగా రూపొందింది.

## 4. పులుగుర్త లక్ష్మీనరసమాంబ

'పాతివ్రత్యము, (1906), 'ఆగ్రాసనాధిపురాలియుపన్యాసము' (1910), 'గుంటూరు ప్రథమ వత్సరపు ఆంధ్ర మహిళా మహాసభోపన్యాసములు', 'ఆధ్యాత్మిక విద్యకును మన దేశ ప్రకృతికిని గల సంబంధము' (1911), 'విద్యావతుల యర్హ్యకృత్యములు' (1915) పుస్తక రూపంలో లభించే వ్యాసాలు. భక్తి ప్రోత్సాహంతో, శ్రీ సావిత్రి పత్రికలో రచయిత్రి వ్యాస ప్రచురణం చేసినా లభ్యం కావటం లేదు. ఈ వ్యాసకర్త్రి రచనా జీవితం మీద కందుకూరి

10. జూలూరి తులశమ్మ
11. దామెర్ల సీతమ్మ
12. దాపులూరి కామేశ్వరమ్మ
13. నడుపల్లి బుచ్చి వెంకటసుబ్బమ్మ
14. పరశూరి ఓంకారము
15. పిళ్ళారిసెట్టి లక్ష్మీకాంతమ్మ
16. పులుగుర్త లక్ష్మీనరసమాంబ
17. పెమ్మరాజు లక్ష్మీదేవమ్మ
18. బాలాంత్రపు శేషమ్మ
19. బుఱ్ఱా బుచ్చి బంగారమ్మ
20. బొమ్మవరపు వెంకటరత్నమ్మ
21. మల్లాది లక్ష్మీదేవమ్మ
22. మోటుపల్లి రాజాచాయమ్మ
23. రాజనాల గవరమ్మ
24. వల్లూరి వెంకాయమ్మ
25. వారణాసి అన్నపూర్ణమ్మ
26. వారణాసి కామేశ్వరమ్మ
27. వేల్పూరి పక్కలంక వెంకట రామజోగమ్మ
28. సీతమరాజు లక్ష్మీనరసమాంబ

వీళ్ళలో సంస్కరణ దృష్టి ప్రబలంగా ఉన్న దామెర్ల సీతమ్మ వంటి వాళ్ళు; పాండిత్య ప్రదర్శనం చేయాలన్న కుతూహలం ఉన్న జూలూరి తులశమ్మను పోలేవాళ్ళు; విద్యాపరురాలయి ఆలోచనా తీవ్రత చూపిన కొలచిన కాంతమ్మకు తుల్యమైనవాళ్ళు పులుగుర్త లక్ష్మీనరసమాంబ, కళ్ళేపల్లి వెంకట రమణమ్మ వంటి ఉన్నత స్థానంలో నిలిచే సామర్థ్యమున్న వాళ్ళు; పలువురు ఈ వ్యాసగతంగా భావ వ్యక్తీకరణం చేశారు. ఈ రచయిత్రులలో చాలామంది ఆ కాలం పత్రికలలో వ్యాసాలు వ్రాశారు.

రచయిత్రులు ఆలోచననో, అనుభూతినో సూటిగా అభివ్యక్తం చేయకుండా పాండిత్యాన్ని, భాషా ప్రయోగ నైపుణ్యాన్ని ప్రదర్శించాలని, రచనను

అసమర్థంగా చేయటం సర్వసామాన్యమయింది. ఇది "త్రెంపి పోసి నట్లెచ్చటి కచ్చటే విఱుపు. ఎక్కడికక్కడే యదుకు ఎక్కడి కక్కడే ముడి. సందర్భ శుద్ధియుఁ జాలఁ దక్కువ. ఇప్పుడు సామాన్యముగా వ్రాయు నంబలలో నేయంబ వ్రాఁత తిన్నగఁ జూచినను పంబ బఱుకునట్లో, కుంటి కాలీడ్చునట్లో, చీకటిలో నెగుడు దిగుడు నేలలో నడ్డదిడ్డముగా దొరలినట్లో, సెనగలు నములు చుండఁగఁ బండ్లకుఁ గటుక్కున రాయి తగిలినట్లో యుండుటయె కాని కమ్మచ్చు దీసినట్లు, తీఁగె వాటముగఁ జల్లున వార్చిన గంజివలె, సారవంతముగ ధారాళ ముగనుండుట యెంత మాత్రమును లేదు" అని పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు అంతఃపురోపన్యాసములో (పుట 495) అనటంలో తీవ్రత ఎక్కు వయినా, వాస్తవం వున్నట్లు గమనింపవచ్చు. ఏమయినా ఆంధ్ర మహిళా సభ ప్రారంభ ప్రయత్నాలలో ఉపన్యాస సృష్టి జరిగింది. స్త్రీలు, సమకాలిక సమ స్యలు ఈ ప్రక్రియాగతంగా వెలువరించారు.

## 6. వాడ్రేవు జోగాయమ్మ

'వేదకాలపు స్త్రీలు' (1933) అన్న గ్రంథం పరిశోధనాత్మకమయిందే అయినా, 12 వ్యాసాల సంపుటిగా గ్రహింపవచ్చు. దీనిని జటావల్లభుల పురుషోత్తము, ఈ రచయిత్రి వ్రాశారు. వేదకాలంలో స్త్రీలకున్న ఉన్నతి తెలుప టానికి ఉద్దేశింపబడింది.

స్త్రీ పుట్టటం, పెరగటం, పెళ్ళాడటం, సపత్ని కావటం, దాంపత్యమను భవించటం గృహ నిర్వహణ చేయుటం, బాహ్య ప్రపంచం పరిశీలించటం, విద్యలు వృత్తులు నేర్చి అవలంబించటం, కర్మకాండ నిర్వహించటం, ధనం పొంది, ఉన్నత స్థానంలో నిలపటం వంటి అనేక విషయాలు ఇందులో తెలుపటం జరిగింది. ఇవి వ్యాసాలుగా కాని, ఉపన్యాసాలుగా కాని వెలువడలేదు. అయితే స్త్రీకి సంబంధించినవే భిన్న విషయాలు, విషయ గౌరవంతో ఉన్నా, రచయిత్రి వ్యక్తిత్వం దోహదం వల్ల రచనాగుణంవల్ల వ్యాసాలుగా గ్రహించటం జరిగింది.

రచయిత్రులకు సారస్వతంలో తమ రచనం వల్ల ప్రముఖ స్థానం సంపా దించాలన్న వాంఛ లేదు అభిప్రాయ ప్రకటనం చేయుటం, స్త్రీ జీవిత పురోభివృద్ధి కోరటం, ప్రధానంగా నిర్వహించాలన్నదే దృష్టి. ఎక్కడయినా, స్త్రీ ఉద్యమం

ఉత్తమ వ్యాస సృష్టి చేయటం యాదృచ్ఛికమే ! రచన ఉత్తమంగా లేదనటం, అందువల్ల, అవసరం కాదు. భాష, వాక్య రచనలో లోపం ఉండవచ్చు కాని, గుండెలో, భావంలో, అభివ్యక్తిలో సంస్కరణ వాంఛలో లోపం లేదు.. ఈ దృష్టితో పటిష్ఠమైన వ్యాసాలు స్త్రీలు వ్రాశారు. పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు అంతటి ఉత్తమ రచయిత అధిక్షేపించేంత ఉన్నత వ్యాస సృష్టి కావించారు. స్త్రీ రచనను శ్రీమతి సు స.గా. పానుగంటి అనుకరించేంత శ్రేష్ఠంగా రచించారు. బుద్ధి హృదయాలు మిశితం చేసి, రచయిత్రులు సృష్టించిన వ్యాసాలు తెలుగు సారస్వతంలో ఒక దశా ప్రదర్శకంగా ఉన్నాయి.

## 3. నేటి రచయిత్రులు

స్వాతంత్ర్యానంతరం దేశంలో శాంతి భద్రతలు స్థిరం కావటం ప్రారంభ మయింది. ప్రపంచంలో పెద్ద ప్రజాస్వామికంగా ఉన్న భారతదేశం సగం జనాభా అయిన స్త్రీలకు హక్కులు ఇవ్వటం, అవి లేకపోతే శాసనాలు చేయటం మొదలయింది. స్త్రీకి సాంఘిక రాజకీయార్థిక సంరక్షణ అవసరమన్న దృష్టి ప్రభుత్వం ఏర్పరచుకోవటంతో స్త్రీలకు మునుపటి ప్రయత్న తీవ్రత అవసరం లేకపోయింది.

ఈ దశలో ఆలోచించే స్త్రీలలో కొందరు రాజకీయ, సాంఘిక సేవా రంగాలలో కృషి చేయటం ప్రారంభించారు. కొందరు ఉద్యోగాలలో ప్రవే శించారు. పూర్వ మెప్పుడూ లేని ఈ స్త్రీ చైతన్యం లలితకళలు మూలంగా సృజన పరిధిలో ప్రవర్తింపసాగింది. ఈ స్థితిలో సారస్వతం కల్పనాత్మక సామర్థ్య పోషణానికి దోహదంగా గోచరమయింది.

ఈ నాటి రచయిత్రులకు ఆధునిక సమాజ జీవితంలోకి తొంగి చూచే నూత్నత అధికంగా వస్తువులు అయ్యాయి. ముందు చూపు, భవిష్యదాశ, వర్తమానాంధ్ర స్త్రీ సాహిత్యంలో గమనింపవచ్చు. ఈ వాఙ్మయంలో స్త్రీలు కష్టాలు తొలగించుకోవటంతో పాటు. ఇష్టాలు కలిగించుకోవటం; నష్టాలు వద లించుకోవటంతో పాటు, అభిమతాలు పదిలం చేసుకోవటం దర్శింపవచ్చు.

స్వాతంత్ర్యం తర్వాత దేశంలో సృజన రచనల ప్రాచుర్యం పెరిగింది. కథా నవలాది రచనంలో స్త్రీలు ముందడుగు వేయటం జరిగింది. కవిత్వ విమ

ర్శన వ్యాసాది ప్రక్రియలు అల్పంగా అయినా స్త్రీలు సృజించటమయింది. వ్యాసం, మిగతా సృజన రచనల పోటీలో నిలువలేక పోవటంతో, రచయిత్రులు అనేకులు ఆదరించిన రచనా రీతి కాలేకపోయింది.

కథానికా నవలాది రచనంలో ఆధిక్యం సంపాదించిన రచయిత్రులు ఎక్కువ మంది ఉన్నారు. రచనల సంఖ్య కూడా ఎక్కువే! ఆత్మ దఘ్న మయిన సృజన రీతిని ప్రదర్శించటంలో స్త్రీలతో పోటీగా వ్రాయగలిగే రచయితలు ఎక్కువగా లేరని చెప్పవచ్చు. జీవితం, వాస్తవికతకు దూరంగా, స్వప్న సుందరంగా దర్శితంకావటం స్త్రీ రచనలలో వుంది. వ్యాసం, సృజనమయినా, ఆలోచనా మాధుర్యం వాంఛిస్తుంది కాబట్టి, కథాపాత్ర సన్నివేశ బలంతో నవలాది ప్రక్రియలు లాగా విస్పష్టంగా ఇంకా రూపొందలేదు కాబట్టి, అమితంగా ఆదరింపబడలేదు.

స్త్రీ హృదయానికి కవితా పరిధి చేరువే కాని పద్య కవిత నల్లుకొన్న ఛందస్సంప్రదాయాలు, శ్రీ శ్రీశ్రీ అన్నట్లు సర్పపరిష్వంగాలు ఉండటం వల్లనూ, గేయ వచన కవితలలో జీవిత మాధుర్యం సౌకుమార్యంతో పాటు వర్తమానంలో కాఠిన్యం చోటు చేసుకోపటం వల్లనూ తెలుగు కవితారంగంలో అధికంగా స్త్రీలు లేరుకాని, కవిత్వం వచనంలోకి తెచ్చి, రచనం పటిష్ఠం చేశారు. ఇక్కడొక్కమాట గుర్తుంచుకోవటం అవసరం. రచయిత్రులు వచనంలోకి కవిత్వం తెస్తుంటే రచయితలు కవిత్వంలోకి వచనం తెచ్చి, వచన కవిత్వం వినూత్నంగా రూపొందించారు.

వ్యాసంలోకి కవితా గుణం తెచ్చిన వాళ్ళలో శ్రీమతి లత గుర్తింపబడవలసిన రచయిత్రి. ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రికలో ప్రతివారం ఊహాగానం పేరుతో వ్రాసిన వ్యాసాలు కవితా రూపాలు. 'లత వ్యాసాలు' అని ప్రచురించిన 13 రచనల్లో ప్రసిద్ధకవులూ రచయితలూ సృష్టించిన పాత్రల పరామర్శ సాహితీ విమర్శనంగా సాగినా కవితా రూపమే! ''రమణీ పాద మంజీరాల గలంగలో మహా రచయితల మధుర గీతికా ప్రసూనాంజలి అది శశికళ'' అని బాపిరాజు పాత్రనూ, 'స్త్రీత్వం నిండిన నిషా సీసా ఇందిర' అని శ్రీదేవి పాత్రనూ, 'వేదన నివేదన చేయటానికి ఊఊర్వశి ఒక వేలుపు' అని శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి పాత్రనూకాక కవితామయంగా ఆలోచన చేయటం అన్ని వ్యాసాల ధర్మంగా వుంది.

శ్రీమతి లత వాక్యనిర్మాణం కవితా హృదయంలో నిలుస్తుంది. ఈ వచనం ఇంత కవితామయంగా కొందరు మాత్రమే వ్రాయ గలుగుతున్నారు.

తెలుగు సారస్వతంలో స్త్రీలు వ్యాస సృష్టి చేయటం గ్రంథంగా ముద్రించటానికి కాక, పత్రికలలో ప్రచురించటానికి అయినట్టు భావించే అవకాశం ఉంది. తెలుగులో వెలువడ్డ పత్రికలు కొన్ని స్త్రీల కోసమే ఉద్దేశింపబడ్డాయి. అటువంటి వాటిలో 'గృహలక్ష్మి' స్థానం గుర్తించాలి. స్త్రీల సమస్యలు తీర్చటానికి, జీవితాలు బాగు చేయటానికి సాహిత్యం ద్వారా, ఈ పత్రిక చేసిన సేవ గమనార్హంగా వుంది. శ్రీమతి కొత్త లక్ష్మీరఘురామ్ ప్రారంభంలో అనేక సృజన వ్యాసాలు వ్రాయటం స్త్రీలోక విదితమే.

స్త్రీలకోసం వెలువడ్డ పత్రికలలోనే గాక, ఇతర మాస, పక్ష, వార, దిన పత్రికలలోనూ, ఆకాశవాణిలోనూ ప్రమదావనం, స్త్రీలోకం, వనితావని, వనితావాణి మొదలైన శీర్షికలతో స్త్రీల సమస్యలు చర్చించే వ్యాసాలు అనేకం వెలువడ్డాయి, వెలువడుతున్నాయి. కుట్టు కట్టు బొట్టుల దగ్గర్నుంచి, కులాంతర మతాంతర వర్ణాంతర వివాహాల దాకా ఈ శీర్షికలలో చర్చించారు ఒక సమస్య మీద పలువురు స్త్రీలు అభిప్రాయాలు ప్రకటించటం, వ్యాసాలు అవతరించటానికి దోహదం చేసింది.

ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రికలో ప్రమదావనం నిర్వహించే శ్రీమతి మాలతీ చందూర్ పత్రికలో వ్రాసిన అనేక వ్యాసాలలోంచి కొన్ని ఏరి, 'మహిళలకు మధుర జీవనం', 'అందాలు - అలంకారాలు' ప్రచురించింది. ఈ వ్యాసాలు స్త్రీలు సుఖంగా ఉండాలంటే ఆచరింపవలసిన అంశాలు విశదీకరించటం, సౌందర్యం పోషించుకోవటం, మెలకువలు గ్రహించటంతో పాటు అలంకారాల పద్ధతులు వివరించాయి.

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో స్త్రీల శీర్షిక నడిపే శ్రీమతి కె. రామలక్ష్మి వర్తమాన స్త్రీ సమస్యలు అనేకం చర్చించింది. ఆంధ్ర దినపత్రికలో ఇల్లాలి దృక్పథం వివరించే వ్యాసాలు వ్రాస్తూ వుంది. ఈ రచయిత్రి 'దారిచూపిన దీపకళికలు' (1960) స్వాతంత్ర్యానికి పూర్వం మహిళల ఉద్యమం సాగించిన కస్తూరిబాయి గాంధీ, కమలా నెహ్రూ, సరోజినీనాయుడు మొదలైన నవలా రత్నాల జీవిత చరిత్ర వ్యాసాలు వ్రాసింది.

ఆంధ్రజ్యోతి వారపత్రికలో, శ్రీమతి పురాణం సీత ఇల్లాలి ముచ్చట్లు పేరుతో హాస్య ప్రచురంగా వ్యాస సృష్టి చేసింది. అనేక పత్రికలలో పలువురు స్త్రీలు వ్యాస రచనం సృజనంగా కావిస్తున్నారు.

ఆకాశవాణి, వనితావాణి, రంగపల్లి స్త్రీల కార్యక్రమాలు నిర్వహించింది. అందులో స్త్రీల సమస్యల మీద ప్రసంగ వ్యాసాలు ప్రసారమయ్యాయి. శ్రీమతి న్యాపతి కామేశ్వరి వ్యాసాలు వ్రాసి, వ్రాయించి, ఆకాశవాణి ఉద్యోగిగా, స్త్రీల ప్రసంగ వ్యాసాలు ప్రసారం చేసింది.

పురుషులతోపాటు సారస్వత విషయాలు గ్రహించి, విమర్శన వ్యాసాలు వ్రాయటంలో ప్రసిద్ధి పొందిన వాళ్ళు ప్రయత్నిస్తున్న వాళ్ళు, స్త్రీలు ఉన్నారు. శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ 'అఖిల భారత కవయిత్రులు'లో భారత దేశంలో ప్రాచీనాధునిక సారస్వతాలు సుసంపన్నం కావించిన ప్రసిద్ధ కవయిత్రుల జీవిత చరిత్ర వ్యాసాలు, 'ఆంధ్ర కవయిత్రులు' (1953) తెలుగు దేశంలో కవిత్వం సృజించిన పూర్వ స్త్రీలు, ఆధునిక సారస్వతం నిర్మించిన స్త్రీల జీవిత చరిత్ర వ్యాసాలు - 131 - వ్రాసింది. ఈ వ్యాసకర్త్రి పత్రికలలో, ఆకాశవాణిలో సారస్వత వ్యాసాలు ప్రచురించటం, ప్రసారం చేయటంతో పాటు ఊరూర సారస్వతోపన్యాసాలిచ్చింది.

ఆంధ్ర సారస్వతంలో అమూల్యమయిన అభినివేశం సంపాదించి విమర్శన వ్యాస సృజనం కావిస్తున్న వాళ్ళలో డా. నాయని కృష్ణకుమారి, డా. యశోదారెడ్డి గుర్తింపబడవచ్చు. ఈ రచయిత్రులు గ్రంథ పరిశోధనం పరిశీలనం చేసే సమర్థతతో వ్యాస రచనం చేయటం వల్ల బుద్ధికి ఈ వ్యాసాలు చేరువగా ఉన్నాయి.

శ్రీమతి జమ్ములమడక శ్రీ కామాక్షి హైమవతీ దేవి వ్రాసిన 'చతుర్దశి' విమర్శన సృజన ధర్మద్వయ విశిష్టంగా ఉంది. శ్రీమతి పిల్లలమర్రి సుశీల 'పూజాపుష్పాలు' కూడా ప్రక్రియగా పై ధర్మద్వయం కలిగివుంది. 'మన సంగీత సాహిత్యాలు' విమర్శన ప్రాధాన్యంతోను, 'గొంతెమ్మకోరికలు' సృజన ధర్మ ప్రముఖంగానూ ఉన్నాయి. వ్యావహారిక భాష, సృజన ధర్మం వ్యాసాలలో గోచరమవుతున్నాయి.

ఆధునికాంధ్ర సారస్వతం అనేక విషయాలు, భావాలు వ్యాసాలలో వెలువరించి, సృజనంగా అధికంగా వ్రాసి, ప్రచురించి ప్రధాన వ్యాసకర్త్రిగా గుర్తింపదగ్గ శ్రీమతి ఇల్లిందల సరస్వతీ దేవి కృషి గమనించవచ్చు. సాంఘిక సేవా రంగంలో, సారస్వత, జీవితంలో సఫలా కథాద్యనేక రచనలు చేసి, వ్యాస వాఙ్మయం పరిపుష్టం కావించింది రచయిత్రి.

'జీవన సామరస్యం' 'నారీ జగత్తు', 'వెలుగు బాటలు', 'జీవితరత్నాలు' వ్యాస సంపుటులు ఆంధ్ర సచిత్రవార పత్రిక వనితాలోకంలో ప్రచురించి, పునర్ముద్రించిన ఈ వ్యాసాలు వందలకొలది ఉన్నాయి. భిన్న విషయస్థంగా ఉన్న వ్యాసాలు, వ్యాస పరిణామ ప్రదర్శకాలు.

ఈ వ్యాసాలు ప్రధానంగా స్త్రీ, సంఘం, సారస్వతం చుట్టుకొని విస్తృత మయ్యాయి. ఆంధ్ర సమాజంలో స్త్రీ పుట్టిందగ్గర్నుంచి గతించిందాకా ఎన్ని సమస్యలు ఎదుర్కొంటుందో వాటి పరిశీలనం వ్యాసాలలో వుంది. స్త్రీల ఆశలు, ఆశయాలు, అవి సాగే తీరు, వాటి పరివర్తన విధానం విపులంగా ఈ వ్యాసాలలో దర్శనమిస్తాయి.

సంఘ జీవితంలో ఆచారాలు, పండుగలూ పబ్బాలు, స్త్రీ భవిష్యత్తు రూపొందించటంలో దోహదం చేయాలని వాంఛించటం; స్త్రీల బాలల సాహిత్యాలు ఆవశ్యకాలని తలంచటం; స్త్రీ జీవితం సంఘ పరంగా సాహితీ పరంగా అభివృద్ధి చెందాలని కోరటం ఈ వ్యాస వాఙ్మయంలో ఉన్నాయి. ఇంత విస్తృత సృజన వ్యాస రచనం కావించిన రచయిత్రులు లేరు.

నేటి వ్యాస రచయిత్రుల విమర్శన సృజన రీతుల వల్ల పూర్వంలేని పరిణామం స్పష్టమవుతుంది. విమర్శన వాఙ్మయ పరిధి స్త్రీ వ్యాస రచనాంతర్గతం కావటం అభ్యుదయ చిహ్నం. సృజన సారస్వతం విస్తృతం అయినందువల్ల, సృజన వ్యాసం స్త్రీలు ఎక్కువగా వ్రాయటం పడరేదు. ఈ యుగంలో శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి ప్రముఖ వ్యాస రచయిత్రి.

స్త్రీ జీవితం చుట్టూ ఆవరించుకొన్న కష్టాలు తొలగించుకోవాలన్న ప్రాథమిక వాంఛతో ప్రారంభమయింది స్త్రీ వ్యాస రచనం. అది అభివృద్ధి పథంలో సాగి, మేలు పొందింది. స్త్రీ వ్యాసం ప్రధానంగా సృజన ధర్మంతో ఒప్పుతూ వుంది. అందువల్ల ప్రగాఢ హృదయ వాంఛా సహితంగా స్త్రీ వ్యాసం రూపొందింది. స్త్రీ వ్యాసం మహిళా సమస్యలకు వేదిక అయింది, దర్పణమయింది, ప్రతిబింబమయింది. ఆనంద సంపాదకమయింది.

—: (౦) :—

# పత్రికా వ్యాసం

తెలుగులో పత్రికలు ప్రారంభం కావటంలో వ్యాస సృష్టికి ప్రోత్సాహం కలిగింది. అది మొదట్లో అల్పంగా, తర్వాత అధికంగా ఉంది. వాటిలో వెలువడి, సంపుటాలుగా ప్రచురింపబడకుండా అనేక వ్యాసాలు గోచరమవుతున్నాయి. అందువల్ల ఈ వ్యాస రీతుల పరిశీలనం అవసరమవుతూ వుంది. పత్రికలు ఎప్పటి నుంచి ఈ ప్రక్రియను ప్రకటించాయో తెలియటం కోసం, వాటి ప్రాచీనత, తెలుగులో, గుర్తింపవలసివుంది. ఇందుకు దేశంలో ముద్రణ స్థితి స్పష్టంగా తెలుసుకోవలసి వుంటుంది. తన్మూలంగా పత్రికా ప్రాచీనత విశదమవుతుంది.

## 1. తెలుగు ముద్రణం

తెలుగులో ముద్రణారంభం స్పష్టంగా తెలియకపోవటం ఆలోచనకు అవకాశమిచ్చింది సి. పి. బ్రౌన్ 1808 లో, అది మొదలైనా 1830 వరకు ఏమీ అభివృద్ధి సాధించలేదనటం తెలుసుకోవచ్చు. అయితే అది స్పష్టమయిన ఆధారాలతో వ్యక్తంచేసిన అభిప్రాయం కాదు. కాగా తెలుగు ముద్రణం ఎప్పుడు మొదలయిందో విశదం కావలసివుంది.

ముద్రణాయంత్రం భారతదేశంలోకి 1556 లో తీసుకురావటం, గోవా నుంచి ప్రచురణ సాగించటం జరిగింది. 1577 నాటికి మలయాళంలో పుస్తక ముద్రణం జరిగింది. తెలుగులో రమారమి ఈ కాలంలో ఏమయినా ముద్రణ యత్నం జరిగిందేమోనని ప్రయత్నించటం, ఆధార రాహిత్యం వల్ల, నిష్ప్రయోజనం.

అయితే 1719 నాటికే తెలుగులో బైబిల్ ఉన్నట్టు "There is a Telugu Bible listed in catalogue of books in the library of Fort St. George prepared in September [illegible] The book, Bible in Gentoo was probably printed in Tranquebar press" (1) తెలుస్తుంది. అయితే బైబిల్ [illegible]

అంటే తెలుగు బైబిల్ అనుకోవటం ఎలా సాధ్యమవుతుందో పరికించవచ్చు. జెంటో అనే పదం ప్రధానంగా హిందువులు, ప్రత్యేకంగా తెలుగు వాళ్ళు, అనంతరం తెలుగు భాష అనటానికి ప్రయోగించినట్లు ఆధారాలున్నాయి. కాబట్టి ఇది తెలుగు బైబిల్ అనుకోవచ్చు. అయితే ఏసువార్తనో కాక పూర్తి బైబిల్‌ని ప్రచురించటం ఆరంభంలో సాధ్యమవటం, పరిశీలింపవలసి వుంటుంది. 1719 నాటికి ట్రాంకోబార్‌లో ముద్రితమయిన ఈ గ్రంథం, అక్కడ ముద్రణాలయం స్థాపించింది 1712లో కాబట్టి, అప్పటిలో తెలుగు అక్షరాలు రూపొందలేదు కాబట్టి, ఇంత తొందరగా ఇంత పెద్దపని జరగటం సాధ్యమా అని స్పష్టంగా తెలుసుకోవటం కోసం ఆ కేటలాగు కోసం ప్రయత్నిస్తే అది అలభ్యంగా వుంది.

అయితే అంతకు ముందే తెలుగులో ముద్రణం జరిగినట్లు చెప్పటం "Benjamin Schultze, the German Luthern from Halle, with financial assistance from S.P.C.K. worked among Telugu people in and around Madras between 1628 and 1643. He wrote four Telugu books and printed them in Halle in the years 1646 and 1647. Copies of these books are preserved in the librar ies of the British Museum and Serampore.. (2) వుంది. కానీ, ఈ సంవత్సరాల విషయంలో, ఆ పుస్తకాలు అలభ్యాలు కావటంవల్ల, శంక సహజం. దీనిని బలపరిచే ఆధారాలు పరికింపవచ్చు. "తెలుగు భాషలో లోతైన పరిశ్రమ చేసిన ప్రథమ పాశ్చాత్యుడు బెంజమిన్ షూల్ట్జి అనవచ్చును. బైబిలు మొట్టమొదట తెలుగు చేయుటకు కృషి చేసి, 1746-1747 సంవత్సరములలో క్రైస్తవ మతమునకు సంబంధించిన గ్రంథముల నచ్చొత్తించెను. 'నిజమైన క్రైస్తవుడు జీవితము గడుపవలసిన నూరు విధులు' అనునట్టి పుస్తకము ప్రష్యాదేశమున" 'మ్యాగ్డిబర్గ్'నకు చేరిన 'హాలే' అనుచోట ముద్రింపబడెను. (3) ఈ విషయం అంగీకరించే తెలుగులో తొలుదొల్త 1746 లో రెవరెండు బెంజమిన్ షూల్జిన్ జర్మనీకి చెందిన ప్రష్యాలోని 'మాగ్డిబర్గు' రాష్ట్రములోని 'హాలే' గ్రామమునుండి అచ్చుయంత్రములు పైపులు పోతపోసి ప్రత్యేకముగా తయారుచేసి, అచ్చువేసెను. ఆ పుస్తకము పేరు "నూరు జ్ఞాన ప్రవచనాలు

బైండు పుస్తకము.'' (4) అని తెలపటం జరిగింది. మిగతా విషయాలు తుల్యంగా ఉన్నప్పటికీ పుస్తకాల పేర్లు వేరువేరుగా ఉండటం వల్ల సమన్వయం అవసరంగా ఉంది. అయితే బెంజమిన్ షుల్ట్‌జి ప్రచురించిన పుస్తకాలు నాలుగు. ఈ రెండూ కాక ఇంకా రెండు ముద్రించాడు.

అయితే బెంజమిన్ షుల్ట్‌జి తెలుగు పుస్తకాలు ముద్రించిన సంవత్సరాలు 1646, 1647 గా గ్రహించాలో 1746,1747 గా స్వీకరించాలో ఎ ఒకటి తప్పో, రెండూ తప్పో స్పష్టంకావాలి. ఇద్దరు విమర్శకులు చెప్పింది సత్యమనటం కాని, చివరి పరిశోధనం సమంజసమనటం కాని, అవసరం కాదు.

బెంజమిన్ షుల్ట్‌జి 1719 లో భారతదేశం చేరుకొన్నట్లు, 1741 దాకా మత సేవ, భాషా కృషి చేసినట్లు గమనింపవచ్చు.

"Benjamin Schultze was perhaps the most talented amongst them. He assumed leadership at Tranquebar. When he found he could not agree with Walter and Pressier, two able missionaries who arrived in 1725, he left Tranquebar and sought a fresh field of labour in Madras (5)

"In Madras the work was begun by B. Schultze (1726-1741). He deemed himself a linguistic genius and translated with much celerity large portions of the Bible, not only into Tamil but also into Telugu and Hindustani. He returned to Germany in 1741." (6)

అందువల్ల బెంజమిన్ షుల్ట్‌జి వ్రాసినట్లు, హాలేలో ముద్రించినట్లు చెప్పబడుతున్న నాలుగు పుస్తకాలు 1746, 1747 సంవత్సరాలలోనే ముద్రించినట్లు స్పష్టమవుతుంది.

ఈ పుస్తకాలు తెలుగు లిపిలో ముద్రితాలయ్యాయా కావా అన్న సంశయం కలగటం సహజం. ''The titles of the works indicate that they are about Telugu, no doubt, but it is left to the historians to examine whether the script was Telugu. It might have been Roman or Latin as well.'' (7)

ఈ శంకకు సక్రమయిన ఆధారం లభించకపోతే, తెలుగు భాష ఇతర లిపులలో వ్రాయబడి ఉండవచ్చు ననిపిస్తుంది.

బెంజమిన్ షుల్ట్‌జి తెలుగు భాష నభ్యసించి, అనువాదం చేయటంవల్ల, లిపి తెలుగు లిపిగానే భావింపవచ్చు. అంతేకాదు, ఈ విషయంలో సరయిన సమాధానం కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు ప్రచురించిన 'విజ్ఞాన సర్వస్వము' (Vol. 2. 1916)లోని 'అచ్చు' అనే గాడిచర్ల హరిసర్వోత్తమరావు (పుట 584 లో) 1746-1747 లో అచ్చయిన, శ్రీరామపురము క్రైస్తవ కళాశాలా గ్రంథాలయంలో ఉన్న, పుస్తకంలోని పుట ఒకటి 'ఫోటో' తీసి ముద్రించటం చూడవచ్చు. అది తెలుగు లిపిలో ఉంది. ''నాకు గల్గిన నిజమయిన రక్షించ్చె వాడా ఆకాశానికి తగిన దుఃఖశాంత్తి నా ఆత్మకు......''గా ఉండటం పరికింపవచ్చు.

కాబట్టి 1746, 1747 సంవత్సరాలలో హాలేలో బెంజమిన్ షుల్ట్‌జి తెలుగు గ్రంథం తెలుగు లిపిలో ముద్రించినట్లు స్పష్టంగా గుర్తింపవచ్చు. అయితే ఇవే ప్రథమంగా ముద్రించిన తెలుగు పుస్తకాలుగా గ్రహించటంలో ఔచిత్యం గమనింపవచ్చు.

బెంజమిన్ షుల్ట్‌జి 'హాలే'లో ముద్రించటానికి ఉపయోగించిన తెలుగు 'టైపు'లు ట్రాంకోబార్ నుంచి గ్రహింపవచ్చు. 1712 నాటికి సిద్ధమయిన ముద్రణాలయం ట్రాంకోబార్ మత ప్రచారకులకు ఇవ్వబడింది. అక్కడికి మత ప్రచార కార్యంలో షుల్ట్‌జి 1719లో రావటం వల్ల, అప్పటికే Bible in Gentoo సిద్ధమయి ఉన్నట్లు తెలియటం వల్ల తెలుగు ముద్రణం జరుగుతున్నట్లు భావించి. 1726 లో మద్రాసు వెళ్ళుతూ, ఈ ముద్రణ పరికరాలు కొంత భాగం వెంట తీసుకొని పోయినట్లు, అది ఉపయోగించి హాలేలో తెలుగు పుస్తకాలు ప్రచురించినట్లు భావించటానికి అవకాశం ఉంది.

ఇది వాస్తవమయితే తెలుగులో బైబిల్, 1719 నాటికి, వెలువడం కూడా అంగీకరింపవలసి వస్తుంది. అయితే, అప్పుడు తెలుగులో ముద్రణం పొందిన ప్రథమ గ్రంథం ఇదే అవుతుంది. కాని ఈ గ్రంథమో, ఆ కేటలాగో పరిశోధకులకు లభించిందాకా ఈ నిర్ణయం అసాధ్యమే !

బైబిల్ ఇన్ జెంటో మొదటి ముద్రితాంధ్ర గ్రంథం కాకపోతే, హాలేలో ముద్రిత పుస్తకాలే ఆద్యాలయితే భారతదేశంలో తెలుగు ముద్రణం ఎప్పుడు ఎక్కడ జరిగిందో తెలియటం అవసరంగా ఉంది. ఇందుకు ప్రధానంగా రెండు ప్రదేశాలు, మద్రాసు, శ్రీరామపురం, గోచరమవుతున్నాయి.

'By the middle of 1807, the Serampore missionaries completed four founts, which with the persian fount from England enabled them to sriptures in seven languages, Telgu being one of them.' (8)

అనటం గ్రహించి శ్రీరామపురంలో 1807 లో "తెలుగులో అచ్చు అయిన మొదటి గ్రంథము 1806 లో చెన్నపురినుండి వెలువడినది" (9) అనటం అంగీకరించి, మద్రాసులో 1806 లో తెలుగు ముద్రణం జరిగినట్లు గ్రహింపవలసి వస్తుంది.

శ్రీరామపురంలో, విలియం కేరీ అనే క్రైస్తవ మతప్రచారంచేసే వ్యక్తి 1798లో ముద్రణ పరికరాలు కొని 1804 నాటికి తెలుగు ముద్రించే స్థితికి అభివృద్ధిచేసి, 1807 లో సువార్తలు తెలుగులో ముద్రించి 1814 లో తాను వ్రాసిన 'A Grammer in Telinga Language' ప్రచురించాడు. ఇక్కడ పెద్ద ముద్రణాలయం ఏర్పడింది, ఏడు భాషల్లో ముద్రణ స్థితి 1807 నాటికి కలిగి ఉండటం 1812లో అది కాలిపోవటం, 1814 కి మళ్ళీ ముద్రాణాలయం పునరుద్ధరించడం గుర్తింపవచ్చు. ఈ స్థితిలో ఈస్టిండియా కంపెనీ కోసం తెలుగు టైపులు తయారు చేస్తున్న పైగ్గిన్స్ అనే వాళ్ళ దగ్గరనుంచి తెప్పించుకోవటానికి ప్రయత్నం జరిగింది. అయితే లండనులో ఈ సమయంలో తెలుగు టైపులకు మూలంగా బెంజమిన్ షుల్ట్‌జి దగ్గరవున్న టైపులు గ్రహించటం జరిగిందనీ, అవి ట్రాంకొబార్‌నుంచి స్వీకరించటమయింది

కాబట్టి తెలుగు టైపులు మొట్టమొదట భారతదేశంలోనే క్రైస్తవ మిషనరీలు తయారు చేయటం వల్ల 1719 నాటికే ఏర్పడ్డాయని నిశ్చయింపవచ్చు.

1761 లో మద్రాసులో ముద్రణాలయం స్థాపింపబడింది. "The authorities from Madras captured a printing press in Pondicherry and presented it to one Philip Fabricius in 1761. The press was set up in the mission compound in Vepery". (10)

ఇక్కడ తమిళ గ్రంథాలు ముద్రితాలయ్యాయి. తెలుగు ముద్రణం గూర్చి హెన్రీ హేరిస్ ప్రయత్నం గమనార్హం.

'As early as 1788 Herny Harris proposed to establish a new printing office at Madras and to introduce persian and other Oriental characters. When objected to, Harris pleaded that specific application was made to them by the Bramins of Madras to have the Gentoo character cut, founded and adopted to the press in the same manner as the Persian and Malabar letter' (11)

కాబట్టి తెలుగు 'టైపు'లు సిద్ధంగా ఉన్నట్లు స్పష్టమయింది.

వేపేరిలో ఉన్న ముద్రణాలయంలో 1861 నుంచి తెలుగు పుస్తకాలు ముద్రించినట్లు ఆధారాలు లభించలేదు. అయితే విశాఖపట్టణంలో క్రైస్తవ మత ప్రచారకులుగా ఉన్న జార్జి క్రేన్, అగస్టస్‌డెస్ గ్రాంజెస్ మద్రాసులో 'ఎసైలమ్ ప్రెస్'లో 1805 లో తమ రచనలు ముద్రింపించారు. 1806 లో వ్యాకరణ గ్రంథంతోపాటు అనేక రచనలు ముద్రించటం జరిగింది.

కాబట్టి తెలుగు ముద్రణం దాదాపు ఒకే సమయంలో మద్రాసు, శ్రీరామపురంలలో ప్రారంభమయినట్లు స్పష్టమవుతుంది. ఇది క్రైస్తవ మత ప్రచార రచనలు కరపత్రాలు ప్రచురించటంతోనూ, కొన్ని వ్యాకరణాలు ప్రకటించటంతోనూ సంబంధించి ఉంది కాని విస్తృతం కాలేదు. 1830 లోపల తెలుగులో పత్రిక వెలువడినట్లు ఏ విధంగానూ భావించటానికి వీలు లేకుండా పుంది.

అప్పటికి తెలుగులో ముద్రణా సౌకర్యం సుస్థిరమయింది. ఆ పైన పత్రికా ప్రచురణం ప్రారంభం కావటానికి అవకాశం ఏర్పడింది.

*ప్రారంభ పత్రికలు*: తెలుగులో పత్రికా వ్యాసంగం, ఆంగ్ల పత్రికలు కారణంగా ప్రారంభమయింది. ప్రథమ దశలో ప్రభుత్వం పత్రికా ప్రకటనం పట్ల వైముఖ్యం చూపటం వల్ల ఆంధ్రులకు క్రైస్తవ మత ప్రచారం కోసం, క్రైస్తవ మిషనరీలు 'సత్యదూత' అనే పత్రిక బళ్ళారి నుంచి 1835 లో ప్రచురించినట్లు తెలుస్తుంది. అయితే 1833 లోనే తెలుగు పత్రిక వెలుగు చూచినట్లు జె. లాంగ్ తెలపటం జరిగినా, పత్రికగాని, వెలువడ్డ ప్రదేశంకానీ, ఏమీ వివరంగా లేకపోవటంతో స్వీకరించే పరిస్థితి సక్రమంగా లేదు.

కానీ 'వృత్తాంతిని' అనే పత్రిక 1838 లో మద్రాసునుంచి ప్రారంభించినట్లు, కడపకు చెందిన మండిగల వేంకటరాయశాస్త్రి సంపాదకత్వం వహించినట్లు, చేతపూడి సుందరరావు, 'లోక రక్షకుడు' వంటి వాళ్ళ చరిత్రనూ, లేఖలనూ ప్రచురించినట్లు, ఈ పత్రికమీద జె. సి. మోరిస్ ప్రభుత్వానికి నివేదిక సమర్పించినట్లు విశదమవుతుంది. అయితే మచ్చుకయినా ఈ పత్రిక ప్రతి లభించలేదు. అప్పటిలో ఈ పత్రిక విపుల ప్రచారం పొంది ఉన్నట్లు, అనేకాంగ్లేయాంధ్రులు దీనిని చదువుతూ ఉన్నట్లు శ్రీ ఆరుద్ర తెలపటం గమనింపవచ్చు.

1842 సయద్ రహ్మతుల్లా, మద్రాసునుంచి 'వర్తమాన తరంగిణి' అనే పత్రిక, వృత్తాంతిని ఆగిపోయిన తర్వాత ప్రారంభించటం జరిగింది. జనాళిలో సౌహార్దం పెంగటానికి ఈ పత్రిక ఉద్దిష్టమయింది. మొదటి ఆరు సంచికలకు తెలియదుకాని, ఆ పైన పువ్వాడ వేంకటరావు సంపాదకత్వం నిర్వహించినట్లు వుంది. 'జన మనోరంజకుడు' 'లోకోపకారి' 'న్యాయవాది' 'సకల జన సమ్మతుడు' 'వికట సంకటకవి' పత్రికలో ఉత్తరాలు ప్రచురించినట్లు తెలుస్తూవుంది.

"There was much original writing in Varthamana Tharangini. Civic lapses, social evils, high-handed doings of certain white men, benovalent, patronage

of arts and letters by understanding civil servants, the questionable practices of the missionaries in the propagation of their faith, the affairs of the educational institutions, literary querries and solving poetical riddles are only a few subjects dealt with in the Varathamana Tharangini." (12)

10-10-1852, 10-4-1853 సంచికలలో ప్రచురించిన 'మత ప్రవర్తనము' 'గాలి వాన' వ్యాసాలుగా గ్రహింపదగ్గ వచన రచనలు, ఈ పత్రికను సి. పి. బ్రౌన్ తన లేఖలు సంపుటం M. Vol. 430 లోనూ, 'Dictionary of mixed Telugu'లోనూ పేర్కొనటం గమనింపవచ్చు.

1848 లో మచిలీపట్నం నుంచి 'హితవాది' అనే సచిత్ర మాస పత్రిక, ఎడ్మండ్ షార్కీ సంపాదకత్వంతో వెలువడింది. ఇది 1862 వరకు నడచింది. దిన వర్తమాని పీటర్ పెర్సివల్ సంపాద కత్వంలో 1861 లో ప్రారంభమయి 1872దాకా ప్రచురితమయినట్లు తెలుస్తుంది. త్యాగయ్య ముదలి సంపాదకత్వంతో 'శ్రీ యక్షిణి' బళ్ళారి నుంచి 1863 నుంచి పక్షపత్రికగా ప్రచురితమయింది.

పత్రికలు నెమ్మదిగా ప్రారంభమయి, వేగం పుంజుకొన్నాయి. ఇకపైన అనేక పత్రికలు వెలువడ్డాయి. తత్త్వబోధిని (1865), సుజనరంజని (1865), గోదావరి విద్యా ప్రదాయిని (1870), ఆంధ్ర భాషా సంజీవని (1871), పురుషార్థ ప్రదాయిని (1872), స్వధర్మ ప్రకాశిని (1872), బ్రహ్మాండ రంజని (1874), లోకరంజని (1874), సుధీరంజని (1874), విద్వన్మనోహారిణి (1874), వివేకవర్ధని (1874) మొదలైన పత్రికలకు ఎన్నో పత్రికలు తోడయ్యాయి. 1874 నుంచి పత్రికలలో వ్యాసాలు, ఉపన్యాసాల పేరుతో లభించడం గమనింపవచ్చు.

## 2. తెలుగు పత్రికలు - స్థితిగతులు

ఆంగ్లేయ పరిపాలనం వల్ల ఆంధ్ర దేశంలో సాంఘిక సారస్వత వ్యవహారాలలో వచ్చిన పరిణామాలలో పత్రికా వ్యాసంగం ప్రాముఖ్యం వహించింది. కాబట్టి రెండు భిన్న సంస్కృతి నాగరకతల కన్నబిడ్డ పత్రిక.

దీని ఆవిర్భావానికి వీటి సమ్మేళనమే కాదు సంఘర్షణ కూడా దోహదం చేసింది. అందువల్ల ఆంగ్లాంధ్ర సారస్వత ధర్మాలు పత్రికలలో నిలచాయి.

## 1. పత్రికా ప్రారంభం

పత్రిక, సంఘ చైతన్యం సాధించటానికి సారస్వతోపకరణమయింది. ఆంధ్ర సాహిత్యాభివృద్ధికి హేతువయింది. భావ ప్రకటన స్వాతంత్ర్యం పట్ల కోర్కె కలిగించింది. దేశంలో ఆర్థిక, సాంఘిక, రాజకీయ వాతావరణంలోని కాలుష్యం ప్రచురించింది. శాసనం చేసింది. పత్రిక తన పరిమిత పరిధిలో దేశ స్వాతంత్ర్యేచ్ఛను కలిగించింది.

*సాంఘికావసరం* : తెలుగులో పత్రిక, ఇతర భాషా పత్రికలు లాగా ఆరంభంలో అనేకావరోధాలు ఎదుర్కొని రెండు ప్రధాన కార్యాలు నిర్వహింప వలసి వచ్చింది. దేశజనంలో అజ్ఞానం తొలగించి, విజ్ఞానం బోధించటం ప్రాథమికమూ ప్రముఖమూ అయిన బాధ్యత కలిగిందయింది, పత్రిక. ప్రభుత్వం తెలుగు ప్రతికల పట్ల చూపే వైముఖ్యం; లాభం కోరే వ్యాపార దృష్టి, కుల మతాలఒత్తిడులు, ప్రారంభ దశలో తెలుగు పత్రిక తట్టుకొని నిలబడింది. ఆంధ్రులలో అజ్ఞానానికి ప్రధాన హేతువులు విద్యారాహిత్యం, మూఢ నమ్మకాలు, భయాలు. అంగ్ల విద్య పట్ల వైమనస్యం, ఆంధ్రుల ప్రాచీన విద్యా విధానంలో ఉన్న అందరికీ విద్య లభ్యంకాని స్థితి, సంఘ సంప్రదాయాలు, ఆర్థిక పరిస్థితులు, అప్పటి జనంలో విద్యావివేకం లేకుండా చేశాయి. సంప్రదాయం పట్ల గుడ్డి భక్తి, ఆచారాల మీద పిచ్చి నమ్మకం మొదలైన అనేక మూఢ విశ్వాసాలు జనంలోని ఆలోచన రాహిత్యం నుంచి పుట్టాయి. దేవుడు, దెయ్యం, మంత్రం, తంత్రం, కులం, మతం, ప్రభుత్వం, ఉద్యోగులు, డబ్బు, అధికారం, వంటి అనేక విషయాలు ఆంధ్రులలో భయం పుట్టించి పోషించి సంరక్షించి, శాశ్వతంగా నిలిపి ఉంచాయి. వీటి మీద దండయాత్ర చేయవలసిన సాంఘికావసరంతో తెలుగు పత్రిక విజృంభించవలసి వచ్చింది.

*పత్రికా నిర్వాహణం*: ఆంధ్ర దేశంలోని నిరక్షరాస్యత, దారిద్ర్యం పత్రికా నిర్వహణకు ప్రబల నిరోధక మయ్యాయి. ఆంధ్రులలోని అనైక్యం పత్రికా నిర్వహణ కష్టానికి దోహదమయింది. సాంఘికంగా, సారస్వత సంబంధంగా వున్న భిన్న వర్గాల వాళ్ళు భిన్న పత్రికలు ప్రారంభించుకోవటం,

ఆ పత్రికలు పరస్పరం నిందించటం త్యజించటం నిషేధించుకోవటం వల్ల వాటి ప్రాచుర్యం తగ్గి తన్నిర్వహణం కష్ట సాధ్యమయింది. పత్రిక అమ్ముడు పోవటం కంటే, చందాదారుల మీద ఆధారపడటం ఎక్కువ అయింది. చందా కట్టలేనివాళ్ళు, ఇష్టంలేనివాళ్ళ విషయం కాదుకాని మిగతావాళ్ళలో కొందరి అశ్రద్ధ పత్రికను నడపటంలోని బాధకు హేతువయింది. ముద్రణా సౌకర్యం సమగ్రంగా లేక, ఆంధ్ర దేశంలో పత్రికలు మద్రాసులో ముద్రించుకోవలసి రావటం మొదలైన అనేక కార్యాల వల్ల పత్రికా ప్రచురణం నష్టపడే పని అయింది. విమర్శకులు పత్రికలలో ఇష్టులైన కవులు, రచయితలను స్తుతించటం, అనిష్టులను దూషించటం సాగించారు. కొంతవరకు ఏ వర్గంతో సంబంధం లేనివాళ్ళకు ఈ పరిస్థితి అసహ్యం కలిగించింది వాళ్ళకు దూరమయి, పత్రికలు ఆదరణ కోల్పోయాయి. దేశ భాషాభిమానాలున్న పత్రికాధిపతులు కష్ట నష్టాలోర్చి కొంతకాలం పత్రిక నడిపి ఆపివేశారు. ఆంధ్ర దేశంలో ప్రారంభంలో వెలువడ్డ పత్రిక ఏదీ ఇప్పటిదాకా నిలవలేదు. దీనివల్ల పత్రిక నడపటంలో ఉన్న అవరోధాలు ఊహింపవచ్చు. స్థూలంగా తెలుగు పత్రిక, బరువు బాధ్యతల తాకిడికి తట్టుకొని అభివృద్ధి చెందింది.

## 2. పత్రికా లక్షణాలు

భారతదేశంలోని ఇతర భాషలలోని పత్రికలు లాగా, తెలుగులోని ప్రారంభ పత్రికలు క్రైస్తవ మత బోధకుల ప్రయత్నం వల్ల రూపొందాయి. ఇవి సారస్వత విషయాలకుకాక మత సంగతులకు నిర్దుష్ట భాషకు కాక మత బోధన భాషకు ప్రాధాన్యమిచ్చాయి. అవి అందరినీ ఆకర్షించినా, ఆసక్తిని రేకెత్తించినట్లు చెప్పటం కుదరదు. క్రమక్రమంగా నూత్న వచన రచనా రీతిని క్రైస్తవ పత్రికలు, రచనలు కలిగించాయి.

సారస్వతం : ఆంధ్రులు ప్రారంభించిన పత్రికలలో భాషాభిమానం గోచరమవుతూ వుంది. ప్రాచీన సాహిత్యం పట్ల గౌరవం, తదుద్ధరణ వాంఛ స్పష్టంగా కనిపించాయి. అపరిష్కృతంగా ఉన్న అనేక సారస్వత, భాషా, చారిత్రక విషయాలు నిర్ధారణ చేయటానికి సంకల్పం ఉండటం స్పష్టమవుతూ వుంది. ప్రాచీనాముద్రిత గ్రంథాలు ప్రచురించటం, కావ్య ప్రబంధ విమర్శనం, ప్రక్రియా సమీక్ష చేయటం, ఆధునిక నవల కవితల ప్రచురణం, వ్యాసోపన్యా

సాలు చేర్చటం, పత్రికలలో సాధారణ ధర్మంగా గోచరమవుతూ వచ్చింది. కొన్ని పత్రికలలో వ్యాసాలే లేవు. కొన్నింటిలో అన్నీ వ్యాసాలే.

*సాంఘికం :* పత్రికలు ప్రధానంగా సాంఘిక లోపాలు చూపి, సంస్కరించే ఉద్దేశంతో వెలువడటం కూడా అధికంగానే జరిగింది. మహాపురుషులు సంఘాన్ని దిద్దవలసిన అవసరం గుర్తించడం, వ్యవసాయం, వైద్యం, పరిశ్రమ వంటి భిన్న విషయాలు బోధించటం, భాషాదృష్టి పెరగాలని తలంచటం, సంఘంలోని అవకతవకలు సవరించాలని కోరటం, మొదలైన ఎన్నో ప్రదర్శించిన పత్రికలు అధికంగా ఉన్నాయి.

*స్త్రీ ప్రాధాన్యం :* తెలుగు పత్రికాప్రపంచంలో స్త్రీ పొందిన ప్రాధాన్యం విశిష్టంగా ఉంది. మొదటి రోజులలో స్త్రీల వ్యాసరచనం, పత్రికారచనం సంపాదకత్వం ఆంగ్లంలోనూ లేనంత ఎక్కువగా సాగింది. వ్యాసం పత్రికలలో ప్రచురించటం మొదలవుతున్న రోజుల్లోనే స్త్రీ వ్యాసం సృష్టించింది. "పోతం జానకమ్మ యను విదుషీమణి 1874 సంవత్సరమున ఫిబ్రవరి 24 తేది నొక్క వ్యాసమును విదేశయాత్రం గూర్చి వ్రాసి శ్రీ మదాంధ్ర భాషా సంజీవనిలో ప్రకటించి యున్నది. ఆ వ్యాసమునందలి శైలి యందలి యుక్తులు మిక్కిలి ప్రౌఢముగా నున్నవి."(13) ఆపైన బండారు అచ్చమాంబ వ్యాస సృష్టి సాహిత్య వీధులలో విహారం చేసింది. 19వ శతాబ్ది చిట్టచివర, 20వ శతాబ్ది మొట్టమొదట స్త్రీ వ్యాస రచన విస్తృతంగా జరిగింది. ఆ కాలంలో స్త్రీల కోసం స్త్రీలే పత్రికలు నడపటం. పురుషులు పత్రికా నిర్వహణంతో ప్రోత్సహించటం గమనింపవచ్చు. తెలుగు పత్రికా సంపాదకత్వం వహించటంలో ఆంగ్లేయ వనిత ప్రాథమ్యం పొందింది. (పత్రిక: ఉపాధ్యాయోపకారి (1892) సంపాదకురాలు డైసిదను దొరసాని). స్త్రీలకోసం స్త్రీలు వ్యాసాది సారస్వత సృజనంకావిస్తూ స్త్రీలే పత్రికలు నడపటం, తెలుగు పత్రికా వ్యాస పరిణామంలోవిస్పష్టంగా గుర్తింపవలసిన అంశం.

స్త్రీలు సంపాదకత్వంతో నిర్వహించిన పత్రిక లనేకం ఉన్నాయి. మొసలికంటి రామాబాయి- హిందూ సుందరి (1902), పులుగుర్త లక్ష్మీనరసమాంబ-సావిత్రి (1904) అర్చిబాల్డ్- 'వివేకవతి' (1912), వింజమూరి వేంకటరత్నమ్మ- 'అనసూయ' ( 917) గాడిచర్ల రామాబాయి ('సౌందర్యవల్లి')

కళ్లేపల్లె వేంకటరమణమ్మ - ఆంధ్రలక్ష్మి (1921) పత్రికలు నడిపారు. గృహలక్ష్మి, ఆంధ్రమహిళవంటి పత్రికలు స్త్రీలు నిర్వహించటంతో సాగి 'శ్రీమతులు' పత్రిక స్త్రీలు స్త్రీలకోసం స్త్రీల రచనలే ప్రచురించటం దాకా అభివృద్ధిచెందింది, స్త్రీ పత్రికా సంపాదక దీక్షాదక్షత.

ఈ పత్రికలలో కందుకూరి రాజ్యలక్ష్మమ్మ వంటి పలువురు వ్యాసాలు వ్రాశారు. ఈ పత్రికా రచయిత్రులు వ్యాస రచయిత్రులుగా తమ ఉపన్యాస సంకలనాలమూలంగా పరిచితులయ్యారు. ఈ పత్రికావ్యాసాలు స్త్రీ జీవితాభ్యుదయం వాంఛిస్తూ వున్నాయి. స్త్రీలకోసం పురుషులు నిర్వహించిన పత్రికలు 'సతీ హితబోధిని' (1883), 'జననా పత్రిక' (1893), 'గృహలక్ష్మి' (1935) స్త్రీ సమస్యలు కొన్ని వ్యాసాలు రూపొందించాయి.

మతదృష్టి: ప్రారంభంలో పత్రికలు మతైకదృష్టితో వెలువడి, తత్ప్రచారం చేశాయి. క్రైస్తవమతం బలపడుతూ వుండటం, హైందవ సమాజంలోని అర్షధర్మాన్ని తిరస్కరిస్తూ, సంస్కరణం దృష్టితో రూపొందిన బ్రహ్మసమాజం విస్తృతమవుతూవుండటం పత్రికాగతంగా, తత్ప్రచురణంవల్ల విశదమయింది. ఈ మతాల తాకిడినుంచి హిందూమతసంరక్షణ చేయటం బాధ్యతగా భావించిన వాళ్లు హిందూ మత ప్రాశస్త్యం తెలిపే పత్రికలు ప్రకటించి, మతౌన్నత్యం తెలపటానికి కృషి ప్రారంభించారు.

తెలుగుపత్రికాలోకంలో ప్రథమంగా గుర్తింపు పొందిన 'సత్యదూత' (1835) క్రైస్తవమత ప్రచార సాధనం. 'ఏక సహస్ర వర్షదిన 'జ్యోతి' (1903), 'వివేకవతి' (1908), 'ది బాప్టిస్టు', 'నిరీక్షణ' మొదలయిన అనేక క్రైస్తవ పత్రికలు అవతరించాయి. వర్తమానాంధ్ర పత్రికలలో అనేక క్రైస్తవ పత్రికలు వెలువడుతున్నాయి. వాటి భాష అప్పటిలో సి.పి. బ్రౌన్ చెప్పినట్లు, క్రొత్తమార్గంలో సాగి, క్రైస్తవేతరులు గ్రహింపగలిగిందిగా లేదు.

భారతదేశాన్ని ఉద్ధరించి ప్రాచీనౌన్నత్యం కాపాడాలన్న దృష్టితో తీవ్రంగా కృషి చేసిన బ్రహ్మసమాజం కందుకూరి వీరేశలింగం పంతులు కాలంలో బహుళప్రచారం పొందింది. సమాజంలో సాహిత్యంలో సంచలనం కలిగించిన బ్రహ్మసమాజం పత్రికాసృష్టికి దోహదం చేసింది. 'ఈశ్వరవాది' (1905) ఈ ప్రచారానికి సహాయభూతమయింది. 'దివ్యజ్ఞాన దీపిక' (1910) తత్సమాజ లక్ష్యాలు ప్రచారం చేసే పత్రిక. క్రమక్రమంగా దేశంలో బలహీన

మయిన బ్రహ్మసమాజం బాగా పనిచేసినకాలంలో పత్రికా ప్రకటనకు వ్యాస రచనకు అవకాశం కలిగించింది.

ఈ మత తీవ్రత గమనించి, దేశభాషామతాలు సంరక్షించుకొనే దృష్టితో హిందువులు చేసిన ప్రయత్నం పత్రికలు ప్రచురించటానికి దోహదం చేసింది. 'హిందూజన సంస్కారిణి' (1885), జనులకు వ్యవహార జ్ఞానమును, ఆత్మ జ్ఞానమును కలిగించగల అన్ని విషయములను తెలిపే 'ప్రభావతి' (1897), 'సత్యసాధని' (1897), 'అర్యమతబోధిని' (1904) 'యధార్థభారతి' (1927) మొదలైన పత్రికలు హిందూమత ప్రాశస్త్యం తెలిపాయి. ఆ పైన వెలువడి, మత బోధనలు చేసిన పత్రికలు ఎన్నో వున్నాయి.

వర్తమానాంధ్ర దేశంలో మత పత్రికలు విపరీతంగా ఉన్నాయి కాని, కొన్ని సారస్వత పరిధిలోకి రావు, పూర్వం మత పత్రికలకున్న ప్రాచుర్యం ఆధునిక యుగంలో లేదు. భిన్నమతాలకు భిన్న పత్రికలు వెలువడటం దేశం చూచిందికాని అన్ని మతాలకు సమన్వయం కోరే పత్రిక వెలువడటం చూడలేదు. మత భాష కాకుండా సారస్వతంగా, మత సమైక్యం వాంఛించే పత్రికను మతాతీత భారతదేశంలో ఆంధ్రదేశం, ఆంధ్రభాష కోరుతున్నాయి.

వర్ణవ్యవస్థ: భారతదేశంలో వర్ణవ్యవస్థ సుప్రతిష్ఠతమయివుంది. వర్ణాధిక్యం భావించుకోవటం, తరతమాలు నిలుపుకోవటం, అత్యవసరంగా తలవడం, ప్రసిద్ధంగా ఉంది. ఒకప్రక్క మత ప్రచారం జరుగుతుంటే, మరోప్రక్క వర్ణాధిక్యం తెలుపుతూ పత్రికలు ఆవిర్భవించాయి. కొన్ని వర్ణాలు కనీసం ఒక్కొక్క పత్రిక అయినా నడుపుకొన్నాయి. ఆర్థికంగా, సాంఘికంగా తక్కువవాళ్ళుగా భావింపబడేవాళ్ళు పత్రికలు ప్రచురింపలేకపోయారు.

'విప్రకుల దర్పణము' (1936) 'ఆంధ్ర బ్రాహ్మణ కుటుంబ చరిత్రములు' కలిగి వుంది. 'నియోగి' (1919) నియోగుల మహాసభ పక్షాన వెలువడింది. 'బంధుసేన' (1931) శిష్ట కరణముల వైశిష్ట్యం తెలుపుతూ వుంది. 'వాసవి' (1926), 'వైశ్య' (1928) వైశ్య జనుల ప్రాధిక్యం వివరించాయి. 'ప్రబోధిని' (1908) శ్రీ కృష్ణా గుంటూరు మండల విశ్వబ్రాహ్మణ సమాజపక్షమున ప్రకటింపబడింది. 'రెడ్డిరాణి' (1923) రెడ్లు క్షత్రియులని తెలుపుతూ ఉంది. 'దేవాంగ ప్రభ' (1942) దేవాంగుల సాంఘికార్థిక దశను వివరించింది. 'ఆంధ్ర

హరిజన్' (1946) హరిజనాభ్యుదయం వాంఛించింది. 'నేత'(1952), 'చేనేత' (1947) సాలెవాళ్ళ వృత్తి వైశిష్ట్యం, అవసరాలు వివరించే దృష్టితో వెలువడ్డాయి. 'ఎఱుకలు' (1942) ఈ తెగ అస్తిత్వం పట్ల ఆందోళన వ్యక్తం చేసిన పత్రిక. వర్తమానాంధ్ర దేశంలో కుల ప్రాధిక్యం చూపే పత్రికలు ప్రాచుర్యం కోల్పోయాయి. అదే వాటి అనావశ్యకాన్ని తెలిపింది. ఇక ప్రచారం అక్కర లేదు.

*విద్య* : తెలుగు పత్రికలలో సారస్వతం వంటి భిన్న విషయాలతోపాటు విద్య కూడా అంశమయింది. 'ఉపాధ్యాయోపకారి' (1892), 'ఉపాధ్యాయోపయోగిని' (1892) గుంటూరు, బందరుల నుంచి వెలువడి, ఉపాధ్యాయ స్థితిని మెరుగుపరచటం కోరాయి. 'గురుబోధిని' (1902) విద్యా విషయాలు వివరించింది. 'ప్రారంభ విద్య' (1912), 'ఆంధ్రసేన' (1917), 'కుమారబోధిని' విద్యార్థులకు అనేక విధులూ విషయాలూ బోధించాయి. విద్య లోపం స్పష్టంగా గోచరమవుతున్న దేశంలో ఎన్ని పత్రికలు వెలువడ్డా ఉపయోగకరంగానే ఉంటుంది. 'తెలుగు విద్యార్థి', 'ఆంధ్ర విద్యార్థి' వంటి పత్రికలు ఆ రంగంలో కృషి చేశాయి. ఇటువంటి పత్రికలూ, 'ఉపాధ్యాయ' వంటివీ, అనేకం వెలువడుతున్నాయి.

*ఆంగ్లత్వం* : ఆంగ్ల పత్రికా ప్రభావం తెలుగు పత్రికావిర్భావానికి హేతువు కావటంవల్ల కావచ్చు, తెలుగు పత్రికలలో ఆంగ్లత్వం గోచరమవుతూ వుంది. ఆంగ్లేయ పద్ధతిలో రచన చేయటం ప్రచురించటంతోపాటు తెలుగు పత్రిక ఆంగ్ల భాషను కూడా నిలుపుకొంది. ఇది రెండు విధాలుగా చూడవచ్చు తెలుగు పత్రికలో ఆంగ్లవ్యాసాలు ప్రచురించటం, తెలుగు శీర్షికకు ఆంగ్లానువాదం ఇవ్వటం. ఆంగ్లాంధ్ర భాషలతో పత్రిక వెలువరించటం క్రైస్తవ మత ప్రచారకుల మూలంగా ప్రవర్తిల్లింది. 'సత్యసంవర్ధిని'ని గూర్చి తెలుపుతూ "A Monthly Anglo-Telugu Journal Mainly devoted to Religious social and Moral topics" అనటం గమనించవచ్చు. పత్రిక, వ్యాసం, మొదలైన వాటి తెలుగు శీర్షికల క్రింద ఆంగ్ల శీర్షిక లుండటం గుర్తింపవచ్చు. ఆరోగ్యము The first and foremost Telugu Medical monthly కాకినాడ నుంచి, 1913 లో ప్రారంభమయి. (వి గోపాలకృష్ణ సంపాదకత్వం, యం. వేంకట రంగయ్య ఉప సంపాదకత్వంతో వెలువడింది) ఆంగ్లంలో పత్రికాంశాలు వివరించింది. 'పురుషార్థ ప్రదాయిని' (మచిలీపట్టణం 1872) అనేక విషయ విన్యస్తంగా ఉండటం తెలుసుకోవచ్చు.

"A
Monthly Magazine
or
Miscellany
Pocket - Book
of
Facts, Fables
opinions, and News
among the leaves
Earn and Enjoy
Chiefly intended
to be a
Concise Telugu Record of
Science, Arts, Antiquities
Agri - Horti - Flori culture
Folklore
Literature, Religion
Natural Theology
Mythology, Merchandise
Manufactures, Handicrafts
Natural History, Biography
Law, History, Curiosities
Rarities, Recreations etc."

ప్రారంభంలో ఆంగ్ల భాష అధికంగా తెలుగు పత్రికలలో గోచరమయి, క్రమంగా తగ్గిపోయి వర్తమానంలో ఆంధ్రత్వం విస్పష్టంగా నిలచివుంది.

ఇంతేకాక, తెలుగు పత్రికలు భిన్న విషయాల ప్రాధాన్యంతో రూపొందాయి. తెలుగు భాషను వివరించేవి, ఆరోగ్యం తెలిపేవి, సంఘసేవను మానవసేవను ప్రోత్సహించేవి, వ్యాపారాన్ని అభివృద్ధి చేసేవి, వ్యవసాయం, పరిశ్రమలు విపులపరచేవి, వైద్యం, న్యాయశాస్త్రం బోధించేవి అనేక పత్రికలు అవతరించాయి. నాటక కళ, గానకళ, నాట్యకళ, సాహితి వంటి లలితకళా పత్రికలు తెలుగులో వెలువడ్డాయి. మానవ జీవితంలోని చాలా దశలు స్థితులు అవసరాలు తెలిపేటట్లుగా తెలుగులో పత్రికలు ఆవిర్భవించినట్లు విశదమవుతూ వుంది.

పత్రికా నామధేయం : 19వ శతాబ్దిలో వెలువడ్డ పత్రికల సామాన్య లక్షణాలు చూడవచ్చు. తెలుగు పత్రికలు 'శ్రీ'తో కూడి ఉండటం సర్వ సాధారణంగా కనిపిస్తూ వుంది. శ్రీ యక్షిణి, శ్రీ ప్రబంధ కల్పవల్లి, శ్రీ వైజయంతి, శ్రీ కళానిధి, శ్రీ భారతి వంటివనేకం ఉన్నాయి. శ్రీ యక్షిణిలో తప్ప మిగతా పత్రికలలో శ్రీ శుభవాచకంగా పత్రిక పేరులో భాగం కానట్లుగా గ్రహించి, తొలగించటం పరికింపవచ్చు.

తెలుగు పత్రికలు సాధారణంగా ఇకారాంతంగా, కొన్నిమాత్రం అకారాంతంగా ఉన్నాయి. అన్యం బహ్వాల్పం. వృత్తాంతిని, వర్తమాన తరంగిణి, హితవాది, దిన వర్తమాని వంటివి ఎక్కువగా ఉన్నాయి. సత్యదూత, మనోరమ, జనానా పత్రిక, శారద వంటివి తక్కువ. ముదిభక్తి ప్రత్యయాంతంగా 'స్వదేశ జన ప్రసిద్ధ అభిప్రాయము', 'విద్యార్థి కల్పభూజము', 'నీతి దర్పణము' వంటివి మిక్కిలి అల్పంగా ఉన్నాయి.

వర్తమాన తరంగిణి, సరస్వతి, చింతామణి, శారద, భారతి అప్పటి కాలంలోనూ, అనంతరమూ, అనేక పత్రికలకు పేర్లయ్యాయి. రంజని పదంతో సుజన రంజనిగా 1865లో వెలువడ్డ పత్రిక ప్రభావం బ్రహ్మాండ రంజని (1874). లోకరంజని (1874), సుధీరంజని (1874)పత్రికలమీద చూడవచ్చు. గోదావరి విద్యాప్రదాయిని (1866) పురుషార్థ ప్రదాయినిని చూడగానే గుర్తుకు వస్తుంది. పరస్పరం వివాదాలతో సారస్వత వ్యాసంగం సాగించిన కందుకూరి వీరేశలింగం పంతులు పత్రిక వివేకవర్ధినిని గుర్తుకు తెస్తూ హాస్యవర్ధని కొక్కొండ వేంకటరత్నం పంతులు పత్రిక వుంటే, ఈ రచయిత పత్రిక ఆంధ్ర భాషా సంజీవని పైరచయిత హాస్య సంజీవనిని తలపిస్తూ వుంది. ఈ వివాద పత్రికలలో ఆయా పత్రికలు గుర్తుకు రావటం ఉద్దేశించినట్లుంది. బోధిని, దర్శిని, మంజరి ఉత్తర పదాలుగా పత్రికలు వెలువడ్డాయి. ఉపాధ్యాయోపకారి (1892) ఉపాధ్యాయోపయోగిని (1892), ఒకదాని వెంట ప్రకటింపబడటం గుర్తింపవచ్చు. పత్రికల పేర్లు ఒక పదంగానో రెండు పదాలతో సమాసంగా ఉండటం సాధారణమయితే, కొన్ని భిన్నంగా ఉన్నాయి. ఉదా: అనల్ప జల్పితా కల్ప కల్పవల్లి; చాలా పత్రికలు విద్యల తల్లి అయిన సరస్వతి నామాంతరాలతో ఉన్నాయి.

పత్రికా సంపాదకులు : 19వ శతాబ్ది తెలుగు పత్రికల సంపాదకులుగా క్రైస్తవ మత బోధకులు ఉన్నారు. ఎడ్మండ్ షార్కీ (హితవాది) పీటర్ పెర్సివల్ (దినవర్తమాని), డైసను దొరసాని (ఉపాధ్యాయోపకారి). వీళ్ళు పత్రికా ప్రారంభ దశలో ఉన్నవాళ్లు వర్తమాన తరంగిణి ప్రారంభించటంతో పాటు, ఆరునెలలపాటు నిర్వహించటం కూడా చేసిన ఆ పత్రికాధిపతి సయ్యద్ రహ్మతుల్లా ఈ సందర్భంలో పేర్కొనవచ్చు. షుజాయత్ ఆలీఖాన్ 'విద్వన్మనోహారిణి'కి (1874) తమిళ వ్యక్తి త్యాగయ్య మొదలి 'శ్రీయక్షిణి'కి (1885) సంపాదకులుగా ఉన్నారు. ఎక్కువ పత్రికా సంపాదకులుగా ఆంధ్రులు హిందువులుండటమే జరిగింది.

పత్రికా ప్రదేశాలు : 19 వ శతాబ్దిలో వెలువడ్డ తెలుగు పత్రికలు అధికంగా తెలుగు దేశపు సరిహద్దులో నుంచి కావటం స్పష్టంగా గుర్తుంచుకో వలసిన అంశం. మద్రాసు, బందరు, బళ్ళారి, విశాఖపట్టణం, బరంపురం, శ్రీకాకుళం అత్యధిక పత్రికల జన్మస్థానాలు. తెలుగు దేశం నడిబొడ్డులో నుంచి వచ్చిన పత్రికలు ఎక్కువగా గోదావరి నదికి రెండు ప్రక్కల పట్టణాలలో పుట్టి నట్లు విశదంగా ఉంది. రాజమండ్రి, కాకినాడ, పిఠాపురం, తుని, కాక, ఏలూరు-గుడివాడ, అత్తిలి కూడా పత్రికల అవతరణకు వేదికలయ్యాయి. ఆ కాలంలో నెల్లూరు బుచ్చిరెడ్డి పాలెం కలుపుకొని పరిశీలిస్తే, అధిక పత్రికల ఆవిర్భావానికి ఆకరం. గుంటూరు, విజయవాడలలో పత్రికాజననం తారతమ్య దృష్టితో చూస్తే అనంతరమే!

## 3. పత్రికలు - వ్యాస బహుమతులు

ఒక ప్రక్రియ విస్తృతంగా రచింపబడటానికి పోటీలు బహుమతులు దోహదం చేస్తాయని ఇతర ప్రక్రియాగతంగా ప్రాచీనం అర్వాచీనం అయిన అనేక సంస్థల పోటీలు విశదం చేశాయి. వ్యాస ప్రక్రియకు ఈ దోహదం పత్రికాగతంగా కల్పలతలో జరిగింది. 1903 లో విశాఖ పట్టణం నుంచి ప్రారంభ మయిన ఈ మాస పత్రికలో సారస్వత విషయాలతో పాటు సాంఘిక విష యాలు గోచరమవుతున్నాయి. ఇదికాక కొన్ని ప్రశ్నలడిగి సమాధానం పాఠకులు వ్రాయగా గ్రహించి, అందులోనుంచి ఉత్తమమయిన వాటిని ఎన్నిక చేసి బహుమతి ఇవ్వటం ప్రతి మాసం కార్యక్రమంగా వుండే.

మదరాసు ప్రెసిడెన్సి కళాశాల శ్రీ ఆంధ్ర భాషాభివర్ధినీ సమాజం 1899 నుంచి నిర్వహిస్తున్న రచనకు సంబంధించిన పోటీ 1908 దాకా విమర్శనంగా, ఆ పైన వ్యాసంగా జరిగింది. 'మను వసు చరిత్ర రచనా విమర్శనము' బహుమతి పొందిన విమర్శనం. అంతకుముందు విమర్శన సాహిత్య సృష్టికి పోటీలు జరిగినట్లు, బహుమతులిచ్చినట్లు తెలుసుకోవటం చేయవలసిన కార్యం. మద్రాసు క్రైస్తవ కళాశాలలోని ఆంధ్ర భాషాభిరంజని సమాజం వాళ్ళు విద్యార్థి పి. దక్షిణామూర్తి 'పింగళి సూరన' అనే 'క్రిటికల్ ఎస్సె' వ్రాస్తే, 10.8.1892న యస్ రంగయ్య చెట్టి అధ్యక్షతన జరిగిన సమావేశంలో చదివించటం ఒక విధంగా విద్యార్థికి బహుమతి. 1892లో ఎస్సె అనటం బదులుగా వ్యాసం అనలేదు. 1899లో వ్యాసం అనకుండా విమర్శనం అనటం జరిగింది. 1908లో ఆంధ్ర భాషాభివర్ధని వాళ్ళు ఈ పోటీకి వ్యాసరచన పోటీ అనటంవల్ల వ్యాసం పేరు 1900 తర్వాత వ్యాప్తి పొందిందన్న అంశాన్ని బలపరుస్తూ వుంది.

ఈ పోటీలో బహుమతి ధన రూపంలో ఉంది. వ్యాసరచనకు కొన్ని సూచనలు చేయటం జరిగింది. ఆ నియమాలు ఆ సూచనలు కొంతవరకు వ్యాస రచన ప్రోత్సాహానికి, లక్షణానికి మార్గదర్శకంగా ఉన్నాయి కనుక వాటిని చూడవచ్చు.

*నియమములు :*

I. ఈ వ్యాసమును జెన్నపురి రాష్ట్రమునందలి వారెవ్వరైన వ్రాయవచ్చును.

II. ఈ వ్యాసము చక్కఁగను విశదముగను దృఢమైన లావు కాగితముల మీఁద నొక ప్రక్కనే వ్రాయబడవలయును.

III. ఈ గ్రంథకర్తలు వేఱు కాగితముపై నీ వాక్యము వ్రాసి సంతకముఁ జేసి వ్యాసమునకుం జేర్పవలయును. "ఈ వ్యాసము వ్రాయుటయందు నేనితరుల సాహాయ్యము నందలేదనియుఁ, గ్రింద బేర్కొనిన గ్రంథములను దప్ప నితర గ్రంథముల నే నుపయోగపఱచికొనలేదనియు నా గౌరవముపై శపథముఁ జేసెదను." గ్రంథముల నామములు వ్రాయవలయును.

IV. వ్యాసము నందెచ్చటనేని తత్కర్తృనామముగాని, దాని సూచించు సంకేతాక్షరములు గాని వ్రాయఁబడఁగూడదు.

V. ఈ వ్యాస మీ సమాజ కార్యదర్శికి 1908 సంవత్సరము డిసెంబరు నెల 1 తేదీనిఁగాని తత్పూర్వముగాని చేరఁ బంపఁ బడవలయును.

VI. బహుమాన ద్రవ్యము రూ. 50.0.0 లు. ఇది యీ వ్యాస పరీక్షకు అర్హులని నిర్దేశించిన వారికి ధన రూపముగనైనను బహుమతి నొందువారి యిచ్చచొప్పున మఱి యే రూపముగనైనను నీయఁబడును.

VII. ఏ వ్యాసమైనను దల్లేఖకులకు మరల బంపఁబడదు.

VIII. బహుమతి నొందినవారు బహుమతి నొందిన తరువాత నాఱు మాసములలో వారి గ్రంథమును ముద్రితముఁ జేయుదురేని గ్రంథ ప్రకటన స్వాతంత్ర్యము (Copy right) వారికే యీయబడును. అట్లు వారు చేయనిచో నా స్వాతంత్ర్యము సమాజమునకే యుండును.

సూ చ న లు

(INSTRUCTIONS)

(Recommended to be followed as far as practicable)

౧-వ ప్రకరణము: కవి, జన్మ, దేశ, కాల, మతాదులు (ఈ విషయముల గురించి యిదివఱకే వ్రాయబడిన గ్రంథములలోని వ్రాతలనే నమ్మక వాని సత్యాసత్యములు చర్చించి సిద్ధాంతము చేయవలయును. Indian Epigraphy అను పత్రిక కాలాదుల నిర్ణయించుట యందుఁ దోడ్పడఁ గలదు.)

౨-వ ప్రకరణము: కవి కృత గ్రంథములు. (ఇవి కాలక్రమము ననుసరించి వ్రాయఁబడ వలయును. ఒక్కొక్క గ్రంథమున కొక్కొక్క ప్రకరణము చొప్పున వ్రాయవలెను. కథా సంవిధాన చమత్కారము, అవయవ పరస్పర సంబంధములు వాని యానుకూల్య ప్రాతికూల్యములు, నాయకాదుల గుణపోషణము (Characterisation) ధ్వని రసాలంకార పోషణములు, సందర్భశుద్ధి, శైలి, పాకము, శబ్దాలంకారములు, లక్షణవిశేషాదులు, భావాదులు, భాషాంతరీకరణమైనచో మూలానుసరణ విషయము వ్రాయవలయును. ఈ కథనే

యితరులు చెప్పియుండినచో దానికి దీనికిగల భేదము వానిలో గుణవంతమేదై నది కవికిని నతని సమకాలికులగు కవులకు సంబంధమున్నచో నదియు, లోకా నుభవ జన్య జ్ఞానము లోనగునది వ్రాయవలెను. కవి విషయమైకాని, గ్రంథ విషయమైకాని, యిదివఱకే యెవరైన నభిప్రాయము లిచ్చియుండిన వాని సాధు త్వాసాధుత్వములు చర్చింపవలయును. కవి కృత పూర్వాపర గ్రంథశైలి భేదమును వ్రాయవలయును. కథ ప్రసిద్ధమైనచో సంగ్రహము వ్రాయఁబని లేదు.

కడపటి ప్రకరణము : విశేషాంశములు, శ్లేషాంశములు (పైన వ్రాయఁ బడని కథలు, చాటుపులు, బిరుదులు లోనగు చరిత్రోపయుక్త విషయములు మొదలగునవి వ్రాయవలయును. ("శ్రీ సరస్వతి - ఏప్రిల్ 1908 సంచిక, స్వవిషయము.)

వర్తమానాంధ్ర సాహిత్యంలో నవల, కథ, నాటక, నాటిక, కవితా, విమర్శనలకున్న పోటీలు బహుమతులు వ్యాసానికి లేనట్లే చెప్పవచ్చు. అయితే చెదురుమదురుగా అక్కడక్కడా, అప్పుడప్పుడూ ఇవి జరక్కపోవటంలేదు. 'ఎమెస్కో' పుస్తకాలమీద సమీక్ష ప్రచురించటానికి ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక సమీక్షా వ్యాసరచన పోటీ నిర్వహించింది. ప్రతి సంవత్సరం జరిగే దీపావళి కథల పోటీలో ఆరు కథలు సంపాదకులు ఎన్నిక చేసి, ఉత్తమమయిన కథలు క్రమం తెలుపుతూ వ్రాసిన వ్యాసానికి బహుమతి ఇవ్వటం ఆంధ్ర సచిత్ర వార పత్రిక 1970-71 నుంచి చేస్తూ వుంది. ఈ పత్రిక, స్త్రీల సమస్యలమీద వ్యాస రచన పోటీని నాలుగేళ్ళనుంచి నడుపుతూ బహుమతులిస్తూ వుంది.

ఈ సందర్భంలో బిరుదుల సంగతి కూడా తిలకించాలి. తెలుగు దేశంలో కవులకు ఎక్కువగా, కథా రచయితలకు మరీ తక్కువగా బిరుదు లివ్వటం పరిపాటి. బిరుదులు ఈ ప్రక్రియా రచయితలకు పరిమితంగా పరిశీలించటమే కృత్యం. అయితే తెలుగులో వ్యాసరచయితకు పూర్వం బిరుదు లిచ్చినట్లు ఆధారాలు అలభ్యంకావడం వల్ల 'వ్యాస విద్యా విశారద' అని శ్రీ తుర్లపాటి కుటుంబరావు కిచ్చిన బిరుదం వ్యాస రచనకే బిరుదంగా అవ్యంగా భావింప వచ్చు. (ది హిందు, మే 2,1972). ఈ రచయిత 'మహానాయకులు' జీవిత చరిత్ర వ్యాస సంపుటి. తెలుగులో వ్యాస రచనకు బహుమతుల రూపంలో ఎక్కువ ప్రోత్సాహం లేకపోయినా అసలు లేకపోలేదు.

## 4. పత్రికా వైవిధ్యం – వ్యాస సృష్టి :

ఈ పత్రికలలో వైవిధ్యం వ్యాస సృష్టిలో వివిధత్వం సమకూర్చింది. స్త్రీ బాల హాస్యాపరాధ పరిశోధన 'సినిమా' లైంగిక వైజ్ఞానిక సారస్వత సాంఘిక మత రాజకీయ పత్రికలు ఆ యా విషయ వైవిధ్యంతో ఉన్న వ్యాస రచనకు దోహదం చేశాయి. ఆయా పత్రికల పాఠకులు రచయితలు ఆ ప్రత్యేక విషయాభివృద్ధి కోసం కృషి చేస్తూ వుంటారు, రచిస్తారు కాబట్టి, ఆ విషయ విన్యస్త వ్యాసాలు వాటిలో చోటు చేసుకొంటూ వున్నాయి.

'సావిత్రి' 'జనానా' పత్రికలు స్త్రీ సమస్యలనూ, 'పాపాయి' 'బాల'లు పసివాళ్ళ మేలునూ, 'డిటెక్టివ్' 'అపరాధ పరిశోధన' వంటివి నేరాలనూ, 'మదన 'సరస'లు లైంగిక విషయాలనూ, 'సాహితి' 'జయంతి' 'భారతి' సాహిత్య విమర్శననూ కలిగి వున్నాయి. ఇంకా సినిమా వైజ్ఞానిక, సాంఘిక, మత రాజకీయ పత్రికలు తత్సంబంధి రచనలను వ్యాసాలుగా వెలువరించటం సాహిత్యంలో సామాన్యమయింది.

నేటి మాస వార దినపత్రికలు అనేక విషయాలతో నిండి ఉంటున్నాయి. రాజకీయం, సారస్వతం, కళ, స్త్రీల, బాలల, చలన చిత్రాల విషయాలు పరిమిత పరిధిలో వ్యాసాలుగా అందిస్తున్నాయి. ఈ నాటి పత్రికలలో విషయ వైవిధ్యం ఉంది కాని వ్యాస వాఙ్మయం తక్కువగా వుంది. సారస్వత పత్రికలలో విమర్శనం ఎక్కువయింది. 'అసలు వ్యాస' రచనం పత్రికలలో తక్కువగా ఉంది.

## 3. తెలుగు పత్రికలు – వ్యాస పరిణామం

సారస్వత పత్రికలలో వ్యాస పరిణామం చూడవచ్చు. 19 వ శతాబ్దిలో ఉపన్యాసాలు, 20 శతాబ్దిలో వ్యాసాలు, పదార్థంలో కాదుకాని పదంలో మార్పు పొంది పత్రికలలో చోటు చేసుకొన్నాయి. తెలుగులో అనేక వ్యాసాలు పత్రికాగతంగా ఉండి, సంపుటాలు కాకుండా పోయాయి. ఒక రచయిత వ్యాసాలన్నీ కానీ, ఒక విషయం మీద భిన్న పత్రికలలో ఉన్న వ్యాసాలు కాని, ఒక రచనా రీతిలో ఉన్న వ్యాస వాఙ్మయమంతా కాని, సంకలనాలుగా చాలావరకు రూపొంద లేదని గమనించటం సముచితం. అందువల్ల స్థూలంగా అయినా ఈ ప్రయత్నం అవసరం.

## 1. ప్రముఖ పత్రికా త్రియం

ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలు, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలు, భారతులు అయిదేశ్వ సంచికలు రూపొందించిన వ్యాస వాఙ్మయం అనంతరం ఏ విధంగా సాగిందో గమనింపవచ్చు. స్థూలంగా సారస్వత పత్రికలలో సాహితీ విమర్శనం వ్యాసంగా అధికంగా ఏర్పడింది. భిన్న విషయాల మీద విమర్శనా వ్యాసాలు రూపొందాయి. సృజన వ్యాసం తక్కువగా ఉన్నట్లు స్పష్టంగా గుర్తించాలి. ఈ పత్రికా వ్యాస రీతిలోనే మిగతా సాహిత్య పత్రికల వ్యాసాలున్నాయి. కాలక్రమంలో వ్యాసం పత్రికా ప్రచురణకే పరిమిత మవుతూ రావటం, వ్యాసాలు పాఠ్యభాగాలవటం ప్రారంభమయిన నాటి నుంచి, సంపుటులుగా వెలువడటం తెలుస్తూవుంది.

*ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలు :* కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు 1910 లో బొంబాయి నుంచి ఆంధ్ర పత్రిక సంవత్సర సంచికలు ప్రచురించి సారస్వతాభివృద్ధికి వ్యాస పరిణతికి దోహదం చేశాడు. తెలుగులో సంవత్సరాది సంచికలు ముద్రించటం దీనితో ఆరంభమయింది. ఇందులో 248 పుటల వ్యాసాలు, 126 చిత్రపటాలు ఉన్నాయి. ''దీనిలో ముద్రితములైన వ్యాసములు భాషాభిమానుల చేతను భాషాభిజ్ఞుల చేతను వ్రాయఁబడుటం జేసి, యవి భాషాభివృద్ధికిని భాషాజ్ఞాన అభివృద్ధికిని దోడ్పడఁగలవు.'' (ప్రథమ సంచిక-విన్నపము)

ఈ సంచికలలో భాషా విషయం, సారస్వతం. చరిత్ర, పరిశ్రమలు, స్త్రీ సమస్య, వైద్యం, జ్యోతిషం, హిందూ క్రైస్తవ మహమ్మదీయ మతాలు ప్రముఖ వ్యాస వస్తువులుగా ఉన్నాయి. వ్యాస రచయితలు పలువురు తమ రచనలీ సంచికలలో ప్రచురించారు. తక్కువగా సృజన వ్యాసాలున్నాయి. పలువురు ప్రసిద్ధులు తమ వ్యాసాలు ఇందులో ప్రచురించారు.

1910 నుంచి నేటి దాకా వెలువడుతూ ఉన్న ఈ సంవత్సరాది సంచికలు ఉత్తమ విమర్శన వ్యాస రచనకు దోహదం చేశాయి. ఆరంభంలో గ్రాంథిక భాషకు ప్రాచీన తత్త్వానికి ప్రాధాన్యం ఇచ్చిన ఈ పత్రిక క్రమంగా కాలంతోపాటు మారి, వ్యావహారిక భాషకు, ఆధునిక జీవిత విధానానికి స్థానం కల్పించుకొంది. నాడూ నేడూ ఆంధ్రదేశంలో ఉత్తమ విమర్శకులు

ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలలో వ్యాసరూపంలో గోచరమవు తున్నారు.

*ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక:* ఇది ఆంధ్ర సాహిత్య పరిషత్తు వెలువ రించే పత్రిక. మూడు మాసాలకొకసారి ముద్రింపబడి ప్రకటన పొందుతూ "తెలుగు భాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించుట కొక పత్రికను ప్రకటించుట'' పరిషదుద్దేశం కావటంవల్ల తన్నిర్వహణార్థం ఈ పత్రిక రూపొందింది.

పరీధావి సంవత్సరం ప్రారంభమయిన ఈ పత్రికాగతంగా భాషా సార స్వత చరిత్రాత్మక కృషి చేసిన వ్యక్తి జయంతి రామయ్య పంతులు, కె. వి. లక్ష్మణరావు మొదలైన వాళ్ళు ప్రసిద్ధులున్నారు. భాషాభావాల సంగతిలో ప్రాచీన ధర్మ ప్రాధిక్య ప్రదర్శన పత్రికా మూల ధర్మంగా గోచరమవుతూ వుంది. నాటికి నేటికి ఈ పత్రిక దర్శిస్తే ఈ సాంప్రదాయిక భాషా సారస్వత స్థితి వ్యక్తమవుతుంది.

ఇందులో సాహిత్య విషయాలు, కావ్య భేదాల గుణదోషాలు, ఆంధ్రాన్య వాఙ్మయ తారతమ్యాలు తెలిపే వ్యాసాలున్నాయి. కవి జీవితాలు, కావ్య చరిత్ర, కృతి విమర్శనం వ్యాసరూపం పొందాయి. తెలుగు భాషా చరిత్ర, దేశ చరిత్ర, రాజచరిత్రలు శాసనాధారాలతో వ్యాసాలుగా ప్రచురణమయ్యాయి. ఆధునిక విజ్ఞాన శాస్త్రీలు ప్రాచీన విశ్వాసాలు జోడించి వ్యాసాలు వ్రాయటం జరిగింది. ఈ పత్రిక ఉన్నత స్థాయి విమర్శన వ్యాసాలకు ఆకరమయి ఉంద. ఇందులో సృజన వ్యాస ప్రకటనకు అవకాశం లేదు. ఒకనాడు తెలుగులో సారస్వత విషయంలో అధికారికాభిప్రాయ ప్రకటనకు రంగస్థలమయిన ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక తత్ స్థానం క్రమంగా కోల్పోయి ప్రాచీన రచనల పత్రికగా తయారయింది. కాలక్రమంలో పద్య రచనలు, పరిష్కృత గ్రంథాలు అధికంగా ముద్రింపబడ్డాయి.

*భారతి :* ఆంధ్రపత్రికా సంస్థ 1924 నుంచి ప్రచురించిన మాసపత్రిక ఇది. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు సంపాదకత్వంతో అప్పటినుంచి ప్రచు రితమవుతున్న సాహిత్య మాస పత్రిక భారతి. సాహితీ గగనంలో వెలుగొందే తారకలు భారతీ దర్శనం పొందటం గమనింపవచ్చు తెలుగు దేశంలో

సాహిత్య మాసపత్రిక ఎక్కువ కాలం నిలపటానికి వీలులేకపోయినా, అప వాదంగా ఉంది భారతి.

భారతిలో వ్యాసగతంగా సారస్వత విమర్శనం ప్రప్రథమంగా గోచర మవుతుంది. అక్కడక్కడా సృజన వ్యాసాలున్నాయి. కావ్య విమర్శనం కవి జీవితంకంటే ఎక్కువగా జరిగింది. అనువాద వ్యాసాలు అనేకం ఉన్నాయి. వివాదవ్యాసం భారతి పుట్టిం దగ్గర్నుంచీ ప్రచురింపబడుతూ వచ్చింది. పరిశ్రమలు, భాషా విషయాలు, గానం, చిత్రకళలు వంటి లలితకళలు, శాస్త్రాలు వ్యాసాలుగా భారతిలో ప్రకటితమయ్యాయి. అనువాద వ్యాసాలు ఇందులో ఉన్నాయి. హిందీ వ్యాసాలు కొన్ని ప్రారంభంలో భారతిలో కనిపించాయి. సాభిప్రాయ విశేషాలు పేరుతో కాశీనాథుని నాగేశ్వరరావు సమకాలీన సమస్యలు, వార్తల మీద వ్యాఖ్యానం చేశాడు.

భారతిలో క్రమక్రమంగా, ఆర్థిక, రాజకీయ వ్యాసాలు ప్రచురించారు. జ్యోతిశ్శాస్త్రవిషయాలు, సారస్వత సమస్యలు, నూత్న రచనా రీతుల వివరణం వ్యాసాలుగా ప్రచురణ పొందాయి. ఒకప్పుడు ప్రాచీనతకు ప్రతీకగా ఉన్న భారతి కాలానుగుణంగా ఆధునికత వైపు పయనించింది. భారత విమర్శనం నుంచి దిగంబర కవిత్వం దాకా సాహిత్యంలో వచ్చిన పరిణామాలకు ప్రతిబింబంగా అర్థ శతాబ్ది తెలుగు భాషా సారస్వతాల సమ్మేళనంగా నిలిచి వుంది భారతి.

## 2. సారస్వత పత్రికా వ్యాసాలు

20 శతాబ్ది ఆరంభానికి పూర్వం తెలుగు సారస్వత పత్రికలలో ఉపన్యాసాలు, తర్వాత వ్యాసాలు ప్రచురించబడ్డాయి. ఉపన్యాసాలు అధికంగా సృజనంగా, అల్పంగా విమర్శనంగా రూపొందితే, వ్యాసాలు ప్రధానంగా విమర్శనంగా, అప్రధానంగా సృజనంగా ఉన్నాయి. ఈ సందర్భంలో ఉపన్యాసం హృదయ ఫలంగా, వ్యాసం బుద్ధి ఫలితంగా ఉన్నట్లు తెలుస్తూ వుంది. ఆంధ్ర వ్యాస వాఙ్మయం పత్రికా ముఖంగా హృదయం నుంచి బుద్ధివైపు సాగింది.

1870 నుంచి తెలుగు పత్రికలలో వ్యాసాలు ఉపన్యాసరూపంలో ప్రచురింపబడినట్లు స్పష్టంగా ఉంది. అంతకు పూర్వం పత్రికలలో వ్యాసాల ఉనికి

పరిశీలించవచ్చు. ప్రారంభ పత్రికగా భావింపబడే 'సత్యదూత' అస్తిత్వం మీద నిశ్చితాభిప్రాయం లేదు కాబట్టి వ్యాస పరిశీలనావకాశం, సత్యదూత ప్రతులు లభించిందాకా, లేదు. 'వృత్తాంతిని'ని గూర్చి సమాచారం స్పష్టంగా తెలియటం తప్ప పత్రికలు లభించటం లేదు. 'వర్తమాన తరంగిణి'లోని 'మత ప్రవర్తనము' (10.10.1852) 'గాలివాన' (10.4.53) వ్యాసాలే. 1850 దాకా వ్యాస రచనంగా భావింపదగ్గ సృష్టి జరగలేదనుకోవచ్చు. 1850-70 మధ్య కాలంలో వ్యాసం అనుకోవటానికి తగినట్లున్న రచనలు వెలువడ్డాయి.

'హితవాది' 'దినవర్తమాని' క్రైస్తవ మత ప్రచారం ప్రధానంగా లక్ష్యముంచి సాగిన పత్రికలు. మత సంబంధి రచనలు కొన్ని వ్యాసాలుగా పరిగణించటానికి అవకాశం ఉంది. 'శ్రీయక్షిణి', 'తత్త్వబోధిని' 'సుజనరంజని' పత్రికలు సారస్వత రంగంలో సమర్థంగా ప్రారంభమయ్యాయి. తత్త్వబోధినిలో వ్యాసాలుగా పేర్కొదగ్గ రచనలు స్త్రీ పునర్వివాహ విషయము, బాలికా విద్యాభ్యాసము, ఐకమత్యము వంటివి ఉన్నాయి.

కొక్కొండ వేంకటరత్నం పంతులు మద్రాసు నుంచి ప్రచురించిన ఆంధ్ర భాషా సంజీవని, హాస్యవర్ధని పత్రికలలోనూ, కందుకూరి వీరేశలింగం పంతులు రాజమండ్రి నుంచి ప్రకటించిన వివేకవర్ధిని, హాస్య సంజీవని, సతీహితబోధిని, సత్యసంవర్ధని, సత్యవాదిని పత్రికలలో అనేక సృజన వ్యాసాలున్నాయి. వ్యక్తి, సాహిత్య విమర్శనం ఉంది. వివాద వ్యాసాలున్నాయి.

పురుషార్థ ప్రదాయినిలో, ప్రబంధ కల్పవల్లిలో గురజాడ శ్రీరామమూర్తి సంపాదక రచయితగా వ్రాసిన కూచిమంచి తిమ్మకవి చరిత్రము (1-4) (సం.1 సం. 4) మతవైరములు (2-3, 4,5); యథార్థ భారతిలో దేవాలయములు, అపూర్వ రోగ కారణములు, ప్రేమ (1-7); విగ్రహారాధన సిద్ధాంతము, దాన మహిమ (1-9); హిందూ జన సంస్కారిణిలో మత విషయకోపన్యాసము (2-9): మనోరంజనిలో తుని గురించి (3-1); స్వదేశ రాజుల వ్యవహారము (2-4); శారదలో కన్యాశుల్క ప్రతిషేధ విషయకోపన్యాసము (1-4,5) వంటి వ్యాసాలనేకం ముద్రితాలయ్యాయి. చింతామణి, జనానా పత్రిక, సత్యసాధిని, మంజువాణి. అముద్రిత గ్రంథ చింతామణి. సరస్వతి ఉపన్యాసాలు విరివిగా ప్రచురించాయి.

పత్రికా వ్యాసం ఉపన్యాసంగానే 19వ శతాబ్దిలో గోచరమవుతూ వుంది. పత్రికలన్నీ సారస్వత సంబంధులు కాకపోవటం, సారస్వత పత్రికలన్నీ వ్యాసాలు ప్రచురించక పోవటం వల్ల ఉపన్యాసం పత్రికలలో పొందిన విస్తృతి పరిమితంగా ఉంది. వివేక వర్ధని చింతామణి, అముద్రిత గ్రంథ చింతామణి, సరస్వతి వంటి పత్రికలు వ్యాస పురోభివృద్ధికి దోహదం చేశాయి.

20 శతాబ్దిలో పత్రికలలో వ్యాస ప్రచురణం అధికమయింది. కొన్ని పత్రికలు అధికంగా వ్యాసాలే ప్రచురించాయి. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక అన్నీ ప్రారంభంలో వ్యాసాలే ప్రచురించింది. ఆంధ్రపత్రిక భారతి, వ్యాసాలు అధికంగా ముద్రించాయి. పత్రికా వ్యాసం సృజన దశనుంచి విమర్శన స్థితికి పరిణామం చెందింది.

## 4. పత్రికా శీర్షికలు

పత్రికలలో కావ్యాలు నవలలు వ్యాసాలు మొదలైన అనేక ప్రక్రియలు ప్రచురింపబడుతూ వున్నాయి. తెలుగు పత్రికలలో వ్యాసాల స్థితి స్థూలంగా గ్రహించటం జరిగింది తర్వాత, నవలాది ప్రక్రియలు లాగా లేకుండావున్న సంపాదకీయాది రచనల విషయం పరికించాలి. గుణం రచనం ఆధారంగా చేసుకొని చూస్తే పత్రికలలో ఎప్పుడూ ఉండే శీర్షికలు వ్యాసాలుగానే గ్రహించటానికి వీలుంది. అవి సంపాదకీయం, ప్రత్యేక శీర్షిక, గ్రంథ విమర్శనం.

### 1. సంపాదకీయం

వర్తమానాంధ్ర పత్రికలు కొన్నింటిలో సంపాదకీయం తప్పని సరిగా ఉంటుంది. ఇది దేశంలోని ఏ సమస్య మీద అయినా, రాజకీయార్థిక సాంఘిక విషయాలలో ఏదయినా, లలిత కళలలో ఏ అంశమయినా ప్రధానమయి ఉంటుంది. ఒక వస్తువును సంపాదకుడి హృదయం తీసిన ఛాయా పటంగా ఇది ఉంటుంది కాబట్టి వ్యాసంగా పరిగణింప దగిందౌతుంది. సంపాదకీయం పత్రికా సౌందర్యానికి నుదుటి తిలకం.

తెలుగు ప్రారంభ పత్రికలలో సంపాదకీయం కొన్నింటికి లేనేలేదు, కొన్నింటికి ఎప్పుడో ఉంది. దీనికి ప్రధాన హేతువు గ్రహించాలి. పత్రిక ఆరంభంలో, కొన్ని పత్రికలలో సంపాదకుడే అనేకాంశాలు వ్రాసి ముద్రించడం

సహజంగా ఉంది. తన అభిప్రాయాలకు సముచితావకాశం ఉండటం వల్ల సంపాదకుడు ప్రత్యేకంగా సంపాదకీయం రూపొందించవలసిన అవసరం కలగలేదు. వర్తమాన పత్రికలలో రచయితలు విభిన్నాభిప్రాయాలు వ్యక్తం చేస్తూ ఉండటం వల్ల, పత్రికా యాజమాన్యం ఏ విషయంలో ఏ దృష్టి ప్రదర్శిస్తుందో తెలియటానికి సంపాదకీయం ప్రధాన సాధనమయింది. నేటి పత్రికా సంపాదకీయాలు యజమాని మనస్తత్వ ప్రతిబింబాలు.

తెలుగులో పత్రికా వ్యాసంగం ప్రారంభమయినప్పుడున్న సంపాదక తుల్య రచనలలో విషయం నేటి సంపాదకీయాలకు భిన్నంగా ఉంది. పత్రికాధిపతి సాధారణంగా ఈ రచనలు చేశాడు. పత్రిక స్థాపించినప్పుడు, తదవసరం, తల్లక్ష్యం వివరిస్తూ చేసిన రచనలు, పత్రిక ఆగిపోతున్నప్పుడు తత్కారణాలు తెలిపిన రచనలు, చందాదారులు సకాలంలో సక్రమంగా చందా కట్టకపోతే కలిగే తొందరలు తెలిపే రచనలు, విమర్శకులు హద్దులు మీరిపోతున్నప్పుడు చేసిన హెచ్చరికలు సంపాదకీయాలుగా ఉన్నాయి. పాతికేళ్ళ తర్వాత, తెలుగు పత్రికలలోని ఈ రచనలు పైరచనల కంటే భిన్నంగా నేటి సంపాదకీయాలకు దగ్గరగా ఉన్నాయి. 'స్వవిషయము' 'స్వవిజ్ఞాపనము' 'విన్నపము' అని సాగిన వీటిలో పత్రికాధిపతికి, పత్రికకు సంబంధించిన విషయాలే ఎక్కువగా ఉన్నా, ప్రతి పత్రికలో ఉండటంవల్ల ప్రారంభ పుటలలో ప్రముఖంగా గోచరమవటం వల్ల, ఇవి సంపాదకీయాలుగా అనుకోవచ్చు.

20వ శతాబ్ది ఆరంభం నుంచీ పత్రికలలో సంపాదకీయాలు విశిష్టంగా గోచరమవుతున్నట్లు ఆంధ్రపత్రిక, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలు ఉత్తమ సంపాదకీయాలతో వెలువడ్డాయి. కృష్ణాపత్రిక, ముట్నూరి కృష్ణారావు సంపాదకీయాలతో శోభాయమానంగా వెలిగింది. సంపాదకీయం వ్యాస స్థానం పొందటానికి దోహదం చేసిన ప్రముఖ పత్రికా రచయితలలో ముట్నూరి కృష్ణారావు ప్రథమంగా గుర్తింపబడవలసిన వ్యాసకర్త !

స్వాతంత్ర్యానికి పూర్వం వెలువడ్డ పత్రికలలో సంపాదకీయాలు ప్రధానంగా, పత్రిక సంపాదకుడు, సాహిత్యం, సంఘ జీవితం, ఆధ్యాత్మికత మొదలైన అనేకాంశాలు స్పృశించాయి కానీ, రాజకీయం ఎక్కడో తప్ప తడమలేదు. కృష్ణాపత్రికాదులు ఇందుకు అపవాదులు.

నేటి దిన పత్రికలలో సంపాదకీయాలు రాజకీయ సాంఘికాది సమస్యలకు పరిష్కార మార్గం చూపుతున్నాయి. వార పత్రికలలో సారస్వత సంబంధులు పై విషయాలే ఎక్కువగా సమీక్షిస్తున్నాయి. మాస పత్రికలు, ఎప్పుడో తప్ప రాజకీయాది సంగతులు గ్రహించటంలేదు. అధికంగా సారస్వత విషయాలే స్వీకరిస్తున్నాయి. కొన్ని మాస పత్రికలు సంపాదకీయాలు లేకుండా వెలువడుతున్నాయి. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికల సంపాదకీయాలు సంవత్సరంలో ప్రపంచపు ఆలోచనలో వచ్చిన మార్పును ఒక కోణం నుంచి చూచి చెప్పటంగా ఉన్నాయి. సినీమా పత్రికలు తన్నిర్మాణం; రాజకీయ పత్రికలు తద్విషయం, మత పత్రికాదులు తమతమ సంగతులు తెలుపుకొంటూ సంపాదకీయాలు వ్రాస్తుంటే, పంచాయతిరాజ్, ఆంధ్రప్రదేశ్ వంటి పత్రికలు ప్రభుత్వ కృషి తెలిపే సంపాదకీయాలకు స్థానాలవుతున్నాయి.

స్థూలంగా సంపాదకీయం పత్రికాత్మ. సంపాదకుడి వల్ల పత్రికా వ్యక్తిత్వం చాలా పర్యాయాలు మారలేదన్న దృష్టి ఏర్పడుతుంది. అందువల్ల సంపాదకీయం పత్రికా లక్ష్యం, వ్యక్తిత్వం స్పష్టంగా ప్రదర్శించేదిగా ఉంది. సంపాదకీయం పత్రికాధిపతి అవసరంగా, సాంఘిక, రాజకీయార్థికాది సమస్యా రచనంగా, పత్రికా జీవిత ప్రతిబింబంబంగా వుంటుంది.

## 2. ప్రత్యేక శీర్షిక

సంపాదకీయంకాక, సంపాదకుడో, ఉప సంపాదకుడో మరే రచయితో, రచయిత్రో ఆ పత్రిక ప్రతి సంచికలోనూ, ఆ పేరుతో ఆ రచయితే సృజనంగానో, హాస్యంగానో, హృదయావిష్కరణంగానో వ్రాసే రచనకే ఈ ప్రత్యేక శీర్షిక ఉద్దిష్టం. ఆంధ్రప్రభ వారపత్రికలో ఊహాగానం, మాణిక్యవీణ, దినపత్రికలో ఆషామాషీ, ఆంధ్రజ్యోతి వార పత్రికలో ఇల్లాలి ముచ్చట్లు ఈ కోవలోని రచనలు.

ఈ రచన ఏ సంచికలో ప్రారంభమవుతుందో, ఆ సంచికలోనే సమాప్త మవుతుంది. రెండో సంచికలో క్రొత్త విషయం ఉంటుంది. ఒకే పేరుతో ప్రతి సంచికలో వినూత్నంగా పూర్వాపర సంచికలతో నిమిత్తం లేకుండా ఉండే ఈ శీర్షిక ఆ పత్రికా ప్రత్యేకతగా గోచరమవుతూ వుంటుంది. ఈ శీర్షిక ఆ పత్రిక అన్ని సంచికలలో ఉండాలన్న నియమం ఉంటుందన్న

స్థితిలేదు. కొన్ని సంవత్సరాలు నెలలు ఉండవచ్చు. ఈ శీర్షిక కనీసం రెండు పర్యాయాలు అయినా ఉండేనే శీర్షికగా గ్రహించడం జరుగుతుంది. లేకపోతే అది ఒక సృజన వ్యాసంగా పరిగణింపబడుతుంది.

ఈ శీర్షికా రచనం ప్రారంభ పత్రికలలో లేకుండా, అనంతర పత్రికలలో అల్పంగా, స్వాతంత్ర్య పూర్వం, కొంచెంగా అనంతరం అధికంగా ఉంది. పత్రికా నిర్వహణంతో రాజకీయంతో, ఏ బాధ్యతతో సంబంధంలేని ఈ రచన, రచయిత హృదయాభివ్యక్తికి విశిష్టమైన అవకాశం ఇవ్వటం వల్ల వీటిని వ్యాసాలుగా గ్రహించటం జరిగింది.

దిన వార మాస పత్రికలలోని ఈ శీర్షిక రచయిత అనుగ్రహంగా కంటే పత్రికాదత్తంగా గ్రహించాలి. సృజన సాహిత్య నిర్మాణ సామర్థ్యమున్న రచయితను ఒత్తిడితో తొందరపెట్టి పత్రిక నిర్వహణ బాధ్యత ఈ శీర్షికను వ్రాయిస్తున్నట్లు భావించే అవకాశం ఉంది. ఈ రచయిత ఆ వేగంలో వ్రాయటంకంటే స్థిమితంగా వ్రాయటం జరిగితే, ఈ విధమైన రచనలు ఉత్తమ వ్యాసాలుగా రూపొంది, తెలుగులో సృజన వ్యాస వాఙ్మయం పటిష్ఠం అయి ఉండేదని తలంపవచ్చు. పత్రికలో పరిమితకాల ప్రయోజనంతో వెలువడుతూ, మళ్ళీ చదవవలసి ఉండే స్థాయి తగ్గించుకొంటూ వచ్చే ఈ రచనలు సాహిత్యంలో ఉన్నత ప్రయోజనం కంటే తాత్కాలిక ఫలితం పొందినట్లు గుర్తింపవచ్చు.

ఈ రచనా రీతిలో రచయిత వ్యక్తిత్వం హృదయం బాహాటంగా కనిపిస్తూ ఉన్నాయి. ఇది సృజనంగా ఉంటూ వచ్చింది. భాష జీవితం దగ్గరగా ఉంది. హాస్యం అనుపానంగా అవతరించింది. కొన్నింటిలో కవితా స్థాయి నిలచింది. సమకాలీన సమాజ సమస్యలకు వీటిలో స్థానం లభించింది. సాహిత్యాది విషయాలు వీటిలో చర్చనీయాంశాలుగా రూపొందాయి. పత్రికలలో ఈ శీర్షికలు రచయితను పాఠకుల ఎదుట నిలిపి స్వచ్ఛంగా ప్రదర్శించి అనుభూతి తరంగా సృష్టించి, ఆనందం కలిగించాయి.

ఈ శీర్షికా రచనం 'చింతామణి'లో గోచరమవుతూ వుంది. ఆచంట సుందర రామయ్య అంతఃపురోపన్యాసములు పేరుతో ఈ శీర్షికను నడపటం జరిగింది. ఈ శీర్షిక అనంతర కాలంలో బహుధా ఆదరింపబడింది 'నవ్వులతోట' పత్రికతో హాసత్వంతో కూడిన 'కబుర్లు' శీర్షిక ఉంది. 1913 లో 'హిత

కారిణి'లో నవయుగ పాఠ్య పుస్తకం అనే శీర్షిక మున్నంగి లక్ష్మీ నరసింహ శర్మ, ఏలూరు నుంచి నిర్వహించటం జరిగింది.

ఈ శీర్షిక నడపటంలో స్త్రీలు ముందంజ వేశారు. వింజమూరి వెంకట రత్నమ్మ పత్రికాధిపురాలుగా నిర్వహించిన అనసూయ (1917) లో 'ఆనకట్టకి బూర్వం కబుర్లు', 'వందేమాతరం' వ్రాయగా ప్రచురించింది. ఈ పత్రిక ప్రథమ సంపుటంలోనే 'తాతయ్య కుంపటి ముచ్చటలు' మొదటి ఎనిమిది సంచికలలో ఇవి రెండూ రెండేసి పర్యాయాలు గోచరమయ్యాయి. 'ఆంధ్ర లక్ష్మి' (1921) 'రూపవాణి' పత్రికలలో మొదటి ఆరు సంచికలలో 'శారద లేఖలు', 'సౌభాగ్యవతి యగు కల్పలతకు' వ్రాయటం జరిగింది.

'భారతి' మాస పత్రికలో ప్రారంభం నుంచీ కాశీనాథుని నాగేశ్వర రావు పంతులు వార్తా సమీక్షగా, అభిప్రాయ ప్రకటనంగా, అనుభూతి వ్యక్తీకరణంగా, దేశాభ్యుదయ ప్రోత్సాహకారకంగా 'సాభిప్రాయ విశేషములు' ప్రచురించాడు. ఈ పత్రికలోనే ఈ మధ్య శ్రీ తిరుమల రామచంద్ర 'సాహితీ సుగతుని స్వగతం' ప్రముఖంగా భాషా సారస్వత చర్చగా సాగించాడు. ఈ రచయిత ఆంధ్ర ప్రభ వార పత్రికలో 'నుడి-నానుడి' పేరుతో రెండేళ్ళు నిర్వహించాడు.

ఒక రచయితే భిన్న పత్రికలలో భిన్న శీర్షికలు నడపటం తెలుస్తూ వుంది కాబట్టి ఈ విధమైన రచనలు చేసిన రచయితల వ్యాసంగం పరికింపవచ్చు. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి ఆకాశవాణిలో నిర్వహించింది, మా గ్రామం, ఈ శీర్షిక వంటిదే. ఆచార్య యన్. జి. రంగా ప్రజాబంధులో 'కబుర్లు పోగు', తాపీ ధర్మారావు కాగడాలో 'కొత్త పాళీ' సముద్రాల ప్రజామతలో, శ్రీ నార్ల వేంకటేశ్వర రావు ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రికలో, పప్పూరు రామా చార్యులు సాధనలో, ముళ్ళపూడి వేంకట రమణ ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నిర్వహించిన శీర్షికలు వీటి ప్రాచుర్యం తెలుపుతున్నాయి.

శ్రీ దాసు వామనరావు ఆంధ్ర సచిత్ర వార పత్రికలో 1953 నుంచి 'కాలక్షేపం' ప్రకటించాడు. ప్రజామతలో శీర్షిక 'ఇష్టాగోష్ఠి' 'కాలక్షేపం' ముద్రితా లయ్యాయి. ప్రారంభోపసంహారాలలో పద్య శ్లోకోదాహరణాలిస్తూ ప్రాచీన సాహిత్య సౌరభాలు పరిమళింప జేస్తూ, మత విషయాలు ఉల్లేఖిస్తూ, హాస్యంగా వ్యంగ్యంగా కాలక్షేపం కోసం వెలువడ్డ ఈ రచనలు సృజనంగా

ఉన్నాయి. ఇవికాక, ఆంధ్ర పత్రిక సారస్వతానుబంధంలో 'తమాషా కులాసా' లను రేడియోలో 'వామన వాక్యాలు' వినిపించాడు.

శ్రీ రావూరు సత్యనారాయణ కృష్ణాపత్రికలో 1938 నుంచి ప్రారంభించిన 'పడగళ్ళు' శీర్షిక విపుల ప్రచారం పొందింది. వార్తలలోని అంశాలు గ్రహించి, ఈ శీర్షిక నడపటం జరిగింది. ఆనంతరం సాహిత్యం వంటి అనేక విషయ పరిధీ ప్రవర్తనం పొందింది. 1959 నుంచి ఆంధ్ర ప్రభలో 'ఆపామాషీ' ప్రతి దినం వచ్చే శీర్షికగా 1963 వరకు, ఆ పైన వారానికి మూడు సార్లు వ్రాస్తూ ఇప్పటికీ సాగించటం చూడ వచ్చు. ఇవి కాక కృష్ణా పత్రికలో అప్పుడప్పుడూ వ్రాసిన 'పల్లేరు కాయలు', ఆనందవాణిలో 'కప్పు-కాఫీ, ఈ సందర్భంలో గమనించాలి. ఇవి పునర్ముద్రిస్తే దాదాపు ఇరవై సంపుటాలు అవుతాయి. హాస్యం, సృజన గుణం అమితంగా ఉండి, సామాజిక జీవితం, పల్లె బ్రతుకు, ఆంగ్ల నాగరకత ప్రభావానికి దూరంగా వున్న తెలుగు వాళ్ళ వ్యక్తిత్వం తెలిపేటట్లు ఈ వ్యాసాలున్నాయి.

శివలెంక శంభుప్రసాద్, ఆంధ్ర పత్రికా, భారతీ సంపాదకత్వం వహించి 1938 ప్రాంతాలలో వార పత్రికలో 'పడక్కుర్చీ కబుర్లు' 1960 ప్రాంతంలో 'తెలుగు వెలుగులు' (కొన్ని మాత్రమే) వ్రాయటం జరిగింది. కవితాత్మంగా వాస్తవికంగా రెండు గుణాల సమ్మేళనంగా రచన వుంది.

విద్వాన్ విశ్వం ఈ శీర్షికను ఎక్కువగా సమర్థంగా పోషించిన రచయిత. ఆంధ్ర ప్రభ వారపత్రికలో (1952-59) 'తెలుపు-నలుపు', ఆంధ్ర దినపత్రికలో (59-60) 'అవీ-ఇవీ', ఆంధ్రజ్యోతి దిన పత్రికలో (60-62) 'ఇవాళ', ఆంధ్ర ప్రభ దిన పత్రికలో (62-66) 'మాణిక్యవీణ', వారపత్రికలో (67 నుంచి) అదే శీర్షిక, ఆంధ్ర ప్రభ దిన పత్రిక ఆదివారం సంచికలో 'వారం-వారం' (66-67) ప్రచురించటం జరిగింది. పాండిత్యం, కవిత్వం, పత్రికారచనం మూడు ముప్పేట వేసుకొనిపోగా అవతరించిన రచనలవి. కవితా గుణం అధికంగా ఉందని, అభివ్యక్తి స్పష్టతా భరితమనీ భావింపవచ్చు. సాహిత్య సాంఘిక వార్తాది అనేక విషయాలు ఈ శీర్షికలకు వస్తువులయ్యాయి. సాహిత్యంలో శాశ్వత స్థానం పొందేంత సమర్థంగా 'తెలుపు-నలుపు' 'మాణిక్యవీణ' ఉన్నాయి. ఇవి సంపుటాలుగా రూపొందక పోవటం ఉచితం కాదు.

శ్రీ బి.సి. కామరాజు (తూలికాభూషణ్, సుకర్ణో) తెలుగు మీజాన్ దిన పత్రికలో (1943-44) కలం పోటు, "తిలకాష్ఠమహిషబంధనం" (52-58) ఆంధ్రప్రభ వార పత్రికలో శాఖా చంక్రమణం (1963-67), 'రేడియోలో విన్నవి' నిర్వహించాడు. ఇవి సమీక్షాత్మకంగా ఉన్నాయి. పత్రికా వ్యాసస్థాయి పొందాయి.

'పురాణం సీత' (శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ కావచ్చు) ఆంధ్ర జ్యోతి సచిత్ర వారపత్రికలో 1967 నుంచి నిర్వహిస్తూవున్న శీర్షిక 'ఇల్లాలి ముచ్చట్లు'. సాహిత్యం, పత్రికా నిర్వహణం సమర్థంగా సమ్మేళనమయి సాగితే 'ఇల్లాలి ముచ్చట్లు' వంటి వ్యాసాలు ఆవిర్భవించవచ్చు. ఇవి పాఠకుల్ని అమితంగా ఆకర్షించాయి. రచయిత్రి నేటి జీవిత యాధార్థ్యం గ్రహించటానికి పొందిన తపననుంచి ఇవి వెలిశాయి. జీవితంలోని బాధకు, ఆవేదనకు నివేదనలుగా ఈ ముచ్చట్లున్నాయి. ఇది కఠినమైన బ్రతుకు తీవ్రతను గుర్తింపచేయటానికి హాస్యం అనుపానంగా చేసిన వ్యాససృష్టి. ఇవి ''మీరు సరదాగా చదువుకుందుకు నేను సరదాగా వ్రాశాను", 'అజ్ఞానాన్నీ, మూర్ఖత్వాన్నీ, అహంకారాన్నీ, ఆడంబరాన్నీ సహించి ఆరాధించే గుణం నాకు లేదు'' అనటం గుర్తింపవచ్చు. ఈ శీర్షికలో బాధ, హాస్యం పెనవేసుకుపోయాయి. 'కర్టెన్ లెక్చర్స్' అయినా ఆచంట సుందర రామయ్య, పానుగంటి వ్రాసిన అంతఃపురోపన్యాసాలు గుర్తుకు తెస్తున్నాయి. ఇవి సాహిత్యంలో సృజన వ్యాసాలుగా నిలిచిపోతాయి. భాష, భావన, అభివ్యక్తి, ఆత్మీయతా ముద్రతో, వాస్తవ దృక్పథంతో, గుండె చేరువగా ఉండి, మనస్సును ఉర్రూతలూగించి వేస్తాయి.

ఈ శీర్షికను నిర్వహించిన వాళ్ళలో శ్రీపతి లత స్థానం విశిష్టమయింది. 'ఊహాగానం' పేరుతో ఆంధ్ర ప్రభ సచిత్రవార పత్రికలో దాదాపు ఒక దశాబ్దం ఈ రచయిత్రి ఈ శీర్షిక నిర్వహించింది. ఈ శీర్షికలో హాస్యం లేదు. కవిత్వం ఉంది. అర్థంకాని జీవితానంతత్వం గ్రహించటానికి రచయిత్రి చేసిన ఊహాయాత్ర కవితా రూపంలో ఊహాగానంగా వెలువడింది. ''ఇందులో ఆవాల మొదలు అంతర్జాతీయ సమస్య వరకూ, అచ్చమ్మగారి అరువు బేరం దగ్గర్నుంచి ఆధ్యాత్మికమైన కావ్యాన్వేషణ వరకూ' ఎన్నో విషయాలు చర్చించింది. ప్రారంభంలో ఉద్రేకం ఎక్కువగా ఉన్నా రచనం క్రమంగా నిశ్చలత్వం

పొందింది, మొదటిలో బుద్ధికి ఉన్న ప్రాధాన్యం క్రమంగా హృదయం గ్రహిం చింది. కవితాత్మకంగా ఈ శీర్షిక ఈ రచయిత్రి నడిపినంత రసరమ్యంగా ఎవరూ నడపలేదని చెప్పవచ్చు.

ఈ శీర్షిక, ఆంధ్ర సచిత్ర వార పత్రికలో మునుపు శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి, ఇప్పుడు శ్రీమతి కె. రామలక్ష్మి, ఆంధ్ర ప్రభ సచిత్రవార పత్రికలో మాలతీచందూర్ స్త్రీలకు ప్రత్యేకంగా నిర్వహించటం గమనించవచ్చు. అంతేకాక, తెలుగు స్వతంత్రలో వినాయకుడి వీణ, శిఖరాలు, ప్రవీణ్ ఆంధ్ర సచిత్ర వార పత్రికలో రాజధాని కబుర్లు, ఆంధ్ర పత్రికలో హైద్రాబాద్ లేఖ బి. నాగేశ్వరరావు నిర్వహించటం జరుగుతూ వుంది.

పత్రికలలోని ఈ ప్రత్యేక శీర్షికలు హృదయం ప్రతిఫలించిన వ్యాసాలు. సృజన ధర్మం ఎక్కువగా నిక్షిప్తమయి ఉన్నాయి. ఆంగ్లంలో స్పెక్టేటరు కాలంలో ఇటువంటి వ్యాససృష్టి అధికంగా జరిగింది. తెలుగులో ఇటువంటి రచనలు వ్యాసాలుగా పరిగణించటం తక్కువగా ఉన్నప్పటికీ, వ్యాస నైజం స్పష్టంగా తెలిపే ఈ రచనలు వాస్తవానికి వ్యాసాలుగా ప్రథమగణ్యాలు. వీటిలోని హాస్య ధర్మం, సారళ్యం, వైశద్యం, కవితాగుణం ప్రముఖంగా గ్రహింపవచ్చు. వ్యాసం రచనా రీతిగా ఈ రూపంలో చదువరుల సాన్నిహిత్యం పొందింది.

## 3. కృతి విమర్శనం

పద్య వచన గ్రంథాలు, నాటకాది రచనలు సారస్వత లోకానికి పరి చయం కావించటమే ప్రధాన ధర్మంగా పత్రికలలో వెలువడ్డ రచనలు ఆరం భంలో కృతి విమర్శనంగా పేర్కొనటం జరిగింది. వీటినే గ్రంథ సమీక్షలనీ, పుస్తక సమీక్షలనీ, పుస్తక పరిచయమనీ వివిధంగా అన్నారు. విమర్శనం పదం కంటే సమీక్ష పదమే నేడు వాడబడుతున్నప్పటికి, కృతి విమర్శనం పేరిట ఇది మొదటిలో ప్రసిద్ధమయింది కాబట్టి, ఈ రచనారీతికిది గ్రహింప వచ్చు.

కృతి విమర్శనం సంపూర్ణంగా చేయటం ఈ పరిధిలో సాధ్యంకాదు. సమీక్షకుడు తన వ్యక్తిత్వ ప్రభావంతో కృతిని సమీక్షించటం ఇందులో

ప్రధానంగా గోచరమవుతుంది కాబట్టి ఇది పూర్ణ విమర్శనం కాదు. ఈ సమీక్షా రచనలు సారస్వత విమర్శనంగా కొంతవరకు, వ్యాసంగా కొంతవరకు, ప్రవర్తిల్లుతూ ఉన్నాయి.

ఈ విధమయిన రచనం కృతి విమర్శనం పేరుతో 1874 నుంచి జరుగుతూ వుంది. వివేక వర్ధనిలో కందుకూరి వీరేశ లింగం పంతులు క్రొత్త పుస్తకాలను పరిచయం చేశాడు. అయితే ఇది ప్రతి పత్రికలో తప్పని సరిగా ఉండే శీర్షికగా లేదు. 'చింతామణి', 'సరస్వతి' పత్రికలలో కృతి విమర్శనం ప్రతి సంచికలోను వుంది.

కృతి విమర్శనంలో ఉన్న కొన్ని రీతులు ప్రాచీన పత్రికలలో పరికింప వచ్చు. సమీక్షలో (1) కృతి లభించే చోటు, వెల ఇవ్వటం, (2) కృతులలోని జావళ్ళు, పద్యాలు, వచన భాగాలు ఉదాహరించటం- చింతామణి, సం. 1- సం. 8 లో గానామృతము, 1-9 లో జానకీ పరిణయము కృతుల విమర్శనం ఆచంట సుందరరామయ్య చేత చేయబడింది. (3) లోపాలు ఎత్తిచూపటం (చింతామణి, 2-7 లో ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాసము కర్త గణపవరపు వెంకటకవి "దీనిని జదువు వారికి మాత్రము కథా చమత్కృతిని బట్టి కాని రసపుష్టిని బట్టి కాని కలుగవలసిన యానందము గలుగదు"-, 3-2 లో శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన కుశ చరిత్రము- వేంకటరాయకవి "ఇటువంటి నిర్బంధములతో గూడిన కవితాధార ధారాళముగా ప్రవహించుట కవకాశముండదు"-, 3-25లో శబ్దార్థ చంద్రిక నిఘంటువు-మహాకాళి సుబ్బ రాయుడు. "దీని యందుండు పదములలో తత్సమములేవో, తద్భవము లేవో వివరింపబడి యుండలేదు". (4) అనువాదమయితే, అది ఎలా జరిగిందో తెలపడం, చింతామణి- 4-3 లో చిలాన్‌బంది అనువాదం శిష్టు జగన్నాథశాస్త్రి. మూలం : బైరను- "భాషాంతరీకరణము కొంతవరకు దృప్తికరముగానే యున్నదనుట కెంతమాత్రము సందియము లేదు." 7-3 లో శ్రీ సేనాపతి కుమారి "ఈ గ్రంథమాంగ్లేయ కథల ననుసరించి వ్రాయబడినట్లు కనిపించు చున్నది". (5) ఉత్తమ కావ్యాన్ని ఆమోదించటం - చింతామణి 7-4 లో విశ్వేశ్వరీయము- కొక్కొండ వేంకటరత్న శర్మ. మేము చదివినంత "వరకు గ్రంథము మొత్తము మీద రసపుష్టి కలదిగాను మృదువుగాను, నిర్దుష్టముగాను సుబోధముగాను నున్నది." (6) గ్రంథ సారాంశ మివ్వటం, చింతామణి

7-5 లో, మర్మశాస్త్రము - ఆర్. వెంకట సుబ్బారావు. ''జనన, బాలపోషణ, ఆయుష్యవృద్ధి దాంపత్య సంభోగ మనః మర్మముల గూర్చి వ్రాయబడినది'')

చింతామణిలో కృతి విమర్శనం ప్రధానంగా ఆచంట సుందరరామయ్య నిర్వహించాడు. ఇది పత్రికాంతంలో కాక పత్రికారంభంలో సంపాదకీయం అంతటి ప్రాధాన్యంతో ఉంది.

సరస్వతి పత్రికాసమీక్షలలో (1) ప్రశ్నించటం (4-8లో ఛందశ్శాస్త్రము-టేకుమళ్ళ రాజగోపాలరావు "గణములు వృత్తములు వలనఁ గష్టమున్నదని యేల యభిప్రాయపడలేదు?'' (2) కథా పరిచయం చేయటం-సరస్వతి 6-5లో బలజా సౌభద్రీయము-నాటకము కస్తూరి శివశంకర కవి (3) ప్రయోజనం వివరించటం;-కుముద్వతీ సారంగధరను. నాటకము. జయంతి భావనారాయణ ''నాటకమును జదువుకొనుటకుఁ బ్రదర్శించుటకు మిక్కిలి యనువుగా నున్నది.'' (4) గ్రంథ వైశిష్ట్యం పట్ల అత్యుక్తి ప్రకటించటం సరస్వతి 9-6లో శ్రీ మహేంద్ర విజయము - దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి ''భక్తిప్రధానంబై ధారాళపద్యంబై నిర్దుష్టంబైన ఇక్కావ్యంబును గూర్చి మేమెంతని వ్రాయఁ గలము'' ఇవీ సరస్వతిలోని గ్రంథ విమర్శన గుణాలు.

ఈ కృతి విమర్శనం స్త్రీలు కూడా చేశారు. హిందూ సుందరి (1902)లో (1-4) అబలా సచ్చరిత్ర రత్నమాలను బండారు అచ్చమాంబ కృతం, కొటికల పూడి సీతమ్మ (1-4) సమీక్షించింది.

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, భారతి వంటి సారస్వత పత్రికలలో ఈ కృతి విమర్శనం నామాంతరాలతో ఉంది. వర్తమాన సారస్వత సంబంధి పత్రికలు కొన్నింటిలో ఈ సమీక్షలు చివరి పుటలకు పరిమితంగా, తప్పనిసరిగా ఉంటున్నాయి. ఈ సమీక్షా కార్యం ఆకాశవాణిలోనూ ప్రసారమవుతూఉంది.

నేడు భారతి, ఆంధ్రపత్రికలలో 'క్షేమేంద్ర', శ్రీ నోరి నరసింహశాస్త్రి 'మనోరాణి' 'రవి' 'రాజా రామమోహన్‌రాయ్' 'అవంతి' శ్రీ వి. యస్. అవధాని 'శివకుమార' ఉన్నారు. వీళ్ళు సమీక్షకులలో కొందరు మాత్రమే! ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో 'అయాస్య', శ్రీ పాలపర్తి వేణుగోపాల్,

'శార్వరి' 'సుమన' 'పాప' పేర్కొనదగ్గవాళ్లు. సమీక్షకులు చాలా మంది తమ పేర్లు తెలపకుండా ఉండటం కూడా సమీక్షా సంగతే !

కృతి విమర్శనం సారస్వత భాగంగా, వ్యాస ప్రక్రియ రూపాంతరంగా భావింపవచ్చు. ఈ సమీక్ష పుస్తకం వెల, దొరికేచోటు వంటి వాటి రచనకు పరిమితమయితే కాదుకానీ, ఆ పుస్తకం మీద ఆ సమీక్షకుడి అభిప్రాయ ప్రకటనం సరసంగా జరిగితే అది సక్రమంగా వ్యాసంగా నిర్ణయింపవచ్చు. సమీక్ష వ్యాసం కావటం సాహిత్యంలో వాంఛనీయ ఘట్టం, సముచిత పరిణామం.

## 5. సంచికలు

పత్రికలలో భిన్న రచయితలు అనేకాంశాలు స్పృశిస్తూ సృష్టించిన విభిన్న ప్రక్రియా సాహిత్యానికి చోటు ఉంటుంది, కానీ సంచికలలో అనేక కవులు రచయితలు ఏక విషయం గ్రహించి నిర్మించిన ఒకే ప్రక్రియకు తావు ఉంటుంది. ఈ విధంగా వెలువడ్డ వ్యాస ప్రక్రియతో ఉన్న సంచికలు పరిశీలించటం, ఈ సందర్భంలో అవసరమే.

వ్యాస సంచికలు సాధారణంగా ఒక ప్రసిద్ధ వ్యక్తి, లేకపోతే సందర్భం కారణంగా రూపొందాయి. చారిత్రకంగా ప్రసిద్ధికాని, సారస్వత రంగంలో ప్రతిష్ఠకాని వీటి ఆవిర్భావానికి హేతువు అయింది. కవి పండిత రచయితల సమ్మానం కోసంకాని, సారస్వత పోషకుడి నీరాజనంగా కాని ఇవి అవతరించాయి. సాహితీమూర్తులు గలిగించినా గౌరవం పొందినా ఇవి వెలువడ్డాయి. ప్రసిద్ధుల జయంతికో, వర్ధంతికో కూడా ఇవి పుట్టాయి.

సారస్వత సంఘాలు, నాటక సమాజాదులు ప్రారంభించినప్పుడో, ఏదైనా ఉత్సవం జరుపుకొన్నప్పుడో సంచికలు ప్రకటనం పొందుతూ వచ్చాయి. అందువల్ల ఒక సంచిక ఆంధ్ర జాతి జీవితంలోని ఒక ఘట్టం వ్యాసగతంగా వివరించేదిగా ఉంది.

ఆరంభంలో సంచికలు చారిత్రక దృష్టితో ఉన్నాయి. భావరాజు వేంకటకృష్ణారావు - రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, రాళ్ళబండి సుబ్బారావు - కళింగ సంచిక, మారేమండ రామారావు - కాకతీయ సంచిక, శాతవాహన సంచిక, వడ్డాది అప్పారావు - రెడ్డి సంచిక ప్రకటించారు

ఈ సంచికలు అపరిష్కృతాలుగా ఉన్న అనేక చారిత్రకాంశాలకు వెలుగు ప్రసాదించాయి. నూత్న విషయాలు తెలిపాయి. చారిత్రక దృష్టి తక్కువగా ఉన్న సమయంలో ఆంధ్రులకి సంచికలు చరిత్రతో పాటు ఆనం దాన్ని అందించాయి. వీటిలో చారిత్రక వ్యాస నిర్మాణం గోచరమవుతుంది.

పత్రికా జీవితంలో ఒక ఘట్టం వివరించేట్లున్న 'త్రిలింగ', 'భారతి' రజతోత్సవ సంపుటాలు, ఆంధ్ర పత్రిక శ్రీ నాగేశ్వర శత జయంతి సంచిక గమనింపవచ్చు. ఇది ఒక రచయిత భిన్న రచనల సంకలనం.

వ్యావహారిక భాషావాదంతో జీవితమంతా గడపిన గిడుగు వేంకట రామ మూర్తి పంతులు సప్తతితమ జన్మదినోత్సవ ప్రచురణంగా వెలువడ్డ 'వ్యాస సంగ్రహము', 'ప్రతిభ స్మారక సంచిక', వ్యవహారిక భాషను సృజన వాఙ్మయ రచనకుపయుక్తం కావించిన గురజాడ అప్పారావు పంతులు 'శతవార్షిక జయంతి సంచిక' వాళ్ళ జీవితాన్నీ కృషినీ వివరించేవిగా ఉన్నాయి.

సాహిత్యం రాజకీయం సాంఘిక జీవితం ముప్పేట పెనవేసుకొని పోయిన శ్రీ మాడపాటి హనుమంతరావు శ్రీ కల్లూరి సుబ్బారావుల సన్మాన సంచికలు వెలువరించి వాళ్ళ జీవిత సారం వ్యాస గతంగా గ్రంథస్థం కావిం చటం జరిగింది.

ఒక వ్యక్తి సాహితీ సేవకు భాషా పోషణకు దేశం కృతజ్ఞత తెలుపు కొంటున్నట్లుగా సంచికలు వెలువడ్డాయి. అవి భాషోద్ధారక శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి సన్మాన సంపుటం, మల్లాది సూర్యనారాయణశాస్త్రి షష్టిపూర్తి సన్మాన సంచిక, అంతేకాక, ఈ విషయం, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికను ప్రచురించిన జయంతి రామయ్య పంతులు, పానుగంటి లక్ష్మీ నరసింహారావు శత వార్షిక జయంతి సంచికలు, శ్రీపాద కృష్ణమూర్తి, శ్రీ రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు స్మారక సంచికలు విశదం చేస్తున్నాయి.

కవులకు సన్మానం చేయటం, ఉద్యమ నాయకులను గౌరవించటం వంటి సందర్భాలలో సంచికలు ప్రకటించటం జరిగింది. జనమంచి శేషాద్రిశర్మ సన్మాన సంచిక, గ్రంథాలయోద్యమం సాగించిన అయ్యంకి వేంకటరమణయ్య సన్మాన సంచిక 'సరస్వతీ సామ్రాజ్యమ్' పై విషయం తెలుపుతున్నాయి.

ఇంతేకాక 'శ్రీ రవీంద్ర శత వార్షికోత్సవ విశేష సంచిక' గోలి ఈశ్వరయ్య సన్మాన సంచిక 'శారదా మంజీరము' నాటక సమీక్ష అనదగ్గ 'కళావని' సంచిక గమనార్హంగా ఉన్నాయి. ఈ సందర్భంలో సంచికా గుణం ఒకటి గుర్తింపవచ్చు. పూర్వంలా వర్తమానంలో వచ్చే సంచికలలో వస్త్వైక్యం ఉండటం లేదు. ఒక వ్యక్తి సన్మానంలో నాటక సమాజ వార్షికోత్సవంలో ప్రకటిస్తున్న సంచికలలో భిన్న విషయాలూ ఉంటున్నాయి. ఒక్కొక్కప్పుడు వ్యాసాలే కాక భిన్న ప్రక్రియలూ ఉంటున్నాయి.

సంకలనాలు : సాధారణంగా సంచిక ఏక విషయ ప్రాధాన్యంతో ఉంటే, భిన్న రచయితలు భిన్న విషయాలతో వ్రాసిన ఒకే ప్రక్రియకు అవకాశంతో సంకలనాలు వెలువడుతున్నాయి. ఇటువంటి సంకలనాలకు ప్రారంభం ఆంధ్ర మహిళా మహాసభ ప్రచురించిన 'ఉపన్యాసమంజరి' రెండు భాగాలు ముద్రించటంతో జరిగింది.

వర్తమానాంధ్ర వ్యాస వాఙ్మయంలో ఈ సంకలనాలు ఆంధ్రప్రదేశ్ సాహిత్యఎకాడమీ పక్షాన వెలువడ్డాయి. 'సాహిత్యోపన్యాసములు' పది సంపుటాలు నన్నయ్య, చిన్నయసూరి, క్షేత్రయ్య, గిడుగు వేంకటరామమూర్తి పంతులు, నన్నెచోడుడు, వేదం వేంకటరాయశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి చిలకమర్తి లక్ష్మీనరసింహారావు పంతులు, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు వంటి ప్రాచీనాధునికుల సారస్వత జీవిత పరిచయ వ్యాసాలు ప్రకటించటం గమనింపవచ్చు. ఒక సంపుటం నాలుగైదు వ్యాసాలతో ఒప్పుతూ ఒక కవి, రచయిత సాహితీ జీవితాలు దర్శించటం జరిగింది. ఆంధ్ర మహాభారతోపన్యాసములు, భాగవతోపన్యాసములు వెలయించటం గమనింపవచ్చు.

ఇంతేకాక, 'సారస్వత వ్యాసములు' ప్రథమ తృతీయ సంపుటాలు డా. జి. వి. సుబ్రహ్మణ్యం, రెండవ నాలుగవ సంపుటాలు శ్రీ పురిపండా అప్పలస్వామి పరిష్కరణం చేస్తే, ఎకాడమీ ముద్రించింది. ఈ వ్యాసాలు సారస్వత విమర్శనంగా ఉత్తమశ్రేణి రచనలు. ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, శారద, భారతి మొదలైన వాటిలో ఉన్న పీటిని ఎన్నిక చేసి ఈ సంకలనాలు రూపొందించటం జరిగింది.

యువభారతి ప్రచురణగా 'మహతి' నూరు వ్యాసాల సంకలనం డా. జి. వి. సుబ్రహ్మణ్యం మొదలగు వాళ్ళ సంపాదకత్వంలో వెలువడింది. ఇది

స్వాతంత్ర్య యుగోదయంతో తెలుగు జీవితం సాంస్కృతంనుంచి సినిమా వరకు వివరించే వ్యాస సంకలనం. తెలుగుజాతి జీవితం ప్రతిబింబించే మహత్తి చారిత్రక ప్రయోజనం కలిగి, ఒక దశాపరిణామ ప్రదర్శకంగా ఉంది.

సంచికలు సంకలనాలు, పత్రికలతోపాటు వ్యాస సృష్టికి దోహదం చేశాయి. సాంఘికం సారస్వతం మొదలైన అనేకాంశాలు వ్యాసాలుగా రూపొందించాయి. వ్యాస పరిణామంలో పత్రికా వ్యాసంగం ప్రధాన ఘట్టం. వ్యాసం పరిమిత పరిధిలో ఉండిపోకుండా అందరికీ అందే స్థితి పత్రికల వల్ల కలిగింది. ప్రాచుర్యంతోపాటు, ప్రాధిక్యంకూడా ఇతర ప్రక్రియలతో కలిసి పత్రికలలో ముద్రించటంవల్ల లభించింది. పత్రికా వ్యాసంగం ప్రారంభమయిం తర్వాత, ప్రచురణావకాశం ఎక్కువయి, రచనావసరం పెరిగిపోయింది. పత్రికలు కారణంగా, నేటికి సృజన వ్యాస నిర్మాణం జరుగుతూ ఉందికాని, లేకపోతే విమర్శనవ్యాసం తాకిడికి ఇది నిలవగలిగేదికాదు. పత్రికా వ్యాస వ్యాసంగం సృజన విమర్శన రచనారీతికి దోహదం చేసింది. విడిపోతున్న రెండు వ్యాస సంప్రదాయాలను ముడివేసి నిలిపి ఉంచిన ఖ్యాతి పత్రికా ప్రపంచం పొందింది.

## References


1. Sri Arudra (Ch) Beginnings of Telugu Journalisam. Studies in the History of Telugu Journalism P. 6.
2. Ibid PP. 6, 7
3. డా. కొత్తపల్లి వీరభద్రరావు - తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము పుట 115.
4. యండమూరి సత్యనారాయణరావు - వచన వాఙ్మయము - పూర్వరంగము - ఉషఃకిరణాలు పుట 275.
5. Julius Richter - The History of Missions in india P iii.
6. Ibid P 113.

7. Smt. J. Mangamma (Ch) Origins of Telugu Printing - Studies in the History of Telugu Journalism.
8. Ibid PP 2, 3.
9. యండమూరి సత్యనారాయణ - వచన వాఙ్మయము - పూర్వరంగము ఉషఃకిరణాలు పుట 275.
10. Sri Arudra (Ch) Beginnings of Telugu Journalism-Studies in the History of Telugu Journalism P 7.
11. Smt. J. Mangamma (Ch) Origins of Telugu Printing-Studies in the History of Telugu Journalism P 3.
12. Sri Arudra (Ch) Beginnings of Telugu Journalism-Studies in the History of Telugu Journalism P 14.
13. ముట్నూరి గోపాలదాసు - ఆంధ్ర దేశము నందలి స్త్రీ విద్య. ఆర్య మతబోధిని. సం. 9 పుట. 6

—: o :—

# వివాద వ్యాసం

కవులు రచయితలు విమర్శకులు ఆత్మాభివ్యక్తి హృదయావిష్కరణాలతో, అనుభూతి పురస్కారంతో, అభిమానాందోళనలు ఆవేశాలోచనలు ప్రతిభా పాండిత్యాలు ప్రతిష్ఠించుకొని సాగించిన సారస్వత చర్చలు వివాద వ్యాస సృష్టికి కారణభూతాలు. దృశ్య కావ్య ప్రక్రియలలోని భాషా భావ పరిశీలనంలో, విమర్శకుడి వ్యక్తిత్వం దాని మంచి చెడ్డలు ప్రవేశించటంతో, వివాద వ్యాసం ఆవిర్భవించింది. ప్రతి భాషకు రూప భిన్నతతో వివాదం ప్రసిద్ధమే అయినా తెలుగులో వ్యాసంగా ఆధునిక పరిణామమే! ఉత్తమ సారస్వత మూర్తులు మానవ సహజ సంయమనం కోల్పోవటం వల్ల వివాద విషయమూ రచనా మర్యాదా మరుగునపడి, సభ్యత సంస్కారం నిర్గమించి, వ్యాసం నిందగా దూషణగా రూపొంది, అసహ్యమయ్యే ప్రమాదం ప్రతి క్షణం సాహిత్యం భరించవలసిరావటం భావ్యం కాదు. మనిషి జీవితంలోని ఒక ప్రముఖ స్వభావ ప్రదర్శకంగా వివాద వ్యాసం సముచిత పరిణామం. సారస్వతం, సాంఘిక జీవితం, రచయిత వ్యక్తిత్వం మిళితమై వెలువడే వివాద వ్యాసతత్త్వం వీక్షించటం అవశ్యకం.

## 1. వివాద వ్యాస హేతువులు

సాహిత్యంలో వివాద వ్యాసం, ఒక కోణంలో మనిషి అంతరమూర్తి ఛాయాచిత్రం. తీవ్ర విమర్శనమయినా సభ్య సమాజం గ్రహిస్తుంది. అయితే అది వివాదం కావటంలోనే అనావశ్యక గుణం ప్రవేశించినట్లు స్పష్టమవుతుంది. ఈ గుణం మనిషి మనస్సు మారు మూలల్లో దాగి రేగి వెలికురికి అభివ్యక్తి పొందటంతో వివాద సృష్టి జరిగింది. ఈ గుణం తన అస్తిత్వం నిలుపుకోవటానికి ప్రాక్తన సంఘంలో మనిషి చేసే పోరాటంలో రూపం పొంది వారసత్వంగా సంక్రమించి, నాగరక మానవుడి రక్తంలో మిళితమయి దాగి ఉంది.

పూర్వం అది పొందినంత అవసరం ఇప్పుడు లేకపోపటం వల్ల దాని ఉనికి అధికంగా గోచరం కాలేదు. అయితే అది అణగారి పోలేదని ఆంగ్ల విద్య ఈ గుణం అవతరణకు దోహదం చేసినప్పుడు స్పష్టమయింది. విలువలు స్థిరంగా స్పష్టంగా ఉన్నప్పుడు వివాదం నిరవకాశమవుతుంది. సంఘ జీవితంలో, సాహిత్యంలో కొత్తదనం ప్రవేశించేటప్పుడు, పాతదనం తొలిగిపోతున్నప్పుడు, ఆంగ్లాంధ్ర భాషలు నాగరికతలు ఆలోచనలు జీవితాలు అనుసంధానం పొందు తున్నప్పుడు ఏర్పడ్డ స్థితి వివాద వ్యాసానికి ఆత్మదానం చేసింది. సాంఘిక వ్యత్యాసాలు, ఆర్థిక లోపం, వ్యక్తి ప్రాధాన్యాప్రాధాన్యాలు, పాండిత్య ప్రకర్షలు ఈ వివాద వ్యాసం సృష్టించాయి. వ్యక్తి వ్యవస్థ మొదలైన భిన్న ప్రాతిపదికల మీద ఇది సృష్టి పొందింది. వివాదంలో ఏర్పడ్డ హేతుబలం వల్ల వ్యాస సామర్థ్యం పెరిగింది.

వివాదం అనేక వస్తుగతంగా ఉంది. అది సారస్వతమయినా, చరిత్ర అయినా వ్యాకరణ మయినా వ్యాసంగా తెలుగులో రూపొందింది కాబట్టి తెలుగు వివాద వ్యాసంగా గుర్తించటం జరిగింది. శబ్ద సాధుత్వం, కావ్య పరిష్కరణం, వ్యాకరణ లక్షణం దేశ చరిత్ర, వాఙ్మయ చరిత్ర, కావ్యోన్నత్వం, నూత్న రచనారీతి, ప్రక్రియలు మొదలైన అనేక విషయాలు వివాదాలయి, వ్యాససృష్టి జరిగింది. ఈ పరిస్థితిని ప్రోత్సహించిన కారణాలు విశదీకరించటం ఆవశ్యకం.

వివాదం ప్రారంభం కానటానికి వ్యక్తుల అహంకారం, మూర్ఖత్వం, పట్టు దలలు కాని, వాటికి సమాధానం చెప్పవలసిన పరిస్థితిలోని మంచిచెడ్డల తీవ్రత కాని ఉంటుంది. తన పని సాహిత్య పరిశోధనం చేయటమనీ, సత్య వ్యక్తీకరణ మనీ, విమర్శన కృత్యం నిర్వహించటమనీ, లోక శ్రేయం కోరటమనీ చెప్పినా, అదే సర్వం సంపూర్ణం కాకపోవటంతో, తదన్యం రచనంలో ప్రవేశించటంతో వివాదానికి దారి ఏర్పడుతుంది.

ప్రతి వివాదం వెనుక సారస్వత పరిధి నతిక్రమించిన ప్రయోజన కాంక్ష బలవత్తరంగా ఉంది. ఇది వ్యక్తి రచనారీతి, ప్రక్రియాది పరిమితంగా ఉండ వచ్చు. ఇది స్థూలంగా స్వాత్మాధిక్యం కాని పరానాధిక్యం కాని ప్రదర్శించే ప్రయత్నంగా గోచరమవుతుంది. లేకపోతే స్వపక్షౌన్నత్వం, ప్రతిపక్ష న్యూనత్వం,

బట్టబయలు చేయాలన్న కృషిగా నయినా మిగులుతూ వుండి. కాకపోతే పరులు చేసిన అన్యాయానికి ప్రతీకారంగా, సమాధానంగా నయినా ఉంది.

తను మాత్రమే పండితుడు, ఇతరు లెవరూ పండితులు కారు. ఎవరి గ్రంథంలో నయినా ఎన్నయినా లోపాలు చూపగలను అన్న పాండిత్య విశ్వాసం దోషాన్వేషణ చేయించి వివాద వ్యాస సృష్టి చేయటం శారదాకాంచిక నాలుగు భాగాలులో గోచరమవుతుంది. వాటి కర్త వేదం వేంకట రాయశాస్త్రి. ఇది తూల నాడటం లేని విమర్శనం కాదు.

తను మహా పండితుడైనట్లు, ఇతరులు కానట్లు, అందరూ తనను గౌర వించాలనుకొన్నట్లు, తన సాహితీ సేవను గుర్తించాలనుకొని నిందించినట్లుగా కాక ఎదుటి వ్యక్తిని సున్నితంగా మాట అని, వివాదం పెంచటం పరికింపవచ్చు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి 'చెరలాటము' ప్రధానంగా చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రితో కలిగిన వివాదం.

ఏ సాహితీపరుడయినా గొప్పవాడుగా భావింపబడతాడేమోనని, ఆ ఆధిక్యం న్యూనపరచాలని ఒక్కరో, అనేకులో ప్రయత్నించటం వివాద హేతువుగా కనిపిస్తుంది. ''చతురాననులు నన్ను నిందించుటకు రెండు కారణములు గన్పించు చున్నవి. అందొక కారణము వారికి నాపైగల యసూయా క్రోధములు. రెండవ కారణము నాకు కళంకము నాపాదించియైనను సరే యణగద్రొక్కవలెనను వారి యుద్దేశము'' (మనవి - కాకతీయాంధ్ర రాజయుగ చరిత్ర విమర్శనము- పుట 2) మారేమంచ రామారావు తన చరిత్ర సిద్ధాంతాలు తప్పులుగా చూపిన చిలుకూరి వీరభద్రరావు గ్రంథం విమర్శిస్తూ వ్రాసిన విషయం గమనింపవచ్చు. ఇటువంటివే 'సౌందర నందము' 'రామాయణ కల్ప వృక్షము'ల మీది వివాదాలు.

తన పాండిత్యం ప్రదర్శించుకోవటం ఒక కోవ అయితే అవతల వ్యక్తి అపండితుడు అప్రతిభుడు అని రుజువు చేయటానికి చేసే ప్రయత్నం వివాద వ్యాస సృష్టికి మరో హేతువయింది. శ్రీ గడియారం వేంకటశాస్త్రి శివభారతము రచించటంలో శ్రీ సి. సుందర రామయ్య చేసిన సహాయం అత్యధికంగా ఉందనీ జంట కవిగా గుర్తింపవలసినంత స్థానం ఉందనీ తెలుపుతూ 'పరాంకుశం' వ్రాసిన ఉషోరేఖ శ్రీ మధురాంతకం రాజారాం వ్రాసిన చిత్తూరు జిల్లా సాహిత్య

చరిత్ర లోప భూయిష్టమని, డా. శ్రీనివాసపురం నరసింహాచార్యులు విమర్శనం ఇందు కుదాహరణాలుగా గ్రహింపవచ్చు.

తమ ప్రతిపాదించిన సత్యం ఇతరులు అసత్యంగా భావిస్తే దాన్ని స్థాపించటం కోసం చేసే ప్రయత్నంకూడా దీనికి దోహదమయింది. గోషా విషయంలో చెలికాని లచ్చారావు, కోటగిరి వేంకటకృష్ణారావులకు; వ్యాకరణ సందర్భంలో డా. పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి వర్ణుల చిన సీతారామస్వామిశాస్త్రులకు రాయల గయశాసనం సంగతిలో శ్రీ కె. వి. శర్మ డా. నేలటూరి వేంకటరమణయ్యలకు జరిగిన వివాదాలు ఈ దృష్టితో పరికింపవచ్చు.

విద్యార్థి తనపట్ల అవిధేయంగా ఉన్నాడని గురువు భావించటం, గురువు తన విషయంలో చులకన దృష్టి చూపుతున్నాడని శిష్యుడు తలంచటం వివాద వ్యాస సృష్టికి హేతువులు. ఇది గురుస్థానంలో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి శిష్య స్థానంలో చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి ఉండి, ఈ వివాదం వ్యాసాలుగా రూపొందించారు.

ఒక పండితుడు, తన మిత్రుడుకాని శిష్యుడుకాని సృష్టించిన సారస్వతంలో లోపం ఎన్నుతూ మరో పండితుడుకాని, కవికాని చేసిన విమర్శనం చూచి, ఆ విమర్శనంకాని, ఆ వ్యక్తి ఇతర సాహిత్యంకాని గ్రహించి వాద స్థాయిలో రచన చేయటం గమనింపవచ్చు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, పేరి కాశీనాథ ప్రణీతమయిన పూర్వ శాకుంతలం విమర్శించటానికి హేతువు తన కవితా శిష్యుడైన పురాణం సూర్యనారాయణశాస్త్రి 'విదగ్ధ మాధవము' నాటకాన్ని పైక వి లోప భూయిష్ఠమని వ్రాయటమే !

వ్యక్తిగత పరిధి దాటి ఒక వ్యవస్థకు సంబంధించిన వివాదాలు, ఉదాత్త రీతిలో కొంతవరకు సాగాయి. ప్రాచీన ధర్మశాస్త్రాల పట్ల కొందరు ఆధునికులకు విశ్వాసం సడలిపోతూ వుండటం, కొందరకు అచంచలంగా ఉండటం సహజమే ! ఆ విశ్వాసం లేని కందుకూరి వీరేశలింగం పంతులు అనేక సాంఘిక సంస్కరణలు వాంఛిస్తుంటే, కొక్కొండ వేంకటరత్నం, వేదం వేంకటరాయ శాస్త్రి, దాసు శ్రీరాములు తిరస్కరించటం జరిగింది. ఈ వివాదం ఉత్తమ వ్యాస సృష్టికి దోహదం చేసింది.

ఇటువంటిదే గ్రాంధిక వ్యావహారిక భాషా వివాదం. తెలుగు భాష ఎలా పలకబడుతూవుందో అలా వ్రాయటం మంచిదన్న వాదం, గ్రంథాలలో ఉన్న ట్లుగా నేడూ వ్రాయాలన్న భావం, వ్యావహారిక గ్రాంథిక వివాదం అయింది. గిడుగు రామమూర్తి పంతులు, గురజాడ అప్పారావు పంతులు, బుర్రా శేషగిరి రావు, సెట్టి లక్ష్మీనరసింహం వంటి ప్రముఖులు వ్యావహారికం పట్ల, కాశీభట్ట బ్రహ్మయ్య, యన్. మూర్తిరాజు, పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు, వేదం వేంకటరాయశాస్త్రి, వావిలికొలను సుబ్బారావు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి వంటి ప్రసిద్ధులు గ్రాంథికంపట్ల అభీష్టం చూపుతూ అన్యం విమర్శిస్తూ వ్రాసిన వ్యాసాలు వివాద వ్యాసానికి ఉద్యమ స్థాయి నిచ్చాయి.

ఈ స్థితిలోనే మహాభారత సంబంధి వివాదం గుర్తింపవచ్చు. కురుపాండవ దాయ భాగం విషయంలో, భారతంలోని పాత్రల సృష్టి విషయంలో కాశీభట్ట బ్రహ్మయ్య, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి వివాదం ఒక పరిధి దాటి, నేరం స్థాయికి పోవటంవల్ల వ్యక్తిగతంగా అయింది కాని, ఈ వాదవిషయం వ్యక్తిత్వ ప్రమేయం లేకుండా ఉండదగినంత ఉత్తమమే !

ఈ దశనే తెలుపుతూవున్నాయి రాజకీయ వాతావరణంలోకి ప్రవేశించిన వాదోపవాదాలు. ఆంధ్రదేశంలో కమ్యూనిజం వేళ్ళూని నప్పుడు, ఆ కవులు తద న్యుల వాద ప్రతివాదాలు సాహిత్యంలో వ్యాసాలుగా రూపొందాయి. గురజాడ అప్పారావు మహాకవి అనీ, కాదనీ వచ్చిన తగాదా, శ్రీ శ్రీశ్రీ సాహిత్యం గొప్ప దనీ, కాదనీ ఉన్న గొడవ ఈ స్థితినే వివరిస్తాయి. అలాగే కన్యాశుల్కం ప్రథ మాంధ్ర నాటకం అన్నప్పుడూ వివాదమయింది. ఇది వ్యాస దృష్టికి హేతువయి వాఙ్మయ దోహదమయింది.

అటువంటిదే సారస్వతంలో సంప్రదాయజ్ఞులకు, నవీనులకు మధ్య ప్రక్రియాగతంగా జరిగింది. ప్రాచీన కవిత్వం ఉత్తమంగా భావ కవిత్వం కానట్లుగా దేశంలో పండితులు రెండు వర్గాలుగా చీలి, చాలాకాలం ఉపన్యాసాలు వ్యాసాల వల్ల తమ భావాలు వ్యక్తం చేస్తూ సాగించిన ఉద్యమం ఉంది. ఈ సమయంలో నండూరి సుబ్బారావు 'యెంకి పాటలు' విమర్శించటం ఈ వివా దంలో భాగమే అయినా, వ్యక్తిగత పరిధి కొంత గోచరమవుతూ వచ్చింది.

తర్వాత భావ కవిత్వం అభ్యుదయ కవిత్వం రెండు భిన్న శాఖలుగా వివాదం పెంచుకొని వ్యాస సృష్టికి కారణమయ్యాయి.

సంఘ జీవితంలో లోపముందనీ, దాన్ని సవరించటం సాహిత్యం వల్ల సాధ్యమవుతుందనీ నమ్మిన చలం వంటివాళ్ళ రచనలు, సమాజంలో లోపం లేదు, వివాహ వ్యవస్థ సక్రమంగా ఉంది అన్న విమర్శకుల రచనలు, పరస్పరం వివాదోన్ముఖంగా నిలిచాయి. వివాహం వాద విషయమై రెండు పక్షాలు వ్యాసోప న్యాసాలు సృష్టించాయి.

కవుల రాజుల జన్మస్థలం రాజధాని మొదలైన చర్చలు వివాదాలు కావటం సహజమే. వేమన కదిరి ప్రాంతం కవా? కొండవీడు కవా? అనీ, పోతన నివాసం ఒంటిమెట్టా, ఒరంగల్లా అనీ, కాకతీయులు వేల్పుకొండవాళ్ళా కారా అనీ ఉన్న వివాదాలు ఉచిత విషయ పరిశీలన సమర్థంగా రూపొం దాయి.

ఈ వ్యవస్థా విమర్శనంలో వర్ణ వ్యవస్థ వివాదం గమనింపవచ్చు. ఏ కవి రచయిత విమర్శకుడు ఏ కులంవాడో గుర్తించి విమర్శించటం తన్మూలంగా వివాదం పెరగటం గుర్తింపవలసిన అంశమే! ఇంతవరకు జరిగిన వివాదాల వల్ల సాహిత్యానికి చాలావరకు మేలే జరిగింది. వ్యక్తి విమర్శనం కూడా వివాద మయినా, కొంతవరకు పరిమితం కావటంవల్ల సహ్యమయింది. వ్యవస్థా విమ ర్శనం ఎంత వివాదమయితే, వాటివల్ల అంత ఆసక్తి, అంత నూత్న విషయావ బోధ కలిగాయి. వివాదం వీలయితే పరిహరింపదగిందేకాని, వీలుకానప్పుడు, వ్యాసంగా నూత్న విషయ వ్యక్తీకరణం, వచన రచనాశోభ కలిగించింది కాబట్టి భరింపవచ్చు.

అయితే వర్ణ ప్రాధాన్యంతో వచ్చిన వివాదం వ్యాసంగా ఎక్కువ ప్రాధాన్యం పొందటం కానీ, విషయం అధికంగా ఆదరింపబడటం కానీ జరిగి నట్లు భావించే అవకాశం తక్కువ. వైదికి, నియోగి వివాదం తిరుపతి వేంకట కవులు, కొప్పరపు సోదర కవులవరకే పరిమితం కాలేదు. ఆంధ్రదేశంలో అది చాలాకాలం ప్రతిధ్వనించింది. నన్నయ వైదికా నియోగా అన్న వాదోపవాదాలు వినిపించాయి. శ్రీకృష్ణదేవరాయలు క్షత్రియుడో, శూద్రుడో తెలియటం మహత్తర అవసరంగా వాదాలు జరిగాయి. భట్టుమూర్తి- రామరాజ భూషణుడు పేర్లకు

పరిమితమయిన వాదం కాదు, కులం ఆలోచన. వెన్నేటి రామచంద్రరావు 'మను వసుచరిత్ర రచనా విమర్శనము'లో భట్టుమూర్తిని అబ్రాహ్మణ కవి అని తిరస్కరించటానికి చేసిన ప్రయత్నం కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి 'శ్రీ మను వసు ప్రణాళికానుబంధము'లో తిరస్కరిస్తూ 'శూద్రజాతి వజ్రము'గా వసుచరిత్రను పోల్చటాన్ని అంగీకరించకపోవటంగా గుర్తించాలి. ఇంతేకాదు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ రామాయణ కల్పవృక్షము మీద కొత్త సత్యనారాయణ చౌదరి విమర్శన వ్యాసాల్ని, ఆ పైన వచ్చిన వివాదం కమ్మ బ్రాహ్మణ కుల వివాదంగా రూపొందింది.

ఈ విధంగా వివాద వ్యాసం అనేక హేతువుల వల్ల ఆవిర్భవించింది. అయితే వివాద కారణాలన్నీ సరసంగా లేవు. కొన్ని ఆనందాన్ని, కొన్ని విజ్ఞానాన్ని, కొన్ని అసహ్యాన్ని కలిగించినా స్థూలంగా వివాదంవల్ల వ్యాసవాఙ్మయం విస్తృతమయింది.

## 2. వివాద వ్యాస లక్షణాలు

ఈ వివాద వ్యాసం పొందే ప్రారంభం, ప్రోత్సాహం, నిర్వహణం, సమాప్తం పరికించి ప్రత్యంశ లక్షణాలు దర్శింపవచ్చు. వివాదం సత్ఫలితాలే ఉద్దేశించినా, సమాప్తం బాధాకరంగా ఉండటమే కొంతవరకు పరిపాటిఅయింది. వివాద వ్యాస సృష్టి ఇరువర్గాలకూ మనశ్శాంతి తక్కువ చేసింది. తాత్కాలికంగా శాంతి సంతోషాలు కలిగినా ఆ వెనుక వచ్చే అశాంతి దుఃఖాలకు అవి ఆద్యరూపాలు

గుణదోషాలో, దోషాలు మాత్రమో అన్వేషింపబడ్డ సాహిత్యంకాని, వ్యక్తి కృషికాని, విమర్శనం చేయబడినట్లు స్పష్టమవుతుంది. ఈ స్థితి ఇంతటితో ఆగిపోతే అది విమర్శ వాఙ్మయంగా సారస్వత లోకంలో పరిగణింపబడుతుంది. ఆ విమర్శలోపం ఎన్నుతూ ప్రతి విమర్శ వచ్చినా, ఆ యా వ్యక్తుల వ్యక్తిత్వం అ రచనంలోకి రాకపోతే, అదీ విమర్శనం కోవలోనే చేరుకొంటుంది. సారస్వతం కంటే భిన్న హేతువులు విమర్శనంలో ప్రవేశిస్తే, అది వివాదంగా ఆ వచన రచనలు వివాద వ్యాసాలుగా గ్రహించటం జరుగుతుంది.

*ప్రారంభం :* వివాద వ్యాసం సాధారణంగా విమర్శనం కారణంగా మొదలవుతుంది. అది విమర్శనంలో విమర్శకుడిలో లోపం చూపటానికి

ప్రధానంగా జరుగుతుంది. ఈ లోపం ప్రతిభా పాండిత్యాలకు ప్రాథమికంగా సంబంధించి ఉండేదే అయినా కొన్నిసార్లు వ్యక్తిగతంగానూ ఉంటుంది. సాహిత్యం విలువ పరిశీలించటానికి, లోపం చూపటానికి, యథార్థం దర్శించటానికి జరుగుతున్నట్లు కనిపిస్తుంది.

చెలికాని లచ్చారావు 'గోషా' వ్యాసంలో కోటగిరి వేంకటకృష్ణారావు వ్యాసాన్ని ఖండిస్తూ 'భ్రమ పోగొట్ట'టానికని తెలిపాడు. రామరాజు శోభనాచలము, కందుకూరి వీరేశలింగం పంతులు గ్రంథ రచనా చాకచక్యములో ఇతర గ్రంథాలలోంచి సంగ్రహించిన భాగాలు వివరిస్తూ ఈ "గ్రంథములలోని స్వారస్యమును లోక మించుక గ్రహింప" చేయటానికి ప్రయత్నించాడు. శారదాకాంచిక ప్రథమ కింకిణిలో వేదము వేంకటరాయశాస్త్రి 'విక్రమార్క చరిత్ర ముద్రణ విమర్శనం' 'పరోపకార బుద్ధి'తో చేసినట్లు చెప్పాడు. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి 'పక్షపాత సహితములగు విమర్శసములపై' ధ్వజమెత్తి, 'మను వసు ప్రకాశిక'ను ప్రచురిస్తే, 'విమర్శనాద్వయ తారతమ్య నిరూపణ' చేయటానికి 'మను వసు విమర్శానానుబంధము'ను వెన్నేటి రామచంద్రరావు ప్రకటించాడు.

ఆంధ్ర శాకుంతల విమర్శనంలోని శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి "అసమర్థతను అనర్హతను వెల్లడి" పరచటానికి తోలేటి వేంకట సుబ్బారావు ప్రయత్నించాడు. స్వాతిశయం ఖండించటానికి చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి 'శ్రీపాద గురువులకడ నా శుశ్రూష', 'నా ముక్త్యాల ప్రయాణము' వ్రాస్తే, అదే పని చేయటానికి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి నాలుగు భాగాలుగా 'చెళ్ళపిళ్ళ వారి చెరలాటము' వ్రాసి అందులో వివాదాలు వివరించి, విమర్శించాడు. అది 'శతవధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు నా యందలి గురుభక్తితో నన్నెంతో గౌరవించుచు నీ నడుమ నేనింతవాఁడంత వాఁడనని స్వాతిశయముల దెలుపుచు గొన్ని వ్యాసములు వ్రాసినారు. ఆ వ్రాతలకు నా కృతజ్ఞత దెలుపుకొనుచు జేతనైనట్లే చెరలాటము వ్రాయుటకుం గారణము కలిగినది" (పుట 1. చెరలాటము ప్రథమ భాగము). వివాద వ్యాస సృష్టి జరగటానికి సాహిత్యేతరాంశ కారణమవుతూ వుంది.

ప్రోత్సాహం: ఈ వివాద వ్యాసరచనకు గురువు శిష్యులను, స్నేహితులు విమర్శకుణ్ణి, పత్రికాధిపతులు రచయితలను ప్రోత్సహించారు. వేంకట రామ కృష్ణ కవులు తిరుపతి వేంకట కవుల సాహితీ విమర్శనం సాగించటానికి అకుండి వ్యాసమూర్తి శాస్త్రి; ములుమూడి నారాయణరెడ్డి దీపాల పిచ్చయ్యశాస్త్రి సాహిత్యంలో తప్పులు పట్టటానికి ధరణికోట వేంకట సుబ్బయ్య ప్రోత్స హించారనీ, తమ శిష్యుల చేత వివాద వ్యాస సృష్టి చేయించటం జరిగిందనీ గ్రహింపవచ్చు. చిలుకూరి వీరభద్రరావు వ్రాసిన కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రము మారేమండ రామారావు విమర్శించటానికి, తనపై మోపిన 'అసత్య ములునగు నిందలు' మాత్రమే కారణంకాక, 'యథార్థ్యమును లోకమునకు తెలియజేయమనియు మిత్రులెందరో నన్ను హెచ్చరించుటచే నే నీ పుస్తకమును రచించితిని' అని మిత్ర ప్రోత్సాహం తెలపటం గుర్తింపవచ్చు. మానవసేవ పత్రికా సంపాదక మండలిలోని నాళము కృష్ణారావు, అద్దంకి సత్యనారాయణ శర్మతో ''శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు వడ్డాది సుబ్బారాయఁడుగారి శాకుంతల నాటకము మీఁద విమర్శనము వ్రాయుచున్నారు. దానిని మా పత్రికలోఁ బ్రక టించు చున్నాము. సుబ్బారాయఁడు చేతఁగాని, మఱియొకరి చేతఁగాని దానికిఁ బ్రత్యుత్తరము వ్రాయించి యిచ్చిన దీనిని గూడ మా పత్రికలోనే ప్రకటించెదము''అని చెప్పటం ఆంధ్ర శాకుంతల విమర్శన నిరసనము పీఠికలో తత్కర్త తోలేటి వెంకట సుబ్బారావు వ్రాయటమూ, ఆంధ్ర పత్రికా సంస్థ రామాయణ కల్పవృక్షము మీద కొత్త సత్యనారాయణ చౌదరి వ్రాసిన విమర్శనం ప్రచురించి, ఆపైన వివాదం ప్రకటించటమూ, శ్రీ శ్రీశ్రీ చలం సాహిత్యం మీద వివాదం వెలువరించటమూ గ్రహించి, పత్రికలు ఇచ్చిన వివాద వ్యాస వాఙ్మయ ప్రోత్సాహం పరికింపవచ్చు.

నిర్వాహణం: విమర్శనం మీద ప్రతి విమర్శనం, వాదానికి ప్రతివాదం రచించటం మొదలవటంతోనే వివాద వ్యాసం రంగంలోకి వచ్చింది. ఈ వివాదంలో వ్యాస సృష్టి చేసేవాళ్ళు స్థూలంగా ఇరుపక్షాలుగా అయిపోవటం చూడవచ్చు. ఎప్పుడయినా మధ్యవర్తిత్వం, న్యాయ నిర్ణయం చేసే దృష్టితో వివాద వ్యాసం ఎవరయినా వ్రాసినా, తక్షణం ఏదో ఒక పక్షంలో చేరిపోవటం జరిగిపోతుంది. ఈ వివాద వ్యాసం సృజనంలో సాధారణంగా ఒక పక్షంలో అందరూ మిత్రులే ఉంటారు, అయితే గురువులు శిష్యులను

దించటమో, శిష్యులు గురువులను తీసుకొని రావటమో జరుగుతూ వచ్చింది. విమర్శకులు ప్రత్యర్థుల్ని రెచ్చగొట్టటం కూడా గమనింపవచ్చు. ఉపన్యాస మంజరీ విమర్శనంలో కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి కందుకూరి "ఉపన్యాసమున నవసరము మాలిన మాట లనేకము కలవు. వాని నన్నింటిని విమర్శింప నవసరము లేదు" అనటం రెచ్చగొట్టినట్లుగానే అయింది. కొక్కొండ వెంకట రత్నము పంతులు వ్రాసిన 'ఆంధ్ర ప్రసన్న రాఘవము' విమర్శనంలో వేదం వేంకటరాయశాస్త్రి "ఛందో వ్యాకరణాలంకారముల కిది వేరు పురువు ... రసము సున్న...పూర్వులు చెప్పిన పాకములిందులేవు. గ్రచ్చకాయ పాకము, మేడిపండు పాకము, ముసిడి పండు పాకము ... ఉడుకుతారు పాకము ... పాద పూరణ ప్రయోగమందును, అదియేనియు చక్కగ చేతగామి యందును. ఇంతటి కవి మఱి లేడు ... తెనిగింపులో వీరికి అర్థము చెడినను దెలసినది కాదు, రసము చెడినను తెలియలేదు. కథ చెడినను తెలియలేదు. లోక స్వభావ విరోధము వచ్చినను తెలియలేదు. వీరు ఆంధ్రభాషకు విషము పెట్టినారు." అని వ్రాసి, మొత్తం 2563 తప్పులు చూపటం వల్ల వివాదం పెరగటానికి అవకాశం కలిగింది. తిరుపతి వేంకట కవులు శృంఖలా తృణీ కారములో "ప్రకృత మీ శిష్యుడును శిష్యులు వేంకట రామకృష్ణ కవులును కుప్పకు నిప్పుపెట్టి పేలా లేరికొని తినుటకై యీ యుద్యమమునకు దిగిరి" అనటం వివాద వృద్ధికి దోహదం చేసింది. కూచిభట్ల ప్రభాకరశాస్త్రి మహా భారత రహస్య విమర్శనమును శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి చేత వ్రాయించాడు. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి మను వసు ప్రకాశికలో వెన్నేటి రామచంద్రరావును గూర్చి "ఇట వీరు బహు ప్రమాదములకు లోనైరని చెప్పవలసి వచ్చి నందులకు జాల విచారముగా నున్నది" అనటం వివాద వృద్ధి హేతువయింది.

ప్రతి విమర్శ రాకుండా, వివాదం ఏర్పడకుండా ఉండాలని ప్రయత్నించిన విమర్శకులకు ప్రతి విమర్శ వచ్చింది. కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి ఈ దృష్టితో వ్రాసిన విమర్శనం ప్రతి విమర్శనకు గురి అయింది. వినయం ప్రదర్శిస్తూ ఎవరయినా విమర్శనం వ్రాసి, నా అభిప్రాయం సవరింప వచ్చు నంటూ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి వ్రాసిన వివాద వ్యాసం ప్రతివాదం పొందింది వి. ఆర్. కృష్ణశాస్త్రి "భిన్నాభిప్రాయములతో నెవ్వరైన నీ గ్రంథమును దూషించుచుగాని మమ్ము నిందించుచుగాని యేమైన వ్రాసినచో

ప్రత్యుత్తరము లీయఁబడవు. భాషాభివృద్ధికిఁ జేయఁదగిన పనులనేకములున్నవి. ఈ యప్రస్తుత ప్రశంసలతో గాలము వ్యర్థము సేయుట ధర్మము కాదు'' అనీ, కాళ్ళకూరి నారాయణరావు 'సదండ వితండ వివాదము'లో ''వితండ వాదములకై వ్రాయఁబడని యీ పుస్తకముపై విజిగీషులగు పండితులు పూర్వ పక్షములకుఁ బూనుకొని తమ కాలమును వ్యర్థము చేసికొనుచు నా కాలమును వ్యర్థపుచ్చక యిందలి గుణమునే గ్రహింతురు'' అనీ తెలిపినా వివాద వ్యాస సృష్టి ఆగలేదు.

నేరం అయ్యేంతగా పద ప్రయోగం చేయటం వివాద వ్యాసంలో గోచర మవుతూ వుంది. 'కురుసామ్రాజ్యాధిపత్య నిర్ణయము'లో ఇఁక వ్యక్తి ద్వేషములచే నల్పులు, మూర్ఖాగ్రేసర చక్రవర్తులు నా గ్రంథమును గురించి వ్రాయు వ్రాతల వలన కానున్న దేమియు లేనందున నవియు విచారణీ యాంశములే కావు'' అని శిష్టా సూర్యనారాయణ శాస్త్రి వ్రాశాడు.

ఎంత వివాదంలోనూ ఔచిత్యం మర్చిపోకుండా వ్యాస సృష్టి చేసిన వాళ్ళు అరుదు. ఏదో ఒక దశలో ఆవేశ కావేషాలకు లోనైపోవటం సహజంగా కని పిస్తుంది. అయితే ఒక స్థితిలో తిరుపతి వెంకట కవులు ''ఏదైననొక గ్రంథ విమ ర్శనమునకు గడఁగినచో దాని యందు గల స్ఖాలిత్యములను మాత్రమే విమ ర్శింప వలయును గాని తద్గ్రంథకర్తలను ఇంగితజ్ఞాన రహితులనియు, కారు కూతలు కూయువారనియు, అవ్యక్త ప్రలాపము లాడువారనియు మున్నుగా గల వచింపరాని దుర్భాషల నాడుట, సువిమర్శనమునకు లక్షణము కా''దని తెలుపటం ప్రశంసాపాత్రం.

వివాద వ్యాసంలో ప్రమాద రచనకు తావీయని శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ దీక్ష గమనించాలి. నాచన సోమనాథుడు ఎఱ్ఱన కంటే కవితాధిక్య మున్నవాడు కాదన్న దృష్టితో ఈ రచయిత చేసిన పరిశీలనం తిరస్కరించిన వాళ్ళతో నడకుదిట వీరరాజు పంతులు విషయంలో ''వారి ఖండన ఖండముఁ జదివిన తరువాత వారి విమర్శన మార్గము గుణ పక్షపాతము గలది కాదని స్పష్టమై'' పోయినట్లు వ్రాయటం, శ్రీ నిడదవోలు వేంకటరావు తనను విమర్శిస్తే 'భారతి'లో సమాధానం వ్రాస్తూ, ''శ్రీ వేంకటరావుగారి గ్రంథ వ్యాసంగము విశాలమైనది. వ్యవసాయము విసుగు లేనిది. దాని ఫలము పూర్ణముగా ఆంధ్ర

సాహిత్యమునకు లభించుటకై వారు తమ అభిప్రాయములను రాద్ధాంతములును కొంత అత్రపడక నెమరువేసుకొని వెలువరచుట కావలసి యున్నది'' అని వ్రాయటం జీవితంలో సంయమనం, సాహిత్యంలో ఓర్పు ప్రదర్శించాయి.

వివాద వ్యాస వాఙ్మయాభివృద్ధికి కవులు రచయితలు విమర్శకులే కాక పత్రికలు కొంతవరకు కారణ భూతాలయ్యాయి. సుదర్శినిలో''... ఈ నడుమ వీరిచే రచింపబడిన 'వారకాంత' యను నాటకముఁ జూడ దటస్థించినది. భాషలో సింతకన్న బాపిష్టి గ్రంథమును,... లేరు. ఈ వెంగలి వెఱ్ఱిమొఱ్ఱి కుశంకలకు సమాధాన మిచ్చుటయే యసమంజసమని తోచుట ముఖ్యకారణము'' అనటం వల్ల వివాదం పెరిగింది. తిరుపతి వేంకట కవులు గుంటూరు సీమ విమర్శనం వైదికి నియోగి వివాదంగా మారి పలువురు పండితులు ప్రముఖులు గోదాలోకి దిగేటట్లు జరిగినప్పుడు పత్రికలు ఈ వివాదం బాగా పెంచాయి. ఒక్క వివాదంలో ఇన్ని పత్రికలు ఇంతకు పూర్వం రంగంలోకి వచ్చినట్లు దాఖలా లేదు. అవి ఆంధ్ర పత్రిక, దేశాభిమాని, శశిలేఖ, ఆంధ్రప్రకాశిక, ఆంధ్ర భారతి, అభినవ సరస్వతి, ఆర్యమత బోధిని, దేశమాత, సువర్ణరేఖ, ఆంధ్రకేసరి, కవితా పత్రిక, సుదర్శిని, మానవ సేవ పత్రికలలో ఈ వివాదం వ్యాసయుద్ధమయింది.

పుర్రెకొక బుద్ధి అన్నట్లుగానే వివాద మొక విధంగా నిర్వహణం పొంది, వ్యక్తులనూ వ్యవస్థలనూ అభిమతాలనూ అభీష్టాలనూ బాధించి, ఉడికించి, చెప్పబడి చల్లారిపోయింది. ఈ వివాద వ్యాసంలో దీని పరిణామం గోచరమవు తుంది. ఇది ముగిసిపోవటం ఏ విధంగా జరిగిందో గమనింపవచ్చు.

సమాప్తం: వస్తుతత్త్వంలో పరిష్కారావకాశం ఉంటే అది ముగిసి పోయింది. లేకపోతే వివాదం సాగుతూనే వుంది. చిత్ర నళీయ నాటక ప్రద ర్శనం మీద గౌతమి పత్రికలో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి చేసిన విమర్శనం మీద ప్రతివిమర్శనం రావటంతోనే వివాదం ఆగిపోయింది. తెలుగులో రచనా వ్యవసాయం గ్రాంథికంలో జరగాలా వ్యావహారికంలోనా అన్న వివాదం ఆగిపో లేదు. విమర్శ ప్రతివిమర్శలతో వివాదం సాగి రచయితల ఆవేశ తీవ్రత తగ్గి పోగానే వివాదం తగ్గిపోయినట్లు కనిపించింది. అయితే ఇటువంటి చాలా వివాదా లకు కాలం సరయిన మందు. భావ కవిత్వం ఒకప్పుడు వివాదాలకు గురి అయి

సంతగా ఇప్పుడుకాదు. దీనికి సాహిత్యంలో సమాజంలో వచ్చిన మార్పులు పరిష్కారం ప్రసాదించాయి.

వస్తు స్వభావమో, కాలమో, వివాద సమాప్తాన్ని నిర్ణయించడం కాక, వివాదంలోని ఔచిత్యానౌచిత్యాలు వివాదంలో భాగంగా పరిష్కరింపబడటం గమనింపవచ్చు. దీనికి ముగింపు, ఈ కోవలో రెండు విధాలుగా వుంది. అవి, పండితులు అనుగ్రహించిన పరిష్కారం, న్యాయస్థానం ఇచ్చిన తీర్పు. పండితులు అభిప్రాయ ప్రకటనం చేయటం, పండితుడు తీర్పు చెప్పటం రెండు రూపాలలో వివాదం ముగింపుకు తేవటం చూడవచ్చు.

బిరుదరాజ శేషాద్రి రాజకవి కుమారసంభవం అనువాదం చేస్తే, అది సరసంగా ఉందని 'వార్తాదర్శిని' భావించటం, దాన్ని పండితులు పలువురు అంగీకరించటం జరగగా, 'శశిరేఖ' పత్రిక ఆక్షేపిస్తే దానిని తిరస్కరించిన రచనమూ; వెల్లాల సదాశివశాస్త్రి, మల్లాది సూర్యనారాయణ కృతమైన 'ఆంధ్ర దశరూపకము' విమర్శింపగా దానికి ఖండమని వెలువడటంతో 'ఖండనాభాస నిరాసనము' మళ్ళీ వెల్లాల వ్రాసి, దానికి తోడుగా పండితాభిప్రాయ మణిమాలికను ప్రచురింపించటమూ, (యస్. కుప్పుస్వామిశాస్త్రి, వి. కృష్ణస్వామయ్యార్, కె. వి. లక్ష్మణసూరి, వేదము వేంకటరాయశాస్త్రి మొదలైన 54 గురు అభిప్రాయాలు ప్రకటించారు) వ్యావహారిక భాషావాదంలో పండితు లనేకులు తమ అభిప్రాయాలు గ్రాంథికభాష కనుకూలంగా తెలుపుతూ ప్రభుత్వానికి మహజరు పంపటమూ; వివాదంలో పండితాభిప్రాయ ప్రాధాన్యం వివరిస్తూ తత్సమాప్త సూచన కావిస్తున్నాయి.

ఇద్దరు కవి పండితుల మధ్య వచ్చిన వివాదం పరిష్కరించటానికి ఒక పండితుణ్ణి కోరటం ఈ వివాద వ్యాస భాగంలో గమనింపవచ్చు. శ్రీపాద–చెళ్ళపిళ్ళ వివాదంలో తీర్పరిగా జయంతి రామయ్య పంతులు కోరబడటం జరిగింది. ఆ తీర్పును జీలుగు రెండు తీర్పుగా శ్రీపాద నిరసించి వ్యాసం ప్రచురించాడు. రామాయణ కల్పవృక్ష విమర్శనం 'విశ్వనాథ-క్రొత్త వివాదం'గా రూపొందించినప్పుడు శ్రీ క్రొత్త సత్యనారాయణ పక్షాన పండిత సభను కోరడాన్ని శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఎగతాళి చేశాడు.

న్యాయస్థానంలోకి సారస్వత వివాదం వ్యాజ్యంగా చేరటం వివాద వ్యాస వాఙ్మయంలో వినూత్న పరిణామం. ఇటువంటివి రెండు ఉపలభ్యంగా ఉన్నాయి.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి - పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి వ్యాజ్యం. శ్రీపాద-చెళ్ళపిళ్ళ వ్యాజ్యం. ఈ రెండింటిలోనూ వివాదం, విషయ పరిధి దాటి, వ్యక్తిగతమైన అవధి దాటి, కుటుంబ వ్యవహారాలు జోడించుకొని నేరంగా రూపొందే స్థితికి పోయింది. ఈ సందర్భంలోనే ''ఇట్లు మా వంశమును బరిహసించుటచేత పుణ్యలోకములలో నున్న మా పూర్వులే వీరికి బుద్ధి చెప్పగలరను దృఢ విశ్వాసముతో నూరకున్నాడను'' (చెళ్ళపిళ్ళ వారి చెరలాటము-శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి-పుట 28) అని బాధపడటమూ జరిగింది. అలాగే "ఏ విధమైన మనోవైషమ్యములుగాని మా తండ్రిగారికిని నాకును లేవు" (సారస్వత విమర్శలు-తిరుపతి వెంకటేశ్వరులు-పుట 123) అనితెలుపుకోవలసిన అవసరమూ కలిగింది.

శ్రీపాద-పెండ్యాల వ్యాజ్యం నిజంగా పరస్పరం నేరమారోపించుకొన్న రెండు వ్యాజ్యాల రూపం. కురుక్షేత్రంలో దాదాపుగా ముగిసిపోయిన భారతం వస్తువై, మహాభారత చరిత్రము పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి వ్రాయగా శ్రీకృష్ణ భారతం శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి వ్రాస్తూ ఉంచగా ఏర్పడ్డ అభిప్రాయ భేదాలతో వివాద వ్యాస కురుక్షేత్రం వీళ్ళిద్దరి మధ్య ప్రారంభమయింది. వజ్రాయుధం పత్రికలో శ్రీపాద విమర్శింపగా, సముదర్శిని పత్రికలో పెండ్యాల ప్రతి విమర్శ వ్రాశాడు. ఈ వ్యాజ్యంలో శ్రీపాద, తన తాతగారి భార్యను, తల్లిని వ్యభిచారులుగా పేర్కొనటం, తన బ్రాహ్మణత్వం కించపరచటం జరిగిందని తెలుపగా, పెండ్యాల తన సత్యసంధత వివరింపగా, న్యాయవాది తీర్పులో ఇద్దరికీ ''20 రూపాయిల జరిమానాగాని, ఒక నెల విడి ఖైదుగాని అనుభవింపవలసినదిగా'' శిక్ష విధించటం జరిగింది.

ఈ వివాదం కంటే శ్రీపాద - చెళ్ళపిళ్ళ వివాదం వ్యాజ్యంగా భిన్న మార్గాలు తొక్కింది. శ్రీపాద చెళ్ళపిళ్ళకు మూడు మాసాలు గురువు. అది అతిశయంతో చెప్పుకొంటున్నట్లు భావించి వాస్తవం తెలుపుకోవాలన్న దృష్టితో చెళ్ళపిళ్ళ వ్యాసాలు వ్రాయగా తన గురుత్వం కించపరుస్తున్నట్లు భావించటంతో వ్యాసం, ప్రతివ్యాసం పెరిగాయి. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి బిరుదాలను చెళ్ళపిళ్ల సహించలేనట్లు కనిపిస్తే, ఈ కవి ఆధిక్యం ఆ కవి భరించలేనట్లు వ్యక్తమయింది. ఇది వ్యాజ్యమయినప్పుడు దాని నుపసంహరింపవలసిందిగా కోరుతూ క్షమాపణ కోరిన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, అది ఉపసంహరింపబడక పోయినప్పుడు

కూడా కొందరు పండితులను ఈ పరిస్థితి వదలలేదు. ఆంధ్రంలో అర్థాను స్వారం, శకటరేఫం వివాద వ్యాస దృష్టికి దోహదం చేశాయి. వేదం వేంకట రాయశాస్త్రి శారదాకాంబిక నాలుగింటిలో మూడు భాగాలలో విక్రమార్క చరిత్ర ముద్రణం, ఆంధ్ర ప్రసన్నరాఘవం శ్రీకాళహస్తి మాహాత్మ్యముద్రణం సంబం ధించిన శబ్దసాధుతాసాధుతలను పరిశీలించాడు. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి మను వసు ప్రకాశికలో శబ్దదృష్టి ప్రసరించాడు. దీపాల పిచ్చయ్య శాస్త్రి శబ్ద సాధుత్వం పట్ల మనస్సు లగ్నం చేశాడు. డా. నేకూరి రామారావు వంటి వాళ్ళు వ్యాకరణ వివాదాలు సాగించటం ఈ దశలో గుర్తింపవచ్చు.

గ్రంథకర్తృత్వం, కవుల అధిక్యం నిర్ణయించటానికి విమర్శనం చేసిన ప్రయత్నాలు వివాద వ్యాస వాఙ్మయ దోహదం కావించాయి. ఆంధ్ర శబ్ద చింతామణి, భాస్కరరామాయణం, ఆముక్తమాల్యదలను రచించిన వ్యక్తి నిర్ణయం పట్ల వివాదం విస్తృతంగా జరిగింది. నన్నయ, నన్నెచోడుడు – వీరిరువురిలో ఎవరు ఆద్యులు అన్న వివాదం, సోమన ఎఱ్ఱనలలో ఎవరు కవితా రంగంలో అధికులు అన్న సమస్య, ఆధునికాంధ్ర వాఙ్మయానికి ఎవరు యుగకర్త అన్న ప్రశ్నలు వివరిస్తూ సాగిన వ్యాసాలు అధికంగా ఉన్నాయి.

గ్రంథ పరిష్కరణం, పత్రికా ప్రకటనం, కావ్య రచనం, తద్విమర్శనం అసందర్భంగా అసహజంగా ఉన్నప్పుడు, ఉన్నా యనుకొన్నప్పుడు వివాద వ్యాస సృజనం జరిగింది. గంద్రకోట కుమారస్వామి శాస్త్రి వ్రాసిన దురాచార ప్రచార విచార జ్ఞాపనమనే పత్రిక వైశ్య తిరస్కారం చూపిస్తుంటే దానిని నంబూరు గోపాలరావు ఖండించటం, సెట్టి లక్ష్మీనరసింహము 'రసికాభిలాష' పరిష్కరించి శ్రీనాథ కృతంగా భావిస్తే, రమా పత్రిక అది శ్రీనాథ కృతం కాదన్న విమర్శనం వచ్చినప్పుడు, శ్రీనాథ కృతమే అంటూ వ్యాసం వ్రాయడం, బేతపూడి భగవంతరావు వ్రాసిన నాటకం 'స్వారోచిష మనుసంభవము' మీద కృష్ణాపత్రిక విమర్శనం ప్రకటింపగా రచయిత 'స్వారోచిష మనుసంభవ నాటక విమర్శన ఖండనము' లిఖించటం, పద్దాది సుబ్బారాయుడు 'విక్రమోర్వ శీయము'ను అనువదిస్తే అది లోపభూయిష్ఠమయినందువల్ల 'మూలకర్తకు కలుగు చెడ్డను తొలగించుటకు' విమర్శనం గొ. రామదాసు ప్రచురించటం, శ్రీకృష్ణ భారతము వ్రాస్తున్న శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రికి ధన సాహాయ్యం కోరి కృతి

భర్తను గౌరవించిన సభాకార్యక్రమాలు తెలుపుతూ దేశమాత పత్రికలో వచ్చిన విమర్శకు, 'దేశమాత పరిదేవనము' నాళము కృష్ణారావు ప్రకటించటం, కట్టమంచి రామలింగారెడ్డి వ్రాసిన విమర్శన గ్రంథం-కవిత్వతత్త్వ విచారము విమర్శిస్తూ కాశూరి వ్యాసమూర్తి కవిత్వతత్త్వ విచారవిమర్శనము వెలువరించటం, శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ విమర్శన గ్రంథం ఆంధ్ర కవయిత్రులు వోలేటి వేంకటరామశాస్త్రి విమర్శించటం, ఈ సందర్భంలో వివాదం, వ్యాస రచనా రీతిని గ్రహించి, గుర్తించటం అవసరమే !

సారస్వత కృషిలో ప్రసిద్ధి పొందిన కవి రచయిత విమర్శకులను సమ కాలికులలో సుప్రసిద్ధ సాహితీ వేత్తలు విమర్శించి వివాద వ్యాస సృష్టి చేశారు. ఇటువంటి వివాదాలకు గురి అయిన ప్రసిద్ధులు పలువురున్నారు. కొందరి నయినా పరికింపవచ్చు.

కందుకూరి వీరేశలింగం పంతులు రచనా జీవితాన్ని కొక్కొండ వేంకట రత్నం పంతులు, వేదము వేంకటరాయశాస్త్రి, దాసు శ్రీరాములు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, రామరాజు శోభనాచలము వంటి ప్రముఖులు విమర్శించారు.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి సాహిత్యాన్ని ప్రధానంగా పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి విమర్శించారు. చిలక మర్తి, వడ్డాది, కాశీభట్ట తన విమర్శకులుగా శ్రీపాద నిర్ణయించుకోవటం పలువురి సాహిత్యం శ్రీపాద అధిక్షేపించటం, అదీ విషయ విస్తృతంగా చేయటం దర్శింపవచ్చు. ఈ సందర్భంలో, ఈ యీ కవులు రచయితలు పండితులు నా శత్రువులని సారస్వత లోకానికి విశదీకరించటం కూడా జరిగింది.

తిరుపతి వేంకట కవులు, ముఖ్యంగా చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి వివాద వ్యాస వాఙ్మయం సృష్టించినంతగా, ఆ సృష్టికి మూల హేతువయినంత మరెవరూ కాలేదేమోననిపించేంత అధికంగా వివాద వ్యాస రచనం జరిగింది. ప్రధాన వివాదాలు శ్రీపాదతోను, కొప్పరపు సోదర కవులతోను, వేంకట రామకృష్ణ కవులతోనూ జరిగాయి. ఈ కవుల బిరుదాలు తృణీకరించాలన్న దృష్టి వివాద వ్యాసాలలో ఎక్కువగా కనిపించింది.

శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ సాహితీ దృక్పథం తిరస్కరించిన వాళ్ళు అనేకులున్నారు. వాళ్ళలో వేలూరి శివరామశాస్త్రి, దేవులపల్లి అచ్యుతరావు, దుర్భా సుబ్రహ్మణ్య శర్మ, నడకుదురు వీరరాజు పంతులు,

సృజన వ్యాసం హృదయ సన్నిహితమై, రచనా ప్రాధాన్యంతో ఉంటే, విమర్శన వ్యాసం బుద్ధి ప్రసిద్ధమై విషయ ప్రాధాన్యంతో ప్రపంచితమయింది. బుద్ధి నిశితత్వం వల్ల విషయ వైశిష్ట్యం పెరిగి, విమర్శన వైపుల్యం కలిగి, రచనా రీతి, శాస్త్ర భాషాధోరణితో సాగింది. విమర్శన వ్యాసంలో వస్త్వాధిక్యం వల్ల వైవిధ్యం పెరిగింది. విమర్శన వ్యాసంలో రచన కంటె వస్తువు విశిష్టంగా గోచరమవుతుంది కాబట్టి వస్తు వైవిధ్యం పరిశీలించటం సంభావ్యం.

తెలుగులో, స్థూలంగా, వ్యాస మంటే సారస్వత విమర్శన మన్న భావం ప్రాచుర్యం పొందింది. దీనికి కారణం విమర్శన వ్యాసాలు సర్వ సాధారణంగా సారస్వత పరిమితంగా వెలువడటమే! సృజన వ్యాసం ప్రసక్తి లేకపోతే, తెలుగులో సాహిత్యాన్య విషయ ప్రచురంగా ఉన్న విమర్శన వ్యాసాలు ప్రాచుర్యంలో కాని, వైశిష్ట్యంలో కాని చాలా తక్కువ.

నాగరకతా వేగం ఎక్కువయి, శాస్త్ర విజ్ఞానంతో పాటు అనేక రంగాలలో మానవ జీవితం మారిపోతూ వుంటే, సాహిత్య ప్రక్రియలు ప్రభావితమయి ఉండవలసింది, వ్యాస సృష్టి జరగవలసింది, కాని అది జరగకుండా ఉండి పోయింది. తెలుగులో వ్రాసే సామర్థ్యం అభీష్టం శాస్త్రవేత్తలకు మేధావులకు తక్కువ కావటం దీనికి ప్రబల హేతువు కావచ్చు. సారస్వతం కంటే భిన్నమయిన విషయ విస్తృతంగా వ్యాస సృష్టి జరిగి, సాహిత్యం సుసంపన్నం కావటం అభిలషణీయం.

తెలుగులో వెలువడ్డ వ్యాసాలు విషయ వైవిధ్యం వల్ల, కావ్యతత్త్వ, కావ్యాత్మ, కావ్యగుణ, కవ్యాత్మ, కావ్య చరిత్ర, జీవిత చరిత్ర, భాషా, అన్య భాషా, అనువాద, పీఠికా, వేదాంత, వైజ్ఞానిక, రాజకీయ, ఆర్థికాది వ్యాసాలుగా వింగడించి పరిశీలింపవచ్చు తెలుగు సారస్వత విషయాలు గ్రహించి ఆంగ్లంలో వ్యాసాలుగా వ్రాసి తెలుగు వ్యాస రచనకు దోహదం చేసిన రచయితల ఆంగ్ల వ్యాసాలు గ్రహించి ఆలోచింపవచ్చు.

తెలుగులో విమర్శనం, విమర్శన వ్యాసం విడమరచి చూడటం కష్టసాధ్యమవుతుంది. విమర్శనం సర్వలక్షణ సంపూర్ణం కాకపోయి విమర్శన వ్యాసంగా రూపొందటంకానీ విమర్శన వ్యాసం గుణవైవిధ్యంతో అధిక్యంతో విషయ విస్తృతత్వంతో శోభించి విమర్శనంగా సిద్ధించటం కానీ సంభవమే

కాబట్టి ఈ రెండింటిని వేరుచేసి పరిశీలించటం వ్యాసలక్షణాలమూలంగా మాత్రమే సాధ్యమవుతూ వుంది.

ఆంగ్ల ప్రభావానికి పూర్వం తెలుగు సారస్వతంలో విమర్శనం అలంకారిక సంప్రదాయసిద్ధంగా, పరిమితంగా ఉంది. వర్తమానాంధ్ర విమర్శన విస్తృతి పూర్వం లేదు. స్థూలంగా పూర్వ విమర్శనం భాషాపరంగా వుంటే, నేటి విమర్శనం భావపరంగా ఉందని భావించవచ్చు. పూర్వం కావ్య రచనకు లక్షణ నిర్దేశం చేయటం కూడా విమర్శనం కాగా ప్రస్తుతం కావ్యంలోని లక్షణాలు ప్రపంచించటం కూడా విమర్శనమే అయింది. పూర్వాపర విమర్శనంలో భాష నుంచి భావానికి, బాహిరత నుంచి అంతపరకు కావ్య శరీరం నుంచి కావ్యాత్మకు పరిణమించిన దశలు గోచరమవుతున్నాయి.

తెలుగు విమర్శన వ్యాసం, విమర్శన లక్షణాలూ వ్యాస గుణాలూ తోడై ఆవిర్భవించింది. పూర్వం సంస్కృతాలంకారిక సంప్రదాయాల మూలంగా ఏర్పడ్డ విమర్శనం, ఆధునిక యుగంలో ఆంగ్ల భాషా సారస్వత సంపర్కంవల్ల కలిగిన విమర్శనం సంగమించిన ఒక ప్రసిద్ధ క్షేత్రం ఆంధ్ర సారస్వతం. తెలుగు విమర్శన వ్యాసం తెలుగు సారస్వత సంబంధిగా అధికంగానూ, అన్యంగా అల్పంగానూ గోచరమవుతూ ఉంది

## 1. కావ్య తత్త్వ వ్యాసం

కావ్య నిర్మాణానికి దోషపరిహరణానికి సర్వకావ్య సామాన్యంగా లక్షణ నిర్దేశం చేయటం, సంస్కృతాలంకారిక సంప్రదాయ ఫలంగా తెలుగులో ప్రాచీన వాఙ్మయగతంగా విమర్శనం కావ్యపరిమితంగా గోచరమవుతూ ఉంది. అయితే ఒక కావ్యంలోని మూలతత్త్వం వివరించి, విపులీకరించి చూపటం, ఆ కావ్యం నిర్మితమైన పునాది విశదీకరించి తెలపటం వంటి విమర్శన రీతి పూర్వం లేదు. స్థూలంగా, ఒక ప్రక్రియకు, ఒక రచనా రీతికి నియమగతంగా, నిబంధనా రూపంగా విమర్శనం తెలుగులో సిద్ధించి ఉంటే, వస్తుగతంగా తత్ప్రత్యేకంగా విమర్శన చేయటం నూత్నంగా సంక్రమించిన కార్య పరిశీలన దృక్పథం.

తెలుగు సాహితీ విమర్శనంలో కావ్య తత్త్వం విశదం చేసే వ్యాసాలు తదితర వ్యాసాలు కంటే విమర్శకుడి సమగ్రదృష్టిని విస్పష్టంగా చూపుతున్నాయి.

ఒక పాత్ర చిత్రణలో కవి చూపిన నైపుణ్యం, ఒక సన్నివేశంలోని సౌందర్యం, ఒక కావ్యంలోని రస నిర్వహణం, ఒక పరిమిత పరిధీ ప్రవర్తకంగా ఉన్న విమర్శనం కంటే ఒక ప్రక్రియాగతంగానో, ఒక తత్త్వ పథంలోనో, ఒక రచనా సంప్రదాయ సంబంధంగానో సాగిన విమర్శనం ఆ వ్యాసకర్త సమగ్ర సాహితీ దృక్పథం వాంఛిస్తుంది.

ఈ విధమయిన విమర్శనం తెలుగు సారస్వతంలో 20వ శతాబ్ది ఆరంభం నుంచీ, ఆంగ్ల ప్రభావం వల్లనే ఏర్పడింది. మొదటి నుంచీ ఈ కోవలోనే విమర్శన వ్యాస రచన జరిగింది. కావ్య తత్త్వం సమగ్రంగా ఆలోచించే దృష్టితో అవతరించిన ప్రసిద్ధ విమర్శనలు, కావ్యతత్త్వం అన్వేషించే వ్యాస సృష్టికి దోహదం కావించాయి.

కట్టమంచి రామలింగారెడ్డి 'కవిత్వతత్త్వ విచారము'లో కవితా నిర్మాణానికి ప్రాథమిక తత్త్వం పరికించి కళాపూర్ణోదయం ప్రభావతీ ప్రద్యుమ్నం పరిశీలిస్తే, కోరాడ రామకృష్ణయ్య ఆంధ్ర భారత కవితా విమర్శనములో ఒక ప్రక్రియ సంపూర్ణ వైశిష్ట్యం సారభూత ధర్మం విశదీకరించారు. భోగరాజు నారాయణ మూర్తి 'ఆంధ్ర కవిత్వ చరిత్రము'లో (1926) కవులు, కవిత్వం, కవితా సంప్రదాయాలు, లాక్షణికులు, కవిత్వ పోషకులను గూర్చి తెలిపితే, పండితశ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులు 'నేటి కాలపు కవిత్వం'లో (1928) భావ కవిత్వానికి భాష్య ప్రాయమైన విమర్శనం సృష్టించారు. శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావు భారతము - తిక్కన రచనలో (1949) భారత తత్త్వాన్వేషణ చేస్తే, శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి 'నాటక విమర్శనము'లో (1949) నాటకోదాహరణ విమర్శనంతో నాటక రచనను గూర్చి తెలిపారు. శ్రీ ముట్నూరి సంగమేశం 'తెలుగు హాస్యం' (1954) లోనూ, మునిమాణిక్యం నరసింహారావు మన హాస్యము (1968) లోనూ తెలుగు సారస్వతంలో హాస్య విమర్శనం కావించారు.

తెలుగులో వచనం పొందిన పరిణామం సవిమర్శకంగా వివరించే శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావు ఆంధ్ర వచన రచనా పరిణామము (1961), శ్రీ నిడదవోలు వేంకటరావు ఆంధ్ర వచన వాఙ్మయ పరిణామము గ్రంథాలు అవతరించాయి. వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రి 'మహాభారత తత్త్వ

కథనము', శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల 'మహాభారత విమర్శనము', శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావు 'నన్నయభట్టు విజ్ఞాన నిరతి' కావ్యతత్త్వం వివరించే విమర్శన గ్రంథాలు.

ఒక కాలంలోని సాహితీ స్థితిని వివరించే విమర్శన గ్రంథాలు. ఈ కోవలో వ్యాస రచనకు దోహదం చేశాయి. ఒక ప్రక్రియాగతంగానూ, ఒక సంప్రదాయ ప్రసిద్ధంగానూ, ఒక ప్రాంతపు కవుల రచనా పరిశీలనంగానూ, ఒక కావ్య భర్త, ఒక రాజవంశం వెలువరింపజేసిన సాహిత్య విపులీకరణం గానూ, రచనా సంప్రదాయంలోని సామూహిక ధర్మ పరిశోధనంగానూ తెలుగులో విమర్శనలు ఆవిర్భవించాయి. ఈ మూలతత్త్వం, సమగ్ర దృక్పథం, విశాల పరిశీలన అభివ్యక్తం చేసే విమర్శన గ్రంథాలు హేతువులై తెలుగులో కావ్యతత్త్వ విమర్శన వ్యాస సృష్టికి అవకాశం కలిగించాయి. ఈ గుణాలు పరిమిత పరిధిలో సంతరించుకొని అవతరించిన వ్యాసాలు పరికింపవచ్చు.

ఒక కోవలోని విమర్శకులు సాధారణంగా రచనా సంప్రదాయంలోని మూలతత్త్వం పరిశీలించే దృష్టి కలిగి ఉండటం సహజమే. ఆ దృష్టి వాళ్ళ విమర్శన వాఙ్మయాన్ని అనుశాసిస్తూ ఉంది. కొందరు విమర్శకులు భిన్నరీతుల్లో విమర్శనం సాగించటం సముచితమే. అటువంటివాళ్ల విమర్శవ్యాసాలలో ఈ తెగ రచనలున్నాయి. కొందరు ఈ విధమైన వ్యాసాలు కొన్ని మాత్రమే వ్రాయటం పరికించవచ్చు. ప్రసిద్ధ రచయితలనూ, వ్యాసాలనూ గ్రహించి, కావ్యతత్త్వ విమర్శన వ్యాససృష్టి సాధించిన వ్యాసపరిణామం గమనింపవచ్చు.

## 1. కోరాడ రామకృష్ణయ్య (1891-1962)

కోరాడ రామకృష్ణయ్య జీవితమంతా అధ్యాపక వృత్తి, పరిశోధన కృషి రెండు నేత్రాలై ప్రకాశించింది. పరిశోధన భాషను, సారస్వతాన్ని వెలిగించింది. ఈ రచయిత విమర్శన వ్యాససృష్టి భాషా సారస్వత రంగాలలో తద్రీతిలో ఆద్యుపశలోని ప్రధానం, ఉత్తమం అయిన కృషిని విశదం చేస్తూ ఉంది.

కోరాడ రామకృష్ణయ్య వ్యాససృష్టిని ప్రధానంగా భాషావ్యాసాలు, సారస్వత వ్యాసాలు, ఆకాశవాణి ప్రసంగవ్యాసాలుగా మూడు పాయలుగా పరికింపవచ్చు. ఈ త్రివేణీ సంగమం స్థూలంగా కావ్యతత్త్వ ప్రదర్శకంగా ఉంది. తెలుగు సారస్వతంలో ఆద్యదశ విమర్శకులలో ఈ వ్యాసకర్త స్థానం స్థిరం.

భాషావ్యాసాలు: తెలుగు భాష ద్రావిడ భాషా కుటుంబానికి చెందినదని ఆంగ్లేయులు భావించడం, కాల్డ్వెల్ ఆ విషయం విస్పష్టం కావించటం ఆంగ్లంలో జరిగితే తెలుగులో ఈ భాషా దృష్టి వ్యాసగతంగా వెలువరించిన తొలి విమర్శ కులలో కోరాడ రామకృష్ణయ్యకు ప్రాధాన్యం వుంది.

'ద్రావిడ భాషాతత్త్వము' అనే వ్యాసం (1921) విజయనగరం మహా రాజా కళాశాలా పత్రికలో ప్రకటించి, పెంచి, భాషోత్పత్తి క్రమము-భాషాచరి తము అనే విశిష్ట వ్యాసంగా (1926) ప్రకటించటం జరిగింది. ఇది ప్రచురణకు పూర్వం ఆంధ్ర సాహిత్య పరిషత్తు తణుకు సమావేశంలో ఉపన్యాసంగా చదువ బడింది. భాష పుట్టుక, తద్వికాసం స్థూలంగా వివరిస్తూ ఉందీ వ్యాసం. ఈ భాషా దృష్టివల్ల 'నన్నయకుఁ బూర్వమాంధ్ర వాఙ్మయ స్థితి'ని పరిశీలించడం జరిగింది.

ఈ భాషా పరిశోధనలో భాగంగా తెలుగుభాషలో సంధి వైశిష్ట్యం దర్శిం చటం జరిగింది. ఈ పరిశీలనం సమగ్ర విమర్శనంగా భావింపదగ్గ ఉన్నత పథ కంతో ఒప్పుతూ ఉంది. ఈ సాహితీవేత్త రచనా వ్యాసంగంలో విశిష్టదృష్టిగా దేశి గోచరమవుతూ వుంది. తెలుగు సాహిత్యంలోనే కాదు, జీవితంలోనూ ద్యోత మయ్యే మార్గదేశి సంప్రదాయాలలో వ్యాసకర్తకు దేశిరీతిమీద ఉన్న అభిమానం అభినివేశం తెలుపుతూ 'దక్షిణదేశ భాషా సారస్వతములు-దేశి'గ్రంథం ఉంది. ఇది ఆరు వ్యాసాల సంపుటిగా భావింపదగి ఉంది. తెలుగు భాషకు, సాహిత్యానికి పథప్రదర్శకంగా ఉన్న దేశితత్త్వం విశిష్టంగా ఇందులో వివేచించటం జరిగింది. ఈ భాషా వ్యాసాలు రచయితను ఆంధ్ర భాషాశాస్త్రవేత్తగా విశిష్టం స్థానంలో నిలుపుతున్నాయి.

సారస్వత వ్యాసాలు: 'ఆంధ్రభారత కవితావిమర్శనము' ప్రఖ్యాత విమ ర్శన గ్రంథం. 'సారస్వత వ్యాసములు' సుప్రసిద్ధ వ్యాస సంపుటి. ఇందులో ఆంధ్ర వాఙ్మయం యుగాలుగా విభజించి, చారిత్రకంగా పరిశీలించి, ఎఱ్ఱా ప్రగ్గడ భారతం ఆంధ్రీకరించిన రీతి విశదీకరించి, సారస్వతంలో జాతి జీవితం ఏ విధంగా ప్రతిబింబిస్తుందో వివరించిన వ్యాసాలుతోపాటు విమర్శనం, విమ ర్శకుడు ఉన్నతీరు, ఉండవలసిన రీతి విపులీకరించిన వ్యాసంకూడా ఉంది.

అంతేకాక, కౌంట్ ఆఫ్ మౌంట్ క్రిస్టోకు కథామాత్రానువాదంగా ఉన్న 'యుగంధర విజయము' అన్న నవల ఆధారంగా అధునికానువాద ప్రక్రియపైన

వ్యాసకర్త కున్న అభిప్రాయాలు విశదమవుతున్నాయి. సారస్వత వ్యాసాలు తత్త్వదృష్టిని విశదీకరించే పరిధిని అతిక్రమించలేవు. ఈ వ్యాసాలలో వ్యాస కర్త బుద్ధి నైశిత్యం, వైశిష్ట్యం గోచర మవుతున్నాయి.

ఆకాశవాణి ప్రసంగ వ్యాసాలు : ఇవి భిన్న విషయ విన్యస్తాలుగా ఉన్నాయి. సాహిత్యంలో సాంఘిక జీవితం దర్శించటం జరిగింది. సారస్వతం, భాష రెండింటి సమ్మేళనం గోచరమవుతూ ఉంది. సంస్కృతం తమిళం రెండూ పరిశీలన పొందాయి. హాస్య రసమూ తత్త్వశాస్త్రమూ ఈ వ్యాసాలలో సమాదరణ పొందాయి. ప్రథమాంధ్ర కవితా శిల్పిగా నన్నయ భట్టూ, ఆధునికాంధ్ర సాహిత్య మార్గదర్శిగా వీరేశలింగం పంతులూ పరిశీలన పొందారు. తాళపత్ర గ్రంథాన్వేషణం, నౌకాయానం వంటి అనేకాంశాలు ప్రసంగ వ్యాసాలుగా ఉన్నాయి.

ప్రసంగ వ్యాసం విస్తృతిలోనూ, ప్రయోజనంలోనూ, ప్రయోగంలోనూ, రచనా పద్ధతిలోనూ పరిమితంగా ఉంది. ఉపన్యాసం, వ్యాసం రచించటం కంటే భిన్నంగా రెండింటి గుణఫలితంగా సమ్మేళనంగా ఉన్న రచనారీతి ప్రసంగవ్యాసం.

ఈ వ్యాసకర్త వ్యాసరచన త్రిగుణీకృతంగా భాషా, సారస్వత, ప్రసంగ వ్యాసరీతిగా సాగింది. స్థూలంగా భాషా వ్యాసాలలో వివరణ నైపుణ్యం, సారస్వత వ్యాసాలలో విమర్శన సామర్థ్యం, ప్రసంగ వ్యాసాలలో విశదీకరణ వైశిష్ట్యం గోచరమవుతున్నాయి. కోరాడ రామకృష్ణయ్య సారస్వతాంతర్వాహినిగా తొణకని బుద్ధి హృదయాల ప్రశాంతత విస్పష్టంగా గమనార్హంగా ఉంది.

రచనలో స్పష్టత రచయిత ప్రధాన లాంఛ. శాస్త్రవిషయం విశదంగా వివరించటంలో వ్యాసకర్త దీక్ష వుంది. అందువల్ల భాష సరళ సుందరంగా రూపొందింది. స్పష్టతకోసం, వ్యాసం, విస్తృతంగా ఆవిర్భవించటం, వివరణ కోసం విశాలం కావటం, పరికింపవచ్చు.

భాషా శాస్త్రవేత్తగా వ్యాకరణ దృష్టి విశాలం కావించుకొన్న వ్యాకర్త రచనలు ప్రారంభంలో గ్రాంథిక భాషాపరిధిలోనూ, అనంతరం వ్యావహారిక భాషా రూపంతోనూ కనిపించాయి. ఆకాశవాణి ప్రసంగ వ్యాసాలు సంపుటిగా ఇప్పుడు ముద్రణ పొందుతున్నాయి ఈ భాషాదృష్టి ప్రదర్శించాయి.

కళాశాల విద్యార్థులకు, భాషా సారస్వత విద్యార్థులకు, పండితులకు పాఠ్యభాగాలుగా, పరిశీలన గ్రంథాలుగా పఠన గ్రంథాలుగా అర్ధ శతాబ్ది నుంచి ఉపయోగపడుతున్న ఈ వ్యాస ప్రాచుర్యం గణనీయమయింది. భాషా సారస్వత పరిశోధన విమర్శనలతో ఈ వ్యాసాల దృష్టి అత్యవసరంగా పరిశీలింపబడుతూ ఉంది. తెలుగు భాషా శాస్త్ర దృక్పథం వివరించటంలో ఆంగ్ల మార్గంలోని నూత్న విమర్శన రీతిని తెలుగులో ప్రవేశపెట్టటంలో కృషి చేసిన రామకృష్ణయ్య వ్యాస సృష్టి ఆద్యదశాప్రదర్శకమై, చారిత్రాత్మకంగా ఉంది.

## 2. దువ్వూరి రామిరెడ్డి

దువ్వూరి రామిరెడ్డి రచనా వ్యాసంగంలో కావ్య సృష్టి ప్రధాన భాగం, వ్యాస రచన ద్వితీయ స్థానమే పొందుతుంది. ఈ కవి వ్రాసిన సారస్వత వ్యాసములు, డైరీ ఉత్తరాల సంకలనాలు వ్యాసాలే. కవిగా ప్రసిద్ధి పొందిన దువ్వూరి రామిరెడ్డి మేధావిగా ఈ వ్యాస సృష్టి వల్ల ప్రఖ్యాతి పొందాడు. సారస్వత వ్యాసాలు మొదట 'కళ' (1923)లో ప్రకటితమయ్యాయి. గ్రంథంగా (1935) అనంతరం ప్రచురితమయ్యాయి. అనంతరం ఆకాశవాణి, ఉదయిని మూలంగా వెలుగు చూచిన వ్యాసాలుకూడా ఈ సంపుటిలో చేర్చటం జరిగింది.

ఈ వ్యాసాలు కవిత్వ మూలధర్మ పరిశీలన శోభితాలుగా ఉన్నాయి. వ్యాసకర్త కవితాపరిధి పరిశోధనగా సాగించి సృజనాత్మకంగా వెలయించి, విమర్శన గుణం విశిష్టంగా ఈ వ్యాసాలలో నిలిపాడు. రస చర్చలో సౌమనస్యం, కవితా ప్రయోజనం పరిశీలనంలో సత్య దృష్టి, నాటక కళా సంస్కరణంలో అభ్యుదయ దృక్పథం గోచరమవుతున్నాయి. అల్లసాని పెద్దన తత్కాల భావ ప్రతినిధిగా వ్యాసకర్త భావించాడు.

ప్రాచీన సారస్వత మూల ధర్మ విశ్లేషణతో పాటు, మారుతున్న కవితా ధోరణులు తెలుగు సారస్వతంలో కలిగించిన పరిణామం పరికించి, అభినవాంధ్ర సాహిత్యం పరిశీలించి, ఈ రెండు రచనా సంప్రదాయాలలోని రమ్యత వైచిత్రి దర్శించి వ్యాస సృష్టి కావించాడు దువ్వూరి రామిరెడ్డి.

'కవి కోకిల డైరీ ఉత్తరాలు' పేరిట ప్రచురితమయిన సంపుటి వ్యాస స్థానంలో నిలుస్తుంది. దిన చర్యలకు, లేఖలకు ప్రాధాన్యం ఇచ్చి పరికిసే అవి

సారస్వతాభిప్రాయాలుగా విమర్శన గుణ సంభరితాలుగా గోచరమవుతాయి. అందువల్ల ఈ సంపుటి వ్యాస సంకలనంగా గ్రహించటం సముచితం.

దువ్వూరి రామిరెడ్డి వ్యాసాలు పరిమితంగా కాక విస్తృత పరిధీ విలసితాలయి వ్యాస ధర్మ ప్రరోచనం కావించటం స్పష్టమవుతూ వుంది. ఈ వ్యాసాలు ఆరంభంలో గ్రాంథిక భాషా రూపం పొందినా క్రమక్రమంగా వ్యావహారిక భాషా రూపాలు గ్రహిస్తూ చివరకు 'సాహిత్యంలో వైచిత్రి' వ్యాసం పూర్తిగా వ్యావహారికంగా వుంది.

కావ్య తత్త్వ విమర్శనం నిక్షిప్తం చేసుకొన్న ఈ వ్యాసాలు కొంత వరకు సృజన గుణ శోభితాలు ఉన్నాయి. ఈ వ్యాస రచనకు ప్రధాన దృష్టి విషయ వివరణం కావటం వల్ల ఆనందం కలిగినా అవి సృజన వ్యాసాలుగాక విమర్శన వ్యాసాలుగానే పరిగణించటం కుదురుతుంది. వ్యాసకర్త వ్యక్తిత్వం, పాఠకమైత్రి అల్పంగా వ్యాసగతంగా గోచరమయినా, ఇవి ప్రాథమికంగా విమర్శన వ్యాసాలు.

ప్రాచీనాధునిక భాషా కవితల రామణీయకం భావించిన వ్యాస సృష్టి కావించిన మేధావి దువ్వూరి రామిరెడ్డి. కవిత్వం, విమర్శనం రెండు చేతులతో, బుద్ధి హృదయాల సంగమ క్షేత్రంలో పండించిన కృషీవలుడీ వ్యాసకర్త. కవితా వచనంలో స్పాష్ట్యం వాంఛించి, వ్యాస రచనా రీతిలో నూత్న ధోరణిని ప్రారంభించి రచయిత వ్యాస సృష్టి సమస్తం కవితా రంగ పరిమితంగా గోచరమవుతూ ఉంది. కవిత్వ తత్త్వ బోధకంగా ఈ వ్యాసాలు విశిష్ట గుణ విలసితాలు.

## 3. పిల్లలమర్రి వేంకట హనుమంతరావు (1918-1970)

నవ్యాంధ్ర సాహిత్య వీధులలో కురుగంటి సీతారామయ్యకు సహ రచయితగా ప్రసిద్ధి పొందిన పిల్లలమర్రి వేంకట హనుమంతరావు ఆంధ్రోపన్యాసక పదవి నిర్వహించి, వ్యాసకర్తగా వక్తగా తెలుగు దేశంలో సుప్రసిద్ధి వహించాడు. ఈ రచయిత వ్యాస సృష్టి 'సాహిత్య సమాలోచనము', 'సాహిత్య సమీక్ష', 'మాధురీ మహిమ', 'సాహిత్య సంపద', 'ఇష్టాగోష్ఠి'

అయిదు సంపుటాలుగా ఉంది. ఈ వ్యాసాలు కావ్యతత్త్వ ప్రదర్శకంగా, కావ్య గుణ విపులీకరణంగా, సాంఘిక ధర్మ ప్రబోధంగా ఉన్నాయి. వ్యాస రచనం 1937 నుంచి ఆరంభమై సాగుతూ వచ్చింది. ఇవి అనేక విశ్వ విద్యాలయాల పాఠ్యభాగాలు అయ్యాయి. వ్యాసకర్తను విమర్శక స్థానంలో నిలిపి ప్రఖ్యాతిని ఆర్జించాయి.

కావ్యతత్త్వ వ్యాసాలు: ఈ కోవలో వ్యాస రచన చేయటం రచయిత ప్రధాన గుణం. ప్రసిద్ధ సామర్థ్యం. 'సాహిత్య సమాలోచనము', 'సాహిత్య సమీక్ష' ఈ ధోరణితో ఒప్పుతున్న వ్యాస సంపుటాలు. 'సాహిత్య సమాలోచనము' సాహిత్యం, కవి, విమర్శకుడు వంటి విషయాలు సూత్రప్రాయంగా వివరించేది. పద కవిత, ప్రబంధం, వచనం, రూపకం మొదలైన ప్రక్రియా స్వరూపం తెలిపేది, సాహిత్యం, తదర్చనం పొందిన పరిణామం ప్రదర్శించేదిగా ఉంది. 'సాహిత్య సమీక్ష' సాహిత్యపు నిర్వచనం, చిత్రణం, అమృతత్వం తెలిపి, సాహిత్యంలో ప్రచార ప్రబోధాలు వివరించి, సాహిత్యంలో మానవత్వం, జాతీయత, ఆదర్శతత్వం, శృంగారం విపులీకరించిన వ్యాసాల సంపుటి.

ఈ రెండు వ్యాస సంకలనాలు సాహిత్య మూలధర్మాలు ప్రక్రియాగతంగా, విషయగతంగా చేసిన పరిశీలనను తెలుపుతున్నాయి. భిన్నకోణాల నుండి సాహిత్య పరామర్శ చేయటం విశదంగా గోచరమవుతూ వుంది. మౌలికం, సైద్ధాంతికం అయిన సాహిత్య చర్చ ఈ వ్యాస రచనకు పునాది.

కావ్య పాత్ర విమర్శన వ్యాసాలు: ప్రాచీనాధునిక కావ్యాలలోని రమణీయ సన్నివేశాలు, రసభరితంగా ఆలోచించి వ్రాసిన వ్యాసాలు 'మాధురీ మహిమ', 'సాహిత్య సంపద' సంపుటాలలో దర్శింపవచ్చు. ఉత్తర గోగ్రహణములోని కవితా సౌందర్యం, 'రాధామాధవము'లోని దాంపత్య దీప్తి, శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యం తెలిపే కన్నప్ప కథలోని భక్తితత్పరత, ప్రాచీన కావ్య సన్నివేశ సౌందర్య సందర్శనంగా సూరన-కలభాషిణి జన్మాంతర వృత్తాంతం, పెద్దన-వరూథిని అస్థాన పతితప్రేమ జీవిత సమారాధనం, శ్రీనాథ రామకృష్ణుల గుణనిధి నిగమశర్మల తల్లి అక్కల తారతమ్య పరిశీలనం, తిమ్మన-సత్యభామ సరసతా జీవిత పరాకాష్ఠ ప్రదర్శనం, పాపరాజు జానకి కరుణ

రసాధి దేవతాస్థితి నిరూపణం, ప్రాచీన కావ్య పాత్ర చిత్రణ వివరణంగానూ, మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి 'పంచవటి'లో భార్యా వియోగ దుఃఖ ప్రకటనం, గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి 'కుంతి'లో సత్య దృష్టి, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి 'దక్షారామము'లో క్షేత్రమహాత్మ్యం, తుమ్మల సీతారామమూర్తి 'ఆత్మార్పణము' లోని రచనా నైపుణ్యం, వేటూరి చంద్రశేఖర కవి 'కాంచనమాల' నాటకంలో కాంచన కుణాల ప్రణయ వృత్తాంతం, ఆధునిక కావ్య సౌందర్య పరామర్శగానూ, సి. ఆర్. రెడ్డి 'ముసలమ్మ మరణము' కావ్యస్థానం, రాయప్రోలు సుబ్బారావు 'స్నేహలత' కుటుంబం కోసం చేసిన ప్రాణత్యాగం, గంటి జోగి సోమయాజి 'రామచంద్రుని హంపీ యాత్ర'లో హంపి వర్ణనం, విశ్వనాథ 'కిన్నెరసాని'లో నిక్షిప్తంచేసిన అందాలు, జాషువా 'ముంతాజి సౌందర్యం' ఆధునిక కావ్యగత పాత్రచిత్రణ సంభావనగానూ; మాలవికాగ్నిమిత్రములో విదూషక పాత్ర, విక్రమోర్వశీయములో ఊర్వశీ పురూరవుల ప్రణయం, ప్రియదర్శికలో ఆరణ్యక వత్సరాజుల అనురాగాతిశయం నాటక గత పాత్ర సృష్టి నైపుణ్య ప్రకటనంగానూ; అనేక వ్యాసాలు వ్రాసి ప్రకటించాడు.

ఈ వ్యాసాలలో రచయిత రచనా ప్రణాళిక సక్రమాలోచన నుంచి ఆవిర్భవించినట్లు స్పష్టమవుతూ ఉంది. సన్నివేశం స్పృశించటంలో, పాత్రను పరామర్శించటంలో రచయిత నైపుణ్యం వ్యక్తమవుతూ ఉంది. కావ్య తత్త్వంతో పాటు, సన్నివేశ పాత్రగతంగా ఆలోచించటమేకాక, సాంఘిక విషయాలుకూడా వ్యాసాలుగా రూపొందించటం గమనింపవచ్చు.

సాంఘిక వ్యాసాలు : ఆంధ్ర ప్రదేశ్ అవతరించటం ఆంధ్రులు క్రియా సాధకులు కావాలన్న ఆసక్తిని రేకెత్తించిందనీ, ఆర్థికంగా వైజ్ఞానికంగా దేశం ముందడుగు వేయాలనీ, ధర్మం సుప్రతిష్ఠితం కావాలని, మనిషి మానవత్వం పెంచుకోవాలనీ, పుస్తక విక్రయ విధానం అభివృద్ధి పొందాలనీ, పత్రికలు పోషింపబడాలనీ, ప్రజాసేవ చేయాలనీ, సినీమావల్ల జాతి జీవితంలో అభ్యుదయం చేకూరాలనీ, సంస్కృతం మీద భారతీయత ఆధారపడి వుందనీ, అధ్యాపక - విద్యార్థి సంబంధం మెరుగుపరచాలనీ, విద్యావసరం స్పష్టంగా గుర్తింపబడాలనీ రచయిత వాంఛలు 'ఇష్టాగోష్ఠి' వ్యాస సంపుటిలో గోచరమవుతున్నాయి.

ఈ రచయిత వ్యాస సృష్టిలో విమర్శన సృజన వ్యాసాలు గోచరమవుతున్నాయి. విమర్శనంలో విషయం మూలసిద్ధాంత పరామర్శ నుంచి ఆధునిక వాఙ్మయ సౌందర్య దర్శనం దాకా సాగింది. ప్రాచీనాధునిక కావ్య నాటక పరిశీలనం జరిగింది. సాంఘిక వ్యాసాలు సృజన ధర్మ శోభతో ఉన్నాయి. ఈ వ్యాస భాష గ్రాంథిక వ్యావహారిక ధోరణులు ప్రదర్శిస్తూ వుంది. సారస్వత వ్యాసాలలో గ్రాంథికం, సాంఘిక వ్యాసాలలో వ్యావహారికం గోచరమవుతూ వుంది. భిన్న విషయాలు, భిన్నరచనా రీతులు, భిన్న భాషా ధోరణులు కలిగి వెలువడ్డ పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు వ్యాసాలు విమర్శన సృజనవ్యాస నిర్మాణంలో మెలకువలు గుర్తెరిగాయి. వచనం శాస్త్ర వచనంగా ప్రారంభంలో ఉన్నప్పటికీ క్రమక్రమంగా పఠన యోగ్యత పెంచుకొంది. స్పష్టత రచనంలో కంటే విషయ విభజనంలో ఉంది. తెలుగు వ్యాస వాఙ్మయ పరిమాణానికి దోహదం చేసిన ఆధునికులలో ఈ వ్యాసకర్త స్థానం స్థిరంగా ఉంది.

## 4. జి. వి. కృష్ణరావు

జి.వి. కృష్ణరావు మేధావి వర్గంలో పేర్కొదగ్గ మనీషి. ఈ రచయిత 'నవతోరణం' వ్యాస సంపుటి. 'జేగంటలు' ప్లేటో, కాంటేల అభిప్రాయ ప్రశంస. 'కావ్య జగత్తు' రస నిర్వచనం కోసం ప్రయత్నించిన వ్యాసం. విమర్శనం, తత్త్వగ్రంథ, నాటక, నవలాది రచనం ఈ వ్యాసకర్త జీవిత కృషిగా కనిపిస్తున్నాయి. కళాశాలాంధ్రోపన్యాస వృత్తిని, ఆకాశవాణిలో ప్రొడ్యూసరు పదవిని నిర్వహించిన తెలుగు సారస్వత జీవి జి.వి. కృష్ణారావు.

నవతోరణంలో నవ పద అర్థవంతం. ఈ తొమ్మిది వ్యాసాలూ పత్రికలలో ఆకాశవాణిలో కనిపించి, వినిపించి గ్రంథ రూపం పొందాయి. వ్యాకరణం మీది వ్యాసం తప్ప మిగతా వ్యాసాలన్నీ సాహిత్య సంబంధంగా ఉన్నాయి. విజయవిలాసం - హృదయోల్లాసవ్యాఖ్యను ఛందశ్శిల్ప గ్రంథాన్ని సమీక్షించటం కూడా పరికింపవచ్చు. జేగంటలులో ప్లేటో కళ, జ్ఞానం, ఆత్మ, ఆదర్శం వంటి భిన్న విషయాలు మీద వెలువరించిన అభిప్రాయాలు, కాంటే పరతత్త్వ వాదం ధర్మ రామణీయక స్వరూపాలు పట్ల ప్రకటించిన దృష్టి సవిమర్శకంగా ఉన్నాయి. కావ్య జగత్తు వ్యాసం పరిమిత పరిధినుంచి పరిశోధన గుణం ప్రద

ర్శిస్తూ ఉంది. రచయిత వ్యక్తిత్వం మృగ్యమయి ఉంటే ఇది వ్యాసం కాకుండా పోయేది. "ఈ క్రొత్త పంథాలో రసాన్ని నిర్వచించటమే నా విశిష్టత" అని తన అభిమతం ప్రకటిస్తూ "నేటి పాఠకుడికి సంతోష భిన్నమై ఆనంద మిచ్చేదే కావ్యం" (పుట 75) అని తెలపటం గమనించవచ్చు.

వ్యాసభాష అధికంగా వ్యావహారికం. రచయిత బుద్ధికి ఈ వ్యాసాలలో చోటు ఎక్కువగా ఉంది. సంస్కృతాంధ్రాంగ్ల భాషా పరిచయం నుంచి పుంజు కొన్న ఆలోచనలతో ఒప్పే ఈ వ్యాసాలు ఉత్తమ విమర్శనకు నిదర్శనంగా ఉన్నాయి.

## 5. శ్రీ విన్నకోట మాధవరావు

శ్రీ విన్నకోట మాధవరావు వ్యాస సంకలనాలు 'కావ్యరీతులు', 'కావ్యాలోకన', 'కావ్య శిల్పము' కావ్యతత్త్వ విమర్శన వ్యాసాలతో ఒప్పుతున్నాయి. కావ్య గుణాలు తెలిపి కావ్యానుశీలనం చేయటం వ్యాసకర్త దృష్టి. 'కావ్య శిల్పము'లో కవి, కవిత్వం, కావ్యం వంటి 13 అంశాలు కావ్యతత్త్వం గుర్తించే ధోరణిలో పరిశీలనం పొందాయి. 'కావ్యాలోకన'లో కావ్య పాత్ర ప్రయోజనం, చిత్రణం పట్ల ఉంచవలసిన దృష్టి వివరించి, తిక్కన, పెద్దన, సూరనల ప్రతిభను గుర్తించి, సంస్కృతాంగ్ల కవితా నిర్వచన పరామర్శ చేయటం జరిగింది.

'కావ్యరీతులు' ప్రబంధ వాఙ్మయ పరిణామ ప్రవర్శకంగా ఉంది ఆంధ్రసారస్వతంలో స్వర్ణయుగంగా భావింపబడే శ్రీకృష్ణదేవరాయల కాలంలో అవతరించిన ప్రబంధాలనూ, తత్పూర్వరంగాన్నీ, ఆనాటి ఇతర కవులనూ గూర్చిన వ్యాసాలు 11 ఉన్నాయి.

శ్రీ విన్నకోట మాధవరావు సాహితీ వ్యాసంగం ఈ సంపుటాల మూలంగా కావ్య పరిమితంగా గోచరమవుతూ ఉంది. కావ్య జీవితం అన్ని దిక్కులనుంచి అవలోడనం చేశాడు. కావ్య సృష్టికి మూలమైన ధర్మాలు పరిశీలించటంతోపాటు కావ్యానుశీలనం చేయటం కూడా విశదంగా ఉంది. ఈ వ్యాస భాష గ్రాంథికంగా ఉంది. స్పష్టత సారళ్యం వాంఛించిన ఈ రచయిత వ్యాసాలు ఆంధ్ర సారస్వత విమర్శన స్థాయిని పెంచేవిగా ఉన్నాయి.

## 6. శ్రీ ఆర్. యస్. సుదర్శనం

వర్తమానాంధ్ర విమర్శకులలో భారతికి వ్యాస సుమాలు సమర్పించే శ్రీ ఆర్. యస్. సుందర్శనం ప్రధానంగా ప్రక్రియతత్త్వంపట్ల దృష్టి ఉంచటం పరికింపవచ్చు. 'సాహిత్యంలో దృక్పథాలు', 'సమాజము - సాహిత్యము' రెండు వ్యాస సంపుటాలు. ఈ వ్యాసాలలో వ్యాసకర్త, రచయిత రచనా ప్రేరణకు, రచనకు మూలహేతువు గ్రహించటానికీ, విశదీకరించటానికీ చేసిన పయత్నం వుంది.

సాహిత్యంలో సామాజికంగా ఉన్న చైతన్యం ఏ విధంగా ప్రతిబిం బిస్తుందో, ఆంధ్ర దేశం మీద ఆంగ్ల సాహిత్యం నుంచి వచ్చిన కాల్పనికవాదం ఎటువంటి ప్రభావం చూపిందో, సాహిత్యంలో విప్లవస్థానం విధానం ఏమిటో, ఆధునిక రచనా జీవితంలో మానవత్వ స్థితి ఏమిటో వివరించే వ్యాసాలు రచనా కృషికి ఉన్న పూర్వ రంగం ప్రదర్శిస్తున్నాయి.

ఈ వ్యాసకర్త రచనా యత్నం అంతా నవలా ప్రక్రియగతంగా ఉంది. తెలుగులోని ఉత్తమ నవలలు సమగ్రంగా నూత్న కోణం నుంచి చేసిన పరిశీల నలో కనిపిస్తున్నాయి. నవల సాహిత్య ప్రక్రియగా పొందిన స్థానం, కలిగిం చిన సామాజిక పరిణామం, నిక్షిప్తం చేసుకొన్న పాత్ర సృష్టి విషయంలో స్పష్టంగా ఆలోచించి, చివరకు మిగిలేది, అల్పజీవి, మాలపల్లి, విశ్వనాథ నవలలు, గోపీచంద్ నవలలు, అమీనా సవిమర్శకంగా పరిశీలించాడు శ్రీ సుద ర్శనం. మనుచరిత్ర కాని, కన్యాశుల్కం గాని స్పృశించినా, ఈ రచయిత ప్రధా నంగా నవలా సృష్టికే క్రొత్త కాంతులు కలిగించాడు. ఆంగ్ల విద్య తదాలోచ నలు ఆంధ్ర విమర్శనంలో పరిపక్వంగా ఈ వ్యాసగతంగా గోచరమవుతున్నాయి. శ్రీ ఆర్. యస్. సుదర్శనం వ్యాసాలు తెలుగు విమర్శన వాఙ్మయంలో నూత్న దృక్పథం ప్రదర్శిస్తున్నాయి.

## 7. ఇతర వ్యాసకర్తలు

కావ్యతత్త్వం విమర్శించే వ్యాస సృష్టిలో పరిశోధన దృష్టి కూడా ఉండ వచ్చు. అయితే అది అధికంగా ఉన్న రచయితల వ్యాసంగాన్నీ, జానపద వాఙ్మయ తత్త్వం తెలిలిపిన వ్యాసకర్తల కృషినీ పరికించి, మిగతా వ్యాస

కర్తల సాహితీ సేవను సంభావించడం సముచితంగా ఉంటుంది పరిశోధన గుణం, విమర్శనంలో కావ్యతత్త్వం గ్రహించేటప్పుడు, చొప్పించిన వాళ్ళు ప్రధానంగా ఇద్దరున్నారు.

*జయంతి రామయ్య పంతులు* (1860-1941) : ఆధునికాంధ్ర వాఙ్మయ వికాస వైఖరి (1934) సంపుటిలోనివి ఆద్యంగా ఉపన్యాసాలు, అనంతరంగా వ్యాసాలు. ఇందులో ఒక్కొక్క భాగం ఒక్కొక్క అధ్యాయంగా ఉంది. అన్ని అధ్యాయాలు వ్యాసాలే. ప్రాచీన కవిత్వం, నాటకం, కథ, నిఘంటువు, వార్తా పత్రికల పరిస్థితి, కృతి విమర్శనం, భావకవిత్వం, గ్రామ్య వాద విమర్శనం ప్రధానంగా ఉన్నాయి. అనేక గ్రంథాలకు పీఠికలుగా, ఆంధ్రసారస్వత పరిషత్పత్రికలో వ్యాసాలుగా ఈ రచయిత సారస్వత కృషి వుంది. భావకవిత్వం, వ్యావహారిక భాషలను తిరస్కరింప వచ్చునన్న భావం రచయితకుంది. ప్రభుత్వోద్యోగిగా, సాహితీ వేత్తగా తన జీవిత కాలంలో అత్యున్నత స్థితిని పొందిన వ్యక్తి జయంతి రామయ్య పంతులు. శాసన పరిశోధన ప్రధానంగా నిర్వహించిన మనీషి. ప్రాచీనత మీద అభిమానం, ఆధునికత మీద సంశయం ఈ రచయితకు ఎక్కువ. ఈ మేధావి ఆలోచనలు నాటికి సముచితంగా, నేటికి ఒక దృక్పథంగా గోచరమవుతున్నాయి. విమర్శన వ్యాసంలో పరిశోధన స్థానం విశదం చేసేటట్లుంది ఈ వ్యాస సృష్టి.

*శ్రీ శిష్ట్లా రామకృష్ణశాస్త్రి* : ఆంధ్రోపన్యాసక వృత్తిలో పరిశోధనతో సాహిత్యానికి చేసిన సేవలో కొంత భాగం 'విమర్శ వ్యాసములు' (1940) సంపుటి. ఈ వ్యాసాలు ఉత్తమ విమర్శకుని ప్రాథమిక రచనలు. దేశచరిత్ర, సారస్వత చరిత్రతో అనుసంధించి, సాహిత్యం మీద బ్రాహ్మణ బౌద్ధ జైన మత ప్రభావాలు వివరించిన ఈ వ్యాసాలు విలువను పరిశోధనావరణంలోకి చొచ్చి వ్యాసకర్త బుద్ధి నైశిత్యం చూపుతున్నాయి.

జానపద వాఙ్మయం దేశంలోనూ సాహిత్యంలోను పొందే స్థానం ఆలోచించటం ఇప్పుడధికంగా జరుగుతూ ఉంది. డా॥ బి. రామరాజు, నేదునూరి గంగాధరం, నాయని కృష్ణకుమారి, శ్రీ ఎల్లోరా వంటి ప్రముఖులు తత్ప్రాధాన్యం వివరించారు. అయితే ఈ కృషి ఆరంభం గమనింపవచ్చు.

చేకుమళ్ళ అచ్యుతరావు 'ఆంధ్ర పదములు-పాటలు' కృష్ణా పత్రికలో (1917) ప్రచురించిన అనంతరం (1924) వ్యాసంగా ముద్రించాడు. జన జీవితంలో సాహిత్యంలో పల్లె పదాలు పద గాథలు (ballads) ఎంతటి చైతన్యం కలిగించాయో తెలుపుతూ ఉదాహరణ సహితంగా ఉన్న ఈ వ్యాసం వాఙ్మయ తత్త్వ ప్రదర్శకంగా ఉంది.

చింతా దీక్షితులు ప్రజావాఙ్మయము పేరుతో వెలువరించిన గ్రంథంలో ఆరు విషయాలు వ్యాసాలుగా విన్యస్తాలయ్యాయి. స్త్రీల సాహిత్యంలో పాటలు ప్రధాన భాగంగా ఉన్నాయి. శారీరక కష్టం మరచిపోవటానికి మానసిక శాంతి పొందటానికి హృదయానుభూతి వ్యక్తం చేయటానికి పాటలు ఉపయోగ పడ్డాయి. బాల వాఙ్మయం జీవిత బాధ్యత ధరించే సమర్థత కలిగించేంత పటిష్ఠంగా రూపొందింది. ఈ వ్యాస సంపుటిలో స్త్రీ - బాల సాహిత్యంతో పాటు, యక్షగానం కొరవంజి వంటి విషయాలు కూడా ప్రస్తావింపబడ్డాయి.

నేదునూరి గంగాధరం 'జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి' లో 8 వ్యాసాలు ఉన్నాయి. జానపద గేయం స్థానం నిర్ణయిస్తూ, రసం, ప్రణయం సాహసం, వీరత్వం, నీతి తెలుపుతూ, వాఙ్మయం ప్రాముఖ్యం వివరించటం పరికింపవచ్చు. పద వాఙ్మయం విస్తృతంగా సేకరించిన ఈ రచయిత కృషి తదుద్ధరణార్థ ఉపయోగపడింది. అనాదృత వాఙ్మయ భిక్షువుగా ఈ రచయిత సాగించిన సేవ మిక్కిలి అధికం. తన జీవిత కాలంలో సముచిత గౌరవం ఎరుగని ఈ సాహితీ తపస్వి, అనాదరంగా ఉన్న జానపద వాఙ్మయం వెలుగు లోకి తేవటం ప్రశంసాపాత్రకృషి.

పరిశోధనం, జానపద వాఙ్మయ పరిశీలనం కావ్యతత్త్వ దృష్టితో సాగటం గమనించట మయింది. కావ్య విమర్శనంలో మూల ధర్మ ప్రరోచనం కావించిన ఇతర రచయితల వ్యాసాలు అవలోకింపవచ్చు.

1. మల్లాది వెంకటరత్నము 'తెలుగు వచన కావ్య వృద్ధి' (1918) 'క్రొత్తవిమర్శ వ్యాసము'గా భావితమయింది. దీనిలో ముద్రణా సౌకర్యం ప్రస్తావించి, తర్వాత వచనంలో గ్రంథరచన ప్రారంభం, నిర్వాహణం తెలిపి, తెలుగువచనం అభివృద్ధి చెందాలంటే సాధింపవలసిన పరిణామాలు వివరించటం వుంది. తెలుగులో విమర్శనం స్వల్పంగా, వచన పరిశీలనం

పూజ్యంగా ఉన్నప్పుడు వెలువడ్డ వ్యాసంగా ఇది ప్రాధాన్యం వహిస్తూ ఉంది. వ్యాస నిర్మాణంలో అంతర్విభజన, శాస్త్ర దృక్పథం వున్నాయి.

2. కిళాంబి రామానుజాచార్యులు 'కావ్యతత్త్వ విమర్శనము' 'బ్రహ్మపురాంధ్ర భాషాభివర్ధనీ సమాజము యొక్క వార్షికోత్సవ సమయమున' చదివాడు. ఈ వ్యాసంలో విమర్శన కోసం గమనింపవలసిన అంశాలు వివరించాడు. ప్రత్యంశం ఒక పేరాగా వ్రాసుకొంటూ పోయాడు. కావ్యాలలోని సామూహిక గుణ పరిశీలనంగా ఈ వ్యాసంలో చూపిన లక్షణాలు ద్యోతకమవుతున్నాయి. విమర్శనంలో కావ్య శైలి ప్రస్తావింపబడాలని వ్యాసకర్త దృష్టి. ఈ వ్యాసం రచయిత సంస్కృతాంగ్ల పాండిత్యాలోచనల ప్రతిబింబం.

3. కూచి నరసింహము 'గ్రంథ విమర్శతత్త్వము' (1924) లో పద్యగద్య రచనలు విమర్శించే తీరుతీయాలు వివరించాడు. పురాణ చరిత్ర నవల నాటకాది అనేక ప్రక్రియలు వ్రాయటంలో, విమర్శించటంలో పాటింపవలసిన తీరులు ఈ వ్యాసాలలో గోచరమవుతున్నాయి. సద్విమర్శ రూపురేఖలు జాగరూకంగా రచయిత ఆలోచించటం గమనింపవచ్చు. వ్యాస రచయితగా, మేధావిగా, రాజకీయవేత్తగా అనేక రంగాలలో కృషి చేసిన కూచి నరసింహము వ్యాస సృష్టి సమ్యగ్దృష్టిని ప్రదర్శిస్తూ వుంది.

4. యం. వి. యస్. సుబ్బారావు వ్రాసిన 'పాశ్చాత్య భావ ప్రపంచము' 1916 లో ధర్మసాధనిలో ముద్రితమయి, 1933 లో గ్రంథంగా రూపొందింది. ఇందులో పాశ్చాత్య మేధావులు ఎనిమిదమంది తమ సాహిత్యం వల్ల సంఘంలో తెచ్చిన మార్పు తెలిపి, అది ఏ విధంగా ఆంధ్రావళికి ఉపయోగపడుతుందో వివరింపబడింది. ఉత్తమశైలిలో సాగిన ఈ వ్యాసం ఆంధ్రాభ్యుదయం వాంఛించింది. తెలుగులో విమర్శనకు, రచనకు ప్రాణభూతమయిన పాశ్చాత్య భావ దృష్టి విశదీకరించిందీ వ్యాసం.

5. కాశీభట్ట సుబ్బయ్య శాస్త్రి 'సాహిత్యకల' (1937) ఆంగ్లప్రభావం వల్ల దేశంలో వచ్చిన విపరీత పరిణామాలు ప్రదర్శించింది. భాషాభావ సందర్భంలో ఆంగ్లత్వం అసహ్యంగా పరికింపబడింది. ఉత్తమశైలి, భావ ప్రకటనంలో స్పష్టత, ఆలోచనలో నైశిత్యం ఉన్న ఈ వ్యాసంలో దోషైక దృష్టి,

చన చేయటం జరిగింది. పల్లె పట్టుల ప్రకృతి సౌందర్యం ఈ వ్యాస భాషలో కొంతవరకు దర్శింపవచ్చు.

13. శ్రీ క్రొవ్విడి రామం 'వ్యాస పారిజాతము' (1968)లో సాహిత్యం ప్రజవంటి పది విషయాలు తాత్త్వికంగా ఆలోచించటం ఉంది. వ్యావహారిక భాష ప్రయోగిస్తూ, రచనలో స్పష్టతను నిలిపిన ఈ వ్యాసాలు పఠన యోగ్యతను ఆర్జించుకొన్నాయి.

14. శ్రీ వడలి మందేశ్వరరావు 'అనుశీలన' విమర్శన విషయంతో ఒప్పే వ్యాసం. విమర్శకుడూ విమర్శనమూ సమగ్రంగా పరిశీలింపబడి ఇది రూపొందింది.

15. ఆవుల గోపాలకృష్ణమూర్తి 'సాహిత్యంలో నౌచిత్యం' వల్ల ఔచిత్యం పరిశీలించి, సంస్కృతి ప్రాచీనతను భావించి, భాషా ప్రాశస్త్యం గ్రహించి, కావ్య ప్రయోజనం, సాహిత్యంలో విప్లవం గుర్తించి, దేశ సంప్రదాయంలో ఆధునికతా ప్రభావం స్వీకరించి వ్యాస సృష్టి కావించిన మేధావి. ఈ వ్యాసాలలో పలువురు సాహితీ ప్రముఖుల సారస్వత సేవనూ, జీవితాన్ని గౌరవంగా గ్రహించి, ఆలోచించటం చూడవచ్చు. ఉపన్యాసాలుగా, వ్యాసాలుగా అవతరించిన ఈ రచనలు సారస్వతం వల్ల సంస్కారణం సాధించవచ్చుననే రచయిత ఆశకూ ఆకాంక్షకు నిదర్శనంగా ఉన్నాయి.

కావ్యతత్త్వ విమర్శన వ్యాసాలు అనేక రచయితలు వ్రాయగా సంకలనాలుగా ముద్రించే సంప్రదాయం తెనుగు వ్యాస వాఙ్మయంలోనూ ఉంది. సంకలన కర్త మానసిక వాతావరణం వల్ల వ్యాస నిర్ణయం సంకలన యత్నం జరగటం సహజమే! ఈ విభాగంలోని లక్షణాలతో ఉన్న వ్యాసాలు సంకలనాలుగా రూపం దిద్దుకొన్నాయి.

శ్రీ పి. వి. సోమయాజి సంకలన కర్తగా రెండు సంపుటులు 'వ్యాస మాల' (1942), 'వ్యాసావళి' (1958) ప్రచురణం పొందాయి. రెండు సంకలన గ్రంథాలలోనూ డా॥ పాటిబండ మాధవశర్మ 'కవిత్వము-భావ కవిత్వము,' శ్రీ దివాకర్ల రామమూర్తి 'కూచిపూడి భాగవతులు' వ్యాసాలున్నాయి. ఈ సంపుటులు ఒక సాహితీ దృక్పథంతో ఆవిర్భవించాయి.

ఈ వ్యాసాలు సాహిత్య తత్త్వం గుర్తించేవే కాని అన్నీ విమర్శన గుణాధిక్యంతోనే శోభించటం లేదు. సృజన ధర్మ ప్రదర్శకంగానూ వెలుగొందుతున్నాయి. ఈ సంకలనాలలో 'ఆంధ్ర నాటకారంభ దశ', 'విషాదాంత నాటకములు' నాటకోత్పత్తి చరిత్రను, విషాద భావ రచనా ధోరణిని తెలుపుతున్నాయి. నిగమశర్మ అక్క వివరణాత్మక వ్యాసం. మల్లంపల్లి సోమశేఖర శర్మ రెండు భిన్న చారిత్రక వ్యాసాలున్నాయి. భిన్న విషయాలు, భిన్న రచనా ధోరణులున్నప్పటికీ వ్యాసాలన్నీ స్థూలంగా కావ్యజీవితంలోని మూలధర్మాలు తెలుపటం కోసం ఉద్దిష్టమైన విమర్శనంతో నిండి ఉన్నాయి.

మునిమాణిక్యం నరసింహారావు 'సాహిత్య వ్యాసములు' నవ్య సాహిత్య పరిషత్తు తరపున ప్రచురించటం జరిగింది. ఇందులో సృజన విమర్శన వ్యాసాలు మౌలిక ధర్మ బోధకాలుగా ఉన్నాయి. 'వెన్నెల' సృజన వ్యాసం. 'హంపీ క్షేత్రము' వ్యాసంగా ముద్రించినా అది ఆ కావ్య పీఠిక. 'కృష్ణపక్షము' వ్యాసం ఆ పేరుతో ఉన్న కావ్య విమర్శనము. సంకలన కర్త వ్యాసం ఈ సంపుటిలో 'హాస్యము' ఉంది. ఇది అనంతర కాలంలో వెలువడ్డ 'మన హాస్యము' గ్రంథంలో గతార్థమయింది. ఈ గ్రంథంలోని వ్యాసాలు ఆధునిక కవితా విషయ ప్రాధాన్యంతో ఉన్నాయి.

ఆంధ్ర రాష్ట్ర హిందీ హిందీ ప్రచార సంఘం 'తెలుగు వ్యాసములు' (1949) వివిధ రచయితల వ్యాస సంకలనంగా ప్రచురించింది. ఇందులో రస స్వరూపము, ఆంధ్ర శిల్పము, రెడ్డి యుగము - ఆంధ్ర వాఙ్మయము, విమర్శనము, పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము, భారతీయ సారస్వత సారూప్యము, కళ - జీవితము, సాహిత్యోపదేశము ఉన్నాయి. ఇవి సృజన విమర్శన ధర్మద్వయంతో ఒప్పుతున్నాయి. కాకా కలేల్కర్ వ్యాసానువాదం ఇందులో ఉంది. విమర్శన వాఙ్మయంలో ప్రాతినిధ్యం వహించే వ్యాసాలు సంపుటీకరింపబడటం వల్ల సముచితంగా వుంది.

తిరుపతి, సాహిత్య సమితి 'వ్యాసావళి' రెండు భాగాలు వెలువడ్డాయి. ఇది ''పరస్పర భావ వినిమయం వల్ల లాభం పొందాలనీ, యథాశక్తి పరిశోధక సాహిత్య సృష్టికి దోహదం చేయాలని సంకల్పించి'' సాగించిన కృషి. ఈ సృష్టి వెనుక ప్రయోజన దృష్టి ఉంది. ఇవి మౌలిక పరిశోధన ఫలితాలుగా

ఉన్నాయి. కొన్ని కావ్య విమర్శనంతో నిండి వున్నాయి. స్థూలంగా ఈ వ్యాసాలు సిద్ధాంత చర్చలుగా, కవికావ్య పరామర్శలుగా ఇతర సాహిత్య పరిచయాలుగా ఉన్నాయి. ఈ వ్యాసాలు ఆయా విషయాలలో నూత్న పథ ప్రదర్శన సమర్థాలయి, ఉపయోగకరంగా ఉన్నాయి.

దిగంబర కవుల సిద్ధాంత వ్యాసాలు ఈ మధ్య అధికంగా వెలువడుతున్నాయి.సృజన వంటి పత్రికలు అవిర్భవించాయి. తమ సాహిత్యపు విలువలు దిగంబరకవులు, ఆ పైన విప్లవ కవులు వ్యాసాలుగా తెలిపినంత ఎక్కువగా, తెలుగులో భావకవిత్వం, వ్యావహారిక భాషావాదం కాలంతో తప్ప, ఏ ఇతర సాహితీ పరిణామ సమయంలోనూ తెలపటం జరగలేదు. ఈ సిద్ధాంత వ్యాసాలు పత్రికలలో, కవితా సంకలనాల పీఠికలుగా ఎక్కువగా ఆవిర్భవించాయి. శ్రీ కె. వి. రమణారెడ్డి, శ్రీ జ్వాలాముఖి అనేక వ్యాసాలు వ్రాశారు. ఇవి ఆవేశ ప్రధానంగా, హృదయ సన్నిహితంగా, ఆలోచనకు పురికొల్పుతూ వ్యాస పరిణామ ప్రదర్శకంగా ఉన్నాయి. ఈ దశలో వ్యాసం ఆవేశంతో ఉగ్రరూతలూగిపోయింది.

కావ్యతత్త్వ విమర్శన వ్యాసాలు విశిష్ట గుణ శోభితాలుగా విస్తృత పథకంతో, విశాల భావ పరిధితో, మూల ధర్మ వివరణంతో, సిద్ధాంత చర్చతో సమగ్ర గుణ సమన్వయంతో ఉన్నాయి. ఈ విధమయిన వ్యాస రచనకు రచయిత ఆలోచన, పాండిత్యం, అనుభూతి, అభివ్యక్తి, సాహిత్య జీవిత సమన్వయ దృష్టి అవసరంగా కనిపిస్తాయి.

## 2. కావ్యాత్మ వ్యాసం

కావ్య తత్త్వ వ్యాసంలో కావ్య గత ప్రధాన తత్త్వం పరిశీలించటం జరిగితే కావ్యాత్మ వ్యాసంలో ఒక్క ప్రత్యేక కావ్య లక్ష్యం దర్శించటం ఉంది. పురాణ ప్రబంధ యక్షగానాది ప్రక్రియలు, కథ నవల నాటక భావ కవిత్వాది ఆధునిక ప్రక్రియలు కావ్య పద గతంగా సంభావించటం జరిగింది. కావ్య ప్రధాన లక్ష్యం విశదీకరించే దృష్టితో సాగిన విమర్శన వ్యాసాన్ని కావ్యాత్మ వ్యాసంగా గ్రహించటమయింది. వస్తుతత్త్వ విమర్శనం ఒక కావ్యం పరకే పరిమితంగా ఉండటం ఈ సందర్భంలో గుర్తింపవలసిన ప్రధానాంశం.

అయితే, ఒక కావ్యంలోని భాష, వస్తువు, రచనం సహాయంతో ఆ లక్ష్యం స్పష్టం కావచ్చు, దర్శింపబడవచ్చు. ఈ పరిశీలనం విషయ వైశాల్యం విస్తృతంగా జరిగి ఉండవచ్చు. ఆ సందర్భంలో విషయగౌరవం తద్దృష్టిని బట్టి అది విమర్శనంగానో విమర్శన వ్యాసంగానో గుర్తింపు పొందుతుంది.

కావ్యాస్తిత్వానికి మూలహేతువు పరిశీలించి దానిని ప్రపంచించటంలో పొందించిన వైవిధ్యం లక్ష్య పరిధిని దాటకపోతే అది కావ్యాత్మ వ్యాసంగానే భావింపబడుతుంది. కావ్యతత్త్వ వ్యాసంలో అనేక కావ్యాంతర్గత సామాన్య ధర్మం వ్యక్తమయితే కావ్యాత్మ వ్యాసంలో ఒక కావ్యంలోని ప్రత్యేకం విశిష్టం అయిన లక్షణం అభివ్యక్తమవుతుంది. కావ్య తత్త్వ వ్యాసం సంఘ ధర్మం ప్రదర్శిస్తే, కావ్యాత్మ వ్యాసం వ్యక్తి ధర్మం నిరూపిస్తుంది. అది సమష్టి అయితే ఇది వ్యష్టి.

వ్యాస రచన ప్రారంభం నుంచి, కావ్య విమర్శనం జరుగుతూ ఉంది. గ్రంథం విమర్శనం వివేకవర్ధని చింతామణి వంటి పత్రికలలో వెలువడి కావ్యాత్మ విమర్శన వ్యాస సృష్టి ప్రచురంగానే ఉంది. సమగ్రంగా విమర్శన వ్యాస రచనం కావ్యాత్మను అన్వేషిస్తూ ఇరవయ్యో శతాబ్ది ఆరంభం నుంచి విస్పష్టంగా ఉన్నట్లు గ్రహింపవచ్చు. కావ్యాత్మ స్పృశించటానికి చేసిన తొలి ప్రయత్నాలు కొంతవరకు సత్యనిష్ఠను కలిగిఉంటటంకంటే పాండిత్య ప్రదర్శననూ పట్టుదలనూ కలిగి పాక్షిక సత్యం ప్రదర్శించేవిగా రూపొందాయి.

కావ్యాత్మ వ్యాస సృష్టి కావించిన రచయితల కృషి పరిశీలించాలి. తెలుగులో కావ్య విమర్శనం ప్రతివిమర్శకు, వాదోపవాదాలకు ఆరంభంలో గురి అయింది. ఈ విధమయిన విమర్శనం సారస్వత పత్రికలలో వ్యాసాలుగా, గ్రంథాలుగా అధికంగానే వెలువడింది. ప్రారంభ కృషి విశదంగా దర్శించటం కర్తవ్యం.

## 1. వేదము వేంకటరాయశాస్త్రి

పాండిత్యంలోనూ విమర్శన సామర్థ్యంలోనూ తలపండిన మనీషి వేదము వేంకటరాయశాస్త్రి. కావ్య పీఠికలు, వ్యాఖ్యానాలు, విమర్శనలు సాగించి ఆంధ్ర

సరస్వతిని అర్చించిన పూజారి వేదం కావ్య విమర్శనకు పూనుకోవటంలో లోపాలు చూపటానికేనన్న దృష్టి వుంది. శారదాకాంచిక, ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ కింకిణులుగా విక్రమార్క చరిత్ర ముద్రణ విమర్శనము (1898), ఆంధ్ర ప్రసన్న రాఘవ విమర్శనము (1898), శ్రీకాళహస్తి మాహాత్మ్య ముద్రణ విమర్శనము (1900), గ్రామ్య భాషా ప్రయోగ నిబంధనము (1901) వెలువరించటం జరిగింది.

అప్పుడే గ్రంథ పరిష్కరణలు విరివిగా ముద్రింపబడుతూ ఉండటం, సర్వసమర్థులైన పండితులే అన్ని గ్రంథాలు పరిష్కరింపకపోవటం ఈ విమర్శనకు అవకాశం కలిగించాయి. కొక్కొండ వేంకట రత్నము పంతులు పట్ల సాహిత్య సంబంధంతో సరయిన అభిప్రాయం లేకపోవటం వల్లనూ ఈ విమర్శనావకాశం కలిగింది.

ఈ వ్యాసాలలో విమర్శనం దోషనిరూపణకు యత్నించింది. ఇది వ్యక్తిగత దృష్టిని ప్రసరించటం గమనింపవలసి ఉంది. ఈ విమర్శనం భాషాదోషాలు రాకుండా రచన చేయాలన్న పట్టుదలను, జాగ్రత్తను కవులకు, రచయితలకు కలిగించటంతో పాటు, రచనా వ్యవసాయం పట్ల భయంకూడా కలిగించింది. దోష రహితంగా రచన చేయటం అసాధ్యమన్న అభిప్రాయం గిడుగు రామమూర్తి పంతులు ప్రకటించడానికి అవకాశ మిచ్చింది.

ఈ విమర్శలు భాషా దృష్టిని మాత్రమే ప్రకటించాయి. రచన, వస్తువు, పాత్ర, సన్నివేశాది అనేక విషయాల ప్రసక్తి లేకపోయింది. ఈ కింకిణులు శబ్ద దృష్టిని కలిగినంతగా అర్థంపట్ల దృష్టి పెట్టలేదు. ఈ వ్యాసాలలో పద చర్చ జరిగినంతగా పదార్థ చర్చ జరగలేదు. ఏమయినా ఒక కావ్యంలోని పద చర్చగా, విమర్శనంగా, కావ్యాత్మ ప్రదర్శకంగా ఈ వ్యాసాలు గ్రహింపవచ్చు. అంతదాకా ఉన్న పద చర్చ వివాదాలు కావ్య దూరంగానో, ఏదైనా పద సంబంధంగానో ఉంటూ వస్తే, ఈ కింకిణులు ఒక కావ్యంలోని అన్ని సంశయాత్మక పదౌచిత్య పరిశీలనం చేశాయి. అందువల్ల కావ్యాత్మ వ్యాస సమాలోచనంలో ఈ వ్యాసాలు కావ్య బాహిరాపరణం చర్చించటంవల్ల గ్రహింపవచ్చు

## 2. వెన్నేటి రామచంద్రరావు

ఈ రచయిత వ్రాసిన మను వసు చరిత్ర రచనా విమర్శనము ([illegible]) మను చరిత్ర, వసు చరిత్రల తత్త్వం, రచనారీతి, గుణదోషాలు తారతమ్య దృష్టితో పరిశీలింప యత్నించిన వ్యాసం. ఈ వ్యాసంలో రెండు ప్రధాన భాగాలున్నాయి. ఈ ప్రబంధాలలో ఏది ఉత్తమం, ఏది కవిత్వం అన్న ఈ రెండు విషయాలు రెండు భాగాలలో ఆలోచన పొందాయి. వసుచరిత్ర కన్న మనుచరిత్ర శ్రేష్ఠం అనటంలో బ్రాహ్మణాబ్రాహ్మణ మనస్తత్వం పనిచేసినట్లు కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి భావించాడు.

ఈ వ్యాసం గూర్చి రెండు వ్యాసాలలో బ్రహ్మయ్యశాస్త్రి విమర్శిస్తే ఇది పాఠ్యగ్రంథంగా నిర్ణయించినప్పుడు అపోహలు నివారించటం కోసం రామచంద్రరావు సమాధానం వ్రాయటం జరిగింది. ఈ విమర్శనం బాగా వాదోపవాదాలకు గురి అయింది.

ఈ వ్యాస రచనం వెనుక ఆంగ్ల విమర్శన రీతి స్పష్టంగా గోచరమవుతూ వుంది. విమర్శనకు ఆంగ్ల ప్రమాణాలే కాక సంస్కృతాలంకారిక సంప్రదాయ ప్రమాణాలు కూడా గ్రహించటం జరిగింది. ఆంగ్ల ప్రభావంతో విమర్శనం సాగించటానికి పూనుకొన్న రచయిత సంప్రదాయం రచనంలో తెంచుకోలేక, ఉంచుకోలేక పడిన అవస్థకీ వ్యాసం నిదర్శనం.

కావ్య విమర్శనం సమగ్రంగా చేయటానికి జరిగిన తొలి ప్రయత్నాలలో ఇది ప్రముఖంగా వుంది. విషయ విభజనం క్రమబద్ధంగా ఉంది. వ్యాసకర్త ఆలోచనలు నూత్నాలు. రచనంలో క్రొత్తదనం ఉంది. రచయిత వ్యక్తిత్వం ప్రాచీనత చుట్టూ పరిభ్రమించటం ఆగిపోలేదు. ఈ రచయిత ప్రాచీనులలో నవీనుడు. అభ్యుదయ ప్రాచీన వాసనలకు, క్రొ[illegible] ఈ వ్యాసం కూడలి. స్థూలంగా వసు, మను చరిత్రల అల్ప[illegible] చేసిన ఈ తారతమ్య యత్నం ఆద్యమై, ప్రశంసాపాత్రమై [illegible]

## 3. బుర్రా శేషగిరిరావు

'విమర్శాదర్శ' (1914) సారస్వత జీవితంలో అలజడికి హేతుభూత మయిన విమర్శ వ్యాస సంపుటి. దీనిలోని భావాలు, భాష, రెండూ నాటి జన జీవితంలో ఇమడలేదు. ఆంగ్ల విద్య ఆంగ్ల విమర్శన గ్రంథ పఠనం వల్ల ఏర్పడ్డ భావాలతో, ఆంధ్ర సారస్వతం పరిశీలించటం ప్రారంభించేసరికి, అప్పటి దాకా స్థిరంగా నమ్ముకొన్న సారస్వత సంప్రదాయాలు విశ్వాసాలు పునాదులతో కదలటం ఆరంభమయింది. వ్యావహారికంలో రచన చేయాలి, అది అత్యవ సరం అనుకోవటం, అలా సాగించటం ఈ రచయిత భాషాభ్యుదయ దృక్పథం ప్రదర్శించినా, నాటి వివాదంలో ఈ గ్రంథ భాష కొత్తకోణం సృష్టించింది.

ఈ గ్రంథంలో లోపాలు చూపటానికి కాశీభట్ట బ్రహ్మయ్య కృషి, పాను గంటి లక్ష్మీనరసింహారావు పంతులు సృష్టి చేశారు అవహేళనం కూడా ఈ సంపుటిని ఆశ్రయించింది. ఈ వ్యాస సంపుటిలో నూత్న భావాలు, భాషా ప్రయోగంతో పాటు ఉత్తమశైలి దర్శింపవచ్చు. ఈ వ్యాసాలు కవి కావ్య సంబంధం కావ్యంలో మానవ జీవితం, కవి సృష్టి కర్త కావటం, కవిత్వంలో తత్కాలధర్మాలు నిలపటం, సాహిత్యం జీవిత ప్రతిబింబం కావటం పరిశీలింప బడ్డాయి. 'ఈ అంశములు చెప్పె ఇతర గ్రంథము నే నెరిగినంతవరకు తెలు గులో లేదు' అని రచయిత తెలిపి, ఆంగ్లంలో క్రాషా అనే దొర వ్రాసిన రెండు విమర్శ గ్రంథాలలోని విషయాలు ఈ వ్యాసాలలో చేర్చినట్లు గ్రహింపవచ్చు. తెలుగులో కృతి విమర్శనం చేయటానికి ఈ వ్యాస సంపుటి దోహదం చేసేంత సమర్థంగా ఉంది.

## 4. కాశీనాథుని నాగేశ్వరరావు (1867-1938)

కాశీనాథుని నాగేశ్వరరావు వైద్యం, విద్య, సంఘ, సాహిత్య రంగాలలో చేసిన కృషి అపారమయింది. సాహిత్యంలో పత్రికాస్థాపనం, నిర్వహణం, రచనా ప్రోత్సాహం, రచనా వ్యవసాయం విభిన్నంగా సాగాయి. తన రచనా కృషిలో వ్యాస రచన పరికింపవచ్చు సాహితీ వేత్తగా మానవతామూర్తిగా విపుల ప్రచారం పొందిన ఈ రచయిత వ్యాస సాహిత్య సృష్టి పరికింపవచ్చు.

ఆంధ్ర పత్రిక, భారతి సంపాదకీయాలు వ్యాసాలే. సాంఘిక, రాజ కీయాది బహు విషయ బంధురంగా సంపాదకీయాలు రూపొందాయి. ఈ రచ

నలు అనంతర సంపాదకుల సంపాదకీయాలకు మేలు బంతులయ్యాయి. భారతిలో ప్రతి మాసం కొంత కాలం ప్రచురించిన 'సాభిప్రాయ విశేషములు' వార్తా వ్యాఖ్యలుగా సృజన వ్యాసాలుగా ఉన్నాయి

ఆంధ్ర వాఙ్మయ సూచికకు ఉపోద్ఘాతప్రాయంగా ఉన్న రచన ఆంధ్ర సారస్వత పరిణామం ప్రదర్శించిన వ్యాసం. పత్రికలలో భిన్న విషయ విస్తృతాలుగా అనేక వ్యాసాలు వ్రాశాడు. తను స్థాపించిన ఆంధ్ర గ్రంథమాల తరపున ముద్రించిన గ్రంథాలకూ, తదితరాలకు వెలయించిన పీఠికలు వ్యాస ప్రపంచంలో చేరుతాయి. విజ్ఞాన సరస్వంలోని వ్యాసాలు భిన్న విషయాలతో ఒప్పుతున్నాయి.

ఆధ్యాత్మిక చింతన, హరిజన సేవ, సముచిత రాజకీయ వాతావరణ కల్పన, సాంఘికాభ్యుదయం, సాహితీ చైతన్యం, గాంధీ కృషి, ప్రేమ విస్తృత వ్యాస రచనంలోని విషయాలు. ప్రాచీన కవిత్వం నుంచి ఎంకి పాటల వరకు రచయిత పరామర్శించాడు. రచన గ్రాంథిక వ్యావహారిక ధోరణులు రెండింటిని కలిగి ఉంది. వ్యాస రచనంలో వ్యాఖ్యానం, వివరణం, విమర్శనం ప్రధాన గుణాలుగా ఉన్నాయి. విషయబోధ ప్రతివ్యాసంలో ప్రాముఖ్యం వహించింది. విషయ విపులీకరణం రచనంగా వుంది. విమర్శన సాహిత్యాభివృద్ధికి దోహదం చేసిన ప్రముఖులలో కాశీనాథుని నాగేశ్వరరావు స్థానం విశిష్టమయింది.

## 5. మానవల్లి రామకృష్ణ కవి (1875-1957)

మానవల్లి రామకృష్ణ కవి సారస్వత వ్యాసంగం విస్తృతమయింది. విస్మృతాంధ్ర కవికావ్య పరిశోధనంలో, ప్రచురణంలో దీక్ష వహించిన వ్యక్తి ఈ రచయిత. నన్నెచోడ కుమార సంభవ కర్తృత్వకాల నిర్ణయం సందర్భంలో వాదోపవాదాలకు గురి అయిన మనీషి.

ఈ రచయిత వ్యాసాలు అన్నీ పత్రికలలోనే ఉండిపోయాయి. ఆంధ్ర పత్రిక ఆరంభంనుంచి భారతి పుట్టుకదాకా ఎక్కువగా, ఆపైన అప్పుడప్పుడు ఆ పత్రికలలో వ్యాసాలు వ్రాసి విమర్శనకు దోహదం చేశాడు.

ఈ వ్యాసకర్త సంస్కృత కవికావ్య పరిచయం కావించటం, తెలుగు కవికావ్య పరిశోధన ఫలితాలు ప్రకటించటం చేశాడు. రచనం తెలుగుకంటే సంస్కృతం అధికంగా ఉంది, ప్రాబంధికంగా వుంది.

వ్యాస రచనంలో పరిశోధన, విమర్శన, నూత్న విషయ విపులీకరణ ప్రధానంగా గ్రహించాడు. మానవల్లి రామకృష్ణ కవి ప్రధానంగా పరిశోధకుడు. సత్య సందర్శనం వివాద హేతువుగా రూపొందుతున్న కాలంలో తన నమ్మకాలు, అభిమతాలు విమర్శన వ్యాసాలుగా ఈ రచయిత వెలువరించాడు.

## 6. వేటూరి ప్రభాకర శాస్త్రి

సారస్వత రంగంలో విశేష కృషి మూలంగానూ, విశేష విద్యార్థి సంపదతోను సుప్రసిద్ధి పొందిన కొద్దిమంది విమర్శకులలో వేటూరి ప్రభాకర శాస్త్రి స్థానం సముచితమయింది. సాహిత్య కృషిలో పాఠ పరిశోధన, గ్రంథ పరిష్కరణ ప్రధాన భాగం. విమర్శన వాఙ్మయ సృష్టి గమనార్హంగా వుంది. విమర్శన వ్యాస సృష్టి సమధికంగా ఉంది ఈ వ్యాసకర్త 'తెలుగు మెఱుఁగులు', 'మీఁగడ తరకలు', 'సింహావలోకనము' వ్యాస సంపుటులు ప్రకటించాడు. వీటిలో కావ్యతత్త్వానుశీలనం చేసిన వ్యాసాలూ ఉన్నాయి.

పరిశోధకుడి అన్వేషణ విమర్శనంలోనూ కనిపిస్తుందనటానికి ఈ వ్యాస సంపుటులు పరికింపవచ్చు. తొలుత వ్యాసాలు గ్రాంథిక భాషలో, ఆపైన వ్యావహారిక భాషలో నిర్మించటం వల్ల, భాషా ప్రయోజనం పరిణామం గుర్తించాయి. వ్యాస సృష్టి అంతా సారస్వత పరిమితంగా చేసి, కవితా వచనంగా రచనం సాగించి, తెలుగులో కావ్య విమర్శన వ్యాస వాఙ్మయం సుసంపన్నం కావించిన విమర్శకుడు వేటూరి ప్రభాకర శాస్త్రి.

## 7. నడకుదుటి వీరరాజు పంతులు

'విమర్శ తరంగిణి' (1931) లో నాల్గు సాహిత్య విమర్శ వ్యాసాలు వివాద హేతువులై ఉన్నాయి. ఈ సంపుటి ఉపోద్ఘాతంలో కూచి నరసింహాము "విషయములు వివాదాస్పదములై యున్నవి" అన్నాడు. రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ అభిప్రాయాలు ఖండించే 'సోముని హరివంశము' వ్యాసం ఈ సంపుటిలో ఉంది. ఇది వివాదంగా రూపొందింది. కుమార సంభవము ఉత్తమ కావ్యము అని తెలుపుతూ సాగించిన విమర్శనం అసమగ్రంగా ఉంది.

ఈ రెండు పెద్ద వ్యాసాలు కాక మరి రెండు చిన్న వ్యాసాలున్నాయి. పూర్వ కావ్యాలలో కవికృతాలు కల్పితాలు అనేకం "అనర్థకములు, అనన్వయ

ములు, అపరిష్కృతములు, అస్థాన పతితములు, అనేక గ్రంథస్థములు, అంతర్హితములు, అసమీక్షితములు, అపరిశీలితములు, అసందర్భయుక్తములు'' అయిన పాఠాలు వివరించటం ఉత్తమ సారస్వత కృషి ఫలితాలు.

ఈ వ్యాస రచనా ప్రణాళికలో విస్పష్ట విభజన నుంది. ఇది ప్రతి వ్యాసంలో విశదంగా గోచరమవుతూ ఉంది. అవసరమయినచోట ఉదాహరణ యుక్తంగా వ్యాసం వ్రాయటం, విమర్శ తీవ్రంగా ఉండటం, దోష నిర్వికారంగా నిరసించటం, భాషాభిమానం ఎక్కువయి కవితా దోషం గమనించక పోవటం ఈ వ్యాసాలలో పరికింపవచ్చు. ఈ వ్యాస కర్త 'విమర్శకునకుఁ బక్షపాతము' ఉండకూడదంటూ చేసిన విమర్శనంలో కించిన్మాత్రంగా వ్యక్తిగతమైన ఇష్టానిష్టాలు చోటు చేసుకోవటం చూడవచ్చు. అయితే బలమైన విమర్శరీతికి విమర్శతరంగిణి ప్రబలోదాహరణం.

## 8. శ్రీ కొండూరు వీర రాఘవాచార్యులు

ఈ వ్యాస కర్త 'మూడు కావ్యాలు' (1952), 'సాహిత్య వ్యాసములు' (1967) కావ్య విమర్శన వ్యాస సంపుటులు. ఇవి విమర్శన వ్యాసాలై, సయుక్తికంగా, వివరణాత్మకంగా ఉన్నాయి. ఇవి శిల్ప సాహిత్య తత్త్వ వాఙ్మయ వ్యాసాలు. ఇవి స్థూలంగా "సంస్కృత సాహిత్య పరిశీలనాత్మకములు. ఆంధ్ర సాహిత్యాలోకనాత్మకములు. ఆధునిక సాహిత్య ప్రశంసాపరములు. చరిత్రాత్మకములు'' గా ఉన్నాయి.

కాలక్షేపంగా కాకుండా, బరువైన విషయాలు వివరంగా చెప్పే ప్రయత్నం వ్యాసగతంగా వుంది. ఇవి సాహిత్య సమాలోకనం కలిగించాయి. ''ప్రసక్త విషయమును విస్తరింపను, ఆత్మానుభవానుశీలనముతో, నిరాడంబర సరళ పద ప్రయోగ చాతుర్యముతో నొప్పుచు ఆనందోప బ్ధి గల్గించు రమణీయ గద్య రచనా విశేషమే వ్యాసము'' అని ప్రస్తావనలో శ్రీ ఎక్కోజు మాధావాచార్యులు వివరించాడు.

కావ్యానుశీలనం, మత ప్రభావం, పాత్ర చిత్రణం, కావ్యతత్త్వం ఈ వ్యాస కృషిలో గమనింపవచ్చు. సారస్వత విమర్శనం సరళంగా రూపొందించటం రచయిత అభీష్టం. అది సిద్ధించింది. అందువల్ల ఈ వ్యాసాలు పఠన యోగ్యతను పెంచుకొన్నాయి.

కావ్యాత్మ వ్యాసం కావ్య ప్రధాన లక్ష్యం స్పృశింప గలిగిందిగా రూపొందుతూ వుంటుంది. ఈ కృషిలో వ్యాసకర్త హృదయ సన్నిహితంగా సమీపస్థంగా ఉండగలగాలి. ఒక కావ్య సృష్టి వెనుక ఏ భావ తీవ్రత శ్రమిం చిందో విస్పష్టమయితే ఆ కావ్యాత్మ విశదమవుతుంది.

తెలుగు సారస్వతంలో విమర్శన వ్యాసం ఈ దృక్కోణంలోనే సాగుతూ ఉంది. ఈ విమర్శనం ఆరంభంలో శబ్ద దృష్టినీ, ఆ పైన కావ్యాత్మ దృష్టినీ పెంపొందించుకొంది. వర్తమానాంధ్ర కావ్యాత్మ విమర్శన వ్యాసాలు అనేకం వెలువడి తల్లోపం లేకుండా చేస్తున్నాయి. సమగ్ర కావ్యతత్త్వం, చరిత్ర నిర్మింప బడటానికి ప్రతి కావ్య ప్రత్యేకత వివరించే కావ్యాత్మ వ్యాసాల పునాది సుప్ర తిష్ఠితమయి ఉండవలసిన అవసరం ఉంది.

## 3. కావ్యగుణ వ్యాసం

కావ్యాత్మ వ్యాసం కావ్య స్వభావ ప్రధానంగా రూపొందితే కావ్య గుణ వ్యాసం స్వరూప ప్రధానంగా సిద్ధించింది. అందులో అంతరతత్త్వం అన్వేషింప బడితే, ఇందులో కావ్య సృష్టికి బాహిరావసరాలు, కావ్యాత్మను చుట్టుకొన్న కావ్య శరీరంలోని సర్వభాగాలు గవేషణ పొందుతాయి. దీప కళిక వంటిది కావ్యాత్మ వ్యాసంకాగా దాని వెలుతురు కావ్యగుణ వ్యాసం.

సాధారణంగా కావ్యాత్మ లక్షణమే కావ్య గుణం కావలసి ఉంటుంది. అయితే ఆ కావ్యం వెలువడ్డ కాలం, నాటి సారస్వత సాంఘిక వాతావరణం, దాన్ని దర్శించిన విమర్శకుడి స్వభావం, నాటి సమాజావసరం మీద ఆధారపడి ఆ కావ్య గుణం వెలుగు చూస్తుంది, నిర్ణయింపబడుతుంది. ఒకే కావ్యం ఇద్దరు విమర్శకుల విమర్శనంలో పొగడబడటం,తెగడబడడం జరుగుతుంది. ఒకే కావ్యం దాని ఆవిర్భవకాలంలో ఉత్తమంగా అనంతరం తద్భిన్నంగా భావింపబడుతుంది. కాలాంతరంలో, స్థలాంతరంలో కావ్యగుణ దర్శనం విపర్యస్తం కావటంలో వింత లేదు. కావ్యకర్త వ్యక్తిగత స్థితి వల్ల, కావ్యభర్త పరిస్థితి వల్ల ఒకప్పుడొక దృష్టినీ, మరొకప్పుడింకొక దృష్టిని ఒక కావ్యం కలిగింపవచ్చు. ఒక కావ్యాన్ని విమర్శకుడు లోకదృష్టి పెరగకముందు ఒకవిధంగా, పెరిగింతర్వాత అన్యంగా విమర్శించటానికి అవకాశం ఉంది. అందువల్ల ఒక కావ్యం భిన్న కాలాలలో, భిన్న స్థలాలలో, భిన్న జనుల మధ్య విభిన్నంగా విమర్శింపబడటానికి అవకాశం

ఉంది. కాబట్టి కావ్యాత్మ విమర్శనం చేస్తే కావ్యగుణ విమర్శనం చేసినట్లు కాదు. కాగా సాహితీ విమర్శనంలో కావ్యాత్మ వ్యాసం రాజశాసనం కాగా, కావ్య గుణ వ్యాసం ప్రజా నిర్ణయం వంటిది. కావ్యాత్మ వ్యాసం రాజరికం అయితే కావ్య గుణ వ్యాసం ప్రజాస్వామికం.

తెలుగులో విమర్శనం గుణదోష పరిశీలన సమగ్రదృష్టితో చేయటంగా గోచరమవుతుంది. అయితే కావ్య గుణ పరిశీలన వ్యాసాలలో కొన్నింటిలో సంపూర్ణ స్తుతి, కొన్నింటిలో సంపూర్ణ నింద గమనార్హంగా ఉన్నాయి. విమర్శనంలో రచయిత వ్యక్తిగతాభిప్రాయాలకు, ఇష్టానిష్టాలకు చోటు లేకుండటం అవసరమే అయినా, విమర్శన వ్యాసంలో రచయిత వ్యక్తిత్వం కొంతవరకు గోచరమవుతూ ఉంది. కావ్యగుణ వ్యాసం కావ్యధర్మాలు విమర్శకుణ్ణి ఏవిధంగా ఆకట్టుకొన్నాయో, ఆ విధంగా రూపొందితే వాంఛనీయమే. కాని ఒక్కొక్కప్పుడు విమర్శకుడు తన ఇష్టానిష్టాలు కావ్య విమర్శగతంగా ప్రకటించటంలో ఔచిత్యం సత్యం ఉంటే సమంజసం సమర్థనీయంగా వ్యాసముంటుంది. ఔచిత్యం విమర్శన వ్యాసం కోల్పోతే రచన పతనమవుతుంది. సత్యం చ్యుతమయితే వ్యాసగతంగా సాహిత్యం ప్రమాదకరమవుతుంది. అందువల్ల ధర్మచ్యుతంకాని అభీష్టం విమర్శకుడు వ్యాసగతంగా తెలపవచ్చు కాని ప్రమాదకరమయిన వాంఛను ప్రపంచించకుండా ఉంచటం అవసరం. ఈ సాహిత్యావసరం ఈ విమర్శన వ్యాస రచనారంభంలో విమర్శకులు గుర్తించినట్లు స్పష్టం కాదు. అందువల్లనే కొంతవరకు అప్పటిలో వివాద వ్యాస విజృంభణం జరిగింది. దాని తిరోగమనం, వర్తమానంలో దాదాపు లేకపోవటం విమర్శన వ్యాసం పొందిన ఔన్నత్యంగా గుర్తింపవచ్చు.

ఈ కారణంగా కావ్య గుణ వ్యాసం పూర్వోత్తర భాగాలుగా విభజింపవచ్చు. దీనికి మూలహేతువు విమర్శక దృష్టి. విమర్శకుడి వ్యక్తిత్వానికి కొంత ఎక్కువగా పూర్వభాగ కావ్య గుణ విమర్శన వ్యాసంలో చోటు ఉంటే, కొంత తక్కువగా ఉత్తరభాగ కావ్యగుణ విమర్శన వ్యాసంలో అవకాశముంది.

## 1. పూర్వభాగం

పత్రికలలో గ్రంథ విమర్శనంగా, కృతి విమర్శనంగా ఉన్న కావ్య విమర్శవ్యాసాలు, సంపుటీకరింపబడకపోవటంవల్ల వర్తమానంలో ఉపయోగపడ

కుండా ఉన్నాయి. తెలుగులో వెలువడ్డ ఈ విధమయిన వ్యాస వాఙ్మయం చాలా వరకు ముద్రితంగా భవిష్యత్తరాలకు భద్రపడకుండా అయిపోయింది. కావ్య విమర్శనంగా 20వ శతాబ్ది ఆరంభం నుంచి జరిగిన వ్యాససృష్టి పరికింపవచ్చు.

వేంకట శ్వేతా చలపతి రంగారావు- 'శ్రీ మహాభారత శ్రీమద్రామాయణ విమర్శనము' (1907) రామాయణ భారత రచనా విషయమూ, పాత్ర పరిచయమూ చేసి, దైవభక్తి మతైక్యం పెంచే బోధించే రీతిలో సాగింది. ఇది దైవవైవిధ్యం సంఘ విచ్ఛేదనం చేయరాదన్న ఆశనుంచి ఆవిర్భవించింది.

కొటికలపూడి యజ్ఞేశగారి నరసింహశర్మ - 'శ్రీ మహాభారత యుద్ధకాల విమర్శనము' (1908)లో, ఇది "క్రీస్తునకు పూర్వము 2448 సంవత్సరమున జరిగినటుల గానబడుచున్నది" అని స్థాపించటం ఉద్దేశించినట్లు స్పష్టమవుతుంది. అవ్యవస్థంగా, అస్పష్టంగా ఉన్న చారిత్రక విషయం విశదం చేయాలన్న సారస్వత సదుద్దేశంతో ఈ వ్యాసావిష్కృతి జరిగింది.

వెల్లాల సదాశివశాస్త్రి-'ఆంధ్ర చరిత్ర విమర్శనము' (1913) చిలుకూరి వీరభద్రరావు చరిత్ర గ్రంథవిమర్శనంగా ఉన్న వ్యాస సంపుటి. చిలుకూరి వీరభద్రరావు అభిప్రాయాలు కొందరికి సమ్మతంగా ఉండవనీ, ప్రమాద జనితాలుగా ఉన్నాయని నిర్ణయించుకోవటం ఈ రచనకు హేతువు. అయితే ప్రమాద జనితమయితే సవరణ అవసరమేకాని, కొందరికి సమ్మతం కానంతమాత్రాన చారిత్రక సత్యం అసత్యం కాదు. ఈ సంపుటి వ్యక్తిగత కారణాలవల్ల వెలువడ్డ విమర్శన వ్యాస సృష్టిగా భావింపవచ్చు.

పుల్లెల శ్రీరామశాస్త్రి-'శ్రీకృష్ణభారతాభినందనము' (1917)లో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి శ్రీకృష్ణభారతములో మూడు పర్వాలు పూర్తిచేసింతర్వాత జరిగిన సభ విశేషాల వివరణముంది. ఇది అభినందనాత్మకంగా ఉన్న వ్యాసం.

దేవరకొండ జగన్నాథరావు - 'సుభద్రా విజయముపై విమర్శనము' (1921)లో వావిలికొలను సుబ్బరాయకృత నాటకం వస్తువు. "ఇందలి విమర్శన విధాన మాంగ్ల కవీశ్వరుండగు షేక్స్పియరు యొక్క నాటకములపై నాంగ్ల పండితు లొనరించిన విమర్శన పద్ధతిని బోలియున్నది. ఇవ్విధానము తెనుఁగు భాషయందు గ్రొత్తదియగుట నాంగ్లభాష రాని పండితుల కొరక మార్గదర్శకమగునని యెంచి వ్రాయగడంగితిని" (పీఠిక పుట 2). విమర్శన సాహిత్యం అభివృద్ధి

పొందాలన్న ఆశతో సాగించిన ఈ వ్యాసం ఆంగ్ల విమర్శనంలోని విషయ విభజన రచనారీతులు కలిగివుంది.

ఓరుగంటి వేంకటేశ్వర శర్మ - 'లక్ష్మీ శృంగార కుసుమ మంజరీ విమర్శనము' (1936). సంస్కృతం నుంచి దుర్భా సుబ్రహ్మణ్య శర్మ అనువదించిన ఈ స్తవంలోని లోపాలు మాత్రమే ఎన్నటంలో శ్రద్ధ వహించిందీ వ్యాసం. అనువాదం పేలవంగా ఉంటే ఈ విమర్శన వ్యాసం సముచితంగానూ, లేకపోతే దోషైక దృష్టితో పాక్షికంగానూ ఉందని భావింపవచ్చు.

జనమంచి శేషాద్రి శర్మ - 'మను చరిత్ర హృదయావిష్కరణము' (1937) లో ''ఈ చిన్ని వ్యాసము వ్రాసి మీ సన్నిధి బెట్టినాడను. ఇది పెద్ద విమర్శ గ్రంథము కాదు'' అని తెలుపుతూ రచయిత మను చరిత్రలోని కథ, కవితా గుణాలు, పాత్ర పోషణం, వర్ణనం వంటి అనే విషయాలు వివరించి కృతపకాలం అనుబంధంగా నిర్ణయించి విస్తృత సాహిత్య సృష్టి చేశాడు. ఒక కావ్య సంపూర్ణ గుణ ప్రదర్శనం చేయాలన్న విమర్శక అభిలాషనుంచి అవతరించిందీ వ్యాసం.

పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి - 'రామోపాఖ్యానము - తద్విమర్శనము' (1938) లో అసలు గ్రంథం కూడా ముద్రితమయింది. అది ఎఱ్ఱాప్రగడ కృతంగా తెలుపబడింది. ఈ వ్యాసం గ్రంథ పరిచయ ప్రాయంగా ఉంది.

కొంపెల్లి సుబ్బరాయశాస్త్రి - 'ఉత్తర రామ చరిత నాటక రస విచారము' కరుణ విప్రలంభ శృంగార రస ప్రధాన నాటకమని అనేక రసశాస్త్ర దర్శనంతో వ్రాశాడు. ఒక అంశమే తార్కికంగా ఆలోచించి వ్రాయటంగా ఇది వుంది.

పార్నంది రామశాస్త్రి - 'శ్రీ మహాభారత విమర్శనము' ఉద్యోగపర్వ పరిమితంగా ఉంది. ఇది వస్తు పాత్ర విమర్శనం. మంగళగిరి కృష్ణ ద్వైపాయనాచార్యులు - కవితా విమర్శనము, ఉత్తర రామచరిత విమర్శనమే. కావ్యారంభం నుంచి అంతందాకా ఉన్న బహువిషయ ప్రచురంగా వ్యాసం రూపొందించాలన్న రచయిత కృషి గోచరమవుతుంది.

మంత్రిప్రెగడ భుజంగరావు (1876-1940) వ్యాసాలు సాహితీ విమర్శనంగా ఉన్నతంగా ఉన్నాయి. వఝ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి వసు చరిత్ర విమర్శనం వ్యాసంగా భావించటం కంటే విమర్శనంగానే గ్రహించటం సముచితం. దాని ప్రణాళిక, తన్నిర్వహణ విమర్శన రీతిలోనే సాగాయి.

పూర్తిగా కావ్య గుణ వ్యాసంగా కాకపోయి, కొంత గుణ సామ్యంవల్ల ఈ విభాగంలో పరికింపదగ్గ సృష్టిని కూడా చూపవచ్చు. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి - 'వ్యాసావళి' అయిదు వ్యాసాల సంపుటి. కంకంటి పాపరాజు సృష్టించిన సీతమ్మ శోకం, శబరీ కావ్య సమాలోకనం, వకుళమాలా పరిశీలనం వ్యాసాలు పోగా, గురజాడ వాల్మీకులు, కాళిదాసు భవభూతులు రెండు వ్యాసాలలో తారతమ్య పరిశీలనం పొందారు. ఈ రచన వ్యావహారికంలో సాగింది.

బి. టి. రాఘవాచార్యులు - 'నాటక దీపిక'లో నాటక నిర్ణయం నుంచి ప్రదర్శనం దాకా చేయవలసిన పనులు తెలపటం జరిగింది. తేకుమళ్ళ అచ్యుతరావు - 'ఆంధ్ర నాటకములు: రంగస్థలములు' (1926) లో నాటకావసరాలు, ప్రదర్శన దృష్టితో వివరించాడు. తేకుమళ్ళ రాజగోపాలరావు 'సారస్వత వ్యాసములు' (1930) లో ఛందశ్శాస్త్ర సంబంధి పరిశోధనం వెలువరించటం, నన్నయభట్టు అక్కరలు పరిశీలించటం, ఆంధ్ర కవితోత్పత్తి దర్శించటం చూడవచ్చు.

కావ్య గుణ వ్యాసం ఒక కావ్య గుణమో, గుణాలో ప్రపంచిస్తూ, స్తుత్యాత్మకమో, నిందాత్మకమో అవుతూ, విమర్శకుడి వ్యక్తిత్వ ప్రాధాన్యం నిలుపుకొంటూ, విమర్శన గుణ సంభరితంగా పరిణామం చెందింది. ఇది ఉత్తర భాగంలో ఈ పరిణామం కంటే భిన్నంగా రూపొందింది.

## 2. ఉత్తర భాగం

కావ్య గుణ వ్యాసం, ఈ భాగంలో, రచయిత వ్యక్తిత్వ ప్రాధాన్యం తగ్గి గుణ సందర్శన సమర్థంగా రూపొందింది, విషయం వివాదస్థాయినుంచి విపులీకరణ స్థితికి పెరిగింది. కావ్య స్తుతినిందలు తగ్గి, గుణదోష పరిశీలనం అధికమయింది. కావ్యంలో ఒక గుణం విశదీకరించటం కంటే బహుధర్మ పరి

చయం కావించటం ఎక్కువయింది. కావ్య గుణ వ్యాసం పూర్వభాగంలో పరిణతంగా వుంది.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి- మహా భారత రహస్య విమర్శనము (1940) కావ్య గుణ వ్యాసంగా ప్రాచీనతా వాసన పూర్తిగా వదులుకోకుండా వెలువడింది. శిష్టా సూర్యనారాయణ వ్రాసిన 'మహా భారత రహస్యము'ను విమర్శించటమే ఈ వ్యాసోద్దేశం. అయితే ఈ ప్రయత్నం వెనుక శ్రీకృష్ణ భారతములోని కొన్ని సందర్భాలు సంరక్షించుకోవాలన్న ఆశ వుంది. ఇటువంటి ప్రయత్నాలు జరిగి పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రితో వివాదం పెట్టుకోవలసి వచ్చింది. ఈ వ్యాసం తన సాహితీ రక్షణ ప్రయత్నంలో అవతరించినా నూత్నాలోచనలకు మార్గదర్శకమయింది.

శ్రీ వోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి-'ఆంధ్ర వాఙ్మయ పరిశోధన వ్యాసములు' (1944), 'పాణినీయము-కావ్యవాఙ్మయము' (1944) వ్యాస సంపుటులు. ఉత్తర గోగ్రహణము సందర్భంలో తిక్కన అనువాదమూ, కల్పనలూ, శ్రీనాథుని ప్రయోగాలూ పరిశీలించి, భారతంలో అఖండయతి లేదని నిర్ణయించిన మూడు వ్యాసాలు ప్రథమ సంపుటిలో ఉన్నాయి. రెండవది, వఝ్ఝల చిన సీతారామ స్వామి శాస్త్రి వ్రాతలను తిరస్కరించిన వ్యాకరణ గ్రంథం. ఈ రెండింటిలో తను తెలుపదలచిన విషయాలు నిర్భీతిగా, నిస్సంశయంగా వెలువరించాడు వ్యాసకర్త.

శ్రీ ఆండ్ర శేషగిరిరావు-'ఆంధ్ర సారస్వత వ్యాసావళి' (1952) లో కావ్య పాత్ర, తదంశ వివరణంగా వ్రాసిన పది వ్యాసాలున్నాయి. ఈ విమర్శనంలో సృజన గుణం శోభిస్తూ వుంది. ఆలోచనలు సారస్వత పరిమితంగా కాక సాంఘిక జీవిత దృక్పథంనుంచి పొందినట్లు విశదమవుతూ వుంది. ఇవి సాహిత్య పరమార్థం ప్రకటించాలన్న సదభిలాష ఫలితాలే.

శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రి-'సాహిత్య సమీక్ష' (1956), 'ద్రోణ ప్రశస్తి' (1960) వ్యాస సంపుటులలో కావ్య భాష పట్ల ముఖ్యంగా, పాత్ర సృష్టి పట్ల కించిన్మాత్రంగా ప్రదర్శించిన దృష్టి వ్యక్తంగా వుంది. మేఘ సందేశ, హరిశ్చంద్ర, శృంగార నైషధ, ఆముక్తమాల్యదలలోని, నిఘంటువు లోని పదాల అర్థ, శబ్ద, పాఠ పరిశీలన చేయటం జరిగింది. ఈ వ్యాసాలు

ఉత్తమ పరిశోధన ఫలితాలుగా ఉన్నాయి. ఈ కృషి నిర్వహణ పాండిత్య శోభి తంగా ఉంది. ఇవి, ప్రాచీన కావ్య సమూహంలో భాషా దృష్టితో చేసే పరి శోధనలో సముచిత స్థానం పొందుతూ వున్నాయి.

మల్లాది సూర్యనారాయణ శాస్త్రి-'వ్యాస రత్నావళి' భాషా సారస్వత సంబంధి వ్యాస సంపుటి. అనేక పత్రికలలో ప్రథమంగా ప్రచురితాలయిన ఈ వ్యాసాలు సంపుటీకరించటం ఇటీవలనే జరిగింది. 43 వ్యాసాల సంపుటి రెండు భాగాలుగా విభక్తమయింది. ఆంధ్ర భాష, సంస్కృత కావ్య విషయాలు ప్రథమ భాగంలో, సాహిత్య విమర్శనం రెండవ భాగంలో గోచరమవుతున్నాయి. మంచిచెడ్డలు, శిల్పము, మనుష్యులు తద్భేదములు వంటి సృజన గుణ శోభిత వ్యాసాలున్నాయి. వ్యాస గతంగా, వ్యాసకర్త సంస్కృతాంధ్ర పాండిత్యం అభి వ్యక్తమవుతూ వుంది. జీవిత చరిత్ర శబ్ద సాధుతా చర్చలు, కావ్య గుణ వ్యాసాలు ఉన్నాయి. కరుణ రస పరిపుష్ట నాటకా లారింటిని విమర్శించటం వల్ల ఆ సిద్ధాంత స్థాపన దృష్టి స్పష్టమవుతుంది. ఆంధ్ర భాషా పరిశీలనం విమర్శనం, వివరణం కలిగి వ్యాసాలున్నాయి. గ్రంథ పీఠికలు, పాత్ర పరి చయాలు దర్శనీయంగా ఉన్నాయి. విషయదృష్టి, విమర్శనాధిక్యం, పాండిత్య శోభవల్ల ఈ వ్యాసాలు విమర్శన వ్యాసాలుగా గ్రహించటం జరిగింది కాని, సృజన గుణం లేకపోలేదు. శ్రీ మల్లాది సూర్యనారాయణ సంస్కృత సాహిత్య సేవతోపాటు, ఈ వ్యాసావళి ఆంధ్రులకు మిగులుతుంది.

శ్రీ బులుసు వేంకటేశ్వరులు - 'భారతీ వ్యాసములు' (1955) పన్నెండు వ్యాసాల సంపుటి. ఇందులో కావ్యాలలోని కవితా గుణాల పరిశీలనం జరిగింది. సాధారణంగా ఎక్కువ మంది స్పృశింపని సాంబోపాఖ్యానము వంటి కావ్య గుణ పరిశోధనం చేశాడు. సంస్కృతాంధ్ర కావ్య నాటక గుణానుశీలనం చేశాడు.

ఆంధ్ర సారస్వత పరిషత్తు -'ఆంధ్ర మహాభారతోపన్యాసములు, ఆంధ్ర మహా భాగవతోపన్యాసములు' (1957) విభిన్న పండితులచేత ఇప్పించి ప్రచు రించటం జరిగింది. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, పోతన రచనా రీతులు వివరిస్తూ సాగిన ఈ ఉపన్యాసాలు ప్రముఖులయిన విమర్శకుల వాణిగా ప్రసిద్ధిపొందాయి. ఈ పదమూడు వ్యాసాలు పరిమితిలోనూ, విషయగతంగానూ విస్తృతంగా ఉన్నాయి. నన్నయ ఆంధ్రీకరణం పరిమితంగా ఉంది. ఎఱ్ఱన అరణ్య పర్వ

శేష వ్యాసం విస్తృతంగా ఉంది. తిక్కన రచన అయిదు వ్యాసాలలో ప్రతి పర్వ పరిశీలనంగా సాగింది. వ్యాస కర్తలందరికీ భాషాంతరీకరణం మీద దృష్టి ఉంది. పాత్ర సృష్టి పరిశీలనం, కవితా చమత్కారం దర్శించటం జరిగింది. పోతన చరిత్ర, కాలం, అనువాద విధానం, కవిత్వం, విశేషాలు, మతధర్మం పరిశీలిస్తూ సాగిన వ్యాసాలు ఆరు విస్తృతంగా ఉన్నాయి. డా. పుట్టపర్తి నారాయణాచార్యులు పోతన కవితా జీవితాలపట్ల చేసిన ఆలోచన ప్రముఖంగా రెండు వ్యాసాలై ఉంది. ఈ వ్యాస సంకలనాలు తెలుగు సాహిత్యంలో విమర్శన స్థాయి పెంచి విలువలు స్థాపించే సామర్థ్యంతో ఉన్నాయి.

జాస్తి వేంకట నరసయ్య - 'వ్యాసవాణి' నాలుగు భాగాలు. ఈ సంపుటులలో కళా సాహిత్య సాంఘికాది బహు విషయ విస్తృతి గోచరమవుతూ వుంది. ఈ వ్యాస గతంగా ఉన్న విమర్శనం ఏ విధంగానూ సమగ్రంగా లేదు. ఏదీ సంపూర్ణతను పొందలేదు. ఇంకా ఈ వ్యాసాలు సృజనంగా భావింప గలిగేంత సరసంగా ఉన్నాయి. విషయం విమర్శనంగా, రచనం సృజనంగా సాగి, కొంత విమర్శనంగా కొంత సృజనంగా రూపొందించిన వ్యాసాల సంపుటులివి. కవినీ, కర్మయోగినీ, ఆంధ్రజాతినీ, ఆంధ్ర భాషనూ, మతాన్నీ, మానవత్వాన్నీ, ప్రాచీన సారస్వతాన్నీ, ఆధునిక కవితనూ, ఆంధ్ర కవులనూ, ఆంధ్రేతరులనూ, సాహిత్యాన్నీ ఆధ్యాత్మికాన్నీ వ్యాస సృష్టిలో జాస్తి వేంకట నరసయ్య నిక్షిప్తం చేశాడు. ఇవి విమర్శన సృజన వ్యాస ధర్మ సమ్మేళనంతో వెలువడ్డ వ్యాసాలు.

విశ్వనాథ సత్యనారాయణ వ్యాసాలూ ఈ ధర్మం ప్రదర్శిస్తూ ఉన్నాయి. కావ్యగుణ వ్యాస విషయం, నన్నయ ఆంధ్రీకరణమయినా, అల్లసాని వాని అల్లిక జిగిబిగి అయినా, శాకుంతలము యొక్క అభిజ్ఞానత అయినా, నాచన సోమన కవితా దర్శనం అయినా, ఏమయినా ఆంధ్ర పంచకావ్య పరిచయ మయినా సృజనంగా రూపొందించారు. [illegible] దృష్టికి సముచితంగా ఉంటుందనుకొన్న [illegible] వ్యాససృష్టి సృజనంగా చేయటంలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ సమర్థుడు.

శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి 'రామాయణ భారత తత్త్వ దర్శనం' పాత్ర, సన్నివేశగతంగా చేశాడు. శ్రీ బి. యస్. శాస్త్రి - 'రాళీబందము-దాని

ప్రాశస్త్యము' లో చారిత్రక దృష్టిని ప్రపంచించటం దర్శింపవచ్చు. విశ్వ విద్యాలయాలలో విమర్శన వ్యాసావిర్భావం అధికంగా జరుగుతూ ఉంది. అది పరిశీలించటం కర్తవ్యమే!

డా. దివాకర్ల వేంకటావధాని-'కావ్యలహరి' అయిదు కావ్యాల విమర్శన వ్యాస సంపుటి. శృంగార నైషధం, మను చరిత్రం, పారిజాతాపహరణం, వసు చరిత్రం, విజయ విలాసం గ్రహించి వీటిలోని సర్వ సౌందర్యాలు వివరించాలన్న అభీష్టంతో వ్యాస సృష్టి చేశాడు. ఈ వ్యాసాలు 'యువభారతి' సంస్థ ఉపన్యాసాలుగా, గ్రంథస్థంగా చేయటం ఆలస్యంగా జరిగినా, ఈ వ్యాసాల విషయం అనేక ప్రదేశాలలో ఉపన్యాసంగా ఆంధ్రు లనేకులు విన్నారు. కావ్యగత గుణ విపులీకరణంగా ఈ వ్యాసాలు సుప్రసిద్ధి వహించాయి. 'సాహిత్య సోపానములు' ఆలంకారిక విషయ వ్యాసాల సంపుటి. కావ్య విషయాలు అనేకం శాస్త్ర పరిధిలో పరికించినట్లు, ప్రక్రియా పరిచయం కావించినట్లు గమనించాలి. ఈ సంపుటి వ్యాస పరిధికి అతీతంగా ఉంటుందనటం పరిపాటి అయింది. ఆంధ్ర నాటక పితామహుడు కీ. శే. ధర్మవరము రామకృష్ణమాచార్యుల వారి నాటకములపై విమర్శ ఏడు వ్యాసాల సంపుటిగా గ్రహింపవచ్చు. అయితే ఇది సిద్ధాంత వ్యాసంగా పరిగణింపబడి వ్యాస పరిధిని దాటుతూ ఉంది. వ్యాస కర్త పాఠశాలల విద్యార్థులు వ్యాస రచనలో సుశిక్షితులు కావటం కోసం పాఠ్యాంశ పరిమితంగా ఉన్న వ్యాస సంపుటి ప్రచురించాడు. డా. దివాకర్ల వేంకటావధాని వ్యాస సృష్టి స్థూలంగా కావ్యగుణ పరిశీలనంగా ఉంది. సరళ గ్రాంథికంలో రసభరితంగా వ్యాస రచన చేసే నైపుణ్యం ఈ రచయిత సొత్తు. ఉత్తమ విమర్శ వ్యాస పథ ప్రదర్శకంగా ఈ వ్యాస సృష్టి ఉంది.

డా. యస్వీ జోగారావు-'సప్తతంతువు', 'మహాకవి మార్గము' (1965), 'సారస్వత నీరాజనము' (1965) వ్యాస సంపుటులు. ఇవి మాత్రమే గ్రంథస్థాలయినా, పత్రికలలో ప్రచురితాలు, ఆకాశవాణిలో ప్రసారితాలు అనేక వ్యాసాలున్నాయి. దక్షిణాంధ్ర యుగ సాహిత్య విమర్శలు అనేకం భారతి, ఆంధ్ర పత్రిక సారస్వతానుబంధంలో ప్రకటించటం జరిగింది. పాత కొత్త విషయాల పరామర్శగా, తిక్కన కవితా గుణ పరిశీలనంగా, ఆముక్తమాల్యదాయ రచనా రీతి ప్రదర్శకంగా అనేక వ్యాసాలు ఈ సంపుటులలో గోచరమవు

తున్నాయి. సక్రమ విభజనతో, హేతుసహితాలోచనతో, నూత్న భావ ప్రచారంతో, కవితా వచనంతో, కావ్యగుణ ప్రకాశంగా వ్యాస సృష్టి చేసే సామర్థ్యం రచయితకుంది. సాహితీ విమర్శనంతో నూత్న రీతులు ప్రదర్శించే తీరులో ఉన్న ఈ వ్యాసాలు సారస్వత విద్యార్థులకు అత్యంతావసరంగా ఉన్నాయి విమర్శన విధానంలో నూత్నంగా ఉన్నాయి.

డా. సి నారాయణరెడ్డి-'వ్యాస వాహిని' (1965) ప్రాచీనాధునిక కవితా ప్రపంచంలో వెలుగు కళికలుగా ప్రకాశించే కావ్య, కవి, పాత్రల గుణ పరిశీలనం చేసిన సారస్వత విమర్శన వ్యాస సంపుటి బహు విషయాలు సమగ్రంగా సృజనంగా వ్యాసాలు రూపొందాయి. ఈ వ్యాస వాహిని అవతరణకు ప్రథమ వేదికలుగా ఆకాశవాణి, అనేక పత్రికలు ఏర్పడ్డాయి. రంగనాథ రామాయణాది కావ్యగుణ పరిశీలనం నన్నెచోడాదుల కవితా దర్శనం, శుక సప్తతి మొదలైన కావ్యాలలో సాంఘిక జీవితం, తిక్కన వేమన రవీంద్రుడు కవితాతత్త్వాలు గ్రహించటానికి చేసిన ప్రయత్నంగా రూపొందిన వ్యాసాలు సాహిత్య విమర్శన వ్యాస స్థాయిని పెంచేవిగా ఉన్నాయి. కవిగా సుప్రసిద్ధి వహించిన సి. నారాయణరెడ్డి వ్యాసం సృజనంగా వచనం కవితా పరిధిలో పరిభ్రమించేదిగా తీర్చిదిద్దటం గుర్తింపవచ్చు.

డా. కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి- 'నైమిశము', 'సమీక్షణ' సాహిత్య వ్యాస సంపుటులు. ఈ సంకలనాలో ఘటికాచలమాహాత్మ్యము, కన్యా శుల్కము, గయోపాఖ్యానము వంటి కావ్య గుణ పరిశీలనం జరిగింది. విమర్శనం, గేయ వాఙ్మయం, భావ కవిత్వం వంటి ప్రక్రియాలోచనం ద్యోతకమవుతూ వుంది. దేవయాని, ఋష్యశృంగర్షి పాత్ర పరిశీలనం ఉంది. కవిత్వం పట్ల భక్తి, సురభాష పట్ల గౌరవం వ్యక్తమవుతున్నాయి. సాహితీ విమర్శన సామర్థ్యం, అది నిర్వహించే పాత్ర వ్యాసకర్తకు విపులంగా తెలుసు. విమర్శకుడు, విమర్శనం ఏ హద్దులలో ఉండాలో తెలుసు. ఆ పరిమితి ఏ పరిస్థితులలోనూ దాటకపోవటం ఈ వ్యాస వైశిష్ట్యం. వ్యాస భాష గ్రాంథికమయి అక్కడక్కడా ప్రాబంధికంగా ఉంది. ప్రాచీనాధునిక సారస్వత సమ్యగ్దృష్టి ఈ సాహిత్య వ్యాసాలలో ద్యోతకమవుతూ

వుండి. వ్యాస విషయం వ్యక్తీకరించటంలో పరిశోధన దృష్టి ప్రపంచితంగా ఉంది. వివరణం విపులీకరణంలో రచయిత ప్రత్యేకంగా జాగ్రత్త వహించటం జరిగింది.

డా. తిమ్మావజ్ఝల కోదండరామయ్య-'తెనుఁగు మఱుఁగులు', 'కళాపూర్ణోదయ ప్రశంస' లలోని వ్యాసాలే కాక పత్రికలలోనూ ప్రచురించిన వ్యాసాలు అనేకం ఉన్నాయి. కళా పూర్ణోదయ ప్రశంస అయిదు వ్యాసాలు, ఇతివృత్తం, ఉపాఖ్యానాలు, సాంకేతికత, పాత్ర చిత్రణం, సూరన స్వప్న జగత్తు విషయాలుగా ఉన్నాయి. ఈ విషయాలు వ్యాసాలుగా అనేకులు వ్రాయటం జరిగింది కాని, కుమార సంభవం, హరివంశం, కాళహస్తి మహాత్మ్యం, కాశీ ఖండం వంటి రచనల్లో పదచర్చ, ఉచిత పాఠ నిర్ణయ కృషి నూత్నంగా ఉంది. 'తెనుఁగు మఱుఁగులు' 'తెనుఁగు మెఱుఁగులు'ను గుర్తుకు తెస్తూ ఆచార్యస్తుతి రూపంగా గోచరమవుతూ వుంది. గ్రాంథిక వ్యావహారిక భాషా రచనంలో మెలకువలు తెలిసిన వ్యాసకర్త భావావిష్కరణం నిరాఘాటంగా జరిగింది.

డా. జె. సూర్యనారాయణ - 'వ్యాసరాజి' (1969) సారస్వత వ్యాస సంపుటి. పరిశోధన ప్రసిద్ధంగా, విషయ మౌలిక ధర్మ ప్రరోచనంగా, అవతరించిన వ్యాసాలు 14. నూత్నాంశ బోధక వ్యాసాలు పలు ప్రముఖ సంచికలలో ముద్రితాలయ్యాయి. విమర్శన కృషికి దర్పణంగా ఉన్న ఈ వ్యాస సృష్టి సమ్యగాలోచనా ప్రతిబింబమయింది.

డా. జి. వి. సుబ్రహ్మణ్యం - 'సారస్వత సౌరభము' (1970) సహృదయత్వం, సమన్వయతత్త్వం, సరస సమాలోచనం, సాహితీ పరిశీలనం, ప్రత్యగ్ర పరిష్కారం తెలిపే సమీక్ష వ్యాసంగ ఫలం. వ్యాసకర్త విశిష్ట సాహితీ స్రష్టగా ద్రష్టగా రూపొందటం జరిగింది. ఆంధ్ర సాహిత్య ఎకాడమీ 'సారస్వత వ్యాసములు' రెండు సంపుటాలకు వ్రాసిన ఉపోద్ఘాతాలు ఉత్తమ విమర్శన రూపాలుగా గోచరమవుతున్నాయి. వక్తగా, ఆంధ్రో[illegible]త్వంలో, సాహితీ [illegible]త్వంలో పెంపొందుగు వేస్తున్న రచయిత వ్యక్తిత్వం శోభాయమానంగా ఉంటుంది. రచయిత ఉత్తమ గ్రాంథికంలో, సమ్యగాలోచనంతో వ్యాస సృష్టి కావించటం గుర్తింపవచ్చు.

శ్రీ కాకర్ల హనుమంతరావు-'సాహితీ జగతి' (1970) సంస్కృతాంధ్ర భాషా వ్యాకరణ సారస్వత సంబంధి వ్యాస సంపుటి. భాష వ్యావహారికంగా

ఉన్నా, గ్రాంథికముద్ర ద్యోతకమవుతూ వుంది. తిరుపతి వేంకట కవులు, కృష్ణశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి వంటి సాహితీపరుల జీవిత చరిత్ర వ్యాసాలున్నాయి. సంస్కృతాంధ్రోదాహరణాలతో విమర్శనంగా వివరణంగా సాగిన ఈ వ్యాస సృష్టి వెనుక ప్రాచీన సంప్రదాయ శైథిల్యం, ఆధునిక జీవిత విశృంఖలత్వం పట్ల రచయిత ఆవేదన అంతర్వాహినిగా ఉంది.

ఆవంత్స వేంకట రంగారావు - 'వ్యాసావళి'లోని వ్యాసాలు చాలా కాలం క్రిందటే వ్రాయటం జరగినా సంపుటిగా ప్రచురించటంలో ఆలస్యం జరిగింది. వనకుమారి, మధురావిజయము వంటి కావ్య గుణ పరిశీలనం, దేశాభిమానం, నవ్యకవిత్వం వ్యాసకర్తను రచనకు ప్రోత్సహించాయి. రచయిత సంస్కృతాంగ్లాంధ్ర పాండిత్యం వ్యాసాలలో గోచరమవుతూ ఉంది. కవితా హృదయం విమర్శన బుద్ధి సమ్మేళనంలో అవతరించిన సృష్టి ఈ వ్యాసాలు.

శ్రీ పంతరాం రామకృష్ణరావు–'వ్యాస మంజరి' (1964) నిశితంగా సారస్వత విషయ పరిశీలనం కావించింది. ఇది వాసా కృష్ణమూర్తి, వాసా సుబ్రహ్మణ్యశాస్త్రి రచయితలై సృజించిన శారదా వ్యాసమాల, క్షేత్ర మాహాత్మ్యం, పాత్రచిత్రణం, కావ్యధర్మం, ప్రబంధకవిత్వం, వేమూరి రాధాకృష్ణమూర్తి-ఆణి ముత్యాలు, వర్తమానాంధ్ర కవితాలోకంలో సుప్రసిద్ధులైన పదహారుగురి సాహితీ సాక్షాత్కారం చేయించే వ్యాస సంపుటి.

కావ్య గుణ వ్యాసం తెలుగు సారస్వంలో సమధికంగా ఉంది. విమర్శ కుల కావ్య పరితమింగా సాగించిన పరిశీలనం ఉత్తమ మార్గంలో సాగింది. ఈ విమర్శనం సంపూర్ణ కావ్య, ప్రక్రియా విమర్శనకు దోహదకారి కాగలిగినంతగా రూపొందింది. పండితులు, సారస్వత ప్రముఖులు అనేకులు ఈ విధమయిన విమర్శన రచనంపట్ల చొరవ చూపించారు. ఈ విమర్శనం గ్రహించి ఉత్తమ కావ్యం సృజించటానికి తగినంత సమర్థంగా ఇది అవతరించింది. స్థూలంగా సమగ్ర సాహితీ విమర్శన భూమికను ఈ కావ్య గుణ వ్యాసం నిర్వహించింది.

## 4. కవ్యాత్మ వ్యాసం

కావ్యగుణ వ్యాసం కావ్య ధర్మాలూ, కావ్యాత్మ వ్యాసం కావ్యతత్త్వమూ విమర్శించే రచనలు కాగా, కవ్యాత్మ వ్యాసం కవితత్త్వం విశదంచేసే ప్రక్రియ.

ఈ వ్యాసం కవి ప్రాధాన్యంతో ఉంది. కవి ఆత్మధర్మం కావ్యంలో ప్రతిష్ఠితరీతి పరికించటం ముఖ్య లక్షణంగా వ్యాస సృష్టి జరిగింది. కవి జీవితం కావ్య జీవితంగా పరిణమించటం పరిశీలించిన వ్యాస రచనం తెలుగులో అభివృద్ధి చెందుతూ ఉంది.

కవి తన కాలంలోని రచనారీతి కంటే భిన్నంగా వ్రాయటంలో, నూత్న ప్రక్రియను రూపొందించటంలో, నూత్న భాష ప్రచారం కావించటంలో, సామాన్య దృష్టిని విస్తృతం కావించటంలో తన మానసిక హార్దిక వాంఛలను కావ్యంలో నిక్షిప్తం చేయటంలో, తన అభీష్టం రూపొందించటంలో, ఏ ధర్మ మయినా అనుభూతి తీవ్రతతో అవతరింపజేయటంలో, తన వ్యక్తిత్వం రచనలో చొప్పించటంలో, తనే రూపాంతరంగా కావ్యంగా మారటంలో కవి ఆత్మే కావ్య మయిపోవటం సంభవమవుతుంది ఈ స్థితి పరిశీలించిన విమర్శనం కవ్యాత్మ వ్యాసం.

ఆముక్తమాల్యదలో క్షత్రియధర్మం ఉందనినా, మొల్ల రామాయణంలో స్త్రీత్వం ఉందనినా, శ్రీనాథుడు శృంగార ప్రియుడు, పోతన భక్తితత్పరుడు అనినా, శ్రీనాథుడిలో భక్తి, పోతనలో శృంగార గుణాలు ఉన్నాయి అనినా, వీరేశలింగంలో సంఘ సంస్కరణం, గురజాడలో దేశభక్తి ఉన్నాయనినా, కావ్యగతంగా కవి ఆత్మను దర్శించిన ప్రయత్నం స్పష్టమవుతుంది.

సాధారణంగా కావ్య వస్తువు, ప్రక్రియ, భాష ఎన్నుకోవటంలోనే కవి తత్త్వం గోచరమయ్యే అవకాశం ఉంది. అయితే ఒక కాలంలోని సామాన్య కావ్యధర్మం ఎక్కడో తప్ప ఎవరో తప్ప, అన్నిచోట్ల అందరూ అధిగమించ లేరు. శ్రీకృష్ణదేవరాయల కాలంలో గురజాడ అప్పారావు పంతులు, కందుకూరి వీరేశలింగం పంతులు జన్మించి ఉంటే, శృంగార కథ, ప్రబంధ రచన, ప్రాబంధికమూ, అలంకారికమూ అయిన భాష ప్రయోగించి అయినా ఉంటారు లేకపోతే రచనయినా చేసి ఉండరు అనుకోవటానికి ఆయా యుగ సాహిత్యమే దోహదం చేసింది. కాని ఏ వస్తువు, ఏ ప్రక్రియ, ఏ భాష గ్రహించినా, కవి ఆత్మ ప్రత్యక్షంగానో పరోక్షంగానో తన అస్తిత్వం నిలుపుకొంటుంది. గ్రహింప చేస్తుంది. శృంగార రస విజృంభణంగా సాగిన మనుచరిత్రలో పెద్దన నైష్ఠికబుద్ధి, నిరంకుశోపాఖ్యానంలో కందుకూరి రుద్రకవి స్వేచ్ఛాప్రవృత్తి,

కాళహస్తి మాహాత్మ్యంలో ధూర్జటి విశృంఖల జీవితం, నిర్వచనోత్తర రామాయణంలో తిక్కన యువక మనస్తత్వం, భారతంలో మంత్రిబుద్ధి విస్పష్టంగా గోచరమవుతూ ఉన్నాయి.

కావ్యంలో వ్యక్తమయ్యే గుణాలలో ఏవి కవిగతంగా ఉన్నాయో, ఏవి పాత్రగతంగా ఉన్నాయో గ్రహించటం కష్టంకాదు. మహాకవి రచనంలో తన వ్యక్తిత్వం సంపూర్ణంగా మరుగుపడిపోతుందనీ, ఆ విధంగా రచించటం అందరికీ సాధ్యంకాదనీ అనటంలో కొంత సత్యం లేకపోలేదు. షేక్స్పియరు నాటకాలలో ఏ పాత్ర గతంగానూ నాటక కర్త గోచరం కాడు అనటం పరిపాటి. స్థూలంగా అది సత్య సందర్శనం చేసిన వాక్కుగా కనిపిస్తుంది. అయితే విషాదాంత నాటక రచనంలో తలపండిన పెద్దగా భావించే దశను సాధించటంలో విషాద నాటక సృష్టి పట్ల కర్త అభీష్టం స్పష్టమవుతుంది. కాబట్టి ప్రతి రచనంలోనూ, స్పష్టంగానో నిగూఢంగానో కవి ఆత్మ విస్తరించి ఉంటుంది. దానిని విశ్లేషించి విమర్శించిన వ్యాసం కవ్యాత్మ వ్యాసం.

అంతేకాక, ఒక కవి వ్రాసిన అనేక కావ్యాలలో సామాన్య లక్షణంగా కనిపించే దానిని, వ్యక్తిత్వంతో ముడిపడినా-లేకపోయినా, అభీష్టంగా భావించి, విమర్శించిన వ్యాసం కవ్యాత్మ వ్యాసం. తొణుకెరుగని తీవ్ర సంస్కరణ వాంఛతో సాహిత్య సృజనం చేసిన కందుకూరి వీరేశలింగం పంతులు ప్రహసనాలలో సామాన్య ధర్మంగా హాస్యం మొరటుగానూ, బూతుగానూ ఉంది. ఈ విధంగా వ్రాయటం సాంఘికావసరమై, అభీష్టమయింది. ఈ విశ్లేషణవ్యాసం కవ్యాత్మ వ్యాసంగా భావింపబడుతుంది. కావ్యతత్త్వ వ్యాసం అనేకుల కావ్యాల తత్త్వదృష్టితో ఉంటే ఒక కవి కావ్యాలలోని ఒక గుణంగా ఈ కవ్యాత్మ వ్యాసం ఉంది.

కవ్యాత్మ ప్రపంచించే రచనం విస్తృతంగా విశాల ప్రణాళికా పరిమితంగా ఉంటే విమర్శనం, కాకుంటే వ్యాసం. శ్రీనాథుని కావ్య సృష్టిలో శృంగార రసపోషణం పరికించే 'శృంగార శ్రీనాథము' (వేటూరి ప్రభాకరశాస్త్రి) విమర్శనంగా రూపొందించటం జరిగింది. అదే విధంగా నన్నయ రచనా గుణం 'నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి' (విశ్వనాథ సత్యనారాయణ) విమర్శనంగా ఆవిష్కరించటం గమనింపవచ్చు. ఈ విధంగానే 'నన్నెచోడుని కవిత్వము'

(శ్రీ అమరేశం), 'శ్రీనాథుని కవిత్వతత్త్వము' (శ్రీ కుందూరి ఈశ్వరదత్తు) వెలయించిన విమర్శనలు పరికింపవచ్చు. ఒక కవి కవితా పరిశీలనంగా అనేక విమర్శన గ్రంథాలు అవతరించాయి. అయితే కవ్యాత్మ వ్యాస సృష్టి బహ్వోధికంగా లేదు.

## 1. శ్రీ దేవులపల్లి రామానుజరావు

ఈ రచయిత వ్యాస సృష్టి 'సారస్వత నవనీతము' (1955), 'వ్యాస మంజూష' (1956) సంపుటులలో వుంది. ఇదికాక ఆకాశవాణి, పత్రికలలో ఈ కృషి వెలువడింది. తెలుగు దేశంలో సారస్వత వేదిక నుంచి కనిపించే మేధావి వర్గంలో ఈ రచయిత స్థానం ప్రముఖంగా ఉంది.

శ్రీ దేవులపల్లి రామానుజరావు కృషిలో వ్యాస సృజనం పరిమితంగా ఉంది. సాహితీ పోషణం ప్రోత్సాహం ప్రధానంగా, సృజనం అప్రధానంగా జరిగినా, జరిగినంతలో సాహిత్య సృష్టి విశిష్టమే ఈ వ్యాస సృష్టి ఆ సారస్వత యత్నంలో కొంత భాగం. వీటిలో కవ్యాత్మ వ్యాసాలు అధికంగానే ఉన్నాయి. కావ్యతత్త్వ కావ్యాత్మ వ్యాస సముదాయమూ గోచరమవుతుంది

వ్యాసకర్తకు ఆంధ్రత్వం మీద అభిమానం అధికం. తెలుగువాళ్ళు కలసి ఉండాలని ఆంధ్రోద్యమంలో కోరి, తెలంగాణా, ఆంధ్ర విడిపోకూడదని వాంఛించిన సమైక్యవాది రచయిత. తెలుగువాళ్ళు గౌరవింపబడాలని, తెలుగు సారస్వతం విస్తృతంగా వ్యాపించాలని ఆశించే హృదయవాది వ్యాసకర్త. శ్రీ దేవులపల్లి రామానుజరావు సృష్టించిన వ్యాస వాఙ్మయ పరిశీలనం చేసినప్పుడే ఈ సత్యం స్పష్టమవుతుంది.

కవ్యాత్మ వ్యాసం: ఆంధ్ర సాహిత్యంలో సుప్రసిద్ధులైన కవుల సాహిత్యంలోని ఆత్మదీప్తిని వ్యక్తిత్వాన్ని తెలిపే వ్యాసాలు ఈ రచయిత ప్రాయటం జరిగింది. క్షేత్రయ్య పద సాహిత్యంలో ఉన్న వర్ణనలు గ్రహించటంతో 'క్షేత్రయ్య నాయికలు', మునిమాణిక్యం నరసింహారావు కాంతం పాత్ర సృష్టిని స్పృశించటంతో 'మునిమాణిక్యంవారి కాంతం' వ్యాసాలు రూపొందాయి.

ఇంతేకాక కందుకూరి సంఘ సంస్కరణం, కొమర్రాజు వేంకట లక్ష్మణరావు చారిత్రక కృషి, గురజాడ సాంఘిక చైతన్యం, ముట్నూరి వ్యాస రచన

ధర్మం, కట్టమంచి విమర్శనం, క్షేత్రయ్య, పోతన, ముద్దుపళని శృంగారం తమ రచనలలో ఏ విధంగా రూపొందించారో తెలపటానికి వ్రాసిన వ్యాసాలు కవ్యాత్మ వ్యాసాలే ! ఇంకా చిలకమర్తి, వెళ్ళపిళ్ళ, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, సురవరం ప్రతాపరెడ్డి, రవీంద్రుడు, తోరూవత్, రాయప్రోలు సుబ్బారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి సాహిత్య పరిశీలనం వ్యాసగతంగా వుంది.

కావ్యతత్త్వ వ్యాసం: అనేక కావ్యాలకు వర్తించేది, అనేక కావ్యగతంగా నిలిచేది అయిన తత్త్వ పరిశీలనం చేసిన వ్యాసాలున్నాయి. ఆంధ్ర వాఙ్మయంలో ప్రకృతి చిత్రణ నన్నయతో ప్రారంభించి జాషువాతో ముగించటం గమనింపవచ్చు. నవ్యసాహిత్యంలో వీర కావ్యాలు ప్రతాప చరిత్రతో ప్రారంభించి చర్చించటం జరిగింది. ఇందులో శివభారతం ప్రాధాన్యం వహించింది. జానపద గేయాలు, స్త్రీల పాటలలో కవిత్వం దర్శితమయింది. సమాజంలో రచయిత స్థితి పరికింపబడింది. సామూహిక కావ్యతత్త్వంతో సంబంధించిన వ్యాసస్పృష్టి విస్తృతంగానే వుంది.

కావ్యాత్మ వ్యాసం : ఒక కావ్యతత్త్వం వివరించే ఈ రచయిత వ్యాస స్పృష్టి వుంది. సూరన కళాపూర్ణోదయంలో శృంగారాత్మ దర్శితమయింది. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ వేయిపడగలు 'భావ ప్రేరకము నవల' గా భావితమయింది. టంగుటూరి ప్రకాశపంతులు స్వీయ చరిత్ర రచనగా గ్రహింపట మయింది కావ్యాత్మ వ్యాసం విస్తృతంగా ఈ రచయిత చేత సృజింపబడలేదు.

శ్రీ దేవులపల్లి రామానుజరావు వ్యాస స్పృష్టి ప్రధానంగా కవ్యాత్మ వ్యాసంగా వుంది. సారస్వతంలో ఆధునికస్థితి పట్ల రచయిత ఆలోచన సాగింది. దేశచరిత్ర సారస్వతాభివృద్ధి ముడిపడినట్లు రచయిత భావించటం స్పష్టమయింది. తెలంగాణాలో వచ్చిన సాంఘిక సారస్వత చైతన్యానికి అక్షర రూపంగా చేసిన వ్యాస స్పృష్టి వుంది. ఆంధ్ర సారస్వతాభ్యుదయం నిరంతర వాంఛగా ఈ వ్యాస వాఙ్మయమంతా ప్రతిధ్వనిస్తూ ఉంది. ప్రాచీనాంధ్ర సాహిత్యంలోని విశేషాలు సమీక్షించటం, సాహితీమూర్తుల పరిచయం రూపొందించటంగా ఈ వ్యాస స్పృష్టిలో గోచరమవుతూ ఉంది

ఈ వ్యాసాలు స్థూలంగా సారస్వత విమర్శనంగా గ్రహించినా రచయిత వ్యక్తిత్వం రచనాగతంగా ఉండటం వల్లనూ, రచనా రీతి వల్లనూ సృజన గుణంతో శోభించే వ్యాసాలూ వ్యాస భాగాలూ అధికంగా ఉన్నాయి. సాహిత్య పర్యాలోకనంలో సాహిత్య ప్రగతి, కళ, క్షేత్రయ్య నాయికలు మొదలైనవి సృజన వ్యాసాలుగా ఉన్నాయి.

వ్యాసాలు అధికంగా వివరణాత్మకంగా ఉంటే కొన్ని విమర్శనంగా సాగాయి. సమీక్షలుగా సింహావలోకన ప్రాయంగా ఉన్నాయి. జీవిత చరిత్ర వ్యాస రచనం ఉంది. భాష ఆరంభంలో గ్రాంథికంగా ఉంది. క్రమంగా వ్యావహారికం వైపు మొగ్గుచూపుతూ వచ్చింది.

బహు విషయాలు అనేక వ్యాసాలలో వెలువరించి, ఈ వాఙ్మయం పరిపుష్టం కావించిన ఆధునికులలో ఈ రచయిత ప్రసిద్ధి గణనీయం. కవ్యాత్మ వ్యాసమే కాక తదితరం తత్సమానంగా రూపొందించి, సాహితీ సేవ కావించిన శ్రీ దేవులపల్లి రామానుజరావు వ్యాస సృష్టి విశిష్టంగా ఉంది.

## 2. డా. బి. రామరాజు

డా. బి. రామరాజు వరంగల్లు పి. జి. సెంటరులో ఆంధ్రాచార్య పదవిని, కళాశాలాధ్యక్ష పీఠాన్ని అలంకరించటం, జానపద వాఙ్మయ పరిశోధన కావించటం, అనేకుల చేత పరిశోధన చేయించటం సుప్రసిద్ధమే. 'జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి' (1960), 'మరుగునపడిన మాణిక్యాలు' (1961) ఈ రచయిత వ్యాస సంపుటులు.

18 గురు విస్మృతాంధ్ర కవుల కృతుల పరామర్శ ద్వారా కవులకు, కవితకు విమర్శక భానూదయమయింది. స్పష్టంగా ఆంధ్రావళి దర్శించే అవకాశం ఏర్పడింది. అనాదృత వాఙ్మయంగా బహుకాలంగా ప్రచారంలో ఉన్న జానపద గేయ వాఙ్మయం సంపాదించి, పరిశోధించి వెలుగు ప్రసాదించి వ్యాసాలుగా రూపొందించటం వల్ల భాషకు నూత్నాలంకారం ఏర్పడినట్లయింది.

ఎవరూ స్పృశించని అంశం సలక్షణము, సులభమూ అయిన భాషలో అభివ్యక్తం చేయటం రచయితకు అభీష్టం. సారస్వతంతో పాటు సంస్కృతి, చరిత్ర ఆలోచనాంశాలయి, నూత్న గుణ ద్యోతక కాలయ్యాయి ఈ వ్యాస సృష్టి

రచయిత సమగ్ర కృషిలో స్వల్పభాగమే అయినా, సాహితీ సిద్ధి వల్ల సారస్వతాలంకారంగా ఉంది.

## 3. డా. చల్లా రాధాకృష్ణ శర్మ

డా. శర్మ 'తెనుగు విందు' 17 వ్యాసాల సంపుటి. ఇందులో ఎఱ్ఱన, సోమన, శ్రీనాథుడు, పెద్దన, చేమకూర, పాల్కురికి, చిన్నయల సాహిత్య కృషి వివరణ వ్యాస్యాలున్నాయి. అంతేకాక ఆరుగురు అన్యదేశీయులైన క్రైస్తవుల సాహిత్య సేవ సముచితంగా వివరింపబడింది.

తెనుగు భాష తేనె సోనగా ఉండటం, అది తమిళంలో పొందిన ప్రశస్తి, పామర సాహిత్య ప్రసంగం ఈ వ్యాస గతంగా గోచరమవుతూ వుంది. వ్యాస రచనం కవుల విషయంలో జీవిత చరిత్రంగా రూపొందింది.

వర్తమానాంధ్ర సారస్వత వ్యాస స్థితికి ఈ వ్యాసాలు నిదర్శనంగా చూపవచ్చు. ఈ వ్యాసాలలో కావ్య, కవి విమర్శనకంటే పరిచయం ప్రముఖంగా ఉన్నట్లు స్పష్టమవుతుంది. ప్రాథమిక విమర్శనంగా పరిపక్వ పరిచయంగా ఈ వ్యాస స్థితి ఉంది. భాష సరళంగా ఉంది ఏ వ్యాసమూ విస్తృతంగా వ్యాపించలేదు. వ్యాస గత విషయం అధికం కాదు. అనేక కవుల ప్రాథమిక విషయాలు తెలియటానికి ఈ వ్యాస పరిచయం అవసరమవుతుంది.

## 4. ఇతర వ్యాసకర్తలు

కథాత్మ వ్యాస సృష్టి చేసిన రచయితలు చాలా మంది ఉన్నారు. ఒక్క కవి సాహిత్యం భిన్న విమర్శకులు పరిశీలించి వ్యాస నిర్మాణం కావించటం జరిగింది. తెలుగు సారస్వతంలో సముచిత విస్తృతత్వం ప్రచారం పొందిన వ్యాస పరిణామం ప్రదర్శించేటట్లుగా అరంభమయి నిర్వహణం పొందిన ఈ కోవలోని రచనలు పరికింపవచ్చు.

పి. దక్షిణామూర్తి, మద్రాసు క్రైస్తవ కళాశాలాంధ్ర భాషాభిరంజనీ సమాజ సమావేశంలో 10-8-1893న పింగళి సూరనను గూర్చి విమర్శన వ్యాసం చదివాడు. ఇది తెలుగు విమర్శన వ్యాస వాఙ్మయ ప్రారంభదశలోని సృష్టి. దీనిలో కవి, కాలం, కావ్య రచనం తెలుపుతూ 13 భాగాలు ఉన్నాయి కవి కృతులన్నీ సవిమర్శకంగా ఈ చిన్ని వ్యాసంలో వ్యాసకర్త పరిశీలించాడు,,

ఈ కావ్యసృష్టి వెనుకఉన్న కవి వ్యక్తిత్వం విస్పష్టంగా తెలుపటానికి వ్యాసంలో ప్రయత్నం జరిగింది.

విషయం విభజించి, వివరించటం ఉత్తమ మార్గంలో సాగింది. రచనా రీతి విశిష్టంగా, శైలి సుందరంగా, భాష విస్పష్టంగా ఉన్నాయి. విమర్శన దృక్పథం ఆవిష్కరించటంలో ఆ విధంగా నిర్వహించటంలో వ్యాసం ఔత్తమ్యం పొందింది.

పింగళి సూరన విషయం పలువురు విమర్శకులు స్పృశించారు. వింజమూరి రంగాచార్యుడు 'పింగళి సూరనార్యుడు' (1914) సవిమర్శకంగా రూపొందించటం చూడవచ్చు. కట్టమంచి రామలింగారెడ్డి, శ్రీ దువ్వూరి వెంకట రమణ శాస్త్రి, డా. తిమ్మావజ్ఝల కోదండ రామయ్యా వంటి విమర్శకులు అనేకులు సూరన కవితా పరిశీలనం చేశారు.

చిలకపాటి వేంకట రామానుజ శర్మ- 'మహాకవి కాళిదాసు చరిత్రము' (1893) వ్యాసం కథాత్మకంగా అభివ్యక్తీకరణం పొందింది. ఇది స్పష్టమయిన చరిత్రాధారంలేని కథలతో కూడి వుంది. ''ఇది మహాకవి కాళిదాసుం డొనరించిన యమానుష చరిత్రముతోను, భోజుని సభయందు వచియించి ప్రశ్యక్షర లక్ష బహుమానముగన్న శ్లోకములతోను, వాని తాత్పర్యములతోను అభియుక్తోక్తిని ప్రమాణముగా గొని వ్రాయబడినది'' అని తెలపటం గమనింపవచ్చు.

కూనపులి లక్ష్మీనరసయ్య - 'శ్రీనాథకవి చరిత్రము' ప్రధానంగా కవిత్వ సంబంధిగా సాగింది. శ్రీనాథుడి మార్గదేశి సాహిత్య గుణ పరిశీలనం చేయబడింది. అయితే చాటువుల విషయంలో వ్యాసం విశృంఖలంగా పెరిగింది. ఈ కవిత్వం వెనుక ఉన్న శ్రీనాథుడి వ్యక్తిత్వం దర్శించటానికి వ్యాసంలో ప్రయత్నం జరిగింది.

శ్రీనాథుడు బహుగ్రంథ నిర్మాత కావటమే కాదు, బహు విమర్శన కేంద్రంగా కూడా అయ్యాడు. మద్దూరి శ్రీరామమూర్తి-' శ్రీనాథుడు' (1930) జీవిత పరిశీలనతో, జొన్నలగడ్డ వేంకట రాధాకృష్ణయ్య- 'శ్రీనాథ కవి చరిత్రము' (1932) చాటువుల ఆధారంతో, జోశ్యుల సూర్యనారాయణమూర్తి- 'శ్రీనాథ భారతి' శ్రీనాథ కృత్యంతర బహు విషయదర్శనంతో వెలువడ్డాయి.

పింగళి సూరనార్యుడి సాహిత్య విమర్శనం జరిగినంతగా ఆంధ్ర సాహిత్యంలో శ్రీనాథుడి కావ్య పరిశీలనమే అయింది. విమర్శనారంభంనుంచి, పరిశోధన, విమర్శన, వ్యాస సృష్టి శ్రీనాథ సంబంధంగా విస్తృతంగా జరిగింది.

పుదుప్పాకం సుబ్రహ్మణ్య అయ్యర్-'నన్నయ భట్టారకుఁడు' (1910) కవితాపరామర్శగా, నన్నయ భట్టారక వర్ధంతి మహోత్సవ సందర్భంలో ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజ సమావేశంలో చదువబడింది.

దిగపల్లి వేంకట శివరావు-'పోతన వేమనల యుగము' (1924) 1922 సంవత్సరపు ఏవెల్ అండ్ మోర్ హెడ్ బహుమానం రూ. 150.00 పొందిన ఆంధ్ర వ్యాసం దీనిలో పోతన వేమనల కాలం కవిత్వం తద్వైశిష్ట్యం తెలపటం జరిగింది.

గొట్టిపాటి వెంకట సుబ్బయ్య-'భట్టుమూర్తి రామరాజ భూషణుడా ?' (1940) వ్యాసంలో వాళ్ళు ఒక్కరు కారనీ, ఇద్దరనీ తెలుపుతూ, ఒక్కరే అనే వాదాలు ఖండిస్తూ భిన్న వ్యక్తులన్న అభిమతం స్థాపించటం జరిగింది. రామరాజ భూషణుడు ఉత్తమ కవి అనీ, ఆంధ్ర దేశం సక్రమంగా గుర్తించలేదని, తన్నివారణార్థం శ్రీ రామరాజభూషణ సాహిత్య పరిషత్తు 'భూషణ కిరణావళి' (1969) వ్యాస సంపుటి ప్రకటించింది ఇందులో రామరాజ భూషణుడి సాహితీ శక్తి, కావ్యతత్త్వం, కావ్య భాష, సంగీత నిధిత్వం, వసుచరిత్రలోని నాటక రీతులు తెలుపుతూ అయిదు వ్యాసాలు ప్రసిద్ధ విమర్శకులు వ్రాశారు. రామరాజ భూషణుడు అబ్రాహ్మణ కవి అని కొందరు తిరస్కరించటంతోపాటు ఇతరులు గౌరవించటం కూడా సృష్టి వింత.

శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి 'ప్రబంధ పాత్రలు' (1952) కావ్యాలలోని పాత్ర చిత్రీకరణ నైపుణ్యం వివరించే వ్యాసాలు. పాత్ర సృష్టి కవి అనుభవం దర్శనం తెలుపుతూ ఉంది. పారిజాతాపహరణంలో నారదుడు, మనుచరిత్రలో మాయా ప్రవరుడు, వసు చరిత్రలో గిరికావసురాజులు, నీలాసుందరీ పరిణయములో నీలాసుందరి, ప్రభావతీ ప్రద్యుమ్నములో శుచిముఖి, పాండురంగ మాహాత్మ్యములో నిగమశర్మ, అతని అక్క పరిశీలింపబడ్డాయి. ఈ పాత్రల ప్రాబంధికతత్త్వం, తన్నిర్వహణం విస్పష్టంగా గ్రహించటం జరిగింది. ఒక వ్యాస సంపుటిలోని రచనలన్నీ పాత్ర పరిచయాలకే పరిమితంగా చేయటం శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి ప్రత్యేకత.

ఆధునిక కవులలో గురజాడ అప్పారావు జీవిత సాహిత్యాలు వ్యాస వస్తువులయినంతగా ఇతరులవి కాలేదనవచ్చు. ఈ కవిని అభ్యుదయకవిగా భావించటం అరంభమయిన దగ్గర్నుంచి అభ్యుదయ కవులు, రచయితలు, విశాలాంధ్ర ప్రచురణాలయం విశేష కృషి చేయటం గమనింపవచ్చు. ఆ స్థితిలో వ్యాస రచన కావించిన అనేకులలో శ్రీ చిట్టిమల్లె శంకరయ్య-'ముత్యాల సరాలు-మహాకవి గురజాడ' (1962) వ్యాసం, శ్రీ దేవులపల్లి ప్రభాకరరావు-'మహాకవి గురజాడ' (1969) వ్యాసం పరికింపవచ్చు. శ్రీ శ్రీశ్రీ, అవసరాల సూర్యారావు, శ్రీ కె.వి. రమణారెడ్డి, శ్రీ ఆరుద్ర, శ్రీ బంగోరెవంటి వాళ్ళు అనేకులు గురజాడ అప్పారావు కవ్యాత్మ వ్యాస సృష్టి చేశారు.

శ్రీ క్రొవ్విడి రామం-'సాహిత్య సౌరభము' (1966) కావ్యంలోని కవి గుణాలు దర్శించే 9 వ్యాసాల సంపుటి. ఇందులో ప్రాచీనాధునిక కావ్య గత కవి ధర్మ పరిశీలన వుంది. ఇందులో ఆంగ్లాంధ్ర భాషలలోని అర్థవిపరిణామం తెలిపే భాషా వ్యాసం కూడా ఉంది.

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ సాహిత్యోపన్యాసము లు నన్నయ, చిన్నయ సూరి, క్షేత్రయ్య, గిడుగు, నన్నెచోడుడు, వేదం వేంకటరాయశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, చిలకమర్తి, కాశీనాథుని సాహిత్య కృషి నీరాజనాలుగా వెలువడ్డాయి. ఒక్కొక్క సాహితీ వేత్తను గూర్చి ముగ్గురు నలుగురు విమర్శకులు వ్రాసిన వ్యాసాలు ఒక్కొక్క సంపుటంగా ప్రచురించటం జరిగింది. ప్రాచీనుల కంటె ఆధునికుల కావ్య పరిశీలనం అధికంగా జరిగింది. ఈ సాహిత్యోపన్యాసాలు కవి కావ్య పరిచయ సమర్థంగా ఉన్నాయి.

కవ్యాత్మ వ్యాసం కవితత్త్వ ప్రదర్శకంగా ఉంది. సాహిత్యం మూలంగా కవి జీవితం వ్యక్తం చేయటం, కవి జీవితాధారాలతో కావ్య సౌందర్యం విశదం చేయటం ఈ వ్యాసం నిర్వహించింది. కవ్యాత్మ వ్యాసం కావ్య గుణాతీతం, రచనాంతర్గత తత్త్వం, వస్త్వంతస్సూత్రం, కవి చైతన్య ప్రతీక.

## 5. కావ్యచరిత్ర వ్యాసం

దేశ చరిత్ర, జీవిత చరిత్రల కంటె భిన్నంగా కావ్య చరిత్ర విమర్శనంగానూ విమర్శన వ్యాసంగానూ తెలుగు వాఙ్మయంలో వెలువడింది. కావ్య

చరిత్రలో కవుల జీవితాలూ, వాఙ్మయమూ, ప్రక్రియలు విభిన్నంగా చారిత్రాత్మకంగా సిద్ధించి వున్నాయి. కవిచరిత్ర విషయ విస్తృతి వల్ల విమర్శనంగా రూపొందే స్థితిని కలిగివుంది. వాఙ్మయ చరిత్ర వాఙ్మయంలోని ఒక దశనో, సంపూర్ణ వాఙ్మయాన్నో పరిశీలించే పథకంతో ప్రభవిస్తుంది కాబట్టి వ్యాస పరిధికి మించి ఉంది. ప్రక్రియా చరిత్ర, ఒక ప్రక్రియ ప్రారంభం నుంచి పొందిన పరిణామం కాని, ఒక దశలో సాధించిన అభ్యుదయం కాని విశదీకరించడం ఆవశ్యకమయి ఉంటుంది కనుక విశాల ప్రణాళిక కారణంగా వ్యాసాతీతంగా ఉంది. కవుల చరిత్ర మయినా, వాఙ్మయ చరిత్ర మయినా, ప్రక్రియా చరిత్రమయినా వ్యాసంగా రూపొందకపోయే గుణం వస్తుతత్త్వంలోనే ఉంది. జీవిత చరిత్ర వ్యాస సృష్టి జరిగినంత అధికంగా తెలుగులో కావ్య చరిత్ర వ్యాస రచనం జరగకపోవటం సహేతుకమే.

ఒక వస్తువు రచనాసిద్ధి పొందటానికి ఒక ప్రక్రియ అమిత సమర్థంగా ఉండటం అనేది వస్తుగుణంతో సంబంధించింది. కావ్య చరిత్ర విమర్శన గ్రంథంగా అవతరించినా, వ్యాస రచనకు అనుకూలమయిన వస్తుధర్మం లేకుండాలేదు. ఏ సారస్వత చరిత్ర రచనం పరికించినా ఈ ధర్మం స్పష్టంగా గ్రహింపవచ్చు. గురజాడ శ్రీరామమూర్తి 'కవి జీవితములు' పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమయి, ఏ కవి జీవితమయినా వ్యాసంగా భావింపవచ్చునన్న అభిప్రాయం కుదురుతుంది. అందువల్ల సాహిత్య చరిత్ర సృష్టిగా ఉన్న ఏ గ్రంథం పరికించినా అది అనేక వ్యాసాల సంపుటిగా తెలుసుకోవచ్చు.

కావ్య చరిత్రగా తెలుగు వాఙ్మయంలో అనేక విమర్శనలు ఆవిర్భవించాయి. (1) కవి, కవిత్వ చరిత్రగా గురజాడ శ్రీరామమూర్తి 'కవి జీవితములు', కందుకూరి వీరేశలింగం పంతులు 'ఆంధ్ర కవుల చరిత్ర', చాగంటి శేషయ్య 'ఆంధ్ర కవి తరంగిణి', శ్రీ నిడదవోలు వేంకటరావు 'తెనుగు కవుల చరిత్ర', శ్రీ శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి 'విజయ నగర ఆంధ్ర కవులు', శ్రీ మధునాపంతుల సత్యనారాయణ 'ఆంధ్ర రచయితలు', శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ 'ఆంధ్ర కవయిత్రులు', చేకుమళ్ళ కామేశ్వరరావు 'నా వాఙ్మయ మిత్రులు', మానపల్లి రామకృష్ణ కవి, వేటూరి ప్రభాకరశాస్త్రి వంటి ప్రముఖుల సాహిత్య చరిత్ర రచనలు; (2) తెలుగు వాఙ్మయ చరిత్రగా వంగూరి సుబ్బారావు 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర', చేకుమళ్ళ అచ్యుతరావు

'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర' 'విజయనగరాంధ్ర వాఙ్మయ చరిత్ర', కాశీనాథుని నాగేశ్వరరావు 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర', ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము 'ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము', డా. దివాకర్ల వేంకటావధాని 'ఆంధ్ర వాఙ్మయ చరిత్రము', 'ఆంధ్ర వాఙ్మయారంభ దశలు', శ్రీ కూర్మా వేణుగోపాల స్వామి 'తెలుగు వాఙ్మయము-సంగ్రహ చరిత్ర', శ్రీ నిడదవోలు వేంకటరావు 'తెనుగు కవుల చరిత్ర', కురుగంటి సీతారామయ్య - పిల్లలమర్రి హనుమంత రావుల 'నవ్యాంధ్ర సాహిత్య వీథులు', శ్రీ శిష్టా రామకృష్ణ శాస్త్రి 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వము', శ్రీ బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి 'నవోదయము', యండమూరి సత్యనారాయణ 'ఉషః కిరణాలు' వంటి గ్రంథాలు; (3) ప్రక్రియా చరిత్రగా భోగరాజు నారాయణమూర్తి 'ఆంధ్ర కవిత్వ చరిత్ర', బసవరాజు అప్పారావు 'ఆంధ్ర కవిత్వ చరిత్ర', గొబ్బూరు వేంకటానంద రాఘవరావు 'ఆంధ్ర వచన రచనా పరిణామము', శ్రీ నిడదవోలు వేంకటరావు 'ఆంధ్ర వచన పరిణామము', వంగూరి సుబ్బారావు 'శతక కవుల చరిత్ర', వేదము వేంకటకృష్ణ శర్మ 'శతక వాఙ్మయ సర్వస్వము', నిడదవోలు వేంకటరావు 'ఉదాహరణ వాఙ్మయ చరిత్ర' వంటి అనేక రచనలు పరిశీలించినప్పుడు అనేక వ్యాసాలు వీటిలో నిక్షిప్తమయి ఉన్నట్లు విశద మవుతుంది. ఈ చరిత్ర రచనలు వ్యాస సంకలనాలుగానూ, చరిత్ర విమర్శ నంగానూ భావించటం సాధ్యంగా గోచరమవుతుంది. వ్యాసంగా రచనా జీవితం పొందవలసి ఉన్న విషయం చరిత్ర విమర్శనంగా రూపొంది కావ్య చారిత్రక వ్యాసంగా ఏర్పడకుండా అయింది.

అయితే కావ్య చరిత్ర వ్యాసంగా అసలు సృష్టి పొందకపోలేదు. అది విస్తృతం కాలేదని మాత్రమే గుర్తించాలి. ఈ వ్యాస సృష్టి తెలుగు విమర్శనా రంభ దశలోనే మొదలయింది.

బొడ్డుపూరపాడు వెంకటరంగంకవి - 'పూర్వకవుల చరిత్రము' (1888-పుటలు 39, వెల: నాలుగు అణాలు) వ్యాసం. ఇందులో రంగనాథుడు, మంత్రి భాస్కరుడు, హుళక్కి భాస్కరుడు, నన్నయభట్టు, తిక్కన సోమయాజి, 'యజ్ఞప్రగడ'లను గూర్చిన స్థూల పరిశీలనం ఉంది. ప్రచారంలో ఉన్న కట్టు కథల మీద ఆధారపడి సాహిత్య వ్యాస రచనా ప్రయత్నం జరిగింది. వ్యాసంలో వ్యావహారిక భాషా రూపాలు గోచరమవుతున్నాయి.

పెదగాడ గంగయ్య - 'కవుల సంగ్రహ చరిత్ర' (1930) 10 చిన్న వ్యాసాల సంపుటి. అశ్వఘోషుడు కాక, 9 మంది తెలుగు కవుల చరిత్ర వుంది. ఇందులో జీవిత సాహిత్య పరిచయం ప్రధాన దృష్టి.

కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావు (1871-1918) ఆంధ్ర వాఙ్మయం పొందిన స్థూల పరిణామం వివరించే వ్యాసం, బండారు తమ్మయ్య శివకవుల కవితా చరిత్ర పరిణామం తెలిపే వ్యాసాలు, ఒంగోలు వెంకట రంగయ్య ప్రాచీన సంప్రదాయ సంస్కృతుల చరిత్ర విశదీకరించే వ్యాసాలు ఆంధ్ర వ్యాస సారస్వతం సుసంపన్నం కావించాయి.

వర్తమానాంధ్ర సాహిత్యంలో కావ్య చరిత్ర వ్యాస సృష్టి కించిన్మాత్రంగా జరిగింది. సారస్వతంలో నూత్న ప్రక్రియలు, నూత్న రచనా ధోరణులు అధిక మయి, వాటి తత్త్వం స్పష్టంగా లేకపోయినప్పుడు, వాటి వివరణంతోపాటు చరిత్ర కూడా వ్యాసాలుగా రూపొందింది. భావ కవిత్వం, అధి వాస్తవికత ఆది విషయాలు చారిత్రాత్మకంగా విశదీకరింపబడ్డాయి. దిగంబర కవులు అభ్యుదయ కవులు సారస్వత ప్రయోజనం చారిత్రకంగా వివరించి, సాంఘిక దృష్టి విశాలం చేశారు. విషాదాంత నాటక రచన, కాల్పనిక కవిత, చైతన్య స్రవంతి చారిత్రక దృష్టితో పరిణామ పరిశీలనం పొందాయి. కావ్య చరిత్ర వ్యాస రచన పట్ల రచయితలకు, విమర్శకులకు అధికాసక్తి ప్రయత్నమూ లేకపోయినా తదావి ర్భావం లేకపోలేదు.

కావ్య చరిత్ర వ్యాసం కావ్యగుణం పరిశీలించటానికి దోహదం చేస్తుంది. అది కావ్యతత్త్వం గుర్తింపచేసి సమగ్ర వాఙ్మయతత్త్వం పరికింపచేస్తుంది. కావ్య రచన, పరిణామం గమనించటం సాహిత్యావసరం. కవి, కవిత, వాఙ్మయ ప్రక్రియాగతంగా సాహిత్యం పొందిన చరిత్ర, విస్పష్ట కావ్య చరిత్ర వ్యాసా లుగా రూపొందితే, సంపూర్ణ సారస్వత విమర్శనం లభిస్తుంది.

## 6. జీవిత చరిత్ర వ్యాసం

వ్యాసం సృజనమయినా విమర్శనమయినా స్వీకృతి వస్తు వైశిష్ట్యం కాంతిమంతంగా ప్రదర్శించటానికి ఉపయుక్తమయింది. జీవిత చరిత్ర వ్యాసం ప్రముఖుల జీవితం విషయంగా కలిగివుంది. ప్రతి వ్యక్తి జీవితం ఒక ప్రధాన శక్తిని వెలువరిస్తూ దానిచుట్టూ ఆవృతమవుతూ దాని రూప నిర్ణయంలో వ్యయ

మయిపోతూ వుండటం లోకసామాన్యంగా ఉంది. మహాత్ములయినవాళ్ళు, చిరం జీవిగా నిలచే మహత్తర శక్తిని లోకంలో ప్రతిష్ఠించినవాళ్ళు, హృదయమో, బుద్ధో కారణంగా ప్రసిద్ధులయినవాళ్ళు ఆయా కారణాల వల్ల స్మరింపబడుతూ ఉండటం సహజంగా జరుగుతూ వుంది.

ప్రాచీన మానవ సమాజం నుంచి నేటికి వంశ పారంపర్యపు హక్కులాగా సంక్రమించిన సంస్కృతి నాగరికతలు, విద్యాబుద్ధులు, కళాకార్యకలాపాలు, ఆచార వ్యవహారాలు, సమస్తమయిన సమాజ వ్యక్తి అవయవాలు అంద చందాలు బాహిరాంతర స్వరూప స్వభావాలు తరతరాల మానవుల బుద్ధి హృదయాల కన్నబిడ్డలని కలకాలం గుర్తుంచుకోవచ్చు. అందువల్ల సంఘంలోని ప్రత్యంశంలో గత సంఘపు ప్రభావం విశదమవుతుంది. వర్తమాన మానవ జీవితం ఈ స్థితికి రావటానికి గత మానవుల అనుభూతి మాధుర్యం ఆలోచనానంతర్యం మార్గదర్శులయి ఉండటం కళ్ళారా చూడవచ్చు.

అయితే కాలప్రవాహంలో సామాన్య మానవ కృషి కొట్టుకుపోయి అగోచరంగా ఉంది. కాని ప్రసిద్ధులయిన వ్యక్తులు లంకలు లాగా నిలిచి గోచరమవుతున్నారు. కాలం తాకిడికి తట్టుకొని అచంచలంగా నిలచిన ప్రసిద్ధ వ్యక్తులు, తమ జీవితాన్ని వెలిగించి నడిపించిన విశిష్ట శక్తి వల్ల ఉన్నత ఉన్నత స్థితి పొందగలిగారు. ప్రసిద్ధుడైన ప్రతి వ్యక్తి ప్రతిష్ఠించిన ప్రాణశక్తి సమాజ పురోగమనానికి మూలధనమయింది.

వ్యక్తి వైశిష్ట్యం తెలుసుకోవటం వల్ల, సమాజ జీవిత గమనం నిర్దేశం కావచ్చు. అది తెలపటానికి ప్రయత్నం సారస్వతంలో జరిగింది. ఈ యత్నాల ప్రసిద్ధుల జీవిత చరిత్రగా లోకంలో ప్రచారమయింది. మనిషి ప్రయత్నం అంతా వివరించడం జీవిత చరిత్రలో సాధ్యమయితే ఒక భాగం మాత్రమే తెలపటం జీవిత చరిత్ర వ్యాసంలో అవకాశం పొందివుంది. జీవిత చరిత్ర విశిష్ట, బృహత్ప్రణాళికా సహితంగా ఉంటే ఆ వ్యాసం ప్రత్యేకాంశ పరిమితంగా ఉంది. జీవితం అంతటా నిండి ఉన్న ఒక అంశం కాని, జీవితంలోని ఒక దశ కాని, జీవితం గమించిన తీరులన్నీ వివరించే మూలధర్మం కాని జీవిత చరిత్ర వ్యాసంలో వస్తువుగా ఉండటానికి అవకాశం ఉంది.

ఒక వ్యక్తి జీవితంలో వ్యాసకర్తకు ఇష్టమయిన, వ్రాయటానికి వీలయిన, ప్రసిద్ధమయిన, లోకోపకారకమయిన, ఆ వ్యక్తి ఉన్నతికి దోహదకారి అయిన అంశం వివరించిన వ్యాసం, విమర్శించిన వ్యాసం, విపులీకరించిన వ్యాసం జీవిత చరిత్ర వ్యాసంగా భావింపవచ్చు. అందువల్ల ఒక సత్య సందర్శన మార్గంలో సాగిన జీవిత చరిత్ర, వ్యాసంగా రూపొందుతుంది. ప్రధాన హేతువు అస్పష్టంగా కాని, ప్రాసంగికంగా కాని ఉన్నదీ, జీవితంలోని అన్నీ కాని, అనేకం కాని, స్థితిగతులు, కథన రూపంలో చెప్పటంగా ఉన్నదీ, జీవిత చరిత్ర వ్యాసం కాకుండా తద్భిన్న మేదయినా అవుతుంది. వ్యక్తి లక్ష్యవికసనోన్ముఖంగా జీవిత చరిత్ర వ్యాస సృష్టి ఉండటమే దాని ధర్మం.

ఈ జీవిత చరిత్రవ్యాసం ప్రధానంగా రెండు భాగాలుగా ఉంది. సంఘంలో ప్రసిద్ధులయిన వ్యక్తుల సాంఘిక జీవితాలుగా, సాహిత్యంలో ప్రముఖులయిన కవుల సాహితీ జీవితాలుగా పరిశీలించటం సముచితం. ఒక కవి సాహిత్యం మాత్రమే పరామర్శ పొందిన వ్యాసం ఈ వ్యాస పరిధిలోకి రాదు. కవి జీవితం, ఒక్కొక్కప్పుడు సాహిత్యంతో నిమిత్తం లేకుండా, మరొకప్పుడు సారస్వత సంబంధంతో, ఇంకొకప్పుడు జీవిత సాహితీ సమ్మేళనంగా రూపొందిన వ్యాససృష్టి మాత్రమే ఈ పరిశీలనంలో భాగంగా ఉంది.

## 1. సాంఘిక జీవితాలు

సంఘ జీవితం చైతన్య పూరితం చేసిన ప్రముఖుల కృషి ఏ రంగంలో జరిగినా అది శుభంకరమే అయింది. రాజ్యపాలనం నుంచి సంఘ సంస్కరణం దాకా మహానుభావులు ఎందరో తమ విధి నిర్వర్తించారు. కొందరి జీవితాలు మాత్రమే వ్యాస గతంగా నిలిచాయి. అటువంటి వ్యాసరచనారంభం విస్పష్టంగా పరిశీలన చేయటం అవసరంగా ఉంది.

రాజా మృత్యుంజయ నిశ్శంక బహదరు 'హిల్ జమీదారీల చరిత్ర' 1868 లో వ్రాయటం జరిగినా 1887 లో ముద్రితమయింది. ఇది ఒక రాజ వంశం అరాజకంగా ఉన్న ప్రదేశ పాలనంలో స్వీకరించిన బరువు బాధ్యతల కేంద్రం నుంచి సాగిన వ్యాసం. ఇందులో రాజవంశారంభం నుంచి వ్యాసకర్త దాకా పరిపాలన చేసిన వాళ్ళ జీవితాల కృషి వివరించటం జరిగింది. చారిత్రకంగా విలువైన విషయ నిక్షిప్తంగా ఉన్న ఈ వ్యాసం జీవిత చరిత్రగా ప్రారంభమయి, నిర్వహణం పొందినా ఆత్మకథా వ్యాసంగా పరిసమాప్తమయింది.

పెద్దాడ బట్టి రామయ్య- 'ద్వాత్రింశన్మంత్రుల చరిత్రము' (1888) తెలుగు దేశంలో ఉన్న "ముప్పది యిద్దరు నియోగివరుల చరిత్రము" గా ఉన్న వ్యాసం. రాజుల కొలువులలో మంత్రి పదవిని పొందిన పలువురు ప్రసిద్ధ మంత్రులు ఈ వ్యాసంలో గోచరమవుతున్నారు. మంత్రి పదవిలోని ఆధిక్యం అవస్థ వివరించే రీతిలో ఈ వ్యాసం సాగింది. రాయన భాస్కర మంత్రి, అతని పుత్రుడు, పౌత్రుడు మొదలుకొని బందా పరదేశి మంత్రి దాకా వ్యాసంలో గోచరమవుతున్నారు. పెద్ద వాక్యాలతో కథాప్రాయింగా అనేక కథాప్రచురంగా జీవిత చరిత్రలు వివరిస్తూ సాగిన బహ్వాంతర్భాగాల వ్యాసంగా దీనిని గ్రహింప వచ్చు. విషయం సమగ్రంగా కాని, సత్య సన్నిహితంగా కాని ఉందని చెప్పే అవకాశం తక్కువ. దీనిని చారిత్రక పరిశోధనకు ప్రాథమిక విషయంగా మాత్రమే స్వీకరింపవచ్చు.

ఎ.సి. పార్థసారథినాయుడు- 'పచ్చయప్ప జీవితము' (1892), జి. వేంకట సుబ్బారావు- 'వీరేశలింగము' (1894), సి.యల్.యస్. ప్రచురించిన 'విలియం కేరీ' (1896), వి. వేంకట రామానుజ పంతులు- 'శివాజీ జీవితము' ఆయా వ్యక్తుల జీవిత ప్రాధాన్యం వివరించే వ్యాసాలు. వి.వి యస్. అవధాని 'శ్రీ విద్యారణ్య (మాధవాచార్య) చరిత్రము' (1900) విస్తత పథకంతో ఒప్పినా ఒకే ప్రధానాశయంతో అభివ్యక్తమయిన జీవిత చిత్రణమయి, విస్తృత వ్యాసంగా వుంది.

చౌధరి జాన్- 'చౌధరి పురుషోత్తమ కవి చరిత్ర' (1901) వ్యాస ప్రాయంగా వ్రాయటం జరిగింది. బాల్యం నుంచి మరణందాకా క్రైస్తవుడుగా మతాంతరీకరణం పొందిన తండ్రి క్రైస్తవ జీవితం, క్రైస్తవుడయిన కుమారుడు గౌరవంతో పరిశీలించటం వ్యాస ప్రధాన విషయం క్రైస్తవ కీర్తనల గ్రంథంలో ఈ కవి పాటలు అనేకం ఉన్నాయి అనుదినం దేవాలయంలోనూ తదితరంగానూ సంగీత సహితంగా ఆలపింప బడుతున్నాయి. మతాంతరీకరణం పొంది క్రొత్త జీవితం చవి చూచిన వ్యక్తి వైశిష్ట్యం వివరించేదిగా ఈ జీవితచరిత్ర వ్యాసముంది.

గాడిచర్ల హరిసర్వోత్తమరావు- 'అబ్రహాము లింకను చరిత్ర' (1907) వ్యాసంలో పుట్టుక మొదలుకొని హత్యదాకా లింకను జీవితం కనిపించింది. సామాన్యుడు అమెరికా అధ్యక్షస్థానం అధిష్ఠించటానికి నడిపించిన మహత్తర శక్తిని సందర్శించే రీతిలో వ్యాస రచనం జరిగింది.

ఆంగ్లేయుల బారినుంచి భారతదేశం రక్షింపబడాలని రాజకీయరంగంలో కృషిచేసిన ప్రముఖుల జీవిత చరిత్ర వ్యాసాలు పఠికింపవచ్చు. ఉ.వై. శ్రీ దొరసామయ్య 'దాదాబాయి నౌరోజీ చరిత్రము' (1907), యస్. వి. రంగాచార్యులు-'శ్రీ బాలగంగాధర తిలక్కుగారి చరిత్రము' (1908) స్వాతంత్ర్యాకాంక్ష నడిపించిన జీవితాలుగా గోచరమవుతున్నాయి.

సంఘంలో చైతన్యం వాంఛించి, అందుకోసం జీవితాంతం కృషి చేసిన మహాత్ముల సంఘ సంస్కరణం విశదం చేసే వ్యాసాలు అవతరించాయి. వెలిదండ శ్రీనివాసరావు-'మోహన విద్యాసాగర చారిత్ర కోపన్యాసములు' (1912) శ్రీ రామమోహన రాయలు, ఈశ్వర చంద్ర విద్యాసాగరుల జీవితాలు ఆది నుంచి అంతందాకా తెలుపుతూ సాగించిన సాంఘిక సేవను వివరించాయి.

శ్రీ దంటు కృష్ణమూర్తి-'భారత రత్నాలు' (1963) లో రాజకీయంగా, సాంఘికంగా ప్రముఖులయిన రాజేంద్ర ప్రసాద్, నెహ్రూ, కార్వేవంటి వ్యక్తుల జీవిత చరిత్ర వ్యాస సృష్టిలో నిక్షిప్తం చేయటం జరిగింది. ఇంకా అనేక ప్రసిద్ధుల జీవిత చరిత్ర వ్యాసాలు ప్రకటితమయ్యాయి.

## 2. సాహితీ జీవితాలు

సారస్వత సేవ కావించిన అనేకులలో కొందరే ప్రాముఖ్యం పొందారు. వాళ్ళలో కొందరే వ్యాసగతంగా శోభించారు. సాహితీ వ్యాసంగం మూలంగా ప్రసిద్ధి పొందిన కవిశ్రేష్ఠులజీవితశ్రేష్ఠత్వం గమనించటం ఈ జీవిత చరిత్ర వ్యాస లక్షణం. కవితా రచనకు మార్గ దర్శకత్వం వహించిన జీవిత గమనం విశ్లేషించి పరికించటం ఆవసరంగా గ్రహింపవచ్చు. సంస్కృతాంధ్ర కవుల జీవిత చరిత్ర వ్యాసాల ధోరణులు దర్శనీయంగా ఉన్నాయి.

సంస్కృత సాహితీ జీవితాలు-శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి-'సంస్కృత కవి జీవితములు' పన్నెండు వ్యాసాల సంపుటి. ఇందులో కాళిదాసుతో ప్రారంభమయి, శ్రీహర్షుడితో సమాప్తమయ్యే జీవిత చరిత్ర వ్యాసాలున్నాయి. ఆంధ్ర సాహిత్యం సంస్కృత సాహిత్యంవల్ల ప్రభావిత మయింది కాబట్టి సంస్కృత కవుల జీవితాలు ఆంధ్ర కవులు పరిశీలింపవలసినవిగా ఉన్నాయి. మల్లాది

సూర్యనారాయణశాస్త్రి-'సంస్కృత కవి జీవితములు' 56 గురి జీవిత చరిత్ర వ్యాసాలతో నిండివున్న విస్తృత సంకలనం. ఇందులో సంస్కృతంలో రచనలు చేసిన ఆంధ్రులు కూడా గోచరమవుతున్నారు. కిళాంబి రాఘవాచార్యులు- 'భాసుడు' (1938) నాటక కర్తగా పరిశీలన పొందటం చూడవచ్చు. ఈయుణ్ణి వేంకట వీర రాఘవాచార్యుడు సంస్కృత సాహిత్యం సుసంపన్నం కావించిన 'రాజకవుల జీవిత చరిత్ర' వ్యాసాలు రూపొందించటం జరిగింది. ఆంధ్ర, ప్రసన్న, సుధ పత్రికలలోని వ్యాసాలు, అభినందన సంచికలలోని వ్యాసాలు గ్రహించటమయింది.

*ఆంధ్ర సాహితీ జీవితాలు :* తెలుగు భాషకు తమ కవితా సృష్టితో సంప ద్విలాసం కావించిన కవులు రచయితలు అనేకులున్నారు వాళ్ళలో ప్రాచీనులు బహువిధ విమర్శన వాఙ్మయంలో గోచరమవుతున్నారు. కాని ఆధునికులు అంతగా కనిపించటం లేదు.

మంత్రిప్రెగడ భుజంగరావు- 'హైమవతీ పరిణయము' (1916) పేరుతో ఆధునిక కవి జీవితములు వెలువరించటం జరిగింది. రెండు వందల ముప్పై ఇద్దరు కవి పండిత రచయితలు వేదము వేంకటరాయశాస్త్రితో మొదలై ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రిదాకా ఉన్నారు. ఈ గ్రంథ రచనా కాలంలో ఈ సాహితీ పరులు చాలా మంది యువకులుగా ఉన్నారు. ఇంత విస్తృత పథకంతో జీవిత చరిత్ర వ్యాస సృష్టి ఆధునిక కవిజీవితాలతో ఒప్పుతున్న వాటిలో శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి ఆంధ్ర రచయితలు నూరుగురు వర్తమానాంధ్ర రచయితల జీవిత చరిత్ర వ్యాస సంకలనం, శ్రీ పేకుమళ్ళ కామేశ్వరరావు 'నా వాఙ్మయ మిత్రులు' నూట ఇద్దరు కవులు రచయితల జీవితాలకు రేఖా చిత్రాలవంటి వ్యాసాల సంపుటి.

ప్రాచీన కవుల జీవిత చరిత్ర వ్యాసాలు ఈ శతాబ్దారంభంనుంచి ఆవత రించాయి. అప్పటికీ వ్యాసాలు కొంత కావ్యగుణ విమర్శనంగా గోచరమవుతూ ఉన్నాయి. చిలుకూరి వీరభద్రరావు-'తిక్కన సోమయాజి' (1917) జీవిత ప్రాధాన్యంతో ఉంది. ఆదిదము రామారావు-'ఆదిదము సూరకవి' (1919) జీవితం, వ్యక్తి వైశిష్ట్యం, సాహిత్యం విమర్శిస్తూ సాగింది. ఇందులో గ్రంథ రచనం ప్రధాన భాగంగా ఉన్నప్పటికీ జీవిత విస్తృతి కూలంకషంగా దర్శిం

చటం జరిగింది. దువ్వూరి జగన్నాథ శర్మ 'కొండకోణంగి-ఘంటము కవి చౌడప్ప' (1939) వ్యాసంలో కవి స్వభావం, నివాసం, కుటుంబం, కవిత్వం విపరించటమయింది. అనేకులు అనేక కవి చరిత్రలు వ్రాసినా ఇంకా కవులు మిగిలి ఉన్నారని ఈ వ్యాసంలో తెలపటం జరిగింది.

కవులేకాక కవులతో సంబంధం ఉన్న వ్యక్తుల జీవిత చరిత్ర వ్యాసాలు ఈ విభాగంలో గ్రహింపవచ్చు. తుంపూడి భగవం గుప్త 'అవచి దేవయతిప్ప' (1949) వ్యాసంలో వ్యక్తివైశిష్ట్యం, వ్యాపారరీతి, శ్రీనాథుడితో సంబంధం వివరించటం జరిగింది. అవచి తిప్పయ చెట్టిగా సారస్వత లోకంలో పరిచయ మయిన ఈ మనీషి కుటుంబ జీవితంకూడా వ్యాసంలో గోచరమవుతూ వుంది. వి.యస్. శర్మ- 'దేశ హిత ప్రదీపిక' (1940) నాల్గు వ్యాసాల సంపుటి. మొల్ల మొదలైన వాళ్ళ కవితా జీవితం కాక తిమ్మరుసు మంత్రి జీవితం ఈ సంపుటిలో ఒక వ్యాసంగా దర్శింపవచ్చు.

మున్నంగి శర్మ-వేదం, వీరేశలింగం, పానుగంటి, కాశీనాథుని వంటి ప్రముఖుల జీవితాలు వ్యాసాలుగా రూపొందించటంతోపాటు 'చెలికయి కానుక', 'వ్యాసునికూర్పు తిక్కన నేర్పు', 'తెలుగునాడులో పడమటిసీమ కవులు' వంటి వ్యాసాలు భారతిలో ప్రచురించటం జరిగింది. ఈ రచయితకు తెలుగుదనపు తీయదనం నుడికారపు సొంపు తెలుసు. చిన్న వాక్యంలో పెద్ద విషయం తెలిపే సామర్థ్యం, కవిత్వంలాగా సాగే వచన రచనం ఈ వ్యాసకర్త సొమ్ములు.

'అష్టదిగ్గజములు' వీళ్ళేనని విస్పష్టంగా వివాదరహితంగా చెప్పటంలో కష్టముందని గుర్తించటంవల్ల డా. దివాకర్లతో మొదలై, డా. నేలటూరితో మొత్తం పదిమంది వ్యాసకర్తలు పదిమంది కవులను స్వీకరించి, సాహితీ ప్రముఖంగా వ్రాయటం జరిగింది. ఈ 'అష్టదిగ్గజములు' అందువల్ల పది వ్యాసాల సంపుటిగా రూపొందింది.

శ్రీ కె. వి. రమణారెడ్డి- 'శరత్‌బాబు' జీవిత సాహిత్యాల పరిచయ వ్యాసం. ఈ బెంగాలీ రచయిత తెలుగు సారస్వతంలో సాధించిన చైతన్యం విశిష్టమయింది. వ్యాసం విభిన్నంగా విభజించి, ప్రతిభాగం ఒక సంఖ్యతో క్రమంగా తెలుపుతూ పోయాడు రచయిత. మౌఢ్యం మీద కత్తికట్టిన సృజన

సాహిత్య నిర్మాతకు తెలుగు విమర్శకుని పూజాపుష్పంగా ఈ జీవిత చరిత్ర వుంది.

శ్రీ జాస్తి వేంకట నరసయ్య- 'నార్ల వేంకటేశ్వర రావు' (1983) లో పలువురు ప్రకటించిన అభిప్రాయాలకు చోటు ఉంది. జీవితం, సాహిత్యం పరికించటం ప్రధాన దృష్టిగా ఈ వ్యాస స్వష్టి గోచరమవుతుంది.

ప్రముఖ వ్యక్తుల జీవితాలు సంఘాన్ని సాహిత్యాన్ని ఫలవంతంగా రూపొందిస్తాయి. సాహితీవేత్తల జీవితాలు సారస్వత గమనం నిర్ణయిస్తాయి, నిర్దేశిస్తాయి. సారస్వత పరిణామం కవి పండిత రచయితల జీవితాలతో ముడి పడివుంది. జీవిత చరిత్ర వ్యాసం విమర్శన వాఙ్మయంలో వ్యాస పరిణామ ప్రదర్శకంగా ఉంది.

## 7. భాషా వ్యాసం

తెలుగులో సారస్వత దృష్టి ఉన్నంత ప్రచురంగా భాషాదృష్టి లేదు. ఆంధ్ర భాషా పరిశీలనం ఆధునిక పరిణామం. ఈ ఆలోచన ఆంగ్లేయపాలనం వల్ల కలిగినట్లు విశదమవుతూ వుంది. ఆంధ్రదేశంలోకి ఆంగ్లేయ పరిపాలకులు జిల్లా అధికారులుగా మత ప్రచారకులుగా వచ్చి తమ కర్తవ్య నిర్వహణంలో ప్రాంతీయ భాషాజ్ఞానం అవసరంగా గుర్తించి తెలుగు నేర్చుకోవటం ప్రారంభించారు. ఆంధ్ర భాషాధ్యయనం సాంప్రదాయికంగా నేర్చుకోవటం కష్టభూయిష్ఠంగా ఉందనీ, నూత్నమార్గంలో అది జరిగితేతప్ప లాభం లేదనీ, అందువల్ల భాషా దృష్టితో అది సాగవలసి ఉంటుందని గ్రహించారు.

తెలుగు నేర్చుకొన్న ఆంగ్లేయులు, తర్వాత వచ్చే ఆంగ్లేయులు నేర్చుకోవటానికి వీలుగా ఈ భాషను రూపొందించటంలో ఈ భాష, భాషాశాస్త్ర పరిధిలోకి ప్రవేశించింది. అంతకుముందు శాస్త్రమంతా వ్యాకరణ పరిమితంగా మాత్రమే ఉంది. ఈ పరిస్థితిలో తెలుగు సంస్కృతజన్యం కాదని, మూల ద్రావిడ భాష నుంచి పుట్టిన భాష అనీ కలిగిన నూత్న పరిణామం, భాషా దృష్టిని వికాలం కావించింది. ఈ భాష దృష్టిని ప్రాథమికంగా, అస్పష్టంగా విలియం కేరీ, స్పష్టంగా ఎ. డి. కాంబెల్, సిద్ధాంత గ్రంథంగా కాల్డ్వెల్ కలిగించారు.

ఆంగ్లేయులకు ఈ అభిప్రాయం కలగటానికి వాళ్ళు భాషా పఠనం చేసే దృష్టితోపాటు, వాళ్ళు ఈ దేశంలోకి వచ్చిన తీరుకూడా దోహదం కావించింది. ఆంగ్లేయులు సముద్రయానం చేసి రావటం వల్ల, సముద్ర తీరపట్టణాలలో నివసించటం వల్ల, అవి ద్రావిడ భాషా ప్రాంతాలలో ఎక్కువగా ఉండటం వల్ల, భాషల పేర్లు వేరుగా ఉన్నా సమాన గుణాలు భాషాగతంగా గోచరమయి, ఈ ద్రావిడ భాషలు పరస్పరం సంబంధమున్న భాషలుగా భావించటం, అవి ఒకే భాషా కుటుంబానికి చెందినవిగా గ్రహించటం జరిగింది.

తెలుగు భాష ద్రావిడ భాషా కుటుంబానికి చెందిందన్న సిద్ధాంతం విపులంగా ప్రచారమయి, క్రొత్త దృక్పథం కలిగించింది. ఈ స్థితిలో తెలుగు సంస్కృత భాషనుంచి పుట్టిందన్న ఆలోచన తెలుగువాళ్ళకు క్రొత్తగా కలగడం ప్రారంభమయింది. ఈ ఆలోచన బృహద్గ్రంథంగా చిలుకూరి నారాయణ రావు భాషా చరిత్రను నిర్మించటానికి అవకాశం కలిగించింది. వర్తమానాంధ్ర దేశంలో తెలుగు భాష సంస్కృతంనుంచి పుట్టిందని, మూల ద్రావిడంనుంచి అవతరించిందని రెండు దృక్పథాలు ఉన్నాయి. ఈ సిద్ధాంత ద్వయానికి సముచిత ప్రోత్సాహం ప్రచారం ఆదరణ లభిస్తూనే ఉన్నాయి.

తెలుగులో వెలువడ్డ అనేక గ్రంథాలు, ఆంగ్లంలోని సిద్ధాంత రచనలు ఆంధ్రభాష సంస్కృతం నుంచి జన్మించిందనటం అంగీకరించటం లేదు. అందువల్ల భాషాశాస్త్ర వ్యాసాలు తెలుగులో చాలావరకు ద్రావిడభాషా సిద్ధాంతం అంగీకరించేవిగా గోచరమవుతున్నాయి.

భాషా వ్యాసాలు ఆరంభంలో శబ్ద చర్చగా సాగాయి. ఇది వ్యాకరణ పరిధిలో శబ్ద సాధుతాసాధుత పరిశీలనంగా సాగింది. క్రమంగా సిద్ధాంత గౌర వంతో వ్యాస సృష్టి ఆరంభమయింది. భాషా వ్యాసం పరిపుష్టం కావించిన ప్రముఖుల వ్యాస పరిశీలనంలో ఈ విషయం పరికించటం జరిగింది. స్వామి నీన ముద్దు నరసింహ నాయుడు, వేదం వేంకటరాయశాస్త్రి, గిడుగు రామమూర్తి పంతులు, గురజాడ అప్పారావు పంతులు, కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, శ్రీ తిరుమల రామ చంద్ర వంటి ప్రముఖులు ఈ భాషా వ్యాసం తీర్చిదిద్దారు.

ఇంకా కోరాడ రామకృష్ణయ్య, గంటిజోగి సోమయాజి వంటి ప్రముఖులు భాషా పరిశీలనం కావించి సిద్ధాంత గ్రంథాలు రచించారు. ఈ మార్గంలో అనేక భాషా వ్యాసాలు సృష్టి పొందుతున్నాయి. ఆధునికంగా భాషా దృష్టి ఎక్కువ కావటం, ఆ రచన విస్తృతంగా రూపొందటం జరిగింది. అయితే ఈ దృష్టి ఆరంభంలో ఏ విధంగా ఉందో చూడటం, భాషా వ్యాస సముదాయం వల్ల సాధ్యమవుతూ వుంది.

వావిలాల వాసుదేవశాస్త్రి- 'ఆంధ్ర భాషా తత్త్వము' (1881) తెలుగు భాషా స్వభావం వివరించేదిగా సాగింది. టి. యమ్. శేషగిరి శాస్త్రి 'అర్ధానుస్వారతత్త్వము' (1893) ఉచ్చారణం లోపించి, వర్ణంగా లిపి రూపంలో ఉండి, అదీ క్రమంగా చ్యుతమయిపోతున్న అర్ధానుస్వారం పరిశీలించటం; 'ఆంధ్ర శబ్ద తత్త్వము' (1896) ఆంధ్ర శబ్ద ప్రయోగం, అది అభివ్యక్తం చేసే జాతి భాషార్థాలు నిశితంగా ఆలోచించటం, ఈ వ్యాసాలలో పరికింపవచ్చు. లభ్యమయినంతవరకు తెలుగు భాషను గూర్చి ఆద్య వ్యాస త్రయం తత్త్వ పరీక్షకు ప్రయత్నించటం గమనింపవచ్చు.

మంగు వేంకట రామానుజరావు-'ఆంధ్ర భాషా చరిత్ర సంగ్రహము' (1899) లో ఆంధ్ర భాషోత్పత్తిని వ్యాసకర్తల దృష్టి నుంచి పరికించి, తెలుగు సంస్కృతం నుంచి పుట్టినట్లు అనేక నిదర్శనాలు చూపటం జరిగింది. అయితే చెన్నాప్రగడ భానుమూర్తి పంతులు-'ఆంధ్ర భాష' (1912) తెలుగు భాష ఉత్పత్తి, వికాసం, అపేక్ష సంస్కారాలు సంగ్రహంగా వివరించింది. ఈ వ్యాసం ప్రాచీన ద్రావిడ భాషనుంచి తెలుగు భాష పుట్టి, కావ్యాలలో పొందిన పరిణామం తెలిపింది. వేదము వేంకటరాయశాస్త్రి-'విసంధి వివేకము' (1913) సంహితలో అసంధి, అసంహితలో సంధి దుష్టంగా భావించటం జరిగింది.

కిళాంబి రామానుజాచార్యుడు - 'ఆంధ్ర భాష' (1915)లో పూర్వం నుంచి భాష పొందిన పరిణామాన్ని చూపి, భాష వ్యవహారికం వైపు మొగ్గటం తెలిపి, ఈ మార్పు అంగీకరించటం అవసరమని ఆధునిక మనస్తత్వం, అభ్యుదయ దృష్టి ప్రదర్శించాడు. కొచ్చెర్లకోట కృష్ణారావు- 'ఆంధ్ర భాషాభివృద్ధి', జాతిభాషా చరిత్రలు, అన్య భాషా పదాలు, కవిత్వం పరిశీలించింది. కాశీభట్ట కృష్ణరావు శాస్త్రి 'అక్షరికోపన్యాసము' (1919) లో అ, ఆ, ఇ వర్ణాల గూర్చి

వివరించిన ధ్వని తత్త్వం ఆకృతి తత్త్వం శాస్త్ర సమ్మతంగా రూపొందితే ఉత్తమాలోచన.

మేడేపల్లి వేంకట రమణాచార్యులు (1864-1931) 'ప్రాకృత భాషోత్పత్తి' ఆర్యభాషా విభాగము వ్యాసాలలో సంస్కృత ప్రాకృత భాషాతత్త్వ పరిశీలనం కావించి, భాషా దృష్టికి దోహదం చేసిన ఈ వ్యాస గత విషయం పరిశోధన ఫలితం. వేదము వెంకటాచలమయ్య (1864-1931) 'కతిపయ శబ్దార్థ విచారము' పేరుతో వ్రాసిన అనేక వ్యాసాలు భాషా దృష్టిని తెలిపాయి. జయంతి రామయ్య పంతులు నిఘంటు నిర్మాణాన్ని, ద్రావిడ భాషలను, శాసన భాషను పరిశీలించి వ్రాసిన వ్యాసాలు భాషా విషయికంగా నూత్న దృక్పథంతో ఉన్నాయి.

మారేపల్లి రామచంద్రరావు- 'తెనుఁగు తోబుట్టువులు' (1934) భాషా చరిత్రను, భాషాభేదాలను, భాషలలో మార్పులను, ద్రావిడ భాషా స్థితిని వివరించింది. కోన వేంకటరాయశర్మ- 'సమగ్రాంధ్ర వ్యాకరణావశ్యకత' (1946) వర్తమాన వ్యాకరణాల అసమగ్రతను తెలిపి ఒకనాటి, నేటి భాష వివరణార్థం సమగ్రంగా తెలుగు వ్యాకరణం రూపొందింపవలసిన అవసరాన్ని గూర్చి తెలిపింది. డా. చేకూరి రామారావు 'భారతి' మొదలైన పత్రికలలో భాష వ్యాకరణం, భాషాతత్త్వం వివరించే అనేక వ్యాసాలు ప్రచురించాడు. భాషా పరిణామం విశదం చేసే ధోరణిలో ఉన్న ఈ వ్యాసాలు, భాషాతత్త్వ మూల సిద్ధాంతాలకు ఉదాహరణప్రాయాలుగా ఉన్నాయి. కొత్తపల్లి రంగారావు-'భాషా శాస్త్ర మూల సూత్రాలు' (1955) లో భాషా శాస్త్ర ప్రయోజనాలు, భాషా కుటుంబాలు, మూలభాష, భాషా నిర్మాణం, లిపి వంటి బహు విషయ పరిశీలనం చేశాడు.

శ్రీ బి. స. బంగారయ్య (వాగరి) 'తెలుగా, ఆంధ్రమా ?' (1963), 'తెలుగునుడి, నానుడి' (1965) వ్యాసాల సంకనాల రచయిత. ది ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో ఉప సంపాదక వృత్తిలో ఉన్నాడు. ఈ రచయితకు ఇంగ్లీషు తెలుగు భాషను ఎంతగా పాడు చేసిందో అంతకంటే ఎక్కువగా సంస్కృతం చేసిందని నమ్మకం. పబ్లిషర్సు అనటం కంటే వెలువరింతలు, ఆంధ్రం అనటం కంటే అంద్రం అనటం ఇష్టం. అప్పుడవి తెలుగుదనంతో ఉన్నట్లు అభిప్రాయం. తెలుగు భాషను దాని నుడికారపు సొంపును రక్షించాలని రచయిత దృష్టి.

మొదటి గ్రంథంలో 'చదుపరులకు కొన్ని సూచనలు'లో తన భాషా దృష్టి వ్యక్తం చేయటం, తన రచనా రీతి వివరించటం జరిగింది. ఆ విధంగానే రచనా నిర్వహణం కూడా ఉంది. ఆంగ్లానువాద పదాలు సంస్కృత పదాలుగా ఉండటంకంటే తెలుగు పదాలుగా ఉండాలని కోరటం జరిగింది. అనేక పదాలు తెలుగులో కల్పించటం కూడా గమనింపవచ్చు. Language and literature అనవలసినప్పుడు నుడినానుడులనీ, dictionary కి నిఘంటువు బదులు నుడువుల కుదురు అనాలనీ తలంచటం తెలుస్తుంది. ఇటువంటి పదకల్పనంలో రచయిత పాండిత్యం, పట్టుదల గోచరమవుతున్నాయి. ఈ వ్యాస సంపుటాలలో రచయిత సామర్థ్యం స్పష్టమవుతూ ఉంది కాని, ఆలోచన సక్రమంగా జరిగిందన్న నిదర్శనం లేదు. వ్యాసకర్తకున్న ఆంధ్ర భాషాభిమానం ప్రశంసాపాత్రమే కాని అది నిర్వహించిన తీరు, ఏర్పరచుకొన్న సంస్కరణ మార్గం హేతుయుతంగా లేవు.

ఆంధ్ర భాషా తత్త్వ పరిశీలనం జరుగుతున్న దశలోనే లిపి పరిణామ కాంక్ష బయలుదేరింది. నేటి కాలంలో తెలుగు కన్నడ భాషలకు ఏక లిపి రూపొందించాలన్న దృష్టి సందిగ్ధంగా ఉంది. అయితే ఈ దృష్టి పూర్వం ఎంత విశాల ప్రాతిపదిక మీద రూపం దిద్దుకొందో చూడవచ్చు. వెన్నెలకంటి అప్పారావు-'ఏకభాషాలిపి ప్రశంస' (1912) భారత దేశ భాషలన్నిటికీ ఒకే లిపి ఉండటంలో ఆవశ్యకత వివరించింది. అందువల్ల లాభాలు విస్పష్టంగా ప్రకటించటం జరిగింది. ఈ ప్రయత్నంలోని నిజాయితీ హర్షింపదగ్గ అంశం.

వల్లూరి పద్మనాభరాజు-'ప్రధాన వాచక పుస్తకము' (1927) లో లిపి సంస్కరణం కోరటం చూడవచ్చు. ధర్మము అని వ్రాయటం ధ్‌అర్‌మ్‌అమ్‌ఉగా కూడా ఉండవచ్చునని, అచ్చులు హల్లుల మీద చేరినప్పుడు పొందే గుర్తులు ముద్రణా సౌకర్యార్థం మార్చవచ్చునని, కరములు s। ు। ము।లు గా వ్రాయ వచ్చునని లిపి పరిణామం వాంఛించటం గమనింపవచ్చు. ఇందులో తలకట్టుకు 'I' గుర్తు ఉండటం అంటే అకారానికి అది గుర్తు అయినట్లే. అయితే ఉకారానికి U ఉండగా 1 కూడా ఉండటం అవసరం. ఏమయినా లిపి సంస్కారం వాంఛించిన ఈ వ్యాసం అభ్యుదయ దృష్టిని ప్రదర్శించింది.

పొనగంటి పార్థసారధి రాయణి-'ఆంధ్రాక్షరములు' (1928) లిపి సంస్కరణం కోరింది. ఏ భాషకు లేనంత ఎక్కువగా 'విధాలు' ఈ భాషకున్నా యని తెలిపాడు. అక్షరాల మార్పు నయినా అంగీకరించటం అవసరమన్న ధోరణి వుంది.

జీవద్భాషకు పరిణామం సహజధర్మం. ఆంధ్ర భాష శాసన భాషగా ఉన్నా, కావ్యభాషగా ఉన్నా, గ్రాంథికమయినా, వ్యావహారికమయినా, మాండలికమే అయినా అది దోషం కాదు. భాషా తత్త్వంలో ఈ మార్పుకు అవకాశం ఉంది. ఈ భాషాధర్మాన్ని భాషా శాస్త్రం సగౌరవంగా స్వీకరిస్తుంది. అందువల్ల భాషా శాస్త్ర వేత్తలకు వ్యావహారిక భాషలో దోషమున్నట్లుగా అభిప్రాయం ఉండదు. తెలుగులో వ్యావహారిక భాషను అంగీకరించే వాళ్ళు, తిరస్కరించే వాళ్ళు ఎక్కువగా ఉన్నప్పుడు వ్యావహారిక భాషలో గిడుగు, గురజాడ వంటి అనేకులు వ్యాసాలు వ్రాశారు. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి ఈ వ్యావహారిక భాషలో వ్యాస సృష్టి చేసిన వాళ్ళలో ప్రముఖ కృషి చేశాడు. గ్రాంథిక భాషావాదుల మీద దండయాత్రగా గిడుగు రామమూర్తి పంతులు ప్రౌఢవ్యాకరణ (?) ... వ్రాస్తే, ఆ తీరులో ఆదిభట్ల నారాయణదాసు మంచి బ్రతుకు, నా యెఱుక, మాటకారి, లయరాడు వంటి అచ్చ తెనుగు వ్యాసాలు వ్రాయటం జరిగింది.

గ్రాంథిక వ్యావహారిక భాషా వివాదాలు చాల కాలంగా ఉన్నాయి. వాదోపవాదాలు వేదికల మీద పత్రికలలో జరిగాయి. ఈ వివాదాలు ఉత్తమ భాషా వ్యాసాలకు దోహదం చేశాయి. వాటిలో కొన్ని ముద్రణం పొంది లభిస్తున్నాయి. కాకినాడ ఆంధ్ర భాషా సంరక్షక సమాజము లోకోపకారార్థము ప్రచురించిన 'గ్రామ్యవాద విమర్శనము' (1914) లో వ్యావహారిక భాష వ్రాయటంలోనే కాని మాట్లాడటానికి పనికి రాదని భావించటం జరిగింది. పురాణం సూరిశాస్త్రి 'గ్రామ్య వివాదము' (1913) లో వ్యావహారిక భాషను తిరస్కరించి గ్రాంథిక భాషా సంస్కారం వాంఛించాడు. వేదము వేంకట రాయ శాస్త్రి 'గ్రామ్యాదేశ నిరసనము'లో వ్యావహారిక భాషను తిరస్కరించటం జరిగింది. పి టి. శ్రీనివాస అయ్యంగార్, బి. శేషగిరిరావు, గిడుగు, గురజాడ, సెట్టి నరసింహము గ్రాంథిక వాదులను విమర్శించటం, ఆ భాషా నిరసనం,

చేయటం గమనింపవచ్చు. వావిలికొలను సుబ్బారావు అధునిక వచన రచనంలో రావలసిన మార్పులు తెలిపి, గ్రాంథికవాది అయినా, వ్యావహారిక భాషా దోహదం చేశాడు. కాకినాడ నుంచి ఆంధ్ర భాషా సంరక్షక సమాజం తరఫున కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గ్రాంథిక వాదిగా తీవ్రతను ప్రదర్శించాడు. ఈ రచయితదే 'కన్యాశుల్కస్థ గ్రామ్య భాషా వాద విమర్శనము' తీక్ష్ణంగా ఉంది. ఈ సందర్భంలో వెలువడ్డ అనేక వ్యాసాలు గ్రాంథిక వ్యావహారిక వివాదంగా కంటే ఆంధ్ర భాషా తత్త్వం పరిణామం ప్రదర్శించేవిగా రూపొందాయి.

తెలుగుతో భాషా శాస్త్రం నూత్నంగా పరిశీలనగా రూపొందిన విషయం. అది పలువురు పండితుల నాకర్షించింది. అయితే ఇంకా విస్తృతంగా ప్రసిద్ధంగా ఏర్పడ లేదు. భాషా శాస్త్ర దృష్టి భాషా భావితత్వ ప్రదర్శకం అవుతుంది. ఈ సందర్భంలో వెలువడ్డ భాషా వ్యాసాలు, భాషా శాస్త్ర పరిచయానికి దోహదం చేయగలుగుతున్నాయి. భాషా వ్యాసం ఆంధ్ర భాషా స్థితి ప్రదర్శకంగా, శాస్త్ర రచన సమర్థంగా రూపొందింది.

## 8. అన్య భాషా వ్యాసం

సంస్కృతాదీతర భాషల సారస్వతాది విషయ పరిశీలనం సవిమర్శకంగా చేసిన తెలుగు వ్యాస సృష్టి ఈ విభాగంలో గ్రహించటం జరిగింది. భిన్న సాహిత్యాల ధర్మ వివరణంలో విశదీకరణంలో వ్యాసం రచనా నిర్మాణంలో నూత్న శోభను ప్రదర్శింప గలిగిందయింది. ఈ సందర్భంలో గుర్తుంచుకోవలసిన విషయం, ఆంగ్ల సారస్వతాన్ని గూర్చి తెలుగులో విమర్శన వాఙ్మయం అల్పంగా ఉంది. వ్యాస వాఙ్మయం అత్యల్పంగా ఉందన్నది సత్యం. సంస్కృతాది సారస్వతాల పరిశీలనం సమధికంగా లభ్యమవుతూ ఉంది.

తెలుగు పండితులు సంస్కృతం అభ్యసించటం, అలంకారిక గ్రంథాలూ కావ్యాలు వ్రాయటం జరిగినట్లే, ఆంగ్లంలోనూ జరిగింది. అయితే ఆంధ్రులు సంస్కృతాన్ని గూర్చి తెలుగులో వ్యాసరూపంగా తెలిపినంతగా ఆంగ్లాన్ని గూర్చి తెలపకపోవటం సమగ్ర వ్యాస వాఙ్మయం ఆంగ్లంలో ఉండటమే రణం కావచ్చు. సంస్కృత కవి జీవిత చరిత్ర వ్యాస దర్శనం అయింగ్ఖాత ఇక్కడ సాహిత్య పరిశీలనం చేయవచ్చు.

యం. భుజంగరావు - 'సంస్కృత సాహిత్యము' (1911)లో హిందూ మతం, సంస్కృత భాష అవినాభావ సంబంధంతో ఒప్పుతున్నాయని, సంస్కృతం భాషగా ఆధిక్యం పొందిందనీ, అందుకు ఆంధ్రులు కూడా దోహదం చేశారనీ తెలిపాడు. వేదము వేంకటరాయ శాస్త్రి 'విమర్శ వినోదము, కతిపయ సంస్కృతాంధ్ర కావ్య నాటకాది విషయకము' (1920) వ్యాస సంపుటి. ఇది శాకుంతలము మొదలైన తొమ్మిది నాటక కావ్య సృష్టిలోని పద, గుణ, తత్త్వ చర్చలు, తెలుగులోని నాల్గు ప్రాచీన కావ్యాల పరిశీలనం వుంది. డా. పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి-'పాణినీయము-కావ్య వాఙ్మయము' (1944) సంస్కృత వ్యాకరణ పరిశీలనం కావించింది. ఇది వఝ్ఝల చిన సీతా రామస్వామి శాస్త్రి వ్రాతలను తిరస్కరించే రీతిలో విమర్శాత్మకంగా సాగింది.

జటావల్లభుల పురుషోత్తము-'భారతీయ వైభవము' (1951) సంస్కృతాధిక్యం, ఆర్యుల నివాసం, భారతీయత పొందిన విశ్వవ్యాప్తి వివరిస్తూ ఉంది. సంస్కృత సారస్వతం సమగ్రంగా తెలుసుకొన్న విమర్శక కలం నుంచి వెలువడ్డ ఈ వ్యాస సృష్టి విలువగలిగిందయింది. తిరుమల శ్రీనివాస శర్మ-'వేద వాఙ్మయము' (1958) ఎనిమిది వ్యాసాల సంపుటి. ఇందులో వేదాలు, బ్రాహ్మణకాలు, వేదాంగాలు, కల్పసూత్రాలు వివరించటంతోపాటు, వేదకాల సామాజిక జీవనం, వైదిక యజ్ఞాల తత్త్వం విశదీకరించటం జరిగింది. వివరణ విధేయంగా ఈ వ్యాస సృష్టి జరిగింది.

ఆకాశవాణి కార్యక్రమాలలో అమరవాణి సంస్కృత భాషా సారస్వత పరిమితంగా వ్యాస ప్రసారం కావించింది. ఆ కార్యక్రమాలలో తమ ప్రసంగ వ్యాసాలు వెలుగులోకి తెచ్చిన సంస్కృత పండిత విమర్శకులు వాటిని సంపుటీకరించటం వల్ల లోకోపకారం చేశారు.

శ్రీ నల్లాన్‌చక్రవర్తుల వేంకటాచార్యులు- 'అమరవాణీ వ్యాసాలు' భాష, వ్యాకరణం, సాహిత్యం వంటి విషయ విన్యాసాలుగా ఉన్నాయి. శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి 'అమరవాణీ ప్రసారములు' పలువురు ఆకాశవాణి సంస్కృత కార్యక్రమంలో ప్రసారం చేసిన వ్యాసాల సంపుటి. ఇందులో శ్రీ జటావల్లభుల పురుషోత్తము, శ్రీ సూరి రామకోటిశాస్త్రి, శ్రీ అప్పల సోమేశ్వరశర్మ వంటి ప్రముఖుల వ్యాసాలున్నాయి. ఇవి భాషా సారస్వత వేదాంతాది అనేక విష

యాలు కలిగిఉన్నాయి. ఈ సంకలనం ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమి ప్రచురించింది.

ఎన్. సి. యస్. వేంకటాచార్యులు-'అమరవాణి' (1968) 23 వ్యాసాల సంపుటి. సాహిత్యం, వ్యాకరణం, పదచర్చ, వర్ణ చర్చ, వ్యాకర్తలు, నిఘంటుకారులు వ్యాస విషయాలు. వ్యాసకర్త సంస్కృతం సంగతి తెలుగు వ్యావహారికంలో వివరించాడు. సంస్కృతం సగౌరవంగా స్వీకరింపబడాలన్న ఆశను, ఆసక్తిని వ్యాసకర్త ప్రకటించాడు. ఈ రచనాగతంగా రచయిత బుద్ధి హృదయాలు విశాలంగా వ్యాకోచాత్మకంగా గోచరమవుతున్నాయి. రచనా భాష సంస్కృతాంధ్రాలలో తెలుగువైపు, గ్రాంథిక వ్యావహారికాలలో వ్యావహారికం వైపు మొగ్గటంలో రచయిత భాషా దృష్టి స్పష్టమవుతూ వుంది.

భారతదేశ స్వాతంత్ర్యానంతరం సంస్కృత భాష కంటే హిందీ రాజ్యాంగ ప్రాధాన్యం పొందింది. దాని ప్రాముఖ్యం క్రమక్రమంగా పెరుగుతూ వచ్చింది. ఈ సందర్భంలో హిందీ పఠనపాఠనాదులు పెరిగాయి. తెలుగువాళ్ళు ఈ మధ్యనే హిందీ అధికంగా నేర్చుకోవటంతోపాటు అందులోని అంశాలు ఆంధ్రులకు తెలుగులో తెలపటం కూడా ఆరంభమయింది.

డా. జి. సుందరరెడ్డి- 'వెలుగుదారులు' 14 వ్యాసాల సంపుటి. హిందీ సారస్వతంలో ఉన్న సాహిత్య సంప్రదాయాలు, కవితారీతులు, కవులు, కావ్యాలు తెలుగు భాషలో విమర్శించిన వ్యాసాల సంపుటి యిది. వీటివల్ల హిందీ విషయాలనేకం తెలుగువాళ్ళకు తెలియటంతోపాటు తారతమ్య పరిశీలనకు దోహదం జరిగింది.

డా. బయ్యా సూర్యనారాయణ 'ఆలోచనామృతము' (1970) వ్యాస సంపుటి. ఆధునిక హిందీ సాహిత్యం మీద ఆలోచనలుగా ఇవి ప్రసిద్ధంగా ఉన్నాయి. డా. బాలశౌరిరెడ్డి, డా. జె. విశ్వామిత్ర హిందీ భాషా సారస్వత విషయాలు తెలుగులో వ్యాసగతంగా నిలుపుతున్నారు. హిందీ సాహితీ ధర్మాలు ఆంధ్రులకు అందించటం కోసం ప్రయత్నించే పత్రిక స్రవంతి. ఇకముందు ఈ భాషావిషయిక వ్యాసాలు తెలుగులో అనేకం అవతరించే అవకాశం ఉంది.

బూర్గుల రామకృష్ణరావు-'సారస్వత వ్యాస ముక్తావళి' ఉరుదూ పారసీ కవితారీతులు ఆంధ్రులకు పరిచయం చేసిన సారస్వత విమర్శన వ్యాస సంపుటి.

కవిగా, రచయితగా, సాహితీ వేత్తగా, రాజకీయ నాయకత్వంతో మంత్రిగా, ముఖ్యమంత్రిగా, గవర్నరుగా జీవితం సారస్వత రాజకీయాల వంతెన మీద గడపిన బూర్గుల రామకృష్ణరావు సంస్కృతాంధ్రాంగ్ల మహారాష్ట్ర కర్ణాటక ఉరుదూ పారసీ సాహిత్యాల లోతులు తెలుసుకోవటం ఆయన సామర్థ్యానికి వివరణ. నమ్మిన సత్యం స్పష్టంగా వివరించటంలో వ్యాసకర్త దీక్ష గోచరమవుతుంది. 1926 నుంచి 1947 వరకు ప్రచురించిన వ్యాసాలలో కొన్నిమాత్రమే ఇందులో చేరాయి. ఉరుదూ పారసీ కవిత్వాలలోని జీవిత ధర్మాలు వివరించటంలో రచయిత తాదాత్మ్యం చెందాడు. భావ కవిత్వానికి ప్రేమ, వ్యావహారిక భాషకు ప్రోత్సాహం, సాహిత్యానికి చారిత్రక దృష్టి రచయిత అందించాడు.

విమర్శన గ్రంథాలుగా వెలువడ్డ శ్రీ నిడదవోలు వేంకటరావు - 'ఆంధ్ర కర్ణాట సారస్వతములు - పరస్పర ప్రభావము' (1962), ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ ప్రచురించిన - 'దక్షిణ భారత సాహిత్యములు' (1962), 'ఉత్తర భారత సాహిత్యములు' (1965) దక్షిణోత్తర దేశభాషలు వివరించే అనేక వ్యాసాల సంపుటాలు. భారతదేశ భాషల సారస్వత పరిశీలనం ఆంధ్ర సారస్వత స్థితి పట్ల సమగ్రాభిప్రాయావకాశం కలిగిస్తుంది.

## 9. అనువాద వ్యాసం

ఆంగ్లభాష, భారతీయ భాషల నుంచి తెలుగులోకి అనువాదమై వచ్చిన వ్యాస వాఙ్మయం అనువాద వ్యాసంగా పరిశీలనం పొందింది. అనువాద వ్యాసం సృజనంగా ఉన్నా, విమర్శనంగా ఉన్నా, తెలుగులోకి అనువదించటంలో కర్తలు అభివ్యక్తం చేసిన కృషి బుద్ధిగతంగా జరిగిందే కాబట్టి అనువాద వ్యాసం విమర్శన వ్యాస భాగంగా గ్రహించటం జరిగింది.

అనువాద వ్యాస ప్రయోజనం బహుముఖంగా ఉంది. ఆంగ్లాది భాషలతో పరిచయంలేని వాళ్ళకు అనువాద వ్యాసం సారస్వత ప్రయోజనం సిద్ధింపజేస్తుంది. ఇతర భాషా సారస్వతాలలో వచ్చిన పరిణామం, భావ చైతన్యం అనువాద వ్యాసం స్పష్టం కావిస్తుంది. అంతేకాక అనువాద వ్యాసం, ఆంగ్లాది సారస్వతాలలో వ్యాసప్రక్రియ లక్షణాలు గ్రహించటానికి దోహదకారిగా ఉంది.

భారతీయ భాషలన్నింటిలోకి వ్యాస ప్రక్రియ ఆంగ్ల ప్రభావం వల్లనే సంక్రమించింది. వ్యాస వాఙ్మయం విశాలంగా రూపొందటానికి ప్రధానావసరం సమర్థమైన వచనం. ఈ భాషలలో ఆధునిక వచనం ఆంగ్ల సారస్వత మైత్రి వల్ల అవతరించింది. అందువల్ల స్థూలంగా వ్యాస వాఙ్మయం ఈ దేశ భాషలన్నింటిలో ఆంగ్ల సాహిత్య ఫలితంగా ఏర్పడింది.

భారతీయ భాషలలో దాదాపు ఒకే కాలంలో అవతరించిన వ్యాసం పొందిన పరిణామం కూడా తుల్యంగా ఉంది. ప్రతి భాషలో, ఈ దశలో కందుకూరి వీరేశలింగం పంతులుతో పోల్చదగ్గ సంఘ సాహిత్య సంస్కర్తలు, సాంఘికావసరమై పుట్టి పెరిగారు. భారతదేశంలో వ్యాసం ప్రారంభంలో ఉపన్యాసంగానే గోచరమవుతూ వుంది. అధిక్షేప వ్యాసావసరమూ కలిగింది.

వ్యాసం ఈ విధంగా రూపొందటంలో భారతదేశ సాంఘిక పరిస్థితి నేపథ్యంగా ఉంది. ఆధునిక విద్యారాహిత్యం, ఆర్థిక జీవితం, మత వాతావరణం ఈ స్థితిని కలిగించాయి, పోషించాయి. తెలుగులోనికి అనువాదం పొందిన వ్యాసాలు పరికిస్తే భారతదేశంలో ఉన్న పరిస్థితులే ఆంధ్రులకూ ఉన్నాయన్న భావం కలుగుతుంది.

ఆంగ్లం నుంచి అనువాదమై వచ్చిన వ్యాసాలు చదువరులతో పాటు రచయితలనూ ఆకర్షించాయి. ఆంగ్లేయాలోచన తెలపటంతో పాటు, ఆంధ్రులలో ఆ విధమైన రచనా ప్రోత్సాహం కూడా కలిగించాయి. తెలుగు సృజన వ్యాస సృష్టి, సృజన వ్యాసానువాదం దాదాపు ఒకే కాలంలో జరుగుతూ వచ్చాయి. ఒకదానికొకటి ప్రోత్సాహ హేతువై, రచనా సిద్ధి పొందాయి.

## 1. ఆంగ్లానువాద వ్యాసం

తెలుగులోని ఈ వ్యాసాలు, ప్రాధాన్యం ప్రాముఖ్యం వల్ల, తత్తదుచితంగా పరిశీలించటం జరిగింది. ప్రారంభంలో అనువాదం గ్రాంథికంగా అనంతరం వ్యావహారికంగా వుంది. ఆంగ్ల వ్యాసానువాదం చేసిన మొదటి దశలో యథాతథానువాదంగా ఉంటే అనంతరం స్వేచ్ఛానువాదంగా వ్యాసాలు కనిపించాయి. నాటి వ్యాసాలలో స్పష్టత సంక్షిప్తత వాంఛనీయంగా ఉంటే నేటి వాటిలో ఆ అవసరం అంతగా లేదు.

1. *బేకనుపన్యాసములు (1903)*: సుసర్ల అనంతరావు: ఆంగ్లంలో ప్రథమ వ్యాసకర్తగా భావింపబడిన బేకన్ వ్యాసాలు తెలుగులో ఉపన్యాసాలుగా అనువదించటం తెలుగు వ్యాస రచన మారంభమయిన తొలి వత్సరాలలోనే జరగలేదు. బేకన్ వ్యాసాలు 58. అందులో 20 మాత్రమే అనువాదం చేయటం జరిగింది. తెలుగులో ఉన్న ఈ వ్యాసాలు ఆంగ్ల వ్యాస క్రమంలో లేవు.

ఈ అనువాద వ్యాస సంపుటిలో మొదటి మూడు పుటలలో బేకను జీవితం స్థూలంగా తెలపటం చూడవచ్చు. ఆ పైన రంగయ్య సెట్టి ఉపోద్ఘాతం ఉంది.

"The wealth of imagery and illustration, no less than the highly suggestive and impressive forece of expression is fairly faithfully preserved, and a terseness of style forming quite a counter part of the original is strikingly exhibited."

అని ఉపోద్ఘాతంలో అనువాదాన్ని గూర్చి చెప్పాడు.

వ్యాసానువాద కర్త "ఈ గ్రంథము నందెచ్చట నయిన బేకను దొరవారి యభిప్రాయమును నేను సరిగ వెల్లడి సేయఁజాల నయితినేని యంతటి మహత్తరమయిన గ్రంథమును భాషాంతరీకరించు నపుడొక దవశ్యము పడవలసిన కష్టమును విచారించి మనీషావంతులు నన్ను మన్నించి సవరణలు నాకుఁ దెలిపి నచో నవ్వానిని వందన పూర్వకముగ నందికొనెదను" అని వ్రాయుటంలో అనువాద శ్రమ అభివ్యక్తమయింది.

ఆంగ్ల భాషా రచనలు ఆంధ్ర భాషలోనికి అనువదించటం ఆరంభించిన మొదటిలో భాషా ప్రయోగంలో ఉన్న సాధక బాధకాలకి సంపుటి నిదర్శనం. అంతకుముందు ఆంగ్ల వ్యాసాలు అధికంగా అనువాదం కాలేదు. ఆంగ్ల వ్యాస రచయితలలో సంక్షిప్త వాక్య రచనకు బేకన్ పెట్టింది పేరు. అనువాద విధానం సక్రమంగా సిద్ధించి ఉండకపోవటం వల్ల ఈ వ్యాసానువాదం కష్ట సాధ్యమే అయింది. అనువాద సంసిద్ధత పొందుతున్న భాషానేపథ్యం దృష్టిలో ఉంచుకొని ఈ వ్యాస పరిశీలనం చేయటం సముచితం.

మూలంలోని వాక్య విన్యాసంలోని సౌందర్యం బలం, అభివ్యక్తి లోపింప కుండా అనువాదం చేయాలన్న తీవ్రయత్నం నుంచి ఈ గ్రంథం అవతరించింది. అయితే అది సర్వసమయాలలో సిద్ధించినట్లు చెప్పటం సాధ్యంకాదు. అనువాద వైవిధ్యం దర్శింపటం వల్ల ఆంగ్ల వాక్య భావాలు ఆంధ్రంలోకి రావటంలో ఎదుర్కొన్న భాషా వైరుధ్యాలు స్పష్టమవుతూ ఉన్నాయి.

1. మూలంలోని స్ఫూర్తికి భిన్నంగా స్వేచ్ఛగా అనువాదం ఉంది. "It has been hard for him that spake it to put more truth and untruth together in few words, than in that speech whosoever is delighted in solitude is either a wild beast or a God." (P.66-Bacon's Essays by E.G.Selly)

దీనికి అనువాదంలో "ఏకాంతవాసము (Solitude) నభిలషించు వాఁడొక యడవి మృగముగ నైనను దేవుడుగ నైనను నుండవలెనని యొకడు సత్యాసత్యములను రెండిని మేళవించి పలికినాడు" (పుట. 1) అనటంలో స్వేచ్ఛ గోచరమవుతూ ఉంది. It has been hard for him కి తెలుగు అనువాదం లేదు. ఒకడు అనటంలో అర్థభేదం దర్శింపవచ్చు.

2. ఆంగ్ల భావస్ఫూర్తి సంపూర్ణంగా విస్పష్టంగా అందించే అనువాదం ఉంది.

"...And defer not charities till death; for, certainly if a man weigh it rightly, he that doth so is rather liberal of another man's than of his own." (P. 93) "men fear death, as children fear to go in the dark; -" (P. 3)...

ఈ వాక్యానువాదంలో "దానముల నవసాన కాలమునఁ జేయ వచ్చునని యూరకుండకుము. చక్కఁగఁ బరికించినచో నీ యవసానదశయందు ధారాళముగఁ జేసిన దాన కార్యములు వేఱొకని సొమ్ముతోఁ జేసిన వగును గాని నీ సొమ్ముతోఁ జేసినవి కావు" (పుట 15) "బాలు రిరులఁ జనుటకు భీతిల్లినట్లు

మనుజులు మరణ మన్న భయపడుదురు'' (పుట 27). మొదటి ఉదాహరణంలో ఆంగ్ల వాక్యంలోని సంక్షిప్తత తెలుగు వాక్యంలో లోపించినా స్పష్టత గుణ భరితమయింది. రెండవ ఉదాహరణంలో అనువాదం విస్పష్టంగా ఉంది.

3. అనువాదం సరళంగా ఉందికానీ, ఇంకా సంక్షిప్తంగా ఉండవచ్చు ననిపించే అనువాద భాగాలు గోచరమవుతున్నాయి.

"Reading maketh a full man; conference a realy man; and writing an exact man. And there fore, if a man write little, he had need have a present wit, if he read little, he had need have much cunning to seem to know that he doth not" (P 130).

దీనికి తెలుగులో "చదువుట వలన విషయ పరిజ్ఞానము గలుగును. సంభాషించుట వలన సమయస్ఫూర్తి యలవడును. వ్రాయుచుండుట వలన నిశ్చితాభిప్రాయములు గలుగును. కావునఁ గొంచెముగ వ్రాయువానికెక్కువ జ్ఞాపక శక్తి యుండవలయును. కొంచెముగఁ బ్రసంగించు వానికి సమయస్ఫూర్తి యెక్కువగ నుండవలయును. కొంచెముగఁ జదువు వానికిఁ దనకుఁ దెలియనిది తెలిసినట్లు నటించు శక్తి యెక్కుడుగ నుండవలయును." (పుట 47). ఆంగ్ల వాక్యం తెలుగులో అనేక వాక్యాలుగా రూపొందిన సంక్షిప్తత తగ్గింది.

4. అనువాదంలో సంపూర్ణ భావ బోధకం కాని వాక్య రచనముంది.

"A principal fruit of friendship is the ease and discharge of fulness and swellings of the heart, which passious of all kinds do cause and induce (P 67). He who was envied wheu alive, will be loved when dead" (P 5)

ఈ వాక్యానువాదాలలో "సకలేంద్రియముల వలనను దన హృదయమునకుఁ గలుగు స్థితిగతులను నిస్సందేహముగా జెప్పుకొనఁగూడుట యొకనికి స్నేహము వలనఁ గలుగు ముఖ్య ఫలము'' (పుట 2) "బ్రతికి యుండగాఁ జెడ్డవాఁడనిపించుకొనిన వానిని చచ్చిన తరువాత నలుగురును మంచివాడందురు''

(పుట 30) మొదటి దానిలో ease and discharge కి కాని, cause and induce కి కాని పూర్తిగా అనువాదం లేదు. fulness and swellings స్థితి గతులు కావు; రెండవదానిలో కర్త స్థానం వ్యత్యస్తమయింది.

5. అనువాదంలో తుల్యపదం లభించకపోవటం చూడవచ్చు. Studies serve for delight, for ornament; and for ability" (P 128) ఈ ఆంగ్ల వాక్యానికి అనువాదం "గ్రంథ పరిశోధనము, హృదయానందమును, ప్రఖ్యాతిని సామర్థ్యమును గలిగించును" (పుట. 45) ఉండి, studies అంటే గ్రంథ పరిశోధన మనటం జరిగింది, అలాగే love అన్న పదం అనువదించటం కామమనో, మోహమనో ఉంది. లేకపోతే పదం త్యజించటం జరిగిందికాని ప్రేమమని వ్రాయటం జరగలేదు. దీని వల్ల love అనే పదానికి అప్పటికి ప్రేమ పదం తుల్యంగా ప్రసిద్ధం కాలేదని గ్రహింపవచ్చు. ఆంగ్ల వ్యాసాలలో వాక్యాలు కొన్ని ఆంధ్ర వ్యాసంలో లోపించాయి.

*నిర్మాణ వ్యాసం:* ఆంగ్లంరాని తెలుగు పండితులు వాక్య రచనా విన్యాసంలో సంక్షిప్తంగా వ్రాసే ధోరణికి ఈ అనువాద గ్రంథం దోహదం చేసింది. వ్యాస విషయ నిర్ణయం చేసుకోవటానికి బేకను గ్రహించిన విషయాలు సహాయపడ్డాయి. శైలి, శిల్పం, ప్రక్రియ తెలుగులో రూపొందటానికి ఈ అనువాదం ఉపయోగపడింది.

ఈ గ్రంథ కాలానికి తెలుగులో అనువాద వ్యాసం ప్రారంభ దశలో ఉంది. బేకన్ వ్యాసాలు, భాష అనువాద రీతికి సిద్ధమవుతున్న దశలో, అనువదించి భాషోపకారం చేయటం వల్ల సుసర్ల అనంతరావు కృషి ప్రశంసాపాత్రంగా గ్రహించటమయింది. ఈ కాలంలో ఈ వ్యాసాలకు కిదాంబి రామానుజాచార్యులు చేసిన అనువాదం లభించటం లేదు. అనువాదం సంపూర్ణ సిద్ధి పొందకపోయినా ఆ కాలంలో ఇంత సమర్థానువాదం విశిష్ట కృషిగానే గ్రహింపవచ్చు.

*ఇంగ్లీషువారి సంసార పద్ధతులు:* ఆంగ్లంలో కుమారి ఎ. ఎం. యం. రిడ్స్‌దేల్ (తర్వాత శ్రీమతి హుడ్) వ్రాసిన 13 వ్యాసాల సంపుటి రాయసము వేంకట శివుడు అనువదించి ప్రచురించాడు. అనువాదకర్త-

"As usual, I have taken care that the style is sufficiently easy and that the language is tolerably grammatical and idomatic. Some particulars here and there - which seemed to me not quite necessary - have been omitted; but every precaution has been taken that the spirit of the book is not lost in translation" అని తెలపటం వల్ల అనువాద విధానం తెలుస్తూ వుంది.

అనువాదం వివిధంగా సాగినట్లు విశదమవుతూ వుంది. "Traing of Children"కి శిశుశిక్ష, 'On married life' కి గృహస్థాశ్రమము సముచితానువాదాలుగా కనిపిస్తే, 'House-keeping'కి కాపురము చేయుట కంటే గృహ నిర్వహణము, "Girl life" కి బాలికలను గురించిన యాచారములు కంటే బాలికా జీవితము సమర్థంగా ఉన్నట్లు భావింపవచ్చు. ఈ వ్యాసాలు జనానా పత్రికలో 1900-1901 సంవత్సరాల ప్రచురించి, ఆనంతరం సంపుటిగా ముద్రించాడు.

ఆంగ్లంలోని 17 వ్యాసాల విషయం తెలుగులో 13 వ్యాసాలుగా సంక్షిప్తమయింది. ఆంగ్లేయ బాలిక స్త్రీగా గతించే వరకు పొందే దశలు ఈ వ్యాసాలు ప్రదర్శించాయి. ఆంగ్లేయుల జీవిత విధానం తెలియటం, స్త్రీ వ్యక్తిత్వం గోచరం కావటం, అందువల్ల ఆంధ్ర స్త్రీ జీవిత విధానంలో మార్పు వాంఛించటం కొంతవరకు ఈ వ్యాసాలవల్ల జరిగింది. ఈ ఆంగ్లేయ స్త్రీ వ్యాసాలు తెలుగులో స్త్రీలు వ్యాస సృష్టి చేయటానికి ప్రోత్సాహంగా రూపొందాయి. తెలుగులో వ్యాస రచయిత్రులు స్త్రీ సమస్యల గూర్చి ఆలోచించటానికి ఇటువంటి వ్యాస దోహదమున్నట్లు భావింపవచ్చు. ఈ వ్యాసాలలో ఆంగ్లేయ వనిత జీవితం, విశ్వాసం, సంఘ గౌరవం ఆంధ్ర వనితతో పోల్చి పరిశీలించటం జరిగింది.

వ్యాస రచయిత్రి కవితాత్మకంగా, కోమలమూ మనోహరమూ అయిన రీతిలో, విషయ మంగీకరింపజేసే తీరులో, ఒక విధమయిన ఆకర్షణ నిక్షిప్తం చేసి వ్యాస సృష్టి చేయటం గుర్తించి, అనువాద కర్త ఆయా గుణాలు తెలుగులో భద్రంచేస్తూ అనువాదం చేశాడు. ఈ వ్యాసాలు, ఆ కాలంలో సాంఘికంగా స్త్రీ వ్యాస సృష్టిగా సాధించిన పరిణామం గమనార్హ స్థాయిని పొందాయి.

3. వేమన - పాశ్చాత్యులు (1971) శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి చేసిన అనువాద వ్యాస సంపుటి. ఆంగ్లవ్యాసాల నుంచి ఈ ఆంధ్ర వ్యాసాలు అనువాదం పొందాయి. ప్రజాకవి, మహాకవి, విప్లవకారుడు, ప్రవక్త, లోకకవి, యుగపురోగామి అనే దృష్టి ప్రసాదించిన వేమన జీవితం సాహిత్యంలో సువర్ణ ఘట్టం. వేమన కవితను ఆంగ్లేయులు ఆదరించి ప్రకటించిందాకా ఆంధ్రులు అంతగా గుర్తించలేదు. అందువల్లనే బ్రౌన్ వేమనను నేను కనుగొన్నాననటం సత్య సన్నిహితం. బ్రౌన్, కాంబెల్, మ్యాక్‌డోనాల్డ్ వంటి పలువురు వేమన కవితను ఉత్తమంగా గ్రహించారు.

ఈ సంపుటిలోని తొమ్మిది వ్యాసాలు ఆంగ్లం నుంచి అనువదించటం జరిగింది. అనువాదకర్త ఆంగ్లాంధ్ర పాండిత్యంతో అనువాద వ్యాసాలు స్వతంత్ర వ్యాసాలన్నంత సమర్థంగా రూపొందాయి. అనువాదం, అసలు రచనగా భావించేంత ఉన్నంతగా ఈ కాలంలో వచ్చిన మార్పుగా గుర్తింపవచ్చు. ఈ రచయిత సారస్వత వ్యాసాలు సంపుటంగా ముద్రింపవలసి ఉన్నా, అనువాద వ్యాసాలు ప్రచురించటంలో వీటి సాఫల్యం స్పష్టమవుతూ వుంది. పత్రికా రచయితగా, వక్తగా, సాహితీవేత్తగా సాధించిన సాహిత్య జీవితం అనువాదంలో నిక్షిప్తం కావటంవల్ల ఈ వ్యాస సంపుటి ఆంధ్రుల కాత్మీయంగా ఉంది.

4. ఇతర వ్యాసాలు : ఆంగ్లం నుంచి అనువదింపబడి తెలుగు సారస్వతంలో భాగంగా ఉన్న వ్యాసాలను మూడు దశలుగా పరికింపవచ్చు. ఆద్యదశ (1876-1900), అనంతర దశ (1901-1947), ఆధునిక దశ (1948-1972) లలో వెలువడ్డ వ్యాసాలు ప్రదర్శించిన పరిణామం పరిశీలించవచ్చు.

*ఆద్య దశ :* ఈ దశలో ఆంగ్లానువాద వ్యాసం అనువాద రీతిలో ప్రాథమిక గుణం ప్రస్ఫుటమవుతూ వుంది. భాష గ్రాంథికంగా ఉండి రచనలో సారళ్యం తగ్గి శైలి కుంటుపడి పోవటం వల్ల ఈ దశలోని అనువాద వ్యాసం ఉత్తమ వచనం వెలువరించలేకపోయింది. అయితే ఆంగ్ల భావాలు ఆంధ్రంలో అభివ్యక్తం చేయటానికి జరిగిన ప్రయత్నాలుగా ఈ వ్యాస సృష్టి గమనింపవచ్చు.

'లార్డ్ క్లైవ్ చరిత్రము' (1876) మెకాలే వ్యాసాల నుంచి ఎ. యన్. నాగేశ్వరశాస్త్రి అనువదించటం జరిగింది. పుట్టుక మొదలు ఆత్మహత్య దాకా ఉన్న ఈ జీవిత చరిత్ర వ్యాసం వ్యక్తి సంఘంతో చేసే పోరాటం నుంచి పుట్టిందిగా గోచరమవుతూ వుంది.

'ఉదకమును గూర్చిన యుపన్యాసము' (1882) డా. యం. సి. ఫర్నెల్ "Water and its effect on public health" ఉపన్యాసానికి వల్లూరి జగన్నాథరావు పంతులు (రిజిష్ట్రారు) చేసిన అనువాదంగా వెలసింది. ఇది స్వేచ్ఛగా సాగి, ప్రజారోగ్యం పట్ల ప్రభుత్వం చూపే ఆందోళనగా కనిపించింది. భారత దేశంలో బావులు కాలువల నీటిని ఉపయోగించుకోవటంలో చూపే అజాగ్రత్తల వల్ల కలిగే అనర్థాలు వివరించటంతో పాటు వేద, స్మృతి, రామాయణ భారతాది గ్రంథోదాహరణాలతో, వీటిని భద్రంగా వాడుకోవటం తెలుపబడింది. భాష స్పష్టంగా విషయ వివరణ సమర్థంగా ప్రయుక్తమయింది.

'రాబర్టు నోబుల్ గారి చరిత్రము' (1884) మల్లాది వెంకటరత్నము ఆంగ్ల జ్ఞాపికలు ఆధారంగా వ్రాయటం జరిగింది. బందరులో నోబుల్ కళాశాల విద్యార్థులకు అంకితంగా ఇది వెలువడింది. పుట్టుక మొదలు గిట్టిందాకా నోబుల్ జీవితం విద్యా బోధన, కుల నిర్మూలన కృషి, బందరులో కళాశాల స్థాపనం వంటి అనేక విషయ విలసితంగా వ్యాసం సాగింది.

'జార్జి స్టీవెన్‌సన్ గారి చరిత్రము' (1897) మల్లాది వెంకటరత్నము జీవిత చరిత్ర వ్యాసంగా అనువదించటం జరిగింది. 'పొగబండి బాటలను మొదటకట్టిన' వ్యక్తి జీవితంలోని ప్రధాన ఘట్టాలు క్రమంగా వివరిస్తూ సాగింది వ్యాసం. సి.యల్.యస్. ప్రచురణంగా తెలుగులో వెలువడింది.

'మనుష్య వాంఛా నిష్ప్రయోజనత్వము' శామ్యూల్ జాన్‌సన్ వ్యాసానువాదంగా చింతామణి పత్రికలో ముద్రితమయింది. మనిషి చేసే ప్రయత్నాలన్నీ ఫలవంతంకాక పోవటం వల్ల ఇహలోక వాంఛల నుంచి పరలోక వాంఛలు ప్రబలుతాయన్న ప్రధాన దృష్టితో ఈ వ్యాస సృష్టి జరిగింది.

అనంతర దశ : ఈ దశలో అనువాద వ్యాసం స్వేచ్ఛగా, భాషా సమర్థంగా, స్పష్టతతో వెలువడింది. ఆద్యదశకంటే ఈ దశలో అనువాద సారళ్యం గుర్తించటం కుదురుతుంది. స్థూలంగా అనువాదం భాషా చైతన్యం పొందినట్లు భావింపవచ్చు.

'మతివలెనే గతి' (1915) కొండూరు కుమారస్వామి, 'మనసు బోలి మానవ జన్మము' (1917) మి. పద్మనాభశ్రేష్ఠి, ఆంగ్లంలో జేమ్స్ అలెన్

As a man thinketh అనే వ్యాస సంపుటికి అనువాదాలుగా వెలువ రించారు. ఇందులో మనిషి స్వభావం, చేష్టలు, సంకల్పంవల్ల లాభాలు, మనశ్శరీర సంబంధం, బుద్ధిసామర్థ్యం, శాంతప్రవృత్తి వంటి అనేకాంశాలు వివరించడం జరిగింది.

'అనుమాన పురుషులు' (1915) బాలాంత్రపు వేంకటరావు అనువాద వ్యాసం. భార్యను అనుమానించే భర్త లక్షణాలు ప్రవర్తన తెలుపుతూ, భార్య తదనుకూలంగా నడుచుకోవటం ఈ వ్యాసంలో వివరించాడు. మనిషి మనస్తత్వంలో భావాల జాడలు అన్వేషించినట్లు ఈ వ్యాసం గోచరమవుతూ ఉంది.

'వివేక చంద్రిక' మహావాది వేంకటరత్నం, వివేకానంద స్వామి మొదలైన అనేకుల ఆంగ్ల రచనానువాదాల సంపుటి. ఇది భిన్న రచయితల వ్యాసాల సంకలన గ్రంథం. విషయం ఆధ్యాత్మికతత్వ పరిమితంగా ఉంది. భగవద్గీతకు విపుల వ్యాఖ్యానాలుగా ఈ వ్యాసాలు స్థూలంగా గోచరమవుతూ ఉన్నాయి. వివేకానందస్వామి వ్యాసాలు కూచి నరసింహము అనువాదం చేసి ప్రచురించాడు.

'నీతి సుధ'-వేటూరి ప్రభాకరశాస్త్రి చేసిన అనువాదం. ఒక గ్రంథంగా గోచరమవుతూ ఉన్నప్పటికీ భిన్న విషయ పరిశీలనం వల్ల వ్యాస సృష్టిగా గ్రహించటం జరిగింది. అనువాదంలో సారళ్యం, మాధుర్యం స్వచ్ఛంగా కనిపించాయి. స్వతంత్రరచనా భ్రాంతి కలిగించేంత ఉత్తమంగా అనువాదం సాగింది.

'గ్రామోద్ధారణ మహాశక్తి' (1937) బ్రైనే వ్రాసిన ది విలేజ్ డైనమోకి గ్రేస్ బుచ్చర్డ్, యం. శేషయ్యల అనువాదంగా వెలువడింది. గ్రామంలో విద్య, పారిశుద్ధ్యం, వ్యాయామం, వృత్తులు, బాల స్త్రీల జీవితం ఏ విధంగా రూపొంద వలసిందీ వివరిస్తూ సాగిన వ్యాసాల సంపుటిగా ఇది గోచరమవుతూ ఉంది. గ్రామ జీవితం పునర్నిర్మాణం అయితే తప్ప దేశ జీవితం పురోగమనం చెందదన్న స్ఫూర్తి కలిగించిందీ వ్యాస సంపుటి.

*ఆధునిక దశ :* ఈ దశలో అనువాద వ్యాసం ఆంధ్రంలో స్వతంత్రంగా రచిత మయిన వ్యాసం అన్నంతగా భాషాశైలి దృష్టితో ఉన్నతంగా గోచరమవుతూ ఉంది. ఈ స్థితిలో తెలుగులోకి ఎక్కువగా సారస్వత వ్యాసాలు అనువదించటం జరిగింది. ఈ దశలో, విషయంలోనూ రచనంలోనూ అనువాద

వ్యాసం సారస్వత పరిధిలోకి ప్రవేశించింది. ఈ అనువాద వ్యాసంలో రాజకీయ చైతన్యం కూడా గోచరమవుతూ వుంది.

'కాళిదాస కవిత' (1958) ఆంగ్ల మూలకర్తలు అరవింద రవీంద్రులైతే ఆంధ్రానువాదకర్త డా. బొడ్డుపల్లి పురుషోత్తము కాగా వెలువడింది. ఈ వ్యాస సంపుటిలో కాళిదాసు కవితా రామణీయకత పరిశీలన పొందింది సారస్వత విమర్శన వ్యాసాలుగా ఉన్న ఈ గ్రంథంలోని ఆరు వ్యాసాల సంపుటి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి.ఎ. పాఠ్య భాగంగా నిర్ణయించటంవల్ల ఈ అనువాద వ్యాస స్థానం విశదమవుతూ వుంది. కాళిదాసు సారస్వతం తాత్త్విక పరిధినుంచి పరికించిన అరవింద రవీంద్రుల ఆత్మదీప్తివల్ల తేజస్సుందరంగా వెలుగొందే ఈ వ్యాసాలు, సముచితాంధ్రానువాదాలై, తెలుగు సారస్వతంలో విలువైన స్థానం పొందాయి.

యం.యన్. రాయ్ వ్యాసాలు కె. రాధాకృష్ణమూర్తి అనువాదం చేయగా తెలుగులో ప్రకటితాలయ్యాయి. రాయ్ జీవిత పరిణామ దశలను వ్యక్తంచేసే భావ సందోహంతో ఒప్పుతూ వున్నాయి ఈ వ్యాసాలు. అజయ్‌కుమార్ ఘోష్ 'వ్యాసాలు ఉపన్యాసాలు' (1962) ఆంగ్లంలో ప్రాచ్య సాహిత్య ప్రచురణాలయం మాస్కో ముద్రిస్తే ఆంధ్రంలో విశాలాంధ్ర ప్రచురణాలయం విజయవాడ ప్రకటించింది. ఇది కమ్యూనిజం ప్రచార వ్యాస సంపుటి రష్యా, ఇండియా లలో కమ్యూనిజం పొందిన పరిణామాలు వివరించింది. ఇది ఒక విధమైన రాజకీయ చైతన్య దృష్టిని బోధించటం పరమ ప్రయోజనముగా అవతరించింది. 'నెహూ్రు ఉపన్యాసాలు' (1962) జాస్తి జగన్నాథం అనువదించాడు. ఇది రాజకీయ సామాజికాలోచనల సంపుటి. 'ధర్మోద్ధరణ' డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ ఆంగ్ల వ్యాసానికి బి. రాధాకృష్ణమూర్తి చేసిన అనువాదం. ఇది మానవ జీవన పరిపూర్ణతను, ఉదాత్త మత ధర్మాల పట్ల విశ్వాసాన్ని బోధించే రచన.

'సంస్కృత భారతము' - శ్రీ రాధాకుముద ముఖోపాధ్యాయ ఆంగ్ల కృతికి కొలచలమ కృష్ణసోమయాజి అనువాదం. భారతదేశంలోని వ్యవస్థలను పరిశీలించి, అప్పుడు సంస్కృతం దేశానికి చేసిన మేలును వివరిస్తూ సాగింది గ్రంథం. ఇందులోని 10 వ్యాసాలు భారతాభ్యుదయం దిక్ప్రదర్శనంగా చేస్తున్నాయి. 'రచయితా-శిల్పమూ' (1955) ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ ఆంగ్ల రచనకు

తుమ్మల వెంకటరామయ్య అనువాదంగా వెలువడింది. ఇది సమాజోన్నతి మీద రచనోన్నతి ఆధారపడి ఉంటుందన్న సత్యం విశదంగా తెలిపిన వ్యాసం.

'జీవితము - మతము'(1959) శ్రీ బెల్లంకొండ రామదాసు అనువదించిన టాల్‌స్టాయ్ వ్యాసావళి, మనుష్య తత్త్వావగాహనకు యత్నంగా గోచరమవుతూ వుంది. మతం, నీతి, హేతువాదం మనిషిని ఎలా తీర్చిదిద్దాయో పరికించటం ప్రధాన మయినట్లు ఈ వ్యాసాలు స్పష్టంగా తెలుపుతున్నాయి. 'పారిశ్రామికాభి వృద్ధి-విదేశీ అప్పులు' (1953) ఫ్రోలోన్ రచనకు శ్రీ డి. వి. సుబ్బారావు ఆంధ్రానువాదం. 'విదేశీ అప్పులు' వల్ల కలిగే నష్టాలు వివరించి ఆర్థిక వ్యాసంగా ఈ అనువాద వ్యాసం వుంది.

'అమెరికా గురించి నా కలలు' ఆంగ్లంలో లిండన్ బి. జాన్సన్ వ్రాస్తే తెలుగులోకి యర్రంనేని వెంకట్రావ్ అనువదించాడు. అమెరికా అధ్యక్షపదవిలో ఉండగా చేసిన సూచనల సంపుటీకరణమీ వ్యాసాలు. అనువాదం పత్రికారచన మంత సరళంగా సాగింది. 'పువ్వులు, తోటలు' సి. జనరాజదాసు ఆంగ్ల వ్యాసానికి శ్రీ గుంటూరు వెంకట సుబ్బారావు అనువాదం. ఇది పూలు, తోటలు, శిరస్సు, హృదయం తెలుపుతూ పోయిన వేదాంత విషయ విన్యస్త వ్యాసం.

ఆంగ్లంనుంచి అనువాద వ్యాసం విశిష్ట గుణ భరితంగా అవతరించింది. ఇతర భారతీయ భాషలనుంచి అవిర్భవించిన అనువాద వ్యాస పరిశీలనం వల్ల తద్గుణగణాలు పరికింపవచ్చు.

## 2. భారతీయ భాషానువాద వ్యాసం

భారతీయ భాషలలో నుంచి తెలుగులోకి అనువాదం పొందిన వ్యాసాల్లో ప్రధానంగా బెంగాలీ వ్యాసం, హిందీ వ్యాసం, కన్నడ వ్యాసం ఉన్నాయి. ఇతర భాషా వ్యాసాలు తెలుగులో వెలువడకపోవటానికి అవసరం లేకపోవటం కాని అనువాదకుల అర్హత చాలక పోవటం కాని కారణం కావచ్చు. ఈ భారతీయ భాషానువాద వ్యాసంవల్ల తెలుగు వ్యాసం పొందిన పరిణామం, పొంద వలసిన స్థితి విశదమవుతున్నాయి.

*1. బెంగాలీ వ్యాసం :* బెంగాలీలకు, ఆంధ్రులకు ఆవేశం తుల్య లక్షణం. సాహిత్యంలోనూ జీవితంలోనూ అది విస్పష్టంగా అభివ్యక్తమవుతూ

వుంది. అందువల్ల ఏ సాంఘిక సారస్వత చైతన్యం బెంగాలులో వచ్చినా అది ఆంధ్రదేశంలో ప్రతిధ్వనిస్తుంది. తెలుగులోకి ఏ ఇతర భారతీయ భాషలలో నుంచి రానంత అనువాద సారస్వతం బెంగాలీ నుంచి వచ్చింది. తెలుగువాళ్ళలో శరత్‌బాబు జీర్ణించిపోవటం సారస్వత పరిధి నుంచి దర్శింపవచ్చు. రవీంద్రనాథ్ టాగూరు సృజన విమర్శన వాఙ్మయం ప్రజాళి ప్రభుత్వంచేసిన కృషి ఫలితంగా అవతరించింది. జీవితంలో అనేక కోణాల నుంచి సామ్యం దర్శించటానికి వీలుగా ఉన్నట్లే బెంగాలీ-ఆంధ్ర సారస్వతాలలోనూ సామ్యం ఉంది. అందుకే అధికంగా వ్యాస వాఙ్మయం కూడా అనువాదంగా బెంగాలీ నుంచి తెలుగులోకి వచ్చింది.

రవీంద్ర వ్యాసావళి ప్రథమ ద్వితీయ సంపుటాలు శ్రీ మల్లవరపు విశ్వే శ్వరరావు (1966), రాయప్రోలు సుబ్బారావు (1962) చేసిన అనువాదాలుగా వెలువడ్డాయి. ప్రథమ సంపుటంలో మహాపురుషుల జీవితాలు, ఇతిహాసాలు, ధర్మం, శిక్ష, సమాజం, రాష్ట్రనీతి మీద సృష్టింపబడిన వ్యాసాలున్నాయి. ద్వితీయ సంపుటంలో ఆత్మ పరిచయం, పత్రధార, భ్రమణం, భాషా సాహి త్యమూ, విభిన్న విషయాలు ఉన్నాయి. భాషా సాహిత్యం విభాగంలో భాషా సాహిత్యాల దృష్టితోపాటు సాహిత్య పథం, సాహిత్య స్వరూపం, ప్రాచీన సాహిత్యం, లోకసాహిత్యం మీద వ్యాసాలున్నాయి.

ప్రథమ సంపుటం విమర్శన వ్యాస పరిధిలోకి చేరుతూ సాంఘిక వ్యాసా లుగా గోచరమవుతున్నాయి. ద్వితీయ సంపుటంలో వ్యాసాలు సృజనంగా సార స్వత విమర్శనంగా కనిపిస్తున్నాయి. ఈ 80 పై చిలుకున్న వ్యాసాలలో టాగూరు ఆలోచనల నైశిత్యం, జీవితం పట్ల సానుభూతి, కళలంటే అభిమానం, దేశమంటే గౌరవం, ప్రజాళిపట్ల ప్రేమ వ్యక్తమయి, ఈ దేశం పూర్వోన్నత్యం సాధించి నవయుగాభ్యుదయం మిళితం చేసుకొని నూత్నశక్తిగా అవతరించాలన్న ఆశ స్పష్టమవుతూ వుంది.

అనువాద వ్యాసాలు స్వతంత్ర వ్యాసాల దీప్తితో ఉన్నాయి. రెండు సంపుటాల భాష గ్రాంథికంగానే ఉన్నా, శ్రీ రాయప్రోలు సుబ్బారావు వ్యాసాను వాద భాష వ్యావహారికంవైపు మొగ్గుతూ ఉంది. శ్రీ మల్లవరపు విశ్వేశ్వర రావు భాషలో వ్యావహారిక రూపాలు కలిసిపోయాయి. కవులుగా సుప్రసిద్ధులైన ఈ అనువాదకులు విశ్వకవి రవీంద్రుని వ్యాసాలు కవితాత్మకంగా అనువదిం

చటం మూల రచనా విశిష్టంగా గుర్తింపవచ్చు. రవీంద్రనాథ్ టాగూరు వ్యాసాలు విడిగా కొన్నింటితో అనువాద వ్యాస సంపుటాలు అనేకం తెలుగులో కనిపిస్తు న్నాయి. వీటిలో శ్రీ మహీధర జగన్మోహనరావు అనువదించిన 'కావ్య జగత్తు' (1959), 'సాహిత్య జగత్తు' (1959) మొత్తం 15 వ్యాసాలతో ఒప్పుతూ ఉన్నాయి. శ్రీ పెమ్మరాజు భానుమూర్తి అనువదించిన 'రసతరంగిణి' వ్యాసాలు కావ్య జగత్తులోని ఏడు తుల్య విషయానువాదాలు. అనేకంగా అనువాద వ్యాసాలు నవలలు కవితలు కథలు రవీంద్రనాథ టాగూర్‌వి తెలుగులో ఉన్నాయి.

'బిపిన్‌చంద్ర పాల్ ఉపన్యాసాలు' (1907) కృష్ణా స్వదేశ ప్రెస్‌లో ముద్రితమయ్యాయి. ఇవి ఎనిమిది రాజకీయోపన్యాసాలు. ఆంగ్లేయులను పంపి వేసి, భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాదించి స్వయంపాలనం చేసుకోవాలన్న దృష్టి ఈ వ్యాసగతంగా గోచరమవుతుంది. ఈ వ్యాసాలు కొంతవరకు ఆంధ్రో ద్యమానికి పునాదులయ్యాయని గుర్తించాలి. ఈ వ్యాసాలు చివరి రెండు లేకుండా ఆరింటిని 'విపినచంద్రపాలుని వ్యాఖ్యానములు' (1907) పేరిట ఉన్నవ లక్ష్మీ నారాయణ అనువదించి ప్రచురించటం జరిగింది. ఈ వ్యాసాలు రాజకీయ విష యంతో, తదనుకూల రచనా విధానంతో రూపొంది వ్యాస స్థానం విస్తరించేంత సమర్థంగా ఉన్నాయి.

'ఈశ్వర చంద్ర విద్యాసాగరుని చరిత్ర' (1909) చెరుకువాడ వేంకట నరసింహము అనువాదంగా జీవిత చరిత్ర వ్యాసం ప్రచురితమయింది. ఇందులో విద్యాసాగర జీవిత కృషి విపులీకరింపబడింది. 'భారత దర్పణము' (1909) వివేకానంద స్వామి వంగ భాషలో వ్రాస్తే కొండిపర్తి వీరభద్రాచార్యులు భాషాం తరీకరించటం జరిగింది. ఇది ఆధ్యాత్మికతత్త్వ ప్రదర్శకంగా ఉన్నప్పటికీ స్వాతంత్ర్య బీజాలు నాటిన వ్యాసం.

'జాతిభేదము' (1916) శివనాథశాస్త్రి వ్యాసం. ఇప్పగుంట సుబ్బ కృష్ణయ్య, జాతిభేదాన్ని సమర్థించటం ఈశ్వర సమ్మతం కాదని తెలిపే ఈ వ్యాసం అనువదించటం వల్ల దీనికి తెలుగులో ప్రాచుర్యం లభించింది. వేదాల నుంచి ఆధునికాంగ్ల విద్యాభ్యాసారంభకాలం దాకా జాతి గతంగా వచ్చిన పరిణా మాలు జాతి భేదం, వర్ణ వ్యవస్థ మూలహేతువులు ఈ వ్యాసంలో వివరంగా ఉన్నాయి.

'ప్రాక్పశ్చిమము' (1923) కూచి నరసింహము చేసిన వివేకానందస్వామి వ్యాసానువాదం. భక్తి యోగోపన్యాసములు కూడా వివేకానంద స్వామి రచనాను వాదంగా ఈ రచయిత చేయగా చెలికాని లచ్చారావు ప్రచురించాడు. మతదృష్టి, తారతమ్య పరిశీలనమే కాక జాతి జీవనాడిని పట్టిచ్చేటట్లు రూపొందిన ఈ వ్యాసాలు బహుళ ప్రచారం పొందాయి.

'ఆనంద సామ్రాజ్యము' (1934) ముద్దా విశ్వనాథము చేసిన రామతీర్థ స్వామి ఉపన్యాసానువాదం. హిందూ మత జీవితంలోని ఆనందం వివరించేదిగా ఈ వ్యాసం రూపొందింది. 'శరత్ వ్యాసాలు' (1966) నన్నపనేని సుబ్బారావు అనువదించి ప్రచురించటం జరిగింది. ఇందులో 23 వ్యాసాలున్నాయి. అన్నీ దాదాపు ఉపన్యాసాలుగా సృజన గుణ శోభితంగా ఉన్నాయి. నవలాది సృజన వాఙ్మయ నిర్మాత శరత్ సృష్టించిన వ్యాసాలు గుండెకు చేరువగా ఉన్నాయి.

బెంగాలీ సారస్వతం నుంచి తెలుగులోకి వచ్చిన వ్యాసాలు ఉపన్యాసాలుగా, సాహితీ విమర్శలుగా, సృజనంగా ఉన్నాయి. హిందీ వ్యాసం తెలుగులో ఉంది.

*హిందీ వ్యాసం :* హిందీ రాష్ట్ర భాషగా అయిం తర్వాత ఎక్కువ ప్రాధాన్యం పొందింది. హిందీ సారస్వతం అన్యభాషలలోకి అనువదించటం ప్రారంభమయింది. ఈ సందర్భంలో తెలుగులోకి వచ్చిన వ్యాసాలతోపాటు హిందీ రాష్ట్రభాష కాకపూర్వం అనువదింపబడ్డ వ్యాస సంపుటి పరిశీలింప వచ్చు. అయితే తెలుగులో వచ్చిన వ్యాస పరిణామం కంటే ఉత్తమంగా ఉన్న హిందీ వ్యాస లక్షణాలు లభింపవలసే వున్నాయి.

'సాహిత్య మీమాంస' (1926) పండిత రామ దహిన మిశ్ర కావ్యతీర్థుని గ్రంథం. ఇది తెలుగులోకి శ్రీపాద కామేశ్వరరావు అనువదించటం జరిగింది. ఇందులో సాహిత్యంలో ఆదర్శం, దివ్యప్రేమ, పాశవప్రేమ, మానవప్రేమ, వీరత్వం, దేవత్వం దర్శించిన వ్యాసాలున్నాయి. హిందీ వ్యాసాలు తెలుగులోకి అనువాదం చేసిన వాళ్ళు, తెలుగులో హిందీ విషయ వ్యాసాలు వ్రాసేవాళ్ళు ప్రయోగించిన పదాలు కొన్ని తెలుగులో ఆ అర్థంలో లేకపోవటం జరుగుతూ వుంది.

'సాహిత్యము-ఉద్దేశము' (1966) ప్రేమ్‌చంద్ సృష్టి విశాలాంధ్ర ప్రచురణాలయం తెలుగులో ప్రచురించింది. ఇందులో సాహిత్య ప్రక్రియలు, సాహిత్యంలో రీతులు వివరించే వ్యాసాలున్నాయి. అనువాదం గ్రాంథిక మయినా, వ్యావహారిక రూపాలతో గోచరమవుతూ ఉంది. ఈ వ్యాసాలు సాహిత్య విమర్శనప్రాయంగా వున్నాయి.

'తలపుల దుమారము' (1969) మౌలానా అబ్దుల్ కలాం అజాద్ అహమద్ నగర్ కోటలో నిర్బంధంలో ఉన్నప్పుడు వ్రాసిన లేఖలు. వీటిని శ్రీ దేవులపల్లి రామానుజరావు అనువదించాడు. ఇవి సృజనాత్మకంగా ఉన్న వ్యాసాలు. ఇవి స్వాతంత్ర్యం పట్ల ప్రగాఢ చైతన్యం సృష్టించిన ఆలోచనలు.

*కన్నడవ్యాసం :* తెలుగు కన్నడాలకు లిపి సామ్యమే కాదు, జీవిత సామ్యమూ సాహితీ సామ్యమూ ఉన్నాయి. తెలుగు కన్నడాలు ఒక కుదురు నుంచి పుట్టాయి. కన్నడాంధ్రలు ఒకనాడు మాండలికాలుగా వేరై తర్వాత స్వతంత్ర భాషలుగా రూపొందాయి. తెలుగులో కన్నడానువాద వ్యాసాలు, కన్నడంలో తెలుగు అనువాద వ్యాసాలు ఎక్కువగా ఉన్నాయి.

తెలుగు భాషను వంగభాష ప్రభావితం చేసినట్లు కన్నడ భాషనూ చేయటం కన్నడ భాష నుంచి తెలుగులోకి అనువాద వ్యాసాలుగా వచ్చిన వంగ సారస్వత విషయాల వల్ల తెలుస్తుంది. వంగ భాషలో హరప్రసాదశాస్త్రి వ్రాసిన దానిని, వి. వేంకటాచారి కన్నడంలోకి అనువదిస్తే, బాలాంత్రపు నీలాచలము 'భారత మహిళ' పేరుతో తెలుగులోకి తెచ్చాడు. అలాగే శ్రీ మాస్తి వేంకటేశ అయ్యంగారు అనువదించిన 'రవీంద్ర ప్రతిభ' శ్రీ సూరాబత్తుల సుబ్రహ్మణ్యం తెలుగులోకి తర్జుమా చేశాడు.

కన్నడ వ్యాస సంకలనం గోరూరు రామస్వామి అయ్యంగార్ రూపొం దించగా దానిని కేంద్ర సాహిత్య ఎకాడమీ పక్షాన శ్రీ తిరుమల రామచంద్ర అనువదించాడు. ఇందులో 31 వ్యాసాలు, అన్నీ సృజనంగా, ఉన్నాయి. ఈ సృజన గుణం వస్తు స్వీకరణ నుంచి రచనా నిర్వహణదాకా ప్రత్యక్షర ప్రత్యక్షంగా ఉంది. కోకిల, చిలుక, చావుతో సరసం, పాదరక్షలు, మా గేదెకు మాటలు వచ్చు, వీధి కొళాయి, నా వీపు వంటి వ్యాసాలు ఉన్నాయి. హాస్యం,

కథనం, కల్పనం, వర్ణనం, అధిక్షేపం, వినోదం ప్రధానంగా రచన జరిగి వ్యాసాలు సంపూర్ణ సృజనగుణ శోభితాలుగా ఉన్నాయి. ఈ వ్యాస సంకలన కర్త "ఈ ఎస్సే అనే మాటకు, దాని సంపూర్ణార్థ సంపదను తెలిపే సమాన శబ్దం మనలో ఇంకా సృష్టి కాలేదు" అనటం గుర్తింపవచ్చు. కన్నడంలో వ్యాసానికి ప్రబంధమని పేరు. కన్నడ వ్యాసం తెలుగులో అనువాద రూపంలో వచ్చి వ్యాసం ఎంత సృజనంగా ఉండవచ్చో వివరించినట్లు భావించటం కుదురుతుంది.

అనువాద వ్యాసం తెలుగులోకి సృజనంగా విమర్శనంగా వచ్చింది. అనువాద వ్యాసగత విషయం, రచనం ప్రధానంగా తెలుగులో వస్తు ప్రక్రియ పునః పరిశీలనకు దోహదం కలిగిస్తూ రచనా నిర్మాణం చేయించటంలో కొంత వరకు దోహదకారి అయింది. ఆంగ్లంనుంచి తెలుగులోకి వచ్చిన వ్యాసాలవల్ల వ్యాస వస్తు విస్తృతి గోచరమవుతూ వుంది. సాంఘికంగా ఆర్థికంగా రాజకీయంగా తెలుగు వ్యాసం పొందవలసిన ఔన్నత్యం వివరిస్తూ అనువాద వ్యాసం అవతరించింది. ఈ వ్యాసానువాదం ప్రారంభంలో కంటే పరిణతావస్థలో ఎక్కువగా సారళ్యం పొందింది. భిన్నభాషా వ్యాసానువాద సమర్థంగా వర్తమానాంధ్ర భాష, ఈ అనువాద వ్యాస కృషి వల్ల, పరిణామం చెందింది.

## 10. ఆంగ్ల వ్యాసం

తెలుగు సారస్వతాది విషయాలు ఆంగ్లంలో వ్యాసాలుగా ఆంగ్లేయులూ ఆంధ్రులూ పలువురు విమర్శకులు వ్రాశారు. ఈ వ్యాస సృష్టి వల్ల తెలుగు వ్యాస నిర్మాణంలో చెందిన పరిణామం ప్రత్యక్షంగా గోచరం కాదు. అయితే వస్తువు తెలుగుదనంతో ఒప్పుతూ ఉంది కాబట్టి, ఆ వస్తువే తెలుగు వ్యాస వస్తువుగా గ్రహించటం, తత్కాలంలో, అనంతరకాలంలో జరిగింది కాబట్టి ఈ వ్యాస సృష్టి పరికింపవలసివుంది. విషయం తెలుగు భాషా సారస్వత సంబంధిగా ఉన్న వ్యాస నిర్మాణం, ఇతరాంగ్ల వ్యాస నిర్మాణం కంటే తెలుగు విమర్శక హృదయ సన్నిహితమై, తెలుగు వ్యాస నిర్మాణం పరోక్షంగా రూపొందించి, తెలుగు వ్యాస పరిణామానికి దోహదం చేసేదిగా ఏర్పడింది.

ఆంధ్ర సారస్వతాది విషయాలు తెలుగులో వ్రాయకుండా ఆంగ్లంలో వ్రాయటానికి ప్రధాన కారణాలు పరికింపవచ్చు. సి.పి. బ్రౌన్‌వంటి విమర్శకులు

ఆంగ్లేయులు కావటం వల్ల ఆంగ్లంలో వ్రాయటం సులువుగా భావించటం జరిగింది. అంతేకాక, ఆ వ్యాసం ఆంధ్రుల కంటే ఆంగ్లేయులకు ఎక్కువగా ఉద్దేశింప బడింది. ఆ కాలానికి తెలుగులో వ్యాస ప్రక్రియ సిద్ధించటమే కాదు, రూపొంద టమే జరుగలేదు.

అనంతర కాలంలో తెలుగులో వ్యాస ప్రక్రియ అవతరించిం తర్వాత కూడా ఆంధ్రులు ఆంగ్లంలో వ్రాయటానికి హేతువు ప్రభుత్వాధికారులయిన ఆంగ్లేయులు చదివి గ్రహించటానికి అనుకూలంగా ఉండాలన్న దృష్టి. ఆ కాలంలో తెలుగులో వెలువడ్డ చాలా గ్రంథాలు ఆంగ్ల శీర్షికతో ఆంగ్ల ఉపోద్ఘాతంతో ఉండటం మామూలయింది. ఈ వ్యాస సృష్టి కావిస్తున్న వాళ్ళు ఆంగ్లవిద్యతో పరిచయమే కాదు, పాండిత్యమున్నవాళ్ళు కావటంతో పాటు తెలుగులో తప్పు లేకుండా వ్రాయటం కష్టమనీ, తప్పులుంటే పండితులు నిర్దాక్షిణ్యంగా విమర్శిస్తారనీ భావించే వాళ్ళు అయినందువల్ల ఆంగ్ల వ్యాస సృష్టి చేశారు.

గ్రాంథిక వ్యావహారిక భాషా వివాదంలో తెలుగు వ్యాసం సుసంపన్నం కావించిన ప్రసిద్ధులు కూడా ఆంగ్లంలో వ్యాస సృష్టి చేయటం చూడవచ్చు. ఈ సందర్భంలో తరచనా సాఫల్యంగా, ఆంగ్లేయులు ప్రభుత్వాధికారులు ఈ భాషా దృష్టి గ్రహించటం కోరబడింది. వర్తమానాంధ్ర సాహిత్య విషయాలు పలువురు ఆంగ్లంలో వ్యాస రూపంలో వెలువరించటం భారతీయులకు ఈ భాషా సారస్వత విషయాలు తెలియాలని కోరటం వల్ల జరిగింది. భారతీయు లందరికీ ఏ విషయం తెలియాలని భావించినా ప్రస్తుతం ఆంగ్ల భాష మాత్రమే భావ వ్యక్తీకరణ వాహికగా ఉంది. ఇప్పుడిప్పుడే సమర్థ స్థానం పొందుతున్న హిందీ కొంతకాలానికి ఆంగ్ల భాషకు ప్రత్యామ్నాయ భాషగా రూపొందవచ్చు.

మొదటినుంచి ఆంగ్లంలో వ్యాస సృష్టి చేయటం వల్ల అనేకులు అనేక రాష్ట్రాలలో దేశాలలో ఆంధ్ర సారస్వతాది విషయాలు గ్రహించటానికి వీలు వుంటుందన్న అభిప్రాయం పనిచేసినట్లు తలంచే అవకాశముంది. కావలి వెంకట బొర్రయ్య చక్కను కవి జీవితాలు ఆంగ్లంలో వ్రాయటానికి, అన్ని

హేతువులతో పాటు ఆంధ్రంలో వచనం తత్సమర్థంగా లేకపోవటంగా కూడా తెలుసుకోవాలి.

## 1. సి.పి. బ్రౌన్

తెలుగు సారస్వతం సుసంపన్నం కావించిన ఆంగ్లేయులలో సి.పి. బ్రౌన్ స్థానం విశిష్టమయింది. ఈ ప్రథమోద్యోగి ఇతర సాహితీ ప్రయత్నాలలో ఈ వ్యాస కృషి అత్యంతాల్ప భాగమే. ఈ వ్యాసం ఆంధ్ర సారస్వతం మీద సమగ్రాభిప్రాయం కలగటానికి దోహదకారి అయి, ఆ నాటికి ఉత్తమ విమర్శనంగా గోచరమయింది. ఈ వ్యాసం "Essay on the Language and Literature of the telugu" పేరుతో, మద్రాస్ లిటరరీ సొసైటీ, రాయల్ ఏషియాటిక్ సొసైటి నడిపే "The Madras journal of literature and science"లో రెండు పర్యాయాలుగా జూలై 1839, అక్టోబరు 1839 సంచికలలో వెలువడింది. తెలుగు సారస్వత విమర్శన రచనను ఎస్సే పేరుతో పిలవటం ఇంతకంటే ముందు జరిగినట్లు ఆధారాలు లభించవలసి ఉన్నాయి.

ఈ వ్యాసం అధికమయిన చారిత్రక ప్రాధాన్యంతో గోచరమవుతూ వుంది. తెలుగు భాషా సారస్వతాలు ఆ భాష ఇష్టమయిన ఆంగ్లేయుడికి ఏ విధంగా అభిప్రాయం కలిగించాయో ఈ వ్యాసం వల్ల తెలుస్తుంది. ఈ వ్యాసం తెలుగు వాళ్ళు, తెలుగు దేశం, తెలుగు భాష, ఆచార వ్యవహారాలు, ఆంగ్ల భాషా దృష్టి తెలుపుతూ వుంది. తెలుగు కవితో తుల్యంగా ఉన్న ఆంగ్ల కవిని ప్రతి సందర్భంలో రచయిత తెలిపాడు. ఆంధ్ర భాష అభ్యసించటంలో సౌలభ్యం లేకపోవటం వివరించాడు. తెలుగు సాహిత్యంలో శాబ్దిక రచనల కంటే వేమన వంటి కవుల నిరాడంబర సాహిత్యం సి. పి. బ్రౌన్‌కు అధికంగా ఇష్టమయింది. ఈ వ్యాస కర్త వ్యక్తం చేసిన అభిప్రాయాలు కొన్ని నేటికి మారిపోవటం కాని వేరుగా భావించటం కాని జరిగినంత మాత్రాన దీని చారిత్రక ప్రయోజనం మారదు. వ్యాసం చివర ద్విపద రామాయణము, సారంగధర చరిత్ర, ప్రభు లింగలీల కావ్య భాగాలు ఆంగ్లంలోకి అనువదించి ప్రచురించాడు. తను చేసిన గ్రంథ పరిష్కరణం గూర్చి వ్యాసకర్త తెలిపిన విషయం గ్రహింపవచ్చు.

"In this opertion fifteen copices were compared for the Dwipada Ramayan, twelve for Mahabharat,

eleven for Bhagavat and smaller number for poems less corrupted by time" (పుట 362)

వ్యాసంలో ప్రతి పేరాకు సంఖ్యాక్రమం గోచరమవుతూ వుంది. తెలుగు అభ్యసింపవలసివచ్చే ఆంగ్లేయులు మిక్కిలి ఆసక్తిగా ఆనాడు చదవ టానికి, పరిశోధకులు ఈనాడు పఠించటానికి అత్యవసరంగా అనుకూలంగా ఉన్నదీ వ్యాసం.

ఈ సందర్భంలో పి. శంకరనారాయణ తన నిఘంటువు ఉపోద్ఘాతంగా వ్రాసిన వ్యాసం "A Common Alphabet for the Different Languages in india" లిపి సంస్కరణం కోరుతున్న వ్యాసం. ఇందులో తెలుగు భాషకు రచనా సౌలభ్యం లేదనీ, ఆంగ్లానికి ఉందనీ, అందువల్ల లిపి సంస్కరణం జరగాలనీ వాంఛించాడు.

## 2. సారస్వత వ్యాసం

తెలుగు సారస్వత సంబంధి ఆంగ్ల వ్యాసాలు విమర్శన గుణ ప్రదర్శకంగా ఉన్నాయి. జి. హరిసర్వోత్తమరావు వ్యాసం "The neglected Emperor Poet" (1912) శ్రీకృష్ణదేవరాయల సాహిత్య జీవితం వివరించింది. సి.ఆర్. సుబ్రామయ్య సృష్టి "Some Mile-stones in Telugu Literature-The Age of Krishnadevaraya" శ్రీకృష్ణదేవరాయల కాలంలోని సాహిత్య వికాసం విమర్శనాత్మకంగా పరిశీలించింది.

పి. టి. రాజు - Telugu Literature (1943), కె. సీతారామయ్య A Hand Book of Telugu Literature (1349) తెలుగు సారస్వత చరిత్ర స్థూలంగా వివరించాయి. పి. చెంచయ్య, భుజంగరావుల Telugu Literature, టి రాజగోపాలరావు A Historical sketch of Telugu Literature, డా. సి. నారాయణరావు The songs of Tyagaraja, వి. యస్. భూషణ్ The Novel in Telugu Literature తెలుగు సాహిత్య పరిణామాన్ని, తత్ప్రక్రియలను వివరించేవిగా ఉన్నాయి.

## 3. భాషా వ్యాసం

ఆంగ్లేయులు, ముఖ్యంగా కాల్డ్‌వెల్, తెలుగు భాషా తత్త్వం తెలిపే రచనలు చేయటం ప్రాతిపదికగా ఆంధ్రులనేకులు ఈ ఆలోచన కొనసాగించారు. ఇందులో ప్రధానంగా డా. సి. నారాయణరావు An Introduction to Dravidian Philology (1929) ద్వారా భాషా దృష్టిలో సంచలనం కలిగించటం జరిగింది.

ఈ సందర్భంలో తెలుగులో వచ్చిన గ్రాంథిక వ్యావహారిక భాషా వివాదం స్మరింపవచ్చు ఈ వాదోపవాదాలు ఆంగ్లంలో వ్యాస సృష్టికి దోహదం చేశాయి గ్రాంథిక భాషను సమర్థిస్తూ జయంతి రామయ్య పంతులు A Defence of Literary Telugu వ్రాయగా, వ్యావహారిక భాషను ప్రోత్సాహపరిచేటట్లుగా పి.టి. శ్రీనివాసయ్యంగార్ Language : Life and Death నీ, గురజాడ అప్పారావు Minutes of Dissent నీ, గిడుగు రామమూర్తి A Memorandum on Modern Telugu నీ, Popular Literature వ్యాసాలనూ ప్రచురించారు. టి. రాజగోపాలరావు A comparative prosody of the Dravidian Languages ఛందశ్శాస్త్ర పరామర్శ.

## 4. ఆధునిక వ్యాసం

తెలుగు సారస్వత సంబంధిగా ఆంగ్లంలో నేడు వెలువడుతున్న వ్యాసాలు ఈ సాహితీ వ్యక్తిత్వం ఉన్నతమని తెలపటానికి ఉద్దిష్టంగా ఉన్నాయి. పూర్వ వ్యాసాలు చారిత్రక దృష్టినే తెలిపాయి. రచనం ప్రాచీనమయినా ఈ దృష్టితో వేమనను గూర్చి పలువురు ఆంగ్లేయులూ ఆంధ్రులూ వ్రాసిన వ్యాసాలు ఈ సందర్భంలో భావింపవచ్చు. సి.ఆర్. రెడ్డి ఆంగ్లంలోని వ్యాసాలు ఉపన్యాసాలు సాహితీ విమర్శనంగా ఉన్నాయి. వేమన, కందుకూరి, గురజాడ ఈ సాహిత్యంలో గోచరమవుతున్నారు.

కె. రామకోటీశ్వరరావు Contemporary Indian Literature-Telgu Literature వ్యాసం, డా. దివాకర్ల వెంకటావధాని An Antho-

logy of Indian Literatures : Telugu వ్యాసం తెలుగు సాహిత్య వైశిష్ట్యం తెలుపుతున్నాయి. ఇందులో అన్ని ప్రక్రియలు లక్షణాలు సమగ్రంగా తెలపటం సాధ్యం కాదు కాబట్టి తెలిపినంతవరకు విస్పష్టంగా విశిష్టంగా తెలుగు సాహితీ వ్యక్తిత్వ గౌరవంగా ఉంది. నార్ల వేంకటేశ్వరరావు వ్రాసిన వేమన, వీరేశలింగం వ్యాసపరిధికి అతీతంగా ఉన్నప్పటికీ సారస్వత విషయికంగా ఉండి విమర్శన రీతిని వివరిస్తున్నాయి. నార్ల వేంకటేశ్వరరావు షష్ఠి పూర్తి సంచం ప్రచురించిన 'Studies in the History of Telgu Journalism' తెలుగు పత్రికా వ్యాసంగం మీద అనేక వ్యాసాలతో ఒప్పుతూ ఉంది.

ఆంగ్ల వ్యాసం తెలుగు వ్యాస పరిణామ క్రమంలో కొంతవరకు రూపొం దినట్లు స్పష్టమవుతూ వుంది. తెలుగులో విమర్శనం వ్యాస వస్తువయినప్పుడు ఆంగ్ల వ్యాసం ఆ తీరుగా సాగింది. అలాగే భాషా వ్యాసం ఆంగ్లాంధ్రాలలో గోచరమవుతూ వుంది. తెలుగు వ్యాసరచనంలోనూ, విషయ స్వీకరణంలోనూ వచ్చిన పరిణామం స్థూలంగా తెలిపేదిగా ఆంగ్ల వ్యాసం ఆవిర్భవించింది.

## 11. పీఠికా వ్యాసం

తెలుగులో ప్రకటితమయిన చాలా గ్రంథాలు పీఠికలతో ఒప్పుతూ ఉన్నాయి. ఈ పీఠిక అభిప్రాయం, అవతారిక, మున్నుడి, ముందు మాట, సూచిక, ప్రవేశిక, ఉపోద్ఘాతం, ఆముఖం వంటి ఏ పేరుతో ఉన్నా రచనా స్వభావం సమానంగా ఉన్నట్లు గ్రహించే వీలుంది. పరిష్కృత పురాణ ప్రబంధ యక్షగానాది రచనలు కావ్య ఖండకావ్య నవల నాటక కథా కవితా విమర్శనాది ప్రక్రియలు ప్రచురితమవుతున్నప్పుడు పీఠికా తిలకంతో అలంకరించుకొని అవతరిస్తూ వున్నాయి.

పరిష్కృత గ్రంథాలకు పీఠికా రచనం ఆధునిక పరిణామంగా భావింపవచ్చు. సి. పి. బ్రౌన్ వెలువఱచిన కావ్యాలకు పరిష్కరణ కృషి పీఠికాప్రాయంగా గోచరమవుతూ ఉంది. నాగపూడి కుప్పుసామయ్య (1865-1951) కావ్యాలకు పీఠికలు వ్యాఖ్యానాల లాగా వ్రాయటంలో సామర్థ్యం ప్రకటించుకొన్నాడు. సంస్కృతాంధ్రాంగ్ల ద్రావిడ భాషలలో పాండిత్య ప్రకర్ష ఉండి విమర్శన వ్యాస సృష్టి చేయటం గమనింపవచ్చు. ఆంగ్లంలోని విమర్శన రీతి ఆంధ్రంలో ప్రవేశపెట్టిన ఆద్యులలో విశిష్ట వ్యక్తి. 'పారిజాతాప

హరణ పరిమళ వ్యాఖ్య' ఈ విమర్శన సామర్థ్యం వివరిస్తూ వుంది. తంజ నగరము తేపప్పెరుమాళ్ళయ్య (1872-1921) గ్రంథ పరిష్కరణంలో వహించిన సుప్రసిద్ధి లోకవిదితంగా ఉంది. ఈ గ్రంథాలకు విమర్శన వ్యాసాలుగా చెప్పదగ్గ పీఠికలు వ్రాయటం సాహిత్య పత్రికలలో సారస్వత వ్యాసాలు వ్రాయటం బహుముఖంగా జరిగింది. నన్నెచోడ కాల నిర్ణయంలో చేసిన విశేష కృషి గమనార్హం. జూలూరి అప్పయ్య శాస్త్రి, కల్లపాటి రంగయ్య, వేదము వేంకట రాయశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి పీఠికా వ్యాస సృష్టిలో ప్రసిద్ధులు.

పీఠిక, వ్యాసంగా భావించటం సి. ఆర్. రెడ్డి పీఠికలు మూలంగా జరిగింది. తమ ఆధునిక కావ్యాలకు అలంకరించిన పీఠికలు 'లఘు పీఠికా సముచ్చయము'గా మొదట, ఆపైన వ్యాసమంజరి వ్యాసాలుగా ముద్రించాడు. ఈ మార్గంలోనే పీఠికలు వ్యాసాలుగా ముద్రించటం పింగళి లక్ష్మీకాంతం చేశాడు. స్థూలంగా పీఠికలు వ్యాస ప్రాయ రచనలుగా, వ్యాసాలుగా భావించటం సాహిత్య సంప్రదాయమయింది. శ్రీ శ్రీశ్రీ మహాప్రస్థానం పీఠిక, శ్రీ చలం వ్రాసింది, సృజన వ్యాసంగా రూపొందింది.

వ్యక్తులు, ప్రచురణ సంస్థలు తమ పుస్తకాలను ముద్రించుకొనేటప్పుడు ప్రముఖులుగా, మిత్రులుగా, గురువులుగా ఉన్న సాహితీ వేత్తలను పీఠికా రచనకు కోరి, సంపాదించి, పుస్తకంతో చేర్చటం సంప్రదాయమయింది. వ్యక్తుల గ్రంథ పీఠికలు విమర్శనంతో ప్రోత్సాహప్రాయంగా, సంస్థల గ్రంథ పీఠికలు ప్రోత్సాహంతో పాటు విమర్శన వ్యాసాలుగా వెలువడ్డాయి. వేంకట్రామా అండ్ కో ముద్రించిన కావ్య జాలం, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ గ్రంథాలు, ఎమెస్కో ప్రచురణాలయం రచనలు ఉత్తమ పీఠికలతో, విమర్శన వ్యాసప్రాయ రచనలతో వెలువడ్డాయి. పీఠికావ్యాసం కావ్యతత్త్వ కావ్యగుణ విమర్శన వ్యాసంగా రూపొందింది. పీఠికలు ప్రాథమికంగా కావ్య గుణం, ఆ పైన సారస్వత ధర్మం వివరించేవిగా ఏర్పడి, వ్యాస పరిణామం తెలిపేవిగా ఉన్నాయి.

logy of Indian Literatures : Telugu వ్యాసం తెలుగు సాహిత్య వైశిష్ట్యం తెలుపుతున్నాయి. ఇందులో అన్ని ప్రక్రియల లక్షణాలు సమగ్రంగా తెలపటం సాధ్యం కాదు కాబట్టి తెలిపినంతవరకు విస్పష్టంగా విశిష్టంగా తెలుగు సాహితీ వ్యక్తిత్వ గౌరవంగా ఉంది. నార్ల వేంకటేశ్వరరావు వ్రాసిన వేమన, వీరేశలింగం వ్యాసపరిధికి అతీతంగా ఉన్నప్పటికీ సారస్వత విషయికంగా ఉండి విమర్శన రీతిని వివరిస్తున్నాయి. నార్ల వేంకటేశ్వరరావు షష్టి పూర్తి సంచిక ప్రచురించిన 'Studies in the History of Telgu Journalism' తెలుగు పత్రికా వ్యాసంగం మీద అనేక వ్యాసాలతో ఒప్పుతూ ఉంది.

ఆంగ్ల వ్యాసం తెలుగు వ్యాస పరిణామ క్రమంలో కొంతవరకు రూపొందినట్లు స్పష్టమవుతూ వుంది. తెలుగులో విమర్శనం వ్యాస వస్తువయినప్పుడు ఆంగ్ల వ్యాసం ఆ తీరుగా సాగింది. అలాగే భాషా వ్యాసం ఆంగ్లాంధ్రాలలో గోచరమవుతూ వుంది. తెలుగు వ్యాసరచనంలోనూ, విషయ స్వీకరణంలోనూ వచ్చిన పరిణామం స్థూలంగా తెలిపేదిగా ఆంగ్ల వ్యాసం ఆవిర్భవించింది.

## 11. పీఠికా వ్యాసం

తెలుగులో ప్రకటితమయిన చాలా గ్రంథాలు పీఠికలతో ఒప్పుతూ ఉన్నాయి. ఈ పీఠిక అభిప్రాయం, అవతారిక, మున్నుడి, ముందు మాట, సూచిక, ప్రవేశిక, ఉపోద్ఘాతం, ఆముఖం వంటి ఏ పేరుతో ఉన్నా రచనా స్వభావం సమానంగా ఉన్నట్లు గ్రహించే వీలుంది. పరిష్కృత పురాణ ప్రబంధ యక్షగానాది రచనలు కావ్య ఖండకావ్య నవల నాటక కథా కవితా విమర్శనాది ప్రక్రియలు ప్రచురితమవుతున్నప్పుడు పీఠికా తిలకంతో అలంకరించుకొని అవతరిస్తూ వున్నాయి.

పరిష్కృత గ్రంథాలకు పీఠికా రచనం ఆధునిక పరిణామంగా భావింపవచ్చు. సి. పి. బ్రౌన్ వెలువరిచిన కావ్యాలకు పరిష్కరణ కృషి పీఠికాప్రాయంగా గోచరమవుతూ ఉంది. నాగపూడి కుప్పుసామయ్య (1865-1951) కావ్యాలకు పీఠికలు వ్యాఖ్యానాల లాగా వ్రాయటంలో సామర్థ్యం ప్రకటించుకొన్నాడు. సంస్కృతాంధ్రాంగ్ల ద్రావిడ భాషలలో పాండిత్య ప్రకర్ష ఉండి విమర్శన వ్యాస సృష్టి చేయటం గమనింపవచ్చు. ఆంగ్లంలోని విమర్శన రీతి ఆంధ్రంలో ప్రవేశపెట్టిన ఆద్యులలో విశిష్ట వ్యక్తి. 'పారిజాతాప

హరణ పరిమళ వ్యాఖ్య' ఈ విమర్శన సామర్థ్యం వివరిస్తూ వుంది. పంజ నగరము తేవప్పెరుమాళ్ళయ్య (1872-1921) గ్రంథ పరిష్కరణంలో వహించిన సుప్రసిద్ధి లోకవిదితంగా ఉంది. ఈ గ్రంథాలకు విమర్శన వ్యాసాలుగా చెప్పదగ్గ పీఠికలు వ్రాయటం సాహిత్య పత్రికలలో సారస్వత వ్యాసాలు వ్రాయటం బహుముఖంగా జరిగింది. నన్నెచోడ కాల నిర్ణయంలో చేసిన విశేష కృషి గమనార్హం. జూలూరి అప్పయ్య శాస్త్రి, కర్లపాటి రంగయ్య, వేదము వేంకట రాయశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి పీఠికా వ్యాస సృష్టిలో ప్రసిద్ధులు.

పీఠిక, వ్యాసంగా భావించటం సి. ఆర్. రెడ్డి పీఠికలు మూలంగా జరిగింది. తమ ఆధునిక కావ్యాలకు అలంకరించిన పీఠికలు 'లఘు పీఠికా సముచ్చయము'గా మొదట, ఆపైన వ్యాసమంజరి వ్యాసాలుగా ముద్రించాడు. ఈ మార్గంలోనే పీఠికలు వ్యాసాలుగా ముద్రించటం పింగళి లక్ష్మీకాంతం చేశాడు. స్థూలంగా పీఠికలు వ్యాస ప్రాయ రచనలుగా, వ్యాసాలుగా భావించటం సాహిత్య సంప్రదాయమయింది. శ్రీ శ్రీశ్రీ మహాప్రస్థానం పీఠిక, శ్రీ చలం వ్రాసింది, సృజన వ్యాసంగా రూపొందింది.

వ్యక్తులు, ప్రచురణ సంస్థలు తమ పుస్తకాలను ముద్రించుకొనేటప్పుడు ప్రముఖులుగా, మిత్రులుగా, గురువులుగా ఉన్న సాహితీ వేత్తలను పీఠికా రచనకు కోరి, సంపాదించి, పుస్తకంతో చేర్చటం సంప్రదాయమయింది. వ్యక్తుల గ్రంథ పీఠికలు విమర్శనంతో ప్రోత్సాహప్రాయంగా, సంస్థల గ్రంథ పీఠికలు ప్రోత్సాహంతో పాటు విమర్శన వ్యాసాలుగా వెలువడ్డాయి. వేంకట్రామా అండ్ కో ముద్రించిన కావ్య జాలం, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీ గ్రంథాలు, ఎమెస్కో ప్రచురణాలయం రచనలు ఉత్తమ పీఠికలతో, విమర్శన వ్యాసప్రాయ రచనలతో వెలువడ్డాయి. పీఠికావ్యాసం కావ్యతత్త్వ కావ్యగుణ విమర్శన వ్యాసంగా రూపొందింది. పీఠికలు ప్రాథమికంగా కావ్య గుణం, ఆ పైన సారస్వత ధర్మం వివరించేవిగా ఏర్పడి, వ్యాస పరిణామం తెలిపేవిగా ఉన్నాయి.

## 12. వేదాంత వ్యాసం

వేదభూమి అయిన భారతదేశంలో ప్రతి ప్రాణి కర్మ జీవిగా, జీవిత దృక్పథం ఏర్పరచుకొని, మనుగడ కొక అర్థం, ఇహమూ పరమూ అయిన చింతన కలిగించుకొని జీవించటంవల్ల సాహిత్యం వేదాంత ధర్మం కలిగివుంది. ఈ వేదాంత బుద్ధికి మత గురువులు, పీఠాధిపతులు ప్రోత్సాహకారకులయ్యారు. వేదాంతం మతంలో చుట్టుకొన్నంత అధికంగా సాహిత్యంతో అల్లుకుపోకపోవటం గుర్తింపవలసిన అంశం.

తెలుగులో వచనం వ్యాసం ప్రముఖంగా రూపొందుతున్న సమయంలో భారత దేశంలోని వేదాంత మనస్కులు దేశరాజకీయశృంఖలాల విషయం పారతంత్ర్య దాస్యంగూర్చి ఆలోచించటం ఆరంభించారు. అది వేదాంతులు సంఘ సంస్కర్తలుగా మారుతున్న కాలం. రామకృష్ణ పరమహంస కన్న వివేకానంద స్వామి వంటి ప్రసిద్ధులు ఆర్షభూమి ఆధిక్యం అందరికీ తెలుపవలసిన వాళ్ళు అయ్యారు.

తాత్త్వికజిజ్ఞాసతో ముముక్షువులు సారస్వతం సుసంపన్నం చేసివుంటే వేదాంత సాహిత్యం విస్తృతంగా రూపొంది ఉండేది కాని బోధనతో, కార్యరంగంలో కృషి చేసే వేదాంతులు సాహిత్యంతో యత్నం సాగించలేదు. తెలుగులో వ్యాసం ప్రారంభమయిన సమయంలో వంగ సాహిత్యం నుంచి వేదాంత వ్యాసాలు అనువాదమై వచ్చినా అధికంగా రాలేదు. ఆంగ్లంనుంచి అంత ఎక్కువగా వేదాంత సాహిత్యం అవతరించలేదు. ఈ సందర్భంలో తన వ్యాస సృష్టి అంతా వేదాంత పరిమితంగా తీర్చిదిద్దిన కోలాచలం శ్రీనివాసరావు కృషి పరికించాలి.

## 1. కోలాచలం శ్రీనివాసరావు (1854-1919)

కోలాచలం శ్రీనివాసరావు వేదాంత వ్యాసాలు (1925-28) మధ్యకాలంలో ముద్రితమయినా 1919 కంటే ముందే వ్రాయటం జరిగింది. అనేక నాటక కర్తగా సుప్రసిద్ధి పొందిన ఈ వ్యాసకర్త తెలుగు దేశం నోచుకొన్న మేధావి. ఈ రచయిత వేదాంత వ్యాస సృష్టిలో విషయం, నిర్మాణం అవశ్యం పరిశీలింపదగ్గ అంశాలు.

నిర్మాణ వ్యాసం : విషయం తాత్త్విక పరిధిలో పరిభ్రమించటం వల్ల వ్యాసం విమర్శనంగా అవతరించింది. అయితే రచనంలో సృజన వ్యాస లక్షణాలు వింగడిస్తే మూడు భాగాలుగా విషయ ప్రారంభం ఉపోద్ఘాత ప్రాయంగా మొదలై విషయ వివరణం విపులంగా చర్చగా ప్రశ్నోత్తరంగా సాగి, విషయోపసంహారం ఉండటం చూడవచ్చు. ప్రారంభోప సంహారాలలో సమాన విషయ ధర్మాలున్నాయి. చర్చించటం, విమర్శించటం ప్రధాన గుణాలు. విషయం హేతుబద్ధంగా విభజించటం క్రమబద్ధంగా నిర్వహించటం జరిగింది. పరిహాస కుశలత, హాస్య దృష్టి అభినందనీయంగా ఉన్నాయి. స్పష్టత వ్యాస ధర్మంగా రూపొంది, సంక్షిప్తతను త్యాగమయినా చేసింది. ఈ వ్యాస రచనా రీతిని గురించి పీఠికలో చింతలపల్లి నరసింహశాస్త్రి ''ఈ గ్రంథమునందు నీ యధ్యాయమునందీ విషయము బోధింపబడునని ప్రారంభముననే చెప్పబడి యీ విషయమును ప్రతిపాదించు ముఖ్యములగు శ్లోకములఁ బరిగ్రహించి వానిపై విశేష చర్చ చేయఁబడి యుక్త్యుక్తులచే నిర్ధరింపబడి నిర్ధారిత విషయమును నుపక్రమోపసంహారముల నిశ్చయింపబడినది. దీని మూలమున విషయమిది యనియు, నడుమ నుండునది దానిని స్థాపించుటకు జేయఁబడు చర్చయనియు, దాని వలనం దేలిన ముఖ్యాంశ మిదియనియు సులువుగా బోధపడుచున్నది'' అని తెలిపాడు.

వ్యాస శీర్షికలు పెద్దవిగా వాక్యప్రాయాలుగా ఉన్నాయి. వ్యాసం ఉపన్యాసంగా పిలువబడింది. ఒక వ్యాసాంతంలో మరో వ్యాస నిర్మాణ హేతువు వివరించాడు. వ్యాసం ప్రారంభంలో ఆ వ్యాస ప్రధానాంశాలు సంక్షిప్తంగా తెలిపాడు. పాండిత్యం బరువు వ్యాసాలలో గోచరమవుతూ ఉంది. ఒక సూత్ర రచన వాక్యానికి ఉదాహరణప్రాయ వాక్యాలు అనేకం ఉన్నాయి. వేదాంత వ్యాసం నిర్మాణంలో విశిష్ట లక్షణ విలసితంగా కోలాచలం శ్రీనివాసరావు రూపొందించాడు.

విషయ వ్యాసం : కోలాచలం శ్రీనివాసరావు కిరి వ్యాసాలలో వేదాంతం ప్రధానాంశం. దాని చుట్టూ ప్రవర్తిల్లిన అనేకాంశాలు వ్యాసాలలో వివరణం పొందాయి. వ్యాస సృష్టి భగవద్గీతను అల్లుకొని సాగింది. దాదాపు ప్రత్యధ్యాయమొక వ్యాస విషయముయింది. అంతేకాక, భారతదేశంలో ఆర్య జీవితం చారిత్రాత్మకంగా తెలిపాడు. భగవద్గీత ప్రాధాన్యం వివరించినంత విస్తృతంగా

వేదగత సామాజిక జీవితం విపులీకరించాడు. ఈ వ్యాసాలలో స్థూలంగా వేద భూమిలో మానవ జీవితం, ఆలోచన, తాత్త్వికబుద్ధి ప్రపంచించటానికి ప్రయత్న ముంది. అల్పంగా భారతీయ విద్య ప్రాచీన గ్రంథాలయాలు పరిశీలన పొందాయి. కడప సారస్వత సభకు అగ్రాసనాధిపతిగా 7-4-1917న కోలాచలం శ్రీనివాస రావు చేసిన ప్రసంగం సారస్వత చరిత్రగా గోచరమవుతూ వుంది. సారస్వతాది వ్యాస సృష్టి అల్పంగా ఉన్నప్పటికీ, వ్యాసకర్త ప్రధానంగా వేదాలు భగవద్గీత చుట్టూ విస్తృతంగా రచన చేశాడు. ఇంత ప్రముఖంగా వేదాంత వ్యాస సృష్టి చేసిన రచయిత తెలుగులో లేడు.

కర్తపేరు అలభ్యంగా ఉన్న 'గీతాకాలము - దాని యుత్పత్తి' వ్యాసంలో గీత ఆధిక్యం, భారత గీతల సంబంధం, కాలం నిర్ణయించటానికి యత్నం జరిగింది. ఈ కృషి వేదాంత పరిధిలో ఉంది.

వేలూరి శివరామశాస్త్రి విఖ్యాత శతావధాని. హరిహరాద్వైత సిద్ధిని వ్యాస నిక్షిప్తం చేశాడు. వేదాంత విషయ ప్రధాన వ్యాసాలు వ్రాశాడు. అతి సులభంగా వ్రాయాలన్న రచయిత దృష్టి ప్రశంసాపాత్రం. విషయ గహనత లేకపోయినట్లయితే రచయిత వ్యాసాలు సృజనంగా ఉండేవి. వేదాంత వ్యాస సృష్టి కావించిన సమర్థ రచయిత వేలూరి శివరామశాస్త్రి.

పత్రికారచనం ప్రారంభమయిన దగ్గర్నుంచి మత పత్రికలలో వేదాంత వ్యాస సృష్టి జరుగుతూ ఉంది. ఆ రచనలు సారస్వత పరిధిలోకి ఎక్కువగా రావటంలేదు. కొన్ని మత పత్రికలు కూడా సాహిత్య విషయ వ్యాసాలు ప్రచురిస్తున్నాయి. అయితే మత విషయం వ్యాస సాహితిగా రూపొందించటం జరిగినప్పుడు వేదాంత వ్యాస వైశిష్ట్యం అభివ్యక్తమవుతుంది.

## 13. వైజ్ఞానిక వ్యాసం

విజ్ఞాన శాస్త్రం దృష్టి పెరిగిన తర్వాత ఆలోచనా రీతిలో మార్పు వచ్చి ప్రతి భౌతిక పరిణామానికి హేతువు పరికించటం ఆరంభమయింది. అందు వల్ల పూర్వం సమాధానం సక్రమంగా లభించని అనేకాంశాలకు విజ్ఞాన శాస్త్రం జవాబు అయింది. తెలుగులో విజ్ఞాన శాస్త్రం వ్యాసవాఙ్మయంగా విస్తృతంగా ఆవిర్భవించ లేదు.

తెలుగులో విజ్ఞాన శాస్త్ర సంబంధి వ్యాస రచనం మొదలయినా సరయిన ప్రోత్సాహం లేక, సామాజిక అభిరుచిని పొందక ఆరంభంలోనే కొంతకాలం దాదాపు ఆగిపోయింది. ఇతర సారస్వతాలలో ఆధునిక వైజ్ఞానిక పరిణామాలవంటి టెలివిజన్ రాకెట్‌లు వ్యాసగతంగా గోచరమవుతుంటే సామాన్యమయిన విజ్ఞానశాస్త్రం కూడా తెలుగులో వ్యాస సృష్టిగా విస్తృతంగా పొందలేదు.

ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మ చాలా ప్రారంభంలో ఈ లోపం తీర్చటానికి యత్నించాడు. సుజన ప్రమోదిని (1881), కల్పలత (1903) పత్రికలు ప్రారంభించి, పదార్థ విజ్ఞాన, రసాయన, జంతు, ఖనిజ, ఖగోళ శాస్త్ర వ్యాసాలు ప్రచురించాడు. 'రహస్య దర్పణము' (1894) విజ్ఞాన విషయిక వ్యాస సంపుటి ప్రకటించి తత్పాండిత్యం వెలువరించాడు. వ్యాసం విజ్ఞాన శాస్త్ర సంబంధి విషయ విన్యాసంగా రూపొందించటం ఈ రచయిత ప్రధానంగా నిర్వహించినప్పటికీ వచ్చిన పరిణామం అధికంగా లేదు.

విజ్ఞాన శాస్త్ర విషయం సాహిత్య రూపం పొందటానికి ఆ విషయ పరిజ్ఞానం ఉన్న, సారస్వత జీవితం ఉన్న రచయితలు అవసరం. ఈ రెండూ ఆంధ్రులలో అంత ఎక్కువగా ఒక్క చోట నిక్షిప్తం కాలేదు. ఉన్నా రచన జరగలేదు. వ్రాయాలన్న అభీష్టం అక్షర రూపం పొందలేదు. అయితే శ్రీ ఎమ్. ఎస్. శాస్త్రి 'సాహిత్యంలో సర్పం' (1953), 'సాహిత్యంలో జంతుజాలం' అనే వ్యాస సంపుటాలలో వైజ్ఞానిక వ్యాసాలున్నాయి. శ్రీ విస్సా అప్పారావు వైజ్ఞానిక వ్యాసం నిర్మించాడు. ఖగోళ శాస్త్ర విషయగతంగా ఈ వ్యాసావిర్భావం ఉంది.

తెలుగులో శాస్త్ర పఠన విస్తృతత్వంవల్ల మున్ముందు వైజ్ఞానిక వ్యాసాలు అవతరించే అవకాశం ఉంది. తెలుగు జీవితంలో ఉన్న హృదయ ప్రాధాన్యం సృజన వ్యాస సృష్టిలో గోచరమయి, శాస్త్రాది వ్యాసరచన విమర్శనాత్మకంగా జరగటానికి అవరోధంగా ఉంది. సంఘ జీవితంలో మార్పు సారస్వత జీవితంలో పరిణామం అవుతుంది. వైజ్ఞానిక వ్యాస సృష్టి అధికంగా రూపొందటానికి సామాజిక నేపథ్యం అవసరంగా ఉంది.

## 14. రాజకీయ వ్యాసం

ఆంగ్ల విద్య, ఆంగ్లేయ పాలన ఆంధ్రులకు రాజకీయ దృష్టి కలగటానికి దోహదం చేశాయి. అంతకు ముందు ఆంధ్ర దేశం రాజకీయ చైతన్యం తారతమ్య పరిశీలనతో చూస్తే ఇంత ఎక్కువగా లేదు. భారత దేశంలో వచ్చిన స్వాతంత్ర్యా కాంక్ష, ఆంధ్ర దేశంలోనూ 20 వ శతాబ్ది మొదటిలోనే రావటంతోపాటు ఆంధ్రోద్యమం కూడా ప్రారంభమయింది. ఈ రాజకీయ చైతన్యం సారస్వ తంలో వ్యాసంగా కంటే పత్రికా రచనంగా ఎక్కువగా గోచరమవుతూ వుంది.

'కాంగ్రెసు కాన్ఫరెన్సుల ఉపన్యాస మంజరి' (1907) కర్త పేరు లేకుండా ముద్రితమయింది. ఇందులో (1906) కాంగ్రెసు మహాసభోపన్యాసాల సారాంశవ్యాసాలున్నాయి. దాదాభాయి నౌరోజీ, గైక్వారు మహారాజు, విఠల్ దాస్, పి.యన్. బోసు, ఆర్.సి.దత్తు, సరోజిని నాయుడు, బరోడా మహారాజు, గోపాలకృష్ణ గోఖ్లే, బిపిన్‌చంద్ర పాల్ ఉపన్యాసాలు, రాజకీయాలు, పరిశ్ర మలు, సంఘ సంస్కరణం విషయాలై ఉన్నాయి.

'ఆంధ్రోద్యమము' (1917) మొదటి అయిదాంధ్ర మహాసభల అధ్య క్షోపన్యాసాల సంకలనం. ఈ సంపుటి బాపట్ల, బెజవాడ, విశాఖపట్టణం, కాకినాడ, నెల్లూరులలో జరిగిన సభలలో బి. యన్. శర్మ, కొండా వెంక టప్పయ్య, న్యాపతి సుబ్బారావు, పురాణము వేంకటప్పయ్య వంటి ప్రముఖు లిచ్చిన ఉపన్యాసాలు సంతరించుకొని వెలువడింది.

డి. గోపాలకృష్ణయ్య రచనల సంపుటాలలో మొదటిది ఆంధ్రోద్యమ భాగంగా (1961) వెలువడింది. ఈ ఉద్యమంలో వ్యాసకర్త కృషి, స్థానం వివరించేటట్లుగా వ్యాసాలున్నాయి. రాజకీయ వ్యాసాలు సంపుటాలుగా కంటే పత్రికలలో అధికంగా ప్రచురితాలయ్యాయి.

తెలుగు దేశంలో రాజకీయ పక్షాలు తమ దృక్పథం ప్రచారం చేయ టాన్ని పత్రికలే ప్రారంభించాయి. విశాలాంధ్ర, జనశక్తి, వాహిని, ఆంధ్ర జనత ఇటువంటి పత్రికలే. వీటిలో అనేక వ్యాసాలు రాజకీయ దృక్పథంతో వెలువడటం జరిగింది. రాజకీయ పక్షాలు ప్రచురణాలయాలు స్థాపించి సిద్ధాంత గ్రంథ వ్యాస ప్రచారం చేశాయి. విశాలాంధ్ర ప్రచురణాలయం కమ్యూనిజం

ఉన్న సాహిత్య రచనలను వెలువరించటం మామూలయింది. మాస్కోనుంచి అనేక రచనలు తెప్పించి అనువాదం చేసి ప్రచురించింది. ఇందులో వ్యాస సృష్టి అధికంగానే వుంది. వాహిని ప్రచురణాలయం కొంతవరకు కిసాన్ మజుదూర్ పార్టీకి, ఆపైన స్వతంత్ర పార్టీకి దోహదం చేసే సాహిత్యంలో వ్యాస సృష్టికూడా వెలువరించింది. అనేక పత్రికలు కాంగ్రెసు సిద్ధాంత వ్యాస పరంపర ప్రచురించాయి. రాడికల్ హ్యూమనిజమ్ తెలిపే రాయిష్టుల వ్యాసాలు యం.యన్. రాయ్‌వీ, తదితరులవీ తెలుగులో వెలువడ్డాయి. అధికంగా సంపుటాలుగా అవతరించకపోయినా ఉపన్యాసాలుగా, వ్యాసాలుగా, వేదికలమీద, పత్రికలలో రాజకీయ వ్యాసం సమధికంగా వెలుగు చూచింది. సమర్థ సాహిత్య సంబంధంగా రాజకీయవ్యాసం తెలుగులో వెలువడే అవకాశం ఉంది.

## 15. ఆర్థిక వ్యాసం

కళాశాల పాఠ్యాంశంగా అర్థశాస్త్రం ఉండటం వల్ల స్వల్పంగా వ్యాస సృష్టి జరిగింది. రాజకీయ స్వాతంత్ర్యం వల్ల ఆర్థిక స్వాతంత్ర్యం లభించి అది సుస్థిరమవుతున్న దేశ జీవితంలో అధికంగానే ఆర్థిక వ్యాసాలు అవతరించే అవకాశం గోచరమవుతూ వుంది.

### 1. మామిడిపూడి వెంకటరంగయ్య

రాజకీయ చరిత్రార్థ శాస్త్రాలు కూలంకషంగా అధ్యయనం చేసి, బోధనలు చేసిన మేధావి మామిడిపూడి వేంకటరంగయ్య ఈ వ్యాసకర్త ఆంధ్ర గ్రంథాలయ సంఘం ఆహ్వానంతో ఆరు ఉపన్యాసాలిచ్చి సంపుటంగా ప్రకటించటం వల్ల ఆర్థిక వ్యాస దర్శనం కలిగింది. అర్థశాస్త్రం ఆంధ్రంలో వ్యాసగతంగా అంతకుముందు మృగ్యం. కట్టమంచి రామలింగారెడ్డి అర్థశాస్త్ర బృహద్గ్రంథం మినహాయిస్తే, ఈ శాస్త్ర రచనలు ఈ విధంగా లేనట్లే!

ఉపన్యాసాలుగా వెలువడ్డ ఈ అర్థశాస్త్ర రచనలు యథాతథంగా పుస్తక రూపం పొందాయి. ''ఆంధ్ర భాషలో సులభశైలి నర్థశాస్త్ర ముఖ్యాంశముల నాంధ్ర దేశీయులకు దెలియునట్లు చేసిన వేంకటరంగయ్యగారి యుద్యమ మత్యంత శ్లాఘనీయమై యున్నది'' అని ఉపోద్ఘాతంలో కిళాంబి రామానుజాచార్యుడు వివరించాడు.

ఈ సంపుటిలో ప్రతి వ్యాసం ముందుగా ఏర్పాటు చేయబడిన ప్రణాళిక ప్రకారం రచితమయింది. వీటిలో విషయ ప్రాధాన్య మున్నంతగా రచనా ప్రాధాన్యం లేదు. ప్రధాన విషయం ఆరు ఉపన్యాసాలుగా విభజించటం, ప్రత్యు పన్యాస భాగం చిన్నచిన్న విభాగాలుగా రూపొందటం నిర్మాణగతంగా పరికింప వచ్చు.

ఈ వ్యాసాలలో, ధనం నాణెం పదాల అర్థం, ధనోత్పత్తి సాధనం లక్షణం ప్రాధాన్యం, మానవ ప్రయత్నం, ధనంతో మానవ సామర్థ్యం సంబం ధించి ఉండటం, వ్యాపార వ్యవహారాలు, ధనార్జన, ఖర్చు, వినిమయ మూలా ధారం వంటి విషయాలు సమర్థంగా వ్యాసగతంగా వివరించిన మామిడిపూడి వెంకటరంగయ్య అర్థశాస్త్ర వ్యాసకృషి ప్రశంసాపాత్రం.

'గ్రామ పునర్నిర్మాణపు తరగతుల ఉపన్యాసములు' (1929) శనివారపు సుబ్బారావు సంపుటీకరించాడు. ఆర్థిక స్థితి మెరుగుపడటానికి గ్రామ నిర్మాణం సహకారం పునాదిగా రూపొందాలని వ్యాసాలు వివరించాయి. గృహ పరిశ్రమలు ఈ స్థితికి దోహదం చేస్తాయని తెలిపాయి. గ్రామం ఆర్థికంగా అభివృద్ధి చెంద టానికి చేయవలసి విధులు వివరించటం ప్రధాన కార్యంగా ఈ వ్యాసాలు రూపొందాయి. ఈ వ్యాసాలు నరసింహదేవర సత్యనారాయణ, కస్తూరి లక్ష్మీ నరసింహారావు, యన్. జి. రంగా, అవటపల్లి నారాయణరావు, కాశీనాథుని నాగేశ్వరరావు వంటి ప్రముఖులు ఇచ్చిన ఉపన్యాసాలు. ఈ ఆర్థిక వ్యాసాలలో గ్రామాభ్యుదయం ప్రధాన దృష్టి.

శ్రీ గోరా - 'ఆర్థిక సమానత - ప్రజాస్వామిక కార్యక్రమము' వ్యాసం ప్రభుత్వం, ప్రజలు ఆర్థిక సమానత కోసం చేయవలసిన కార్యాలను తెలుపుతూ ఉంది.

పత్రికలు కొంతవరకు ఈ వ్యాస సృష్టికి దోహదం చేశాయి. భారతి పత్రికలో శ్రీ బులుసు వేంకటసుబ్బారావు అనేకమైన ఆర్థిక వ్యాసాలు వ్రాశాడు. ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలలో ఆర్థిక వ్యాసాలు ముద్రితాలయ్యాయి. ఇవి ప్రపంచార్థిక పరిస్థితిని, పరిశ్రమల స్థాపనావసరాన్ని వివరిస్తున్నాయి. ఆకాశవాణి కార్మికుల కార్యక్రమంలో పరిశ్రమలలో పెట్టుబడులకు సంబంధించి,

ఆర్థిక వ్యాసాలు ప్రసారమయ్యాయి. తెలుగు సారస్వతంలో ఆర్థిక వ్యాసం నిర్మాణాభ్యుదయంతో రచితమవుతుంది.

తెలుగులో పరిశోధన వ్యాసం విశ్వవిద్యాలయాలలో పరిశోధన ప్రారంభమయిన నాటినుంచి వెలువడుతూ వుంది. చిలుకూరి నారాయణరావు భాషా చరిత్రకు, డా. కాకర్ల వేంకట రామనరసింహం ప్రబంధ వికాసానికి డాక్టరు పట్టాలు పొందారు. ఆంధ్రదేశంలోని మూడు విశ్వవిద్యాలయాలలో, పి. జి. సెంటరులలో పరిశోధన వ్యాసాలు అవతరిస్తున్నాయి.

పరిశోధన వ్యాసం ఏ విధంగానూ వ్యాసం కాకపోయినా ఆ పేరుతో ప్రవర్తిల్లుతూ వుంది. భాషా పరిశోధన సంపూర్ణ శాస్త్ర చర్చ పరిధిలోకి, సారస్వత పరిశోధన విమర్శన పరిధిలోకి ప్రవేశించటం గోచరమవుతూ వుంది. సారస్వత పరిశోధనంలో ప్రక్రియ, కవి, కావ్య, తత్త్వ పరిమితంగా విషయ గ్రహణం ఉంది. భాషా పరిశోధనంలో భాషా శాస్త్ర వ్యాకరణ రీతులు ఉన్నాయి.

విశ్వవిద్యాలయాలలో పరిశోధనలకు పర్యవేక్షకులుగా ఉండి, స్వయంగా పరిశోధన చేసి, తత్ఫలితాలు వ్యాసాల ద్వారా వెలువరించే ప్రముఖులు వాటిని సంపుటాలుగా ప్రచురించారు.

డా. తూమాటి దోణప్ప అనేక పత్రికలలో ఆకాశవాణిలో ప్రచురించిన, ప్రసారం చేసిన వ్యాసాలు, ప్రసంగ వ్యాసాలు సాహిత్య విమర్శనంతో ఒప్పుతున్నాయి. అవి ఈ మధ్యే సంపుటీకరించటం జరిగింది. డా. సుప్రసన్నాచార్యులు వ్యాస సంపుటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ బహుమతి పొందింది. విశ్వవిద్యాలయాలలోని అధ్యాపకులు పరిశోధన వ్యాసాలు ప్రచురిస్తున్నారు.

సంస్కృతి వ్యాసం రూపొందించిన వాళ్ళలో శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ కృషి గమనింపవచ్చు. 'భారతీయ సంస్కృతి' (1968) అయిదు వ్యాసాల సంపుటి. ఈ సంపుటిలో సంస్కృతి నిర్వచనంతో ప్రారంభించి, అధ్యాత్మిక, శారీరక, మానసిక, సారస్వత సంస్కృతిని దర్శించటం జరిగింది. ఈ రచయిత 'వాల్మీకి రామాయణ విమర్శనము' (1944) సంస్కృతి దృష్టితో పాటు చారిత్రక గుణం కూడా వెలువరించింది. ఇందులో తొమ్మిది వ్యాసాలు రామాయణ శైలి, కవిత్వం కాలం ఆలోచిస్తూ సాగాయి. ఈ రచయిత 'వ్యాసావళి'

(1951) ప్రాచీన జన జీవితంలో సంస్కారంతో పాటు ఖద్దరు పరిశ్రమ, మద్య పాన నిషేధము, వర్ణాంతర వివాహములు వంటి అనేక విషయాలు పరిశీలించటం చూడవచ్చు.

కళా వ్యాసంగా కృత్తివాస తీర్థుల 'వ్యాస వింశతి' ఉంది. ఇందులో వ్యాసాలు శిల్పం, చిత్రలేఖనం, కావ్యం ఆది వస్తువులతో పాటు, వైష్ణవ ధర్మ వివరణం, రస స్వరూపం దర్శనం చేస్తూ ఉన్నాయి. ఈ వ్యాస సంపుటిలో భారతీయ ప్రాచీన వైభవ యత్నం గోచరమవుతూ వుంది. కళలు మత సంబంధులై ఆనంద సంపాదకాలై రస పరిపుష్టాలై, ఆనంద శాంత జీవనం అందించాలన్న ఆశకు ఆకారాలుగా ఉన్న ఉత్తమ వ్యాసాలివి.

కల్లూరి చంద్రమౌళి- 'భారతీయ ప్రతిభ' (1950) వ్యాసాల సంపుటి. భారతదేశ సంస్కృతి నాగరికతల పరిశీలనలుగా ఇవి అవతరించాయి. కళలు, ప్రకృతి నిత్య జీవితం విశదిస్తూ ఈ దేశం ప్రపంచానికిచ్చే సందేశం వివరించటం పరికింపవచ్చు.

దుగ్గిరాల వేంకట సూర్య ప్రకాశరావు-'హిందూమతాచారక విషయకోప వ్యాసములు' (1892) వ్యాస ప్రారంభదశలోని రచనకు ప్రతీకలుగా సృజనంగా ఉన్నాయి. ఈ వ్యాసాలు రచయిత సంస్కరణ దృష్టిని అభివ్యక్తం చేస్తున్నాయి. వచనం నూత్న భావ ప్రకటన సమర్థంగా రూపొందింది. కె. ఆర్. వి. కృష్ణారావు సంఘ సంస్కరణ సంఘము దాని విధులు (1894) ఉత్తమ తరగతి వ్యాసం. సృజన గుణశోభితంగా వుంది.

వివిధ పత్రికలలో సంచికలలో సంకలనాలలో వ్యాసాలు ప్రచురించిన రచయితలు అనేకులున్నారు. ఆయా వ్యాసాలు సంపుటాలుగా ముద్రించక పోవటం, లభించకుండటం వల్ల పరిశీలనం పొందని వ్యాస రచయితలు పలువురు గోచరమవుతున్నారు. ప్రాథమికంగా ఈ రచయితలు విమర్శన వ్యాస నిర్మాతలుగా ఉన్నారు. వీరు శ్రీయుతులు మాడపాటి హనుమంతరావు, ఆదిరాజు వీరభద్రరావు, పులిజాల హనుమంతరావు, దివాకర్ల రామమూర్తి, పువ్వాడ శేషగిరిరావు, విస్సా అప్పారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, అడవి బాపిరాజు, చంద్రమౌళీశ్వర రావు, మోటూరి సత్యనారాయణ, గుఱ్ఱం వేంకట సుబ్బరామయ్య, కాశూరి వ్యాసమూర్తి, శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రి,

ఆత్మకూరి గోవిందాచార్యులు, అయ్యంకి వెంకటరమణయ్య, ఆంధ్ర శేషగిరి రావు, ఎల్లోరా, వేదాల తిరువెంగళాచార్యులు, నండూరి బంగారయ్య, నండూరి రామకృష్ణమాచార్యులు, గడియారం వేంకట శేషశాస్త్రి, దాశరథి, కాళోజీ నారాయణరావు, బి. వి. రమణారావు, డి. వి. జి. కృష్ణమూర్తి, గొబ్బూరి రామచంద్రరావు, గొట్టుముక్కల కృష్ణమూర్తి, పర్సా వేంకటేశ్వరరావు వంటి ప్రముఖులే కాక శ్రీమతులు యల్లాప్రగడ సీతాకుమారి, రాపోలు లలితా దేవి, నందగిరి ఇందిరాదేవి వంటి వాళ్ళు అనేక విమర్శవ్యాస సృష్టి చేశారు.

వర్తమానాంధ్ర పత్రికలలో సారస్వత వ్యాస సృష్టి కావిస్తున్న వాళ్ళు అనేకులున్నారు. వీళ్ళు అధికంగా వ్యావహారిక భాషను గ్రహించి, సారస్వతంలో వస్తున్న పరిణామాలు సాహితీ తత్త్వాలు వివరించే విమర్శన వ్యాసాలు సృష్టిస్తున్నారు. ఇంకా పలువురు పెద్దలు, యువకులు వాఙ్మయం పరిపుష్టం కావిస్తున్నారు.

తెలుగులో విమర్శన వ్యాసం అధికంగా సాహిత్య విషయ విస్తృతంగా ఉంది. సాహిత్యేతర విషయాలు పరిమితంగా వ్యాసరచనంలో గోచరమవుతున్నాయి. వివరణం విపులీకరణం విశదీకరణం విమర్శన వ్యాస తత్త్వంగా గ్రహింపవచ్చు. కావ్యగుణ దోష పరిశీలనంలో విమర్శన వ్యాసం ప్రకాశ వంతమయిన సామర్థ్యం కలిగి వుంది.

తెలుగు విమర్శకులలో కావ్యతత్త్వం వెలువరించి సాహితీ జీవితం స్పష్టం చేయటానికి కృషిచేసే వాళ్ళు అధికంగా ఉన్నారు. అందువల్ల కావ్య విమర్శనం అధికంగా ఉంది. భాషాదివ్యాసాలు కూడా ఈ దృష్టినే వివరిస్తున్నాయి.

తెలుగువాళ్ళు ప్రాథమికంగా హృదయవాదులు. పరిణతంగా బుద్ధిమంతులు. అందువల్ల సృజన వాఙ్మయం ఏర్పడినంతగా విమర్శన వాఙ్మయం అవతరించలేదు. విమర్శన వాఙ్మయం అధికంగా కావ్యాది సృజన రచనల విమర్శనంగానే రూపొందింది కాని, శాస్త్ర స్పర్శ ఉన్న విషయగతంగా అంత ఎక్కువగా లేదు.

వర్తమానాంధ్రదేశం ఆలోచనానుభూతుల హద్దులు పెరుగుతున్నాయి. పూర్వంకంటే హేతుయుతంగా ఆలోచించే బుద్ధి జీవుల సంఖ్య క్రమక్రమంగా

పెరుగుతూ వుంది. అందువల్ల విమర్శన వాఙ్మయ పరిధి విశాలమై, విస్తృతంగా నూతనంగా ఈ వ్యాస సృష్టి జరిగే అవకాశం ఉంది. పూర్వంకంటే వర్తమానంలో రచనావకాశం, రచనావసరం, రచనా దృష్టి పెరిగాయి. అందువల్ల ముస్ముందు అధికంగా వ్యాస వాఙ్మయం అవతరింపవచ్చు.

తెలుగు భాష, కళాశాలల విద్యాబోధక భాషగా రూపొందటంతో పూర్వమెప్పుడూ లేని దశను పొందింది. ఇంతకాలం ఆంగ్లంలో చదవటం ఆలోచించటంగా ఉన్న అనేక శాస్త్ర విషయాలను పాఠ్యాంశాలుగా తెలుగులో చదవటం ఆలోచించటంగా రూపొందటం వల్ల భాషా భవితవ్యం, విమర్శన వ్యాసాభ్యుదయం కలిగే స్థితి ఏర్పడింది. ఇక తెలుగులో అధికంగా భౌతిక రసాయనక శాస్త్రాది వైజ్ఞానిక శాస్త్ర వ్యాసాలు, ఆర్థిక శాస్త్రాది సాంఘిక శాస్త్ర వ్యాసాలు, వ్యాపార వాణిజ్య వ్యాసాలు వంటి అనేక నూత్న విషయ విస్తృతంగా విమర్శన వ్యాసం రూపొందవచ్చు.

విమర్శన వ్యాసం ఆంధ్ర దేశ ఆలోచన ప్రతిబింబం. ఈ ఆలోచన దేశ వ్యక్తిత్వ ఫలితం. దేశ వ్యక్తిత్వం యుగయుగాల తరతరాల మానవ సంస్కృతి నాగరికతల సమాహార రూపం. విమర్శన వ్యాసంలో పరిణామం దేశ వ్యక్తిత్వంలో మార్పు వచ్చినప్పుడే సాధ్యం. రాజుల పాలనం నుంచి, జమీందారుల ఏలుబడి నుంచి స్వాతంత్ర్యం వైపు పయనించిన దేశంలో, సామాన్యుడి వ్యక్తిత్వానికి స్థానం ఏర్పడ్డ ఈ ప్రజాస్వామికంలో, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో మానవుడి అస్తిత్వం గౌరవింపబడుతున్న సమయంలో, బుద్ధి వికాసం తప్పనిసరి పరిణామం. విమర్శన వ్యాసం మహోత్కృష్టంగా అవతరించటానికి ఈ దేశం అనుకూలంగా ఉన్న అభ్యుదయ వేదిక.

---

# తెలుగు వ్యాస శైలి

వ్యాసం రచయిత వ్యక్తిత్వ ముద్రతో, భాషా ప్రయోగ నైపుణ్యంతో శోభిస్తుంది. ఈ రెండు గుణాల ఔత్తమ్యంవల్ల అది ఉత్తమత్వం పొందుతుంది. వ్యాస శోభకు శైలి ప్రాణభూతం. అందువల్ల శైలీతత్త్వంలో రచయిత వ్యక్తిత్వం, అతడు భాషను ప్రయోగించిన తీరు ప్రధానం. ఆంధ్ర వ్యాస వాఙ్మయంలో శైలీగతంగా సాధితమైన అభ్యుదయం దర్శించాలి.

శైలి సాధారణంగా కవితా విషయికంగా వచన విషయకంగా రెండు భిన్న రీతుల్లో గమనించటం ఆంగ్ల సారస్వత సంప్రదాయ సిద్ధమే ! కాబట్టి, ఆంధ్ర వచన శైలిగా, వ్యాస రచనలో శైలి దర్శింపవచ్చు. తెలుగులో కాని, సంస్కృతంలో కాని, శైలిని గూర్చి ప్రత్యేక పరిశ్రమ జరగలేదు. సంస్కృత రీతి తత్త్వం కొంతవరకు ఈ శైలిని గూర్చి తెలుపుతుంది. సంస్కృత వాఙ్మయంలో శైలిని గూర్చి ఆలంకారికులు అనుకూలంగా వివరించింది అల్పమే కాని, ప్రతికూలంగా విపులీకరించింది అధికమే ! పద వాక్య దోషాలు తొలగిస్తే ఉత్తమ శైలికి మార్గం ఏర్పడుతుంది. వీళ్ళు శైలిని నిర్వచించలేదు కాని, శైలీ భంజకాలను దోషాలుగా పరిత్యజించారు. ఈ మాత్రం ప్రయత్నం కూడా తెలుగులో జరగలేదు. అయితే సంస్కృతాలంకారిక సంప్రదాయాలే ఆంధ్ర వాఙ్మయ ప్రసిద్ధం కాబట్టి, కొంతవరకు పరోక్షంగా వుంది శైలీ పరిశీలనం.

శైలి అన్న పదం స్టైల్ పదం నుంచి ఏర్పడింది కాదు. స్టైల్ అనే పదం ఏ అర్థంలో ప్రయోగింపబడుతుందో, ఆ అర్థంలో శైలి అనే పదం పూర్వం లేకపోయినా వర్తమానంలో వ్యవహరింపబడుతూ వుంది. అయితే కొందరు ఈ శైలి పదం స్టైల్ జన్యంగా భావిస్తారు కాని అది వాస్తవం కాదు.

ప్రత్యక్షంగా సంస్కృతంలో శైలిని గూర్చి సమగ్ర పరిశీలన జరగ లేదు, తత్ఫలితంగా తెలుగు సారస్వతంలో తల్లోపం గోచరమవుతుంది. సంస్కృతాలంకారిక సంప్రదాయమే తెలుగులో దర్శింపబడటం వల్ల అస్పష్టంగా ఉన్న విషయం ఆంధ్రంలో స్పష్టతా వాంఛితంగానే మిగిలిపోయింది.

శైలి సారస్వతాంతర్వాహిని. ఏ ప్రక్రియ అయినా, ఏ రచనా ధోరణి అయినా బాహిరంగా గోచరమవుతున్నప్పటికీ, ఆ సాహిత్యంలో అంతరంగా ప్రవహించే చైతన్యం శైలి. ఆంగ్ల భాషలో శైలీ లక్షణం విస్పష్టం చేయటానికి విశిష్ట కృషి జరిగింది. అక్కడ పద్య శైలి గద్య శైలి వింగడించి వివరించారు. వచన రచన శైలీతత్వం ఆలోచనకు గురి చేశారు. ప్రతి రచయిత శైలి మీద వ్యాఖ్యానంతో పాటు శైలిని గూర్చి ప్రత్యేకంగా పరిశీలించారు.

అందువల్ల ఆంగ్ల శైలీ ధర్మాలు, సంస్కృతంలో శైలీ భంజక గుణాలు, వర్తమానాంధ్ర సారస్వతంలో శైలిని గూర్చిన స్వల్ప ప్రయత్న సంబంధి లక్షణాలు గ్రహించి, ఒక క్రమంలో వింగడించి, వాటి ఆధారంతో తెలుగులో వ్యాస శైలి గుర్తించాలి. ఇది విస్తృతార్థంలో వచన శైలి.

## 1. శైలీ దర్శనం

శైలి, రచయిత భాషను రూపొందించటంలో చూపే నేర్పు మీద, తత్త్వం మీద ఆధారపడి, ఆ రచనాంతర్గతంగా గోచరమవుతూ వుంటుంది. భాష ధ్వనిగా, పదంగా, పదాల కూడికగా, వాక్యంగా, వాక్యసముదాయంగా, వ్యాసంగా ఇత్యాదిగా రూపం దిద్దుకోవచ్చుగాని, తద్రూపాలన్నీ శైలి కాక, ఆ రూపాంతర్గతంగా శైలి విలసిల్లుతుంది. రూపం శైలి కాదు. రూపాంతర తేజస్సు శైలి. శైలి పైకి కనిపించదు. లోతుల్లో ఉంటుంది. అది బాహిరంకాక, అంతరంగా వుంటుంది. అయితే బాహిరపద, వాక్యాది సంకేత సహాయంతో అంతరంగా శైలి విలసిల్లుతూ వుంటుంది. పదాది మేఘాల మరుగు నుంచి తళుక్కు మనే తటిల్లత శైలి.

శైలి సారస్వతాంతర ధర్మం. ప్రతి వ్యక్తికీ ప్రాణమున్నట్లే ప్రతి రచనకు శైలి ఉంటుంది. అయితే ప్రాణమున్న అందరూ ఎలా చైతన్యవంతులుగా, కళగా, వెలిగే దివిటీలులాగా వుండలేరో, మహోత్తములు కాలేరో, ఆలాగే అన్ని రచనలు శైలీ చైతన్యం ప్రదర్శించలేవు. అందువల్ల ఏ వ్యాసం ఉత్తమ శైలీ సముచితమో, అది ఉత్తమం. శైలి రచయిత రూపొందించే భాషా సంబంధి అయి, సాహిత్యాంతర్వాహిని అయి, సారస్వతానికి ప్రాణ చైతన్యమయి ప్రకాశిస్తుంది.

కావ్యేంచిరకు శబ్దార్థాలు తనువు, అలంక్రియా వితానం సొమ్ములు, గుణాలు గుణాలు, వృత్తులు వృత్తులు, ధ్వని జీవం అయితే ఆ ప్రాణచైతన్యం శైలి. ఈ శైలి లక్షణాలు పరికించేముందు, తత్పదానికున్న అర్థం గమనించాలి.

## 1. 1. స్టైల్ పద అర్థం

'స్టైల్' అనే ఆంగ్ల పదం, 'స్టైలస్' అనే లాటిన్ పదం నుంచి పుట్టింది. దీనికి వ్రాత కుపయోగించే ఇనుప ఘంటమని అర్థం.

ఇది అర్థ విపరిణామం వల్ల వ్రాతగా, రచనగా, విశిష్ట రచనా రీతిగా మారి, చివరకు భాషా రచనలో విశిష్ట రీతి అయింది. "For the Latin stilus comes from the root stig-of. Greek-stigma stimulus, instigate, stick, German stochen. We should, were English a logical language, write stile (if German-stil, Italian-Stile, Spanish-estilo). But the Latin stilus became corrupted to stylus by confusion with the Greek-, a pillar; and this spurious 'Y' does at least save us now from confusing the styles of writers with the stiles of fields-paths." (1)

లేఖనార్థం పనికి వచ్చే పరికరం లేఖన రీతిగా ఆంగ్లంలో అర్థ బోధ కావించింది. సంస్కృతాంధ్రాలలోనూ శైలికి లేఖన రీతి అన్న అర్థమే, స్థూలంగా వర్తమానంలో వుంది. అయితే ఆంగ్లంలో ఈ పదం పొందిన అర్థపరిణామం పరికింపవచ్చు.

## 1.2. స్టైల్ అర్థ పరిణామం

ఈ పదం ప్రాథమికంగా వాగ్వ్యాపారానికీ, పరిణతంగా సారస్వత ధర్మానికీ సూచకమయింది. వర్తమానంలో సాహిత్యేతర విషయాలకూ పేరయింది.

అరిస్టోటిల్ సిసిరోలు స్టైల్ భావ సముచితాలంకారంగా భావించారు. వక్తకాని, వ్యాసకర్త కాని, విషయతత్త్వానికి అనుకూలంగా, అలంకార సహితంగా, పరిమిత వాక్య ప్రణాళికలో ఒదిగేటట్లుగా తన భావాలు వెలువరించవలసి వుంటుంది. ఈ దశలో ఈ భావాలకు ఈ విధమైన వాక్య విన్యాసం రచనా రీతి శోభావంతంగా వుంటాయని భావింపవచ్చు. ఆ విధమయిన రచన శైలిగా గుర్తింపు పొందింది.

అర్హ స్థలాలలో సమర్హ పదాలు అనే జోనాథాన్ స్విఫ్ట్ దృష్టి, స్టైల్‌ని గూర్చి వివరింపబడే ఆలోచనలకు మధ్యస్థంగా వుంది. భావ వ్యక్తీకరణకు ఏర్పడే వాక్య విన్యాసంలోని వైవిధ్యంలోంచి సముచిత వాక్య సముదాయం గ్రహించటం ఉత్తమ శైలికి ఉదాహరణంగా భావించిన రాలి-స్విస్ వ్యాసకర్త-వాక్యంకంటే పదం శైలి దృష్టితో, ప్రధానంగా భావించారు. ఏ భావ వ్యక్తీకరణమైన, అనేకేతర భావద్యోతకం కావచ్చు. సాధారణంగా ద్యోతక భావం వ్యక్తీకరణ భావం కన్నా బలవత్తరంగాను ఉండవచ్చు. వ్యక్తీకరణ భావంలో సామాన్య ప్రయోగాల నతిక్రమించి ద్యోతక భావం వుంటుంది. కాబట్టి, ఇది బలవత్తరమయింది. శైలిని గూర్చిన ఈ అభిప్రాయంలో పదం ఎన్నిక, దాని ద్యోతకార్థం ''ఏ వొకేటివ్ మీనింగ్'', దాని అనేకార్థ సంయోగ సామర్థ్యం ''పొలవలెన్సి'', దాని పరావర్తనం ''డీవియేషన్'' వీటి మీద శైలి ఆధారపడి వుంటుంది. ఈ సందర్భంలో శైలి సంపూర్ణంగా భాషా సంబంధిగా గోచరమవుతుంది. అందువల్ల ఇది ఈ విషయంలో పాక్షిక సత్య ప్రదర్శకమే అయినా తత్పాక్షికార్థాం పరికింపవచ్చు.

అత్యాధునిక దృక్పథంలో శైలి సంపూర్ణంగా భాషా సంబంధి కాదు, అధికంగా రచయిత వ్యక్తిత్వ సంబంధి అని తెలుస్తుంది. బఫ్ఫన్ ప్రసిద్ధ నిర్వచనం "Style is the man himself" అనేది ఈ విషయ బోధకంగా వుంది. రచయిత వ్యక్తిత్వ ప్రాధాన్యం శైలీగతంగా పరికిస్తే శైలి, రచయిత మనస్సు యొక్క బాహిరాకారం. అందువల్ల ఇది రచయిత మానసిక లక్షణం. దీనివల్ల రచయిత వ్యక్తిత్వం మరో రచయితకంటె భిన్నంగా వుంటుంది కాబట్టి శైలిలో వైవిధ్యం విస్తృతత్వం గౌరవ పాత్రాలవుతున్నాయి.

నేడీ అర్థంలోనే శైలి ప్రయుక్తమవుతూ వుంది. సారస్వతంలో గౌరవ పీఠం అధిష్ఠించిన శైలి, ఇతర కళలకు ఎగబ్రాకి తత్కళాధర్మంగా భావింప బడుతూ వుంది. జీవితం ప్రతిబింబించే కళా ప్రపంచంలో చిరంజీవి అయిన శైలి కళారంగంలోంచి జీవిత రంగంలోకి ప్రవేశించి, అనేక సందర్భాలలో ప్రయోగింపబడుతూ వుంది.

శైలి రచయిత వ్యక్తిత్వమే అయి, సాహిత్య రూపం పొందుతుంది. ఈ ఆధునిక దృష్టికి తోడు అతి ప్రాచీనమయిన దృష్టి కూడా గమనింపవలసి వుంటుంది. పదం, పద సంయోజనం, వాక్యాలు, భాషా విషయిక రీతి, భాష-శైలి విషయంలో స్పష్టంగా పరికింపవలసిన అంగాలే అవుతాయి. అందువల్లే శైలి, రచయిత వ్యక్తిత్వం ప్రతిష్ఠించిన భాషాంతర్గత చైతన్యమని చెప్పటం సాధ్య మవుతుంది. కాబట్టి రచయిత వ్యక్తిత్వం భాషా వైశిష్ట్యం శైలీ ధర్మాలు.

వచన ప్రక్రియల్లో శాస్త్ర సంబంధి రచనల్లో భాషావైశిష్ట్యం ప్రధానంగా, రచయిత వ్యక్తిత్వం అప్రధానంగా వుంటుంది. కథా నవలాది సృజన ప్రక్రియల్లో రెండు గుణాలు 'సమపాళ్ళ'లో వుంటాయి.

వ్యాసంలో తల్లక్షణంగా రచయిత వ్యక్తిత్వం ఉండాలన్నది స్పష్టమే! శైలిలోనూ, రచయిత వ్యక్తిత్వం ఉంటటం తప్పనిసరి. కాబట్టి వ్యాసశైలిలో రచయిత పరిత్రలోకానికి ప్రత్యక్షంగా, సాక్షాత్కారమయి ఉండటం ప్రత్యక్షర పరమార్థం. వచన ప్రకియల్లో ఉత్తమ స్థానంలో నిలిచే వ్యాసం, శైలిమూలంగా అత్యుత్తమ శిఖరాలు అధిరోహించే అవకాశం వుంది. కాబట్టి ఏ సృజన ప్రక్రియలోనూ రచయితకు లేని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు వ్యాస సృష్టిలో లభిస్తాయి.

## 2.1. శైలి-సంస్కృతాంధ్రాలు

శైలి సంస్కృత పదం. దీనికి అర్థం నిఘంటువుల్లో లభిస్తుంది కాని, ఆలంకారికంగా లభించదు. శైలికి సాంప్రదాయిక నిర్వచనం మృగ్యం. దీనికి ఆప్టే ఇచ్చిన అర్థం: "శైలీ 1. A Short explanation of a Grammatical opherism. 2. A mode of expression or interpretation; ప్రాయేణా చార్యాణామియం శైలీ యత్స్వాభిప్రాయ మపి పరోపదేశ మివ వర్ణయతి. Kull on Ms. 1.4.(Kulluka on Manu-

smriti 1. 41. 3. Behaviour, manner of acting, conduct, course'' దీనివల్ల శైలి అంటే భావ వ్యక్తీకరణ విధానం అని స్పష్టమవుతుంది. తెలుగులో శబ్దార్థ చంద్రిక ''శైలి. స. వి. రచనా కౌశలముగల భాషా సౌష్ఠవము. భాషాసరణి, లేఖన పద్ధతి, విధము, ధోరణి'' అనటం వల్ల శైలి రచనా కౌశల సంబంధిగా స్పష్టమవుతుంది.

''శైలి యనగా మన మనస్సున గల యభిప్రాయమే మఱియొకరి మనస్సునను బుట్టించుటకై భావ బోధకములగు శబ్దములను వాక్యపరంపరగా గూర్చుట'' (2) ఈ నిర్వచనం ఆంగ్ల భాషా పరిచయం వల్ల తెలిపినట్లు స్పష్టమవుతుంది. ఇందులో శైలికి ప్రధానమయిన రచయిత వ్యక్తిత్వం అస్పష్టంగా, భాష స్పష్టంగా తెలుపబడ్డాయి. ''మన మనస్సున'' అనటం వల్ల రచయిత వ్యక్తిత్వ ప్రాధాన్యం స్పష్టం కాదు. ఏ విషయం ఎవరు వ్రాయాలన్నా, అది మనస్సున పుట్టిందే అవుతుంది. ''మరియొకరి మనస్సునను బుట్టించుటకై'' లో రచయిత చేయవలసిన కృషిలో వ్యక్తిత్వ ముద్ర ఉండవచ్చునన్న స్ఫురణ వల్ల వ్యక్తిత్వాన్నిగూర్చి అస్పష్టంగా అయితేనేం చెప్పటం జరిగింది.

## 2. 2. శైలి–రీతి

శైలి, రీతి తుల్యార్థ బోధకాలుగా భావించే విమర్శకులున్నారు. అయితే రీతి శైలిలో అంతర్భాగం మాత్రమే! శైలి విశాల పరిధీ ప్రవర్తకమైతే, రీతి స్వల్ప పరిధీ పరిమితమై, శైలిలో అంతర్భవిస్తుంది. పద ధర్మం రూపం గుణంగా, పద సంయోజన వైశిష్ట్యం రీతిగా భావించాలి. రీతి పద రచన మాత్రమే కాదు, తదాత్మ. పద రచన, గుణబోధకమై శరీరం. దానిలోని ఆత్మ రీతి. అందుకే ''రీతిరాత్మా కావ్యస్య'' అనటం కుదిరింది. పద రచన బాహిర తత్త్వం గుణాలు, అంతరదీప్తి రీతి. గుణాలు రీతిని ప్రత్యక్షీకరించే పద నిర్మాణ దర్శకాలు.

ఆంగ్ల సంప్రదాయసిద్ధంగా, శైలి రచనాంతర్గతంగా ఉంటుంది అన్న అంశంతో, పద రచన అనే శరీరంలో ఆత్మగా రీతి ఉంటుంది అన్న దృష్టి ఏకీభవిస్తుంది. అయితే శైలికి వ్యక్తిత్వ సంబంధం ఉంది. రీతికి అది స్పష్టంగా లేదు. శైలి విస్తృత లక్షణ ద్యోతకమయితే రీతి పరిమిత స్థితి బోధకమవుతుంది. అందువల్ల శైలిలో రీతి అంతర్భూత మవుతుందనటం సాధ్యం.

అయితే డా. పాటిబండ మాధవ శర్మ "ది ఫిలాసఫీ ఆఫ్ రీతి" వ్యాసంలో "It may be noted here that the English equivalent of Riti is rhythm and not style as most critics believe" అనటం వల్ల రీతి అంటే లయతో తుల్యమని శైలి కాదని స్పష్ట మవుతుంది. లయ శైలిలో అంతర్భాగం కాబట్టి రీతి లయతుల్యమయితే, రీతి శైలిలో అంతర్గతమై పోతుంది. కాబట్టి రీతి శైలి కాదు కాని శైలిలో అంతర్భ వించిన రచనా విశేషం.

సంస్కృతంలో శైలి రచనా విషయికంగా స్పష్టమే కాని లక్షణ స్పాష్ట్యం లేదు. ఆంగ్లంలో శైలి సలక్షణంగా ఉంది. సంస్కృతాంగ్ల లక్ష్య లక్షణ బలంతో విస్పష్ట శైల్యాలోచన తెలుగులో జరగవలసి వుంది.

## 3. 1. శైలి - భాష

భాష, రచయిత వ్యక్తిత్వం, రెండూ మిశ్రితమయి శైలి అవతరిస్తుంది. ఈ రెండు గుణాలు పెరిగిన కొద్దీ, శైలి బలవత్తరంగా రూపొందుతుంది. అందువల్ల ఏ దశలో భాషా వ్యక్తిత్వాలు ఏ పరిణామం ప్రదర్శించి శైలికి వన్నె కలిగించాయో పరిశీలింపవచ్చు.

ప్రధానంగా ప్రాథమికంగా భావ ప్రకటన సమర్థమయిన భాషలో, రచయిత భాషాధికారం పెరిగే కొద్దీ, ప్రకటన సామర్థ్యం, నైపుణ్యం పెరిగే అవకాశం వుంది. రచయిత సృష్టిలో కనిపించే ఈ భాషా నైపుణ్యం శైలీ ధర్మ ప్రదర్శకం. రచయిత ఆలోచనానుభూతుల అభివ్యక్తికి బాహిరాకారం భాష. ఈ భాషామూలంగా ప్రకటితమయ్యే భావ సందోహాంతరాకారం రచయిత వ్యక్తిత్వం. ఈ భాషా వ్యక్తిత్వాల అంతర్వాహిని, చైతన్య జ్యోతిక, శైలి.

భాషను భావం వాడుకొంటుంది. భావం జరువైతే దాన్ని భరించటానికి సంప్రదాయ సిద్ధంగా సిద్ధ సంకేతంగా ఉన్న భాష సంకోచిస్తుంటే క్రొత్త భాషను, సాధ్య సంకేతాన్ని భావం సృష్టించుకొంటుంది. అంటే రచయిత తన భావ ప్రకటనార్థం నూత్న భాషా పథాలు అన్వేషిస్తాడు. అందువల్ల రచయిత ఈ భాషతో చేసే ప్రయోగాలు శైలీ ధర్మద్యోతకాలు. "A writer, full of a matter, he is before all things anxious to express,

may think of those laws, the limitations of vocabulary, structure, and the like, as a restriction, but a real artist will find in them an opportunity." (3)

సాధారణంగా, ఒక భావాన్ని వ్యక్తం చేయటానికి భాష ఒక క్రమంలో ఏర్పడుతుంది. సక్రమ భాషానుసంధానంలో భావం ప్రకటింపబడితే, ఆ భావం ఆ భాషలో ఆ క్రమంలో ఉండి తీరవలసిన అగత్యం ఏర్పడ్డప్పుడు, అంతకంటే ఇతర క్రమంలో ఆ భావం చెప్పటానికి సాధ్యం కాదని గుర్తించి నప్పుడు, ఒక భావానికి ఒక నిర్ణీత భాషా రూపం తప్పనిసరి అని గ్రహించి నప్పుడు, దాన్ని మార్చి, ఆ భావం విస్పష్టంగా, అతివ్యాప్తి, అవ్యాప్తి లేకుండా అనుభావ ఛాయాభేదం రాకుండా వ్రాయటం అసాధ్యమని తెలుసుకో వచ్చు.

భాషా భావాలను విడదీయటానికి వీలులేదు. భావం బరువు పెరుగు తున్న కొద్దీ భాష భరించే గుణం పెంచుకొంటుంది. భాష, భావానికి నిరంతరం ఒదుగుతూ, దాని అవసరానికి తగినంతగా పెరుగుతూ వుండే సహధర్మ చారిణి. ఒక భాషలో భావ నైశిత్యం పెరిగిందంటే, భావ ప్రకటనకు తగిన భాషారూపాలు, రచనారీతులు ఏర్పడ్డాయని అర్థం. తత్త్వ శాస్త్రానికి, శాస్త్రాలకు, కళలకు తగిన భాష తగిన రూపంలో పెరుగుతుంది. ఈ భాష పెరగటం వెనుక, ఆ విషయాల కనుకూలంగా భాషను రూపొందిస్తున్న రచయిత వ్యక్తిత్వం వెలుగుతుంది. దానిలోంచి శైలి ఆవిర్భవిస్తుంది.

రచయిత చెప్పదలచిన అభిప్రాయాన్ని ప్రకటించిన వాక్యం చదువు కొన్న పాఠకుడు, ఈ వాక్యంలోంచి ఆ అభిప్రాయం పూర్తిగా, స్పష్టంగా పొంద కలిగేట్లు వ్రాయటంలో శైలి గోచరమవుతుంది. అది ఎంతగా లోపిస్తుందే, శైలి అంతగా లోపిస్తున్నట్లు లెక్క! భాష భావం ప్రకృతి పురుషుడు లాగా అవినాభావ సంబంధంతో సంచరిస్తుంటే, ఆ సత్సంబంధలోని చైతన్యం-ప్రాణం-తేజస్సు-దీప్తి-శైలిగా చెప్పవచ్చు.

భాష విషయ వ్యక్తీకరణ సాధనమే కాని, అదే సమస్తం కాదు. విష యాభివ్యక్తికి సుదూరంలో భాష నిలచిపోతే అంత సమర్థం కాని దాని సహా యంతో వ్యక్తిగత వాసనాజ్ఞానం దాని అభివ్యక్తికి సహాయకారి అవుతుంది.

భావానికి వీలయినంత వరకు భాషను ఇమిడేటట్లు చేయాలకాని, అంత సామర్థ్యం దానికి సహజంగా లేదు. కొన్ని సమయాలలో భాషను లొంగదీసుకొని, పొగరుబోతు గుర్రాన్ని లొంగదీసుకొన్నట్లు, భావం స్వారీ చేస్తుంది. ఇది వాంఛనీయమే! అయితే అస్పష్టంగా ఉన్న భావం ఒక్కొక్కప్పుడు సమర్థమైన భాషవల్ల, సుశిక్షితమైన గుర్రం మీద స్వారీలాగా సురక్షితంగా గమ్యం చేరు కొంటుంది. ఇది ప్రమాదంతో కూడింపి అయ్యే అవకాశం వుంది. గుర్రం మీద విశ్వాసం ఉన్నా, రౌతు మీద నమ్మకం లేదు కాబట్టి గమ్యం ఏమవుతుందో శంకింపవలసి వుంటుంది. భావం-రౌతు లాగా - ఆరోగ్యంగా లేనప్పుడు, ఆరోగ్యం కలిగిందాకా స్వారీ ప్రారంభించకపోతే మంచిది. అంటే భావం సమర్థంగా రూపొందిందాకా అభివ్యక్తి ఆరంభం కాకుండా ఉండటం ఉచితం. ఆరోగ్యకరమైన భావం, అంతే ఆరోగ్యంగా ఉన్న భాష వల్ల సుగమంగా గమ్యం చేరుకొంటుంది.

భాష, రచయిత, అంతరావిష్కరణమై, బాహిరాక్షర రూపం పొందు తుంది. సర్వ వాఙ్మయంలోని భాష, ఆ భాషా చరిత్రలో ప్రాచీన కాలంనుంచి అనేకుల అంతర్యాన్ని ప్రదర్శించిన ప్రతిబింబం ప్రాచీన మానవాంతర్యాన్ని మించి రచయిత ఆలోచింపకపోతే భాషలో ప్రయోగం జరగదు. పాత అను భవానికి అతీతంగా రచయిత అనుభూతి వుంటే తప్ప భాషలో క్రొత్తదనం రాదు. సాంఘికంగా వచ్చే పరిణామాలు మనుష్యులందరినీ చుట్టుకొంటాయి, కనుక భాష తత్పరిణామ విధేయ మవుతుంది. కాబట్టి, శైలి భాషా సంబంధిగా క్రొత్తదిగా ఉండవచ్చుకాని, దాని ప్రధాన స్థితి భాషా వ్యక్తిత్వాల మీద ఆధార పడి వుంటుంది.

భాష నిరంతరం ప్రయోగ విధేయంగా వుంటుంది. ప్రతి భాష స్వయం వ్యక్తిత్వ పూరితమయి, పరిణామ సిద్ధమై, వ్యాకోచాత్మకమై, సజీవ జాత్యాలోచనతో సాంఘికంగా మారుతూ వుంటుంది. భాషాంతర్గతంగా ప్రవ హించే శైలి, భాషా పుష్పంలో పరిమళమైన శైలి, అంతర దృష్టికి గోచరిస్తుంది. అనుభూతి కంపుతుంది కాని, పూర్తి స్ఫూర్తితో ఎదుట నిల్వదు, చేతి కందదు,

## 3.2. శైలి వ్యక్తిత్వం

జీవితానేక రంగాలలో లాగా సాహిత్యంలోనూ వ్యక్తిత్వం ప్రముఖ పాత్ర వహిస్తుంది. సాంఘికంగా ఏ రంగంలో అయినా మనిషి తన వ్యక్తిత్వం చేత ప్రభావితం చేసినట్లు, రచనను వ్యక్తిత్వ ముద్రచేత కాంతిమతంగా, రచయిత వెలిగిస్తాడు. రచయిత వ్యక్తిత్వం భాషకు క్రొత్త అర్థం, క్రొత్త రూపం, క్రొత్త పథం కలిగించటంతోపాటు పాత అర్థం, పాత రూపం, పాత పథం వెలిగిస్తుంది.

ఒక విషయాన్ని గూర్చి ఒక కాలంలో వాళ్ళు, తుల్య ధర్మాలు ఉన్న వాళ్ళు, ఇద్దరు ఒక భాషలో వ్యక్తీకరించిన రెండు భావాలలో, ఒకటి బాగుందన్నా, శైలి బాగుందన్నా, ఒక రచయిత వ్యక్తిత్వం ఆ రచనలో స్ఫుటంగా ఉందని అర్థం. రచనాధిక్యం రచయిత వ్యక్తిత్వాధిక్యం మీద ఆధారపడి వుంటుంది. రచనలోని శైలి అంటే, రచయిత వ్యక్తిత్వం అనే అర్థం. వ్యక్తిత్వం అంటే వ్యక్తి తత్త్వమనేకాని వ్యక్తి వైశిష్ట్యమని కాదు. వ్యక్తి తత్త్వం విశిష్టంగా వుంటే వుండవచ్చు. అది సాహితీరూపం వెలిగిస్తే వెలిగించనూ వచ్చు.

సామాజికంగా రచయిత వ్యక్తిత్వం ఏ ధోరణి కలిగి వుంటుందో, సాధారణంగా ఆ తీరు శైలిలో గోచరమవుతుంది. వేగం జీవిత ధర్మమయిన రచయిత శైలిలో, వేగం ఉండే అవకాశం ఎక్కువ. ఏది రచయిత జీవితాన్ని నడిపించే లక్ష్యమో, అది శైలిలో తప్పని సరిగా వుంటుంది. సాంఘిక సమానత వాంఛించే రచయిత అసమానత చూపటం జరగదు.

రచయితే శైలి, శైలే రచయిత, అంటే రచయిత వ్యక్తిత్వమే శైలి, శైలే రచయిత వ్యక్తిత్వం అని అర్థం. అయితే సాంఘికం, ఆలంకారికం అయిన ధోరణులతో, శైలి పునాదులు పునః ప్రతిష్ఠితం జేసి, నూటికో కోటికో ఒక్కళ్ళో ఇద్దరో పూర్తి వ్యక్తిత్వం దర్శించే శైలితో సాహిత్యం సృష్టించ గలుగుతారు. వాళ్ళే సాహిత్య చరిత్రలో చిరంజీవు లవుతారు.

అయితే శాస్త్ర చరిత్రాది రచనల్లో రచయిత వ్యక్తిత్వావశ్యకం ఏముందనిపించవచ్చు. శాస్త్ర, చరిత్రలు పఠనయోగ్యంగా రూపొందినప్పుడు, గహనంగా వున్న విషయాలు స్పష్టంగా ఏర్పడినప్పుడు, అక్రమంగా ఉన్న

సంగతులు క్రమంగా తయారయినప్పుడు, రచయిత వ్యక్తిత్వం-శైలి రచనలో ప్రవేశించాయి.

"Your historian, for instance, with absolutely truths intention amid the multitude of facts presented to him must need select and in selecting assert something of his own humour, something that comes not of the world without but a vision within." (4)

రచయిత వెలువరించే లోక ధర్మం, అమృతం లాగా ఆ రచయిత అనే పాలసముద్రంలో మథింపబడి వెలువడటం వల్ల, రచయిత వ్యక్తిత్వం, లోక ధర్మాన్ని కాంతిమంతంజేసి పూర్వంకంటే క్రొత్తగా రూపొందిస్తుంది.

ఒక రచనలోని విషయం సూటిగా గుండెకో బుద్ధికో తాకిందంటే రచయిత అనుభూతో, ఆలోచనో విస్పష్టంగా శైలిగతంగా ప్రతిఫలిస్తూ ఉందని అర్థం. శైలి ఆత్మ భంగిమ. ఎవరికయినా స్పష్టంగా క్లుప్తంగా వ్రాయటం నేర్పవచ్చు. విషయ విభజనం వాక్య నిర్మాణం క్రమం బోధింపవచ్చు. ఏ రచనలో అయినా భావ వ్యక్తీకరణలో బలహీనత, ఆలోచనా రీతిలో అక్రమత కొంతవరకు తొలగింపవచ్చు. అయితే ఆ రచయిత వ్యక్తిత్వమే ఆ రచనలోకి మరొకరు తేవటం అసాధ్యం!

శైలికి పునాది వ్యక్తిత్వం. "Literary style is simply a means by which one personality moves others" (5) అది రచయితను పాఠకుణ్ణి దగ్గరకు తెస్తుంది. ఉత్తమ శైలికి ఉత్తమ శీలం అవసరమనిపించే అవకాశం వుంది. సాహిత్య విషయంలో మోసం చేసే మనిషి శైలిలో అంతా ధర్మమే వుండదు. అనేక పదాలు పఠనయోగ్యంగా వ్రాసి, ఏ విషయమూ తెలపని రచయిత, మసిపూసి మారేడుకాయను చేస్తున్న ధోరణి తెలుస్తుంది. రచయిత శైలి లోంచి రచయిత వ్యక్తిత్వం చూడవచ్చు. "'There is no vice, however unconscious no virtue, however shy, no touch of meanness or of generosity in in your character, that will not pass on to the paper." (6)

రచయిత వ్యక్తిత్వంలోని మంచి చెడ్డలు అతని శైలిలో అంతర్భూతాలవుతాయి. "Therefore, if you wish your writing to seem good, your character must seem at least partly so. And since in the long run deception is likely to be found out, your character had better not only seem good, but be it." (7)

ఉత్తమ శీలం ఉత్తమ శైలికి అవసరం అన్న భావం గోచరమవుతుంది. "Naturally no fineness of character is likely to make an ungifted man write well." (8)

ఉత్తమ శీలం ఉన్నప్పటికీ రచనాసిద్ధి లేని వాణ్ణి బాగా వ్రాసే వాణ్ణిగా రూపొందించటం కుదరదు. ఉత్తమ శీలవంతుడు రచయిత అయితే ఉత్తమ శైలీయుతుడుగా ఉండవచ్చు. కాని, ఉత్తమ శీలం లేని వాడి రచన ఉత్తమ శైలీ సముచితం కాదని నిర్ణయింపవలసివుండటం న్యాయం కాదు, ఉచితం కాదు. ప్రాథమికంగా రచనా గుణాలు శీలం మీద ఆధారపడిలేవు. రచనకు సంబంధం లేని శీలంలో రచనాంతర్వాహిని అయిన శైలి సంబంధించి వున్నట్లుగా భావించటం సహజం కాదు. సాంఘికావసరాల వల్ల, బాహిరంగా, శారీరకంగా, శీలరహితంగా ఉండే వ్యక్తి అంతరంగా మానసికంగా శీల సంపూర్ణంగా ఉండవచ్చు. శీలం కోల్పోయిన వ్యక్తి ఆ అనుభవాల గుణ పాఠంతో ఉత్తమ శీలవంతుడు కావచ్చు. శీలం ఒక విషయికంగా పోగొట్టుకొంటున్న వ్యక్తి అనేక రంగాలలో అత్యుత్తమ శీలం ప్రకటింపవచ్చు. శీలం ఉండటం లేకపోవటం ప్రధానం కాదు. శీలం లేనివాళ్ళుగా భావింపబడే రచయితలనేకులు ఉత్తమ శైలీ విలసితాలయిన రచనలు సృష్టించటం ప్రపంచ సాహిత్యానికి అవగత పూర్వమే! అందువల్ల శీలం శైలి పరస్పరం ఆధారం ఆధేయం కావు. ఈ దృష్టి ఆధునికం కాదు. అనుక్షణం మారుతున్న సంఘంలో, మనిషికీ మనిషికీ మధ్య సంబంధం-దాని రూపం మారిపోతూ వుంది. శీలం అనేక ధర్మ సంచయం..అది ఇదమిత్థంగా తేల్చటానికి, దానిమీద ఆధారపడి నిర్ణయించటానికి వీలుకాదు. పొరపాటు జరక్కుండా శీలాన్ని నిర్వచించటం అసాధ్యం కాబట్టి, దాని మీద నిర్ణయింపబడే శైలి సుస్థిరమైన పునాది మీద నిలబడిందిగా ఉండదు. కాబట్టి శైలికి

రచయిత శీలంతో నిమిత్తం లేదని గ్రహించాలి. సాధారణంగామంచి చెడ్డలతో నిండి, ఉచితంగా అనుచితంగా భావింపబడుతూ లోకంచేత గుర్తింపబడ్డ శీలం సాంఘికమయింది. ఈ ద్వంద్వాలతో సంబంధం లేకుండా ఏ కార్యం చేసినా, స్పష్టంగా, నిశితంగా, తీక్షణంగా, లోతుగా పరిశీలించే మనస్తత్వం మూలంగా చూడదగ్గ శీలం ఒకటి ఉందని గుర్తిస్తే అది మానసికమయింది. ఈ దృష్టితో రచనాంతర్గత శైలి సాంఘిక శీలం మీద ఎక్కువగా ఆధారపడి వుంది. సాహిత్యంలో ప్రత్యక్షమయ్యేది మానసిక శీలం. అది సారస్వత శీలం సాంఘిక శీలం జీవిత సంబంధి. మానసిక శీలం సాహిత్య సంబంధి. సాంఘిక శీలానికి మానసిక శీలంతో ముడిపెట్టటం ధర్మంకాదు.

వ్యక్తిత్వం భాష మీద అధికారం చూపితే శైలి ఉత్తమం అవుతుంది. అది భాషకు విధేయమయితే శైలి లోపిస్తుంది. రచన నీరసమవుతుంది. భాష, వ్యక్తిత్వం రెండు శైలి రథానికి జోడు గుర్రాలు. ఏది బలహీనమయినా రథం కదలదు. భాషా వ్యక్తిత్వాలవల్ల అవతరించే శైలి స్వభావ స్వరూపాలు దర్శింపవచ్చు.

## 1.4. శైలీ వైవిధ్యం

మానవులలో వైవిధ్యం ఉన్నా, మానవత్వం ఒక్కటే అయినట్లు, రచయితలనేకులయినా శైలి ఒక్కటే. ఒక్కొక్క మనిషిది ఒక్కొక్క ప్రత్యేక మానవతా దృష్టి అయినట్లు, ఒక్కొక్క రచయితది ఒక్కొక్క ప్రత్యేక శైలి. కాని ఇది అందులో అంతర్భాగమే. వేరు కాదు. ఒక్క భాషలో భిన్న రచనా ధోరణులు ఉన్నా, భిన్న ప్రాంతాలలో భిన్న భాషలు ప్రవర్తిల్లినా, ఈ భాషా రచనాంతర్గతంగా ఉన్న శైలి ఒక్కటే! భిన్న ప్రక్రియలు భిన్న రచయితలు చేత వ్రాయబడ్డా, భిన్న భాషా ప్రాంతాల రచయితలు భిన్న భాషల్లో వ్రాసినా అభివ్యక్తమయ్యే వ్యక్తిత్వం రూపొందించే శైలి ఒక్కటే! ఏ భాష అయినా భావ ప్రకటన విధేయం, ఏ వ్యక్తిత్వం అయినా సారస్వతంలో భాషకు ప్రాణం. భావ ప్రకటనం కోరే భాషకు ప్రాణ ప్రతిష్ఠ చేసే రచయిత వ్యక్తిత్వం భాషను మిక్కిలి ప్రయోజనకరంగా రూపొందించ టంలో శైలి ఉజ్జ్వల మవుతుంది. భాష ప్రాథమిక ధర్మం, వ్యక్తిత్వపు ప్రధానాభివ్యక్తి, ఏ భాషకు, ఏ మనిషికి అయినా స్థూలంగా సమానమే కాబట్టి, ఏ

భాషలో నయినా, ఏ రచయితలో నయినా అభివ్యక్తమయ్యే శైలి సహజంగా ఒక్కటే!

కానీ ఆంగ్ల సారస్వతంలో, ఇంకా పూర్వం అరిస్టోటిల్, సెనెకా శైలి ఉపన్యాస శైలిగా భావించటం, ఆ పైన రచనా శైలిగా భావించటం ఉంది. దీని వల్ల వాక్ సంబంధి శైలి, రచనా సంబంధి శైలి అని శైలీ ద్వైవిధ్యం ఏర్పడుతుంది. ఈ వైవిధ్యం పైపైదే కాని లోతుల్లోది కాదు. భాషా వ్యక్తిత్వాల చైతన్యం అయిన శైలి వాక్ రూపం పొందినా, వ్రాత రూపం పొందినా అభివ్యక్తమవటమే ఆంతర్యంకాని తదన్యం కాదు. కాబట్టి శైలి వాక్కుగా వ్రాతగా రూపొందిందిగాని, ఆ ద్వైవిధ్యం పొందలేదు. ఉపన్యాస ధోరణిలో భాష పొందే పరిణామం నిర్మాణం, వ్యక్తిత్వంపొందే మార్పు విధానం; రచనా ధోరణిలో భాషా పరిణామ నిర్మాణాలు, వ్యక్తిత్వపు మార్పు విధానాలు; సూక్ష్మంగా అల్పవైవిధ్యం కలిగివున్నా స్థూలంగా తేడాలు లేనివే అవుతాయి. అందువల్ల వాక్కు, వ్రాత అభివ్యక్తి ధోరణులు కాని, భిన్న శైలీ ప్రదర్శకాలు కావు. ఈ ద్వివిధాభివ్యక్తికి ఆత్మ అయిన శైలి ఒక్కటే!

ప్రపంచ సారస్వతంలో ప్రధానంగా పద్య శైలి గద్య శైలి అని, వచనం ఆవిర్భవించిన నాటినుంచి పిలవటం సాధారణమయింది. పద్యం గద్యం భిన్నంగా చూపించే ప్రధాన లక్షణం ఛందస్సు ఒక్కటే అనుకొంటే ఛందస్సు భాషను కొంతవరకు, కవి వ్యక్తిత్వాన్ని అత్యల్పంగా తన కనుకూలంగా మలచుకొంటుంది. ఆ ధర్మం కొంతలో కొంత వచనం కూడా నిర్వహిస్తుంది. కాబట్టి ఛందస్సంబంధి విభిన్నత్వం మినహాయిస్తే స్థూలంగా గద్య పద్యాలకు తేడా లేదనవచ్చు. గద్యమయినా పద్యమయినా, భాషా వ్యక్తిత్వాల కన్న బిడ్డలే! రెండింటిలో ఉన్న ప్రాథమిక ధర్మాలు తుల్యాలే! అందువల్ల గద్య పద్య శైలులు విభిన్నం కాదు. వాటి రచనా రీతులు వేరైనా, అంతర శైలి ఒక్కటే!

ఆధునికాంధ్ర సారస్వతంలో గ్రాంథిక శైలి వ్యావహారిక శైలి అని రెండు మాటలు విన బడుతున్నాయి, కనపడుతున్నాయి. అంటే గ్రంథస్థమైన భాషలో వ్రాయబడే ధోరణి, సమాజ వ్యవహారంలో ఉన్న భాషలో వ్రాయబడే ధోరణి-ఈ పదాలు తెలుపుతున్నాయి అని అర్థం. శైలిని ఈ విధంగా విభజించటం సరయిన ప్రాతిపదిక మీద నిర్వహించిన కార్యంగా కనిపించదు.

శైలీ వైవిధ్యంలో ఉండే రచయిత వ్యక్తిత్వంలో మార్పులేదు. ఒకనాడు స్థిరమయిన భాషలో వ్రాసింది, గ్రాంథిక శైలీ అనీ, నేడు స్థిరమవుతున్న భాషలో వ్రాసింది వ్యావహారిక శైలి అనీ, వేరుచేసి, శైలీభిన్నత ఆలోచించటం ఉచితం కాదు. భాష పూర్వాపరాలు స్వీకరించి వ్రాసినందువల్ల భాషా వ్యక్తిత్వాలు ప్రధానమైన శైలిలో వైవిధ్యం చెప్పే వీలులేదు. గ్రాంథిక శైలి, వ్యావహారిక శైలి అనేవి రచనావకాశాలు కాని శైలులు కావు. శైలి ఒక్కటే!

విమర్శన శైలి, శాస్త్రశైలి, నాటకీయ శైలి, నాటక శైలి, కథా కథన శైలి, వర్ణనాత్మక శైలి, నవలా శైలి, పురుష శైలి, స్త్రీ శైలి, ప్రబంధ శైలి, ''ఉత్తరముల శైలియు, నుపన్యాస శైలియు, వ్యాస శైలియు, కావ్య శైలియు, పురాణ శైలియు'' (9) అని భిన్నరీతులుగా శైలి గోచరమవుతూ వుంది. పైన పేర్కొన్న భిన్న శైలులుగా చెప్పబడేవి నిజంగా భిన్నంగా భావించే అవకాశం తక్కువ. ఏ విధంగా వ్రాసినా రచయిత వ్యక్తిత్వం, భాష, ఈ రెండు ప్రధానంగా గోచరమవుతాయి. విమర్శన శైలి, శాస్త్ర శైలి అనే వాటిలో అది పదాల ప్రాధాన్యంతో వ్రాయబడ్డ రచనా విశేషాన్ని శైలి చేర్చి పిలవటం పలకటం అయింది. కాని, ఔచిత్యం అవుతుందనుకో నక్కరలేదు. విమర్శన శైలి అంటే విమర్శనం వ్రాసిన భాష అని మాత్రమే అర్థం. కాబట్టి రచనా విశేషాలు ఎన్నయినా ఉండవచ్చు కాని, శైలి ఒక్కటే!

''అలెగ్జాండర్ పోప్ శైలి, కీట్స్ శైలి, భట్టుమూర్తి శైలి, నేటి స్వచ్ఛంద శైలి'' (10) అని రచయిత, కవి సంబంధి శైలిగా ఆలోచించే తీరు గోచరమవుతుంది. రచయిత, కవుల వ్యక్తిత్వం మనుష్యులందరి వ్యక్తిత్వాలాగా భిన్నంగా వుంటుంది. భిన్న వ్యక్తిత్వం ఉన్న రచయితలు కవులు వ్రాసిన రచన భిన్న భాషలో, భిన్న మార్గంలో గోచరమవుతూ వుంటుంది. రచన చూచి, రచయితను కవినీ పోల్చుకోగలిగినంత విభిన్నంగా, విశిష్టంగా, విస్పష్టంగా రచన వుంటుంది ఆ శైలి ఆ రచయితకే పరిమితమవుతుంది. అటువంటి శైలి మరెవరయినా అనుకరింపవచ్చు గానీ, అదే విధమైన రచనను మరెవరూ వ్రాయలేరు. ఒక రచయిత శైలి ఆ రచయితకే పరిమితం. మనుష్యులందరికీ నవ్వు వేరు వేరయినా, తత్త్వం ఒకటే అయినట్లు, వ్యక్తులందరి రచన వేరువేరుగా ఉన్నా శైలి ఒక్కటే! కొన్ని ధర్మాలు స్పష్టంగా కనిపించినప్పుడు అది ఆ వ్యక్తి శైలి అంటే

ఆయా ధర్మాలు గల రచనమూ వ్యక్తి సృష్టి అనే అర్థం. వ్యక్తి కొక రచనా రీతి సహజం కాని, శైలి సహజం కాదు. వ్యక్తిత్వం శైలికి ప్రాణమన్నమాట సత్యం. భిన్న వ్యక్తిత్వాలు శైలిని సుసంపన్నం చేస్తాయి. శైలి వ్యక్తి సొత్తుకాదు. సమష్టి శక్తి. వ్యక్తిత్వం వ్యక్తులందరికీ సంబంధించింది. భాష అందరి సొత్తు. భాషా వ్యక్తిత్వాలు వ్యష్టిగా కాక, సమష్టిగా వర్తించే ధర్మ సహితాలు. అందువల్ల సూక్ష్మంగా కొంత పరిమిత పరిధి వరకు వ్యక్తి నిష్ఠంగా శైలి భావించినా స్థూలంగా విస్తృత పరిధిలో శైలి ఒక్కటే!

"Suppose that a certain John Smith has just died. His son, writing a few days later to one of his friends, might say-

(1) My beloved parent has joined the heavenly choir.

or

(2) My father has passed away.

or

(3) My father has died.

or

(4) My old man has kicked the bucket.

Each of these statements communicate the same fact; that John Smith has died. But the words which express the fact are different in each case. The matter is the same, but the manner has changed. In other words, each sentence is written in a different style. The style of (1) is pompous and sententious; it clearly tries to raise the matter to a high-falutin, would-be literary, dignity. (2) is simpler but still emotional, perhaps little substitutes a soften, gentler, less unpleasant expression. (3) is a plain, brief, statement in

which the writer's feelings are not directly indicated. (4) employs a slangy, colloguial style, 'old man' for father and 'kicked the bucket' for died. We might say that his style suggests a lack of respect for his father." (11)

శైలి సాహిత్య సంబంధిగా, ఆవేశభరితంగా, స్వచ్ఛంగా, వ్యావహారికంగా పేర్కొనబడింది. రచనా రీతి అనవలసినచోట శైలి అన్నాడు. ఒక విషయం నాలుగు విధాలుగా వ్రాయబడింది అనటం నాలుగు శైలులు అనటం కన్న సముచితం. నాలుగు రచనారీతులున్నాయి. కాని శైలి ఒక్కటే !

శైలీ వైవిధ్యం, పైన పేర్కొనబడ్డట్టుగా, ఉందనుకోవటంలోని ఔచిత్యం పరిశీలనార్హం. కించిన్మాత్రంగా నయినా తేడా గోచరమయితే, విభిన్నంగా విషయం విభజించుకోవటంలో సౌకర్యం గుర్తించే విమర్శకులు శైలి వివిధంగా ఉందనుకోవటం సమంజసంగానే తలపోశారు. శైలీ వైవిధ్యం భావించారు.

అయితే రచయిత వ్యక్తిత్వం ఉన్నా, లేకపోయినా, రచయిత వ్యక్తిత్వ ముద్రితంగా భాష ఉన్నా, లేకపోయినా, సృజింపబడ్డ సాహిత్యం అంతటిలో ఏదో విధమయిన శైలి ఉండవచ్చు, కాని, ఉత్తమ శైలి-అదే శైలి-అనుకొనేది అలభ్యమవుతుంది. ఉత్తరాల శైలి, దస్తావేజుల శైలి అనటం కంటే ఉత్తరాలు వ్రాసే తీరు దస్తావేజులు వ్రాసే తీరు, అనటమే సముచితంగా వుంటుంది.

విస్తృతార్థంలో విశాల పరిధిలో పరికింపబడవలసింది శైలి. సంకుచితంగా పరిమితంగా దర్శింపబడకూడదు. సర్వ వాఙ్మయం సజీవం కావటానికి హేతుభూతమయింది శైలి. అది సారస్వతంలో చైతన్యం. ఆ చైతన్యాన్ని పరిమితంగా దర్శించటం అనుచితం. సామూహిక ధర్మమయిన శైలిని ప్రత్యంగ ధర్మంగా భావించటం దాని ఔన్నత్యాన్ని అపార్థం చేసుకోవటం అవుతుంది. శైలి అస్తిత్వం సాహిత్యంలాగా దాని అనంతత్వంలో నిక్షిప్తమయివుంది. దాన్ని భిన్నంగా వింగడించే ప్రయత్నం, దాన్ని సరిగ్గా అర్థం కాకుండా చేస్తుంది. అందువల్ల శైలులు అనేకం లేవు. ఎన్నో రచనా రీతులున్నా సారస్వత మన్నట్లూ, ఎన్నో ధోరణులున్నా ఒక ప్రక్రియ అన్నట్లూ, రచన విధా

నంలో ఎన్నో తీరులున్నా, దాన్ని శైలి అనటమే సమంజసం. సాహిత్యంలో నిరంతర శైలి ఏకవచనం.

## 2. శైలి-వ్యక్తిత్వ లక్షణాలు

శైలి, రచయిత వ్యక్తిత్వం రూపొందిన భాషా చైతన్యం. ఆ వ్యక్తిత్వం శైలిగా నిరూపించే లక్షణాలు, శైలిని విస్పష్టంగా గ్రహించటానికి దోహదం చేశాయి. ప్రతి రచనకు ఏదో శైలి వుందని అంగీకరిస్తూ, ఉత్తమ శైలినే శైలిగా స్వీకరిస్తున్నట్లే, ఈ క్రింద వివరింపబోయే లక్షణాలు రచనలో ఉత్తమంగా ఉంటే శైలికి ఉత్తమత్వం ఏర్పడుతుందని గ్రహింపవచ్చును.

### 2.1. సంగ్రహత

వ్రాయదలచిన విషయం వీలయినంత సంగ్రహంగా వుండటం వల్ల శైలీ దర్శనం కలుగుతుంది. అతివ్యాప్తి, అవ్యాప్తి లేకుండా, అనవసర పదాలు, వాక్యాలు లేకుండా వ్రాయటం వల్ల రచనకు బిగువు సౌందర్యం రావటంతో పాటు బలం సామర్థ్యం వస్తాయి. సంక్షిప్తంగా వ్రాయటం వల్ల రచనలో వేగం వస్తుంది. సంక్షిప్తత స్పష్టతకు మార్గం ఏర్పరుస్తుంది. క్లుప్తత పాఠకుడికి ఉత్సాహకారకం అవుతుంది.

'భక్తి ముక్తి' అన్న వాక్యం సంగ్రహతకు ఉదాహరణంగా స్వీకరింపవచ్చు. పైన పేర్కొన్న లక్షణాలు దీనికి వర్తిస్తాయనవచ్చు. దీనిలో అతివ్యాప్తి అవ్యాప్తి అనవసర పదాలు లేవు. బిగువుగా వాక్యముంది. స్వరసామ్యం వల్ల వాక్యం సుందరంగా వుంది. ఈ వాక్యంలో విషయం సూటిగా ఉండటంతో బలం ప్రదర్శితమయింది. ఎక్కువ విషయం తక్కువ మాటల్లో తెలపటం వల్ల రచనలో వేగం సాధింపబడింది. క్లుప్తంగా వాక్యముండటం వల్ల వెంటనే స్పష్టంగా అర్థమవుతుంది. భక్తి వుంటే ముక్తి వస్తుంది. భక్తి కలిగి జీవించే ప్రాణి ముక్తి పొందుతుంది అని పాఠకుడు వాక్యంలో బాహిరంగా లేని పదాలు అవగాహనలో జోడించుకొని తను ఆ వాక్యానికి సామర్థ్యం కలిగించిన సంతృప్తి పొందుతాడు.

అందువల్ల శైలి సుందరంగా భావింపబడటానికి అనేక గుణభరితమయిన సంగ్రహత్వం లక్షణంగా వుంటుంది. ఈ సంగ్రహత్వం ఉన్న వాక్యాన్ని

క్లుప్తంగా వ్రాయటంలోనే కాక, ఉన్న విషయాన్ని సంక్షిప్తంగా వ్రాయటంలోనే కాక, కొన్ని విషయాలు వ్రాయకుండా ఉండటంలోనూ వుంది. రచయిత వ్యక్తిత్వం ఏది వ్రాయాలి, ఏది వ్రాయకూడదు నిర్ణయించటంలోనూ, సంక్షిప్తతను సాధిస్తుంది. " A good writer is one who knows also what not to write" (12)

"The artist" says Schiller, "May be known rather by what he omits; and in literature, too, the true artist may be best recognised by his tact of omission." (13)

కనుక రచయిత వ్రాసింది సంక్షిప్తంగా వ్రాయటంతో పాటు, వ్రాయనక్కరలేంది వదలి వేయటం కూడా సంగ్రహత అవుతుంది. "సంగ్రహమనగాఁ జెప్పవలసిన విషయములలోఁ గొన్ని చెప్పి కొన్ని విడిచి కాని, చెప్పిన విషయమునైనను బూర్ణముగ జెప్పక కాని, వ్యాసమును గుఱుచపఱుచుట కాదు" (14) అని పొరపాటుకు అవకాశం లేకుండా హెచ్చరిక గ్రహింపవచ్చు.

ఉదాహరణం : 1. జన బాహుళ్యము జ్ఞానము నందభివృద్ధిని బొందినఁ గాని దేశమభివృద్ధి పొందనేరదు. (కందుకూరి వీరేశలింగం పంతులు - ఉపన్యాసములు - విద్యాధికుల ధర్మములు - పుట 143)

ఈ వాక్యం, ఈ భావం పూర్తిగా తెలుపుతూ ఇంతకంటె క్లుప్తంగా వ్రాయటం కుదురదు కాబట్టి సంక్షిప్తత సాధించిన వాక్యంగా చెప్పవచ్చు.

2. "భాగ్యదేవత పెట్టుకొన్న ముద్దు గాలి కెగిరి పోవును గాని, కొట్టిన లెంపకాయ కాటి వఱకు నిల్చును." (పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు - సాక్షి II - విచిత్ర స్వప్నము - పుట 41)

ఈ వాక్యంలో సంక్షిప్తత ప్రధానంగా ముద్దు లెంపకాయల వల్ల సాధితమయింది. ముద్దు అంటే అనుకూలమైన అనేక విషయాలు. అలాగే లెంపకాయ అంటే ప్రతికూలమయిన బహు విషయాలు. ఈ ఆ విషయాలు ఏకరువు

పెట్టకుండా వుండటం వల్ల ఈ రెండు పదాలతో ఈ సంక్షిప్తత ఈ వాక్యంలో సాధిత మయింది.

3. "ఈ గ్రంథ ముద్రణోద్దేశములు రెండు. పితృభక్తి చెల్లించుట, బంధువులకు నర్పించుట." (కట్టమంచి రామలింగారెడ్డి-వ్యాసమంజరి-శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి కృతులు - పు. 96).

ఏ సాధారణ రచయిత అయినా ఒకటి పితృభక్తి చెల్లించుట, రెండు బంధువులకు నర్పించుట అని వ్రాయవచ్చు. అయితే ఆ రెండు పదాలు పరిహరించటమే కాదు, మరిక్లుప్తంగా వ్రాసే అవకాశం లేకుండా పై వాక్య నిర్మాణం వుంది.

4. "అల్పత్వమునకు రసికుల బ్రతుకులో చోటులేదు." (శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ - సారస్వత లోకము - రాయలనాటి రసికత - పుట. 27)

సూత్రప్రాయంగా ఉన్న ఈ వాక్యం అల్పాక్షరాలలో అనల్పార్థ బోధకం.

5. యుద్ధం పత్రికల కడుపు పంట (శ్రీ శ్రీశ్రీ - శ్రీశ్రీ సాహిత్యం రెండు పు. 574)

యుద్ధ వార్తల వల్ల పత్రికలు పుటలెక్కువయి లావు అవుతాయి. కడుపుతున్న స్త్రీ లావు అవుతుంది. పత్రికలకు వార్తలు బాగా లభించి యజమానులు సంతోషిస్తారు. గర్భవతికి పరిచర్యలు చేసినట్లు, జనం, యుద్ధ వార్త పత్రికలను పరామర్శ చేస్తారు. బహు విషయం ఈ చిన్న వాక్యంలో క్లుప్తంగా తెలుపబడింది.

## 2.2. స్పష్టత

అస్పష్ట భావ ప్రకటనం, అసలు భావ ప్రకటనం చేయకుండా ఉండటం కన్నా, ప్రమాదకరం. పదానికున్న ప్రాతిపదికార్థం కాని, ప్రయుక్తార్థం కానీ సరిగా గుర్తించక పోవటం వల్ల, అజాగ్రత కాని, నిర్మాణ ధర్మావగాహన రాహిత్యం కాని కారణంగా వాక్యం వ్రాయటం వల్ల, ఒక భావాన్ని, భావ సముదాయాలతో ఒక్కచోట చేర్చటం వల్ల, ఏ విషయమూ పూర్తిగా చెప్పకుండా బహు సంగతులు ఒక్కసారిగా చెప్పటం వల్ల అస్పష్టత ఏర్పడవచ్చు.

అంతేకాక, గొప్పగా వ్రాయాలనుకోవటం వల్ల, శాబ్దికంగా, అలంకారికంగా ఉండాలి రచన, అని భావించటం వల్ల, విపరీతంగా స్పష్టత ఉండాలను కోవటం వల్ల, అస్పష్టత కలుగుతుంది. న్యాయాలయాల తీర్పులు, ప్రభుత్వ చట్టాలు ఒక్కొక్కప్పుడు అందుకు నిదర్శనంగా ఉంటాయి. అసమర్థత అత్యాశ రచనలో స్పష్టత పోగొట్టవచ్చు. కాబట్టి స్పష్టంగా వ్రాయటంలో, వ్యక్తిత్వ లక్షణంగా శైలి నిబిడమయి వుంటుంది.

అర్థం అగోచరంగా ఉన్న పాతిక పదాల కంటే అర్థస్పష్టంగా ఉన్న పది పదాలు ప్రయోగించుకోవటం వల్ల, శాబ్దికంగా ఉండాలని కొండవీటి చేంతాడులాగా పొడవైన వాక్యం కాక, కురచ వాక్యాలు వ్రాయటం వల్ల, ఒక్క అభిప్రాయం పూర్వపరాలు అనుసంధిస్తూ ఒక్కచోట వ్రాయటంవల్ల, ఒక విషయం ప్రస్తావించేటప్పుడు అన్య విషయం స్పృశింపకుండా ఉండటంవల్ల, అలంకారికంగా శాబ్దికంగా కాకుండా అతి సామాన్యంగా సహజంగా రచన ఉండేటట్లు చూచుకోవటంవల్ల, స్పష్టత సాధింపబడుతుంది. అస్పష్టమయిన నూరు గొప్ప సంగతులకంటే, స్పష్టమయిన ఒక్క మంచి సంగతి రచయితకు, పాఠకుడికి శ్రేయస్కరం.

సున్నితంగా చెప్పాలనుకోవటం ఒక్కొక్కప్పుడు అస్పష్టతకు కారణమవుతుంది.

"But there is one particular weakness in writing that I want to call your attention to in this section, the habit of using euphemisms instead of plain words." (15)

ప్రియం చెప్పు, సత్యం చెప్పు, సత్యమైన అప్రియం చెప్పకు అనే సంప్రదాయంలో అనిష్ట సంగతులు సున్నితంగా చెప్పటమే సిద్ధమయివుంది.

1. ఇచ్చట పరిశుభ్రముగా వుంచుము.

2. ఇచ్చట ఉమ్మి వేయరాదు.

ఈ రెండు ఒకే అర్థం బోధించటానికి ఉద్దిష్టాలై గోచరమవుతాయి. మొదటిది అనుకూలంగానూ, రెండవది ప్రతికూలంగానూ ఉన్నట్లు కనిపిస్తాయి. ఆద్య వాక్యం సున్నితంగా, అనంతర వాక్యం కఠినంగా ఉన్నట్లు గోచరమయినా

చెప్పాలనుకొంది ఒక్కటే! స్పష్టత దృష్టితో పరికిస్తే రెండవది శ్రేష్ఠం. ఇచ్చట పరోక్షముగా వుంచుము అన్నప్పుడు ఉమ్మి వేయకు అనే అర్థంకంటే, తుడువు, కడుగు, దులుపు అని స్ఫురించి చేయకూడంది గుర్తుకురాక చేయవలసింది ఆలోచింపవలసి వచ్చి, ఊహించిన దానికి భిన్నంగా అది అభిప్రాయం కలిగించే ప్రమాదముంది. చేయరానిది గుర్తుకు తెచ్చినా చేయరానివి అనేకం గుర్తుకు రావటానికి అవకాశం ఉంది. అందుకే ఇందులో స్పష్టత లేదు. జీవితంలో లాగా, సాహిత్యంలో స్పష్టత అతి ప్రధానం, అవసరం అయిన లక్షణం. స్పష్టత క్లుప్తత శైలిని నిలిపే ప్రధాన స్తంభాలు. రచయిత వ్యక్తిత్వం రూపొందించే ఈ లక్షణాలు శైలికి అస్తిత్వం ప్రసాదిస్తాయి.

*ఉదాహరణం* : 1. ''ఏ గ్రంథమైనా చదువుకునే వారికి సులభముగా నున్న త్వరితముగానున్న సందేహములు లేకుండా నున్న బోధపడే లాగున ఉండవలసినది ఆవశ్యకమై యున్నది.'' (స్వామినీన ముద్దు నారసింహనాయుడు - హితసూచని - విద్యా ప్రమేయము. పుట 9) స్పష్టత కాంక్షించే ఈ రచనా భాగం స్పష్టంగా వుంది.

2. ''యజ్ఞంబులలోఁ బశు యాగములు పశుహింసా రూపంబులు గాన నవి యధర్మా పర్యవసితములగు నని కొందఱంద్రు. అది న్యాయముగాదు. అవి పశువులకుం దత్కాలమున హింసారూపంబు లట్లు కానవచ్చిన ఉత్తర జన్మంబులు నుత్తర లోకములు నొసంగు గాన వైద్యుడు సేయు శస్త్ర సాధన ముల వలె శుభోదర్కములు గాన నధర్మకరములు గావు - అందుకు బదులుగా ధర్మంబులే యగును.'' (పరవస్తు వేంకటా రంగాచార్యులు- కర్మ సంగ్రహము - పుటలు 5,6)

చివరి వాక్యంలో ''అందుకు బదులు'' తొలగించినా విషయం వ్యక్తమవు తుంది కాని, దానివల్ల కూడా స్పష్టతే చేకూరింది. ఆ విషయం అందరూ అంగీకరింపలేక పోవచ్చు కానీ అది స్పష్టంగా ఉందనటంలో ఎవరికీ ఇబ్బంది లేదు.

3. ''అజ్ఞాన మెక్కుడగా నున్న కాలములో స్వప్రయోజన పరత్వమును భీతియు హెచ్చుగా నుండక తప్పవు.'' (కందుకూరి వీరేశలింగం పంతులు - ఈశ్వరోపాసనము-పుట 81) ఇందులో అర్థ స్పష్టత వుంది. అపార్థ స్ఫూర్తి లేదు.

4. ''కావున భాషల సంబంధ బాంధవ్యమును నిర్ణయించుటలో పదముల సారూప్యము కంటెఁ గూడ వ్యాకరణాంశముల యందలి పోలికయే యుత్తమ సాధనమని తేలుచున్నది.'' (కోరాడ రామకృష్ణయ్య-భాషోత్పత్తి క్రమము-భాషా చరితము-పుట 50)

5. ''ఈ కథ యందెంత సత్యమున్నదో తెలియదు. తెనుగున రంగనాథ రామాయణ మను నొక ద్విపద రామాయణము కలదు. తద్రచయిత రంగనాథుడు కాడు. కోన బుద్ధరాజను క్షత్రియుడా గ్రంథమును రచించినట్లు అందు చెప్పబడియున్నది.'' (డా. నేలటూరి వేంకట రమణయ్య - వాఙ్మయ వ్యాస మంజరి-భాస్కర రామాయణ సమస్య-పుట 223)

సాహిత్యంలో స్పష్టత రచయిత వ్యక్తిత్వ ధర్మం.

## 2. 3. నిరాడంబరత

ప్రాబంధికంగా శాబ్దికంగా వ్రాయటం, ఏ సారస్వతంలో అయినా, ఒక కాలంలో సామాన్య లక్షణంగా ఉండవచ్చు. అయితే ఆధునిక యుగంలో అతి సామాన్యంగా మిక్కిలి సహజంగా భాషను రూపొందించటం భావ్యంగా వుంది. జీవితంలోనూ, సాహిత్యంలోనూ ఆడంబరత అవశ్యం పరిహార్యంగా వుంది.

ఆడబరత, ఒక్క పదంతో సరిపోయే చోట నాలుగు పదాలు పలకటం, ఒక్క వాక్యంతో ముగిసే చోట నాలుగు వాక్యాలు వ్రాయటంలో గోచరమవుతుంది. ఒక సామాన్య పదం ప్రయోగిస్తే అర్థం స్పష్ట మయ్యే చోట ఒక కఠిన పదం ప్రయోగించటంలో ద్యోతకమవుతుంది; శబ్దాలంకారం అభివ్యక్తికి అందంగా వుందని విపరీతంగా వాడుకోవటంలో తెలుస్తుంది; భాష అధికంగా చిన్న భావం చుట్టూ-గుది గుచ్చటంలో అర్థమవుతుంది. నిరాడంబరత స్పష్టతకు ప్రధానాంగం,

దృష్టి పథంలో తిరిగే పాఠకుల్ని మెప్పించే ఉద్దేశ్యంతో భాషను రూపొందించే తీరులోనూ, భావాలను భాషను చిత్రిక పట్టి రంజనం చేసే ధోరణిలోనూ, మాట్లాడినట్లుగా వ్రాయాలన్న తొందరలోనూ, ఆడంబరత ప్రవేశిస్తుంది.

ఇది వాంఛనీయం కాదు. పై పెచ్చు పరిహార్యం. "వ్యాసములందు వాగాడంబరము సమ్మతముగాదు. క్లిష్ట పదంబులను దీర్ఘ సమాసంబులను గూర్చుట తగదు." (16) "Proper words in proper places, said Swift, 'makes the true definition of style' (17)" అంటే పదాడంబరం తొలగించి తీరాలని తెలుస్తుంది.

1. రాము ఆనందించాడు.

2. రాముడమందానంద కందళిత హృదయారవిందు డయ్యాడు.

ఈ రెండింటిలో మొదటిది సామాన్యంగా రెండవది ఆడంబరంగా వుంది. మొదటిది ఉన్నంత నిరాడంబరంగా వ్రాయటం శైలీ ధర్మం.

*ఉదాహరణం :* 1. "భోగము దాని చెఱువని దాని పేరు. దాని నుండి సాగింపబడు పాఱుదల వల్లనే మాకు జీవనము." (కట్టమంచి రామలింగారెడ్డి-వ్యాస మంజరి- శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి కృతులు-పు. 91)

భోగము. దాని చెఱువు-దాని నుండి సాగింపబడు పాఱుదల-మాకు జీవనము. మూడు అపార్థాల అవకాశం వుంది. ఉన్నా చింతలేదన్న ధోరణి వాక్యగతంగా వ్యక్తమవుతుంది. ఇది మానసిక నిరాడంబరతకు ప్రబల నిదర్శనం.

2. "ఉపేక్ష యొకటి త్రోసివేసిన దక్షత తనంత వచ్చును."(శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ - సారస్వతాలోకము-రాయల వైదుష్యము-పుట 83)

మనిషి దక్షత సాధించడానికి ఉపేక్ష అవశ్యం పరిత్యజించాలన్న సార్వకాలిక సత్యం మిక్కిలి మామూలుగా, సామాన్యముగా తెలపటంతో నిరాడంబరంగా గోచరమయింది.

3. ''పూర్వకవుల పోకడలు మన భావ కవులకు గిట్టవు. వీరి పద్ధతి రాబోవు తరము వారికి రుచించునేమో చెప్పుటకు వీలుకాదు.''(డా. నేలటూరు వేంకటరమణయ్య-వాఙ్మయ వ్యాసమంజరి-బైచరాజు వేంకటనాథుడు-పుట 165)

రుచించదు అన్న విషయం చెప్పడానికి తొందరపాటు లేకుండా సున్నితంగా, నిరాడంబరంగా చెప్పబడింది.

4. ప్రపంచమంతా హారతి పట్టినా నేను టాగూరును కవిగా అంగీకరించలేను. (శ్రీ శ్రీశ్రీ సాహిత్యం రెండు-పుట 420)

లోకం కోసం, తను కవి కాదనుకొన్న వ్యక్తిని కవిగా అనుకోలేక పోయిన స్థితిలో వ్యక్తమయిన వాక్యం జీవితంలో లాగా రచనలోనూ నిరాడంబరంగా వుంది.

## 2.4. ఉదాత్తత

పాఠకుడు ఏమీ తెలియని వాడని, ఆ విషయ సంబంధి సర్వ సంగతులు ఏకరువు పెట్టడం, అతడికి అన్నీ తెలుసునని ఏ విషయమూ వివరించకుండా అస్పష్టంగా చెప్పటం ఉచితం కాదు. అందువల్ల వ్యాస రచయిత 'ఈమాత్రం నీకు తెలియకపోతే ఎవడేం చేస్తాడు?' 'ఇదికూడా తెలియదా?' అన్న ధోరణిలో అతిశయం ప్రదర్శించంపక 'ఇది తెలిసిందే కదా', 'ఇది వివరించటం అవసరం కదా' అన్న రీతిలో వేగిరపాటు చూపక, మానసిక హార్దిక క్రమత చూపడం ఉచితంగా వుంటుంది.

పరిహాస కుశలత ఉదాత్తతగా భావింపబడుతుంది. ముఖం మాడ్చుకొని మాట్లాడుతున్న ధోరణికాక నవ్వుముఖంతో సరసుడయిన పెద్దమనిషి, మేధావి పలుకుతున్న తీరులో రచన జరిగితే ఉదాత్తత గోచర మవుతుంది. హాస్య అవహేళనలు రచయిత పాఠక సంబంధం పటిష్ఠంగా రూపొందిస్తాయి కాని, అవహేళనంలో ఉదాత్తత లోపిస్తుంది. సంఘాన్ని సాహిత్యాన్ని విమర్శించే వాక్యాలు పరిహాస కుశలత కోల్పోతే సాంసత్వస్థాయినుంచి ఒక మెట్టు దిగిపోతాయి.

అనవసరంగా రచయిత కోపించటం, అసందర్భంగా రెచ్చిపోవటం, చిరాకు పడటం, విరోధుల్ని తిట్టటం, పలకరానిమాటలు వ్రాయటం, సాహిత్యంలో

ఉదాత్తత లోపింపజేస్తుంది. శైలి కుంటుపడుతుంది. తను ప్రేమించే వ్యక్తుల లోపాలు క్షమించి గుణాలు హర్షించే పెద్దబుద్ధిసంపవి రచనలో ప్రదర్శింపబడితే ఉదాత్తత సాధింపబడుతుంది

ఉదాహరణం :- 1. "ఏ కవి ఇతరులు చెప్పిన లక్షణమునకు భయపడి తన మతము మార్చుకొంటాడో ఆ కవి అస్వతంత్రుడు." (గిడుగు వేంకటరామమూర్తి పంతులు - వ్యాసావళి విన్నపము-పుట-99).

రచయిత కోపించే పరిస్థితి కలిగినప్పుడు శాంతంగా పెద్దలు పిన్నల్ని మందలించినట్లు వ్యక్తమయిన ఈ వాక్యంలో ఉదాత్తత వుంది.

2. "సౌమనస్యమున ఋషులకును, బాళియగాంధ్రకును, మృగములకును భేదము శూన్యము." (కట్టమంచి రామలింగారెడ్డి - వ్యాసమంజరి - కళాపూర్ణోదయము-పుట 76)

ఋషులు శాంతతకు, మృగాలు క్రూరతకు, పాళియగాంధ్రుడు శాంతత క్రూరతలకు ప్రసిద్ధంగా చెప్పవచ్చు. ఋషులలో క్రూరత, మృగాలలో శాంతత సాధింపబడ్డ ఈ వాక్యం ఉదాత్తం.

3. 'తర్కశాస్త్రము నోరుమూసినను, హృదయమును మూయజాలదు.' (శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ - సారస్వతాలోకము - ఆంధ్రవాఙ్మయమున నాచన సోమనాధున కీయదగిన స్థానము-పుట-118)

తర్కశాస్త్రం, బుద్ధి సంబంధి, అది ఆలోచనా సహితం. హృదయం అనుభూతి పూరితం. ఆలోచనకు దూరం. తార్కికంగా హృదయబలం ప్రదర్శింపలేకపోయి, మాటాడక మానపచ్చుకాని, హృదయానుభూతి ఆగిపోదు. దాన్ని తార్కికశక్తితో బంధించటం అసాధ్యం. శాస్త్ర హృదయాలకు సంబంధించిన విషయం ఉదాత్తంగా అభివ్యక్తి పొందింది.

## 2.5. సమర్థత

నిరంతర ప్రయోగంవల్ల పదం, నాణెం అరిగిపోయినట్లు, అతివ్యాప్తినో, అవ్యాప్తినో పొందే అవకాశం వుంది. శిథిలమవుతున్న భాషను

సమర్థుడైన రచయిత సారవంతంగా రూపొందించి క్రొత్తదనం కలిగిస్తాడు. భాషలో కొన్ని పదాలు పడికట్టు పదాలుగా వ్యర్థ పదాలుగా మారే స్థితి ఏర్పడు తుంది. దాన్ని తొలగించి పదం బలమైన పనిముట్టుగా రూపొందించుకొంటాడు. ఈ స్థితి భాషకు సమర్థత కలిగిస్తుంది.

ఏ విషయమయినా మిక్కిలి ఎక్కువగా మిక్కిలి తక్కువగా ఉండటం శైలికి దూరమయిన సంగతులే అయినా ; భాషలో హద్దులు అవధులు అవసరమే అయినా; సాహిత్యంలో, అవధి లేకుండా పదాన్ని బలవర్ధకంగా చేయటం, పదానికి బలం లేకుండా అవధి ఏర్పరచటం కన్నా, శ్రేయస్కరం. దేన్నయినా చేస్తే తప్పేమో కాని పదాన్ని బలవంతంచేయటం కాదు. అది సమర్థత.

అలంకారికులు, వ్యాసకర్తలు, తత్త్వవేత్తలు, తప్పనిసరిగా కొన్ని పదాలు కొంత సంకేతార్థంలో ప్రయోగిస్తారు. ఈ పదాలు అరిగిపోయి, ఆ సంకేతార్థం మరుగునపడ్డా, ఇవి చెలామణీ అవుతూ వుంటాయి. ఇటువంటి పద ప్రయోగంతో భాష పాలిపోయి, పేలవంగా, రక్తంలేని మనిషి అయిపోతుంది. అందువల్ల రచయిత పద సామర్థ్యం పెంచవలసిన అవసరం ఏర్పడుతుంది.

కాలు అంటే ప్రాణి అవయవం అనటంతో పాటు కుర్చీకాలు కూడా చెప్పబడటం వల్ల పద సమర్థత పెరిగింది. 'ఆవు' అంటే అంతగా అర్థ విప్రతి పత్తిలేదు. ప్రకృతి అనేసరికి వివిధార్థాలు స్ఫురిస్తాయి. భాష వ్యక్తంచేసే భావం తుప్పు పట్టుతుంటే జాడించి, మసి పట్టితే తుడిచి, దుమ్ము పడితే విది లించటం భాషకు సమర్థత కలిగించటం అవుతుంది.

పడికట్టు పదాలు వైవిధ్యం, జీవితం, స్పష్టత, సత్యం కోల్పోయాయి కాబట్టి ఉత్తమ శైలిలో వాటికి ప్రవేశం ఉండదు. ఈ పదాలు ఒక్కొక్కప్పుడు తప్పని సరిగానూ, సంక్షిప్తతకు దోహదకారులుగానూ ఉండవచ్చు. అయినా స్పష్టత ప్రధానం కావటం వల్ల, మరే సుగుణం ఉన్నా, ఈ పదాలు పరి త్యాజ్యాలు.

పటిష్ఠత శైలికి వెన్నెముక. అది పద సమర్థత వల్ల సాధింపబడుతుంది. ఒక అంశం వివరించటానికి, మిక్కిలి అధికంగా, ప్రత్యంశ ప్రదర్శకంగా, భాషను వినియోగింప నక్కరలేదు. స్పష్టంగా అర్థబోధ అయ్యేంతవరకు భాష ప్రయోగింపవచ్చు. అయితే ప్రత్యల్పాంశ ప్రకటనం వల్ల రచన వాస్తవికంగా రూపొందే అవకాశం వుంది.

"Some circumstances of minuteness and particularity frequently tend to give an air of truth to a piece, and to interest the spectator in an extraordinary manner" (18) "But of all methods of obtaining this essential concreteness, and the vitality that concreteness alone can give, none." (19)

రచయిత అంతర్యంలో పొందే భాషా పరిణామం నుంచి పటిష్ఠత సాధింపబడి, భాషకు సమర్థత కలుగుతుంది.

*ఉదాహరణం* 1. "పిల్లలు తల్లులయ్యేదు వింత దేశములో పిల్లవాండ్రు తండ్రులగుట యాశ్చర్యము కాదు గదా ?" ( కందుకూరి వీరేశలింగం పంతులు - ఉపన్యాసములు వర్ణము - పుట. 228 )

ఈ వాక్యంలో తల్లులు తండ్రులు అన్న పదాలు మిక్కిలి అర్థవంతంగా బహు సమర్థంగా ప్రయోగింపబడటం వల్ల వాక్యం సమర్థత పొందింది.

2. "సభావేదిక మీద చిన్న చిన్న తోలుబొమ్మలాట లాడి ప్రయోజనం లేదు. ఊపిరితిత్తులు బలంగా ఉన్న సురేంద్రనాథ్ బాబు వంటి ప్రదర్శకులనే ఎన్నిక చేసి, తమ ఉపన్యాసాలను అనర్గళంగా చదవమనండి." (గురజాడ అప్పారావు - వ్యాస చంద్రిక - మద్రాసు కాంగ్రెసు మహా సభ –పుట 133)

ఈ వాక్య ప్రయోగానికి తోలు బొమ్మలాట, ఊపిరితిత్తులు, ప్రదర్శకులు, అనర్గళం అనే పద చతుష్టయం వల్ల సమర్థత కలిగింది. మనిషి తోలుబొమ్మ, అయినా తోలు బొమ్మలాటలోని ప్రాణం లేని బొమ్మగా కాక ప్రాణమున్న తోలుబొమ్మ. మనిషికీ బొమ్మకు ప్రధాన వ్యత్యాసం ప్రాణం. ప్రాణమున్న మనిషి వేదిక మీద ప్రాణం లేని బొమ్మలాగా ప్రవర్తించటం పట్ల చమత్కారం 'తోలుబొమ్మలాట' ప్రయోగం. 'ఊపిరితిత్తులు' బలంగా ఉండటమంటే, ఆరోగ్యంగా ధైర్యంగా ఉండటమే ! అవేవీ లేనివాళ్ళు ఉపన్యాసకులుగా వుంటే

సదస్యులు సహించటం కష్టమన్న సూచన ఉన్న పదమిది. 'ప్రదర్శకులు' అనటంలో అపహేళనం వుంది. ప్రచారోద్దేశం అన్న సూచన వుంది. ఉపన్యాసం ఇవ్వటం చేతకాకపోతే వ్రాసుకు వచ్చిందాన్ని ఉపన్యాస క్రమంగా చదవమన్నట్లు 'అనర్గళం' స్ఫురింపచేస్తుంది.

## 2. 6. ఋజుత

భావ ప్రకటనంలోని నిజాయితీని ఋజుత్వం అనవచ్చు. ఈ ఋజుత్వానికి అతిశయోక్తికి ఆమడ దూరం. నమ్మని విషయం నమ్మినట్లుగా, తెలియని సంగతి తెలిసినట్లుగా అవసరమై అల్పతను అధికంగా, అధికతను అల్పంగా, సందేహంగా చెప్పినప్పుడు ఋజుత కుంఠిత మవుతుంది.

ఋజుత్వాన్ని సమగ్రంగా వివరించటం కష్టమే. ఏ రచన గుండెను తాకేటట్లుగా వుంటుందో, అబద్ధం అన్న అనుమానానికి అవకాశం లేకుండా వుంటుందో, ఆ రచనా శైలిలో ఋజుత వుండనవచ్చు.

బాగా వ్రాయాలన్న పూనిక వుంటే అబద్ధంగా వుండే తీరు గాలికి కొట్టుకు పోయే గడ్డి అవుతుంది. ఈ ఋజుత్వం పిరికితనంవల్ల, ఉత్ప్రేక్షవల్ల, అజాగ్రత్త వల్ల, భాషా స్పష్టత వల్ల లోపిస్తుంది. ఆవేశం పొందకుండా, చేయదగిందేదీ కొందరు రచయితలు చేయలేక పోవచ్చు. అయితే ఆవేశంలో నిజాయితీని కోల్పోయే పరిస్థితి ఏర్పడవచ్చు.

రచయిత ఉన్నదానికంటె ఎక్కువగానో, తక్కువగానో, చెబితే కలిగే నష్టం కంటె గుడ్డిగా అతిశయంగా చెప్పటం ప్రమాదకరం. కనుక భావ ప్రకటనంలో గుండె చెబుతున్నట్లు విని మనస్సు చెపుతున్నట్లు గ్రహించి రెంటినీ అనుసంధించి వాస్తవంగా ఉండాలన్న దృష్టితో చేసిన సృష్టి ఋజుత కలిగి వుంటుంది. ఋజుత స్పష్టతకు దోహదకారి. సంక్షిప్తత కొంతవరకు ఋజుత్వం వల్ల సాధింపబడుతుంది.

ఉదాహరణం : 1. "గుడ్డి పాఠముగా చదివిన చదువంతయు వ్యర్థ మయినదే కాని ప్రయోజనకరమయినది కాదు." (కందుకూరి వీరేశలింగం పంతులు - ఉపన్యాసములు - స్వయంకృషి- పుట 254)

ఇందులో అతిశయోక్తి లేదు. అబద్ధం లేదు. సత్యం సూటిగా చెప్ప బడింది. గుండెను తాకేటట్లుంది. రచయిత నిజాయితీ వాక్య గతంగా ద్యోతకమయి, ఇది ఋజుత్వం ఉన్నదయింది.

2. ''కాబట్టి పలువురతోఁ జేరి సుఖించుట మనుష్య ధర్మము; ఏకాకిగా నుండ గోరుట మృగధర్మము. ఇందుకు సందేహము లేదు.'' (కందుకూరి వీరేశలింగం పంతులు - ఉపన్యాసములు-ఐకమత్యము -పుట. 306)

మనిషి సంఘ జీవి. సమష్టిగా జీవించవలసిన వాడు. ఒంటరిగా బ్రతక లేడు. కూడదు. ఈ విషయం కఠినంగా మృగధర్మం అన్న పదం ప్రయోగించి 'ఇందుకు సందేహము లేదు' అని తిన్నగా చెప్పబడటంతో ఋజుత్వం గోచరమవుతుంది.

3. ''ఈ నియోగి వైదిక సమ్మేళన మసంభవము కాదు. ఈ భేదము నే శాస్త్రము నందు ఆధారము లేదు. ఇది స్వకపోల కల్పితము. కావున వీరిని గలుపుట కాక్షేపణ యుండదు. పెద్దలును ఒప్పుకొనిన విషయమే' ఇందుకు బహిష్కార భీతిలేదు." (కొమర్రాజు వేంకట లక్ష్మణరాయ వ్యాసావళి- నియోగి వైదిక భేదకాల నిర్ణయము- పు. 15)

దీనిలో రచయిత నమ్మకం గోచరమవుతుంది. అది విశ్వాసం కూడా అయింది. చెప్పటంలో నిర్భీతి వుంది. నిజాయితీ, ఋజుత్వం ఉన్నాయి.

4. ''అక్కడికి నేను మొదటసారి మా తాతయ్యగారితో వెళ్ళాను. అత నక్కడే ఉండి పోయాడు. నేను స్నానం చేసి తిరిగి వచ్చాను." (శ్రీ శ్రీశ్రీ- శ్రీశ్రీ సాహిత్యం-రెండు-పుట 394)

శవంతో శ్మశానంలోకి వెళ్ళి సంస్కారం తరువాత స్నానం చేసి తిరిగి వచ్చిన మనిషి వ్యక్తం చేసిన ఈ వాక్యంలో కవిత్వంతోపాటు ఉన్నతమైన ఋజుత్వం ఉంది.

## 2.7. అలంకారత

శబ్దాలంకారం ప్రాథమికంగా భాషా సంబంధి అయితే అర్థాలంకారం, అనుభూతికి అభివ్యక్తి కావటం వల్ల, వ్యక్తిత్వ సంబంధి. ఆంగ్లంలోని అంల

కారాల సంఖ్య కంటే సంస్కృతంలో బహ్వాధికం కావటం వల్ల అభివ్యక్తి విష యంలో అనుభూతి ప్రాధాన్యం విశేషంగా ఆలోచించి భాషా రచనలో వైవిధ్యం సాధించి, శైలీ సంబంధి అంశం ఈ రూపంలో దర్శించటం ఉంది.

అర్థాలంకారాలు పదయినా, వందయినా, వర్ణింప దలచిన వస్తువుతో పోలిక వున్న మరో వస్తువు సంబంధం తెలపటమే ప్రధానంగా తోస్తుంది. అంటే అన్ని అలంకారాల ఆత్మ ఉపమేయోపమాన సంబంధి అవుతుంది. సంస్కృతంలో ఆంధ్రంలో అవతరించిన అలంకారాలన్నింటిలో ఏ కొన్నో తప్ప, చాలా వరకు ఉపమేయోపమానాలుగా ప్రస్తుతాప్రస్తుతాలుగా, వర్ణ్యా వర్ణ్యాలుగా మొదలయిన పేర్లతో వర్ణింపబడే వస్తువు, పోల్చబడే వస్తువ ప్రాధాన్యం వహిస్తాయి.

కాబట్టి భాషాలక్షణాలు తొలగించి అలంకారాలు పరికిస్తే పోల్చవలసింది, పోల్చబడేది రెండే పదాలుగా, రెండు వస్తువుల ధర్మాలు గోచరమవుతూ ఒక పోలిక మాత్రమే అలంకారాత్మగా భావిత మవుతుంది. అంటే సర్వా లంకారాంతర ధర్మంగా-అల్పసంగతులు అటుంచి-పోలికను చెప్పవచ్చు.

పోలిక ప్రధాన ధర్మంగా ఉపకం-రూపకం ఉన్నాయి. ఉపమ పదాధికత వాంఛిస్తే, రూపకం పదాల్పతను కోరుతుంది. కనుక సంక్షిప్తత వాంఛనీయమైన శైలి గతంగా రూపకం ఉత్తమాలంకారంగా అలంకార ధర్మ ప్రతినిధిగా, అలంకారాత్మకు ప్రతీకగా భావింపవచ్చు.

వర్ణింపవలసిన వస్తువు రచయితకు స్పష్టంగా ఎదుట వుండి అది అంత స్పష్టంగా పాఠకుడికి తెలిపేటట్లు చెప్పాలంటే, ఆ వస్తువుతో సంపూర్తిగానో, అసంపూర్తిగానో, ఏ మాత్రమో సంబంధం ఉన్న ఇతర వస్తువుల్లో ప్రసిద్ధమైన దాన్ని గ్రహించి, ఆ అప్రసిద్ధమైన లేక నూత్నమయిన వర్ణనీయం స్పష్టంగా ఆరోపించటం రూపకం కార్యం.

రచయిత తన అనుభవంలో, ఒకానొక ఆవేశ సన్నివేశంలో ఆకస్మిక మయిన వస్తువు క్రమక్రమంగా హృదయంలో ఒక రూపం పొంది, మిగిలిపోయి వుండి, తన వస్తువు ప్రకటించటానికి చేసే మానసిక కృషి గ్రహించి అనేక వాల పొరలు చీల్చుకొని ఆకారం దాల్చిన ఆవేశంగా అవశ్యంగా ఆవిష్కృతమై, వర్ణ్యరూపం స్పష్టం కావిస్తుంది కాబట్టి, రూపకం అనుభూతియొక్క అభివ్యక్తి.

రూపక నిర్మాణ దక్షత శైలిలో ఉత్తమాంశం. రూపకం వల్ల విషయం విస్పష్టంగా తెలుపవచ్చు. రూపకం మహావ్యక్తి అభివ్యక్త ధర్మం. దీని నిర్మాణానికి రచయిత ప్రత్యేక దృష్టి అవసరం.

రూపకం చాల కాలంగా, కవితాగుణంగా భావించటం ఆచారమయింది. అయితే అది వాస్తవం కాదు. వచనంలో అది ఒక సుందర వ్యక్తీకరణం. అంతేకాదు. విద్యావంతులకు ఈ అలంకారం పరిమితం కాదు. నిరక్షరాస్యులు కూడా నిశ్చింతగా, యథేచ్ఛగా రూపకోపయోగం చేస్తారు. అందువల్ల భాషాతత్త్వంలోనే రూపక నిర్మాణ సామర్థ్యం ఇమిడి వుంది.

కొందరు అలంకారాలన్నింటిలో ప్రాచీనం ఉపమ అంటారు. రూపకం అనంతరం అనీ అంటారు. అయితే అది వాస్తవం కాదు. భాష పుట్టిం దగ్గర్నుంచి పదానికి అర్థం స్పష్టం కావటం దగ్గర్నుంచి రూపం వుంది. అందువల్ల రూపకం అన్ని అలంకారాల కంటె ప్రాచీనం. "The truth seems that metaphor too is older than any literature-an immemorial human impulse as much utilitarian as literary." (20)

ఈ విషయం అరిస్టోటిల్ కూడా అంగీకరించటం గమనార్హం.

రూపకం వల్ల రెండు వస్తువుల ధర్మాలు ఒక్కసారిగా స్పష్టమవుతాయి. రెండింటిలో అనుగత పూర్వ వస్తువు కొత్త వస్తువును వివరిస్తుంది. రచయిత అనుభవాంతర్యం తెలపటంతో పాటు విషయం స్పష్టం కావించటానికి రూపకం దోహదకారి అవుతుంది.

"As to metaphorical expression, that is a great excellence in style, when it is used with propriety, for it gives you two ideas for- one" (21)

"Living metaphor is a kind of two-headed Janus looking two ways at once and making us see two things almost simultaneously." (22)

స్త్రీ చంద్రుడు నిజంగా సంబంధించి వున్నట్లు లెక్కకాదు. అయితే చంద్రుడికిలోసి తెల్లదనమో, చల్లదనమో, ఆవేశంగా రచయిత అనుభవం

అయింది. ఈ అనుభవం ఘనీభవించి ఆత్మగతంగా నిలిచిపోయింది. స్త్రీ ముఖం చూచినప్పుడు తెల్లదనమో, ప్రసన్నత వల్ల చల్లదనమో, ఒక అనుభవాన్ని కలిగించింది. ఈ అనుభవం, ద్రవరూపంలో, ఘనీభవించక పూర్వపు రూపంలో ఇటువంటి అనుభవాన్ని తాకి, దాన్ని వెలుపలికి తెచ్చి రెండింటికీ పోలిక సాధించింది. ఏ విధంగానూ ఒకటి గాని ఈ రెండు వస్తువుల్లో పోలిక సాధింపబడటం రూపక ప్రధాన ధర్మం. అందుకే-''It is also a mark of genius, since a good metaphor implies an intuitive perception of the similarity in dissimilars'' (23) అనటానికి వీలు కలిగింది.

సంబంధంలేని రెండు వస్తువుల సంబంధం చెప్పే టప్పుడు బాహిరంగా భాష సాధించటం లేదు. అంతరంగా ఉండే, రచయిత వ్యక్తిత్వం-ఒక విధమయిన జోస్యం చెప్పే గుణం వంటిది సాధిస్తుంది. అందువల్ల రూపక నిర్మాణం రచయిత వ్యక్తిత్వానికి సంబంధించి వుంటుంది.

ఇప్పుడు ''ముఖం చంద్రబింబం'' అనే పోలిక స్థిరమై మిగిలిపోతుంది. ఇది తదనంతరం యథేచ్ఛగా ప్రయోగింపబడుతుంది. ఈ ప్రయోగ బాహుళ్యం వల్ల ఒక్కొక్కప్పుడు పోలిక, రూపకం అరిగిపోతుంది. నిర్జీవమవుతుంది. అప్పుడు క్రొత్త రూపకం ఆవిష్కృతం అవుతుంది. నిర్జీవ రూపకం కలిగి వుండే భాష ఉత్తమ శైలిని ప్రదర్శింపలేదు.

రూపకం వల్ల విషయం కాంతిమంత మవుతుంది. వివరణం లోపించి, అస్పష్టంగా ఉన్న విషయం ఒక్క పోలికతో మిక్కిలి వివరంగా స్పష్టంగా తెలుపవచ్చు. ''But a metaphor is the swift illumination of an equivalence. Two images, or an idea and an image stand equal and opposite, clash together and respond significantly, surprising the reader with a sudden light.'' (24)

రూపకం వల్ల స్పష్టత సంక్షిప్తత సాధింపబడుతాయి. స్త్రీముఖం చల్లగా వుంది, తెల్లగా వుంది అనే అనేక గుణాలు స్పష్టంగా చెప్పాలన్నా, సంక్షిప్తంగా చెప్పాలన్నా 'ఆమె ముఖ చంద్ర బింబం' అన్నప్పుడు కలిగిన సౌకర్యం మరె

ప్పుడూ సాధ్యం కాక పోవచ్చు. "A metaphor is the result of the search for a precise epithet....Try to be precise and you are bound to be metaphorical." (25)

రూపకం వల్ల, స్పష్టత సంక్షిప్తతతో పాటు వచన రచన బలవర్థక మవుతుంది. వేగం సాధింపబడుతుంది. పరిహాస కుశలత సాధిత మవుతుంది. ఉత్సాహజనకంగా వుంటుంది. వ్యక్తిత్వం ఏర్పడుతుంది. కవితా మయంగా భాసిస్తుంది.

భాష పొందిన ఒకానొక మహోత్తమ వరం రూపకం. రచయిత తన వ్యక్తిత్వం-అనుభూతి యొక్క అభివ్యక్తిగా-రూపకం వల్ల ప్రదర్శింప గలిగితే మంచిదే! లేకపోతే మృతప్రాయమైన రూపకాలతో భాషను అసహ్యంగా చేయకుండా వుండటం వాంఛనీయం.

"...those who have no gift for metaphor and imagery are doubtless wise to keep clean of it, but that those who have it whether in writing or in speech, will find few qualities that better repay cultivation." (26)

అలంకారాత్మ అయిన రూపకం, రచయిత వ్యక్తిత్వం ప్రదర్శించే ఉత్తమ శైలీ లక్షణంగా తెలుగు వ్యాస సారస్వతంలో కలిగించిన ప్రత్యేకత పరికింపవచ్చు.

*ఉదాహరణం :* 1. అయితేనేమి ఆమె శ్రీమతి సరోజినీ దేవి ప్రసంగ మొక వేకువ. చేయవలసిన విధ్యుక్త ధర్మాన్ని తెలిపే కోడికూత. (గురజాడ అప్పారావు-వ్యాస చంద్రిక-మద్రాసు కాంగ్రెసు మహాసభ-పుట 140)

ప్రసంగం వర్ణ్యం. వేకువ, కోడికూత అవర్ణ్యాలు. వేకువ సూర్యోదయానికి సూచన, కోడికూత ధర్మ నిర్వహణకు హెచ్చరిక. వేకువ కోడికూత, కంటికి కనిపించే చెవికి వినిపించే దృశ్యం, శబ్దం. ఇంద్రియ గోచరమయిన ఈ ఉపమానాలతో మనస్సు గ్రహించే ప్రసంగం స్పష్టం చేసిన ఈ అలంకారం రచయిత అనుభవం నుంచి అవతరించింది.

2. ''ప్రబంధ సూర్యుడస్తమించిన వెనుక ప్రతిభాన్వితులైన కవులు లేకపోవుట చేతను, సంఘము నైతిక కర్దయములోను, రాజకీయపు ఉరులలోను దగుల్కొనుట చేతను కవి ప్రతిభా మూలకమైన కవి కర్మకు అవకాశము లోపించెను.'' (ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము - లక్ష్మీరంజన వ్యాసావళి-భావకవిత్వము పుట 209)

ప్రబంధం-సూర్యుడు, నీతి-కర్దయము, రాజకీయము-ఉరులుగా పోల్చబడి, ఉపమానబలం వల్ల ఉపమేయాలు మిక్కిలి స్పష్టంగా వ్యక్తమయ్యాయి. ఈ అలంకార దోహదం లేకపోతే, ఈ వాక్యం ఇంత స్పష్టం కాదు.

3. రెండూ సినీమాలు ప్రజామేఘాలచేత కనక వర్షం కురిపించాయి. (శ్రీ శ్రీశ్రీ-శ్రీశ్రీ సాహిత్యం రెండు-పుట 399)

ప్రజలు మేఘాలుగా, కనకం వర్షంగా చెప్పటంతో పోగైన ధనం ఎంత ఎక్కువో అలంకారం అనాయాసంగా వివరించింది.

## 3. శైలి-భాషా లక్షణాలు

భాష-అభివ్యక్తి : తెలుగు వ్యాసరచనాతత్వం అనటానికే వ్యాస శైలి అన్నప్పుడు అది ప్రాచ్యార్యార్థంలోనే ప్రయుక్తమయింది కాని పర మార్థంలో కాదు. తెలుగు వ్యాస శైలి, వ్యక్తిత్వ లక్షణాలు భాషా లక్షణాలతో నిబిడమయిందే అయినా, భాషా లక్షణాల కన్న, వ్యక్తిత్వ లక్షణాలు ఉత్తమ శైలికి దోహదం చేస్తాయి. వాస్తవ దృక్పథంలో వ్యక్తిత్వ లక్షణాలు శైలికి ఆత్మగా, భాషా లక్షణాలు శరీరంగా గమనించాలి. వ్యక్తిత్వం శైలికి అంతర ధర్మం, భాష బాహిర ధర్మం. ఈ బాహిర భాషా ధర్మ పాటిష్ఠ్యం మీద ఆధార పడి ఉండే శైలి ఔన్నత్యం పరికించాలి.

భాషా విషయంగా పరికించేటప్పుడు వచనంలోనూ, వ్యాసంలోనూ, కొంతవరకు పద్యంలోనూ శైలి వాక్య పద గతమే. అయితే వ్యాసం విషయాను కూలంగా విభజన పొందితే ఒకొ్కక్క విషయం ఒకొ్కక్క 'పేరా'గా వ్రాస్తే, ఆ 'పేరా'లో ఆ విషయం తప్ప అన్య విషయం లేకపోతే, ఆ విషయం

రూపొందిన వాక్యాలు పరస్పర సంబంధం కలిగివుంటే, ఆ వాక్యాలలో అర్థవంతమయిన పదాలు శబ్దబంధాలు కూర్పుతో వ్రాయటం జరిగితే, ఆ రచనలో భాషా దృష్టితో శైలి ఏర్పడుతూ వుంది.

ఒక వ్యాసంలో ఒక ప్రధాన విషయం కన్న ఎక్కువ విషయాలున్నా, ఒక 'పేరా'లో ఆ ప్రధాన విషయంలోని అంతరాంశం ఒకటి కన్నా ఎక్కువ వున్నా, ఒక వాక్యంలో ఒక భావం కంటే ఎక్కువ భావ ప్రరోచనం వున్నా రచన మంచి శైలిలో సాగుతున్నట్లు అనిపించదు. ఈ అనిపించకపోవటం సామాన్య రచయితల విషయంలో మాత్రమే. ప్రతిభావంతులు నియమ త్యాగమూ, పరిగ్రహణమూ చేస్తారు.

అభివ్యక్తి ధర్మ నిష్ఠమైన శబ్దాలు, అర్థవంతమైన పదాలు కలిసిన వాక్యంలో అవసరం లేని పదం కాని, శబ్దం కాని శైలికి బాధకమే. ఒక అంశ వివరణకు అవసరం ఉన్న వాక్యాలకు మించినా, అంశ పరిణామ క్రమంలో వాక్యానుసంధానం లేకపోయినా, అంశ ధర్మానుగుణంగా వాక్యాలు అన్వయం పొందక పోయినా, శైలి కుంఠితమవుతుంది. రెండు అంశాలు ఒక్క 'పేరా'లో కలిసినా, ఒక్క ముఖ్యాంశం ఒక్క 'పేరా'లో లేకపోయినా, 'పేరా' మిక్కిలి పెద్దది అయినా, శైలి బాధితమవుతుంది. విషయం వివరించేదిగానో, విపులీకరించేదిగానో వుండే వ్యాసంలో విషయం ఎంత చిన్నదో పెద్దదో అయినా ఒకటి ఉండకపోతే, రెండూ మూడూ వుంటే, విషయం కాని పక్షంలో, మానసిక దశ ఒకటిగా నయినా లేకపోతే వ్యాసశైలి విశిష్టంగా రూపొందదు. అందువల్ల వ్యాసంలోని శైలి వాక్యపదగతంగా పరికించటం కర్తవ్యం.

*తెలుగు భాష-గ్రాంథిక వ్యావహారికాలు :* వర్తమానాంధ్ర భాష గ్రాంథికం వ్యావహారికం అని రెండు విధాలుగా వుంది. అవి ఒకనాడు వాదా లయ్యాయి. ఆంధ్రదేశం అంతటా వ్యాపించాయి. భాషా సంబంధి శైలి పరి శీలించటానికి, భాష తీరు పరికించటం అవసరమే !

తెలుగు భాష గ్రంథస్థంగా పదకొండో శతాబ్ది నుంచి వుంది. అది శాసన స్థంగా ఆయిదో శతాబ్ది నుంచి కనిపిస్తుంది. ఈ భాషా ధోరణులు రెండు విధా లుగా వున్నాయి. భారత భాష గ్రాంథికంగా శాసన భాష వ్యావహారికంగా ఏక కాలంలో ఉన్నాయి. వ్యావహారికంలో శాసనం పుట్టిన తర్వాత దాదాపు

రెండు వందల ఏళ్ళకు గ్రాంథిక శాసనం- తురుమెళ్ళది-అవతరించింది. గ్రాంథికంగా కావ్యం వెలువడ్డ వెనుక దాదాపు రెండు శతాబ్దులకు వ్యావహారిక రచన-ప్రతాప చరిత్ర-వెలుగు చూచింది. తెలుగు భాషలో మొదటి నుంచీ రెండు విధాల రచనలున్నాయి. ఒకటి గ్రాంథిక భాషా రచన, రెండు వ్యావహారిక భాషా రచన.

తెలుగు భాష ఆరంభం నుంచి ఆధునిక కాలం దాకా రెండు విధాల వ్రాయబడుతూ వచ్చింది. పద్య రచన-పురాణం, ప్రబంధ, కావ్యాది-గ్రాంథికంగా సాగుతూ వచ్చింది. గద్య రచన, అల్పమే అయినా వ్యావహారికంగా ఉంది. శాసనాలు చాలావరకు వ్యావహారికమే. అనంతర ప్రక్రియలైన సంకీర్తనలు, కీర్తనలు, యక్షగానాలు మొదలైన రచనలలో వ్యావహారికం వుంది. ఇంతవరకు గ్రాంథిక వ్యావహారిక భాషా వివాదం లేనట్లే భావింపవచ్చు. అయితే ఇప్పుడు జరిగిన ప్రధాన సంఘటన చిన్నయసూరి బాలవ్యాకరణం.

ఇది పద్యగతి భాషను అంగీకరించి, వచనాది రచనల భాషను తిరస్కరించటంతో, తప్పుగా నిరూపించే యత్నం చేయటంతో, వివాదాలు ఆరంభమయ్యాయి. పందొమ్మిదో శతాబ్ది మధ్య భాగం నుంచి ఈ వివాదం ఆరంభమయింది. అయితే ఆ శతాబ్ది చివర, ఇరవయ్యో శతాబ్ది మొదట ఇది తీవ్ర రూపం దాల్చింది.

గిడుగు వేంకట రామమూర్తి పంతులు వ్యావహారిక భాషా రచన సర్వశ్రేష్ఠంగా భావించి దాని ప్రచారం చేయటం కంటే పూర్వం చాలా మంది, వ్యావహారిక భాషలో రచన చేయాలని ప్రచారం చేయటంతో పాటు, అటువంటి రచనలు చేశారు. వాళ్ళలో కొందరు 1. వఠ్యం వాసుదేవ పరబ్రహ్మశాస్త్రులు 2. స్వామినేని ముద్దు నారసింహనాయడు 3. వెలుగోటి సర్వజ్ఞ కుమారేచంద్ర భూపాలుడు 4. యెఱ్ఱమిల్లి మల్లికార్జునుడు పేర్కోదగ్గవారు.

1851 లో వఠ్యం వాసుదేవ పరబ్రహ్మ శాస్త్రులు ''వ్యవహార దర్పణము'' అనే న్యాయ శాస్త్ర గ్రంథం నిర్మించాడు. ఈ గ్రంథం సంపూర్ణంగా వ్యావహారిక భాషలో వుంది. దానికి రచయిత చెప్పిన ఉద్దేశమిది:

అఖిల లోకోపకారార్థ మట్టి ధర్మ
వాక్యతతి తెల్గుభాషనే బల్కబడియె-

గాన నన్నయ సూత్ర సంస్కారములను
విడిచి పెట్టుట దోషమై వెలయదచట.
(వ్యవహార దర్పణము- పుట 62)

ఈ గ్రంథంలో భాష కుదాహరణం-
''వకనికి హక్కు కలిగిన సొమ్ము యందు,
పారంపర్యము వల్ల వచ్చిన సంబంధము చాత-మరి
వకరికి కూడా హక్కు కలిగెనా అలాటి స్థావరం జంగమాత్మక
మయిన ఆస్తి-దాయమన పడును.'' (పుట 1)
''పెళ్ళి కాని ఆడ చిన్న వాళ్ళకి పెండ్లికి యెంత
ఖర్చు కావలెనో అంత సొమ్మును పంచుకోవటముకు
మును పే యెత్తి యివ్వ వలసినది.'' (పుట 2)

స్వామినేని ముద్దు నారసింహ నాయడు తన 'హిత సూచని' వ్యాస సంపుటి పీఠికలో వ్యావహారికంగా వ్రాయటం గూర్చి ఈ విధంగా వివరించాడు: ''...ఆంధ్ర భాషను బహుశః సంధి మొదలైన వాటి నియమము లేకుండగానే భాషించడమున్ను, వాక్య గ్రంథముల యందు వ్రాయడమున్ను వాడికయై యున్నది. యీ పద్ధతి సులభముగా నున్ను, రమ్యముగా నున్ను, భాషను రచించడమునకు సదుపాయమై యున్నట్లు నాకు తోచుచున్నది. ... గనుక సాధారణమైన భాష యందు వాడికలో నున్న గ్రామ్య పదములు చాలమట్టుకు సరసమైన వాక్య రచనలో నంగీకరించ తగినవిగా నేను ఎంచుకుంటున్నాను'' అని తద్విధంగా వ్యావహారికాంధ్రం వ్రాశాడు.

వెలుగోటి సర్వజ్ఞ కుమారేచంద్ర భూపాలుడు 'మనస్స్వాతంత్ర్యము', 'సందిగ్ధ తత్త్వ రాద్ధాంతము', 'నాస్తిక ధ్వాంత భాస్కరము', 'సర్వమత సార సంగ్రహము', 'సగుణవాద నిరాకరణము' వంటి అనేక రచనలు చేశాడు. వ్యావహారికంలో, వ్రాయటానికి తన సంకల్ప మీ విధంగా 'మనస్స్వాతంత్ర్యము'లో తెలిపాడు: ''ఈ గ్రంథాభిప్రాయము అందరికి చక్కగా తెలియవలెనని వాడుకగా నుండు మాటలతో వ్రాసినాడను. ఏ లక్షణ శాస్త్ర మేనియు లక్ష్యము చూపి పిమ్మట కొన్ని సంకేతములు ఏర్పరచగా లక్షణము పుట్టుచున్నది. ఇందువలన తెనుగు భాష యనాదిగా నుండి, నన్నయభట్టు ఈవలి లక్షణము చేసినందున,

పూర్వపు వాడుక ప్రకారమే, సమస్త జనులు ఉచ్చరించుచు నుండుట వలన, గ్రామ్య ప్రయోగములే అందరికి దెలియదగినవి గాన నీలాగు వ్రాసినందుకు అంగీకరింపవలయును'' అని ఆ విధంగా తన సాహిత్యం సృష్టించాడు.

యెళ్ళమిల్లి మల్లికార్జునుడు చార్ దర్వీషు కథలకు తెలుగులో చేసే అను వాదం వ్యావహారికంగా ఉండాలని నిర్ణయించుకొన్నాడు. ''...అనేక భాషల యొక్క శబ్దములు మిళితమయి, స్వభాషవలె వాడికై యున్నందున, వాటిని భేదించి తెనుగు మాటలతో వ్యాకరణ పద్ధతిగా గ్రంథము చేసే యెడల, సర్వ జన సాధారణము కాకపోవడమే కాక దేశీయ భాషా చమత్కారము బోధపడక, విరసమౌనని తోచి, స్త్రీ పురుషులు వకరితో నొకరు మాటలాడునట్లు సులభ ముగా అర్థమయ్యే లాగున సంక్షేపముగా జాతీయ రసముతో భాషాంతరులకు పూర్వోత్తరములు తెలియదమునకు ముఖ్యమయిన రిమార్కులతో యీ గ్రంథం సేయ నిశ్చయించుట మయినది. గనుక, ఇందుకు సమస్తమయిన వారు హర్షించవలసినది'' అని ఆ ప్రకారంగా భాషను ప్రయోగించాడు.

గిడుగు రామమూర్తి పంతులు కంటే పూర్వం ఎందరో వ్యావహారికంగా వ్రాయాలని సంకల్పంతో రచించారు. గ్రాంథికంగా వ్రాయటం స్వభావవిరుద్ధం, వ్యావహారికంగా వ్రాయటం సహజ ధర్మం అన్న ధోరణితో ఈ వ్యావ హారిక భాష ప్రోత్సాహం పొందుతూ వచ్చింది. గిడుగు కాలంలోనూ, ఆ తర్వాతా ఈ ద్వివిధ ధోరణులు భాషా విషయంలో వివాదాలు పెంచాయి. జయంతి రామయ్య పంతులు వంటి ప్రభుత్వోన్నతోద్యోగులు, పానుగంటి వంటి ఉత్తమ వ్యాస రచయితలు గ్రాంథిక వాదం, గిడుగు గురజాడలవంటి విమర్శ కులు, కవులు వ్యావహారిక వాదం చేపట్టారు.

నేడీ వాదాలు ప్రబలంగా లేవు. గ్రాంథికంగా వ్యావహారికంగా ఆంధ్ర భాష రెంటించులు పదనుకత్తి అయింది. రెండు విధాల రచనలు జరుగు తున్నాయి. ఉత్తమ రచనలు అవతరిస్తున్నాయి. అయితే ఇక్కడ గమనించ వలసింది, ప్రధానమయింది ఒక్క అంశం అది ఈ భాషలు శైలికి దోహదం చేసే తీరు. శైలి ఉత్తమంగా ఉండాలంటే భాష గుండెలోకి పోయి, అక్కణ్ణుంచి శంఖంలోంచి తీర్థంలాగా అవతరించాలి. గ్రాంథిక భాష జన జీవితానికి దూరమయిందనీ, వ్యావహారిక భాష సమీపంగా వుందని నమ్మితే, ఉత్తమ శైలికి వ్యావహారికమే అవసరం.

కాని చాలా మంది గ్రాంథికంలో వ్రాసినంత ఉత్తమ శైలి వ్యావహారికంలో వ్రాయలేరు. అలాగే వ్యావహారికంలో వ్రాసిన చక్కని శైలి గ్రాంథికంలో వ్రాయలేని వాళ్లున్నారు. కాబట్టి, అభిప్రాయ ప్రకటనార్థం ఏ భాష తగిందిగా వుంటే ఆ భాషలో వ్రాయటం సముచితంగా భావింపవచ్చు. భాష గ్రాంథికంగా వుందా, వ్యావహారికంగా వుందా అన్నది శైలి విషయంలో ప్రశ్నే కాదు. భాష గుండెలోంచి వచ్చిందా, పెదాలమీంచి వచ్చిందా అన్నదే ఆలోచింప వలసింది. గ్రాంథికంలో గాని, వ్యావహారికంలో గాని అంత ఉత్తమంగా లేని రచన చేసే కంటే, ఏ భాషా విధానంలోనైనా ఉత్తమంగా ఉండేటట్లు వ్రాయటం వాంఛనీయం. రచన గ్రాంథికం అయినా, వ్యావహారికం అయినా ఉత్తమ శైలికి అవకాశం వుంది.

## 3.1 వాక్యం

శైలి లక్షణ భాషా విషయకంగా వివరించటానికి వీలయిన భాగం ప్రముఖంగా వాక్యం. దీనిలో ఏ భాషా భాగ ప్రాధాన్యం ఉందని అంగీకరించినా, ప్రధానంగా ఇది, ఒక సమాప్త విషయబోధకంగా వుంటుంది. అందువల్ల వాక్యం ఒక భావ ప్రకటనకు సమగ్రమయిన, శక్తిమంతమయిన పద సముదాయం. వాక్యంలో పదాల పరస్పర సంబంధం నిర్మాణగుణ ప్రదర్శకం అవుతుంది. కాని శైలీగతంగా దర్శింప నక్కరలేదు అయితే పద ప్రయోగ నైపుణ్యం శైలీ సందర్శకమవుతుంది.

భిన్న వాక్యాలు విభిన్న భాషా కార్య నిర్వహణ సమర్థాలు. భాషా వినియోగం శక్తిమంతంగా జరిగితే శైలి ఆవిర్భవించినట్లు గుర్తు. భాషా ప్రయోగం అంత ప్రబలంగా లేకపోతే దాని ప్రాథమిక ధర్మమయిన అభిప్రాయ ప్రకటనం మాత్రమే జరిగినట్లు లెక్క. ఈ విధమైన వాక్యాలు సారస్వతంలో సామాన్యమే! ఆ వాక్య నిర్మాణం దోషం కాదు. కాని భావ ప్రకటనం కుదరక, అభిప్రాయ వ్యక్తీకరణంలో లోపం ఉన్న వాక్యాలు దోష భూయిష్ఠాలు. ఉత్తమ వాక్యం శైలికి దోహదం కలిగించినట్లే దోష సహిత వాక్యాలు తద్భంజకాలు. వాక్య దోషం గుర్తించి పరిహరిస్తే, ఉత్తమ వాక్య నిర్మాణం, తన్మూలంగా ఉత్తమ శైలీ దర్శన మార్గం ఏర్పడవచ్చు.

## 1.1 వాక్య దోషాలు

సంస్కృతాలంకారిక సంప్రదాయానుసారంగా అనేక వాక్య దోషాలు గుర్తింపు పొందాయి. ఆ దోష గ్రహణానికి పూర్వం గమనింపవలసిన విషయాలు రెండు. ఈ దోషాలు ప్రధానంగా కవితా రచన కుద్దిష్టాలు. వచనం రచనా విధానంగా ఆధునికం కాబట్టి దాని కుద్దిష్టాలు కావు. ఈ వాక్య దోష నిరూపణం సంస్కృతం ప్రభావంతో అవతరించి, ఆ భాషకు ప్రాథమికంగా అన్వయిస్తుంది. తెలుగు భాషకోసం అవి నిర్మించలేదు. సంస్కృత వాఙ్మయంలో ఈ దోషాలు దోషాలే! అయితే అవి తెలుగులో కొన్ని చోట్ల దోషాలు కాకపోగా గుణాలు కూడా అయ్యాయి. దీనికి తోడు మరో స్థితికూడా వుంది. ఆంగ్ల వాక్య నిర్మాణ క్రమంలో ఈ దోషాలు దోషాలు కాకుండా పోతాయి.

అందువల్ల సంస్కృతం తెలిపిన వాక్య దోషాలన్నీ తెలుగులో కావు. చాలా భాగం ఏ భాషలో అయినా దోషాలుగానే వుంటాయి. సక్రమ శైలికి దోష రాహిత్యం అవశ్యకమే కాబట్టి, తత్పరిశీలనం ఆవసరమే. అందువల్ల దోషాలు పరిహరించి గుణాలు గ్రహింపవచ్చు.

''రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు కైకేయీ, సుమిత్రా కౌసల్యా నందనులు'' అన్నప్పుడు కుమారుల పేర్లు చెప్పిన క్రమంలో తల్లుల పేర్లు చెప్పలేదు కనుక క్రమం తప్పినందువల్ల అక్రమం, స్థానం కాని చోట ఉండ కూడని పదం ఉండటం వల్ల వ్యాకీర్ణం; తప్పక చెప్పవలసిన వాక్యగత పదం పరిత్యజించటం వల్ల వాచ్య వివర్జితం; రసోచితంగా లేని రచనా విధానం వల్ల ఆరీతి; ఉపమానం చాలకో, ఎక్కువయ్యో ఏర్పడే ఉపమాలంకారం పరిసమాప్త విషయం మళ్ళీ ప్రారంభించటంతో కలిగే సమాప్త పునరావృత్తం; సమాసావసరం లేనిచోట సమాసముంటే అస్థాన సమాసం; ప్రారంభానుకూలంగా లేక భిన్నంగా సాగే పతత్ప్రకర్షం; ఇష్ట సంబంధం చ్యుతమైతే సంబంధ వర్జితంగా వాక్య దోషాలు ఉన్నాయి. అయితే వాక్య దోషాలుగా వున్న కొన్ని నేడు దోషాలు కావు. అందువల్ల వాటి పరిశీలనం ఆవశ్యకమే!

*దోషాలలో గుణదర్శనం:* *1. విసంధి:* వాక్యంలో లక్షణ హీనమయిన సంధి, విరుద్ధ సంధి, అపండితులు ప్రయోగించిన సంధి, విసంధిగా అలంకారిక సంప్రదాయం. అయితే వర్తమానంలో విసంధి అందే సంధి చేయకుండా

ఉండటం! పూర్వం అన్విష్టసఖి, సర్వమున్నతని వంటి రూపాలు విసంధులుగా భావిస్తే, రాముడు అతడు, సీతఆమె వంటి రూపాలు నేడు విసంధి. అందువల్ల దుష్ట సంధి కాదు, సంధి రాహిత్యం విసంధి.

ప్రయోజనం లేకపోతే దుష్ట సంధి దోషం. కాని సంధి చేయకపోవటం దోషంగా భావింప నక్కర లేదు. ఈ విధమైన విసంధివల్ల వాక్యంలో స్పష్టత సాధింపవచ్చు. భాషా ప్రయోగంలో స్పష్టత అవశ్య వాంఛనీయ లక్షణం. ఇది ఉత్తమ శైలీ గుణం కాబట్టి ఆ దృష్టితో వాక్యంలో విసంధి దోషం కాదు.

సంస్కృతంలోనూ, ఆంధ్రంలోను సంధి తప్పనిసరి కార్యమే కాని, ఈ విసంధి ఆధునిక రచనా విధానంలో భాగం. పలకటంలో సంధి, ఏ భాషలో అయినా నిత్యమే కావచ్చు. ఈ భాషల్లో వ్రాయటంలో సంధి సంప్రదాయం సిద్ధమయివుంది. ఆంగ్లంలోని ఉచ్చారణలో సంధి, రచనంలో విసంధి మూలంగా ఆంధ్రంలో విసంధి రచనా సంప్రదాయం ఆధునిక కాలంలో అవతరించింది.

వాఙ్మయానికి స్పష్టత వెన్నెముక కాబట్టి, శైలి దృష్టితో విసంధి వాంఛనీయం. అందువల్ల తెలుగు వాక్యంలో విసంధి ఆదరణీయం. అయితే నోటి మాటకూ చేతి వ్రాతకూ సంబంధం ఉండాలన్న వ్యవహారిక భాషా వాదం దృష్టితో విసంధి పరిత్యాజ్యంగా కనిపిస్తుంది. ఎందుకంటే నోటిమాట - ఉచ్చారణ - ససంధిగా, ముఖ్యంగా వ్యావహారిక భాషలో చేతి వ్రాత విసంధిగా వుంటుంది. కాబట్టి, ఈ భావం కలుగుతుంది.

విసంధిగా వ్రాసినా చదవటం ససంధిగానే కొంతవరకు జరుగుతుంది కాబట్టి నోటి మాట - చేతి వ్రాత సమన్వయించినట్లే తలపోయవచ్చు. సంధివల్ల ప్రాథమికంగా పదరూపం స్పష్టం కాకపోవటం కూడా సంభవం కాబట్టి విసంధి వాంఛనీయం.

అపార్థ స్ఫూర్తి, అన్య స్ఫురణ పరిహరించటం కోసం కూడా విసంధి రచనం ఉండాలి. రచనం ఉండాలి అని వుండటమే, రచన ముండాలి కంటే శ్రేయస్కరం. ఆమె నక్క కోరింది అనటం కంటే, ఆమెను అక్క కోరింది అని విసంధిగా ఉండటమే సముచితం.

సాధారణంగా సమాసంలో విసంధి అవసరం కాకపోవచ్చు. కాని అన్వార్థస్ఫూర్తి తొలగించవలసి వున్నప్పుడు సమాసంలో అయినా, ఆధుని కాంధ్ర వ్యావహారికంలో విసంధి పాటింపవచ్చు. ఆ యా కారణాల వల్ల వాక్యంలో, వర్తమానంలో. విసంధి దోషం కాదు.

2. ప్రక్రమ భంగం : "ప్రారంభించిన మార్గమును విడిచినచోఁ బ్రక్రమ భంగము", "శౌరి దానవారి చక్రధారి అభవు అమితభవు జిష్ణు విష్ణు కృష్ణు గొల్తు." ఇవి లక్షణ లక్ష్యాలు. లక్ష్యంలో మొదటి మూడు పదాలు ఇకారాంతంగా ఉన్నాయి. తరువాత పదాలు ఉకారాంతంగా ఉన్నాయి. ప్రారంభించిన క్రమంలో అనుసంధించిన పదాలు లేవు.

అయితే ఈ దోషం కవుల మాటకేం, రచయిత లందరూ చేస్తారు. అందరూ చేస్తారు కాబట్టి దోషం కాకుండా పోతుందనటం కాదు కాని, ఇది దోషంగా భావింప నక్కరలేదు. ఎందువల్లనంటే, వాక్యావసరాన్ని బట్టి, దాని నిర్మాణక్రమం మారుతుంది.

కాని, ఒక వాక్యంలో సాధారణంగా ఒక ధోరణి ఉంటుంది. అవసర మయితే అనేక ధోరణులు చోటు చేసుకోవచ్చు. దానివల్ల వాక్య విస్తృతి పెరుగుతుంది. రెండు భిన్న ధోరణులు ఒక వాక్యంలో కలిసినప్పుడు అవి రెండు విధాలుగా వ్రాయవచ్చు కాబట్టి, రచనా విధానంలో రెండు భిన్న రీతులు ఆవిర్భవిస్తాయి.

ఒక క్రమంలో ప్రారంభమయి, మరో క్రమంలో సాగి, ఇంకో క్రమంలో వాక్యం ముగియటం వల్ల వాక్య రచన కొత్త అనుభవాన్ని పొందు తుంది కాని, దోషంగా మారిపోదు. ఏ క్రమంలో ప్రారంభమయిందో, ఆ క్రమంలో పరిసమాప్తం కావాలన్న దృష్టి ప్రాచీనం. తద్భిన్నంగా ఆధునిక దృష్టి వుంటుంది.

ఒక వాక్యంలో ఎన్ని భిన్న రచనా క్రమాలు, ధోరణులు ఉన్నా, రచయిత సమర్థుడయితే, రచనా ధర్మంలో నూత్న సామర్థ్యం అవతరిస్తుంది. కాబట్టి, వర్తమానాంధ్ర వాఙ్మయంలో ప్రక్రమ భంగం, ప్రయోగం దృష్టితో, దోషం కాదు.

పునరుక్తి : "శబ్దమును అర్థమును మఱల నదే విధముగఁ బ్రయో గింపబడినచోఁ బునరుక్తి దోషము" — దీనికి ఉదాహరణం —"చక్రాం

చలమునఁ జక్రధరుఁడు దనుజాళినిఁ ద్రుంచును''లో చక్రపదం అదే అర్థంలో రెండుసార్లు ప్రయోగింపబడింది కాబట్టి పునరుక్తి దోషంగా భావింపబడింది.

సంస్కృత వాఙ్మయంలో, ప్రాచీనాంధ్ర వాఙ్మయంలో పునరుక్తి దోషమే! ఆధునిక వచనంలో పునరుక్తి అభీష్టమయితే దోషం కాక, గుణం కూడా అవుతుంది. భావ ప్రకటన పటిష్ఠత కోసం పునరుక్తి చేయవచ్చు. "Repetition, that is to say, is the strongest generator of emphasis known to language" (27) సామాన్యంగా పునరుక్తి దోషమే! అయితే దోషం కాక గుణమైన స్థితి ఆధునికాంధ్ర వచన వాఙ్మయంలో వుంది.

*అపూర్ణం-అక్రియం* : స్థూలంగా ఈ రెండు వాక్య దోషాలు క్రియా రాహిత్యం మీద ఆధారపడ్డాయి. ఉదాహరణంగా "నరపతి బహుళముగా ద్రవ్య మొసఁగఁగ నౌదార్యశాలి" అన్న వాక్యం అపూర్ణదోషయుతం. అందులో క్రియాన్వయం లేదు.

భాష ప్రాథమికంగా వ్యవహార ప్రయోజనం కలిగివుంటుంది. "నరపతి-ఔదార్యశాలి" అన్న వాక్యం ఆ విధంగా ప్రయోజనకారి. వాడికీ, పెడితే పెళ్ళి, లేకపోతే చావు అన్న వాక్యం అచ్చంగా వ్యవహార ప్రయోజనం. దీనికి క్రియాన్వయం లేదు.

అసలు తెలుగుభాషలో క్రియా ప్రాధాన్యం తక్కువ. అది లేకుండా ఎన్నో వాక్యాలు- అది బడి, ఇది గుడి- వాక్యాలే! క్రియలేదు. రాజుమాట మంచి మాట, రాముడు బుద్ధిమంతుడు- వాక్యాలే! క్రియాన్వయం లేదు. జీవితం పాలవెల్లి, యౌవనం కల్పవల్లి. స్త్రీ క్రొవ్వొత్తి, భక్తిముక్తి వాక్యాలే! క్రియావసరం లేదు.

క్రియావసరంలేని వాక్యాలు ఎన్నో తెలుగులో ఉన్నాయి. ఇవి ఈ భాషా తత్త్వం ప్రదర్శిస్తాయి. అందువల్ల క్రియాన్వయం లేకపోవటం తెలుగులో దోషం కాదు. అపూర్ణం, అక్రియం సంస్కృతంలో కావచ్చుకాని, ఆధునికాంధ్రంలో దోషాలు కావు.

*వాక్యసంకీర్ణం:* ఒక వాక్యంలోని పదాలతో, ఇంకో వాక్యంలోని పదాలు కలిసిపోవటం ఈ దోషం. దీనికిచ్చిన ఉదహరణం "ఈ భూకాంతు

డనేక గుణాన్వితుడనుచు నిలలో జనులెల్లరు బొగడుదురు.'' రెండు వాక్యాలు, మధ్యలో అనుచు చేరింది. ఈ రెండు వాక్యాలు కలిశాయికాని పదాలు కలప లేదు. అందుచేత భిన్నవాక్యైక్యం ఈ దోషంగా చెప్పినట్లు గ్రహింపవలసి వుంటుంది.

వాస్తవానికి ఇది దోషంగా పరిగణింప నక్కరలేదు. రెండు వాక్యాలు మాత్రమే కాదు. అనేక వాక్యాలు, విషయ పటిష్ఠం బోధకోసం, ఒక విన్యాసం కోసం, ఒక శైలీ సమార్జనకోసం, కలిపి వ్రాయవచ్చు.

అధికపదం: ఒక అర్థాన్ని బోధించడానికి అవసరమయిన పదాలకంటె యెక్కువ పదాలు ప్రయోగించడం అధిక పద దోషం అవుతుంది. దీన్నిగూర్చి సంక్షిప్తతలో తెలుపబడింది.

ఒక సందర్భంలో ఒక అర్థంలో ఒక పదం, మరో సందర్భంలో ఒక అర్థంలో అనేక పదాలు అవసరం కావచ్చు. అందువల్ల ఎక్కువ పదాలు ఒక అర్థబోధకు స్వీకరించడం దోషం కాదు. అవసరాన్ని మించి ప్రయోగించటం దోషం.

''సాహిత్యంలోనూ, జీవితంలోనూ ఎకానమీ ఆఫ్ వర్డ్ అండ్ థాట్స్ లేకపోవడం...'' శ్రీ చలం నిరసిస్తే, పానుగంటి పేనుపంటి భావానికి ఏనుగంటి రూప మివ్వటం నేను గంటిసని శ్రీ శ్రీశ్రీ తిరస్కరించాడు. అవసరాన్ని మించిన అధిక పద ప్రయోగం దోషమే కాని, అవసరమయినప్పుడు అధిక పదం గుణం కూడా అవుతుంది.

వాక్యగర్భితం: ఒక వాక్యంలో మరోవాక్యం ప్రవేశించడమే ఈ దోషం. ''ఖలులగు నెడమతుల తోడి సంగతి నీకిది కడుహితము ఒనర్పగా పలుచు.'' ఈ ఉదాహరణం అపార్థస్ఫూర్తి కలిగిస్తుంది. ఇటువంటి వాక్యాంతర వాక్య రచన చేయకూడదనటం స్పష్టం.

అయితే, ఖలులగు నెడమతులతోడి సంగతి, నీ కిది కడుహితము, ఒన ర్పగా వలదు అని 'కామా' లతో 'నీకిది కడుహితము' అన్న వాక్యం ఖలులు పలుపు అన్న వాక్యంలో చేర్చవచ్చు. విరామచిహ్నాలులేని కాలంలో వాక్యగర్భితం దోషమే కాని వర్తమానంలో ఈ విధమైన రచన ప్రసిద్ధమే!

విరామచిహ్నాలమీద ఆధారపడి వాక్యగర్భితం దోషం పరిహరింప బడ వచ్చు. అయితే ఈ విధమయిన వాక్యనిర్మాణం అత్యవసరం అయితేతప్ప చేయ కూడదు. వాక్యం చూడగానే స్పష్టంగా అర్థం గోచరం కాదు. విరామచిహ్నం ఏ కారణంవల్ల చ్యుతమయితే అర్థభంగం అవుతుంది. కాబట్టి ఈ వాక్యనిర్మాణం జాగరూకత వహించవలసిందిగా వుంటుంది.

వాక్యగత దోషం శైలికి భంగకరం. అవి అవశ్యం పరిహరింప బడాలి. అలంకారిక సంప్రదాయ సిద్ధమయిన దోషాలు కొన్ని వర్తమానాం ధ్రంలో బహుకారణాల వల్ల దోషాలు కావు. కాబట్టి, మిగతా దోషాలు పరి హరింపవచ్చు.

దోషంలేని వాక్యం విషయాన్ని స్పష్టంగా అందిస్తుంది. అది శైలికి దోహదకారి అవుతుంది. అప్పుడే వాక్యంలో ఉత్తమత్వం సాధితమవుతుంది. ఉత్తమ వాక్యం ఉత్తమ శైలికి ఉత్తమ సోపానం.

## 1.2. వాక్య రీతులు

వాక్య నిర్మాణంలో ఉండే భాషా భాగాలతో ఇక్కడ నిమిత్తం లేదు. వాక్యగతంగా విరామ చిహ్నాలు అర్థ బోధలో విస్పష్టతను సాధిస్తాయి. క్రియ ఒక్కటే వాక్యంగా గోచరమయ్యే అవకాశం ఉంది. అయితే సాధారణంగా వాక్యం ఒక పని, భావం అభివ్యక్తిగా తలచినప్పుడు, దానికి క్రియకంటె భిన్నమయిన భాషా భాగాలతో అవసరం ఏర్పడుతుంది కాబట్టి, వాక్యం, తెలుగులో, క్రియతో కూడి అయినా, కూడక అయినా కొన్ని పదాల సమ్మేళనమై, ఒక పని జరగటాన్ని ఒక భావం అభివ్యక్తం కావటాన్ని తెలిపే సామర్థ్యం కలిగి వుంటుంది.

శైలిలో పెద్ద వాక్యాలుగా చిన్న వాక్యాలుగా వుండవచ్చు. పెద్ద వాక్యాలు విశ్రాంతి బాగా వున్న సమాజానికి, చిన్న వాక్యాలు అది కొదవ అయిన సమాజానికి చేరువవుతాయి. చిన్న వాక్యాల వల్ల వేగం సాధింపబడితే, పెద్ద వాక్యాల వల్ల ఆలస్యం స్ఫురింపచేయవచ్చు. వేగంగా జరిగే కార్యం చిన్న వాక్యాలతో, నెమ్మదిగా జరిగే పని పెద్ద వాక్యాలతో చెప్పటానికి వీలు వుంటుంది. ఆధునిక నాగరకతలో వేగం ప్రధాన భాగం కాబట్టి నేటి జీవితానికి చిన్న వాక్యం శైలి దగ్గరగా వుంటుంది. ఈ జీవితంలో జాప్యం వ్యక్తం చేయవలసిన చోట పెద్ద వాక్యాలు ఉపయోగకరంగా వుంటాయి.

ఈ రెండు వాక్య ధోరణులు పెద్ద వాక్య నిర్మాణం తెలుపుతాయి. ఈ రచనా విధానాలు రెండూ ప్రాచీనతను కలిగి వున్నాయి. ఇవి వ్యాసాల పూర్వ రంగమయిన ఉపన్యాస కళలో అంతర్భాగాలయి, ఇప్పుడు శైలి విషయికంగా ప్రసిద్ధమయ్యాయి.

*ఉదాహరణాలు : 1. సంకోచ వాక్యం :-* ''తల్లి దండ్రులు కోపిష్ఠులగుదురేనినిష్కారణముగా నిరపరాధులయిన బిడ్డలను కొట్టి హింస పెట్టుదురు; బిడ్డలు దుర్మార్గులగుదురేని జననీ జనకులకు మనస్తాపము కలిగింతురు; రాజులు దుష్టాత్ములయిరేని దేశజనులను బాధింతురు; జనులు స్వామి ద్రోహులయి తిరుగఁబడు వారగుదురేని రాజులకు మనోవ్యధ కలుగును; భర్తలు సురాపానాది దుర్వృత్తుల మరగినవారైరేని భార్యలు దుఃఖభాజనులగుదురు; భార్యలు జారిణులగుదురేని భర్తలు సుఖదూరులగుదురు; గురువులు మోసగాండ్రగుదురేని శిష్యులు భ్రష్టులగుదురు; న్యాయాధికారులు లంచములు గైకొను వారగుదురేని ప్రజలు క్షోభపడుదురు; పాపభీతి వలన నందఱును నీతిమంతులైనచో నిటు నిటువంటి బాధలించుమించుగా నివారణమగును.'' (కందుకూరి వీరేశలింగం పంతులు-జన్మాంతరము - పుట 18)

పాపభీతి - నివారణమగును వాక్య భాగంతో పై వాక్యం పూర్తి అవుతుంది. దీనితో వాక్యం ముగిసిపోయింది. ఈ భాగం చేర్చకుండా కార్యకారణ వాక్య భాగాలు ఎన్నయినా వ్రాయవచ్చు. చివరిభాగం చేరటంతో వాక్యం సంకోచమయి సమాప్తమయింది.

*2. వ్యాకోచ వాక్యం :* ''ధనవంతులు భక్షించుటకు పంచభక్ష్య పరమాన్నములును గలిగియు దేహ కష్టము లేకపోవుటచేత నేది భుజించినను జీర్ణము కాక వారు బలహీనులయి బాధపడుచుందురు; ఎంత బలమయిన యాహార పదార్థములను దిన్నను దాని సారమును గ్రహింపజాలక యారోగ్యదూరులగుదురు; నాలుఁగడుగులు నడచిన నాయాసపడుదురు; తఱుచుగా సంతానహీనులును నల్పాయుష్కులును నగుదురు.'' (కందుకూరి వీరేశలింగం పంతులు-జన్మాంతరము - పుట 8)

ఈ వాక్యంలో ప్రధాన భాగం-ధనవంతులు - బాధపడుచుందురు, మాత్రమే-మిగతా వాక్య భాగం, పై వాక్య భాగం వివరించడానికి ఉద్దిష్టమయి వుంది. ఇది ఇక్కడ తప్పని సరిగా ఆగిపోవాలని నియమం లేదు. ఎంత

దూరమయినా వ్యాకోచం చెందే అవకాశమున్న వాక్యం కనుక వ్యాకోచ వాక్యం. ఆంగ్లంలోని లూజ్, పీరియాడిక్ వాక్యాలు వీరేశలింగం పంతులు ఉపన్యాసాలలో, వ్యాకోచ సంకోచ వాక్యాలుగా అధికంగా కనిపిస్తాయి. వాక్య ప్రధాన భాగం ఆరంభంలో వుంటే వ్యాకోచ వాక్యం, ముగింపులో వుంటే సంకోచ వాక్యం.

*3. మరో సంకోచ వాక్యం:* "వీరితోనా నేను పోటీ చేసేది!'' అని తక్కిన పోటీదార్ల పట్ల న్యూనభావం వుండవచ్చు; ''వీరా నన్ను పరీక్షించేది!'' అని పోటీ నడుపుతున్న వారి పట్ల తిరస్కార వైఖరి వుండవచ్చు; ''ఇంత పోటీ చేస్తే, ఈ మాత్రమేనా ప్రతిఫలం!'' అని ఆశ చూపబడిన పారితోషికంపట్ల తృణీకార భావం వుండవచ్చు; 'పోటీలలో నెగ్గనిదే నా ఘనతను లోకం గుర్తించదా! సరే-చూద్దాం!' అన్న అహమహమిక వుండవచ్చు; లేదా భయమో, సంకోచమో, వినయమో, వినమ్రతో అడ్డు రావచ్చు. కారణాలేమైనా పసగల వారిలో పెక్కుమంది పోటీల ఛాయలకైనా వెళ్లరు: (నార్ల వేంకటేశ్వర రావు-రూపం-గుణం-'పిచ్చాపాటీ' -పుట 20)

## 2.2 ఆవృత్తవర్ణ, పద, వాక్య వాక్యాలు

ఒక వాక్యంలో ఒక వర్ణం కాని, పదం కాని, వాక్యం కాని, ఆవృత్తమవుతూ, పునః పునః ప్రయుక్తమవుతూ వుంటే శబ్దాలంకారం కంటే భిన్నంగా విధిగా ఆశీరర్థకంగా స్పష్టమయిన వాక్య సంబంధాన్ని కలిగించే అవకాశం వుంది. సాధారణంగా ఉత్తమ వచనం ఈ వాక్య లక్షణం కొంత వరకయినా కలిగి వుంటుంది. వర్ణ, పద, వాక్య ఆవృత్తి క్రమంగా అధునికంగా భావింపబడుతుంది.

ఈ వాక్యంలో పరస్పర భిన్నంగా ఉన్న ధర్మాలు సంబంధించినట్లు తెలుపబడ్డప్పుడు అర్థం స్పష్టంగా గోచరమవుతుంది. కొద్ది మాటల్లో పెద్ద విషయం వివరంగా తెలుస్తుంది.

ఇటువంటి వాక్యాలు సాధారణంగా పెద్దవిగా వుంటాయి. ఈ వాక్యం వాక్ప్రౌఢిమకు నిదర్శనంగా భావింపవచ్చు. తన కనిష్టమయిన విషయం అంగీకరిస్తున్నట్లు కనిపించే వ్యక్తి ఈ వాక్య విధానం స్వీకరించటం వల్ల

అభిప్రాయం గోపనం ఒక వైపూ, ధ్వనిగా తత్ప్రకటనం మరొక వైపూ సాగింపవచ్చు.

*ఉదాహరణాలు : 1. ద్విత్వ సముచ్చయం అవృత్తమయిన వాక్యం. 'అనేక' పదంకూడా అవృత్తమైంది.*

"మనుష్యుడు అనేక వస్తువుల నున్ను వస్తువుల, యొక్క కూటములనున్ను భక్షించడమునకున్ను పానము చేయడమునకున్ను అభ్యాసము గలవాడున్ను అనేకములైన హద్దులకు లోపడవలసిన ప్రవర్తన గలవాడున్ను అనేక దుష్ప్రేరణలను పొందడమునకు లాయకైన వాడున్ను అనేకములైన కోరికెలను కోరెవాడున్ను ఐ యున్నందున మనుష శరీరము అనేక విషదోషములను పొందడమునకున్ను అనేక రోగముల యుత్పత్తికిని ఆలయమై యున్నది." (స్వామినేని ముద్దు నారసింహ నాయుడు-వైద్య ప్రమేయము-హిత సూచని-పుట 15)

2. *'ఏదో' 'ఎవడో' అవృత్త వాక్యం :* "అమృతమేదో, హాలహలమేదో, పూలబంతి యేదో, తుపాకి గుండేదో, మిత్రుడెవడో, శత్రువెవడో, స్వర్గమేదో, నరకమేదో, పరమేశ్వరుడెవడో, బ్రహ్మరాక్షసుడెవడో, భేదమంతయు నశించినది కదా !" (పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు - సాక్షి- సాక్షి సంఘ నిర్మాణము - పుట 3)

## 2.3 సమాప్త పద విశిష్ట వాక్యాలు

వాక్యంలో ప్రారంభంలో ఉన్న పదమూ, పరిసమాప్తిలో ఉన్న పదమూ, ప్రధాన స్థానాన్ని కలిగి వుంటాయి. వాక్యారంభంలోని పదం తత్పూర్వ వాక్యాంత పదంతో సంబంధించి వుంటుంది. అలాగే వాక్యాంత పదం ఆగత వాక్య ప్రథమ పదంతో అనుసంధానం పొంది వుంటుంది.

అందువల్ల వాక్య ప్రథమ పదం వాక్యాలను కలిపే పదంగా వుంటే వాక్యాంత పదం వాక్య సారాంశంగా మిగులుతుంది వాక్యం వల్ల పాఠకుడు పొందే అనుభవం, ఆ వాక్యంలో చివరి పదం మీద ఆగి, నిలిచి వుండి, స్థిరీకరింపబడుతుంది. కనుక వ్యాస రచయిత ముద్రింప దలచుకొన్న భావం వాక్యాంత పదంలో నిక్షిప్తం చేయటం వాక్య సంప్రదాయం. అందువల్ల వాక్యం చివర ఉన్న పదం ప్రధానంగా మనిషి తలలాగా గౌరవింపబడుతుంది.

"—Or consider a more particular point. One of the most important things, to my mind, in English style is word-order. For us, the most emphatic place in clause of sentence is the end. This is the climax; and, during the momentary pause that follows, that last word continues, as it were, to reverberate in the reader's mind. It has, in fact, the last word. One should therefore think twice about what one puts at a sentence-end." (28)

కాబట్టి వాక్యాంత పదంతో పాటు, పద క్రమం వల్ల కూడ వాక్య గౌరవం పెరుగుతుంది. ఈ విధంగా కాక, వాక్యం సాధారణంగా వ్రాసే తీరు, తారుమారు చేయటం వల్ల చివరి పదం మీద బరువు నిలిచి, వాక్యం అధిక సమర్థపు విషయబోధ కావిస్తుంది.

ఈ వాక్యాంత పద ప్రయోగం ఒక్కొక్కప్పుడు రచయిత, పాత్ర మనస్తత్వ దర్శనానికి, ఆలోచనా రీతికి ప్రయోగించవచ్చు. ఈ పద క్రమ నిర్ణయ దృష్టి నుంచి ఆధునిక రచనా విధానాలకు మార్గం గోచరమవుతుంది. వాక్యాంత పదం మీద బరువు నిలిచి, విషయ గౌరవం పెరుగుతుంది.

పాఠకుడికి కలిగే అనుభూతి క్రమంలో పదాలు ప్రయోగింపబడి వాక్య నిర్మాణం ఏర్పడవచ్చు. అందువల్ల పద క్రమం అనుభూతి క్రమం కావచ్చు.

1. వీచెను గాలి చల్లగా.
2. గాలి వీచెను చల్లగా.
3. వీచెను చల్లగా గాలి.
4. చల్లగా వీచెను గాలి.
5. గాలి చల్లగా వీచెను.
6. చల్లగా గాలి వీచెను.

ఈ వాక్యాలు ఆరింటిలో 1,2 లో చల్లగా, 3,4 లో గాలి, 5,6 లో వీచెను ప్రాధాన్యత వహిస్తాయి. ఈ వాక్యంలో మూడు పదాల మీద ప్రాధాన్యం

నిలుపవచ్చు. అయితే ఒక్కొక్క వాక్యానికి రెండు రూపాలు ఉన్నాయి. ఉదాహరణకు మొదటి రెండు వాక్యాలు గ్రహింపవచ్చు. అందులో గాలి, వీచెను రెండు పదాలు ప్రారంభంలో ఉన్నాయి. వీటిలో ఏది తత్పూర్వ వాక్యానుసంధానం కలిగిందౌతుందో అది సమర్థంగా ఉంటుంది.

ఈ వాక్యాంత పద ప్రయోగ విధానంలో గుర్తించుకోవలసిన అంశ మొకటి ఊనిక. సాధారణంగా చివరి పదం మీద విషయం బరువు నిలపవచ్చు. కాని, ఊనిక ఉన్న పదం, వాక్యంలో ఎక్కడున్నా, వాక్య సారాంశం గ్రహించి, వాక్యంలో మకుటం లాగా నిలుస్తుంది.

ఉదాహరణాలు: 1. దినముల లోపల నుత్తమ దినమే తద్దినము. (వదరుబోతు-పుట 5)

ఈ వాక్యంలో చివరి విశ్వాసం తద్దినం మీద నిలుస్తుంది. అది వాక్య బలమంతా పీల్చుకొన్న పదం.

2. నేర్పులేని వాని పదవి మేక మెడ చన్ను. (నార్ల వేంకటేశ్వరరావు -పిచ్చాపాటీ-పుట 29)

నిరుపయోగమయిన, అనవసరంగా బరువు అయిన మేక మెడ చన్ను మీద వాక్యం బరువు నిలుపుతుంది.

## 2.4. వ్యాకరణా విధేయ వాక్యాలు

సర్వ వాక్యాలు ఒక విధమైన సమతతో నిర్మిత మవుతాయి. భాషాంతర నిబిడమైన తూగునుంచి వాక్యాలు ఆవిర్భవిస్తాయి. కాబట్టి వాక్యం సాధారణంగా, ఒక ధర్మంతో, ఒక లక్ష్యంతో, ఒక లయతో నిండి వుంటుంది. సహజంగా ఈ నిర్మాణం వ్యాకరణ విధేయం కావచ్చు. వ్యాకరణంలో మార్పులు వాక్య నిర్మాణంలో మార్పు తెచ్చి శైలీ సందర్శనం చేయవచ్చు. రాముడు సీతను పెళ్ళాడాడు అన్నప్పుడు రాముడు ప్రాధాన్యం వహిస్తే, సీత రాముడి చేత పెళ్ళాడబడింది అన్న చోట సీత ప్రాముఖ్యం పొందుతుంది. ఒక్క వాక్యం భిన్న రీతుల్లో వ్రాయటం వల్ల శైలీ పరిణామం వస్తుంది.

అయితే, కొన్ని అభిప్రాయాలు ప్రకటించేటప్పుడు, కొన్ని అనుభవాలు వ్యక్తీకరించేటప్పుడు, కొన్ని హృదయగత భావాలు తెలిపేటప్పుడు వాక్యం,

భావాల బరువుతో కుంగి పోవచ్చు, పంగి పోవచ్చు, వంకర కావచ్చు, వ్యాకరణం పరిధి అతిక్రమించవచ్చు.

వ్యాకరణపరిధిలో లేకపోతే వాక్యం తప్పుగా భావించడం ప్రాథమికభాషా సత్యం. కాని, పరిణతమయిన భాషలో వాక్యాలు వ్యాకరణానికి అవిధేయంగావుండి, భావప్రకటన సమర్థంగా ద్యోతకం కావచ్చు. మనస్తాత్త్విక వాస్తవికత ప్రదర్శించే రచనల్లో చైతన్య స్రవంతి రచనా విధానంలో భాష వ్యాకరణ విధేయం కాకుండా విశృంఖలంగా సాగుతుంది. ఇటువంటి చోట వాక్యాలు వ్యాకరణ బద్ధం కాకుండా మానసిక వాతావరణానికి దర్పణమవుతాయి.

వ్యాకరణాన్ని అతిక్రమించినవాక్యం ఒక్కొక్కప్పుడు అనవసర పదాలు లేకుండా సంక్షిప్తతతో, అన్వయి క్లైష్ట్యం లేకుండా స్పష్టతతో రూపొంది, ఉత్తమ శైలికి దోహదం చేస్తుంది. ఇటువంటి వాక్యాలు ఆవేగ ప్రధానంగా రూపొంది అనుభూతి వేగంగా కలిగిస్తాయి.

ఉదాహరణలు :- 1. ''స్వేచ్ఛ ! స్వేచ్ఛ ! స్త్రీలకి స్వేచ్ఛ, పిల్లలకి స్వేచ్ఛ ! కార్మికులకి స్వేచ్ఛ ! మామూలు మాటలు, ప్రతి వాళ్ళ నోటి నుంచీ ఈ మాటలు, ఆ స్వేచ్ఛా దేవత ప్రత్యక్ష మయిందా, ప్రేమించిన స్త్రీ, పెంచిన పిల్ల, పోషించిన నౌకర్లు, సాకుతున్న కుక్క- రూపాన స్వేచ్ఛ కావాలని ఎవరు తిరిగి కళ్ళముందు నిలబడ్డదా, ఆ ఆదర్శాన్ని భరించగల మనుష్యు లెంద రున్నారు?'' (శ్రీ చలం-మ్యూజింగ్స్ I- పుట 172)

స్వేచ్ఛ అందరూ కావాలంటారు, మనిషి తను ఆదరంగా చూచుకొనే స్వేచ్ఛ కోరి వెళ్ళిపోతే తను ఈ స్వేచ్ఛాధర్మాన్ని భరించగలడా అన్న విషయం తెలిపే ఈ వాక్యం స్పష్టత తక్కువగా, క్లుప్తత తక్కువగా వ్యాకరణానికి లొంగకుండా వుంది కాని ఒక మానసికానుభూతిని తెలుపుతుంది. ఆ అనుభూతి వెంట సేవకుడిలా భాష పరుగెత్తింది. 'కళ్ళ ముందు నిలబడ్డదా' కు, 'ఆదర్శాన్ని'కి- మధ్య అక్షరాలు లేకపోయినా అను భూతి పొందిన సౌందర్యం నిశ్శబ్దంగా వినిపిస్తుంది.

2. ''సరిగా మనం స్నానాలు చేసినచోట నీళ్ళల్లో మెల్లగా తేలి నడిమధ్య రాళ్ళమీద కూచోడం, నీనుంచి నేను దూరంగా యీదితే భయమేసి నువ్వునన్ను

వెనక్కి పిలవడం, నీలపు నీటికింది నీ తెల్లని చేతులు- సాగే నఖం, అవతలవొద్దుననే మళ్ళీ నృత్యం అంత అందం-ఎట్లాంటి రోజులివి?''(శ్రీ చలం-ప్రేమలేఖలు-పుట 67)

సాంప్రదాయికంగా వాక్యాన్వయం అసాధ్యమయినా, ఒకానొక మానసిక చిత్రీకరణ జరిగి, భాష నిర్వహించవలసిన కార్యంకంటే ఉత్తమవిధి నిర్వహింపబడింది ఈ వాక్యంవల్ల.

## 2. 5. చిన్న వాక్యాలు :

తెలుగులో చిన్నవాక్యాలు ఒక పదంతో కూడిన క్రియతోగాని, క్రియ లేని రెండు మూడు పదాలుతో కాని, ఏర్పడవచ్చు. సాధారణంగా రెండుకంటే ఎక్కువ పదాలు, అయిదారుకంటె తక్కువ తక్కువ పదాలతో ఏర్పడ్డ వాక్యం మిక్కిలి చిన్న వాక్యంగా భావింపవచ్చు.

చిన్నవాక్యంవల్ల రచనలో వేగంతోపాటు విషయం స్పష్టంగా క్లుప్తంగా తెలిపే అవకాశం వుంటుంది. ఆధునికాంధ్ర వచనంలో కొంతవరకు చిన్న వాక్య రచన జరుగుతూ వుంది.

*ఉదాహరణాలు*: 1. ''వారి కాకాశమే పత్రము. నోటిమాటయే చేవ్రాలు. సూర్య చంద్రులే సాక్షులు. సత్యమే స్టాంపు." (పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు-సాక్షి II-సనాతనాధునాతన నాగరకతలు-పుట 75)

పై వాక్యాలన్నీ నాలుగూ, రెండూ, మూడు మాటలతో కూడిన చిన్న వాక్యాలు. సనాతన నాగరకతలోని శ్రేష్ఠతను వేగంగా స్పష్టంగా ఈ చిన్న వాక్యాల మూలంగా తెలిపాడు.

2. చెట్టు ఋతువు ప్రకారం ఆకు రాల్చవచ్చు, చిగర్చవచ్చు, పుష్పించవచ్చు, కాయ కాయవచ్చు. (ముట్నూరి కృష్ణారావు - నర లీలా రహస్యం - లోవెలుగులు-పుట 207).

3. ''నాగేంద్రునకు దీపము పనికిరాదు. అందుచేత దీపము పెట్టరు. వేడి వస్తువులు పనికిరావు. ఉడికించని ఆహారమే వినియోగింతురు. ప్రధానముగా చలిమిడి చేసి తిందురు. ఇది కడుపు చలవకోసమని స్త్రీల విశ్వాసము.''

(ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము లక్ష్మీరంజన వ్యాసావళి. ఆంధ్రుల సాంఘికాచారములు-నియమములు-తీర్థములు-పండుగలు-పుట 118).

## 2. 6. పెద్దవాక్యాలు:

ఇన్ని పదాలుంటే, ఇంత పొడవుంటే, ఇది పెద్దవాక్యం అనే అవకాశం కంటే చిన్నదిగా లేదు అనుకోదగ్గ వాక్యమే పెద్దవాక్యం. తక్కువ పదాలతో చిన్నవాక్యం, ఎక్కువ పదాలతో పెద్దవాక్యం ఉంటాయి. కాని అంతకంటే విస్పష్టంగా వాక్యపరిమితి నిర్ణయించే అవకాశం లేదు.

వీటిలో ముఖ్య ధర్మం గమనించి విభజన చేయాలంటే కొన్నింటికి అవకాశం వుంది. సముచ్చయంకాని ప్రశ్నార్థకం కాని, ఆశ్చర్యార్థంకాని, భావార్థం కాని, వ్యతిరేకార్థం కాని, క్రమంగా ఎక్కువగా అధికంగా ప్రయోగింపబడ్డ వాక్యం పెద్దదిగా రూపొందుతుంది. అసమాపక క్రియా ప్రయోగం, వాక్యాన్ని పెద్దదిగా తయారు చేస్తుంది. విరామ చిహ్నాలు ఒక దానికి బదులు మరొకటి ప్రయోగించే వీలుంటే, ప్రయోగిస్తే, వాక్య దైర్ఘ్యం పెరుగుతుంది. వాక్యాలు, పదాలు కలిపే కొన్ని పదాలు అధికంగా ప్రయోగించటం వల్ల వాక్యం దీర్ఘత్వం పొందుతుంది. ఒక వాక్యంలో ఒక విధమైన సమాప్తి ఎంతగా పెంచితే అంత పెద్దవాక్యం ఏర్పడుతుంది. ఒక ధోరణి అధికంగా గాని, భిన్న ధోరణులు అల్పంగా కాని ప్రయోగించటం వల్ల వాక్యాలు పెద్దవిగా ఏర్పడుతాయి. శాస్త్రీయ విషయం కంటె తీవ్ర హృదయ భావ వ్యక్తీకరణకు పెద్ద వాక్యం సమర్థంగా వుంటుంది.

*ఉదాహరణాలు :* 1. మూడు ధోరణుల వాక్యం : ''కన్నులగాజులతో, నోటి సిగరెట్లతోఁ దలల సీమంతములతోఁ గాలి జోళ్ళతోఁ జర్మావలగ్న బంధములతో; తిలక శూన్యాళికములతోఁ జేతి కఱ్ఱలతో సెంట్లవాసనలతో మీరు వీధులలో నేమి, సముద్ర తీరము నందేమి, భోజన శాలలందేమి, పడుకగదులందేమి, నిరంకుశముగ, నిశ్శంకముగ, నిర్గత ప్రాచీనాచారులై ప్రవర్తింపలేదా ?'' (పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు-సాక్షి II-ప్రమాణ వాక్యములు-పుట 51)

ఈ వాక్యంలో తో, ఏమి, గ, లతో ముగిసే పదాలలో వున్న వాక్య భాగాలు మూడు. ఈ మూడు విధాల వాక్య భాగాలతో నిండిన వాక్యమిది.

2. సముచ్చయం దీర్ఘంగా వ్రాయబడ్డ వాక్యం : ''ఎంత విచిత్ర మైన శక్తి ఉన్నదో చూడు నీకు ? కన్ను తెరవనూ గలవు, మూయనూ గలవు, వెలుగును లోపలకు రానియ్యనూ గలవు, రాకుండానూ జెయ్యగలవు, ఒక్క విషయాన్నుండి ఇంకో విషయానికి నిలకడ లేకుండా పరుగు లెత్తనూ గలవు, ఒక్క విషయం మీదే కదలకుండా నిశ్చలంగా నిలవనూ గలవు, ఒక్క విషయాన్ని జ్ఞాపకం ఉంచుకోనూ గలవు, మరచిపోనూ గలవు, మరచిన దానిని తిరిగి జ్ఞప్తిలోనికి దెచ్చుకోనూ గలవు.'' (ముట్నూరి కృష్ణారావు-లోవెలుగులు-సమగ్ర దృష్టి-పుట 223)

ఈ వాక్యంలో 'నూ' విశిష్టత వల్ల రచనలో ప్రవాహ దశ.

## 3. అనేక ప్రశ్నల వాక్యం

''కాని యీ మతములు ధర్మాధర్మములు, వర్ణాశ్రమములు' కట్టుబాట్లు వీని యాడంబర మేమి ? జీవితానంతరము మాత్రము మన నెత్తిన శిఖర మెత్తుటకా యివి ? మానవుని జీవిత కాలమున సుఖమాపాదించుటకుఁ గానిచో, తర్వాత నివి యేల? ఈ యేడంతయు నుపవాసమున మలమల మాడి, వచ్చు సంవత్సరము నిరంతరము పండుగుల ననుభవించుట కెట్టి మూర్ఖు డిచ్చ గించును? కావున వీని నిర్మించిన మహనీయుల యభిప్రాయ మేమైయుండును ? సంఘమును బాగు పఱచుటకా ? లేక ముక్తి నొసగుటకా ? వారు స్వర్గ సంపా దనములని జెప్పు ధర్మశాస్త్రములన్నియును సంఘమునకు మేలు గలిగించు నుద్దేశము గలవికావ ?'' (వదరుబోతు-పుట 13).

ప్రశ్నార్థకాలు రచనకు వేగం సముపార్జించాయి.

## 3. 2. పదం

శైలి భాషా సంబంధిగా గమనించేటప్పుడు పదం జాగరూకత వహించ వలసిన భాగం. ఈ సందర్భంలో పద ప్రయోగంలో ఉండే ధర్మాలు దర్శించినంతగా పదం పుట్టుక, పదం చరిత్ర చూడవలసిన అవసరం లేదు. పదం, ప్రయోగింపబడ్డప్పుడు పొందే అర్థం, శైలిలో కలిగించే మేలి గుణాల దృష్టితో, భాషలో ఆధునిక యుగంలో తెలుగుపదం ఏ భావం తెలపటానికి ఉద్దిష్టంగా వుందో, వర్తమానంలో దాని విలువ ఏమిటో ఆ తీరు పరికించటమే కృత్యం.

తెలుగు పద జాలంలో అచ్చ తెలుగు పదాలతో పాటు, సంస్కృత ప్రాకృత తత్సమ తద్భవాలు, ఉరుదూ, ఆంగ్ల పదాలు ఎన్నో ఉన్నాయి. ఈ పదాలు భాషా రూపంలో, అర్థంలో, పొందిన పరిణామంతో కంటె ఆ పదాలు వ్యక్తం చేసే అర్థంలో శైలి సంబంధం కలిగి వుంటుంది.

ప్రయోగం నుంచి దూరమయిన పదాలతో శైలికి సంబంధం లేకపోయి, ప్రయోగింపబడిన పదం వ్యక్తీకరించే ధర్మంనుంచి శైలి స్ఫురిస్తుంది. పదం పొందే అర్థం, శబ్దం శైలిలో అవశ్యం పరిశీలింపబడే అంశాలు.

పదంపొందే వాచ్య లక్ష్య వ్యంగ్యార్థాలు వింగడించి చూసే ప్రయత్నం కంటే ప్రయోగంలోఉన్న విలక్షణత వల్ల సాధింపబడ్డ శైలి దర్శింపబడుతుంది అందువల్ల అలంకారిక సంప్రదాయంలో పదగత చర్చకంటే, ప్రయుక్తపదంలో శైలి నిక్షిప్తమయివుంటే అది ఏవిధంగా ఏర్పడిందో ఆలోచింపవచ్చు. స్థూలంగా పదం శైలీ ప్రదర్శకమయితే, తత్ప్రదర్శనకు, తత్పద సామర్థ్యం పరిశీలించడం ఉచితం.

## 2. 1. పదం-సామర్థ్యం

పదం నిరంతర ప్రయోగంవల్ల ఒక్కొక్కప్పుడు స్వార్థం కోల్పోతుంది. కాలగమనంలో విపరిణామార్థం మిగులుతుంది. పదం కలిగిఉన్న అర్థం, కాల క్రమంలో పొంది ఉన్న అర్థం రెండూ ఒకేసమయంలో ప్రయోగింపబడుతుంటే ఆ పదం రెండంచుల పదునుకత్తి! రచనలో పదార్థం విపరిణామార్థం శైలీద్యోత కాలు కావచ్చు.

ఒక ధాతువునుంచి పుట్టిన పదాలు పెరుగుతాయి. సంకోచం వ్యాకోచం పొంది విస్తృతంగా విశాలంగా చెట్టులాగా వ్యాపిస్తాయి ఒక్క ధాతువు శాఖోప శాఖలుగా విస్తరిల్లుతుంది. ఒక్కపదం చిలువలు పలువలుగా కొమ్మలు రెమ్మలు తొడుక్కుంటుంది. అయితే ఒక పదంలాగా ఇంకొక పదం ఉండదు. ఏ రెండు పదాలూ ఒకే అర్థం కించిన్మాత్రంగానయినా తేడా లేకుండా, బోధించవు.

సాధారణంగా ఏ కవీ, తన అనుభూతి నంతటినీ వ్యక్తం చేయగలిగే పద జాలంతో సంసిద్ధుడై ఉండలేడు. ఉన్న పదజాలంతో భావ వ్యక్తీకరణం చేయ డానికే పూనుకొంటాడు అందువల్ల పదానికి ఉన్న అర్థం ఏమిటన్న ఆలోచన

కంటే, ఆ పదం కలిగిస్తున్న అనుభూతి ఏమిటన్నదే ప్రయోజనకరం. ఒక నిరర్థక పదమయినా, ప్రత్యేక ప్రయోగ సామర్థ్యం లేనిదైనా, బాగా ఆలోచింపబడి, ప్రదర్శించబడితే, విశ్వద్వారాలు తెరిచి, రహస్యాలు తెలుపుతుంది.

"ఆమె సౌందర్యం చూసి నా చిరునవ్వు ఆమెకు నమస్కరించింది." (చలం-మ్యూజింగ్స్-పుట141).

చిరునవ్వు అంటే అభినందన చిహ్నంగా నమస్కారం అంటే గౌరవ సంకేతంగా గ్రహించిన ఆ పదాలు ప్రసాదించిన స్ఫూర్తి విశిష్టం. చిరునవ్వు నమస్కరించడంలో ఉక్తి వైచిత్రి వుంది.

సంకేతంగా ఏర్పడ్డ ఒక పదం కలిగివున్న అర్థం దాదాపుగా అదే అర్థంలో ప్రయోక్తనుంచి శ్రోతకు చేరాలంటే మధ్యలోఉన్నమార్గం విస్పష్టంగా నిర్ణయించే అవకాశంలేదు. ఒక పదం ఒక వ్యక్తికి బోధించే అర్థం అదే రూపంలో అవతల వ్యక్తిని చేరేస్థితిని విశదీకరించడం అసాధ్యం. అయితే మనిషి మనస్సు మారుమూలల్లో చరించే ఒకానొక సామాన్యతత్వం-సామాజికసంబంధం-ఇద్దరకు ఒక పదం, దాదాపు ఒకేఅర్థంలో స్పష్టమయ్యేటట్లు చేస్తుంది.

పలకటంలో ఊనిక, కాకువు మొదలయినవి ఒక పదం ఇచ్చే అర్థం నిర్ణయించడానికి ఉపయోగపడతాయి. అయితే రచనలో, ఈ భాషా సామర్థ్యం స్పష్టంచేసే అవకాశం తక్కువ. అందువల్ల వాక్కు కలిగిఉన్న ధర్మాలు-రచనా పరిమితిలో ప్రదర్శించే వ్యాసం శైలీ శోభిత మవుతుంది.

ప్రతి పదం తన అర్థం తాను నిలుపుకోవడానికి తీవ్రంగా ప్రయత్నిస్తుంది. సాలీడులాగా తన చుట్టూ వలయాలు నిర్మించుకొని వాతావరణం ఏర్పరచుకొంటుంది. ఆ పదం, తన పరిశోధనలోకి వచ్చిన ఇతర పదాలనే కీటకాలను ఏరుకు తిన్నట్లు తనలో నిక్షిప్తం చేసుకొని, తన పరిసరాన్ని విస్తృతం చేసుకొంటుంది.

అందువల్ల ఏ భాషా పదజాలం అయినా కొత్త భాషా పదజాలాన్ని తన పరిధిలోకి రాకుండా చూచుకొంటుంది. అందువల్ల అన్య భాషా పదాలు అంత తొందరగా అంత ఎక్కువగా ఏ భాషలోనూ చేరవు. సాధారణంగా కొత్త పదజాలంలో చేరాలంటే విపరీతంగా అలజడి ఆందోళన జరుగుతాయి.

"అనవసరముగ నొకటిపై నొకటి యంగరఖాలు దొడిగికొని మెడ కజాగళ స్తనముల నతికించుకొనుటకును, కాలి తిత్తులు బిగించుకొనుటకును కాలమంతయు వ్యర్థమగుచుండ సద్వ్యాసంగమునకు గాలమెట్లు వచ్చును?" (వదరుబోతు-పుట 24)

షర్టు, కోటు, బొ, సాక్స్ అనే ఆంగ్ల పదాలు ఆంధ్రంలోకి రాలేక పోయాయి. వచ్చిన కలక్టర్ వంటి పదాలు కలకటేరు మొదలయిన రూపాలు పొందాయి.

ఆంగ్లభాష ఇతర భాషా పద జాలం స్వీకరిస్తున్నట్లుగా ఒకప్పుడాంధ్ర భాష సంస్కృత పదాలు అధికంగా స్వీకరించింది. అయితే అన్య భాషా పదాలు ఇప్పుడాంధ్ర భాషలో ప్రవేశించటానికి చాలా చిక్కులు, అవరోధాలు, వ్యాస కర్తల దృష్టిలో, ఉన్నాయి. అయితే ఉరుదు, ఆంగ్ల పదాలు అనేకం, పద రూపంలో పదార్థ రూపంలో పరిణామం చెంది, తెలుగు భాషలో చేరాయి.

"బాంబు ఎవరిదైనా ఫలితం మాత్రం గ్యారంటీ" (శ్రీ శ్రీశ్రీ-శ్రీశ్రీ సాహిత్యం రెండు-పుట 348)

బాంబు, గ్యారంటీ తెలుగు పదాలు లాగా ఆంధ్ర భాషలో చేరిపోయి, భావ ప్రకటనంలో క్లుప్తతకు స్పష్టతకు దోహదం చేశాయి.

"నై" అన్నాడు గవర్నరు 'నై'(Nye)" (శ్రీ శ్రీశ్రీ-శ్రీశ్రీ సాహిత్యం రెండు-379) ఉరుదూ పద స్వేచ్ఛ గుర్తింపవచ్చు.

పదం అంటే భావం, లేకపోతే వస్తువు. పదం ప్రయుక్తమయితే, భావమో, వస్తువో, అటువంటివో గోచరం కావాలి. ఉత్తమ శైలిలో ఆ అవకాశం వుంటుంది. ఇది వాక్కులో వ్రాతలో సంపూర్తిగా సత్యంగా నిర్ణయం కాకపోతే, కనీసం దాని సమీపానికి అయినా అభివ్యక్తి చేరుకోవాలి.

ఏ వ్యాసంలో అయినా పదాలు కనిపిస్తూ పదార్థం గోచరం కాకపోతే, రచయిత ఉత్తమ శైలి కలిగి వుండలేదని అర్థం. "And where the words are so muddled, I suspect that the mind is muddled too." (29)

అయితే పదాల విషయంలో మిక్కిలి జాగరూకత అత్యుత్తమ వ్యాస కర్త కూడా ప్రదర్శించలేకపోవచ్చు. భావ తీవ్రతతో, అనుభూతి బరువుతో,

మనస్సు గుండె పీడితమై తాడితమై వుంటే, పదాంకోసం, పదాలు చిత్రిక పట్టటం కోసం రచయిత ఓపిక పట్టలేకపోవచ్చు. "Flaubert himself, that saint and martyr of style, felt driven to confess that the greatest writers were pre-occupied with greater things than perfect words." (30)

## 2.2 పదం-శబ్దం

పదం పలికితే వినవచ్చే ధ్వని చెవి కింపుగా వుండటం లేకపోవటం, రసోచిత అర్థ స్ఫూర్తి కలిగించటం కలిగించలేకపోవటం, ఆధారం చేసుకొని పదానికి ఉన్న శబ్దం వల్ల ఎదుటి వ్యక్తి దాని అర్థం కాకపోయినా, కొంతవరకు దాని ధోరణి గుర్తించవచ్చు. కొన్ని ప్రత్యేక ధ్వనుల కలయిక కొన్ని అనుభూతులు కలిగించే అవకాశం వుంది. వర్గ యుక్కాలు, సంయుక్తాక్షరాలు కలగాపులగంగా వ్రాయబడ్డ తీరు భీతావహం కావచ్చు. సరళాక్షర భాష కోమలంగా మృదువుగా ఉండవచ్చు.

అందువల్ల పదానికున్న శబ్దం, అర్థం వల్ల కలిగే వాతావరణం, రసధోరణి గుర్తింప జేయవచ్చు. శబ్దం నుంచి లయ పుడుతుంది. లయ శబ్దాలంకారం వల్ల కూడా సాధింపబడుతుంది. అనుప్రాస, యమకం వంటి శబ్దాలంకారాలు కూడ లయను సాధిస్తాయి.

వచనంలో ఛందస్సును ఏ విధంగానూ గ్రహించడానికి కృషి చేయకూడదుకాని లయ సాధించటానికి ప్రయత్నించవచ్చు. లయ భావ బోధనకు ఒక్కొక్కప్పుడు మిక్కిలి సమర్థంగా వుంటుంది. అయితే వచనంలో లయ కోసం విపరీతంగా ప్రయత్నించటం కాని, అదే పనిగా వ్రాయటం కాని ప్రమాదకరమయిన ఫలితాలకు తోవ తీయవచ్చు. జాగ్రత్తగా ప్రయుక్తమయిన వచన లయ ఉత్తమ శైలికి మార్గ మేర్పరుస్తుంది.

వచనంలో-వాక్యంలో వర్ణావృత్తి, పద్యంలో యతిలాగా, కొంతవరకు వాక్యోచ్చారణలో విశ్రాంతికి, శ్రవణ సుభగత్వానికి దోహదం చేస్తుంది. ఈ వర్ణావృత్తి భాషకు, తత్త్వవేదాంత సంబంధి కాని, ప్రాథమిక ధర్మ ప్రబోధకం గాని, అయిన విషయానికి, ఉదాత్తతను సాధిస్తుంది.

సంస్కృతాలంకారిక సంప్రదాయానుసారంగా వైదర్భ్యాది రీతులు, శ్లేషాది గుణాలు పదోచ్చారణ ధ్వని మీద ఆధారపడి వింగడింపబడ్డాయి. సమత పద్య రచనకే ఉద్దిష్టమయినప్పటికీ గద్యరచన విషయికంగానూ ప్రయుక్తం కావచ్చు. తెలుగులో సంధిగతమయి, ఒక వర్ణం, మరో వర్ణంగా మారటం వల్ల వచ్చే ధ్వనికూడా, శైలికి దోహదం కలిగిస్తుంది.

పద ధ్వని శైలికి తేజస్సు ప్రసాదిస్తుంది. అయితే ఒక్క శబ్దం మీద చెవి పెడితే, అర్థం కాని, వాక్య శోభ కాని, ఎప్పుడయినా చ్యుతమయ్యే అవకాశం ఉంది కనుక ఉత్తమ శైలికి శబ్ద జాగరూకత అవసరం అవుతుంది.

## 2.3. పదం-దోషం :

పద ప్రయోగంలో రావటానికి వీలున్న దోషాలు గమనింపవలసి వుంటుంది. దోషాలు పరిహరిస్తే పద ప్రయోగం గుణభరితమే అవుతుంది. సంస్కృతాలంకారిక సంప్రదాయానుసారంగా ఆంధ్రంలో పద విషయికంగా జరిగిన దోష పరిశీలనం అంత సక్రమంగా ఉండటాన్ని ఆంగ్లంలో వెదుక వలసి వుంటుంది. కాబట్టి దోష పరిహారం కోసం, పద ప్రయోగంలో, వాటి రీతులు గమనింపవలసి వుంటుంది.

డొంక తిరుగుడుగా ప్రస్తుతానికి నిరుపయోగంగా ఉండే పదంలో అపుష్టార్థాన్ని; అప్రసిద్ధ పద కల్పనంతో అర్థ సాధనం యత్నించే పదంలో నేయార్థాన్ని; ఒక భావం తెలపటానికి సమర్థంకాని పదం వల్ల అసమర్థాన్ని; అర్థవంతం కాని పదం వల్ల నిరర్థకాన్ని; అర్థ ద్వయమున్న పదం తెలిపే రెండర్థాలలో అప్రసిద్ధార్థం తెలిపే పదం వల్ల అన్వర్థాన్ని; వ్రీడ, జుగుప్స, అమంగళకరాలయిన పదాల వల్ల అశ్లీలాన్ని; శాస్త్ర పురాణాలలో ప్రసిద్ధంగా వుండి, నేడు ప్రయోజనం లేని విశేషణం తెలిపే పదాల వల్ల అప్రయోజకాన్ని; తాత్పర్యం స్పష్టం చేయలేని పదాల కలయిక వల్ల క్లిష్టాన్ని; పదానికున్న భిన్నార్థాలలో ఏది ఉద్దిష్టమో తెలుపలేకపోయే పదాల వల్ల సందిగ్ధాన్ని; వాంఛితార్థం కంటే భిన్నార్థం ద్యోతకం చేసే పదాల వల్ల విపరీత ధీప్రదాన్ని; ప్రధానమైన విషయాన్ని అప్రధానంగా, అప్రధానాన్ని ప్రధానంగా తెలిపే పదాల వల్ల అవిమృష్ట విధేయాంశాన్ని; చెవికింపుగాని పదాల వల్ల పరుషాన్ని దోషాలుగా ఆలంకారికులు నిర్ణయించారు.

అవిమృష్ట విధేయాంశం పదగత దోషంగా కాక, సమాసగతంగానో, వాక్యగతంగానో భావించే అవకాశం వుంది. నాగరక వ్యవహారం తెలియని వాళ్ళు ప్రయోగించే పదం వల్ల గ్రామ్యదోషం, వ్యాకరణ సంస్కారం లేని పదం వల్ల చ్యుత సంస్కారదోషం తెలుపబడ్డాయి కాని, అవి వర్తమానాంధ్రంలో దోషాలుగా పరిగణించే అవకాశం తక్కువగా వుంది.

వ్యావహారిక భాష ప్రయుక్తమవుతూ, మాండలిక భాషా ప్రయోగం కోరబడుతూ వున్న వర్తమానంలో గ్రామ్య పదం దోషం కాదు. అయితే గ్రాంథిక భాషలో పరిహార్యంగా, వ్యావహారిక భాషలో వాంఛనీయంగా గ్రామ్యం తలపబడుతుంది. వ్యాకరణ సిద్ధి లేని పదం బహుకాలం ప్రయోగార్హం కాదన్న భావం ఏర్పడి వుంది. అయితే గ్రాంథిక భాషకున్న వ్యాకరణం వ్యావహారిక భాషకుండదు. వ్యావహారిక పదాలు వ్యాకరణ నియమాలు లేకుండా ప్రయోగింపబడుతున్నాయి. కాబట్టి, వ్యాకరణ మంటే లిఖితమైనా, కాకపోయినా అది భాషా ధర్మం. అంటే, లిఖిత వ్యాకరణం గ్రాంథిక భాష కుంటుంది. అది వ్యావహారిక భాషకుండకపోవచ్చు. అంతమాత్రాన వ్యావహారిక భాష వ్యాకరణరహితం కాదు. అయితే దాని లక్షణాలు వ్యాకరణంగా సిద్ధించి, గ్రంథంగా ముద్రితమై ఉండకపోవచ్చు. వ్యాకరించిన ధర్మాలు గ్రంథరూపంలో కనిపించనంత మాత్రాన వ్యావహారిక భాష వ్యాకరణ విరుద్ధమైన భాష కాదు. కాని ఈ వ్యాకరణ విరుద్ధంగా కవులు ప్రయోగాలు చేయవచ్చు. అయితే అది భాషా విరుద్ధంగా వుండదు.

అయితే వ్యాకరణాన్ని త్యజించిన ప్రయోగాలవల్ల అభివ్యక్తి అందగిస్తే, ఆ పదం చ్యుత సంస్కారం, దోషాలు కాకపోగా, గుణాలై శైలి శోభిస్తుంది.

అలంకార సంప్రదాయంలో రీతులు గుణాలు క్రమ గుణ దర్శితాలయితే, వాక్య పద దోషాలు వ్యతి క్రమ గుణ దర్శితాలవుతున్నాయి. సంప్రదాయ సిద్ధిని అనుసరించి, వ్యతి క్రమ గుణ మార్గంలో లక్షణ నిర్దేశం చేసే పద్ధతి ప్రాచ్యంగా, క్రమగుణ మార్గంలో విషయ వివేచన చేసే తీరు పాశ్చాత్యంగా భావింపవచ్చు. స్పష్టతకు పాశ్చాత్య పద్ధతి, నిర్దుష్టతకు ప్రాచ్య పద్ధతి స్వీకరింపదగివుంటాయి.

భారతీయ సారస్వతంలోని పద సామర్థ్యం మీద జరిగినంత చర్చ, అది శాస్త్రీయంగా సాగిన తీరు ఇతర సారస్వత సంప్రదాయాలలో పరికింప వలసే వుంటుంది. ఇంత లేదనవచ్చు. పదాన్నీ, పదార్థాన్నీ శాస్త్రీయంగా దర్శించారు ఆలంకారికులు. అయితే శైలి గతంగా కొత్త దృక్పథం ఆంగ్ల సారస్వత సాహచర్యం నుంచి సంక్రమించింది.

పదం భావింపబడిన భారతీయ దర్శనం దృష్టితో ఆ శాస్త్రీయ విభాగం విశదంగా వింగడించుకొని చూస్తే శైలికి అవసరమయిన, ప్రాణభూతాలయిన గుణాలు, ఈ ఆ చర్చల అంతర్భాగాలు. ఆ పేరుతో, ఆ తీరులో కాకపోయినా, శైలికి సంబంధించిన పరిశీలనం, ప్రాథమికంగా భారతీయాలంకారిక సంప్రదాయ సిద్ధమే !

## 2. 4. పదం—అర్థబోధ

ఒక పదం వ్యక్తికి కలిగించే భావం, ప్రదర్శించే వస్తువు ఒకటి కాక పోవచ్చు. వ్యక్తి సంస్కారం, అనుభవం, ఆ పదం అర్థంచేసుకోటానికి దోహదం చేస్తాయి. ఆ పదం ప్రవర్తించే భావంతోనో, వస్తువుతోనో పూర్వ పరిచయమో, అనుభూతో లేకపోతే ఆ పదం, ఆ వ్యక్తికి సంపూర్ణంగా అర్థవంతం కాదు. 'ఆవు' అన్న పదం ఒక వ్యక్తికి కలిగించే భక్తి, మరోవ్యక్తికి కలిగించ లేకపోవటానికి కారణం తగినంతగా తత్పరిచయం లేకపోవటమే అవుతుంది.

ఒక పదం వ్యక్తం చేసే భావం, వస్తువు వ్యక్తి నిష్ఠ కావటం కూడా ఈ విధంగానే సాధ్యం. సముద్రం అన్న పదం ఆ తీరంలో వ్యక్తికి తెలిసినట్లు, సముద్రం ఎప్పుడూ చూడని వ్యక్తికి తెలియదు. చెరువే సముద్రంగా భావించే ప్రాంతంలో సముద్రం అంటే చెరువు. కాబట్టి ఒక ప్రాంతం వ్యక్తికి ఒక అర్థం తెలిపే పదం మరో ప్రాంతం వ్యక్తికి మరో అర్థం తెలుపుతుంది.

పదాలు సాధారణంగా అర్థబోధకే ఉద్దిష్టాలయి వుంటాయి. పదం వ్రాతకు, వాక్కుకు సంబంధించే వుంటుంది. అయితే పదం పలకటంలో, వ్రాయటంలో, దాని వెనుక ఆ వ్యక్తి అనుభూతి లేకపోతే ఆ పదం నిరర్థకమవుతుంది. అంతేకాదు, సమాచారం సరఫరా చేయగలిగే సామర్థ్యం కోల్పోతుంది.

ఉదాహరణాలు :- 1. ''అదిన్నీ కాక సంపన్న గృహస్థుల మీఁదికి వచ్చినంత త్వరగా చొరవ చేసి వాళ్ళ మీఁదికి (బీదలు) ఆ యా వ్యాధులు తఱుచు రానేరావు.'' (చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి-కథలు-గాథలు- మద్య నిషేధం అవసరమే-పుట 125)

జబ్బు రావటానికి, చొరవ అక్కరలేదు. అయితే చొరవ పదం వాక్యంలో అధిక్షేపం సాధించింది. జబ్బుకి చొరవ వున్నట్లు వ్రాయటం రచయిత అనుభూతి ఫలితం.

2. అయితే బయలు దేరిన రోజున వొక బస్తా బియ్యానికేనా చావులేదు గదా! (చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి-కథలు-గాథలు-వెనకటి పండితులు-పుట 367)

ఇక్కడ చావు అంటే లోపం, కొదవ అని అర్థం. పై పదం ప్రయోగించటం వల్ల పుష్కలత్వం గమనింపబడుతుంది. ఈ పదం సంఘానుభవం నుంచి నూత్న భావ స్ఫోరక మయింది.

మిక్కిలి స్పష్టంగా ఒక అర్థంతో ప్రయోగింపబడే సామర్థ్యంలేని పదం, వ్యక్తి అనుభూతి తీవ్రతవల్ల ప్రయుక్తమయి, ఆ లేని అర్థాన్ని పొందటం కూడా సాధ్యమే.

1. ''ఆ పరమాత్ముని యా పెద్ద దుకాణమెంత శోభగ నుండునో చెప్ప వలయునా?'' (పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు-సాక్షి I-పార్థసారథి స్వామి-పుట 257)

స్వష్టి అర్థంలో దుకాణం అన్న పదం ప్రయోగింపబడి సమర్థత పుంజుకొంది. అందుచేత పదం వెనుక అనుభూతి అధికం, అధికతరం, అధికతమం అవుతున్నకొద్దీ, తత్సమర్థత, ఆ క్రమంతోనే విశిష్టం, విశిష్టతరం, విశిష్టతమం అవుతుంది. అనుభూతి ప్రేరితమయిన పదం కొత్త రంగు, కొత్త కాంతి, కొత్త ఆకారం పుంజుకొంటుంది.

2. ''ఈ సమయమున నా తమ్ము సోదరులు కొంద రాంధ్ర భాష వచ్చి పోయినదని సెలవిచ్చియున్నారు.'' (పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు-సాక్షి I-జంఘాలశాస్త్రి యుపన్యాసము-పుట 287)

'చచ్చిపోవుట' అనే విస్తృతార్థం ఉన్న పదం వ్యవహారం నుంచి తొలిగి పోయింది అన్న అర్థంలో ప్రయోగింపగా కొత్త స్ఫూర్తి పొందింది.

## 2. 5. పదం-సంకేతం

ఒక పదం పలకగానే, పలికిన మనిషి అనుకొన్న వస్తువో, భావమో, తత్తుల్యమో, అవతల వ్యక్తి గ్రహించటం లోని హేతువు, ఆ శబ్దం కలిగించిన ఆలోచన, స్ఫూర్తి అనుకొనే అవకాశం వుంది. లేకపోతే శబ్దం వినపడగానే వస్తువు గుర్తుకు రాదు. ధ్వని పదానికి ప్రాణమన్న భావం కలిగే అవకాశం వుంది. "In prose the primary function of the sound of the isolated word is its expressiveness." (31)

తెలుగు చాలా పదాలు ధ్వని వల్ల అర్థబోధ కలిగించేవిగా ఉన్నాయి. రంకె, గురక, గాండ్రింత, ఓండ్ర మొదలయిన పదాలు గుర్తింపవచ్చు. అయితే ఈ ధ్వని వల్ల పదం యొక్క అర్థం అంటే వస్తువు గుర్తింపబడటం కొంతవరకే సాధ్యం.

ఆవు అనగానే, ఆ పదం, పదార్థం తెలియని వాళ్ళకు ఆవు గుర్తుకు వస్తే ఆవు అన్న పదం ఉచ్చరిస్తే కలిగే ధ్వనికి ఆ అర్థబోధక శక్తి ఉందని గమనింప వచ్చు. అయితే ఆవుగానే, అది గుర్తుకు రాదు. అందువల్ల పదం యొక్క ఉచ్చారణ ధ్వని అర్థబోధ చేయలేదని తెలుస్తుంది. "It was Aristotle who said that there can be no natural connection between the sound of any language and the things signified, and, if we set the problem right side up and remember the other words before examining it, we shall have to agree with him." (32)

అయితే పదంలోని అక్షరాలు, పదగత వస్తువు విషయం చెప్పలేవు. ఆ పద ధ్వని కూడా చెప్పలేవు. ఆ పదం, సంకేతమై ఆ వస్తువు విషయం స్ఫురింప చేస్తుంది. ఇప్పుడు ఆ పదసంకేతం కావటానికి హేతువు ఏమిటి ఆలోచింపవలసి వుంటుంది.

ఈ ఆలోచనతో పదం పుట్టుకకు హేతువు, దోహదం, మార్గం ఏమయి వుంటాయన్న దృష్టి తోడవుతుంది. ఆనందమో, విషాదమో పొందిన మనిషి

తన అనుభవం తెలుపవలసి వచ్చినప్పుడు పలికిన ధ్వని పదం అయితే, ఆ పదం ఆ అనుభవానికి ప్రతీక.

అటువంటి అనుభవమే మళ్ళీ ఆ మనిషికే కలిగితే, ఆ మనిషి ఆ శబ్దమే మళ్ళీ ఉచ్చరింపవచ్చు. లేకపోతే, ఒక అనుభూతికి లోనయిన మనిషి ఉచ్చరించిన పదం గ్రహించిన మరో వ్యక్తి అటువంటి అనుభవానికి గురి అయినప్పుడు అదే శబ్దం స్వాభావికంగా గాని, స్ఫురణవల్ల కాని, ఉచ్చరింపవచ్చు. ఈ విధంగా ఒక అనుభవానికి ప్రతీకగా ఉచ్చరింపబడే ఒక పదం కాలక్రమంలో ఆ అనుభవానికి సంకేతమవుతుంది.

ఒకొక్కప్పుడు ఆ పదం, ఆ అనుభవానికి తగిన ధ్వని రూపం అయితే కావచ్చు, లేకపోతే లేదు. ధ్వని అనుభవ సాక్షాత్కారం చేయగలిగిందిగా ఉండాలని కాని అక్కర లేదని కాని, తీర్పు చెప్పే అవకాశం లేదు.

ఒక అనుభవానికి సంకేతంగా ఏర్పడ్డ పదం కాలక్రమంగా మారిపోవచ్చు. ఒకొక్కప్పుడు పాత రూపం గుర్తు పట్టటానికి వీలు కానంత మారవచ్చు. శైథిల్యం పొందవచ్చు. అందువల్ల పదం ప్రారంభంలో అనుభూతికి తుల్యమయిన ధ్వని కలిగించేదే అయినప్పటికీ, కాలక్రమంలో అది మారిపోయి వుండవచ్చు.

ఈ దృష్టితో పరికిస్తే చాల ప్రాచీన పదాలు పదం-ధ్వని పూర్తిగా పొంతన లేకుండా పోయి వుంటాయి. ఆధునిక పదాలకు పదం-ధ్వని చేరువగా ఉంటాయి అనే చెప్పవచ్చు. పదం ప్రాచీనమయిన కొద్దీ సంకేత రూపం జటిలమయి పోతుంది. ఆధునికమయినకొద్దీ పదం-ధ్వని రూపంలో వస్తువు విషయం బోధించేదిగా వుండే అవకాశంతో నిండి వుంటుంది.

కాబట్టి పదం-అక్షరాలతో, దాని ధ్వనితో సంబంధించింది కాదు. ఒక అనుభవానికి సంకేతంగా వుంది. ఈ పదం, ఆ అనుభవంతో వ్యక్తీకరింపకపోతే మరుగున పడిపోతుంది. తుల్యానుభవంతో దాన్ని వ్యక్తీకరించినప్పుడే, ఆ ప్రత్యేక పదానికి పునరుజ్జీవం ప్రాప్తిస్తుంది. అనుభవానికి సంకేతంగానే, ప్రాథమికంగా, జీవించి వుంటుంది. అనుభవానికి దూరమయిన పదం ప్రయోగం నుంచి విరమించుకొంటుంది.

## 2.6 పదం-ఏకార్థం

ఏ భాషలో అయినా ఒక పదం ఒక అర్థం మాత్రమే కలిగి వుంటుంది. అదే అర్థంలో భిన్న పదాలు ఉన్నట్లు గోచరమవుతాయి కాని, అది వాస్తవం కాదు. అల్పమైన అర్థ వ్యత్యాసం లేకుండా ఒకే అర్థంతో రెండు పదాలు ఉండవు. అంతేకాదు, ఒక అర్థంలో ఒక పదం పుట్టివుంటే మరో పదం పుట్టవలసిన అవసరం, పుట్టే పరిస్థితి అసంభావ్యం. అందువల్ల మనుష్యులు పోలికలు కలిగివున్నా విభిన్నులు అయినట్లే పదాలు తుల్యంగా గోచరమయినా విభిన్నాలే !

"Let the truth be said out right; there are no synonyms, and the same statement can never be repeated in a changed form of words." (33)

"Possessed of an absolute belief that there exists but one way of expressing one thing, one word to call it by, one adjective to qualify, one verb to animate it, he gave himself to super human labour for the discovery, in every phrase, of that word, that vreb, that epithet. In this way he believed in some mysterious harmony of expression, and when a true word seemed to him to lack euphony still went on seeking another, with invincible patience, certain that he had not yet got hold of the unique word. A thousand pre-occupations would be set him at the same moment, always with this desperate certitude fixed in the word, all forms and turns of expression there is but ONE-one form, one mode-to express what I want to say." (34)

కాబట్టి, ఒక అర్థం చెప్పటానికి అన్ని అంశాలా తగింది ఒక్క పదమే, ఒకే ఒక్క పదమే ఉంటుంది. ఒక అర్థం చెప్పేవిగా కనిపించే

పదాలు వాస్తవంగా భిన్న పదాలే! తుల్యార్థం ఉన్నట్లుగా గోచరించే పదాలు అల్ప వ్యత్యాసమయినా కలిగి వుంటాయి. దీనికి ఉదాహరణాలు గ్రహింప వచ్చు. "Phrases such as "the little house", "the diminitive house", and the "petite house" have overlapping or synonymous meaning, but little may suggest endearment as well as size, diminitive, good construction, and petite, prettiness." (35)

సమానార్థకాలుగా కనిపించే పదాల అర్థంలో తప్పని సరిగా ఈషణ్మాత్రమైనా తేడా వుంటుంది. అది గుర్తింపబడటం అవసరం అనడానికే సమానార్థక పదాలు ఏ భాషా సాహిత్యంలోనూ లేవు అనవలసివస్తుంది. "పాండు రాజు మరణానంతరము కొన్ని దినములకు సీమంతినీ రత్నమగు కుంతీదేవి తన తనయులఁ దోడ్కొని హస్తినాపురికి వచ్చెనని వ్రాయరాదు. కుంతీదేవి యీ ప్రస్తావనకాలమున, బతిహీన కావున ముత్తైదువు లందు మాత్ర ముపయోగింపఁ దగిన సీమంతినీ శబ్దము కుంతీదేవి పట్ల వాడరాదు." (36) ఈ సందర్భంలోనే, దినంలో ఏభై అయిదో ఘడియకు పేరైన ఉషస్సు పదాన్ని ఏభై ఎనిమిదో ఘడియకు నామంగా ఉన్న ప్రాతఃకాలానికి పర్యాయ పదంగా కాని, సమానార్థకంగా కాని ప్రయోగింపరాదు.

అందువల్ల తుల్యమనుకోదగ్గ పదాలు రెండింటిలో ఉన్న ఛాయామాత్రమైన తేడా గుర్తించిన వ్యాసకర్త చేసే సక్రమ పద ప్రయోగం ఉత్తమ శైలికి సోపానంగా ఉంటుంది.

## 2. 7. పదం-సృష్టి :

భాషలో పదజాలం అవసరంకొద్దీ ఆవిర్భవిస్తుంది. పదసృష్టి జరిగే వ్యవధి లేకపోతే చలామణిలోఉన్న పదం - విలువ పెరిగిన, తరిగిన నాణెంలా గా- కొత్తఅర్థం పొందుతుంది. పాత పదం కొత్తఅర్థం పొందడంకూడా, కొత్త పదం పుట్టటంతో చాలావరకు సమానంగానే భావింపబడుతుంది.

శైలి నిత్యనూతనంగా ఉండాలంటే పదం విస్పష్టంగా ఉండటమే గాదు, కొత్తపదాల ఆవిష్కరణ అవసరం. సాహిత్యంలో చాలా పదాలు ఒక పరిమి

తార్థంలో ప్రయోగించటం సామాన్యమే! అయితే ఆ పదాల నొక విశిష్టార్థంలో వ్యాస రచయితలు ప్రయోగిస్తారు.

ఉదాహరణాలు 1. "విప్లవ శబ్దానికి సంస్కృత భాషలో సుప్రసిద్ధంగా వున్న అర్థమేమో ఉపద్రవమనేది. కాని యిప్పుడు ఈ విప్లవ శబ్దానికి పూాణ భాషా నిష్ణాతులు వాడుకునే అర్థం మార్పు అనేది." (చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి-కథలు-గాథలు-కవితానిప్లవం-పుట 832)

2. "జ్వరం తగిలింది-వద్దురా, బాబూ! అంటే రాగం తియ్యటం మొదలుపెట్టాడు." (నార్ల వేంకటేశ్వరరావు - పిచ్చాపాటీ - జగన్నాటకం-పుట 9).

రాగం అంటే సంగీత సంబంధి కాని, దుఃఖసంబంధిగాదు. శబ్దసంబంధి, మౌలికం కనుక ప్రయోగింపబడ్డ రాగం నూత్నార్థ స్ఫోరకం అయింది.

3. తెలిసీ తెలియని మేళం కనుక (నార్ల వేంకటేశ్వర రావు - పిచ్చాపాటీ - పుట 11)

మేళం అంటే మనిషి కాదు. పర్యాయ పదంగా వాడబడింది. మేళం మోగుతుంది. తెలిసీ తెలియని వ్యక్తి మాట్లాడినా మేళంలాగే వుంటున్న దన్న భావం నుంచి పుట్టిన పదం మనిషి పర్యాయపదం అయింది. ఇటువంటివే ఈ క్రింది పదాలు :

తిక్క తిరిగినప్పుడు - బుద్ధి పుట్టినప్పుడు
సీతాకోక చిలుకలు - అందగత్తెలు
దమ్ము - ధైర్యం

అన్య భాషల నుంచి అనేక పదాలు ఏ భాషలో అయినా ప్రవేశిస్తాయి. ఆదాన ప్రదానాలు భాషా ధర్మాలు. అయితే స్వీకరింపబడ్డ పదం, ఆంధ్ర భాషా సంప్రదాయానుసారంగా రూపొందుతుంది. అప్పుడే స్వీకరించటం పరిపూర్ణంగా ముగుస్తుంది. పదం రూపంలోనే కాక అర్థంలోనూ మార్పు పొందవచ్చు. ఈ రూపం అర్థం పొందే మార్పునే, ఆంధ్రంలో కొత్తదనంగా స్వీకరింపవచ్చు.

కాబట్టి దేశీయమయినా, అన్యదేశీయమయినా పునస్సృష్టి పొంది ప్రయోగింపబడితేనే పదం అర్థవంతంగా వుంటుంది. ఈ సృజన సామర్థ్యం ఉన్న పదం శైలిని ప్రదర్శిస్తుంది.

అయితే క్రొత్త భావాలు చెప్పవలసినప్పుడు క్రొత్త పదాలు అవసర అవుతాయి. కొత్త వస్తువుల్ని కొత్త పేర్లతో పిలువవలసి వస్తుంది.

Chortle (chuckle + snoot)
inscape (inside + landscape)
sexhibition (sex + exhibition)
guestimation (guess + estimation) వంటి పదాలు ఆంగ్లంలో ఏర్పడటం సహజమే!

ఆంధ్రలో శ్రీ శ్రీశ్రీ ఉదాహరించిన మసిపూసిన మాణిక్యం. నివురుగప్పిన నిప్పులా ప్రసిద్ధం కాదు, "మసిపూసి మారెడుకాయ-చెయ్యటం", "మసిపాతను కట్టిన మాణిక్యం" కలిపితే ఏర్పడ్డ రూపం.

అహంతరిక్ష మార్గం (అహం-అంతరిక్షమార్గం) (ఆరుద్ర)
అహంకారం అంతరిక్షం దాటేంత వుందన్న స్ఫురణ కలిగిస్తుంది.
కసాయిబు (కసాయి + సాయిబు) (శ్రీ శ్రీశ్రీ)

సాయిబు, కసాయి కాకపోవచ్చు. కసాయి, సాయిబు కాకపో వచ్చు. కసాయి సాయిబయితే కసాయిబు ఉచితం.

కూపస్థ భల్లూకం (శ్రీ శ్రీశ్రీ)

కూపస్థ మండూకంలాగా మూర్ఖత్వం భల్లూకంపట్టులాగా పట్టుదలఉన్న మనిషిని మూర్ఖపు పట్టుదల ఉన్నవాడుగా చెప్పవలసివచ్చి కూపస్థ భల్లూకం అనవచ్చు అన్నాడు శ్రీ శ్రీశ్రీ.

సాహిత్యంలో అధివాస్తవికత, కాల్పనికత, వాస్తవికత, ఆ అర్థాంలో కొత్త పదాలు. అలాగే సంఘంలో లఫూట్ వాడు, కేడీజాట్ వాడు, కతకత ఫోలిగాళ్లు కొత్త పదాలు,

ఒక్కొక్కప్పుడు సాహిత్యం రెండు పాత పదాలు కలిపి ఒక కొత్త భావం స్ఫురించే పదబంధం, సమాసం సృష్టించుకోవచ్చు. పూల మందలు, ముసలి నిప్పు, చీకటి లిపి వంటివి నూత్నార్థద్యోతకాలు.

పదం నూత్నంగా జీవం నింపబడింది కాకపోతే, పునస్సృష్టి పొందక పోతే, కొత్తగా సృష్టింపబడింది కాకపోతే, నూత్నత పదం శిరస్సు మీద నర్తించకపోతే, ఆ పదం భాషను కొత్త ఊపిరితో ఆరోగ్యంగా ఉంచలేదు. ఇటువంటి పదాలతో జరిగిన రచనలో శైలి సజీవంగా వుంటుంది.

సారస్వత సృష్టిలో శైలిని పరిశీలించటం ఆధునిక దృక్పథం, ఆంగ్ల ప్రభావ ఫలితం. రచనంలో దోషాలు పరిహరించటం సంస్కృతాలంకారిక సంప్రదాయం. తెలుగు, సంస్కృతాంగ్ల భాషా సారస్వత ప్రభావ ముద్రితం కావటం వల్ల, ఆంధ్రంలో శైల్యాలోచన దోషాలు తొలగించటంలోనే కాదు, గుణాలు కలిగించటంలోనూ ఉంది. వర్తమానాంధ్ర సాహిత్యంలో సంస్కృ తాంగ్ల శైలి లక్షణాలు అవగతమవుతున్నాయి. వీటిని తెలుగు సారస్వత వ్యక్తిత్వం సముచితంగా మార్చుకొంది, సమర్థంగా గ్రహించింది. శైలి అంతర బాహిర లక్షణాలు తెలుగు వ్యాసంలో రూపొందిన తీరు గమనించి, ఉత్తమ శైలికి దోహదం జరిగింది. ఉత్తమ శైలితో ఉత్తమాంధ్ర సృజన వ్యాసం మహాంధ్రాశి హృదయామృతత్వానికి సుస్థిర ప్రతీక, సుప్రతిష్ఠిత పతాక.

—: o :—

# References


1. F.L. Lucas - Style. p. 17
2. వావిలికొలను సుబ్బారావు-సులభ వ్యాకరణము-పుట. 20
3. Walter Pater - Appreciations-with an essay on style - p. 8,9.
4. Walter Pater - Appreciations - with an essay on style - p.5
5. F.L. Lucas Ch. 2 Style p. 47

6. Walter Raleigh - Style - p. 128
7. F.L. Lucas Ch. 2 Style - p. 48
8. Ibid - p. 56
9 వావిలికొలను సుబ్బారావు - సులభ వ్యాకరణము పుట. 20
10. జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి - శైలి - (వ్యాసం) సాహిత్యతత్త్వ విమర్శనము పుట. 92
11. Alan Warner - Introduction - What is style (ch) A short guide to English style p. 1
12. F.L. Lucas - style p. 84
13. Walter Pater - Appreications - with an eassy on style p. 14
14. వావిలికొలను సుబ్బారావు - సులభ వ్యాకరణము - పుట. 46
15. Alan warner - A short Guide to English style. p. 19
16. వావిలికొలను సుబ్బారావు - సులభ వ్యాకరణము పుట. 50
17. F.L. Lucas - Style p. 123
18. Ibid - p. 181
19. Ibid - p. 184
20. Ibid - p. 186
21. Dr. Johnson - Quoted by I A. Richard. The philosophy of Rhetoric. p. 89
22. F.L Lucas - Style - p. 186
23. Aristotle - Poetics P. II
24. Herbert Read - English prose Style p. 28
25. J. Middleton Murry. The problem of Style -p. 75
26. F.L. Lucas - Style p. 218
27. Walter Raleigh-Style-p 52
28. F.L. Lucas-Style-p. 39
29. Ibid-p. 29

30. Ibid-p. 21
31. Herbert Read-English Prose Style-p. 3
32. I.A. Richards-The philosophy of Rhetoric-p. 62
33. Walter Raleigh-Style p. 46
34. Gustave Flaubert - Quoted by Walter Pater - Appreciations-with an essay on Style p. 25
35. Encyclopedia Britannica-Vol. 21 (1968) p. 334
36. వావిలికొలను సుబ్బారావు-సులభ వ్యాకరణము-వ్యాస పరిచ్ఛేదము-పుటలు 13, 14



# ఉపసంహారం

తెలుగు వచన ప్రక్రియలలో వ్యాసం సుస్థిరమయిన స్థానం పొందింది. ఇది తెలుగులో ప్రారంభమయిన నాటి నుంచి విభిన్న మార్గాలలో సాగింది. కవితాగుణం శాస్త్ర ధర్మం వ్యాస రచనంలో బలవత్తరంగా రూపొందాయి. వ్యాస రచనం వచన స్థాయిని పెంచితే, ఇది వాఙ్మయ వ్యక్తిత్వం ఇనుమడింప జేసింది. ఇది సారస్వత స్థితికే కాదు, సాంఘిక విషయాలకూ సమగ్రదర్శనం ప్రసాదించింది. సృజన విమర్శన రచనా రీతులకు వారధి అయింది.

వ్యాసం ఆరంభంలో ఆ పేరుతో ప్రసిద్ధంగా లేదు. ప్రథమాంధ్ర వ్యాసకర్త స్వామినీన ముద్దునారసింహ నాయుడు 'ప్రమేయము' అనీ, పరవస్తు వేంకటరంగాచార్యులు 'సంగ్రహము' అనీ, జియ్యరు సూరి 'వచన కావ్యము' అనీ తమ వ్యాసాలకు నామకరణం చేశారు. అయితే కందుకూరి వీరేశలింగం పంతులు కాలంలోనూ అనంతరమూ 'ఉపన్యాసం' అనే పేరు వ్యాస పర్యాయ పదంగా విశేష ప్రచారం పొంది ప్రసిద్ధంగా ఉంది.

వ్యాసం అనే పేరు ఈ ప్రక్రియకు చాలా కాలం తర్వాతే రూఢి అయింది. గురజాడ వేంకట అప్పారావు పంతులు ఈ రచనలు వ్యాసాలుగా వెలువడ్డాయి. ఆ కాలంలో పత్రికలలో వ్యాసం గోచరమవుతూ వచ్చింది. వర్తమానాంధ్ర సాహిత్యంలో వ్యాసం సుప్రసిద్ధంగా ఉన్నప్పటికీ, ఈ పేరుతో కాకుండా ఇటు వంటి రచనం పత్రికా శీర్షికలలో ఆవిర్భవిస్తూ వుంది. కథలు గాథలుగా లేఖలుగా భిన్న నామాలతో రూపాలతో తెలుగు వ్యాసం వెలుగు చూస్తూ వుంది.

ప్రమేయం (1862), సంగ్రహం (1872), వచన కావ్యం (1876) పేర్లు వ్యాస నామాంతరాలుగా కొంత ముందుగానే ప్రభవించినా, అవి ముద్రితాలయిన ఆ యా సంవత్సరాల నుంచి ప్రాచుర్యం పొందాయి. ఉపన్యాసం (1874) ఆవిర్భవించినప్పటి నుంచి ప్రక్రియగా ప్రచారమయింది. అయితే వ్యాసం జన్మించిన సంవత్సరం స్పష్టంగా చెప్పటానికి అవకాశం లేదు. వ్యాసం అనే పదం ఈ ప్రక్రియార్థంలో ప్రయుక్తమవుతూ 1852 నాటికే ఉన్నట్లు తెలిసినా, ఆ పేరుతో పిలువబడ్డ రచనం లభించక పోవటంవల్ల, ఆ కాలంలో రచయితలు

ఇటువంటి రచనలకు ఇతరమైన పేర్లుంచటంవల్ల, ఈ పేరుతో ఈ రచనలు 19వ శతాబ్ది తర్వాతే గోచరమవటం వల్ల, వ్యాస పదం పదార్థ సంబంధంతో 20వ శతాబ్ది సృష్టి.

వ్యాస నిర్మాణం ప్రాథమికంగా విషయ వివరణ దృష్టితో సాగింది. ఆపైన విషయ విమర్శనం ప్రధానమయి సృజింపబడింది. ఆరంభంనుంచి వివరణ విమర్శనలు వ్యాస నిర్మాణానికి పునాదులై నిలచాయి. అయితే మొదటిలో క్వాచిత్కంగా విజ్ఞాపనం ఉపదేశం వ్యాస నిర్మాణం నిర్ణయిస్తే, అనంతరం వర్ణనం, ఆత్మనివేదనం చోటు చేసుకొన్నాయి. భిన్న నిర్మాణ రీతులతో వ్యాసం వైవిధ్యం సాధించింది. విషయం సాంఘికమయినా, సారస్వతమయినా, వ్యక్తిగతమయినా, ఏదైనా రచనా గుణం వల్ల వ్యాస నిర్మాణం స్పష్టమవుతూ వుంది. అయితే వివరణమో, విమర్శనమో, ఏ ఒక్క లక్షణమో ఏ ప్రత్యేక వ్యాసంలోనూ సంపూర్ణంగా, ఇతర లక్షణ ప్రమేయం లేకుండా లేదు. వివరణ వ్యాస నిర్మాణంలో విమర్శనం, అలాగే విమర్శన వ్యాస నిర్మాణంలో వివరణం లభించాయి. అందువల్ల నిర్మాణ లక్షణం స్థూలంగా సంభావించటమే కాని విస్పష్టంగా వివరించటం రచనాతత్త్వంలో సాధ్యంకాదు.

స్వామినీన ముద్దు నారసింహ నాయడు, పరవస్తు వేంకట రంగాచార్యులు, జియ్యారు సూరి ముఖ్యంగా వివరణంతో, కొంతవరకు విమర్శనంతో; కందుకూరి వీరేశలింగం పంతులు వివరణ విమర్శనలతో పాటు విజ్ఞాపనోపదేశాలతో; గురజాడ, గిడుగు, పానుగంటి వివరణ విమర్శనలతో పాటు వర్ణనంతో; కట్టమంచి, రాళ్ళపల్లి, పింగళి ప్రముఖంగా విమర్శనంతో; చెళ్ళపిళ్ళ, చలం, శ్రీశ్రీ, నార్ల ప్రధానంగా విమర్శన ఆత్మనివేదన వర్ణనలతో వ్యాస నిర్మాణం చేశారు. ఇక పూర్వాపరాలలో విస్తృతమయిన వ్యాస నిర్మాణంలో విమర్శనం ప్రాధిక్యం పొందింది. వివరణంగా విమర్శనంగా ప్రారంభమయి ఉపదేశంగా విజ్ఞాపనంగా సాగి, వర్ణనంగా ఆత్మనివేదనంగా విస్తృతమయిన వ్యాస నిర్మాణం విమర్శనంగా పరిణమించింది.

వర్తమాన వ్యాస వాఙ్మయంలో విషయ విశాలత గమనార్హంగా ఉంది. ఇదిప్పుడు అధికంగా సారస్వత సంబంధిగా ఉంది కాని, ఆరంభంలో లేదు. మొదటి ముగ్గురు తెలుగు వ్యాసకర్తలు సాంఘిక మత విషయాలతో వ్యాస

సృష్టి చేశారు. కందుకూరి కాలంలో ఉపన్యాసాలలో ప్రారంభమయి, గురజాడ కాలంలో వ్యాసాలలో పెరిగి, పానుగంటి కాలంలో విస్తృతమయి, కట్టమంచి కాలంలో సారస్వత విషయం సంపూర్ణంగా విమర్శనంగా రూపొందింది. అయితే ఇక్కణ్ణుంచి వ్యాస సాహిత్యం రెండు పూర్తి భిన్న శాఖలుగా విస్తరిల్లింది. ఒక శాఖ సారస్వత ప్రముఖంగా విమర్శన వ్యాస మయింది. ఇంకొక శాఖ సర్వ విషయ సమర్థంగా సృజన వ్యాసమయింది. వ్యాసం. విస్పష్టంగా విమర్శన రీతిగా వేరుకాకపూర్వం సృజనంగానే వుంది అందువల్ల వ్యాసం సృజనంగా రూపొందటం ఆద్యమయితే, విమర్శనంగా ఏర్ప డటం అనంతర పరిణామం.

సృజన వ్యాసంలో విషయం ప్రముఖంగా సాంఘికమయివుంది. ఇందులో అనేక విషయాలతో పాటు సాహిత్య విమర్శనం కూడా చేరి పెరిగింది. ఈ ప్రారంభ వ్యాసాలలో సంఘ సంస్కరణ వాంఛ తీవ్రంగా కనిపించింది. మత దృక్పథంతో మనిషి జీవితంలో మార్పు కోరటం జరిగింది. స్త్రీ జీవితాభ్యుదయం, విద్యావివేకాలు, సంఘ చైతన్యం వ్యాస విషయాలయ్యాయి. సాంఘిక లోపాలు, దురాచారాలు, మౌఢ్యాలు ఖండించి ఆంధ్రావళి జీవితం నందనం కావాలని వాంఛించటం వ్యాస దృక్పథంగా అభి వ్యక్తమయింది. నాటి సృజన వ్యాసాలలో పత్రికావ్యాసాలు సారస్వత సాంఘిక వైద్య, విద్య జీవితచరిత్రాది బహు విషయ విన్యస్తంగా రూపొందాయి. స్త్రీల వ్యాసాలు, తమ సమస్యలకు ప్రతిబింబాలుగా అవత రించాయి. వివాద వ్యాసాలు సాహితీ సత్య సందర్శంతో పాటు, మానవ జీవితాంతర్యం స్పృశించాయి. అధిక్షేప వ్యాసం సమకాలంలోని మూఢ జీవితాన్ని అదలించింది. అస్తవ్యస్తంగా ఉన్న చారిత్రక సత్యాలు స్పష్టంగా ఈ వ్యాసాలలో వెలుగులోకి వచ్చాయి. కాలక్రమంలో సృజన వ్యాసం కల్పనాత్మక సాహిత్య ధర్మ ప్రరోచనంతో, బహు విషయ సంభరితంగా పెరిగింది.

విమర్శన వ్యాసం అధికంగా సారస్వత సంబంధిగా, అల్పంగా అన్య విషయగతంగా ఉంది. కావ్య జీవితంలో మూలతత్త్వం, ప్రత్యేక కావ్య తత్త్వం, దాని గుణాలు, కవితాపరిధిలో కవి జీవితం, కావ్య చరిత్ర, ఉత్త

ములుగా కవులుగా ప్రసిద్ధుల జీవితం, భాషా స్థితి, ఇతర సారస్వతాల పరిస్థితి, తెలుగులోని అనువాదాలు, ఆంగ్లంలోని ఆంధ్ర సాహిత్యం గ్రంథ పీఠికలు పరిశోధన మొదలైన విషయాలతో విస్తృతంగా రూపొందిన విమర్శన వ్యాసం తెలుగు సారస్వతంలో సమధికంగా ఉంది. ఆంధ్రావళి జీవితంలోని వేదాంత తత్పరత, వైజ్ఞానిక దృష్టి, రాజకీయ చైతన్యం, ఆర్థిక స్థితి, సంస్కృతి కళాది బహు విషయాలతో విమర్శన వ్యాసం తెలుగులో గోచర మవుతూ వుంది.

సృజన విమర్శన రీతులలోనే కాక, వ్యాసం పేరుతోనే పిలువబడకుండా తెలుగులో వ్యాస సృష్టి ఉంది. అది ఆంగ్ల వ్యాస ప్రభావానికి పూర్వంగానూ పరంగానూ ఉంది. ప్రాచీన వచన గ్రంథాలలో వ్యాస ధర్మ దర్శితంగా రచనా రీతి గోచరమయింది. ఆధునికాంధ్ర సారస్వతంలో అన్య ప్రక్రియ లలో భిన్న రచనలలో వ్యాసం నిర్మాణ సామర్థ్యంతో స్పష్టంగా ఉండటంతో పాటు రచనా విస్తృతిలో పరిణామంలో సముచితంగా ఉంది.

తెలుగు వచనం వ్యాస రచనా సమర్థంగా. వ్యాసారంభంలోనే ఏర్పడి వుంది. శాసన కాలంలో దేశి రీతిలో ఉన్న తెలుగు వచనం సంస్కృత వచనంతో మార్గ రీతిలో నన్నయ కాలం నాటికి, ఆంగ్ల వచనంతో ఆధునిక రీతితో చిన్నయ కాలం నాటికి ప్రభావితమయింది. అందువల్ల వర్తమానాంధ్ర వచనంలో ఆంధ్ర సంస్కృతాంగ్ల వచన వ్యక్తిత్వ సమ్మేళనం ఉంది.

తెలుగు వచనం శాస్త్ర వచనంగా కవితా వచనంగా స్థూలంగా రెండు కోణాలలో గోచరమవుతూ వుంది. శాస్త్ర వచనంకంటే హృదయ సమీపస్థ వచనం, కవితా వచనం కంటే బుద్ధి జన్య వచనం నూత్నంగా తెలుగులో వ్యాస ప్రక్రియ కారణంగా ఆవిర్భవించింది. వ్యాసం వచనానికి నూత్నాభి వ్యక్తీకరణ సామర్థ్యం కలిగించింది. కట్టమంచి యుగంలో చిలుకూరి యుగంలో ఈ వచనం అధికంగా గోచరమవుతూ ఉంది. అయితే స్థూలంగా సృజన వ్యాసంలో, అంతకు పూర్వ వచనం శాస్త్ర వచనంవైపు, ఆ పైన వెలువడ్డ వచనం కవితావచనంవైపు మొగ్గి ఉండటం స్పష్టమయింది. సృజన వ్యాసంతో నిమిత్తంలేని విమర్శన వ్యాసంలో వచనం శాస్త్ర వచనాధిక్యంతో ఒప్పుతూ ఉంది. వ్యాసం సృజనమయినా విమర్శనమయినా వచనం వీలయినంతవరకు ఈ తృతీయ దశాత్మకంగా ఉంటే, అది ఉత్తమంగా రూపొందుతుంది.

తెలుగు వచన రచనంలో గ్రాంథిక వ్యావహారిక రీతులు ప్రసిద్ధంగా సమాంతరంగా ఉన్నాయి. సృజన విమర్శన వ్యాసకర్తలు ఈ రెండు విధాలు గానూ వ్రాశారు. వాళ్లు ఎక్కువగానూ ఉన్నారు. అయితే కొందరు గ్రాంథికం, కొందరు వ్యావహారికం మాత్రమే వ్యాస రచనకు గ్రహించారు. స్వామినీన ముద్దు నారసింహ నాయుడు 'ప్రమేయము'లలో వ్యావహారికమే వ్రాయటం వల్ల తెలుగు వ్యాసం వ్యావహారిక భాషా రచనంగా ప్రారంభమయింది. అయితే సృజన వ్యాస భాష అద్యదశలో అధికంగా గ్రాంథికమయి ఉంటే, అనంతర దశలో వ్యావహారికమయి ఉంది. విమర్శన వ్యాసం మిక్కిలి ఎక్కువగా గ్రాంథిక భాషలోనే ఉంది.

ఈ భాషా ద్వైవిధ్యం తెలుగు వ్యాస శైలిని సముచితంగా దిద్ది తీర్చింది. ప్రాచీనాధునిక భాషా సాహచర్యంతో జీవించే వ్యాసకర్తల వ్యక్తిత్వావిష్కరణకు ఇది దోహదం చేసింది, తెలుగు సృజనవ్యాస నిర్మాణంలో, వ్యక్తీకరణంలో భాషా ప్రయోగంలో రచయిత వ్యక్తిత్వం ప్రస్ఫుటంగా ఉంటే, విమర్శన వ్యాసంలో పటిష్ఠాభివ్యక్తిగా ఉంది. భాషా జలం రచయిత శంఖం నుంచి తీర్థంగా వెలువడి వ్యాస సృష్టికి చైతన్యాభిషేకం చేసింది. తెలుగు వ్యాస శైలిలో స్పష్టత క్లుప్తతాది గుణాలతో వాక్య పద ప్రయోజనం అనుసంధానం పొంది రచయిత బుద్ధి హృదయాల పుట్టిన వ్యక్తిత్వ ముద్ర విస్పష్టంగా ఉంది.

వ్యాసం, శైలి రెండూ రచయిత వ్యక్తిత్వం మీద అధికంగా ఆధారపడి వున్నాయి. సంపూర్ణ సృజన సాహిత్యంలో కంటే తక్కువగా, సంపూర్ణ విమర్శన వాఙ్మయంలో కంటే ఎక్కువగా వ్యాసంలోనూ, శైలిలోనూ రచయిత ప్రాధాన్యం ఉంది. అందువల్ల వ్యాసశైలిలో రచయిత వ్యక్తిత్వం తొణుకు తొట్రుపాటు లేకుండా అతివ్యాప్తి అవ్యాప్తి రాకుండా ఆలోచనానుభూతులు ఎక్కువ తక్కువ కాకుండా ప్రవేశించే పరిస్థితి లభ్యమయింది.

ఆంగ్లాంధ్ర వ్యాస లక్షణాలు పరిణామం స్థూలంగా తుల్యం. అయితే ఆంగ్లంలో లేని ఉపన్యాసం, 'లెక్చర్సు' కంటె భిన్న రచనా రీతి తెలుగులో ఏర్పడింది. ప్రసంగ వ్యాసం ఆకాశవాణి కారణంగా తెలుగులో సృజన శాఖగా విస్తరిల్లింది. ఆంగ్లంలో విమర్శనం విమర్శన వ్యాసం కలిగి ఉన్న దూరం

తెలుగులో తగ్గిపోయింది. ఈ సాహిత్యంలో అసలు వ్యాసంలోకి విమర్శనం ప్రవేశించింది. అసలు విమర్శనం వ్యాసంగా రూపొందింది. అందువల్ల ఆంధ్ర సారస్వతంలో విమర్శనం విమర్శన వ్యాసం విడదీయటం కష్ట సాధ్యమయింది. వ్యాసం సృజన విమర్శనంగా రెండు ప్రధాన శాఖలై పెరగటం తెలుగు వ్యాసానికి పరిమితంగా గోచరమయింది.

మనిషి బుద్ధి హృదయాలు విమర్శన సృజన వ్యాసావిర్భావ క్షేత్రాలు. ఆలోచనానుభూతులు నిక్షిప్తం చేసుకొన్న ఈ రచనలు వాటికి మూల హేతువులు, రూపాలు. రచనంలో ఆలోచన పెరుగుతున్న కొద్దీ విమర్శన వ్యాసం శాస్త్ర పరిధ్యభిముఖంగా సాగింది. అనుభూతి తీవ్రతరమవుతూ పోయిన సృజన వ్యాసం కవితాత్మకంగా రూపెత్తింది.

మనిషికి జీవితమయిన ఆలోచనానుభూతులకు వ్యాసంలో ఉన్నంత అవకాశం ఇతర సారస్వత ప్రక్రియలలో లేదు. ఆవేశం మూర్తీభవించిన వ్యక్తి కల్పనాత్మక సాహిత్యం ఆదరించటం ఆలోచన ఆకారమయిన ప్రాణి శాస్త్ర వాఙ్మయం గౌరవించటం సారస్వత సంప్రదాయంగా ఉంది. అందువల్ల తెలుగు జాతి జీవితంలో బుద్ధి ప్రాధాన్యం కలిగితే, శాస్త్ర సాహిత్యం పెరిగి, హృదయం ప్రాముఖ్యం పొందితే కల్పనాత్మక సాహిత్యం ఎదిగి పోతుంది. తెలుగు జాతి జీవితంలో ఈ రెండు గుణాల సమ్మేళనం జరిగితే వ్యాసం నిశ్చయంగా సారస్వతోత్తమ ప్రక్రియగా ఆవిర్భవిస్తుంది. అప్పుడది జాతి జీవితానికి సంపూర్ణాదర్శంగా రూపొందుతుంది.

తెలుగులో సృజన వ్యాసం పొందినంత గుణ, రచన, విషయ, నిర్మాణ వైవిధ్యం విమర్శన వ్యాసం పొందలేదు. విమర్శన వ్యాసం వ్యాపించినంత విస్తృతంగా అధికంగా సృజన వ్యాసం వ్యాపించలేదు. సాహితీ విమర్శన వ్యాసంతో సమానంగా అన్య విషయ విమర్శన వ్యాసం రూపొందలేదు. స్థూలంగా తెలుగు వ్యాసం సర్వవిషయ సమర్థంగా సర్వలక్షణ సమన్వితంగా సర్వ సద్గుణ సంపూర్ణంగా అవతరించలేదు కాని, ఈ వ్యాస స్థానం ఈ సాహిత్యంలో అనేకేతర ప్రక్రియలకన్నా ఉన్నతంగా, ఇతర ఉదాత్త భారత సారస్వత వ్యాస ప్రక్రియకు తీసికట్టు కాకుండా ఉంది.

**ఉపసంహారం**

తెలుగు బోధనా భాషగా అనేక శాస్త్ర విషయాలు బోధింప బడుతూ ఉన్న ఈ తరుణంలో భిన్న శాస్త్ర సంగతులు వ్యాసగతంగా అభివ్యక్తమయి వ్యాసం సుసంపన్నమయ్యే అవకాశం ఉంది. స్వాతంత్ర్య పూర్వం తెలుగులో సృజన వ్యాస సృష్టి ఎక్కువగా జరిగితే, తదనంతరం విమర్శన వ్యాస సృష్టి పెరిగింది. భారత ప్రజాస్వామ్యం సుస్థిర సాంఘిక న్యాయ ప్రాతిపదిక మీద నిలచి, ఆర్థిక రాజకీయాది సమానతలు విస్పష్టంగా ఏర్పడుతున్న శుభసమయం భవిష్యద్వ్యాస సృష్టికి ఉత్తమ దోహదం చేస్తుంది.

భారతీయ భాషలలో వ్యాసం ఎంత ముందుగా ఆవిర్భవించినా ఈ రూపంలో నూట పాతికేళ్ళకు పూర్వం లేదు. ఒక ప్రక్రియా జీవితంలో ఈ కాలం బహు స్వల్పం. భారత వ్యాసం బాల్యం దాటి యౌవనోన్ముఖంగా ఉంది. నాలుగు వందలేళ్ళకు కూడా ఆంగ్ల వ్యాసం ఇంకా సమగ్ర పరిపూర్ణతను చేసు కోలేదని భావించే వాళ్ళున్నారు. ప్రపంచ భాషగా ప్రసిద్ధమయిన ఆంగ్లంలో, సర్వ ప్రక్రియా రచనా సమర్థంగా రూపొందిన ఆంగ్లంలో వ్యాసం పరిపూర్ణ తను పొందలేదంటే ఇంక ఏ సారస్వతంలో అది సంభవించినట్లు భావించటానికి అవకాశం ఉంటుంది ?

తెలుగు సాంఘిక సారస్వత జీవితాలలో ఆనందం అనుభూతి ఆధికారం చెలాయించటం వల్ల సృజన వ్యాసం గుణభరితంగా ఉంది. విమర్శన వ్యాసం సువిశాలంగా ఉన్నప్పటికీ సుప్రతిష్ఠితాలోచనకు అక్షర రూపంగా సంపూర్ణతను చేరుకోవలసి వుంది. హృదయవాది అయిన తెలుగుజాతి ఆధునిక యుగంలో బుద్ధి ప్రాధాన్యం పెంచుకొని అనతికాలంలో సుప్రసిద్ధ సారస్వతాలలోని వ్యాస స్థాయిని అధిగమిస్తుందని ఆశింపవచ్చు.

మనిషి బుద్ధి హృదయాల ఆలోచనానుభూతుల సంగమ క్షేత్రం వ్యాస జన్మభూమి. ఈ శక్తిద్వయాన్ని కైవశం చేసుకొన్నప్పుడు మానవుడు సంపూ ర్ణుడు. పరిపూర్ణ మానవ జీవితం సమాజ జీవిత పరిపూర్ణతకు మార్గం ఏర్పరు స్తుంది. సంపూర్ణ జాతి జీవితానికి ఉత్తమ వ్యాసం కన్నబిడ్డ. అందువల్ల వ్యాసం సంఘ పరిపూర్ణతా ప్రతీక, ప్రాణ పతాక.

మానవ చైతన్యం వ్యాస రూపంలో సమాజానికి సంపూర్ణతను కలిగిస్తుంది. సమాజ తేజం మానవ కేంద్రం నుంచి విశిష్ట వ్యాస సృష్టి చేయిస్తుంది. మనిషి, సంఘం పరస్పరం ప్రభావితమవటం ఉత్తమ వ్యాసావిర్భావానికి పునాది. సంఘ చైతన్యం నుంచి నిలువెత్తు బలం పొందిన మానవుడు మహా మానవుడయితే, మాధవాంశ సంచాలకుడయితే, ఉత్తమ వ్యాస సృష్టి జరుగుతుంది. ఉత్తమ వ్యాసం ఉత్తమ సమాజంలో ఉత్తమ మానవ చైతన్యం.

—oకోకoo—

# ఉపయుక్త గ్రంథాలు


1. ఆంధ్ర గద్య చంద్రిక-విశ్వనాథ సత్యనారాయణ, ఇతరులు
2. ఆంధ్ర వచన రచనా పరిణామము-గొబ్బూరి వేంకటానంద రాఘవరావు.
3. ఆంధ్ర వచన వాఙ్మయము-నిడదవోలు వేంకటరావు.
4. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర-నేలటూరు వేంకటరమణయ్య.
5. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము-దివాకర్ల వేంకటావధాని.
6. ఆంధ్ర వాఙ్మయ సూచిక-కాశీనాథుని నాగేశ్వరరావు.
7. ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము-ఖండవల్లి లక్ష్మీరంజనము.
8. ఉషః కిరణాలు-యండమూరి సత్యనారాయణరావు.
9. కావ్యాలంకార సంగ్రహము-సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి.
10. గద్య చింతామణి-గిడుగు రామమూర్తి.
11. తెలుగు వచన కావ్యవృద్ధి-మల్లాది వేంకటరత్నము.
12. తెలుగు వచన ప్రారంభ పరిణామాలు (Origin and the Development of Telugu prose upto 18th Century-not printed) యం. కులశేఖరరావు.
13. తెలుగుసాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము-కొత్తపల్లి వీరభద్రరావు.
14. తెలుగు హాస్యము—ముట్నూరి సంగమేశం.
15. నవ్యాంధ్ర సాహిత్య వీథులు-కురుగంటి సీతారామయ్య, పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు.
16. నా వాఙ్మయ మిత్రులు-టేకుమళ్ళ కామేశ్వరరావు
17. పానుగంటివారి సాహిత్యసృష్టి-ముదిగొండ వీరభద్రశాస్త్రి
18. వీరేశలింగం పంతులు (అముద్రితం)-అక్కిరాజు రమాపతిరావు.
19. వ్యాసరచన-పద్యకథావళి-గొల్లపూడి శ్రీరామశాస్త్రి
20. సారస్వత జీవనము-దేవులపల్లి రామానుజరావు
21. సాహిత్య సమాలోచనము-పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు.

22. సిద్ధేశ్వర చరిత్ర (ఉపోద్ఘాతము)-ఖండవల్లి లక్ష్మీరంజనము
23. సులభ వ్యాకరణము (వ్యాసపరిచ్ఛేదము)-వావిలికొలను సుబ్బారావు
24. వ్యాసాలు.

1. నూతేంద్ల తెలుగు వ్యాసము. ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక (1960-61) నిడదవోలు వేంకటరావు.

2. వ్యాసము-ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక (1931-32) రాయసము వేంకట శివుడు.

3. ఇతర వ్యాసాలు, వ్యాస సంపుటాలు, వ్యాస సంకలనాలు, ఉపోద్ఘాతాలు.

25. A Book of the Essay (Introduction) - Homer C. Combs
26. A Concise History of Classical Sanskrit Literature-Gourinatha Sastri.
27. A Critical History of English Literature-David Daiches.
28. A History of English prose Rhythm - George Saintsbury.
29. A History of the Samskrita Literature-V. Varadachari.
30. A History of English Literature-Emile Legoris & Louis Gazamian.
31. An Introduction to the Study of Literature (Essay) W.H. Hudson.
32. Appreciation-with an Essay on Style - Walter Pater.
33. A short Guide to English Style-Alan Warner.
34. A Study of the types of literature-Mabel Irene Rich.

35. Eighteenth Century Prose-D.W. Jefferson
36. Elizabethan and Jacobean Prose-Kenneth Muir.
37. English Literature: Its Background and Developmet-B.R. Mullik.
38. English Prose Style-Herbert Read.
39. Essays and Essayists-Henry Newbolt.
40. Great Essays of All Nations-F.H. Pritchard.
41. Historical Grammar of Telugu-Korada Mahadeva Sastri.
42. History of Classical Sanskrit Literature - M. Krishnamachariar.
43. History of Sanskrit Literature-A.B. Keith.
44. Kadambari (Introduction)-C. Kunhan Raja.
45. On English Prose-James Sutherland.
46. Satire-Gilbart Cannan.
47. Seventeenth Century Prose-Peter Ure.
48. Studies in the History of Telugu Journalism-Gd. K.R. Seshagiri Rao.
49. Style-F.L Lucas.
50. Style-Walter Raleigh.
51. The Concise Cambridge History of English Literature-George Sampson.
52. The English Essay & Essayists-Hugh Walker.
53. The Essay : A Critical Anthology - John L. Stewart
54. Essay-Orlo Williams.
55 The History of Indian Literature-A. Weber.
56. The Influence of English on Telugu Literature (Not printed) : G.N Reddy.

57. The philosophy of Rhetoric-I. A. Richard.
58. The Problem of Style-J. Middleton Murry.
59. Victorian Prose-Kenneth Muir and Mirian.
60. Encyclopedias :

1. The Home University En.
2. Everybody's En.
3. Chambers' En.
4. Colliers' En.
5. En. Britannica.
6. En. Americana.

—: o :—

# అనుబంధం - 1

# 19 వ శతాబ్ది తెలుగు పత్రికలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | సత్యదూత | | బళ్ళారి | 1835 |
| 2. | వృత్తాంతిని | మండిగల వేంకటరాయశాస్త్రి | మద్రాసు | 1836 |
| 3. | వర్తమాన తరంగిణి | సయ్యద్ రహ్మతుల్లా, పువ్వాడ వేంకటరావు | మద్రాసు | 1842 |
| 4. | హితవాది | ఎడ్మండ్ షార్కీ | మచిలీపట్నం | 1848 |
| 5. | దిన వర్తమాని | పీటర్ పెర్సివల్ | మద్రాసు | 1861 |
| 6. | శ్రీ యక్షిణి | త్యాగయ్య ముదలి, వేంకటరమణ కవి | బళ్ళారి | 1863 |
| 7. | తత్త్వబోధిని | | మద్రాసు | 1865 |
| 8. | సుజన రంజని | వింజమూరి కృష్ణమాచార్యులు బహుజనపల్లి సీతారామాచార్యులు | మద్రాసు | 1865 |
| 9. | నేటివ్ పబ్లిక్ ఒపీనియన్ | స్వదేశ జన ప్రసిద్ధాభిప్రాయం | మద్రాసు | 1865 |
| 10. | గోదావరి విద్యాప్రదాయిని | బారో | రాజమండ్రి | 1870 |
| 11. | ఆంధ్ర భాషా సంజీవని | కొక్కొండ వేంకటరత్నం పంతులు | మద్రాసు | 1871 |
| 12. | పురుషార్థ ప్రదాయిని | | మచిలీపట్నం | 1872 |
| 13. | స్వధర్మ ప్రకాశిని | ద్వైతం కోటేశ్వరశర్మశాస్త్రి | మచిలీపట్నం | 1872 |
| 14. | బ్రహ్మాండ రంజని | | మద్రాసు | 1874 |

| | | | | |
|---|---|---|---|---|
| 15. | లోక రంజని | కాకర్ల సుబ్బయ్య | మద్రాసు | 1874 |
| 16. | సుధీరంజని | ఓగిరాల జగన్నాథం | కాకినాడ | 1874 |
| 17. | విద్వన్మనోహారిణి | షుజాయత్ అలీఖాన్ | నరసాపురం | 1874 |
| 18. | వివేక వర్ధని | కందుకూరి వీరేశలింగం పంతులు | రాజమండ్రి | 1874 |
| 19. | భారతి | | బళ్ళారి | 1875 |
| 20. | జనవినోదిని | వి. కృష్ణమాచారి | మద్రాసు | 1875 |
| 21. | సకల విద్యాభివర్ధని | సి. సుబ్రహ్మణ్యశాస్త్రి | విశాఖపట్నం | 1875 |
| 22. | స్వదేశి | | బరంపురం | 1875 |
| 23. | హాస్య వర్ధని | కొక్కొండ వేంకటరత్నం పంతులు | మద్రాసు | 1875 |
| 24. | హాస్య సంజీవని | కందుకూరి వీరేశలింగం పంతులు | రాజమండ్రి | 1876 |
| 25. | రాయబారి | మిషనరీ | చాగల్లు | 1877 |
| 26. | జన్మభూమి | | — | 1878 |
| 27. | మందార మంజరి | ఓగిరాల జగన్నాథం | కాకినాడ | 1879 |
| 28. | అనల్ప జల్పితాకల్ప కల్పవల్లి | దాసు శ్రీరాములు | బందరు | 1880 |
| 29. | ప్రబంధ కల్పవల్లి | గురజాడ శ్రీరామమూర్తి | పెద్దాపురం | 1980 |
| 30. | సుజన ప్రమోదిని | ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ | — | 1881 |
| 31. | కళానిధి | పులపర్తి శాంతయ్య | కాకినాడ | 1882 |
| 32 | విద్యార్థి కల్పభూజము | రామచంద్రరావు | నెల్లూరు | 1882 |
| 33. | యధార్థ వాది | గరుడా కూర్మయ్య | విశాఖపట్నం | 1883 |
| 34. | సతీహిత బోధిని | కందుకూరి వీరేశలింగం పంతులు | రాజమండ్రి | 1883 |
| 35 | హిందూజన సంస్కారిణి | మన్నవ బుచ్చయ్య పంతులు | మద్రాసు | 1885 |
| 36. | సన్మార్గ దర్శిని | | పిఠాపురం | 1885 |

| | | | | |
|---|---|---|---|---|
| 37. | నీతి దర్పణము | భుక్త జమ్మయ్య శాస్త్రి | జిలుమూరు | 1885 |
| 38. | అముద్రిత గ్రంథ చింతామణి | ఒదయారు వీర రంగయ్య, పూండ్ల రామకృష్ణయ్య | నెల్లూరు | 1885 |
| 39. | గ్రంథ ప్రదర్శిని | | | 1886 |
| 40. | ఆంధ్ర ప్రకాశిక | ఎ. పార్థసారథినాయుడు | మద్రాసు | 1886 |
| 41. | దేశాభిమాని | | గుంటూరు | 1886 |
| 42. | రసికోల్లాసిని | | గుంటూరు | 1886 |
| 43. | ఇతిహాస మంజరి | | మద్రాసు | 1887 |
| 44. | మనోరంజని | భాగనగర గురులింగ దేవర | తుని | 1887 |
| 45. | సత్యదూత | సి. యల్. యస్. | మద్రాసు | 1888 |
| 46. | సుమనోభిరంజని | డబ్బీరు కృష్ణమూర్తి | జిలుమూరు | 1888 |
| 47. | మహారాణి | వి. కృష్ణమాచారి | --- | 1889 |
| 48. | మనోరమ | | రాజమండ్రి | 1889 |
| 49. | సరస్వతి | | బళ్ళారి | 1890 |
| 50. | చింతామణి | వావిలాల వాసుదేవశాస్త్రి | — | — |
| 51. | చింతామణి | న్యాపతి సుబ్బారావు | రాజమండ్రి | 1891 |
| 52. | ది హిందూ రిఫార్మర్ | | — | 1891 |
| 53. | సత్యసంవర్ధని | కందుకూరి వీరేశలింగం పంతులు | రాజమండ్రి | 1891 |
| 54. | బుధ విధేయి | నాదెళ్ళ పురుషోత్తం | బందరు | 1891 |
| 55. | రాజయోగి | గురజాడ శ్రీరామమూర్తి | కాకినాడ | 1892 |
| 56. | ఉపాధ్యాయోపయోగిని | కోట సూర్యనారాయణ | బందరు | 1892 |
| 57. | ఉపాధ్యాయోపకారి | డైసిదను దొరసాని | గుంటూరు | 1892 |
| 58. | జనానా పత్రిక | రాయసం వెంకటశివుడు | రాజమండ్రి | 1893 |
| 59. | జ్ఞానోదయము | దాసు కేశవరావు | ఏలూరు | 1893 |
| 60. | ధర్మవర్ధని | సి. హెచ్. రామమూర్తి | — | 1893 |
| 61. | శశిలేఖ | గట్టుపల్లి శేషాచార్యులు | మద్రాసు | 1894 |
| 62. | వార్తాదర్శిని | | నెల్లూరు | 1894 |
| 63. | బుద్ధిప్రదాయిని | నందగిరి వేంకట అప్పారావు | గుడివాడ | 1894 |
| 64. | మంజువాణి | మంత్రిప్రగడ భుజంగరావు | ఏలూరు | 1894 |

| | | | |
|---|---|---|---|
| 65. వైజయంతి | పనప్పాకం అనంతాచార్యులు | మద్రాసు | 1894 |
| 66. రత్నాకరము | మల్లంపల్లి భైరవమూర్తి | బందరు | 1894 |
| 67. సుజన వినోదిని | | బందరు | 1894 |
| 68. ధీమణి | | మద్రాసు | 1895 |
| 69. శారద | యడపల్లి కామశాస్త్రి | బుచ్చిరెడ్డిపాలెం | 1895 |
| 70. సకలార్థ దాయిని | | తుని | 1895 |
| 71. కల్పవల్లి | | ఒంగోలు | 1895 |
| 72. వర్తమాన తరంగిణి | బెజవాడ కృష్ణారెడ్డి | బుచ్చిరెడ్డిపాలెం | 1895 |
| 73. శారద | అత్తిలి సూర్యనారాయణరావు | అత్తిలి | 1895 |
| 74. కళింగ | కొనుకొలను కనకాద్రి రామారావు | శ్రీకాకుళం | 1895 |
| 75. శారద | దొడ్ల వెంకట రామారెడ్డి | బుచ్చిరెడ్డిపాలెం | 1896 |
| 76. బాలిక | సంగీతపు బాపిరాజు | శ్రీకాకుళం | 1896 |
| 77. సత్యసాధని | ఓ.వై. దొరసామయ్య | మద్రాసు | 1897 |
| 78. ప్రభావతి | | కడప | 1897 |
| 79. ముముక్షు జనరంజని | ఏ. నరసింహాచార్యులు | మద్రాసు | 1898 |
| 80. సరస్వతి | కె.ఆర్.వి. కృష్ణారావు | రాజమంద్రి | 1898 |
| 81. సూర్యాలోకము | జి. శ్రీనివాసాచారి | — | 1898 |
| 82. వాగ్వల్లి | కొమాండూరు వేంకటరామానుజ-శర్మ | నెల్లూరు | 1899 |
| 83. ఆనందదాయిని | జె, శేషాద్రిశాస్త్రి | నెల్లూరు | 1899 |
| 84. కళావతి | శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి | రాజమంద్రి | 1899 |
| 85. బాల సరస్వతి | యస్. కృష్ణారావు | మద్రాసు | 1899 |
| 86. సరస్వతి | కొచ్చెర్లకోట కృష్ణారావు | కాకినాడ | 1899 |
| 87. బాప్టిస్టు | డబ్ల్యు.యల్. కాంబెల్ | — | — |

—: o :—

# అనుబంధం - 2

## ప్రౌఢ వ్యాకరణం - వ్యాస పదం

బహుజనపల్లి సీతారామాచార్యులు (1827-1891) ప్రౌఢ వ్యాకరణంలో 'వ్యాసం' అనే పదం ప్రయోగించాడు. ప్రౌఢ వ్యాకరణం 1885లో ముద్రితం. ప్రక్రియార్థంలో కాకపోయినా 1885 కంటే పూర్వమే 'వ్యాస' పదం వ్యాకరణ గతంగా ప్రయుక్తమయింది. ఈ పదం వాక్యపరిచ్ఛేదంలోని 18 వ సూత్ర వృత్తిలో రెండు సార్లు, 20 వ సూత్రంలో ఒకసారి ఉంది. ఈ రెండు సూత్రాలలో వ్యాసపదం వాక్య పదానికి పూర్వ పదంగానో పరపదంగానో వుంది. రెండుసార్లు వాక్యవ్యాసంగానూ, ఒకసారి వ్యాసవాక్యంగానూ కనిపిస్తూ వుంది.

వ్యాసం అనే పదం వాక్యవ్యాసంగా ప్రయోగింపబడినప్పుడు వివరణం అనే అర్థం ప్రధానంగా బోధిస్తుంది, వ్యాసవాక్యంగా ప్రయుక్తమయినప్పుడు విస్తరణం అనే అర్థం ప్రముఖంగా తెలుపుతుంది. రెండు సందర్భాలలోనూ 'వ్యాసం' అనే పదం వివరణం, విస్తరణం అనే అర్థబోధకావిస్తూ వుంది.

''వాక్య సంగ్రహంబునందినన్నంతక్రియాపూర్వకంబులగు కాక కాన్యవ్యయంబు లనుక్త వాక్యపద గ్రాహకంబులగు ౧౮

ఉ॥ కాకకు-తే. నీవు నలునకుఁ బేర్మితో దేవివైనఁగాక నీ సముజ్జ్వల రూపకాంతి విభవ నిత్య సౌభాగ్య భాగ్యాభిజాత్యలక్షణావళులవి సఫలంబు లగునె. భార. అర. ౨ . ఆ. 20. (వాక్యవ్యాసమునందు - నీవు నలునకుఁ బేర్మితో దేవివైన నీ సముజ్జ్వల రూపకాంతి విభవ నిత్యసౌభాగ్య భాగ్యాభిజాత్య శద్రలక్షణావళులవి సఫలంబులగును. కాకున్న నీ సముజ్జ్వల రూపకాంతి విభవ నిత్య సౌభాగ్య భాగ్యాభిజాత్యలక్షణావళులవి సఫలంబులు కావు). కానికి - ''ఆ నలునకాని నళినదళనేత్ర వరియింపదట్టె'' (వాక్య వ్యాసము నందు నలునే వరియించుంగాని వేఱొకని నళినదళనేత్ర వరియింపదట్టె) భార. అర. ఆ ౨౨. మొ॥ ''

ఇందులో వాక్యసంగ్రహమంటే సూక్ష్మీకరించిన వాక్యం. అనగా సంక్షిప్త వాక్యం. వాక్యవ్యాసమంటే వివరించిన వాక్యం. అనగా విస్తరణవాక్యం ''నలునకాని నళినదళనేత్ర వరియింపదట్టె'' - ఇది వాక్యసంగ్రహం. ''నలునే వరియించుంగాని వేఱొకని నళిన దళనేత్ర వరియింపదట్టె''-ఇది వాక్యవ్యాసం

వాక్యసంగ్రహంలో 'కాని' పదం వ్యాస వాక్యంలో 'వరియించుంగాని వేఱొకని'గా విస్తరణ పొందింది. అలాగ్గే 'నీవు...అగునె' - వాక్యసంగ్రహం. "నీవు... కావు" వాక్యవ్యాసం. వాక్యసంగ్రహంలోని 'కాక' పదం "కాకున్న...... కావు" గా విస్తరణ పొందింది.

అందువల్ల వాక్యసంగ్రహానికి వాక్యవ్యాసం విస్తరణ రూపం. అంటే వ్యాసం విస్తరణార్థంలో ప్రయుక్తమయింది. విస్తరణార్థంతో పాటు వివరణార్థం కూడ నిక్షిప్తమయివుంది.

"కొన్ని యెడల వ్యాసవాక్యమునకు ముందు సంగ్రహవాక్యంబు నొడంగు ౨ం

ఉ॥ వ. అయ్యా ! యేను నీకుం బ్రియంబు సేసెద; నీ హృదయేశ్వరి యయిన దమయంతి పాలికింబోయి నీ గుణంబులు దానికి వర్ణించి చెప్పి యక్కన్య యన్యుల నపేక్షింపక నీయంద బద్ధానురాగ యగునట్లు చేసెద. భార: అర. ౨ ఆ. ౧౪.వ. ఇదియెట్లు ? ధర్మ పరిపాలన పరులై వీరులై రణనిహతులైన రాజులక్షయ సుఖంబు లనుభవింపక నతిథులై యిందుల కెంత కాలం బయ్యె రాని కారణంబేమి ? భార. అర. ౨ ఆ. 30. వ. శుక్రుండిదియేమి ? యెందులకుం బోయెదవని యడిగిన. భార. అర. ౨. ఆ ౫౬ మొ॥"

"అయ్యా యేను నీకుం బ్రియంబు సేసెద"—సంగ్రహ వాక్యం. "నీ హృదయేశ్వరి......చేసెద" - వ్యాసవాక్యం, అలాగే "ఇది యెట్లు ? "— "ఇది యేమి ? "—సంగ్రహ వాక్యాలు. వాటికి క్రమంగా "ధర్మ పరిపాలన ......కారణంయేమి ? ", "ఎందులకుం......యడిగిన" అనేవి వ్యాస వాక్యాలు. సంగ్రహ వాక్యానికి వ్యాసవాక్యం వివరణంగానూ విస్తరణంగానూ వుంది. ఈ రెండు సూత్రాలలో ప్రయోగింపబడిన వ్యాసం అనే పదం వివరణం, విస్తరణం అనే అర్థాలను బోధించటానికి ఉద్దేశింపబడింది. ఈ రెండు గుణాలు వ్యాస ప్రక్రియాస్వరూప బోధకంగా ఉన్నాయి.

వ్యాసం పదంగా 1852 నుంచీ (ఈ పరిశోధన గ్రంథం పుటలు 128, 129) ప్రక్రియాబోధకంగా 1900 ఆరంభంనుంచీ (పుట 233) ఉంది.

—: o :—

# సవరణ సూచి

ఈ సిద్ధాంత గ్రంథ ముద్రణలో కొన్ని సవరణలు సూచింపవలసిన అవసరం ఉంది. సహృదయులు సవరించుకోదగివున్న వాటిని కాక, తప్పని సరిగా చెప్పవలసిన, సూచింపవలసిన, వాటిని మాత్రమే ఇక్కడ క్రోడీకరించడం జరిగింది.

ఆంగ్ల రచయితల గ్రంథాల పత్రికల ఊళ్ళపేర్లు ఉచ్చారణను అనుసరించే వ్రాయటం ఉన్నా, కొన్ని సందర్భాలలో వర్ణక్రమాన్ని అనుసరించవలసి వచ్చింది. తెలుగువ్యాసకర్తల పేర్లు వాళ్ళెలా వ్రాసుకొన్నారో, లేదా విమర్శకులు ఎలా ఉదాహరించారో అలాగే గ్రహించటమయింది. వేంకట, వెంకట రెండు రూపాలవంటివి వాడటంతో పాటు ఒకే వ్యక్తి పేరు రెండు రూపాలలోనూ ఉంది. స్వామిసీన ముద్దు నారసింహ నాయడు పేరు ముద్దు-ముత్తుగా, నారసింహ-నరసింహగా, నాయడు-నాయుడుగా భిన్న సందర్భాలలో భిన్నవిమర్శకులు ప్రయోగించారు. ఆ సందర్భంలో ఆ పదం అలాగ్గే వాడటం జరిగింది. సృష్టి నామం కాని, స్రష్ట నామం కాని సూచిలో ఇచ్చినా, ఒక పేరు సరిగా చాల చోట్ల, తప్పుగా ఒకటి రెండు చోట్ల (జియ్యరు-జయ్యరుగా) ఉన్నా, ఒక పదరూపం ఒకసారి సవరణలో చూపినా, వాటిని మళ్ళీ ఇందులో చేర్చలేదు.

సంస్కృతాంధ్రాంగ్లాల ఉదాహృతులు ప్రసిద్ధాలయితే ముద్రాక్షర దోషాలు కనిపించినా, ఉదాహృతుల తర్వాత కొనసాగవలసిన వాక్యక్రమం సరిగా లేకపోయినా, ఆగకుండా సాగవలసిన వాక్యభాగాలు పేరాలుగా మారినా, కామాలు, సెమికోలన్‌లు, ఫుల్‌స్టాప్‌లు సరిగా ఉండకపోయినా, శీర్షికల, ఉదాహృతుల మైపు మారినా, ఆటువంటి చోట్లు ఎక్కువ లేవు కాబట్టి చదువరులు దిద్దుకోగలరు కాబట్టి ప్రత్యేకించి చూపలేదు.

కొన్ని చోట్ల ద్విత్వంగా, సంయుక్తంగా ఉన్న అక్షరాలలో ఏ భాగమయినా సరిగా లేకపోవటం, ఒత్తులు ఉండీ లేనట్లుండటం, అవి పూర్ణాక్షరా

లకో పరాక్షరాలకో చేరటం, ట, ల ఒత్తులు తారుమారు కావటం, ఒకటీ రెండు చోట్ల అక్షరం జారిపోవటం, అదనంగా చేరటం, పదం ఎప్పుడయినా రెండోసారి ముద్రితం కావటం ఉన్నా ఆ దోషం కంటికి కనిపిస్తుంది కాబట్టి అసలురూపం పోల్చుకోవచ్చు కనుక ఇందులో ప్రదర్శించలేదు.

కొన్ని చోట్ల ఒక అక్షరం బదులు మరో అక్షరం ఉంది, అ, ఆలు; వ-పలు; థ, ధలు; శ, శలు; క, శలు; ను, చులు; చే, బేలు; లో, తోలు; అస్పష్టంగా ఉన్నాయి. గురజాడ గురుజాడగా, గద్య గద్వగా, తీక్ష్ణ తీక్షణగా మాహాత్మ్యం మహాత్మ్యంగా, స్రష్ట-స్రస్టగా. విస్పష్టం విష్పష్టంగా ముద్రితమయ్యాయి.

పంతులు - ంపతులుగా, సంభరిత - సంభతరిగా, జీవితాంతర్యాలు - జీవింతాతర్యాలుగా తారుమారయిన అక్షరాలతో ముద్రణ ఉంటే తెలుస్తుందను కొన్న పంతులు వంటి రూపం సవరణలో చేర్చలేదు. భిన్నార్థం వస్తుందను కొన్నా, అర్థబోధకు కష్టమనుకొన్నా ఇందులో చేర్చటం జరిగింది.

ఎక్కడయినా ఉండవలసిన అక్షరం, పదం, వాక్యభాగం లేకుండా పోయినా, ఉండరాని గుర్తు అక్షరం పదం వాక్య భాగం ఉన్నా, సవరణ ఇవ్వటమయింది. ఉచితజ్ఞులయిన విమర్శకులు సహృదయులు పదరూపాలు సవరించి చూడవలసిందిగా కోరిక.

| పుట | వరుస | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 20 | చంధస్సుందరమై | ఛందస్సుందరమై |
| 5 | 3 | చూర్ణముత్కాలికా | చూర్ణముక్తాలికా |
| 7 | 8 | వృత్త గ్రంధి | వృత్త గంధి |
| 15 | 3 | బిరుదుగద్య లోపుగద్య | బిరుదుగద్య |
| 15 | 24 | రాజకీయ నిర్వహణ | రాజకీయ కార్యనిర్వహణ |
| 15 | 26 | వచములు | వచనముల |
| 16 | 1 | తెలుగువ్యాస పరిణాయము | తెలుగువ్యాస పరిణామము |

| | | | |
|---|---|---|---|
| 16 | 7,8 | ఇంకొకకోవ. ఈ విధమైన సంకీర్తనంతో వచనములు ఇంకొకకోవ. ఈ విధమైన | ఇంకొకకోవ. ఈ విధమైన |
| 19 | 6 | వచనా విధానం | వచన రచనా విధానం |
| 21 | 13 | అనగాహనమైన | అనవగాహనమైన |
| 23 | 13 | సౌష్ఠమును | సౌష్ఠవమును |
| 39 | 9 | సంభావిస్తున్నట్లు | సంభావిస్తున్నట్లు |
| 41 | 23 | పారాయణ గద్యాలతో | పారాయణ గద్యాలలో |
| 44 | 6 | ప్రాత వచనా విధానమును | ప్రాత వచన రచనా విధానమును |
| 46 | 24 | తెలుగు పురాణకథా సాహిత్యం | తెలుగు పురాణకథా సాహిత్యం, కల్పిత కథా సాహిత్యం |
| 50 | 22 | సంఘ శ్రోతస్విని | సంఘ స్రోతస్విని |
| 65 | 2 | అవంతీ సుందరీ కథా ఖ్యాయికలు | అంతి సుందరి కథా సారం అనే కథాఖ్యాయికలు |
| 87 | 2 | భాష పృద్విలో | భాషా పృధ్విలో |
| 98 | 24 | వచన పరిణామము | వచన రచనా పరిణామము |
| 116 | 26 | కొత్త ప్రసాదించిన | కొత్త దశ ప్రసాదించిన |
| 128 | 25 | నొక | ఒక |
| 129 | 24 | లభ్యంగా | అలభ్యంగా |
| 130 | 4 | ఆంధ్రలో | ఆంధ్రంలో |
| 130 | 5 | సారసత్వం | సారస్వతం |
| 145 | 26 | ఆలోచనంలోని అపరిపక్వంగా | ఆలోచనం అపరిపక్వంగా |
| 160 | 23 | క్రీ. పూ. | క్రీ. శ. |
| 163 | 29 | రాజకీయ రంగంతో తాత్కాలిత సంగతులు | రాజకీయ రంగంలో తాత్కాలిక సంగతులు |
| 173 | 13 | ఉపన్యాంగా | ఉపన్యాసంగా |

| | | | |
|---|---|---|---|
| 174 | 7 | భాగం వికాస వ్యాసం | భాగం యుగ వికాస వ్యాసం |
| 177 | 1 | తెలుగు వ్యాస పరిణామము | సృజన వ్యాసం |
| 177 | 6 | ధృవుడికి | ధ్రువుడికి |
| 178 | 19 | క్రియా మాపాలు | క్రియా రూపాలు |
| 180 | 28 | అని ముగిసి వ్యాసంగా | అని ముగిసి |
| 190 | 28 | కథలు కథ మొదలైన అనేక ప్రధానాంశ | కథ మొదలైన అనేక కథలు ప్రధానాంశ |
| 191 | 21 | కలిగింది | కలిగించింది |
| 196 | 16 | × | |
| 196 | 21 | × | |
| 203 | 28 | భాషా ప్రధానమయినా | భాషా ప్రభావమయినా |
| 204 | 2 | చదువురాని | చదువురాని స్త్రీల |
| 204 | 17 | అకర్షరూపం | అక్షర రూపం |
| 214 | 27 | విధ్యకర్థంగా | విధ్యర్థకంగా |
| 220 | 20 | ములి గూర్చి గరపుట | ములం గూర్చి కలపుట |
| 224 | 7 | స్థిరపడని | స్థిరపరచి |
| 231 | 17 | వ్యాసమన్న ప్రయుక్త మయింది | వ్యాసమన్న పదం ప్రయుక్త మయింది |
| 233 | 25 | భాషాసరాలు | భాషావసరాలు |
| 234 | 24 | వ్యావహారికమే | వ్యావహారికమే వుంది. |
| 236 | 6 | జీవింతాతర్యాలు | జీవితాంతర్యాలు |
| 238 | 14 | షాభా | భాషా |
| 239 | 11 | పీలికలు | పీఠికలు |
| 241 | 19 | మొత్తం 67 | మొత్తం 77 |
| 241 | 23 | పత్రికా సంపాదకుగా | పత్రికా సంపాదకుడుగా |
| 242 | 24 | ఆధిక్యం | ఆధిక్యం వుంది |
| 259 | 22 | కవికాలస్థలాలనీ | కవికాల స్థలాది నిర్ణయాలనీ |
| 270 | 12 | సామాజికాభివృద్ధి నూత్నమనీ | సామాజికాభివృద్ధి ప్రయత్నం నూత్నమని |

| | | | |
|---|---|---|---|
| 273 | 10 | సోదరుడి బాధ్యత | సోదరుడి బాధ్యత మిత్రుడి బాధ్యత |
| 290 | 15 | రూపొందాయి | రూపొందింది |
| 293 | 18 | 1933 | 1968 |
| 295 | 14 | సాసర్వతం | సారస్వతం |
| 299 | 4 | వ్యక్తం గుర్తింపవచ్చు | వ్యక్తం కావటం గుర్తింపవచ్చు |
| 300 | 4 | వ్యావహారాలలో | వ్యావహారికాలలో |
| 300 | 23 | గమనింపవచ్చు | |
| 303 | 18 | అనంతం | అనంతరం |
| 304 | 21 | ప్రసంగ వ్యాసం, ఉపన్యాస | ప్రసంగ వ్యాసం, వ్యాస ఉపన్యాస |
| 305 | 7 | తుష్టి గుర్తింప | తుష్టి కలిగించటం గుర్తింప |
| 314 | 26 | కవిత ధర్మమో కావ్యపుట్ట రమణీయకమో | కవితా ధర్మమో కావ్యపుట్ట రామణీయకమో |
| 321 | 9 | తెలిపితే కాదని గుప్త | గుప్త |
| 321 | 15 | ఈ వ్యాసకర్త | తెలిపితే కాదని ఈ వ్యాసకర్త |
| 326 | 4 | ముద్రితాలు | ముద్రించారు |
| 334 | 13 | పాత సంతతయినా | పాత సంగతయినా |
| 335 | 29 | సాహిత్యమో, కళాత్మకమో | సాహిత్యమో, సాంఘికమో, కళాత్మకమో |
| 345 | 16 | కవిత్వం | కసిత్వం |
| 359 | 11 | బాల్య వివాహం పద్ధతీ | బాల్య వివాహం వద్దనీ |
| 370 | 13 | హరిసర్వోత్తమరావు | హరిసర్వోత్తమరావు వ్యాసంలో |
| 370 | 24 | గ్రహింపవచ్చు | గ్రహించినట్లు ఊహింపవచ్చు |
| 382 | 25 | ఒకదాని వెంట | ఒకదాని వెంట ఒకటి |
| 393 | 8 | సంపాదక | సంపాదకీయ |
| 417 | 25 | వాళ్ళతో నడకుదిట | వాళ్ళలో నడకుదుటి |
| 419 | 1 | పత్రికా వ్యాసం | వివాద వ్యాసం |

| | | | |
|---|---|---|---|
| 427 | 9 | అంతపరకు | ఆంతరతకు |
| 445 | 18 | హిందీ హిందీ ప్రచార | హిందీ ప్రచార |
| 447 | 4 | వైశాల్యం | వైశాల్యం వల్ల |
| 487 | 25 | సంకనాల | సంకలనాల |
| 491 | 8/9 | పరిశీలనంవుంది | పరిశీలనం కలిగివుంది |
| 500 | 13 | ఉన్నంతగా | ఉన్నతంగా |
| 508 | 13 | కన్నడాంధ్రలు | కన్నడాంధ్రాలు |
| 546 | 26/27 | భావసముదాయాలలో ఒక్కచోట | భావసముదాయాన్నో కాక, అనేక భావాలనో, భావసముదాయాలనో ఒక్కచోట |
| 551 | 18 | అవసరం | అనవసరం |
| 559 | 4 | కలిగించింది. ఈ అనుభవం | కలిగించింది. ఈ అనుభవం ఘనీభవించి ఆత్మగతంగా నిలిచి పోయింది. స్త్రీ ముఖం చూచినప్పుడు తెల్లదనమో, ప్రసన్నతవల్ల చల్లదనమో ఒక అనుభవాన్ని కలిగించింది. ఈ అనుభవం. |
| 568 | 28 | అఖిల లోకో పాప కరార్థ | అఖిల లోకోపకారార్థ |
| 571 | 9 | అధిక పథం | అధిక పదం |
| 572 | 5 | చ్యుతమయితే | చ్యుతమయినా |
| 592 | 26 | పద సంకేతం | పదం సంకేతం |
| 592 | 28 | పుట్టుక | పుట్టుకకు |
| 601 | 1 | సమగ్దర్శనం | సమ్యగ్దర్శనం |

—:o:—

# స్రష్టసూచి

41)

# సృష్టి సూచి